కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

# యోగ ప్రసంగములు

## (పతంజలి యోగసూత్రములు)

తృతీయ భాగము - విభూతి పాదము

**3**


సంకలనము :

డా॥ కె. యస్. శాస్త్రి



THE GLOBE ROTATES

వరల్డ్ టీచర్ ట్రస్ట్

విశాఖపట్టణం - 530 016.

## కృతజ్ఞతలు

మాస్టరు ఇ.కె.గారి యోగప్రసంగములు **''మూడవ భాగము - విభూతి పాదమును''** ముద్రించి సాధకులకు, సోదర బృందమునకు అందించుటకు ఆర్థిక సహాయము చేసిన **శ్రీ బి. శ్రీహరిరావు, శ్రీ భేరి వెంకట్రావు, శ్రీ కె. వి. ప్రసాద్** (డా॥ కె.యస్. శాస్త్రిగారి కుమారుడు) గార్లకు మరియు యథోచితముగా చిన్న మొత్తములను అందించిన **హోమియో సోదర బృందమునకు** అనేక కృతజ్ఞతలు.

వారికి, వారి కుటుంబ సభ్యులకు, బంధు మిత్రులకు మాస్టరుగారు ఆయురారోగ్య ఐశ్వర్యములను అనుగ్రహించ వలసినదిగా ప్రార్థిస్తున్నాము.

11.8.99 జగద్గురు పీఠము

# కులపతి బుక్ ట్రస్ట్

★ **కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య** గారిచే రచింపబడిన అన్ని గ్రంథముల పైనను హక్కులు కలిగియున్న **'కులపతి బుక్ ట్రస్టు'**, 14-38-2, రాధామాధవమ్, ముప్పిడి కోలనీ, విశాఖపట్టణము - 530 002 నకే ఈ గ్రంథము యొక్క హక్కులు కూడ చెందియున్నవి. ఇందలి ఏ అంశమునైనను, ఏ విధమైన ముద్రణ వినియోగమునకైనను ఈ ట్రస్టు వారి లిఖితమైన అనుమతిని పొందవలెను.

★ ఈ గ్రంథమును ప్రచురించు హక్కు 'ది వరల్డ్ టీచర్ ట్రస్ట్, 14-38-2, రాధామాధవమ్, ముప్పిడి కోలనీ, విశాఖపట్టణము- 530 002 వారికే అనుమతింపబడినది.

★ యుగముల తరబడి మానవునకు ప్రసాదింపబడిన శాశ్వత జ్ఞానమును వెదజల్లుటకై స్థాపింపబడినదీ గ్రంథ ప్రచురణ సంస్థ. ఈ గ్రంథముల వలన కలుగు ఆదాయము ఇట్టి గ్రంథముల పునః ప్రచురణ చేసి సత్యమును వెదజల్లుటకై మాత్రమే వినియోగింపబడును.

# తొలిపలుకు

తనయందు, తన పరిసరములయందు గల దివ్యత్వమును ఒక నిర్దిష్టమార్గమున అనుభూతి చెందుటకు ఏర్పడిన శాస్త్రమే యోగశాస్త్రము. దివ్యత్వమును గూర్చి తెలుపు గ్రంథములు లెక్కకు మిక్కుటముగ గలవు. కాని దివ్యత్వమునకు చేర్చు శాస్త్రము యోగ మొక్కటియే! తనయందు దివ్యత్వమును దర్శించుట, అది తానేనని తెలియుట, అదియే ఈ సమస్తముగ రూపించినదని నిర్ధారణముగా భాషించుట అను ఈ స్థితు లన్నియు శాస్త్రీయముగ యోగశాస్త్రము తెలుపుచున్నది. ఇందు మతమునకు, మూఢ విశ్వాసమునకు, వెఱ్ఱి భక్తికి తావులేదు. యోగసాధకుడు ఒక నిర్దిష్టమైన క్రమశిక్షణను దీక్షతో నిరంతరముగ దీర్ఘకాలము నిర్వర్తించుకొని తానొక జీవన విధానమును తదనుగుణముగ ఏర్పరచ్చుకొనుట ఆవశ్యకము. సాధన సిద్ధినిచ్చు వరకు శాస్త్రమున తెలిపిన నియమముల ననుసరించి జీవించుటయేగాని, మరి గత్యంతరము లేదు.

యోగసాధకుడు బహిరంగమున పాటించవలసిన నియమములు పది. అవి కారణముగా అతనికి కలుగునది ఆసనసిద్ధి. ఆసనసిద్ధి ప్రాతిపదికగా మాత్రమే ప్రాణాయామము జరుగగలదు. మరియొక మార్గము లేదు. ఆసనసిద్ధి మనస్సునకు సంబంధించినదేగాని, శరీరమునకు సంబంధించినది కాదు. రాజయోగ మార్గమున ఈ విషయము స్పష్టమగును. పరిస్థితుల ప్రభావమునకు లొంగని మనస్సు స్థిరముగ, సుఖముగ, దీర్ఘకాలము ఒకే స్థితి (vibration) యందు ఉండు మనస్సు ప్రాణాయామము నాలుగవ యోగాంగమునకు అర్హత నేర్పరచ్చును. ప్రాణాయామము బహిర్ముఖమగు ప్రజ్ఞను అంతర్ముఖముగా మరల్చుటకు నిర్దేశింపబడిన సాధన. ప్రాణాయామము ద్వారా బహిః కరణముల నుండి సాధకుని ప్రజ్ఞ అంతఃకరణముల ప్రాంగణములలోనికి ప్రవేశింపబడును.

ఇటుపై సాధన అంతర్ముఖ సాధన. మిగిలిన నాలుగంగములు ( ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు) లోపలి యంగములు. నిజమునకు ప్రత్యాహారము ప్రాణాయామము యొక్క సిద్ధియే గావున చివరి మూడు అంగములు అనగా ధారణ, ధ్యాన, సమాధులు మాత్రమే లోపలి అంగములని పతంజలి మహర్షి నిర్దేశించును.

ఆసనసిద్ధి, ప్రాణాయామము, ప్రత్యాహారము అను అంగములతో నిశితము అయిన మనస్సు సాధకులు నిర్దేశించిన విధముగా నిలుచును. నిర్దేశింపబడిన అంశముల

యందు నిర్దేశించినంతసేపు నిలబడుట ధారణయను సిద్ధికి ప్రజ్ఞను చేర్చగలదు. అట్లుండే చాలాకాలము నిలచియుండుట, అది తప్ప మరియొకటి భాసించకుండుట, చపలత్వము లేక నిశ్చల జ్యోతివలె నిలచియుండుట వలన సాధకుడు నిర్దేశింపబడిన అంశముతో ఏకత్వము చెందును. ఇట్లు ఏకత్వము చెందుటయే ధ్యానసిద్ధి.

అట్లు దీర్ఘకాలము ధ్యానింపబడుచున్న అంశము తానై యుండుట జరిగినప్పుడు ఆ వస్తువుయొక్క పేరు, రూపము, ప్రవర్తనము లేక గుణము మాయమై, దాని స్మరణము మాత్రము మిగులుట, తన రూపము కూడా గోచరించకుండుట సిద్ధించిన నాడు ప్రజ్ఞయొక్క ఈ స్థితిని సమాధి అని తెలియవలెను.

పై తెల్పిన రీతిలో ధారణ, ధ్యాన, సమాధులు ఏక కాలమున సంభవించుట సంయమము. ఇట్టి సంయమము కలిగిన సాధకుడు సిద్ధుడు. అతనికి వివిధములైన సిద్ధులు, శక్తులు, అనుభూతులు విభూతి పాదమున వివరింపబడినవి. యోగసాధకుని దృష్టి ఈ విభూతులపై గాక చేయవలసిన సాధన యందు దీక్ష వహించి యుండవలెను.

మాస్టర్ ఇ.కె. గారి యోగప్రసంగములు – వాటి స్ఫూర్తిని సత్సాధకులకు తప్పక కలిగింపగలవు. అట్లు కలుగుటయే ఈ ముద్రణా యజ్ఞముయొక్క ఫలశ్రుతి. ఈ యజ్ఞమును దీక్షతో నిర్వర్తించుచున్న సోదరులు డాక్టర్ కె.ఎస్. శాస్త్రిగారు, వారి బృందము ఎంతయో ప్రశంసనీయులు. మాస్టరుగారి మహా సంకల్పమునకు వాహికలుగా నిలబడి ఈ గ్రంథమును సిద్ధింపజేయు యత్నమున పై తెలుపబడిన యోగస్ఫూర్తి వారందరికిని దక్కియే ఉండవలెను. అది కారణముగా వారందరూ కృతకృత్యులు.

జగద్గురు పీఠము సోదర బృందము నిర్వర్తించుచున్న ముద్రణా యజ్ఞమున మాస్టరుగారి యోగ ప్రసంగములకు ఒక ప్రత్యేక ప్రయోజనము, అది కారణముగా ఒక ప్రత్యేక స్థానము ఏర్పడినవి. పాఠకులు శ్రద్ధాభక్తులతో గ్రంథస్థమైన విషయములను గ్రహింతురని ఆశించుచూ.....

ఇట్లు

15.7.1999

హైదరాబాదు.

**కంభంపాటి పార్వతీకుమార్**

అంతర్జాతీయ గౌరవ అధ్యక్షులు

జగద్గురు పీఠము.

# పీఠిక

మాస్టర్ ఇ.కె. గారి పతంజలి యోగసూత్ర ప్రసంగముల ప్రథమ, ద్వితీయ భాగములను మాస్టరుగారి 73వ జన్మదినోత్సవ సందర్భముగాను, 1999 గురుపూజోత్సవములలోను గ్రంథరూపముగా ఆధ్యాత్మిక సోదర బృందమునకు అంకితము చేయుట జరిగినది. మాస్టరుగారి 74వ జన్మదినోత్సవములలో 3వ భాగము అనగా ''విభూతి పాదము'' ఆవిష్కరింపబడుట మాస్టరు గారి కృపా విశేషమే.

రెండవ పాదము - సాధన పాదము క్రియా యోగముతో ప్రారంభమై అష్టాంగ యోగములోని మొదటి ఐదింటిలో అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములతో పూర్తయినది. ఇక మూడవ భాగము విభూతి పాదములో అష్టాంగ యోగములోని మిగిలిన మూడింటితో అనగా ధారణ, ధ్యాన, సమాధులతో ప్రారంభమయి వాటిని సంయమము చేసుకోవటంతో కలిగే విభూతులతో సమాప్తమయింది. యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహారములు అభ్యాసము చేయవలసిన వయితే, ధారణ, ధ్యాన, సమాధులు వాటంతటవి మన లోపల ఉన్న అనుగ్రహముగా గురువు రూపంలోనో, ఈశ్వరుని రూపంలోనో సాక్షాత్కరింపవలసినవి. మనము చేసిన దానినిబట్టి అవి అనుభూతములగును. అష్టాంగములోని ఎనిమిది భాగములు కూడ ఒక దాని వెంబడి మరొకటి చేయవలసినవి కావని, అన్నియు కూడ ఏక కాలములో అభ్యసించవలసినవేనని చక్కగా ఉపదేశించారు ఈ ప్రసంగములలో. మాస్టరుగారి శైలి మనము యింతవరకు చవి చూచినదే. అయినను ఏ వాక్యమున కా వాక్యములోని క్రొత్తదనము, సమయస్ఫూర్తి, అర్థవంతమై చదువరులను మైమరపించగలదు. మన జీవితంలో ఆచరించవలసిన అనేక విషయములు, పరమ గురువుల బోధనలు, ఇతిహాస పురాణాది ఉపమానములతో సామాన్య మానవునకు సహితము తృటిలో అర్థమగునట్లు మాస్టరుగారు వివరించారు.

ఈ భాగములోని ప్రధానాంశము ''సంయమము''. ధారణ, ధ్యాన, సమాధులను సంయమము చేయుటచే మన మనుభవింపగల దివ్య స్పర్శలను చాల విపులంగా వివరించారు. ఒక్కొక్కచోట ఒక్కొక్కలా సంయమము చేస్తే వేర్వేరు అనుభూతులు వస్తాయి. ఉ॥ ''మైత్ర్యాదిషు బలాని'' మైత్రి మున్నగు సద్గుణములన

సంయమము చేస్తే బలము వచ్చును. బలవంతులపై సంయమము చేస్తే ఏనుగు బలము వచ్చును. అట్లే ఒక్కొక్క రకంగా సంయమంచేస్తే దూరశ్రవణము, దూరమున ఉన్న వస్తువుల జ్ఞానము వస్తుంది. సూర్యుని యందు సంయమంచేస్తే భువనజ్ఞానం, చంద్రునియందు సంయమము చేస్తే తారావ్యూహ జ్ఞానము, నాభిని కేంద్రముగా సంయమంచేస్తే కాయవ్యూహ జ్ఞానము. కంఠమునందు సంయమము చేస్తే ఆకలిదప్పులు లేకుండుట, శిరస్సునందు వెలుగును దర్శించుచూ సంయమంచేస్తే సిద్ధుల దర్శనము జరుగుతుందన్నారు. ఇలాగ అనేక రకాలైన సంయమములు చెప్తూ భువన జ్ఞానం అంటే ఏమిటి, తారావ్యూహం అంటే ఏమిటి, తారకలంటే ఏమిటి, కాయ వ్యూహం, సిద్ధ దర్శనము, సిద్ధులంటే ఎవరు, సిద్ధులు అంటే ఏమిటి మొదలైన అనేక విషయాలు కూలంకషముగా ఈ అధ్యాయంలో వివరించుట జరిగింది. ఈ అధ్యాయములో అందించినంత ఆత్మజ్ఞానము, సృష్టి విజ్ఞానము మరొకచోట లభ్యమగుట దుర్లభమే. నిస్సందేహంగా మానవజాతిని ఉద్ధరించుటకే యింత అమూల్యమైన ప్రసంగములు వెలువడిన వనుటలో ఆశ్చర్యం లేదు. అర్థమయినా అర్థమవకపోయినా ప్రతి ఒక్కరూ చదివి, ఆ చదువుటలో లభ్యమయ్యే దివ్యస్పర్శ, అనుభూతి పొందగలరని ఆశిస్తున్నాము.

చి॥ సౌ॥ దర్భా వెంకట సరోజరత్నం, ఎమ్.ఏ. (నా పుత్రిక) శ్రద్ధతో ఈ గ్రంథమును వెలికితీసుకొని వచ్చుటకు క్యాసెట్లలోని మాస్టరు గారి ప్రసంగములను వ్రాసి అందచేసి, మాస్టరుగారి కృపకు, శుభాశీస్సులకు పాత్రురాలైనది. మాస్టరుగారు ఆమెకు, వారి కుటుంబ సభ్యులకు, బంధువర్గమునకు ఆయురారోగ్య ఐశ్వర్యములు ప్రసాదించుగాక!

అక్షర రూపములో ఉన్న ప్రతిని 2, 3సార్లు పరిష్కరించిన పిదప మరల మరల కాపీ చేయుటకు సహకరించిన చి॥ సౌ॥ కె. లక్ష్మి (మా పెద్ద కోడలు), హోమియో సహాధ్యాయుడు శ్రీ టి. రమేష్ వారికి, వారి కుటుంబ సభ్యులకు మాస్టరు గారు ఆయురారోగ్య ఐశ్వర్యములు పుష్కలముగా ప్రసాదించెదరు గాక!

ఈ మహా యజ్ఞములో అనేకమంది దృశ్యముగను, అదృశ్యముగను అనేక విధములైన సహాయము లందించిన సోదర బృందమునకు ధన్యవాదములు. వారందరికి మాస్టరుగారి శుభాశీస్సులు పుష్కలముగా అందును గాక!

ఈ గ్రంథము ముద్రణ చేయుటకు కావలసిన ద్రవ్యమును అందించి సహకరించిన వారికి, వారి కుటుంబ సభ్యులకు మాస్టరుగారు ఆయురారోగ్య ఐశ్వర్యములనిచ్చి ఇట్టి ధార్మిక విషయములలో వారు యింకా యింకా ఆసక్తి చూపుటకు కావలసిన వనరులు అందించెదరుగాక!

ఈ గ్రంథమును సకాలములో సర్వాంగ సుందరముగా తయారు చేసిన ఎక్వేరియన్ ప్రింటింగ్ స్కూల్ సోదర బృందమునకు మాస్టరు గారి కృప సర్వదా అందుగాక!

ఈ గ్రంథము అనూహ్యరీతిలో నా ద్వారా వెలువడుటకు అవకాశము యిచ్చిన మాస్టరు ఇ.కె., మాస్టరు సి.వి.వి. గార్లకు శిరస్సు వంచి పాదాభివందనము చేయుచున్నాను. ఇపుడు వెలువడినది పతంజలి యోగ సూత్రములలో మూడవ భాగము. ఇంకను నాల్గవ భాగము రావలసియున్నది. ఈ కార్యక్రమము విజయవంతముగా పూర్తిచేయుటకు కావలసిన శక్తి సామర్థ్యముల నొసంగి, ఆశీర్వదించెదరు గాక అని పరమగురువులను ప్రార్థిస్తున్నాను.

ఇట్లు

4-8-99
విశాఖపట్నం

**డా॥ కె.ఎస్. శాస్త్రి**
వైస్ ఛైర్మన్ (సర్వీసెస్)
జగద్గురు పీఠము.

## విషయ సూచిక


| | సూత్రవము | పుట |
|---|---|---|
| 1. | దేశబన్ధ శ్చిత్తస్య ధారణా। | 1 |
| 2. | తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్। | 14 |
| 3. | తదేవార్థ మాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః। | 19 |
| 4. | త్రయమేకత్ర సంయమః। | 27 |
| 5. | తజ్జయాత్ప్రజ్ఞాలోకః। | 31 |
| 6. | తస్య భూమిషు వినియోగః। | 34 |
| 7. | త్రయమన్తరఙ్గం పూర్వేభ్యః। | 39 |
| 8. | తదపి బహిరఙ్గం నిర్బీజస్య। | 42 |
| 9. | వ్యుత్థాన నిరోధ సంస్కార యోభిభవ ప్రాదుర్భావౌ నిరోధక్షణ చిత్తాన్వయోనిరోధ పరిణామః। | 54 |
| 10. | తస్య ప్రశాన్త వాహితా సంస్కారాత్। | 68 |
| 11. | సర్వార్థ తైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః। | 77 |
| 12. | తతః పునశ్శాన్తోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్తస్యైకాగ్రతా పరిణామః। | 93 |
| 13. | ఏ తేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామా వ్యాఖ్యాతాః। | 101 |
| 14. | శాన్తోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ। | 112 |
| 15. | క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః। | 122 |
| 16. | పరిణామత్రయ సంయమాదతీతానా గత జ్ఞానమ్। | 127 |
| 17. | శబ్దార్థ ప్రత్యయానా మితరేతరాధ్యా సాత్సఙ్కరస్తత్ప్రవిభాగ సంయమాత్సర్వ భూతరుతజ్ఞానమ్। | 137 |
| 18. | సంస్కార సాక్షాత్కరణా త్పూర్వజాతిజ్ఞానమ్। | 148 |

| సూత్రము | | పుట |
|---|---|---|


19. ప్రత్యయస్య పరచిత్త జ్ఞానమ్। ....... 163

20. న చ తత్సాలమ్బనం తస్యావిషయీ భూతత్వాత్। ....... 169

21. కాయరూప సంయమాత్తద్గ్రాహ్య శక్తి స్తమ్భే చక్షుః ప్రకాశా సంప్రయోగేఽ న్తర్ధానమ్। ....... 172

22. ఏతేన శబ్దాద్యన్తర్ధానముక్తం। ....... 181

23. సోపక్రమం నిరుపక్రమంచ కర్మ తత్సంయమా దపరాన్త జ్ఞాన మరిష్టేభ్యో వా। ....... 186

24. మైత్ర్యాదిషు బలాని। ....... 199

25. బలేషు హస్తి బలాదీని। ....... 201

26. ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట జ్ఞానమ్। ....... 208

27. భువనజ్ఞానం సూర్యే సంయమాత్। ....... 217

28. చన్ద్రే తారావ్యూహ జ్ఞానమ్। ....... 217

29. ధ్రువే తద్గతి జ్ఞానమ్। ....... 218

30. నాభిచక్రే కాయవ్యూహ జ్ఞానమ్। ....... 219

31. కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః। ....... 258

32. కూర్మనాడ్యాం స్థైర్యం। ....... 260

33. మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్। ....... 262

34. ప్రాతిభాద్వా సర్వమ్। ....... 290

35. హృదయే చిత్తసంవిత్। ....... 297

36. సత్త్వపురుషయో రత్యన్తా సంకీర్ణయోః ప్రత్యయా విశేషో భోగః పరార్థత్వా త్స్వార్థ సంయమా త్పురుష జ్ఞానమ్। ....... 300

37. తతః ప్రాతిభ శ్రావణ వేదనాఽఽ దర్శాస్వాద వార్తాజాయన్తే ....... 315

38. తే సమాధావుప సర్గా వ్యుత్థానే సిద్ధయః। ....... 324

| సూత్రము | పుట |
|---|---|


39. బంధకారణ శైథిల్యా త్ప్రచార సంవేదనాచ్చ చిత్తస్య పరశరీరావేశః। ........ 328

40. ఉదాన జయాజ్జల పంక కంటకాదిష్వసంగ ఉత్క్రాన్తిశ్చ। ........ 337

41. సమాన జయాజ్జ్వలనమ్। ........ 343

42. శ్రోత్రాకాశయో స్సంబంధ సంయమాత్ దివ్యం శ్రోత్రమ్। ........ 356

43. కాయాకాశయో స్సంబంధ సంయమాల్లఘుతూల సమాపత్తే శ్చాకాశ గమనమ్। ........ 361

44. బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః। ........ 369

45. స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాద్భూతజయః। ........ 384

46. తతోఽణిమాది ప్రాదుర్భావః కాయసంపత్తద్ధర్మా నభిఘాతశ్చ। ........ 392

47. రూప లావణ్య బల వజ్ర సంహననత్వాని కాయ సమ్పత్। ........ 399

48. గ్రహణ స్వరూపాస్మితాఽన్వయార్థవత్త్వ సంయమాదిన్ద్రియ జయః। ........ 406

49. తతో మనోజవత్వం వికరణభావః ప్రధానజయశ్చ। ........ 413

50. సత్త్వపురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వ భావాధిష్ఠాతృత్వం సర్వ జ్ఞాతృత్వంచ। ........ 420

51. తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్। ........ 426

52. స్థాన్యుపనిమన్త్రణే సంగస్మయా కరణం పునరనిష్ట ప్రసంగాత్। ........ 434

53. క్షణ తత్క్రమ యోస్సంయమాద్వివేకజం జ్ఞానమ్। ........ 440

54. జాతిలక్షణ దేశైరన్యతాఽనవచ్ఛే దాత్తుల్యయోస్తతః ప్రతిపత్తిః। ........ 447

55. తారకం సర్వవిషయం సర్వథా విషయ మక్రమంచేతి వివేకజం జ్ఞానమ్। ........ 454

56. సత్త్వ పురుషయోశ్శుద్ధి సామ్యే కైవల్యమ్। ........ 472

# 1. దేశబన్ధ శ్చిత్తస్య ధారణా।

చిత్తస్య = చిత్తమునకు, దేశబన్ధః = దేశమునందు బంధింపబడుట, ధారణా = ధారణ (అనబడును).

**మనస్సును సాధకుడు నిర్దేశించిన విధంగా నిలుపుట ధారణ.**

**వివరణ :** విభూతి పాదము అనే అధ్యాయంలోకి మనం ప్రవేశించాం. యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారముల తరువాత 'ధారణ'కు నిర్వచనము యిచ్చారు. 'దేశబన్ధ శ్చిత్తస్య ధారణా' చిత్తస్య అంటే చిత్తమునకు, దేశబంధః - దేశమునందు బంధింపబడుట. దేశము అంటే యిక్కడ చోటు అని అర్థంకాదు. నిర్దేశము అని అర్థం. అంటే proposed localisation or prescribed concept or thought. అంటే మనం పరిమితి చేసి చిత్తాన్ని యిలా ఉండు అని నియమించ గలిగినపుడు 'ధారణ' అంటారు. ఇప్పుడు మనం ఎక్కడనించి బయల్దేరి ఎక్కడిదాకా వచ్చామో చూసుకోవాలి. చిత్తవృత్తులు అనే స్థితిలోనుంచి పతంజలి మనల్ని ఉద్ధరించటం కోసం యిన్ని లక్షల సంవత్సరాలనించి ప్రయత్నం చేస్తున్నారు. ఈ చిత్తవృత్తుల వలన వృత్తి సారూప్యము జరుగుతూ ఉన్నది. అనగా ఏ వృత్తియందు మనస్సు, యింద్రియములు ఉన్నవో, ఆ వృత్తితో సమానమైన స్థితిలో మనం ఉంటున్నాంగాని, మనం మనంగా ఉండటం లేదు. అదీ మొట్టమొదటిగా పతంజలి మనకి ప్రతిపాదన చేసిన విషయం. ''వృత్తి సారూప్య మితరత్రా'' చిత్తవృత్తులు కల్గినపుడు వృత్తులతో మనం ఉంటున్నాం. అంటే ఎవరితో మనం మాట్లాడినపుడు వాళ్ళ వైఖరిలో మాట్లాడుతున్నాంగాని, మన వైఖరిలో మాట్లాడటం లేదు. ఎవరితో లావాదేవీలు చేస్తున్నపుడు వాళ్ళతో సంబంధించినవి చేస్తున్నాంగాని, మనకి సంబంధించినవి కావు. చింతపండు తింటున్నపుడు నాలిక అనే ఇంద్రియము పులుపుగా ఉందిగాని, యింద్రియముగా లేదు. లైటును చూస్తున్నపుడు కన్ను అనే యింద్రియము లైటుగా ఉందిగాని, యింద్రియముగా లేదు. అంటే స్వస్వరూపము లేదు. ఇది మొట్టమొదట పతంజలి మనకి చెప్పింది. ఇలా ఉన్న స్థితిలోంచి చిత్తవృత్తుల నిరోధం జరగటానికి యోగాభ్యాసం ఎలా ఉండాలో అనుశాసనముగా యిచ్చారు. మనం ఏమి ఆచరించాలో, దాని నియమములు యిచ్చారు. ఫలితం చిత్తవృత్తి నిరోధం. వృత్తి నిరోధము అంటే చిత్త

నిరోధము కాదు. తేడా గమనించుకోవాలి. చిత్త నిరోధము సాధ్యపడదు. చిత్త నిరోధము అంటే మనస్సుని కంట్రోల్ చేయటం. 'నిగ్రహః కిం కరిష్యతి' భగవద్గీతలో చెప్పాడు. ఎవడి స్వభావం వాడికి వెనుక ఉన్నది. దానిష్ట మొచ్చినట్లు అది మనస్సుని ఆడిస్తూంటే యింక కంట్రోల్ ఏమిటి? ఆ పద్ధతి కాదు మనం వెళ్ళవలసింది. మనస్సువల్ల కాదు మనం ఆడుతున్నది. మన (Nature) స్వభావంవల్ల. ఎవడి స్వభావము వాడిది ఉన్నది. దానివల్ల మనస్సులో అభిప్రాయములు, సంకల్పములు పుట్టింపబడుతూంటే, ఆ పుట్టింపబడిన అభిప్రాయములు, సంకల్పములు మనం పుట్టించుకుంటున్నాం అనుకొని బ్రతుకుతున్నాం. కాని మనం పుట్టించుకుంటం నిజమైతే, ఒకడు పుట్టించుకున్న అభిప్రాయాలు ఇంకొకడు ఎందుకు పుట్టించుకోడు? అందుచేత అభిప్రాయములు మొదలైనవి మనం పుట్టించుకుంటున్నటు వంటివి కావు. మన పూర్వకర్మ వాసనలచేత, లోపల ఉన్న మన త్రిగుణాత్మకమైన ప్రకృతిచేత పుట్టింపచేయగా, అవి ఈ మనస్సు అనే తెరపైన వాటి ప్రోగ్రాం ప్రకారం నడుస్తూ ఉంటే, మనం వాడు వేసిన సినిమా చూసేస్తున్నాం. మనం వేయమన్న సినిమా వాడు వేయటం లేదు. ఇదీ జరుగుతూ ఉన్నది. సినిమా చూసాం అనుకోండి. టిక్కెట్టు అమ్మినపుడు చూపించక ఏం చేస్తాడు? వాడు చూపించిన సినిమా మనం చూస్తున్నాం. మర్చిపోకూడదు అది. అంతేకాని టిక్కెట్టు కొన్నారు కదాని మనమడిగిన సినిమా వాడు చూపిస్తున్నాడా? అలాంటిదే ఇది. కనుక మనస్సుని, ఇంద్రియాల్ని నిరోధము చేయటం సాధ్యం కాదు. అంటే చిత్తనిరోధము సాధ్యంకాదు. ఈ యోగాభ్యాసంవల్ల చిత్తవృత్తి నిరోధం సాధ్యం అవుతుంది. స్వస్వరూపము నందు అనుసంధాన మౌతారు. అంటే అది చూస్తున్నపుడు అదిగా, ఇది వింటున్నపుడు ఇదిగా, వాళ్ళతో మాట్లాడుతున్నపుడు వాడిగా, బ్రతకటం అనేది ఆగిపోయి, మీరుగా బ్రతకటం అనేది ప్రారంభం అవుతుంది. ఇది పతంజలి ప్రతిపాదన చేసిన సిలబసు. అది మర్చిపోకూడదు. కనుక చిత్తమునకు వృత్తులుంటాయని, వృత్తి నిరోధము కావాలని, వృత్తులు 5 రకాలని, అందులో క్లిష్టములు, అక్లిష్టములు ఉండవచ్చని తెలియజేసాడు. చిత్తవృత్తుల స్థితి దగ్గరనించి, చిత్తవృత్తి నిరోధము దగ్గరకు, ఆపైన స్వస్వరూపమునందు అనుసంధానము చెందే వరకు ఈ మార్గాన ఆరోహణం చేయాలి. దీనికి మొట్టమొదట కావలసినవి 1. అభ్యాసము, 2. వైరాగ్యము. అభ్యాసము అనే మాటకి అర్థం ప్రాక్టీసు

కాదు. పూర్వం చెప్పుకున్నాం తిరిగి తిరిగి అదే ఆసక్తితో ఆచరించటం (repetetion with zeal) అని అర్థం. ఇతనిచే ఈ విద్య అభ్యస్తము అంటారు. అంటే గురుకులంలో 50 సార్లో, 100 సార్లో వాడు గురువు దగ్గర మళ్ళీ మళ్ళీ చదివేడని అర్థం. ''గురుజన క్లిష్టో మురారి కవిః'' అన్నాడు. గురుజనము దగ్గర శరీరాన్ని, మనస్సుని అలాగ క్లేశపెట్టి, రొష్టుపెట్టి చదువుకున్నాట్ట మురారి అనే కవి. సగర్వంగా చెప్పుకున్నాడు. కనుక అభ్యాసము, వైరాగ్యము కావాలి. ఏమిటి అభ్యాసం కావాలి? మొట్టమొదట, నాకు చిత్తవృత్తుల స్థితి దగ్గరనించి చిత్తవృత్తి నిరోధము అనే జీవితము కావాలి అని అనుకోగలగాలి. అంటే self-proposing . అది లేనిదే మిగతావి ఏవీ సహాయం చేయవు. స్వయంభూః అయినటువంటి వెలుగు మనలో ఉన్నది. మొదలు పెడితే అది సహాయం చేస్తుంది. అభ్యాసం నిరంతరం చెయ్యాలి. 24 గంటల్లో మీ వృత్తి చేస్తూన్నపుడు ఆఫీసులోను, మీ చుట్టుప్రక్కల ఉన్నవాళ్ళతో, మాట్లాడుతున్నపుడు, వాళ్ళందరూ మీతో మాట్లాడుతూ ఉంటే వింటూన్నపుడు, వాళ్ళకి కావలసిన వ్యవహారాలు చేస్తూ, మీకు కావలసిన పని మీరు చేస్తూ ఉండండి. ''వీళ్ళని చిత్తవృత్తి నిరోధానికి ఆరాధ్య దైవతములయొక్క రూపములుగా నేను వినియోగించు కుంటున్నాను'' అనేది నిరంతరం క్షణక్షణం అభ్యాసం చేస్తూండాలి. ఇది చిత్తవృత్తి నిరోధానికి కావలసినది.

రెండవది వైరాగ్యం చెప్పాడు. వైరాగ్యము రెండు రకాలు. పుచ్చు వైరాగ్యం, మంచి వైరాగ్యం. పుచ్చు వైరాగ్యమంటే ఏమిటి? మీ దగ్గర పది రూపాయలు అప్పు తీసుకొని యిస్తానన్న రోజుకి ఒకరోజు ముందే యిచ్చేయటం. రేపు మరో వందరూపాయలు అప్పు తీసుకోబోతున్నాము. దానికోసం. వందరూపాయలు కూడ తీసుకొని అలాగే యిచ్చేయటం. ఎంచేత? ఎల్లుండి వెయ్యి రూపాయలు తీసుకోబోతున్నాడు. ఇహ కనపడడు. ఇలాగే కాఫీ మానేస్తాము. ఎందుకంటే స్వర్గంలో యింతకంటే మంచి కాఫీ నిరంతరం తాగుతూ ఉండవచ్చుట. అది డొక్కు వైరాగ్యం. ఇక్కడ బ్రహ్మచర్యం ఆచరిస్తున్నాం. ఎంచేత అంటే, స్వర్గంలో రంభ మొదలైనటువంటి వాళ్ళు ఉంటారు గనుక ఇది డొక్కు వైరాగ్యం... అలా కాకుండా, ఈ చేస్తున్న సాధనలో సర్వాంతర్యామి యందు స్పర్శ కలుగగా,

పెద్దల సాంగత్యము కలుగగా, ఒకానొక నిజమైన జీవితము యొక్క రుచి మొట్టమొదటి తడవగా మనకి తెలుస్తుంది. అప్పుడు ప్రస్తుతం మనమున్న జీవితం యొక్క రుచి తక్కువగా ఉంటుంది. అది తెలియటం వల్ల దానియందు రుచి కల్గి, ఇప్పుడున్న దానిని సహజంగా వదిలివేయటం జరుగుతుంది. ''అరతిర్జన సంశతి'' భగవద్గీతలో చెప్పాడు. అంటే ఎక్కడైనా పదిమంది చేరారంటే అది ఏమిటో అనే ఆరాటం మనస్సుకు ఉండదు. అలాగే వ్యాపారంలోను, సులభంగా కొన్ని లక్షలు వస్తాయంటే కూడ మనస్సు ఆరాట పడకూడదు. అది లేకుండా ఉంటే యోగాభ్యాసం. అక్కడనించి కనిపిస్తుంది వైరాగ్యం అనేది. లేకపోతే యోగాభ్యాసం వాయిదా వెయ్యాలి. ఆ వ్యాపారం చేద్దాం అని అనిపించి మానేసినా, యోగాభ్యాసానికి యిప్పుడిపుడే పనికిరాం. కనుక వైరాగ్యమనేది ఎవరికి వారికే తెలుస్తుంది. ఎవడూ చెప్పక్కర్లేదు. చేతిలో ఉన్న పండు వగరుగా ఉన్నదా, పుల్లగా ఉందా, తియ్యగా ఉందా, తిన్నవాడికి తెలియక ఎవరికి తెలుస్తుంది? అలాంటిదే వైరాగ్యం. కనుక అభ్యాసము, వైరాగ్యము ఈ రెండూ చేయండి. ఇంద్రియ నిగ్రహము అంటే మనస్సుని బిగదీయటం, ఇంద్రియాల్ని బంధించటం, గాలిని బంధించటం, ఇట్లాంటివన్నీ చేయకండి అన్నాడు. నిర్బంధాలు ఏమీ చేయకుండా 'ఈశ్వర ప్రణిధానము' (ఈశ్వరుని యందు శరణాగతి చెందుట) ప్రారంభం చెయ్యాలి. అంటే ఎవడియందు నువ్వు మేల్కొనే వరకు అంతకు ముందున్న నేను ఏడుస్తూ, నవ్వుతూ కుక్కలాగ బ్రతుకుతూ ఉంటే అదే నేను అనుకొని సరిపెట్టుకొని బ్రతుకుతున్నామో (with all fears and complexes) అదికాక, వాడి లోపల ఎవడైతే అంతర్యామియైన నేను ఉన్నాడో ఆయనకు శరణాగతి చెందాలి. అక్కడి వరకు ఒక్కొక్కడితో ఒకోలాగ ప్రవర్తిస్తున్నాం. కొడుకైతే ఒకలాగ ప్రవర్తిస్తాం. అల్లుడైతే ఒకలాగ ప్రవర్తిస్తాం. కూతురైతే ఒకలాగ ప్రవర్తిస్తాం. కోడలైతే ఒకలాగ ప్రవర్తిస్తాం. చుట్టం అయితే ఒకలాగ ప్రవర్తిస్తాం. ఇంకోడైతే యింకోలాగ ప్రవర్తిస్తాం. మన కులం వాడైతే ఒకలాగ ప్రవర్తిస్తాం. ఇంకో కులం వాడైతే యింకోలాగ ప్రవర్తిస్తాం. అది పోవాలి. ఈశ్వర ప్రణిధానం చేస్తేగాని పోదు. ఈశ్వర ప్రణిధానానికి ''తస్య వాచకః ప్రణవః'' అని చెప్పారు. మొట్టమొదట ఉచ్ఛ్వాసము, నిశ్వాసము క్రమబద్ధము చేయాలి. వీలైనంత సుదీర్ఘంగా, వీలైనంతసేపు, బాధ కలగకుండా ఉన్నంతసేపు,

సుకుమారంగా, సున్నితంగా శ్వాస లోపలికి పీలుస్తూ ఉండండి. ఇంక పీల్చడం నిండిపోయింది అనంగానే, అదే విధంగా సున్నితంగా సుకుమారంగా ఎంతసేపైతే శ్వాస విడువగలరో, అంతసేపు విడుస్తూ ఉండండి. ఇది శ్వాసను క్రమబద్ధం చేయటం. ఎందుకని? ఉచ్ఛ్వాసము, నిశ్వాసము అనేవి రెండూ ఒక జంట. అలాగే గుండె కొట్టుకుంటం కూడ. జంట దెబ్బలు ఉంటాయి. 'లబ్', 'డబ్' రెండూ ఉంటాయి గుండెలో. ఎలక్ట్రో మాగ్నెట్‌కి రెండు alternations of currents ఉంటాయి. లేకపోతే అసలు బ్రతుకు లేదు. ఎలక్ట్రిక్ కరెంటులేదు. 21వ శతాబ్దిలో ఫిజిక్స్‌లో గమనిస్తారు, ప్రాణమన్నా, విద్యుచ్ఛక్తి అన్నా ఒకటే అని. ఇపుడు అది వేరు ఇది వేరుగా ఉంటోంది. కాని ముట్టుకుంటే మాత్రం యిది అందులోకి వెళ్ళిపోతుంది. అంతవరకు తెలుసు. తరువాత ప్రణవం. దీన్ని మూడుమాట్లు చేయండి. మళ్ళీ ఆపేయండి. మళ్ళీ మూడు మాట్లు చేయండి. ఇలాంటి శ్వాస ఎందుకు చెయ్యాలో ఇంతకు ముందు చెప్పారు. ''ప్రచ్ఛర్దన విధారాణాభ్యాం వా ప్రాణస్య'' నిర్విరామంగా చేయవలసింది (continuous attempt) కాదు. ప్రత్యామ్నాయంగా చేయాలి (alternation of attempt). ఇలా ఒక మొదటి స్టెప్. తరువాత పీలుస్తున్నంతసేపు 'సో' అనే మంత్రం మానసికంగా జపించి, లోపల ఉన్నటువంటి ఉచ్ఛ్వాస, నిశ్వాసలలో ఉన్న ఈ కదలికలు గమనిస్తూ ఉండండి. ఇంకేం గమనించినా ఇన్నాళ్ళూ చేసినది వ్యర్థమే. పాతికేళ్ళో, ముప్పై ఏళ్ళో యివన్నీ చేసినా, శ్వాస పీలుస్తూ మనస్సు ఆఫీసులో ఉందనుకోండి, ప్రయోజనం లేదు. ఆఫీసుకి వెళ్ళిపోవటం నయం. శ్వాస పీలుస్తూ మనస్సు శ్వాసలో ఉన్నటువంటి కదలికల యందు, శ్వాస పీల్చువాని యందు ఉండాలి. ఎవడు వీడు? అని లోపల అన్వేషిస్తూ ఉండాలి. ఇది అయిన తర్వాత వదిలేటపుడు 'హం' అనేటువంటి దానితో మూడు శ్వాసలు, మళ్ళీ వదిలేయండి. కొంచెంసేపు ఆగి మళ్ళీ మూడు శ్వాసలు, మళ్ళీ వదిలేయండి. కొంచెంసేపు ఆగి మళ్ళీ అలాగే చేయండి. 'హం' అనేది కంఠంతో ఉచ్ఛరించాలి. బయటికి వదుల్తూన్నపుడు చేస్తూన్నది కనుక. ఎందుకంటే అది వినాలి. ఓంకారం ఎట్లా అయితే చేస్తారో, అలాగ. 'హం' మొదట ప్రారంభించేటప్పుడే కాని మిగిలినదంతా ఓంకారమే అక్కడ పలికేది. యింకేం ఉండదు. ఇలాగ అయిన తర్వాత మూడవ స్టెప్‌లో పీల్చేటపుడు

మానసికంగా ఓంకారము, వదిలేటపుడు కంఠంతో ఓంకారము, మూడు మాట్లు, మళ్ళీ వదిలేయండి. మూడుమాట్లు చేసి మళ్ళీ వదిలేయండి. ఇది ఈశ్వర ప్రణిధానము. ''తస్యవాచకః ప్రణవః'' అన్నదానికి అర్థం చాల ముఖ్యం కనుక ఇదివరకు రెండుమాట్లు చెప్పుకున్నాం. ఇది ఒక్కటే అసలైనటువంటి విద్య. గుహ్యావిద్య. ''యదక్షరం వేదవిదో వదంతి'' దేన్నైతే అక్షరం అని వేదం తెలిసినవాళ్ళు అంటున్నారో, ''విశంతి యద్యత వీతారాగాః'' రజస్తమస్సులు తొలగిపోయిన తర్వాత క్రమంగా దేంట్లో ప్రవేశిస్తున్నారో అది. వీళ్ళు ఉచ్చరిస్తూ అందులో ప్రవేశించాలి. మెట్లమీద నిల్చుని ఉచ్చరిస్తూ ఉంటే మెట్ల వేదాంతమే. ''తత్తేపదం సంగ్రహేణ ప్రవక్ష్యే'' అది సంగ్రహంగా నేను చెబుతాను విను అన్నాడు. ఏం చెప్పాడో తరువాత శ్లోకంలో లేదు. ఏం చెప్పాడు భగవద్గీతలో. వీడు అన్నాడు వాడు ఉచ్చరించాడు. అంటే వీడు చేసి తర్వాత వాడిచేత చేయించటం. భగవద్గీతలో దీనికి corresponding part అది. ఈ గాప్ చేసుకుంటూ ఉంటే ప్రణవానికి ప్రణవానికి మధ్య వ్యవధి పెరుగుతుంది. ఈ మూడు మూడు కాకుండా ఇంకోమూడు లేకపోతే నాలుగు, శరీరంలో ప్రస్తుతం ఉన్న తత్వాన్ని బట్టి సహజంగా ఆ శ్వాసలు అప్రయత్నంగా పెరుగుతాయి. అది ఎంత పెరిగినా నిరంతరంగా చేసుకుంటూ ఉండాలి. ఏ రోజునైనా కొంచెం ఎక్కువ చేయాలంటే లోపలనించి చెబుతాడు. లోపల ఉన్నవాడు చేసుకోవచ్చుని, లేదా ఈ రోజుకి యింతే అని చెబుతాడు. ఆ పరిస్థితిని బట్టి గురువు లోపలనించి చక్కగా ప్రతిరోజూ కూడ ఉదయం, సాయంత్రం మనకి చెబుతూ ఉంటాడు. స్పష్టంగా మీరు వింటారు, దాన్ని అనుసరిస్తారు. ఇదీ పద్ధతి. కనీసం ఇది పెట్టుకోండి. దీంట్లోంచి చాలం పెంచుతాడు గురువు. కనుక ఈశ్వర ప్రణిధానము. దీంతోపాటు మీ యిష్టము వచ్చినటువంటి ధ్యానము చెయ్యాలి అన్నాడు కదూ. ''అభిమత ధ్యానాద్వా'' అంటే గణపతిని యిష్టపడితే కళ్ళు మూసుకొని గణపతిని 'ఓం' అనే అక్షరం క్రింద ఊరికే ధ్యానం చేసుకోండి. లేదా అలాగే శివుడు కాని. ప్రస్తుతానికి 'ఓం' ఒక్కటి తప్ప మంత్రాలు మాత్రం ఇప్పుడప్పుడే చేయద్దు. ఈ మూడవ పాదంలోకి వచ్చినదాకా చేయకూడదు. అంటే 'దేశబంధశ్చిత్తస్య ధారణా' అన్నాడే అది వచ్చేదాకా చేయకూడదు. వచ్చాక మీ యిష్టం. మిగతా గాయత్రి కలుపుకోండి. శివుణ్ణి కలుపుకోండి. విష్ణువుని కలుపుకోండి.

ఎంతమందిని కలుపుకున్నా ఒకే మంత్రం నడుస్తూ ఉంటుంది. అక్కడిదాకా మాత్రం ఒక మంత్రం కాక రెండోది చేసారంటే గజిబిజి అయిపోతుంది. అది మీకు తెలుస్తుంది. అన్ని మంత్రాలలోను కూడ ఒకే మంత్రం ఓంకారము అనే కంఠధ్వని నడుస్తూంటుంది. ''యో వేదాదౌ స్వరః ప్రోక్తః వేదాంతే చ ప్రతిష్ఠితః'' వేదానికి మొట్టమొదట ఏ స్వరం చెప్పబడ్డదో, వేదం మధ్యలో ఏది చెప్పబడ్డదో, వేదాంతంలో ఏది చెప్పబడ్డదో; అంటే ఏమిటి? మీరు గొంతెత్తి ఏది మాట్లాడినా, ప్రశ్న వేసినా, ఒకడికి ఒకడు సమాధానం చెప్పినా, బజారు వస్తువుల్ని గురించి మాట్లాడినా, లెక్చరు యిచ్చినా, ఆఫీసు విషయాలు మాట్లాడుతున్నా, ఆ కంఠధ్వని రూపంలో వస్తున్న ఓంకారం తప్ప యింకొకటి లేదు అనే స్థితి వస్తుంది. కనుక వేదానికి ఆది, మధ్యము, అంతము ఓంకారము అయినటువంటి స్థితి వస్తుంది. అది శృతి. ధారణదాకా వచ్చాక మనం ఏది పలికినా అదే స్థితి వస్తుంది. అపుడు మీ యిష్టం వచ్చిన మంత్రాలతోటి చేసుకోవచ్చు. కాని ఒక్క మంత్రం చాలు. లేదా సరదాకి పాతికో, ముప్పైయో, యాభైయో మంత్రాలతో చేసుకోవచ్చుగాని, రావణాసురుడులాగ అయిపోతాం. బుర్రకాయ పాడైపోతుంది. ప్రణవం ఒక్క మంత్రం చాలు. చాలామంది దానితోనే ఉన్నారు. మంత్రం వద్దుగాని రూపాన్ని చేసుకోండి. విష్ణువుని, శేషశయనుణ్ణి, లేదా గరుడయానుణ్ణి మీ యిష్టం. మీ హృదయాన్ని ఏది ఆకర్షిస్తూ ఉన్నదో దాన్ని. ఇందులో ఒకడు పెద్ద దేవుడు. ఒకడు చిన్నదేవుడు అంటూ ఏమి లేదు. మన హృదయాన్ని ఏది ఆకర్షిస్తే అక్కడ నిలబడాలి. ఇవన్నీ ఒకే అంతర్యామియైన దేవుడిచేత చేయబడిన విగ్రహములు. కనుక అదికూడ కలుపుకోండి. దీనితో వచ్చిన దానితో మీ కంఠధ్వనిని ఉచ్చరించి మీరే వింటున్నారు గనుక మీ మనస్సు, మీ యింద్రియములు, మీ అంతర్ముఖత్వానికి వెడుతూన్నాయి. అంటే ఎవడు ఉచ్చరిస్తున్నాడో అని వింటున్నాయి. ఉచ్చరిస్తున్నటువంటి నాదాన్ని వింటున్నాయి. యింకా మనస్సుకేదైనా పని అప్పచెప్పినట్లైతే యింకొక పనిమీదకి వెళ్ళకుండా ఉంటుంది. యిన్నాళ్ళనించి మనకి తెలీలేదు ఆ విషయం. మనస్సుని కేంద్రీకరణం చేయండి, వంటరిగా పెట్టండి, నొక్కి ఉంచండి, అంటే అది నానా రచ్చ చేస్తుంది. అలా చేయకుండా శ్వాస కదుల్తూంటే ఆ కదలికల్ని గమనించండి. అంటే మనం గమనిస్తున్నాం అని అనుకుంటున్నాము. కాని గమనిస్తున్నది మనస్సే కదా. ఎందుకంటే మనం మనస్సుతోటే ఏకమై

యిన్నాళ్ళు నించి ఉన్నాం కనుక మనస్సు గమనిస్తోంది. ఆ కదలికలలో కుతూహలం కలిగింది మనకి. అపుడు ఎక్కడుంది మనస్సు? ఆ కదలికలలోనే ఉన్నది. తర్వాత కంఠంతో ఉచ్చరిస్తూ ఆ శబ్దం వింటూ ఉన్నది. మనస్సు శబ్దమునందు కుతూహలపడి లీనమైపోయినది. ''బ్రహ్మణి శ్రీనివాసే శేముషే భక్తిరూపా'' 'శ్రీ' యందు నివసించునటువంటి వక్ష స్థలంలో వున్న పరబ్రహ్మ యందు ప్రజ్ఞంతా కరిగి భక్తిరూపమై వెళ్ళి అక్కడ ఆగిపోతుందన్నారు రామానుజులవారు. ఒకే విద్య మనకి బోధపడాలని నాలుగు దిక్కులనించి నలుగురూ చెప్పారు. ''నిఖిల నిగమ జన్మస్తే మభంగాభిరామే'' నిఖిల నిగమములు అంటే ఈ సమస్త వేదములు సృష్టిగా అంటే పృథివి ఆపస్తేజో వాయు రాకాశములు, దేశము, కాలము, సూర్యుడు మొదలైనటువంటి రూపంలో ఉండగా, దాంట్లో జన్మ; ఒక జన్మ పుట్టుట, మళ్ళీ శరీరం అందులోకి వదలటం అనేటువంటిది, భంగం అంటే అల. ఈ టైము అనే నీళ్ళల్లో అలలాగ అన్నమాట. అల లేచినట్లు మనము ఒకసారి శరీరాలు పొందుతున్నాము. అల అణిగిపోయినట్లు ఈ శరీరము అందులోకి లీనమౌతోంది. ఈ మధ్యన ఉన్నటువంటి ఈ భంగముతో అభిరామమై, ఈ అలలతో మనోహరంగా ఉన్నటువంటి ''బ్రహ్మణి శ్రీనివాసే'' శ్రీయందు అంటే శ్రీ ఎక్కడుంటుంది? శ్రీ వక్ష స్థలంలో ఉంటుంది. ఈయన చెప్పినటువంటి ఓంకారాన్ని ఉచ్చరిస్తున్నదెవరు? అని ప్రశ్నించే దానిపేరు శ్రీదేవి అంటారు, వైష్ణవ సంప్రదాయంలో. ఆయన్ని ఆశ్రయించి ఉంటుంది కనుక శ్రీ అనే మాటకి అర్థం ఆశ్రయించి ఉన్నది అని. శ్రీ సూక్తంలో కూడ మనకి చెప్పబడినది అదే. శ్రీ విద్యలో చెప్పబడినది కూడ అదే. ఓంకారము అని చెప్పబడే అంతర్యామి దేనియందు ఉంటున్నాడు? ''శ్రీనివాసః'' శ్రీయందు నివసించి ఉంటున్నాడు. శ్రీ తనయందు నివసించి ఉంటోంది. అట్లాంటి 'బ్రహ్మణి' సర్వాంతర్యామి యందు 'మమ' అంటే నాకు, అంటే ఈ అహంకారము అనేటువంటి వాడికి, చిత్తవృత్తులు జరుగుతూ ఉన్నవాడికి 'శేముషీ' ఉన్న తెలివి, ప్రజ్ఞ మొదలైనటువంటి దంతా 'భక్తిరూపా' భక్తిరూపమై, ఈ చిత్తవృత్తి నిరోధము జరిగి తాను ఉంటాడు. బ్రహ్మ సూత్రములకు రామానుజుల వారు వ్రాసిన వివరణలో మొట్టమొదట వ్రాసిన శ్లోకం ఇది. బ్రహ్మ సూత్రాలు, నారద భక్తి సూత్రాలు, పతంజలి యోగ సూత్రాలు దేనికదే వేరు అనుకుంటే ఏం ఉండదు. జాగ్రత్తగా

సమన్వయం చేసుకుంటే ఇన్నింటిలో కూడ మనం ఏం చేయాలో అది ఒక్కటే యిస్తారు. మనోవాక్కాయ తపస్సులు, స్వాధ్యాయము, పెద్దలు చెప్పినటువంటి వాక్కులు, ఇతిహాస పురాణ, ఉపనిషత్తులు, వేదవాక్కులు ఇవేవో తీసుకొని మొదలుపెట్టు అని క్రమంగా అందులోకి దూరుస్తారు. ఒక్కొక్కపుడు దానివల్ల పెద్దల దగ్గరికి వెళ్ళవలసి వస్తుంది. అలా వెళ్ళినపుడు పెద్దల సాంగత్యము ఒకటి వస్తుంది. అది లేకపోతే యోగాభ్యాసం లాభం లేదు. అంటే ఇనుప ముక్కకి అంతకుముందు అయస్కాంతీకరణ మయిన ఇనుప ముక్క లేకపోతే అయస్కాంతమవ్వటం ఉండదు. అది సత్సాంగత్యము అంటే. కనుక తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము ఈ మూడు ముఖ్యంగా చేయవలసిన పనులు. అంచేత క్రియా యోగము అన్నాడు. ''తపస్స్వాధ్యాయ ఈశ్వర ప్రణిధానాని క్రియా యోగః'' ఇలా చేస్తూంటే చిత్తము శుద్ధికాగా ''ప్రత్యక్ చేతనాధిగమః'' అంటే నీ చేతనము అనగా నీ ప్రజ్ఞ అనే వెలుగు ఉన్నది ఉన్నట్లుగ ఆ స్వస్వరూపంలో నీమీద వెలగటం మొదలు పెడుతుంది. ప్రత్యక్షముగా సూటిగా ఎదురుగా టార్చిలైటు వేసినట్లుగా వెలుగుతుంది. లేకపోతే నీ మనస్సుగా, నీ యింద్రియాలుగా, నీకున్న అభిప్రాయాలుగా, నీ ఆశయాలుగా, నీ ఆదర్శాలుగా వెలుగుతోంది. ఏదో తుక్కు విషయాలుగా వెలుగుతోందిగాని, చేతనముగా వెలగటం లేదు. ఇపుడు వెలగటం మొదలుపెడుతోంది. ఇక్కడ నించి యమము, నియమము మొదలైనవి మొదలు పెట్టండి నాయనా అన్నారు. యమ, నియమ, ఆసనము లంటే ఏమిటో వాటివల్ల ఏమి వస్తుందో కూడ చెప్పారు. అప్పుడు హృదయము, మనస్సు కలిసి స్థిరత్వము, సుఖము కలిగి ధారణకు కావలసిన ఒకానొక యోగ్యత కలుగుతుంది. దాని తర్వాత ప్రాణాయామము సిద్ధిస్తుంది. అప్రయత్నంగా ఎపుడైతే చిత్తము హృదయమునందు రమించుట చాతనయిందో, అక్కడ ఉన్నటువంటి నాదాన్ని విని, అక్కడ వచ్చిన కదలికల్ని చూచి పూర్తిగా దానితోనే కాలక్షేపం చేయటం వస్తుంది (బైట విషయాలతో కాలక్షేపం అక్కర్లేకుండా). అప్పుడు చిత్తవృత్తి నిరోధము మనకు తెలియకుండా జరిగిందన్నమాట. తెలిస్తే చిత్తవృత్తి నిరోధం పుటం పెట్టినా జరగదు. తెలియటం అంటే బైట విషయాలు తెలియటం. నిద్ర ఎలా అయితే తెలియకుండా వస్తుందో అలా ఉంటుంది చిత్తవృత్తి నిరోధం. ఒక సైకలాజిస్టు నిద్ర ఎలా వస్తుందో చూడాలని రీసెర్చి చేస్తున్నాట్ట రోజూ, అన్ని పనిముట్లూ

దగ్గర పెట్టుకుని. చివరికి నిద్రవచ్చే క్షణం వచ్చేటప్పటికి నిద్రపోతున్నాట్ట, ఇట్లా జన్మంతా సరిపోయింది వాడికి. ''నయనాభిముఖీ బహువా'' అన్నాడు కాళిదాసు రఘువంశంలో. రఘు మహారాజు వేటాడివచ్చి, తన గుడారంలో పడుకొని ఉంటే, అలా చూస్తూండగ కళ్ళ కెదురుగుండా ప్రియురాలులాగ చాల మనోహరంగా వచ్చిందిట నిద్ర. అలాగ చిత్తవృత్తి నిరోధము తెలిసి ఎవడికి రాలేదు. వచ్చేటపుడు తెలియనూ తెలియదు. ఏదైనా విఘ్నం వస్తే తప్ప కొంచెంసేపు చిత్తవృత్తి నిరోధంలో ఉన్నామని తెలియదు. బాగా అలవాటైన తర్వాత కూడ చిత్తవృత్తి నిరోధంలో రోజుల తరబడి, నెలల తరబడి, సంవత్సరాల తరబడి ఉండటమే కాని ఉన్నట్లు తెలీదు. అందుకనే మాధుర్యము తెలిసినటువంటి మహానుభావులు అందరు కూడ అది కానటువంటి క్షణములు జన్మలో లేకుండా ఉండుగాక! అని కోరారు. అంటే తదన్యము లేకుండా ఉండాలి. దాన్నే ''అనన్యాశ్చింత యంతో మాం యే జనాః పర్యుపాసతే'' అన్నారు. ఈ అనన్య చింతతో ఎవరైతే అంతర్యామి యైనటువంటి నన్ను పర్యుపాసన చేస్తారో, ''తేషాం నిత్యాభి యుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్'' అలాంటి వాళ్ళు ఎపుడూ కూడ నిత్యమూ నాతో అభియుక్తులు అంటే అభిముఖంగా యోగం పొందినటువంటి వాళ్ళు, కనుక వాళ్ళ యోగక్షేమము నేను చూస్తూ ఉంటాను, వాళ్ళు చూసుకోరు గనుక అన్నాడు శ్రీకృష్ణుడు. అలాగే 'అనన్య' అంటే ''న అహం వేదమ్నర్న తపసా నదానేన నచేద్యమా'' ఈ అనన్యత్వము రానటువంటి వాడికి వేదం చదువుకున్నా లాభంలేదు. తపస్సు చేసినా లాభంలేదు. యజ్ఞయాగాది క్రతువులు చేసినా లాభం లేదు. పూజలు జప హోమాదులు చేసినా లాభం లేదు. ''భక్త్యా త్వనన్యయా శక్యః అహం ఏవం విధోఽర్జునా'' పదకొండవ అధ్యాయంలో విశ్వరూప సందర్శన యోగంలో కూడ అనన్య భక్తి ఒక్క దానికే సాధ్యమన్నాడు. అంటే అన్య వస్తువు మిగిలినటువంటి మనస్సుకి ఇది లాభం లేదు. చిత్తవృత్తి నిరోధము కలిగినపుడు అన్య వస్తువు ఉండదు. కనుక చిత్తవృత్తి నిరోధము కలిగినట్లు వాడికి తెలీదు. అనన్యము అనేటువంటి పదంతో కొందరు చెబితే, దాన్నే ఏకాంతము అనే పదంతో కొందరు చెప్పారు. ఏకాంతం అంటే ఒక్కడే ఉండటం. మీతో కొంచెం ఏకాంతంగా మాట్లాడాలండి అంటారు. మాట్లాడేటపుడు ఇద్దరుంటే ఏకాంతం ఏమిటి? తో కాంతమే. ఏకాంతం

వచ్చిన వాడికి ఎంతమంది ఉన్నా అందరిలోను ఒకడే ఉంటాడు. దాన్నే ఏకాంత సేవ పేరుతో కవులు కూడ ప్రియురాలు ప్రియుణ్ణి ఎలా సేవిస్తుందో దానితో పోల్చి కావ్యాలు రాసారు. ఏకాంత సేవకు సంబంధించినటువంటివి పెద్దల దగ్గర కూర్చుని చదువుకుంటే తెలుస్తాయి. సూటిగా యోగానందము, మోక్షానందము ఇచ్చేటువంటివి చాల పదుల పాటలు రవీంద్రనాథ్ ఠాగూర్ రాసారు. అంతేకాకుండా బెంగాలీ సంప్రదాయంలో వైష్ణవ గీతాలని ఉండేవి. ఆ గీతాలు పాడుతూ ముష్టివాళ్ళు యింటికి వస్తూంటే డబ్బులిచ్చి కూర్చోబెట్టి వాళ్ళచేత పాడించి రికార్డుచేసి, ఆయన ప్రచురించాడు. ఇంగ్లీషులోకి కూడ అనువాదం చేసాడు. ఇది వచ్చినటువంటి వాళ్ళనే ఏకాంత ధర్మము కలవాళ్ళంటారు. పరమైకాంతులు అని భారతంలోను భాగవతంలోను చెబుతారు. ఇది చిత్తవృత్తి నిరోధానికి సంబంధించినటువంటి కథ. చిత్తవృత్తి నిరోధం జరిగితే ఇంద్రియార్థముల యొక్క ప్రభావం యింద్రియముల మీద ఆగిపోతుంది. లైటు ప్రభావం కంటిమీద పడదు. మీ కన్ను ఏది చూడదల్చుకుంటే అది చూస్తుంది. చీకటి మీకంటి మీద ప్రభావం చూపించటం లేదు. అలాగే ఈ ఐదు ఇంద్రియములు కూడ. ఆ లోపల ఉన్న ఈశ్వరుడు అనే శబ్దంతో ఎవడికైతే ప్రణిధానము చేయమన్నాడో, వాడి దగ్గరికి తీసికెడ్తున్నారు. ఈ స్థితి అందేటప్పటికి తమాషాగా incandesence అంటే రెండు కార్బన్ రాడ్‌లుపెట్టి ఛార్చిచేస్తే మధ్యనున్న చోటులో మంట వస్తుంది. ఈ మంటకిన్నీ, వీటిలో ఉన్న కార్బన్‌కిన్నీ, texture లో ఏం సంబంధం లేదు. అలాగే ఈ స్థితిలో పుట్టే ఈశ్వరుడు అనే వెలుగుకిన్ని, వ్యక్తమయ్యే మిగతా యంత్రాంగంలో ఉన్న మనో బుద్ధ్యహంకార చిత్తములు తరువాత సప్తధాతువులు మొదలైన వాటికిన్ని ఏమి సంబంధం లేదు. అది మనస్సుకి దేహానికి మధ్య ఉన్న అంతరాన్ని ఒకచోట పూరిస్తోంది. మనస్సుకి ఆపైన ఉన్నదానికి అంతరాన్ని (gap) ఇంకో చోట పూరిస్తోంది. దీన్ని పెద్దలు బ్రిడ్జి (bridge) అన్నారు. Gap fill up చేస్తోంది. ఈ రెండవ దాన్ని Master C.V.V. గారు higher bridge అన్నారు. higher bridge begining అని ఉంటుంది. ఇది వస్తుందిక్కడ. ఇలాంటి స్థితి పుట్టినపుడు ఆ వెలుగు ఉంటుంది. మీరు ఉండరు. వెలుగులో మీరుంటారు. మళ్ళీ మెలకువ అయ్యి ఇవతలికి వచ్చాక మీరుంటారు. అంతకు ముందు వెలగుందని

అనిపిస్తుందిగాని మీకు తెలీదు. అందుకని అభ్యాసం కాగా కాగా 24 గంటలూ వెలుగే ఉండాలి. నేనుండక్కర్లేదు అనే సంగతి తెలుస్తుంది. ఈ స్థితి వచ్చిన తర్వాత అయిపోయిందా? అయిపోలేదు. ఇపుడేం చేయాలంటే ఈ ఇంద్రియాలు, ఈ మనస్సు, బుద్ధి, అహంకారము ఇంకా ఇందులో చాల సొరుగులు ఉన్నాయి, వీటన్నింటినీ అవతల పారేయక్కర్లేదు. సద్వినియోగం ఇపుడు చేస్తాం. ఇదివరకు దుర్వినియోగం చేసాం. ఎపుడైతే ఈ వెలుగు వచ్చిందో, అపుడు మీకు ప్రాణాయామము సిద్ధిస్తుంది. అనగా ఆ వెలుగును మీరు అనుభవిస్తున్నంతసేపూ శ్వాస ఆగిపోతుంది. శ్వాస ఆపకండి, మీరు ఆపితే ఆగటం కాదు. దానంతట అది మనకు తెలియకుండా ఆగాలి. మళ్ళీ ఏదైనా చెదురుబాటు వచ్చినపుడు శ్వాస మొదలు పెడుతుంది. ఇలాంటి ప్రాణాయామం వచ్చిన తర్వాత ఈ యింద్రియాల్లోంచి ఒకదాన్ని పిలిచి, ఈ మనస్సుని దానియందు నువ్వు అప్లై (apply) అవ్వుచూద్దాం అని చిత్తాన్ని దేశబంధువు చేస్తారిపుడు. ధారణ అంటే అర్థం అది. అంటే దానంతట అది apply అవుతున్నటువంటి యింద్రియములు మనస్సుని మీరు వృత్తుల్ని నిరోధించి బంధాన్ని చేస్తున్నారు. దేశబంధం అంటే నిర్దేశవుచే బంధించుచున్నారు. You are prescribing something to the mind and the senses. యింద్రియములు చేసేవైతే వృత్తి. మీరు నిర్దేసిస్తే చేసేదైతే వృత్తికాదు. ఇంతవరకూ అంతర్ముఖం అయ్యాం. తర్వాత మళ్ళీ బహిర్ముఖం అవ్వకుండా అంతర్యామిత్వం చెందుతున్నాం. అంతకు ముందు బహిర్ముఖంగా ఉన్నాం. కనుక 'దేశబంధశ్చిత్తస్య ధారణా' అనే సూత్రానికి చిత్తమునకు నిర్దేశమునందు బంధించుట ''ధారణ'' అనబడును. అంటే ఏదైనా ధ్యానం చేయరా అని చెప్పినా, దేనియందైనా మనస్సు పెట్టుకో, దీన్ని చూస్తు ఉండు అంటే యిపుడు చూస్తూ ఉంటాడు. ఎందుకంటే ఎలా చెపితే అలా ఉండటం నేర్చుకున్నాడు కనుక. ఉచ్ఛ్వాస నిశ్వాసల యందు నేర్చుకున్నాడు. తరువాత ఓంకారాన్ని వింటూ యింకొక దానికి వెళ్ళటం లేకుండా నేర్చుకున్నాడు. కనుక ఈ లోపల మనలో ఇతరుల గురించి ఉన్న అభిప్రాయములన్నీ పోతాయి. భార్య భర్తయందు, భర్త భార్యయందు పట్టే తప్పులు, ఒకళ్ళమీద ఒకళ్ళకు చికాకులు మొదలైనవన్నీ పోతాయి. ఒకవేళ యితరులేమైనా అనుచితంగా ప్రవర్తిస్తే (misbehave) అది వాళ్ళకి

సంబంధించినదిగాని, వీళ్ళకి సంబంధించినది కాదు అని తెలుస్తుంది. ఈ మార్పులు వస్తాయి. ఒకవేళ లోపాలున్నా సర్దుకుపోయే స్వభావం వస్తుంది. ఈ స్థితి వచ్చినపుడు ధారణ చేతనవుతుంది. ధారణమనగా యిచ్చినటువంటి అభిప్రాయమును మనము చెప్పిన మాటవిని ధరించుట, ఇంద్రియములు ధరించుట. ఈమధ్యలో ప్రత్యాహారములో ఖాళీ అయిపోయినటువంటి మనస్సు, ఇంద్రియాలున్నూ లోపల మీకు కనిపిస్తూ ఉంటాయన్నాడు. ఇదివరకు మనస్సంటే భావనే (idea) కదా. ఇపుడు ఆ భావన లేకుండా మనస్సు కనిపిస్తుంది. ఇదివరకు కన్ను అంటే వెలుతురు, చీకటి అనే కదా. ఇపుడు వెలుతురు చీకటి కాకుండా కన్ను అనేటువంటిది తెలుస్తుంది. అది ప్రత్యాహారమంటే. ఇంద్రియాలు మనస్సూ వాటిని అభ్యర్థించక్కర్లేకుండా లోపలవున్న వాటి counter parts మీకు తెలుస్తాయి. అది అయిన తర్వాత నీవు ధారణ చేయటానికి సిద్ధంగా ఉన్నావిపుడు. ఇపుడు ఎలా ధారణచేస్తే ఆ చేసిన ధారణయందు నిలబడాలి.

## 2. తత్ర ప్రత్యయైకతానతా ధ్యానమ్।

తత్ర = ఆ ధారణమునందు, ప్రత్యయ = నిలబడుట, ఏకతానతా = ఏక కాలమునందు, ధ్యానమ్ = ధ్యానము అందురు.

**అట్లు నిర్దేశింపబడిన అంశమునందు ఏకత్వము నిలబడుట ధ్యానము. (అది తప్ప మరియొకటి భాసింపకుండుట. ఇట్లు దేనియందు చిత్తమును నిలిపినను ఏకత్వము సిద్ధించు సరికి అది అంతర్యామిగా తెలియును.)**

**వివరణ :** ఆధారమునందు నిలబడుట ధ్యానము అంటారు. 'ప్రత్యయం' అంటే మామూలు అర్థం నమ్మకం. ఇక్కడ అదికాదు. ప్రత్యయమంటే నిలబడటం. ముందు సూత్రంలో ధారణలో నిలబడాలి అన్నారు కదా! అదీ ధారణ. 'ఏకతానతా' అంటే అదే పనిగా నిలబడితే అది ధ్యానం. ఎంతసేపైనా సరే. బల్ల ఎక్కరా అంటే ఎక్కాడు కుర్రాడు. అంటే అల్లరి చేస్తుంటే మాస్టర్ ఎక్కమంటే ఎక్కడం కాకుండా, క్లాసులో ఏదో బాగుచేయటం కోసం మాస్టరు ఎక్కమంటే ఎక్కాడనుకోండి. రెండింటికి తేడా లేదూ. చిత్తవృత్తి నిరోధము లేనటువంటివాడు అల్లరి చేస్తుంటే, misbehave చేస్తుంటే, ఎక్కినుంచోమని పాఠం చెబుతూంటే ఇటూ అటూ కాళ్లు మారుస్తూ అబ్బబ్బ కాలు లాగేస్తోంది అంటాడు. మాస్టర్ని ఏడిపిస్తాడు. కాని రెండవవాడు అలాంటివాడు కాదు. నువ్వు ఇక్కడ ఎక్కు. అక్కడ బిగించు అంటే అది బిగించటం అయ్యేవరకు అలా నిల్చుంటాడు. అలాగ ఎంతసేపైనా నిలబడి కదలకుండా ఉంటే దానిని ధ్యానం అంటారు. చెప్పింది చెప్పినట్లు మనస్సుకి నిలబడితే ధారణ. ఆ నిలబడ్డది ఎంతసేపైనా సరే అలా నిలబడితే అది ధ్యానం. అదీ తేడా. ఇక్కడే కొంచెం సూక్ష్మమైన విషయాలు. 'తత్ర' అంటే ఆ పరిస్థితి యందు అంటే ధారణ యందు 'ప్రత్యయ ఏకతానతా'' అంటే స్థిరత్వమునందు ఒకే పట్టున ఉండుట (at one breath) పేరు ధ్యానం అంటారు. వేదం చదవమన్నార్ట. ఇద్దరు శిష్యుల్ని. ''ఆ ప్రాతమున్ సాయమున్ ఆమ్నాయమున్ గ్రోలుచో'' ప్రొద్దున్నే కూర్చుంటే సాయంత్రమైనా లేవరుట. ''తలల్ వూసెంగాయునరో'' స్నానం చేయాలి. లేకపోతే క్షవరం

చేయించుకోవాలి. యిట్లాంటివి కూడ వాళ్ళకి తెలియదుట. ''ఆసీన ప్రచలాయితంబైన లేదు'' 'ఆసీనం' అంటే కూర్చున్నటువంటి తీరు (posture) నిలచి 'ప్రచలాయితం' కాలు యిటునించి యిటు మార్చుకుంటం కూడ లేదు అన్నాడు ఒకచోట తెనాలి రామకృష్ణుడు అగస్త్య మహర్షి యొక్క శిష్యుల్ని వర్ణిస్తూ. కూర్చుని చదవరా అంటే చదువుతూ ఉంటారుట. కాలుకూడ మార్చుకోలేదేమిటి? అన్నాడు. వాడికేం నెప్పిలేదా? అంటే లేదన్నాడు. అంటే మనకి కొన్ని కొన్ని తమాషా అయిన ఉదాహరణలు ఇచ్చారు. కనుక 'ప్రత్యయ ఏకతానతా' అంటే ప్రత్యయమునందు ''ఏకతానత్'' అంటే ఆ మాధుర్యము కలిగినటువంటి ఒకానొక అంతర్యామి అనుభూతిలో మీరు ప్రవేశిస్తారు. అపుడు మీ భౌతిక శరీరంలో ఉన్న ధాతువులకు నెప్పిగాని, ఆకలిదప్పులు కాని ఉండవు. అది ఉన్నంతసేపు ఆహారం అక్కర్లేదు. అంటే అర్థం ఉపవాసాలు చేయమని కాదు. యివతలకి వచ్చిన తర్వాత ఆహారం తినండి. అందులో ఉన్నపుడు మాత్రం ఆహారం అక్కర్లేదు. నడుస్తూనే ఉంటారు. పనిచేస్తూనే ఉంటారు. కళ్లు మూసుకొని కూర్చోనక్కర్లేదు. 24 గంటలు పనిచేస్తూనే ఉంటారు. ఏదన్నా ఉత్సవములలోగాని, కొందరు కొందరు పెళ్ళిళ్లలోగాని రెండు మూడు రోజులు మంచినీళ్ళు కూడ తాగరు. ఏదో రోజుకి ఒక్కమాటు కాసిని మంచినీళ్ళో, యిన్ని పాలో పుచ్చుకుంటారు మనం పుచ్చుకోమంటే. అంటే ఏం జరుగుతూ ఉన్నది. అన్నమయ కోశమును దాటినటువంటి ఒకానొక చిత్రమైన కోశంలో ప్రవేశిస్తూ ఉన్నారు. చూస్తున్నామా? లేదా? ఈ మూడురోజులు వీడెలాగ ఉన్నాడు అని అనిపిస్తుంది. ప్రతి సంవత్సరం యిప్పటికి ఇరవై సంవత్సరాలనించి అనేక ఊళ్ళనించి గురుపూజలకి మనుషులు వస్తారు. ఖరగ్‌పూర్‌నుంచి కామేశ్వరరావు అని వస్తాడు. అతను ఇరవై సంవత్సరాల నించి గురుపూజలు మూడురోజులు ఏమి తినడు, తాగడు. మొదటి రోజుల్లో ఒకటి రెండు సంవత్సరాలు నేను చాల కష్టపడ్డాను. తర్వాత గ్రహించాను. వాడికి అక్కర్లేదు. బలవంతంచేస్తే బాధపడతాడు. కావలసివచ్చినపుడు తను తీసుకుంటున్నాడు. అంటే ఆ కక్ష్య మారుతుంది. ఒకానొక చిత్రమైన కక్ష్యలో ప్రవేశిస్తుంది. అప్పుడు Law of

Matter పనిచేయదు. Law of force పనిచేయదు. Law of consciousness కూడ పనిచేయదు. Law of balance, Law of equallibrium, Law of experience and Law of happiness అవే పనిచేస్తుంటాయి. అందులో సంవత్సరాలైనా సరే అన్నపానీయాలు లేకుండా ఉన్నవాళ్ళున్నారు. కనుక ధ్యానస్థితి అనగా అది. వాడు మాట్లాడుతూనే ఉంటాడు. ధ్యానస్థితి అంటే అలా మరమేకల్లే కూర్చోనక్కర్లేదు. అలా కూర్చుంటే ధ్యానం ఎక్కడ నిలుస్తుంది మనస్సుకి. పెళ్ళి చేసుకోమంటే గురువుని ధిక్కరించి నేను కూచొని ధ్యానం చేస్తాను పెళ్ళి చేసుకోను అని చెప్పొట్ట అగస్త్య మహర్షి శిష్యులలో ఒకడు. రెండవ అధ్యాయంలో చూసాము. అయితే మా యింట్లో ఉండకు. నీ యిష్టం వచ్చినట్లు వెళ్లు అన్నాడు. వాడు హిమాలయాల మీద కూర్చొని పెళ్ళిట పెళ్ళి, తపస్సు చేసుకుందామంటే పెళ్ళి అంటాడు, బ్రహ్మచర్యం అంటే పెళ్ళి అంటాడు. ఈ పెళ్ళేమిటి? ఈ స్త్రీలు ఏమిటి? వాళ్ళ కన్నులు ఏమిటి? వాళ్ళ ముక్కులు ఏమిటి? వాళ్ళ జడలు ఏమిటి? వాళ్ళ సాంగత్యం ఏమిటి? అనుకుంటున్నాడు మనస్సులో. ఇదీ వాడు చేస్తున్న తపస్సు. తెనాలి రామకృష్ణుడు చాల అద్భుతంగా చూపించాడు. ''తత్ర ప్రత్యయే కతానతా ధ్యానం'' అన్న మాటకి అర్థం ఇది. నిలబడింది ఎంత కాలమైనా సరే అలా నిలబడుతుంది. ఆ నిలబడిన దానిని ధ్యానం అన్నారు. దీని కోసమే ఒక 'పాండురంగ మహత్యం' గాని లేక 'ఆముక్తమాల్యద' గాని తీసుకొని చదువుతూ ఉంటే ''(శ్రీ) విష్ణు నీగతి చింతించవలయు'' కృష్ణదేవరాయలు చెప్పాడు. విష్ణువంటే విష్ణుర్, వ్యాప్తో అంతర్యామియైనవాడు విష్ణువు. శివుడు అంటే శుభకరుడు, మంగళకరుడు. సమస్త జగన్మంగళకరుడు అంతర్యామి అని అర్థం. అంటే వాళ్ళభాష వేరు మనభాష వేరు. వాణ్ణి ఎలా ధ్యానం చేయాలో చెబుతాను విను అన్నాడు. మొట్టమొదట మనస్సు వాడి పాదాలమీద పెట్టు అన్నాడు. ఈ పెట్టటం అంటే చిత్తవృత్తి నిరోధం అయ్యాక. ఈ యమ, నియమ, ఆసన, ప్రాణాయామములు అనేటువంటి స్థితులు సహజంగా సిద్ధిస్తూ వస్తాయి. తర్వాత ప్రత్యాహారము సిద్ధిస్తుంది. పాదాలమీద పెట్టు అంటే పాదాలు ఎట్లా ఉండాలి. ''చిగురు పొట్లపు దోయి

చెంగటించినవాని'' చిగురుటాకులు దగ్గరగా పెట్టినట్లుగా ఉంటాయి అన్నాడు. ఆ వ్రేళ్ళ యొక్క మడతలు. ఇలా నువ్వు ఊహించు. నేను ఊహించటం కాదు అన్నాడు. నీకు కావలసిన భగవంతుడి పాదాలు నువ్వు ఊహించు. ఏ రంగులో ఉంటాయో, ఏ ఆకారంలో ఉంటాయో, ఎంత ఉంటాయో, అయితే నువ్వు శిల్పం చేయి నీ యిష్టం. ఏయే భూషణాలుండాలో, ఏమిటో చూడు అన్నాడు. చూసామండి ఉదయిస్తున్న సూర్యకిరణాల్లాగ ఇప్పుడు చెప్పు నీ యిష్టం. వాడెవడో శుభ్రంగా అన్నంపెట్టి నెయ్యి వేయమంటూంటే, వాడికి నెయ్యి వెయ్యడానికి ఏడిస్తే ఎట్లాగ. వాడెవడో మహానుభావుడు వెయ్యమన్నాడు. వేయమంటే మనం మధ్యన ఇంతకంటే ఎందుకండి వేయడం అంటే ఎట్లాగ. వాణ్ణి కోకొల్లలుగా వర్ణించు అన్నాడు. చిత్తవృత్తి నిరోధం జరిగాక నీ యిష్టం నీ మనస్సుని ఎక్కడికి పడితే అక్కడికి పోనీయ్ అన్నాడు. అంతకు ముందు ఎక్కడికి పడితే అక్కడికి పోతోంది మనస్సు. మన యిష్టంకాదు. దానివెంట కుక్కల్లే మనం పోయాం. చిత్తవృత్తి నిరోధం జరిగాక ఎక్కడికి పడితే అక్కడికి పోనీయ్ చూడన్నాడు. చూస్తే ఆ పాదాలు నిలబడ్డాయి. నిలబడ్డాయా? ఎంతసేపు నిలబడ్డాయి గంట, రెండు గంటలు, మూడు గంటలు ధ్యానం వచ్చింది. ఆ మొదట పాదాలమీద మనస్సు పెట్టమనటం ధారణము. పాదాలమీద ఎన్నిగంటలైనా నిలబడటం ధ్యానం. తర్వాత పిక్కలు, చీలమండలు అన్నాడు. ఆముక్తమాల్యదలో చెప్పాడు, చూడండి. సీసపద్యం. చీలమండలు ఎంత బావున్నాయో నీ యిష్టం నువ్వు చూసుకో అన్నాడు. నే చెప్పిన చీలమండలు నీకు బావుండడమేమిటి? అన్నాడు. పైలేరియా అల్లే ఉండచ్చు. అందుకని ఎవరి హృదయంలో కనిపించిన జగన్మోహనాకార మైనటువంటి చీలమండలు వాళ్లు చూసుకోవాలి. మానవ శరీరంలో యింతకంటే ఉత్తమోత్తమమైన జగన్మోహనాకారము ఉండదు. కనుక మీరు మనస్సుతో శిల్పం చేసుకోండి అన్నాడు. అయిన తర్వాత ఆ మోకాళ్ళమీదికి ఉన్న పట్టుబట్ట, యింకా పైన మోకాళ్ళ దగ్గర ఉన్నటువంటి నిర్మాణము, ఆపైన శరీరమంతా శిరస్సుదాక చేసుకుంటూ వస్తే, ఈ మొత్తం అన్నింటితో నిలబడిపోతుంది ఈ సాధనచేస్తూ వచ్చిన వాడికి. ప్రతి వాడికి

కాదు. దానిపేరు ధ్యానము అన్నాడు. అలాగే శివస్వరూపము ''పలు పాప తల చుట్టుల లవరించినవారు, బూది పూతల మేను పూయువారు'' అంటే తలపాగలు కట్టుకుంటే ఫస్ అని పైకి లేస్తున్నాయిట పాములు. అంటే కైలాసాన్ని వర్ణిస్తున్నాడు. వాడికి ఎంత దర్శనము వచ్చాక అది స్థిరంగా అట్లా నిలబడితే వర్ణిస్తాడు. కనుక అబ్బ బలేగ రాసాడనిపిస్తుంది. తెనాలి రామకృష్ణుడు కైలాసాన్ని వర్ణించటం. ఇంతకీ అక్కడ హిమాలయాల్లో చలివేయటం లేదు. వాళ్ళు గోచీలు కట్టుకు తిరుగుతున్నారు. ఒంటినిండా బూడిద పూసుకున్నారన్నారు. చలి వేయదుట. అందులో కొంచెం హాస్యం కలపటం మసాలాలాగ. ఇలాగ చేస్తే ఆ ప్రపంచంలో నువ్వు జీవిస్తావు. నువ్వు నివసిస్తావు. వాళ్ళతో మాట్లాడుతూ సరదాగ సంభాషణలు చేసుకుంటూ ఉంటావు. ఇదిగో విష్ణుచిత్తుడు. ఇదిగో గోదాదేవి. ఇదిగో విష్ణుచిత్తుడు ఆ లోకానికి వెళ్ళాడు. సుబ్రహ్మణ్యేశ్వర స్వామిని చూసి ఇలా మాట్లాడాడు. గణపతితో ఇలా మాట్లాడాడు అంటుంటే మీరు వాళ్ళందరితో కలిసి తిరుగుతారు. ఈ స్థితివస్తే వాళ్ళ కంఠధ్వనులు కూడ మీకు వినిపిస్తాయి. వాళ్ళ రంగులు చిరునవ్వులు, ఎన్ని సంవత్సరాలు పోయిన తర్వాతైనా వాళ్ళు అలాగే కనిపిస్తారు. మీకు చెదరదు ఆ రూపం. అదీ ధ్యానమనేటువంటి స్థితి. మీరు కవిత్వం రాసినా, చిత్రలేఖనం రాసినా, భావన చేసినా, జపతపాదులు చేసినా అలాగే పనికొస్తుంది. వీట్లల్లో దేనితో అయినాసరే తరించగలరు. ఆ స్థితివస్తే. రెండవసూత్రం అది. కనుక ''తత్ర ప్రత్యయే కతానతా ధ్యానం'' ధారణయందు ఏకతానత అనేటువంటి ప్రత్యయం అంటే కాలమునందు నిలబడి ఉండుట, స్థిరముగా చెదరిపోకుండా. దానిపేరు ధ్యానమంటారు. మూడవ అధ్యాయంలో ప్రవేశించినప్పటి నుంచి ధారణ, ధ్యానము అనేవి రెండు రైళ్ళు. ఈ మూడవది non-stop express ఇక్కడినుంచి ఇది ఆఘమేఘాల్లో వెడుతుంది. ఎక్కడా ఆగదు. ధారణ, ధ్యానం చెప్పేసాడు. అంటే స్పీడు. స్పీడు అందుకున్నాడన్నమాట. అంతకుముందు చెప్పినవి తిన్నగా అర్థం చేసుకుంటే ముందుకి వెళతాము. లేకపోతే యిక్కడ ఆగిపోతాము. మూ అధ్యాయం ఊరికే అక్షర సంజ్ఞగా టీకా తాత్పర్యాలు మిగుల్తాయి.

## 3. తదేవార్థ మాత్రనిర్భాసం స్వరూపశూన్యమివ సమాధిః।

(తత్+ఏవ) తదేవ = ఆపైన చెప్పినదే (ఆ ధారణ మరియు ధ్యానమే), అర్థమాత్ర నిర్భాసం = అర్థము మాత్రమే మనస్సునకు భాసించి, స్వరూప శూన్యం = స్వరూపము నశించి, యివ = వలే; సమాధిః = సమాధి (అనబడును).

ఆ వస్తువే అర్థముగా మాత్రము వెలుగుచు తన రూపములేని స్థితి గోచరించినచో సమాధి అనబడును. (ధ్యానింపబడుచున్న వస్తువుయొక్క పేరు, ప్రవర్తనము, ఆకారము, ఆ వస్తువుకన్న వేరైనవి. అవి మాయమై వస్తువు యొక్క స్మరణము మిగులుట సమాధి. అపుడు మిగులునట్టిది పరబ్రహ్మము అను వెలుగు.)

**వివరణ :** ధారణ, ధ్యానము, సమాధి ఈ మూడు అంతస్సంబంధం ఉన్నవి (interlinked). ఇక్కడ ధ్యానానికి సమాధికి తేడా ఏమిటో చెబుతున్నారు. ''శ్రీ విష్ణు నీ గతి చింతింపవలయు'' అన్నారు కృష్ణదేవరాయలు. ''వలయున్ చింతింపన్ పద్మాక్షున్ జగన్మోహనున్'' అన్నారు పింగళి సూరన్న. అన్ని కావ్యాల్లోను ఉంది ఈ అష్టాంగ యోగము. పాండురంగ మహత్యము, ఆముక్త మాల్యద, అల్లసాని పెద్దనగారు రాసిన మనుచరిత్ర మొదలైనవి చదువుకోవాలి. వీటిలో అష్టాంగ యోగము ఉన్నది. అల్లసాని పెద్దనగారు రాసిన దాంట్లోను, పింగళి సూరన్నగారు రాసిన దాంట్లోను పరిపూర్ణంగా మొత్తం అంతా కూడ పతంజలి యోగం యిచ్చారు. యింకా దాన్ని భక్తితో కలిపి ఎలా చదువుకోవాలో, ఎలా సమన్వయించుకోవాలో పరిపూర్ణంగా యిచ్చి, దాన్ని సేవించుకుంటూ అభ్యాసం చేస్తూన్నటువంటి ఆ మణికంధరుడు అనే మహానుభావుడు యాత్రచేసి పెద్దల దర్శనంచేస్తూ, పెద్దల సాంగత్యంలో ఎలా నేర్చుకుంటాడో అవి చక్కగా యిచ్చాడు. అలాగే మనకి పారిజాతాపహరణంలో కొంచెం యిచ్చాడు. ధూర్జటి కాళహస్తీశ్వర మహత్యంలో కొల్లలుగా యిచ్చాడు. ఏవో కొన్ని తప్ప అంతకు ముందున్నటువంటి ప్రబంధాలన్నీ కూడ చాల పరమ పవిత్రమైనటు వంటివి. అష్టాంగ యోగము అన్నింటిలోను యిచ్చారు. మన పుణ్యంగా ఆచార్య పురుషులు, ఋషులు మన తెలుగుదేశంలో పుట్టి తెలుగులో రాసారు. వాళ్ళందరు ఒక్కొక్కడు ఒక్కొక్క జగదాచార్యులు. లోకానికి మార్గం చూపినటువంటివారు. ''ఆవునదల్చు పచ్చగెదురంఘ్రియుగంబు'' ఇది ధ్యానంకోసం యిచ్చారు. ఆవుని అదిల్చేందుకు ఎండిపోయిన పెద్దకర్ర

తీసుకుంటే దెబ్బ తగుల్తుందిట. అందుకని ఆకుపచ్చగా ఉన్నటువంటి, ఇంకా ఆకులతో ఉన్నటువంటి చిన్న బెత్తం తీసుకొని బయల్దేరాడుట బాలకృష్ణుడు ఆవుల్ని తోలుకుంటూ. అలాంటి బాలకృష్ణుణ్ణి ధ్యానం చెయ్యి అన్నాడు. పాండురంగ మహత్యం దగ్గరికి వచ్చేటప్పటికి ధ్యానం చేసి చేసి పాదాలు, చీలమండలు, మోకాళ్ళు ధ్యానం చేసారు. గజ్జెల మొలత్రాడు ధ్యానం చేసారు. ''బాలాయనీల వపుషే నవకింకిణీ కజాలాభిరామ జఘనాయ దిగంబరాయ''. ఆకాశమనే మొల కలిగినటువంటిది దిక్+అంబరుడు. అంటే ఆకాశం దిక్కులు. ఆకాశమే తన శరీరంగా కలవాడు అని లోపల అర్థమున్నా, దిగంబరుడు అంటే వస్త్రము లేనటువంటి పిల్లవాడని పై అర్థం. వాళ్ళు యోగ రహస్యాలు అలా యిస్తారు. కవిత్వంలో యిచ్చినా కూడ ''నీల వపుషే'' నీల దేహము కలిగినటువంటి వాడు అని 'నవకింకిణీ కజాలాభిరామ జఘనామ'' కొత్తగా ఘల్లు ఘల్లుమంటున్నటు వంటి ఆ మొలలో ఉన్నటువంటి ఆ మొలత్రాడు గజ్జెలు అన్నాడు. అంటే అకారాది క్షకారాంత శబ్దములు ఎక్కడనుంచి పుడతాయి? ఆకాశంలోంచి పుడతాయి. అది మొలత్రాడుగా కలవాడు. ఒక్కొక్కడు ఒక్కోలాగ చేసాడు. మొలత్రాడు ధ్యానం చేసాం. గజ్జెలు ధ్యానం చేసాం. వక్షస్థలం ధ్యానం చేసాం. చేతులు ధ్యానం చేసాం. గోళ్ళు ధ్యానం చేసాం. వేణువు ధ్యానం చేసాం. కస్తూరీ తిలకం ధ్యానం చేసాం. పెదవులు ధ్యానం చేసాం. నాసిక ధ్యానం చేసాం. పైన కొండె చుట్టినటువంటిది, దానిమీద నెమలి ఫించం ధ్యానం చేసాం. చేయగా చేయగా బాలకృష్ణుడనే పేరు జారిపోతుంది మనస్సులోంచి. ఏముంటుంది? ఆ తత్వం ఉంటుంది. తర్వాత మళ్ళా చేయగా ఆ పాదముల యొక్క ఆకారం జారిపోతుంది. ఆ ఆకారంతో మీకు వస్తున్నటువంటి ఆనందం మాత్రం మిగుల్తుంది. వాడు ధరించినటువంటి వస్త్రము, నెమలి ఫించము, వాటి రంగులు జారిపోతాయి. ఆ రంగుల తాలూకు ఆనందం మీలో మిగిలిపోతుంది. బృందావనము పేర్లు ఆకారాలు ఎగిరిపోతాయి. అందులో మీరు దేన్నైయితే ఆనందిస్తున్నారో అది మిగుల్తుంది. కొంచెం కష్టం తెలియడం. ఈ స్థితివస్తే దాన్ని సమాధి అంటారు. 'తదేవ' అంటే అదే. యిందాక చెప్పినదే. ఏది? ధ్యానమే 'అర్థమాత్ర నిర్భాసం' అర్థము మాత్రమే మనస్సునకు భాసించి అనగా మనస్సును స్పృశించి 'స్వరూప శూన్యం మివ' దాని స్వరూపం లేకుండా పోయిందా అన్నట్లుగా ఉంటుంది. అంటే కంటికి రూపం ఎలా అయితే

లేకుండా ఉంటుందో మనస్సుకి కూడ రూపం లేకుండా ఉండి వస్తువు మాత్రం ఉంటుంది. ఆ స్థితి వస్తుంది. అంటే కృష్ణుడుంటాడు. కృష్ణుడనే పేరు ఉండదు మన ధ్యానంలో. నీల దేహుడుంటాడు. నీలం రంగుండదు. దేహం ఉంటుంది. దేహం అనే పేరుగాని ఆకారంగాని ఉండదు. నెమలి ఫించం అనేది ఉండదు. కృష్ణతత్వం మీయందు ఉంటుంది. ఇట్లాంటి స్థితి వస్తే దాన్ని ''సమాధి'' అంటారు. ఒక వస్తువుని అప్పజెప్పు అన్నారు. సామాన్యమైన వస్తువును కూడ అప్పజెప్పవచ్చు. అభ్యాసం అయిన తర్వాత గడియారాన్ని అప్పజెప్పు. దీనిమీద మనస్సు పెట్టు. పెడితే గడియారం అనే పేరు జారిపోతుంది. వస్తువు ఉంటుంది. తర్వాత దీని వినియోగం మీద మనస్సు వెడుతుంది. వినియోగం మీదకి వెళ్ళేటప్పటికి దీని ఆకారం జారిపోతుంది. దీని రంగు జారిపోతుంది. ఇది చూపించేటువంటి టైము మీదికి మనస్సు వెళ్ళేటప్పటికి ఆ తిరుగుతున్న ముళ్ళు ఆగిపోతాయి. ముళ్ళు కనిపించవు. అవి తిరగటం కనిపించదు. ఏమీ కనిపించదు. ఏముంది? గడియారం అనే మూలతత్వం దాని శాశ్వతమైనటువంటి ఆదితత్త్వం ఏదైతో ఉందో అది కనిపిస్తుంది. అంటే ఏది మనస్సులో ఉంటే మొట్టమొదటి వాడు గడియారాన్ని కనిపెట్టాడో, అది మీరు చూస్తున్నారిపుడు. దానినుంచి ప్రతివాడు తలో గడియారం తయారు చేసేసి తలో ఫ్యాక్టరీ పెట్టేస్తున్నాడు. అంటే గడియారం నుండి ఎక్కడికి వెళ్ళారు? కాలము దగ్గరికి వెళ్ళారు. కాలము దగ్గర నుంచి ఎక్కడికి వెళ్ళారు? కాల యంత్రము, కాలము మధ్యన చూసారు. కాల యంత్రానికి, కాలానికి అవతలికి ఎక్కడికి వెళ్ళారు? కాలము అనేటువంటిది అబద్ధం కనుక చూచేవాడి మనస్సులో తప్ప అవతల లేదు గనుక కాలాతీతమైనటువంటి ఒకానొక జనన మరణాతీతము, శాశ్వతము, సచ్చిదానందము, స్వచ్ఛము అయినటువంటి ఒక తత్త్వములోకి వెళ్ళారు. ఇక్కడ ఊరికే పదాలుచేసి వర్ణించడమే గాని, అనుభవిస్తేనే తెలుస్తుంది. యిటుపైన ఈయన చెప్పినట్లుచేస్తే అది అనుభవానికి వస్తుంది. లేకపోతే పదాలే మిగుల్తాయి. అంటే పతంజలి చెప్పినట్లు మనం వెళ్ళాలి. ఈ సిలబస్ అంతా మళ్ళీ ఇవాళ ఎట్లా అయితే సింహావలోకనం చేసుకున్నామో మనం అలా చేసుకుంటూ వెళ్ళాలి. మనస్సుకి మన యిష్టం వచ్చినటువంటి దాన్ని చూడమని చెప్పటం ధారణ. అది ఎంతకాలమైనా సరే, అలా చూడటం ధ్యానము. ఆ ధ్యానమే 'అర్థమాత్ర నిర్భాసం' అర్థము మాత్రము వెలిగి

బయుటికి 'స్వరూప శూన్యం ఇవ' తన స్వరూపము నశించి మాయమైపోయినట్లు ఉన్న స్థితి ఒకటి వస్తుంది. దాన్ని సమాధి అంటారు. ఈ సమాధి స్థితికి వచ్చేటప్పటికి శివుణ్ణి ఆరాధించే వాడికి, విష్ణువుని ఆరాధించే వాడికి, గాయత్రిని ఆరాధించే వాడికి, తలుపులమ్మని ఆరాధించేవాడికి అందరికి ఒకే వెలుగు కనిపిస్తుంది. అవన్నీ పోతాయి. ఇంతకు ముందు వరకు శివుణ్ణి ఆరాధించేవాడు శివుణ్ణి ఆనందించవచ్చు. విష్ణువుని ఆరాధించేవాడు విష్ణువుని ఆనందించవచ్చు. ఇక్కడ అలాంటివేవి లేవు. శివుడు, విష్ణువు పేర్లేలేవు. శివుడని పిలువబడువారు, విష్ణువు అని పిలువబడువారు, మనచే ఆరాధింపబడువారు, ఈ మనస్సుచే ధ్యానింపబడువారు, ఈ మనస్సు దేనితో చేయబడినదో, అందులో ఉన్నటువంటి అంతర్యామి అనబడువారు, ఈ స్థితి వస్తుంది. కనుక మళ్ళా ఒక మాటు పదాలు చూసుకోండి. తత్+ఏవ అంటే అదియే. అంటే ధారణ, ధ్యానము అని చెప్పబడినటువంటి పై స్థితియే. 'అర్థమాత్ర నిర్భాసం' దాని అర్థము మాత్రము మిగిలి, అర్థం అంటే శబ్దానికి అర్థం అని ఒక్కటే కాకుండా, ప్రయోజనము అని అర్థం. మీ శరీరం ప్రయోజనం ఏమిటండి? లోపల ఉన్నటువంటి అంతర్యామికి వాహనంగా పనిచేయటం. అది తెలుస్తుంది. అలాంటపుడు యింక శరీరం అనేది కనిపించదు. ఒకడితో ఒకడు మాట్లాడుతూంటే శరీరంతో మాట్లాడుతున్నామా? కాని శరీరం లేనిదే మాట్లాడలేము. కాని మాట్లాడుతున్నది శరీరంతో. వాడి మొహంతో మాట్లాడు అంటావా? కాని మాట్లాడేది మొహంతోనే. మొహం వంకచూసే మాట్లాడాలి. లేకపోతే యింక ఎట్లా మాట్లాడతాము? కాని మాట్లాడేది మొహంతో కాదని మనకి తెలుసు. ఎలా అయితే మొహం వంకచూసి మాట్లాడుతూ మొహాన్ని చూడకుండా మనిషిని చూస్తామో (మనిషిని చూస్తున్నపుడు మొహాన ఉన్న ఉలిపిరి కాయ, జుట్టునో చూడము) అలాగ ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుతున్న విషయమే భాసిస్తుంది గాని వాడి మొహం వీడికి, వీడి మొహం వాడికి భాసించదు. అలాగే, ఇందులో మీకు ఆ దేవతల పేర్లుగాని, వస్తువుల పేర్లుగాని ఈ గడియారం మొదలైనటువంటివి, లోకంలో ఉన్న వ్యవహారాల పేర్లుగాని, ఇవన్నీ, ఎక్కడికి అక్కడ జారిపోయి, మీరుచేసే పనులు మీరు చేస్తూనే ఉంటారు. ఆ చేస్తున్న పనుల పేర్లుండవు. మీరు నీ ఆఫీసులో చేయవలసినవి అన్నీ చేస్తూంటారు. కాని వస్తువుల పేర్లు ఉండవు. వంద రూపాయల నోట్లు లెక్కపెట్టి యిలా యివ్వండి అంటారు. చేత్తో

లెక్కపెట్టి ఇస్తూంటారు. మీకు వందరూపాయల నోట్లు అనేది ఉండదు. వంద అనేది ఉండదు. కాని అవతల వాడికి అంతే వెడతాయి. పొరపాటున అంతకుముందు ఎపుడన్నా చేసి ఉంటే జరగవచ్చుగాని, యింక పొరపాటు రాదు ఇక్కడ. ఎందుకని? పొరపాటు మనస్సుకి వస్తుంది. ఇక్కడ మనస్సు నశించింది. మీరున్నారు. పొరపాటు అనేది జరుగదు. ఆ స్థితి వస్తుంది. రోజూ ఈయన చెప్పిన మార్గంలో కొంత వెడితే మనకి బోధపడుతుంది ఇక్కడినుంచి. కనుక 'తదేవ' అదియే అర్థమాత్ర నిర్భాసం. అంటే ప్రయోజనము మాత్రమే భాసిస్తుంది. అర్థము మాత్రమే భాసిస్తుంది. ''స్వరూపశూన్యం'' మనకి కనిపిస్తున్న స్వరూపము లేకుండా పోయినట్లుగా కనిపించే స్థితిని సమాధి అంటారు. వీడుండడు యింక. చూచేవాడు ఉండటంపోయి ప్రాణాయామం దగ్గరే ఆగిపోయింది. చూచేవాడు గనుక ఉంటే శ్వాస ఆగిపోదు. శ్వాస ఆపాల్సి వస్తుంది. కాని పతంజలి చెప్పే ప్రాణాయామంలో శ్వాస ఆపకూడదు. శ్వాస ఆగిపోవాలి. అంటే యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము ఈ నాలుగు బాహ్య ప్రయత్నములు. మిగతా నాలుగు లోపల జరిగేవి. అంచేతనే యిక్కడెక్కడా ఆపటం లేదు. టక టక వెళ్ళిపోతున్నాడు. యిక చూచువాడు లేడు. భావన కతీతమైపోతుంది. వాడు భావనలో సృష్టించలేదు. వాడు పిల్లవాడు ఆడుకున్నట్లు సృష్టించాడు. మన భావాలు మనల్ని బంధిస్తున్నాయి గాని, వాడికి భావాలు లేవు. భగవంతుడు పిల్లకాయలా ఆడుకుంటూ ఉంటే వాడికి భావాలేం ఉంటాయి? కనుక భగవంతుడు ఎందుకు సృష్టించాడు అంటే సమాధానం చెప్పడు. కుర్రాణ్ణి ఎందుకు ఆడుకుంటున్నావు అంటే చెబుతాడా? కనుక భావంలేదు. భావం ఎక్కడుంది? జీవుడు పుట్టి బద్ధుడైన తర్వాత వీడికొచ్చిందే ఈ భావమనే దరిద్రం. అందుకని ఆ స్థితిలోకి ఎపుడైతే మనం వెడుతున్నామో, భావాలు లేవు యింక, ఉన్నటువంటిది ఒక్కటే మహాభావము. దాంట్లో యివన్నీ కూడ అప్రయత్నముగా ఉంటాయి. పది పదిహేను సంవత్సరాలు, లండన్‌లోనో, పారిస్‌లోనో, బొంబాయిలోనో కారు డ్రైవ్ చేయడంలో అనుభవం కలవాడు కారు డ్రైవింగ్ చేయడు. వాడిచేత చేయబడుతుంది. చేయటం ఉండదు. వాడి కారులో ఇంకోడు కూర్చుంటే నడుపుతూ వాడితో మాట్లాడుతూ ఉంటాడు. ఎటు వెళ్ళాలో వెడుతుంటాడు. తర్వాత ఏ ప్రక్కకి తిప్పాలో అవన్నీ వీడు చేయటం లేదు. వీడిలో అంగములుగా ఉండి

ప్రతీది జరుగుతున్నాయి. ఎలా అయితే శరీరంలో కన్ను, ముక్కు, చెవులు యోగస్థితి వచ్చిన వాడికి అవి ఉండకుండా వీడిలో భాగములుగా ఉంటాయో కారు డ్రైవింగ్ అనేది వీడు చేయడు. కర్మ నశిస్తుంది. వీడిద్వారా చేయబడుతుంది. ఇవన్నీ కూడ అంతే. జగత్తులో ఉన్నటువంటి సమస్తలీల కూడ అలాగే జరుగుతుంది. వీడు చేసేది అంటూ ఏమీలేదు. ఆ స్థితి వస్తుంది. ఇది సమాధి స్థితి. భావం ఉన్నపుడు వీడికి కర్మ ఉంటుంది. వీడుండనపుడు మనస్సుండదు. మనస్సు ఉండనపుడు భావం ఉండదు. భావం ఉండనపుడు కర్మ ఉండదు. జగత్తే, అంటే అంతర్యామే. ఇంకేముంటుంది. వాడిలీలే. ఎందుకు జరుగుతోంది? అంటే వాణ్ణి అడగండి అంటాడు. వాణ్ణి అడిగితే నవ్వుతాడు, సమాధానం ఏం లేదు. ఎందుకంటే అది వాడికి సంతోషము కనుక. ఇది సమాధి. ''అర్థం'' అంటే లోపల ఉన్న అసలు అర్థము పరమార్థము. అది భాసించి, చుట్టూ ఉన్నవి మాయమైనట్లుగా కనిపించి, మనము నిత్యమూ ఏ కాళిదాసు కావ్యాన్నో పెద్దల దగ్గర కూర్చొని యోగ్యతతో చదువుకున్నా కూడ ఆ స్థితి వస్తుంది. కాళిదాసు పేరుతో వ్యాకరణమో, తర్కమో భయం వేసేటట్లు చెప్పేవాడు కాకుండా, కాళిదాసుని, కాళిదాసుగా చెప్పేవాళ్ళు చెబుతూ ఉంటే కొంతదూరం వెళ్ళేటప్పటికి గురువుకి శిష్యుడికి కూడ ఆ కావ్యం పేరు రఘువంశం అని గుర్తుంటుందా? ''అథః తృతీయ సర్గః'' అని గుర్తుంటుందా? వాళ్ళు చెబుతూంటే ఇది కాళిదాసు అని గుర్తుంటే వాడు చెప్పేవాడు దేవయ్య. వినేవాడూ దేవయ్యే అన్నమాట. అందులో లీనమవుతూంటే ఎవడు ఎవడితో మాట్లాడుతున్నాడో కూడ జారిపోతుంది. కౌత్సుడు, రఘు మహారాజు మాట్లాడుతున్నారు. పాఠం చెప్పుకున్నపుడు వీళ్ళకి తెలుసు. నాలుగైదు సంభాషణలు అయ్యాక కౌత్సుడి పేరు లేదు. రఘు మహారాజు పేరు లేదు. వీడు అన్నాడు. వాడు విన్నాడు. వీడు అనటం లేదు. వాడు వినటం లేదు. ఆగిపోయింది. ఒక 5, 6 శ్లోకాలు అయిన తర్వాత ఏమైంది? ఒక అరనిమిషమో, నిమిషమో, రెండు నిమిషాలో శూన్యం (Silence) వచ్చింది. అదీ కావ్యం ఆనందించటం అంటే. యింతకు ముందు చెప్పుకున్న దాంట్లో పరిపూర్ణంగా లేదు. మళ్ళీ disturb అయింతర్వాత చెప్పుకుంటం కూడ లేదు గమనించండి. దీన్నే జగన్నాథ పండితుడు

ఏమన్నాడంటే ''మిగళిత వేధ్యాంతరం'' అంటే ఇంకొక తెలుసుకోదగిన స్థితి జారిపోతుంది. అంటే మైండు ఉండదు అన్నాడు. అదే మనకి ''అనన్య భక్తి'' ''అనన్యాశ్చింత యంతో మాం'' అని చెప్పబడ్డది. ''ఏకాంత'' అనేటువంటి స్థితి ఇందాక మనం చెప్పుకున్నటు వంటిది. ఆనందంతో సమానమైనది ఏమీ ఉండదు. ఆనందమే. కావ్యంలో వచ్చిన ఆనందమే. శుభ్రమైనటువంటి సినిమా భక్త ప్రహ్లాదలాంటిది చూస్తుంటే ఏం అంతుపట్టదు. ఆనందమే వచ్చేది. ఆనందం ఎన్నడూ రుచి చూడనటువంటి వాళ్ళు పండితులు. అహోరాత్రాలు ఆనందాన్ని గురించే చెప్పుట, ఆనందాన్ని గురించే వినుట, టీకా తాత్పర్యములు అల్లుట మొదలైనవి చేసుకుంటంలో ఆనందం ఆనందించటానికి తీరుబడి లేదాయె. వాళ్ళ మధ్య కదా రాయవలసి వచ్చింది. ''బ్రహ్మానంద సహోదరం'' అన్నారు. ''ప్రమ్రుష్ట ప్రమాతృ ప్రమేయ ప్రమాణ ప్రభేదః'' అన్నాడు. అంటే చూచువాడు, చూడబడునది, చూచుట, ఈ మూడునూ మూడు మంచుగడ్డలు కరిగిపోయి ఒక గిన్నెలో నీళ్ళు అయిపోయినాయి అన్నాడు. ఆ స్థితి వచ్చింది. ఏ శాస్త్రంలోకి వెళ్ళినా సత్యం అనుభవించినటువంటి వాళ్ళు చెప్పారు. ఇది సమాధిస్థితి. మన కిష్టమైనటువంటి సినిమాకి వెళ్ళాము. మనకి నచ్చింది. సినిమా మొదలయ్యాక హాలు పేరు గుర్తుంటుందా? గుర్తుంటే అనవసరం వెళ్లడం. అది ప్రహ్లాద సినిమా అనేది జారిపోతుంది. తర్వాత హిరణ్యాకశిపుడు, ప్రహ్లాదుడు మాట్లాడుతున్నారనేది జారిపోతుంది. ఏం జరుగుతుంది? వాడు చెప్పినది వీడు చెప్పినది. ఎక్కడున్నాడురా హరి? అంటే ''ఇందు గలడు అందు లేడను'' అనునది, అడిగిన హిరణ్యాకశిపుడు ఉండడు. చెప్పిన ప్రహ్లాదుడు ఉండడు, పరతత్త్వము ఉంటుంది. ఒక నిశ్చలమైన స్థితిలో నిలబడతారు మీరు. సినిమా చూడటంలేదు. ఏంలేదు. అక్కడినుంచి ఎవడన్నా సోడా అని అరిస్తే మళ్ళీ చూడాల్సిందే. మనం అనుభవిస్తున్నామా? లేదా? అది ఈయన చెప్పిన సమాధి అనే స్థితి. ఏమీ కంగారు లేదు. నామర్దా లేదు. నమోషీ లేదు. మనకి నచ్చినటువంటి సినిమాకి వెళ్ళినా కూడ సమాధిస్థితి వస్తూనే ఉన్నది. కాకపోతే కావలెనని పెద్దలు చెప్పినటువంటి మార్గంలో అభ్యాసం చేసి నడచి వెళ్ళటంకోసం యోగాభ్యాసం ఇచ్చారు గాని, మనం పొందలేనివి, దుర్లభము

లైనటువంటివి ఏవో లోకాల్లో ఉన్నాయని వాటికోసం ఇక్కడ రాతికేసి తలకాయ అరగతీసుకోవడం కోసం చెప్పినవి కావు.




ధారణ, ధ్యాన సమాధులు మనకి తెలియక ఒకదాని తర్వాత ఒకటి అనుకుని, ముందుకి వెళ్ళిపోతున్నాం అనుకుంటున్నాం. కాని ~~ఈ~~ మూడు మూడు కోణాల్లో ఉండి మధ్యన ఉన్న తత్వంలో వెళ్ళుతున్నాము. దానినే సంయమము అంటారు.

## 4. త్రయమేకత్ర సంయమః।

త్రయం = ఈ మూడును, ఏకత్ర = ఏకస్థితి యందున్నపుడు, సంయమః = సంయమము అందురు.

**పై చెప్పిన ధారణ, ధ్యానము, సమాధి ఏక కాలమున నిలుచుట సంయమము.**

**వివరణ :** 'త్రయం' అంటే ఈ మూడును 'ఏకత్ర' అంటే ఒకే స్థితి యందున్నపుడు, అంటే ఏకకాలము, ఏకదేశము, ఏకానుభూతి స్థితి వస్తుంది. కాలము, దేశము ఉండవు. కనుక ఏకకాలము అనకూడదు యిక్కడ. మిగతా టైముల్లో ఏకకాలికంగా భోంచేసారనవచ్చు. రెస్టారెంటులో ఒక వందమంది ఏకకాలంగా భోంచేశారనవచ్చు. కాని యిక్కడ ఏకకాలికంగా అనటానికి కాలం లేదు వీళ్ళకి యింక. ఏకతానతా ఒక్కటే వాడాలి. ఇక్కడ ధారణ ఉంటుంది. ధ్యానము ఉంటుంది. సమాధి ఉంటుంది. మూడు కాదు ఈ చెప్పినవి అంటున్నాడు. అంటే దేని మీదన్నా చిత్తం పెడితే నిలబడటము పేరున్నా, ఎంతసేపు నిలబడటం పేరున్నా, ఆ నిలబడ్డ దాని పేరున్నా జారిపోయి, వస్తువు నిలబడటమున్నా, ఈ మూడూ, మూడు కాదన్నాడు. ధారణ అంటేనేమో మీరు ప్రతిపాదించి దానిమీద మనస్సు నిలబడటం. చిత్తవృత్తి నిరోధం అయ్యాక, అంతకు ముందు అలా నిలబడటం ఎవడి తరంకాదు. ప్రతిపాదన చేసిన దానిమీద మనసు నిలబెట్టుట, చిత్తమునకు నిర్దేశము అనేటువంటిది బంధించుట ధారణ అని చెప్పాడు. అంటే to make a cut out to the mind by giving a proposal. దాన్ని ధారణ అంటారు. దానికి ఏకతానత్వము అంటే ఎంతసేపైనా దానియందు అలాగే ఉండే స్థితి మీరు ప్రతిపాదించటం ధ్యానం. ఎంతసేపైనా ఉన్నపుడు దాని వివరాలు జారిపోయి, దాని పరమార్థము మిగలటం సమాధి. ఇపుడు ఈ మూడు మూడా? ఒకటా? ఒకదాని యొక్క మూడు స్థితులే కదా. ఈ రెండవ స్థితి వచ్చినపుడు మొదటిది ఉంటుంది ఆటోమేటిక్‌గా. మొదటిది వచ్చినవాడికి మిగతా రెండు ఉండవుగాని, రెండవది వచ్చినపుడు మొదటిది ఉంటుంది.

మూడవది వచ్చినపుడు మిగిలిన రెండూ ఉంటాయి ఆటోమేటిక్‌గా. చూశారా! క్రింద లైటు వేస్తే మేడమీద గదిలోకి కనిపించదు గాని, మేడమీద లైటువేస్తే క్రింద పైనా రెండూ వెలుగుతాయి. వెన్నెముకలో ఉన్న మెకానిజం అలాంటిది. వెన్నెముక, కుండలిని, షట్చక్రాలు, గుండెకాయలో ఉన్న మెకానిజం ఏమిటంటే ప్రతీగదిలో ఒక లైటు ఉంటుంది. అక్కడ లైటు వేస్తే వెలుగుతుంది. పై గదిలో లైటు వేస్తే అదిన్నీ, క్రింద గదిలో లైటూ వెలుగుతాయి. యింకా పై గదిలో లైటు వేస్తే అదిన్ని, క్రింద రెండు గదుల్లోవి వెలుగుతాయి. క్రింద గదిలోది వేస్తే మాత్రం ఆ గదిలోనే వెలుగుతుంది. పై గదిలో వెలగదు. అలాంటిది ఈ మెకానిజం. అన్నింటికంటే పై గదిలో లైటు వెలిగితే క్రింద అన్ని గదుల్లోను ఆటోమేటిక్ లైట్లు వెలుగుతాయి. దీన్నే 'ఏకత్రయము', 'ఏకత్ర' అన్నారు. అంటే ఈ మూడున్నూ ఒకటిగా నుండుట, దాన్ని సంయమము అని అంటారు. ''తస్యాం జాగర్తి సంయమీ'' భగవద్గీతలో చెప్పారు. మనందరికీ ఏది రాత్రో దాంట్లో మేల్కొని ఉంటాడు. ఇది రాత్రికాక పగలేమిటి? అన్పిస్తుంది. మనము ఎరగము కదా! దానియందు మేల్కొని ఉంటాడు. ''సంయమి'' అన్నాడు, కనుక దీన్ని C.V.V. గారు **simultaneous existence of consciousness in all planes is yoga** అన్నారు. పై లోకంలో వెలుగుతూంటే క్రింది లోకంలో ఆరిపోవడం అనేది అయోమయపు యోగం. లాభం లేదు. ఔరా! ఈ ప్రాపంచిక విషయాలు ఏమీ లేవుట! పై వాటిల్లో మేల్కొన్నారు, అంటే చెయ్యిపట్టుకొని బజారుకి తీసుకెళ్ళాలి. అది యోగం కాదు రోగం. వారికి అన్నం కలిపి తినిపించారుట అంటే బ్రహ్మస్థితిలో ఉన్నాడు అంటారు. అది బ్రహ్మస్థితి కాదు. మనం చేస్తున్నటువంటి స్థితులలో ఒక భాగం. యోగం అంటే ఇందాక కారు డ్రైవింగ్ వాడి ఉదాహరణగాని, అది వస్తూంటే ఇవి జారిపోవడం కాదు. అల్లా అయితే యోగాభ్యాసం చేసాట్ట అంటే అవిటివాడు, గుడ్డివాడు, కుంటివాడు, కుష్టువాడు వాళ్ళందర్ని పోషించాలి. అపరిగ్రహము లేనిదే యోగం కాదన్నాడు కదా. పది రూపాయల పనిచేసి పెట్టానని నమ్మకం ఉంటేగాని తను తినకుండా ఉంటేనే యోగాభ్యాసానికి పనికొస్తాడు. గురువుని సత్కరించారు. వాళ్ళు

పెట్టిన భోజనం మనం చేసాం. చేయొచ్చునా? అంతకు ముందు మనం వాళ్ళకేమైనా చేసామా? అపుడు భోం చేయాలి. అది అపరిగ్రహము అంటే. అపరిగ్రహము లేనిదే కోసినా, పుటం పెట్టినా యోగాభ్యాసం లేదు ఆ జన్మకి. జాగ్రత్తగా ఉండాల. ఆయిన గురువుగార్త. ఎవరో ఒకరు పోషిస్తూ ఉండాలట అంటారు. ఆయన గురువు కాదు. గురువంటే బరువని అర్థం, అంటే బాధ గురువు. కనుక యిక్కడ simultaneous existence of consciousness in all planes. అంటే అన్ని స్థితులలోను ఎరుక కలిగి ఉండాలి. అన్ని స్థితులంటే సర్వ సామాన్యుణ్ణి తీసుకుంటే ఆఫీసు పని ఏ జాగ్రత్తలు పడక్కర లేకుండా, పూర్వంకంటే జాగ్రత్తగా చేస్తాడు. మిగిలిన వారికున్న దరిద్రం వీడికుండదు. వీడికి ఏంకావాలో తెలుసు. కోరిక లుండవు. వీడున్న స్థితి అంతర్యామియై భార్యా పిల్లల యందు వ్యాపించి నిరంతరమున్నా, ఆనంద స్పర్శతో ఎవరూ అనుభవించలేనటువంటి సుఖం కుటుంబమంతా అనుభవిస్తూ ఉంటారు. కనుక వీడు నిజమైన యోగాభ్యాసం చేసిన వాడైతే భార్యా పిల్లలు వీణ్ణి చూసి గర్వపడాలి. యిలాంటి వాతావరణంలో మనం ఉన్నాం అనే ఒకానొక ఆనంద స్పర్శతో ఉంటారు. అందుకని వీడికేం కావాలో వాళ్ళకి అదే కావాలి. వీడికేమి అక్కర్లేదో వాటిని తలచుకోనే తలచుకోరు. అలా అయితేనే యోగాభ్యాసం లేకపోతే కాదని గ్రహించాలి. ఋషులు అలాగే ఉన్నారు. మహానుభావులు ఋషులెవ్వరూ ఉట్టికట్టుకొని ఊరేగినటువంటి వాళ్ళు, చెట్లకి వ్రేలాడి ఉన్నటువంటి వాళ్ళుకారు. భార్య, పిల్లలు, మనుమలు, కొడుకులు, కోడళ్ళు అందరూ ఉన్నటువంటి వాళ్ళు. వాళ్ళున్నది అదొక స్థితి. కనుక ''త్రయ మేకత్ర సంయమః'' ''ఈ మూడున్నా ఒకసారి పనిచేస్తాయి. ఒక్కొక్కటే అంటూ ఉండదు. టైపు కొట్టేవాడు అవతల వ్రాసినది చూస్తూ యిక్కడ కొడతాడు గాని, యిక్కడ a,s,d,f చూస్తూ కొట్టడు కదా. కనుక ఎక్కడ ఏది కావాలో అది వస్తూంటుంది. ఎవరితో మాట్లాడుతున్నా, ఏ పని చేస్తున్నా, ఆఫీసు పని చేస్తున్నా, ఇంటి పనిచేస్తున్నా లేకపోతే శరీరానికి కావలసిన పశుప్రవృత్తి (animal needs) లో ఉన్నా, వీట్లల్లో ఎపుడెలా ప్రవర్తించాలో అపుడలా ప్రవర్తించి వాటిలో చిక్కక తిరుగుతూ

ఉంటాడు. అలా ఉన్నపుడు సంయమము అనే స్థితిలో ఉంటాడు. ఆటోమేటిక్‌గా ఈ మూడింటిలో ఎపుడు ఏది ఎంతపని చేయాలో, అపుడది అంతపని చేస్తూ ఉంటుంది. సంసారబద్ధుడు (animal human being) పశువైనటువంటి, ఇంద్రియలోలుడైనటువంటి మానవుడికి, రజస్తమస్సులు వాణ్ణి లెక్కచేయకుండా ఎలా అయితే పనిచేస్తూంటాయో, ఈ స్థితికి వచ్చినటువంటి వాడికి, ధారణ, ధ్యాన సమాధులు ఎపుడెంత కావాలో వీడి ప్రమేయం లేకుండానే ఆటోమేటిక్‌గా పనిచేస్తూంటాయి. అట్లాంటిది వచ్చేటప్పటికి, సర్వ స్వామిత్వము వస్తుంది. త్రిగుణములు వాడికి దాస్యం చేస్తూంటాయి. చాల సమర్థత గల పనితనము గలవాడుగా ఉంటాడు. తర్వాత సూత్రంలో సంయమము వచ్చిన తర్వాత ఏమౌతుందో చెపుతున్నారు.

## 5. తజ్జయా ప్రజ్ఞాలోకః।

తత్ = అది, జయాత్ = జయించుట వలన, ప్రజ్ఞాలోకః = ప్రజ్ఞయొక్క వెలుగు.

**సంయమమును సాధించుట వలన స్వచ్ఛమైన జ్ఞానము సాధకుని దృష్టిగా ఏర్పడును.**

**వివరణ :** సంయమమును జయించుట వలన, ''ప్రజ్ఞాలోకః'' ప్రజ్ఞయొక్క ఆలోకం అంటే వెలుగు. ఆరోజు నుంచి తెలుస్తుంది. అది వరకు ప్రజ్ఞ మనస్సుగా, ఆదర్శాలుగా, ఆశయాలుగా ఉంటుంది. నానా చెత్తగా ఉంటుంది. ప్రజ్ఞ ప్రజ్ఞగా ఉండదు. వీడెరిగి ఉన్న మంచి విషయాలు, చెడ్డ విషయాలు వాడు చెప్పినవి, వీడు చెప్పినవి, వీడు విందామనుకున్నవి, చేద్దామనుకున్నవి, అవుననుకున్నవి, కాదనుకున్నవి, నానా కచ్చా కచ్చాగా ఉంటుంది. వీటన్నిటితో కలిసి ఉంటే, ప్రజ్ఞ ఏమిటి? సంయమము వచ్చాక స్పష్టంగా ప్రజ్ఞ అని తెలుస్తుంది. ఆలోకము అంటే ప్రజ్ఞ వెలుగుతుంది అన్నాడు. అవతల ఉన్న వస్తువుకి అంటుకోకుండా, ఈ వెలుగు దానిమీద పడుతుంది. నువ్వేం చేయాలో అదే చేస్తావు. ఏం చేయకూడదో అది ఎన్నడూ చేయవు. స్వాభావికముగా నీవు సరిగా చేస్తావు (instinctively you are right). "Iam" అనే వెలుగు ఈరోజు నుంచి వెలుగుతుంది. ఈ సంయమము అనే స్థితి వచ్చినందువల్ల ప్రజ్ఞ అంటే ఏమిటో, అది వెలగటం తెలుస్తుంది. ఎవరన్నా ఒక శాస్త్రం చెబుతున్నా రనుకోండి. ఆయనకి ఏంవచ్చు. మనం వింటున్నాం కాని అన్పిస్తుంది. ఇట్లాంటి అహంకార లోకాలన్నీ ఎప్పుడో పోయి ఉంటాయి. చిత్తవృత్తి నిరోధం అవ్వంగానే ఆగిపోయేయి. అప్పుడు ఆయన పరిపూర్ణుడు గనుక మొదలు పెట్టగానే శాస్త్రం మొత్తంగా నీలోకి దిగుతుంది. ఒకరోజో, రెండు రోజులో వినేటప్పటికి, ఆయన చెప్పబోయేవన్నీ మీలో ఉంటాయి సహజంగా. 64 రోజులలో 64 విద్యలు శ్రీకృష్ణ పరమాత్మ నేర్చేడని భాగవతంలో ఉన్నది. శాస్త్రం పరిపూర్ణంగా ఉన్నపుడు ఆయన చెప్పటానికి పూనుకోగానే శాస్త్రం మేల్కొంటుంది వీడి ప్రజ్ఞా లోకంలోకి.

అది ఫొటోగ్రాఫ్ తీస్తుంది. వాడిదగ్గర యిప్పుడున్నటు వంటి sensitive plate directly exposed sensitive plate కాదు. అంటే అదివరకు impressions ఉన్నటువంటిది కాదు. అవన్నీ వెళ్ళిపోయినాయి. యిపుడు ఏక్షణమైనా సరే unexposed plate యే వీడి దగ్గర ఉంటుంది. ఈ క్షణంలో మీరు expose అయితే మరుక్షణంలో మళ్ళీ unexposed plate యే ఉంటుంది. క్రిందటి క్షణంలో మీరు మాట్లాడిన మాటలు ప్రకారం మాట్లాడడు. నిన్న మీరు ఎలా ప్రవర్తించారో దాని ప్రకారం యివాళ ప్రవర్తించడు. యివాళ మీకు ఏమికావాలో అదే చేస్తాడు. అదీ వీడి స్థితి. అందుకనే నిన్న మీరు మాట్లాడిన మాటలో తేడా ఉంటే యివాళ గుర్తుంచుకోవడం ఉండదు. 'తత్' 'జయాత్' ఈ సంయమమును జయించుట వలన నీకు ''ప్రజ్ఞా ఆలోకః'' ప్రజ్ఞ వెలుగుట కలుగును. అంటే అనుభవించ వలసిందే గాని యింక చెప్పేదేంలేదు. ప్రజ్ఞ ప్రజ్ఞగా ఉంటుంది. ప్రజ్ఞ మీరుగా ఉంటుంది. అంతేకాని మీ విద్యగాగాని, మీరు నేర్చుకున్నదిగా గాని, మీ information గా గాని, మీ memories గా గాని, యిందులో ఏదిగాను ఉండదు. మీరుగా ఉంటుంది ప్రజ్ఞ. అందుకని ఎప్పుడూ ఏ శాస్త్రమైనా సరే, ఏదైనా సరే, ముద్రపెట్టినట్టుగా వస్తుంది. ఆ పద్ధతినే జ్వాలాకూలుడు the method of teaching by impression అన్నాడు. 21వ శతాబ్దం మధ్యలోకి వచ్చేటప్పటికి విద్యాలయములలోను, కళాశాలల్లోను, విశ్వవిద్యాలయముల్లోను పిల్లవాళ్ళు రాత్రిపూట నిద్రపోతూండంగ వాళ్ళకి సబ్జక్టు మొత్తం విత్తనం క్రింద వేస్తాట్ట మొట్ట మొదట రోజున ఆచార్యుడు (professor). వాళ్ళకి నిద్దట్లో వేసిన ఆ బీజం మొలిచి, ఎట్లాగయితే మఱ్ఱి విత్తనం మఱ్ఱిచెట్టుగా మొలుస్తుందో, అలాగ మర్నాడు తెల్లవారేటప్పటికి కొన్ని భావాలు వస్తాయి. వాణ్ణే ఆ భావాలను రాయమంటారు. వాడు రాస్తాడు. ప్రతి విద్యార్థిని ఎవడికి వాణ్ణే వేరుగా రాయమంటారు ఒకొడి దొకడు చూడకుండా. మర్నాడు యింకాసిని ఎక్కువ వస్తాయి. రాయమంటారు. యిలాగ నెలో, రెండు నెలలో అయ్యేటప్పటికి ఒక్కొక్కడు ఒక్కో బుక్ రాస్తారు. యిందరు రాసిన పుస్తకాలు పోల్చి చూస్తారు. అందులో ఏమన్నా ఎగుడు దిగుళ్ళు

ఉన్నట్లైతే వీళ్ళు గ్రహించడంలో ఉన్నటువంటి లోపాలు (imperfections) అన్నమాట అవి తీసేసి మిగిలినవి తీసుకోండి నాయనా అని చెప్తారు. అది 20వ శతాబ్దంలోనే కొద్దిమంది శిష్యులతో ఆయన చేసాడు. తాను హిమాలయాలు దగ్గర ఒక గ్రామంలో కూర్చొని Alice. A. Bailey అనే ఆమె న్యూయార్క్‌లో ఉంటే 24 Volumes english లో verbatim dictate చేసాడు. ఇపుడు బ్రహ్మవిద్యకి సంబంధించిన ఆ 24 Volume లు జగత్ప్రఖ్యాతములు. ఒక్క భారతదేశములో తప్ప అన్ని దేశాల్లో తెలుసు. వేదములు, ఉపనిషత్తులు అన్నీ ఉన్నాయి వాటిల్లో. దేవతలు, పితృదేవతలు అన్నింటిని గురించి scientific explanations ఉన్నాయి. అందులో చెప్పారాయన. 21వ శతాబ్దం మధ్యలోకి వెళ్ళేటప్పటికి ఈ పద్ధతి విశ్వ విద్యాలయాల్లోకి వస్తుంది. ఇపుడున్నటువంటిది చాల మోటు పద్ధతి. పాత రాతియుగం నాటిది (paliolithic method). Memory test ని education అనుకునేటువంటి స్థితిగ ఉన్నారిపుడు అన్నాడు. ఇది education కాదు. కనుక ప్రజ్ఞాలోకం అంటే ఏమిటో తెలుస్తుంది. చదువుకున్న కొద్దీ తేలిక పడుతుంది. బరువెక్కదు. అంటే పొద్దుటి నించి సాయంత్రందాకా క్లాసులకి హాజరైతే అబ్బ కాస్త కాఫీ తాగి వద్దాం అన్నట్టుగా బుర్రపాడవటం అంటూ ఉండదు. అలుపు (exhaustion) ఉండదు. గంటో, రెండు గంటలో చదివేటప్పటికి బుర్ర బరువెక్కిందంటే అర్థం చెప్పే విధానం అంత అఘోరించినట్లు శ్రాద్ధయోగ్యంగా ఉందని అర్థం. బోధనా విధానము సరిగ్గా ఉంటే 24 గంటలు మనం నేర్చుకున్నా, శరీరము తేలిగ్గా ఉంటుంది. మనస్సు తేలిగ్గా ఉంటుంది. అప్పటికప్పుడు స్నానంచేసి వచ్చి కూర్చున్న వాడల్లే ఉంటాడు. కనుక యిది ''ప్రజ్ఞాలోకం'' అన్నాడు. ఈ ప్రజ్ఞ అనే కిరణాన్ని ఏం చేయాలి. ఎవరూ చూడకుండా, వినకుండా దాచుకోవాలా? అదేంకాదు. తరువాత సూత్రంలో చెప్తారు.

## 6. తస్య భూమిషు వినియోగః।

తస్య = దానికి, భూమిషు = అనేక (లోకములు) కక్ష్యల యందు, వినియోగః = వినియోగింపబడును.

ఈ వెలుగును సాధకుడు తన ధృక్పథములయందు వినియోగించును.

**వివరణ :** తస్య అంటే దానికి, భూమిషు అంటే అనేక కక్ష్యల యందు, అనేక లోకముల యందు (planes of consciousness) 'వినియోగః' విని యోగము చేయబడును. అదివరకు పదిరకాల జీవితం ఉంటే యోగాభ్యాసం చేసాక వంద రకాల జీవితం ఉంటుంది. అదివరకు ఆఫీసు, స్నేహితులు, భార్య, పిల్లలు మొదలైనవే ఉన్నాయి. అవికూడ సరిగ్గా చేయలేకపోతున్నాము. యోగాభ్యాసంలోకి వచ్చేటప్పటికి వందలు, వేలు చేయాలి. మూడు నెలలనుంచి చేదకి చాంతాడు మర్చిపోతున్నాడు. బాత్ రూమ్‌లో స్విచ్ పాడైంది. ఆర్నెల్లు అయింది. ముట్టకుంటే షాక్ కొడుతోంది. రోజూ తెస్తానంటాడు. తేడు. అంటే వీడు జంతువులా బ్రతుకుతున్నాడు. ఒకచోట ఉన్నటువంటి స్థితి యింకో చోటికి ఏం గుర్తుంటుంది. Simultaneity of existence లేదు. ఈ స్థితికి వచ్చేటప్పటికి ఆఫీసుకెళ్ళే దారిలోనే స్విచ్ కొంటాడు. అంటే ఏమిటి? లోపల ఎవేర్‌నెస్ పెరుగుతుంది. నిర్లిప్తత ఎక్కువైన కొద్దీ ఎవేర్‌నెస్ పెరుగుతుంది. నిర్లిప్తత తగ్గి జిడ్డు ఎక్కువైన కొద్దీ, యావ, తాపత్రయం పెరుగుతుంది. అదవ్వలేదు, యిది అవ్వలేదు అని సతాయించుకుంటూ ఒకళ్లని ఒకళ్లు జిడ్డు మొహాలల్లే ఏడుస్తూ ఉంటారు భార్య భర్తా కూడను. అంటే దరిద్రం తాండవిస్తూ ఉంటుంది వాళ్ళ మొహాన. యింట్లో తిండికూడ తిన్నగా తినరు భగవంతుడు తింటానికి అంతా ఇచ్చి ఉండికూడను. అవన్నీ శుభ్రంగా దుమ్ము దులిపేసినట్లు పోతాయి. ఎంత ఆశ్చర్యకరంగా ఉంటారు. యింట్లో ఉన్నటువంటి మనుష్యులు మొహాన ఎంత కళ ఉంటుంది. 24 గంటలూ కళ ఉంటుంది. నిన్న సాయింత్రం అనుకున్నారుట. యివాళ పొద్దున్న స్విచ్ పట్టు కొచ్చేసాడు బజారు నుంచి. వేరే పట్టుకురావడం ఉండదు. వాడు పట్టుకు రాడు. పట్టుకు రాబడుతుంది వాడిచేత. దానిపేరు simultaneity of existence. దాన్ని awareness అంటారు. అట్లాగ గృహ కృత్యంలోను, ఆఫీసు, వినోదము మొదలైన అన్ని కక్ష్యలలోను అంతే.

చేయకూడనివి చేయడు. అక్కర్లేనివి ఎత్తేస్తాడు. కావలసినవి ఉంటాయి. బాధ్యతలు విస్మరించడు. బాధ్యత పెరుగుతూ ఉన్నా నిర్లిప్తత ఉంటుంది. ఏదీ అంటదు. అన్నీ వాడు చేయడు. చేయబడుతూ ఉంటాయి కనుక ''తస్యభూమిషు వినియోగః'' ఈ కాంతిని, ఈ తేజస్సుని, తనలోంచి ప్రసరిస్తున్న తేజస్సుని, ఈ లాంపును ఎక్కడ పెడితే అక్కడ వినియోగపడుతుంది. ''తస్యభూమిషు వినియోగః'' వెలుగేం చేసుకుంటావు? ఎక్కడ పెడితే అక్కడ వినియోగం అవుతుంది. అది వెలుగుతూ ఉంటుంది. ఎక్కడ పెడితే అక్కడ పనిచేస్తుంది. దానికేమిటి? పగలు కూడ సూర్యరశ్మిని తిరస్కరించి వెలుగుతుంది. కనుక ఎప్పుడూ పనికొస్తుంది ఆ వెలుగు. రాత్రి వెలుగుతుంది. నిద్దట్లోనూ వెలుగుతుంది. మెలకువలోనూ వెలుగుతుంది. ఇదీ పద్ధతి.

'త్రయమేకత్ర సంయమః' ధారణ, ధ్యాన, సమాధులు మూడూను ఒకటిగా సమాపన్న మగునపుడు సంయమము అనేటువంటి స్థితి కలుగుతుందని చెప్పారు. ''తత్ జయాత్ ప్రజ్ఞాలోకః'' దానియందు జయము కలిగినపుడు ప్రజ్ఞ అనేటువంటిది వెలుగుతుంది అన్నారు. అంతకు ముందు ప్రజ్ఞ ఎక్కడ ఉన్నదో మనకి తెలీదు. మనలో ఎక్కడో పరోక్షంగా ఉన్నటువంటి ప్రజ్ఞ మిగతా మనం ఎరిగి ఉన్నటువంటి విషయాల మీద పడుతూంటే, యివి వెలుగుతూంటే దాన్ని ప్రజ్ఞ అనుకుంటూ ఉన్నాం ప్రపంచంలో. అంటే **inabsentia** గా బ్రతుకుతూ ఉన్నాం. కాని యిది వచ్చేటప్పటికి ''ప్రజ్ఞ ఆలోకః'' ప్రజ్ఞ వెలగటం, మిగిలిన విషయాలు దాంట్లో వెలగటం ఉంటుంది. ప్రజ్ఞ వెలగటం కొంచెం కష్టం. ఉదాహరణకి ముద్రణాలయాల్లో రెండు రకాలున్నాయి. అక్షరాలు అకారాది క్షకారాంతము వరకు తలకట్లతో, దీర్ఘములతో, గుణింతములతో సహా ఉంటాయి. వేర్వేరుగా సంధి బంధాలు విడదీసి, అవి కూర్చుకుంటే మనం యిచ్చినటువంటి matter అవుతుంది. దాన్ని కంపోజింగు అంటారు. తర్వాత దాని నమూనా తీసి మనకి యిచ్చి, మనం తప్పులు దిద్దితే, సరిగ్గా తీసి మళ్ళీ అచ్చువేయడం - యిదొక పద్ధతి. యిదికాక కొత్తరకం. ఆఫ్‌సెట్ ప్రెస్‌కి యిచ్చామనుకోండి. 15 రోజుల్లో మీరిచ్చిన పుస్తకం అచ్చయిపోయి, పుస్తకములు కుట్టబడి, ఎన్నేసి పుస్తకములు కావలెనో, అన్నేసి కట్టలు కట్టబడి, మీ దగ్గరికి వచ్చి నిలుస్తాయి. మనం ఎరిగి

ఉన్నదే ఇటువంటి ప్రజ్ఞ. అలాగే ప్రజ్ఞలో చేయబడిన తదితరములైనటువంటి అనేక విషయములు మనం ఎరుగుదుము గాని ప్రజ్ఞ ఎరగం. ప్రపంచంలో మనం ఎరిగినదల్లా సందర్భానికి కొంచెం అనుకూలంగా పనిచేసి, వెళ్ళిన పని అయిపోయిందనుకోండి. అబ్బ! చాల ప్రజ్ఞతో పనిచేసారంటారు. అట్లాంటివి ఐదారు చేస్తే వాడు చాల ప్రజ్ఞావంతుడు అంటాం. కాని అపుడు ఇపుడు ప్రజ్ఞ మనకి కనపడ్డది కాని తెలిసింది కాని, ఏమీ లేదు. ఏం జరిగింది? దాని తాలుకు after effects, by products మనం అనుభవిస్తున్నాం. అంతకు తప్ప ప్రజ్ఞ అంటే pure consciousness అనేటువంటిది ఎరిగినటువంటి స్థితిలో లేము సుమా. ఈ చెప్పిన విశ్లేషణ స్థితులు అవలంబించిన వారికి ''ప్రజ్ఞాలోకం'' వస్తుంది. ప్రజ్ఞ అనేటువంటిది వెలుగు తప్ప, దానిచేత వెలిగింప బడుతున్నటువంటి అనేక శాస్త్రములు పెన్స్, బుక్కులు, ఇజమ్‌లు, ఆలజీలు ఇవికావు ప్రజ్ఞ అంటే. ఇవన్నీ కూడ ప్రజ్ఞవల్ల వెలిగింప బడుతున్న చీకటి ముద్దలు. అందుకనే శంకరాచార్యులవారు శాస్త్రములు సమస్తమూ కూడ అజ్ఞాన తిమిర పుంజములు అన్నారు. ఏమిటిరా ఇలా అంటాడు అంటే అంతే అన్నాడు. శాస్త్రముల యెడల నీ ప్రజ్ఞ తిన్నగా ప్రసరించిన క్షణంలో అది జ్ఞానం అవుతుంది గాని లేకపోతే అది జ్ఞానం ఎలా అవుతుంది? చూడబడే వస్తువు, చూచేవాడు, చూచుట అనేటువంటి ప్రక్రియ ఈ మూడున్నూ సమాపన్నము (fusion) జరిగి ఒకే ఒక consciousness కానపుడు జ్ఞానం ఎలా అవుతుంది? మూడు ముక్కలుగా విరగ్గొట్టినటు వంటి జ్ఞానం అనే పుల్ల. దానిపేరు అజ్ఞానం. అదీ మనకు శంకరాచార్యులు మొదలైనటువంటి వాళ్ళు, నిజమైన psycologists చెప్పినటువంటిది. Modern psycologist కి మనస్సూ, దానిపొరలే మనిషికున్నటువంటి ఆస్తి. దానిపైన ఉన్నటువంటిదేమీ తెలీదు. అసలు ఈ మనస్సు, దానికున్న పొరలు యివన్నీ కూడ పాలమీద ఉన్నటువంటి నురుగు. అంటే ఏదైతే అబద్ధమో దాన్ని గురించి చెప్పేది modern psycology. సముద్రంలో అలలు ఎట్లా వస్తాయో, దాన్ని ఫొటోతీసి, రికార్డింగ్ చేసి, statistics తీసి, ఒక పది సంవత్సరములలో విశాఖపట్నం రామకృష్ణా బీచ్‌లో వచ్చిన అలలు, పది సంపుటిలు వేసామనుకోండి. చాల ఫొటోగ్రాపులతో వేయచ్చు. వాటికి ఎంత విలువో, యిపుడున్న modern psycology పుస్తకాలన్నింటికీ కలిసి అంతే విలువ. ఇందులో మనం నేర్చుకోదగ్గది కాని, బాగుపడదగ్గది కాని, ఎదుటి

వాడికి సహాయం చేయదగ్గది కాని, ఏ లేశము లేదు. ఎందుకంటే mind and its layers గురించి యిచ్చినది నురగ foam లాంటిది. (conditoned truth) లేక ఏది అసత్యమో దాన్ని గురించి (analasis) యిచ్చేటువంటిది. ఈ శాస్త్రంలో దానికి అవతల ఉన్న విషయం యిస్తున్నారు. ఇంతకు ముందు మనం ఎరిగి ఉన్నదంతా కూడ ప్రజ్ఞ కాదు. ప్రజ్ఞచేత వెలిగించబడిన కొంచెము ప్రజ్ఞ అనేటువంటిది. ఒక కొవ్వొత్తి చేత వెలిగింపబడిన అనేక చెత్త విషయములు. అంటే ఒక హాలు నిండా నానా చెత్త పడేసి అందులో ఆముదపు దీపం పెట్టామనుకోండి. దాంట్లో అవన్నీ ఎట్లా వెలుగుతున్నాయో, ఈ జన్మలో మనం చేసుకుంటున్న తెలివిగల పనులు, ఈ వ్యాపారాదులు, మనం జాగ్రత్తగా చేస్తూండటం, జాగ్రత్తగా మాట్లాడుతూ ఉండడం, బేరం, మనం కొనేటువంటి కూరగాయల్లో పుచ్చుల్లేకుండా కొనడం, యివన్నీ అంతా కలిసి అంతే. అంతకంటే విలువైనటువంటి విషయాలు కావు. అందుకని అదంతా ప్రజ్ఞ అనుకుంటూ ఉంటాం మనం. ఇవన్నీ వెళ్ళిపోతాయి ఈయన చెప్పిన సాధన చేసిన తర్వాత. ప్రజ్ఞ అంటే వాట్లని వెలిగిస్తూ ఉన్నటువంటి కిరణం. ఆ ప్రజ్ఞాలోకం వస్తుంది. అది అనుభవించడం వచ్చిన తర్వాత ''తస్యభూమిషు వినియోగః'' దానిని అనేక కక్ష్యల యందు వినియోగించు కోవాలి. ఇందాక చెత్త అంతా పడేసి ఉన్న హాలు అన్నారు చూడండి. అలాంటి హాల్సులో వినియోగించుకుంటే ఒక గంట కూడ చెత్త ఉండదు అన్నాడు. అది తీసేసి ఇల్లంతా ఎలా ఏర్పాటు చేసుకోవాలో, లోపలా బయటా కూడ తెలుస్తుంది. అది తెలిసిన ఒకణ్ణి మంచివాణ్ణి యింట్లో పెట్టారనుకోండి, మర్నాడు వెళ్ళేటప్పటికి యిల్లెలా ఉంటుంది. ఎంతో టైము పట్టదు. ఆ మార్పు వస్తుంది మీలో. మీ దగ్గరికి వచ్చేటువంటి వాళ్ళు 24 గంటల్లో ఎవడి పరిణామం (evolution) ఎంతో వాడికి ఏది మంచిదో అది ఇస్తూంటారు. ఆ స్థితి వస్తుంది. చూసారా. మీకేది మంచిది అనేది ఏం ఉండదు. మీకేది మంచిదో ఆ స్టేజి అయిపోయింది. ఉండదు యింక. అది అజ్ఞానంలో ఉన్నంత కాలమే మీకేది మంచి అనేది, అది దాటి ఎప్పుడైతే సంయమము అనే స్థితికి వచ్చారో, మంచి లేదు. చెడు లేదు, జగత్తు ఉన్నది. అందులో మనం జీవించడం చాతనవుతుంది. అంతకంటే యింకేం లేదు. ఈ మార్పు మీలో అప్రయత్నంగా వచ్చేస్తుంది. ఏ మార్గంలో వెడితే మంచిదండి అన్నవాడు

పిచ్చివాడు. ఎవడికేది కావాలో యిచ్చి సంతోషపరుస్తాడు. ఎవణ్ణీ అవమానపరచడు. చాల ఆశ్చర్యకరంగా ఉంటుంది. కనుక ''తస్య భూమిషు వినియోగః'' ఎన్ని భూములు, ఎన్ని లోకముల యందు వినియోగం అంటే, ఎన్ని ఉంటే అన్ని అన్నాడు. అవతలి వాళ్ళు ఎన్ని రకాలైన వాళ్ళు వస్తే అన్ని. ఇంకొక సూత్రం చెప్తున్నాడు ఏడవది. అంటే చుట్టుప్రక్కల పరిస్థితులతో గాని, యితరులతో గాని ఏ విధమైన సంబంధం లేదు మీ యోగాభ్యాసానికి, యోగ పరిపూర్తికీ, జ్ఞాన పరిపూర్తికి. అంతేకాదు. యింట్లో ఉన్నటువంటి మనుష్యులతో కూడ సంబంధం లేదు. భర్తతో గాని, భార్యతోగాని, పిల్లలతోగాని హాయిగానే ఉంటూ ఉంటారు. వాళ్ళకి యోగాభ్యాసం కావలసి వస్తే మీతోపాటు అనుభవిస్తూ ఉంటారు. లేకపోతే మామూలుగానే బండి నడిచిపోతూ ఉంటుంది. ఎవళ్ళకి కావలసినది వాళ్లు అనుభవిస్తూంటారు. ''*వేత్తలందరు గూడి వేదాంత మడుగంగ అందులో ఒక వేత్త అటుకు లడిగె*'' అన్నారు. అందరూ కలిసి వేదాంత మడుగుతుంటే ఆ చెంబులో అటుకులున్నాయి తీయమందిట ఒకావిడ. ఎన్ని చెప్పినా అవి దాటవు కదా. ఇది చేస్తే దాటుతారు. దాటితే భర్త దాటాడు కదాని భార్య దాటాలని ఎక్కడాలేదు. భార్య దాటలేదు కదాని నేను యోగిని నువ్వు యోగి భార్యగా ఉండడానికి పనికిరావు అనటానికి వీల్లేదు. వాడు యోగి అయినా అంతే నియోగి అయినా అంతే. వాడి సాధనకి కావలసినటువంటి జీవిని ఆమెగా యిచ్చారు. ఆమె సాధనకి కావలసిన జీవిని వాడిగా యిచ్చారు సృష్టిలో. అవీ వీడికి బోధపడేటువంటివి. భార్యగాని, భర్తగాని, పిల్లలుగాని యిలాంటి కొడుకుని యిచ్చేవేమిరా అని ఏడ్చి ఏం లాభం లేదు. మనం పూర్వజన్మలో కొడుకుగా ఉండి ఏం చేసామో, తండ్రిగా ఉండి కొడుకుని ఏం చేసామో, దాన్నిబట్టి ఈ జన్మలో కొడుకు అలాంటివాడు వస్తాడు. అందుకని ఉన్నదున్నట్లు స్వీకరించడమే. అక్కడ నీకేం సంబంధం లేదు. వాళ్ళిష్టం వాళ్ళది. నీ యిష్టం నీది. ఆ స్థితి వచ్చేస్తుంది. నీకు ఏమి ఇబ్బంది ఉండదు. వాళ్ళకీ ఏమి ఇబ్బంది ఉండదు. అట్లాంటి స్థితి వచ్చాక ఏడవ సూత్రం చెబుతున్నాడు. అంటే దీంట్లో కొంచెం వివరంలోకి వెళ్ళబోతున్నాడు.

## 7. త్రయమన్తరఙ్గం పూర్వేభ్యః।

పూర్వేభ్యః = ఆ మొదటి ఐదింటి కన్నా, త్రయం = ఈ చెప్పబడిన మూడున్నూ, అన్తరఙ్గం = లోపలి పనిచేసే భాగములు.

**యోగాంగము లెనిమిదింటిలో ధారణ, ధ్యాన, సమాధులు అను మూడును మిగిలిన ఐదింటికన్న సాధకుని లోపలి అంగములు.**

**వివరణ :** యమము, నియమము, ఆసనము, ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణము, ధ్యానము, సమాధులు అనే ఎనిమిది అంగములలో మొదటి ఐదింటికంటే చివరి మూడునూ అంటే ధారణ, ధ్యానము, సమాధి అనేవి 'అన్తరఙ్గం' అంటే లోపలి భాగములైన పనిముట్లు. ప్రతి యంత్రానికి రెండు రకాల పనిముట్లు ఉంటాయి. బయటికి కనిపించే పనిముట్లు, కనిపించని భాగములు. మొదటివి బయటికి కనిపించేవి. గడియారంలో ముళ్ళు మొదలైనవి లాగ. అదిగాక తరువాత మూడు వెనుక డిప్పలోపల తిరుగుతూ లోపల పనిచేసేవి. అవి అంతరంగములు.

ఇవి బయట ప్రపంచంతో పనిచేసే పనిముట్లు కావు. లోపల ప్రపంచంలో పనిచేసేటు వంటివి. వీట్లని ఉపయోగించుకునేటపుడు కొంచెం జాగ్రత్త పడాలి. చాకు, బ్లేడు, మేకు, కత్తి, సుత్తి మొదలైనవి ఉపయోగించుకునేటపుడు జాగ్రత్తగా ఉండాలి. కొన్నాళ్ళయిన తర్వాత ఒక్కొక్కపుడు గోళ్ళు బ్లేళ్ళుగా, మేకులుగా, సుత్తిలుగా, స్క్రూడ్రైవరులుగా చెక్కుతాము అనుకోండి. అపుడు మాత్రం అసలు బ్లేడు, మేకు మొదలైనవి ఉపయోగించనపుడు ఉన్న జాగ్రత్తకంటె ఎక్కువ జాగ్రత్తగా ఉండాలి. గోళ్ల బ్లేడల్లే చెక్కుకున్నవాడు నిద్రపోతు ఉండంగ ఆ చేత్తో గోక్కున్నాడనుకోండి. పొద్దున్న లేచేటప్పటికి పులి అల్లే ఉంటుంది మొహం. అంటే గీసుకుపోయి ఉంటుంది. అంటే దుర్వినియోగం చేశాడన్నమాట. అలాగే ఈ మూడింటిని దుర్వినియోగం చేసినట్లైతే నువ్వు ఉండవు జాగ్రత్త అన్నాడు. మొదటి ఐదు దుర్వినియోగం చేయటం, చేయకుండా ఉండటం మనకి తెలుస్తుంది. లోపల పనిచేసే మూడింటితో చేయటం చేయకుండా ఉండటం తెలీదు.

కాబట్టి కొన్ని హెచ్చరికలు యిస్తున్నారు. లోపల లోపలనే పనిచేసే పనిముట్లు గనుక యివి లోపల తెగుతున్నాయో, పనిచేస్తున్నాయో, ఉపకారం చేస్తున్నాయో, అపకారం చేస్తున్నాయో మనకు తెలిసేటప్పటికి టైము పడుతుంది. వీటిని వాడుకునేటపుడు జాగ్రత్తలేమిటో చెప్పబోతున్నారు యిటుపైన. ''యోగశ్చిత్తవృత్తి నిరోధః'' యోగమనగా చిత్తము యొక్క వృత్తుల్ని నిరోధం చేయటం. చిత్తవృత్తి నిరోధమనగా అని కళ్ళు మూసుకున్నాం, చెవులు మూసుకున్నాం అన్నా నిరోధం అవదు. అయినా ఏమీ నష్టం లేదు. అలాగే మనస్సుని ఏకాగ్రత చేయడానికి ప్రయత్నం చేసినా ఏమి నష్టంలేదు. లోపలి వాటి విషయంలో కొంచెం సుళువులు సూక్ష్మాలు ఎక్కువ తెలియవలసిన advanced classes యివి. వీటి పనిముట్లు (instruments) కూడ చాల సున్నితం. జాగ్రత్తగా వాడుకోవాలి. మీ శరీరములోని భాగములే గనుక ఒక instrument ఏదైనా తల్లక్రిందులైందంటే ఇహ అక్కడనించి మళ్ళీ తీసుకురావటానికి వీలుండదు. అది మీలో గుచ్చుకొని చిన్నాభిన్నము అయిపోతుంది మనస్సు. అందుకని ప్రతి అడుగడుగునా కూడ నిజమైన యోగ సాధన అవునా కాదా అని చూసుకుంటూ ఉండాలి. కవితా పద్ధతిలో చెప్తే ''మధురాధిపతే రఖిలం మధురం'' నువ్వు పెదవి విప్పితే ఎదుటివాడికి మధురంగా ఉండాలి. ఎదుటివాడు ఏం మాట్లాడినా నీకు తమాషాగా సరదాగ ఉండాలి. అంటే వాడు నానా అవాకులు చవాకులు మాట్లాడినా పిల్లవాడు మాట్లాడుతూంటే పెద్దవాళ్ళకి ఎట్లా ఉంటుందో అట్లా ఉండాలి. నీవు తినేటువంటిది నీకు మధురంగా ఉండాలి. ఎదుటివాడు యింకాస్త తింటూ ఉంటే ద్వేషపడకు. కనుక సమస్తం నువ్వు చేస్తున్నటువంటి సాధనలో లోపలగాని, బయటగాని, పాదానికిగాని, శిరస్సుకిగాని, మనో, బుద్ధి, అహంకార చిత్తాలకి గాని ఎక్కడైనాసరే నీకు మధురంగా ఉన్నట్లయితే ఆ మార్గం రైటు అని అర్థం. చచ్చి చెడి సాధిస్తున్నాం యోగాభ్యాసం అనుకుంటే ఆ మార్గం తప్పు. పతంజలి యోగమైనా అంతే. భగవద్గీతలో ఉన్నటువంటి యోగమైనా అంతే, నీలో భాగాలు అన్నారు కదా యివన్నీ. నీవే ఈ శరీరంలో ఏ భాగమూ కాకుండా తెలుసుకున్నపుడు ఏమవుతాయి. ఈ మూడు కూడ

నీలోవి కావు. ఇందాక చెప్పినవి ఎంతవరకు అంటే నేను అనేది లోపల యేర్పాటు చేసుకొని దానిచుట్టూ తలకాయ, గుండెకాయ, ఊపిరితిత్తులు, పంచేంద్రియాలు ఉన్నాయి. అనుకున్నంతసేపున్నూ, అంటే తానుగా శరీరంలో ఉన్నవాడికి. తానక్కడుండటం కాకుండా తనలో యివన్నీ ఉన్నాయనుకుంటే ఆ స్థితి వస్తుంది. యింకొంచెం ముందుకెళితే తాను శరీరంలో ఉండటం అనేటువంటి దుర్గతి ఉండదు. ఈ శరీరాదులు తనయందు ఉండటం, తనయందు నటించటం, తనయందు లీనమవటం అనే స్థితిలోకి వస్తాయి. అది వచ్చినా ఈ మూడు తనలోవేనా. తనలోవి ఎందుకవుతాయి. శరీరమే తనలోది కాదే. తన శరీరంలో ఉంటే యివన్నీ తనలో భాగాలు అవుతాయి. శరీరం తనలో ఒక భాగం. అలాంటపుడు ఈ మూడు తనలోవి కావు. శరీరంలోవి. అంటే యంత్రంలో భాగములే అవుతాయి గాని తనతో indentification లేదు. వెలుపలి అంగములే అవుతాయి. ఎనిమిదవ సూత్రంలో అది చెప్పబోతున్నారు.

## 8. తదపి బహిరఙ్గం నిర్బీజస్య।

తదపి = ఆ త్రయమును, బహిరఙ్గం = బహిరంగమే, నిర్బీజస్య = నిర్బీజుడు అయినటువంటి వాడికి.

**నిర్బీజము అనబడు అనుభూతిలో ఉన్నవానికి ఈ మూడును కూడ తనకన్న వెలుపలి అంగములే.**

**వివరణ :** ధారణ, ధ్యాన, సమాధులు మూడు కూడ బహిరంగములే కాని, అంతరంగములు కావు. అంటే వెలుపలనున్న యంత్రాంగ భాగమే కాని లోపలనున్న యంత్రాంగ భాగము కాదు. ముందు సూత్రంలో, మొదటి ఐదింటికన్నా చివరివి మూడును లోపలి యంత్రభాగములు అన్నారు. ఎవరికి? సబీజము కలవాడికి అలా ఉంటాయి. నిర్బీజము అనేటువంటి స్థితి పొందినవాడికి ఆ మూడు కూడ బహిరంగమే. అంటే ఎనిమిది అంగములు కూడ వెలుపలి అంగములే. ఎందుచేత? లోపల ఉన్నటువంటి వ్యక్తి 'ప్రజ్ఞాలోకః' ప్రజ్ఞయొక్క వెలుగు లేదా ఈశ్వరుడు అన్నాడు కదా. పంచేంద్రియములలో మనస్సు ఉంటే అది చిత్తం. ఆ లోపల ఉన్నటువంటి వాడు ఈశ్వరుడు. ఈశ్వరుడి దగ్గరికి వెళ్ళిపోయిన వాడిని నిర్బీజుడు అంటారు. యోగాభ్యాసం చేస్తూకూడ ఏదో కొంతవరకు వెనకేసుకొని పెళ్ళిళ్ళు అవి చేసుకోవాలనుకొనే వాడు సబీజుడు. సబీజుడు అయిన వాడికి ఆ మొదటి ఐదున్నూ వెలుపలి యంత్రాంగములు, మిగతా మూడున్నూ అంతరంగములు. నిర్బీజుడైనవాడికి ఎనిమిదీ బహిరంగములే. నిర్బీజుడంటే ఈశ్వరుడే. ''ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి'' ఈ ఎనిమిది అంగాల్ని ఏం చేస్తున్నాడు? ''భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా'' భగవద్గీతలో యిచ్చారు. ఈ ఎనిమిది అంగములతో కూడినటువంటి యంత్రము నందు ఆరూఢము చేసి చుట్టూ గిరిగిర తిప్పుతున్నాడు లోపల ఉన్నటువంటి ఈశ్వరుడు. ఆ స్థితిలో ఉన్నవాడు నిర్బీజ సమాధి పొందినవాడు. అలా కాకుండా ఈ లోక వ్యవహారాల్లో వీటికి వాటికి పెద్ద ఏం ఫర్వాలేదు, ఇవీ చూసుకుంటూ ఉండాలి, అదీ చూసుకుంటూ ఉండాలి అన్నవాడు. సబీజ సమాధి

కలవాడు. అంటే రాజీపడే తత్వం గలవాడు. అంటే యోగసిద్ధి వస్తుందా! వచ్చినంత వస్తుంది. కాని నిర్బీజుడికి వచ్చినట్లు వాడికిరాదు. యోగసిద్ధి అనగా నిర్బీజుడిదే కాని సబీజుడిది కాదు. పతంజలి ఇదివరకు వీటన్నింటినీ కలిసి ద్రష్ట అన్నాడు.




ఇలాంటి పంచేంద్రియాలతోనే యింకోడు ఇంకో ప్రక్కన నిల్చున్నాడు. మధ్యవాడి యెడల మేలుకోలేదు వీళ్ళిద్దరు. వీడుకూడ తనకి తాను ద్రష్ట అంటే చూచువాడు. కాని వీడికి వాడు దృశ్యము. వాడికి వీడు దృశ్యము. అంటే వీణ్ణి అడిగితే నేను అనే పదం వాడతాడు. ద్రష్ట అంటే చూస్తున్నవాణ్ణి నేను, మాట్లాడుతున్నవాణ్ణి, చూడబడుతున్నవాడు అంటాడు. వాణ్ణి అడిగితే చూస్తున్నవాణ్ణి నేను. చూడబడుతున్నవాడు వాడు అంటాడు. అబద్ధమా? ఏమీకాదు. దీన్నిగురించి చెబుతూనే పైథాగరస్ బ్రహ్మవిద్య అనేటువంటి ఇల్లు కట్టేటువంటివాడు, శరీరం అనేటువంటి ఇల్లు నిర్మాణం చేయటానికి కావలసిన పనిముట్లు (instruments) తెలుసుకోవాలన్నాడు. మొట్టమొదటిది కంపాస్ (campass) అన్నాడు.




Centre to Circumference

Circumference to Centre

జగత్తులో ఒక ప్రక్క నిలబెట్టి తిప్పితే అది కేంద్రము రెండవది పరిధి అవుతుందన్నాడు. రెండవది నిలబెట్టి తిప్పితే అది కేంద్రము, మొదటిది

పరిధి అవుతుందన్నాడు. కేంద్రము అంటే 'నేను' అనే పదానికి అర్థమున్నా, పరిధి అంటే నీవు అనే పదానికి అర్థము అన్నాడు. పైథాగరస్ ఇచ్చిన బ్రహ్మోపదేశాల్లో ఇది ఒకటి. ఇటుపైన ధ్యానం చేసుకోండి అన్నాడు. ఇంక చెప్పేవి ఏమీ ఉండవు అక్కడ. ఆయన రెండవ సంపుటి (Volume) లో యిచ్చినటువంటి పరమోపదేశం ఇది. వీటిని implements of masonry అంటారు. దీనిమీద ఆధారపడే free-masonry అనేటువంటి పరమ పవిత్రమైన శాస్త్రం ఉన్నది, masonic lodges అని కొన్నివేల సంవత్సరాల క్రిందటి నుండి ఉన్నాయి. (బ్రహ్మవిద్య ఆలయములు). రానురాను అపవిత్రత చోటు చేసుకుంటోంది. Free masonry లో అసలు నేర్పవలసినటు వంటివి.

Campass , Spirit level, Set square 90 Degrees Scale, Plumb 'ఒడంబము' త్రాడుకి వ్రేలాడదీసిన ప్లంబ్. ఈ పనిముట్లు ఇల్లు కట్టడానికి కావలసినవి. వీటిద్వారా బ్రహ్మవిద్యా పరమ రహస్యములు, ఆత్మ సామ్రాజ్య నిర్మాణము "The building of temple" అన్నాడు పైథాగరస్. దీని కిచ్చినటువంటి ఉపదేశములు 33 డిగ్రీలు అనే పేరుతో 33 వాల్యూములు యిచ్చాడు ప్రపంచానికి పైథాగరస్. ఇప్పటికిని ఆ 33 volumes అచ్చయి ప్రపంచములో అన్ని దేశములలో ఉన్నటువంటి నిజమైన బ్రహ్మవేత్తలకు ఆరాధనీయములు అవుతున్నాయి. కాని ఈ masonic lodge లో ఉన్నటువంటి వాళ్ళకి ఎవళ్ళకీ అందనూ అందవు. తెలియనూ తెలియవు. ఎందుకంటే అవి పవిత్రంగా ఉన్నవాళ్ళ కోసం అట్టే పెట్టారు అప్పటినుంచి ఇప్పటివరకు జాగ్రత్తగా. వీట్లని "the implements of masonry" అంటారు. నిర్మాణమునకు, సృష్టి ప్రక్రియకు కావలసినటువంటి అంతరంగములు implements అంటే. పతంజలి అంతరంగములు అని ఏ పద్ధతిలో అన్నాడో, సరిగ్గా యిక్కడ అదే పద్ధతిలో అన్నాడు. కనుక మనకు ఉపనిషత్తులో దీన్నే ''స యశ్చాయం పురుషే యశ్చాసావాదిత్యే'' అని చెప్పారు. నువ్వు యిక్కడ నిల్చుని నేను అని ఏదైతే అంటున్నావో, వీడు సూర్యుడు అని ఉదయిస్తూంటే ఎవడినైతే అంటున్నావో, ఈ అంటున్నవాడు, ఈ అనబడుతున్నవాడు వీళ్ళిద్దరూ కూడ ''స ఏకః'' వాడు ఒక్కటే అని చెప్పారు. నేను సూర్యుణ్ణి చూస్తున్నవాణ్ణి అంటూ వుంటాం. ఇతడు సూర్యుడు అని అంటూ ఉంటాం. ఈ రెండునూ కూడ ఒకచోట కలుస్తూ ఉంటాయి. అది నువ్వు. అదీ వేదములు, ఉపనిషత్తులు చెప్పినటువంటి పరమోపదేశం. These are

called teachings of all times. Wisdom teachings అంటారు. మతమునకు సంబంధించినవి కావు. దేశమునకు, జాతికి సంబంధించినవి కావు. ఎవరూ మూట కట్టుకునేవి కావు. కట్టుకుంటే లొంగేవీ కావు. ఇపుడు వీడు ఎవడికి వాడు ద్రష్ట. ఒకడికొకడు దృశ్యము అని చెప్పాడు. చిత్తవృత్తి నిరోధం కలిగాక అవతల దృశ్యముగాను, తాను ద్రష్టగాను ఉండటం తొలగిపోతుంది అని చెప్పాడు ఇంతకుముందు. అది తొలగిపోయిం తర్వాత యింకేం ఉంటుంది? ద్రష్ట అని ఏ వెలుగునైతే నువ్వు అంటున్నావో, ఆ వెలుగే అవతల కూడ ఉంటుంది అన్నాడు. అంటే యిది వెలిగేటప్పటికి, అనగా ఈశ్వర శబ్దవాచ్యుడైన వాడికి ప్రణిధానము చేయటం చాతనయ్యేటప్పటికి, అంటే ప్రతిదినము ఓంకారము ఉచ్చరించి దాన్ని వింటూ ఆ చెప్పబడిన సాధన చేసేటప్పటికి, దాంట్లోకి మీరు ప్రవేశించేటప్పటికి, చూస్తున్నటువంటి వ్యక్తులు గాని వాళ్ల స్వభావములు గాని, వాళ్ళకి మనకీ ఉన్న సంబంధములు గాని, యివన్నీ కరిగిపోయి ఒకే ఒక వెలుగు, సత్యం ఉంటుంది వాళ్ళలోను, మనలోను కూడ. దానినే ప్రజ్ఞాలోకము అంటారు. అవి అభ్యాసము చేసుకుంటూ ఉంటే, అది ఉండడం మంచిదే మనకి అని ఒకడు అనుకున్నాడు అనుకోండి. అంటే వాడి ఉద్దేశ్యంలో ఎలా ఉంది అది. మనకెప్పుడైనా ఎందుకైనా పనికొస్తుందని. అది దాటలేదు వాడు. అందరిలోను ఉన్నటువంటి అంతర్యామియైన వెలుగు అని తెలిసి కూడ, దాన్ని ధ్యానంచేసి మచ్చిక చేసుకొని ఉంచుకొని, ఎపుడన్నా మనకవసరం వచ్చినపుడు పనికొస్తుంది అనేటువంటి దృష్టిలో ఉన్నాడు వీడు. వీడు తప్పు దృష్టిలో ఉన్నాడు. అంటే అంతర్యామి అంటే సమస్తంలోను, తనలోను, బయట ఉన్నవాడని చెబుతూ తమ మనస్సనేటువంటి ఎలకల బోనులోకి దేవుడనే పందికొక్కుని, లటుక్కున పట్టేద్దామని అనుకున్నట్టు. ఎట్లా దొరుకుతాడు. దీనికంటే చిన్నవాడైతే యిందులోకి పడతాడు గాని, దీంట్లోను, బయటా కూడ ఉన్నాడని ''అన్తర్ బహిశ్చతత్సర్వం వ్యాప్య నారాయణ స్థితః'' అని ప్రతిరోజూ అంటూ ఉంటాడు. లోపల ఉన్నాడు. బయట ఉన్నాడు. అంచేత ఈ బోనులో పడు అంటే ఎందుకు పడతాడు వాడు? అలా ధ్యానం చేసేటువంటి వాళ్ళు కొంతమందీ, నారాయణుడు సర్వత్ర వ్యాపించి ఉన్నాడని, అన్నిటిలో కూడ దాన్నే ధ్యానిస్తూ ఆనందిస్తూ, ఉండిపోయిన వాళ్ళు కొంతమంది. మొదటివాళ్ళు సబీజ స్థితిలో యోగాభ్యాసం చేసేవాళ్ళు, రెండవవాళ్ళు నిర్బీజ స్థితిలో

యోగాభ్యాసం చేసేవాళ్ళు. సబీజ స్థితిలో యోగాభ్యాసం చేసేవాళ్ళకి యోగాభ్యాసం వల్ల వినియోగా లుంటాయి. అంటే మనం యోగాభ్యాసం చేశామంటే మన అదృష్టం మారుతుంది. ఎవడో చెబుతాడు, నీ జాతకంలో ఉన్నటువంటి గ్రహాలున్నాయే వాటి ఫలితాలు మారతాయని. దాని కోసమని చేస్తూంటాడు. దాని కోసమని చేసినవాడికి అంతర్యామిత్వము అందదు. గ్రహాల్లో ఇరుక్కున్నవాడికి మనస్సు అంతర్యామిత్వములోకి ఎలా వెడుతుంది? అంతర్యామి అంటే అన్నింటిలోను యిమిడి ఉన్నటువంటి వాడు. అలాగే ఈ యోగాభ్యాసం చేస్తుండగ మనకి కలిగినటువంటి అభివృద్ధిలో తమాషాగా ఒక పద్ధతిలో వెడుతూంటే, ఆ విసురులో మనుషుల అనుకూలాలు, గ్రహాల అనుకూలాలు యిలా చూసేటప్పటికి ఎవరినైనా సరే సర్వభూత మైత్రి వస్తుంది అని పతంజలి చెబుతాడు యిటుపైన. సకల జీవరాసులతో మిత్రత్వము వస్తుంది. అంటే ఏ హైదరాబాదు వెళ్ళినాసరే మన అబ్బాయికి ఉద్యోగం వేయించుకోవచ్చు అనుకుంటాడు వీడు. అది దాటి వీడి బుర్ర పనిచేయలేదు. అంతర్యామిత్వములోకి వెళ్ళలేదు. అంటే motive. బీజం అంటే motive అని అర్థం. సబీజం అంటే motive తో అంతర్యామిని మచ్చిక చేసుకోవడం. అంటే దేవుణ్ణి అంతర్యామితో మచ్చిక చేసుకొని ఇంట్లో పెంపుడు జంతువులాగ పెంచేవాడు. కాకపోతే ఇంతకంటే అందమైన జంతువు. ఎందుకు పనికొస్తాడు? మనకు శాంతి, దాంతి, కాంతి, వర్చస్సు, బ్రహ్మవర్చస్సు రావచ్చు. మనం రోడ్డు మీదకి వచ్చేటప్పటికి ఫెళఫెళ లాడుతూ ఉండాలి. ఎవడూ మనకి ఎదురు రాకూడదు. మనం అనుకున్న పనులు అయిపోతూ ఉండాలి. అది దాటి వీడికి వేరే దృష్టి ఉండదు. ఆ విసురులో పిల్లల పెళ్ళిళ్ళు అయిపోవాలి. ఇల్లు కట్టటమూ అయిపోవాలి. అందరికీ తలో నాలుగెకరాలు ఇచ్చి చివరికి ఏదో బండి నడిపేయాలి. ఇంక చూసేవాడెవడు? చేసేవాడెవడు? తర్వాత ఆత్మకి పరమాత్మ ఉన్నాడంటే ఉన్నాడో, పెట్టాడో ఎవడికి తెలుసును? ఈ శరీరం వదిలాక జీవుడుంటాట్ట అంటే ఉన్నాడో, లేడో ఎవడికి తెలుసును. నమ్మకం ఉండి చావదు. యోగాభ్యాసం చేసినా, ఏంచేసినా, ఏం చెప్పినా కూడ వాడికి వ్యవహారం దగ్గరికి వచ్చేటప్పటికి వ్యవహారమే. పోనీ వాడు పదిరూపాయలు తిన్నాడు. ఎందుకురా ఏడుస్తావు అని అడిగితే, నీకేం నీ పదిరూపాయలు తింటే తెలుస్తుంది అంటాడు. ఆ పదిరూపాయలు తిననంతసేపూ యోగాభ్యాసము, పతంజలి యోగ

సూత్రాలు చెప్పండి నమ్ముతాడు. అట్లాంటిది సబీజ సమాధి. సమాధి వస్తుందా వాళ్ళకి అంటే పోన్లే రాదంటే ఏడుస్తారు గనుక 'సబీజ సమాధి' అన్నాడు పతంజలి. వీటన్నింటి యందు అంతర్యామి ఉన్నాడని చచ్చుగా నమ్ముతారు. ఈశ్వరుడి యందు లీనమౌతారా? తప్పకుండా అవుతారు. మనకి మార్కులు వేసేటువంటి ప్రొఫెసర్ కాదు ఈశ్వరుడంటే. మనం చేస్తున్న మంచి చెడు అన్నింటినీ కూడ క్షమించే అంతర్యామియైనటువంటి దయామయుడు కనుక ఆయనకి మన బలహీనతలు అన్నీ తెలుసును. అంచేత కంగారు లేదు. మన తప్పులెంచేవాడు కాదు ఈశ్వరుడు. మన తప్పులు వాడికి తెలియక బయిటివాడికి తెలుస్తాయా? అలా తెలిసినపుడు ఆ సర్వాంతర్యామిని శరణు పొందాలి, ఎలా శరణు పొందాలి? ''సర్వభావేన భారత'' భగవద్గీతలో చెప్పాడు. ''త్వమేవ శరణం గచ్ఛ'' వాణ్ణే శరణుపొందు అని, సర్వభావేన అంటే అన్ని భావములతో. అంటే గౌరవించినా అవమానించినా ఒకే భావముండాలి. ఇందులో ఏదీ మనది కాదు. గౌరవించిన రోజు మనదిన్నీ అవమానిస్తే పారిపోయేది అంటే ఎట్లాగు. అవమానిస్తుంటే చూస్తూ ఊరుకుంటావా నీ భక్తుణ్ణి, అని దేవుణ్ణి కోప్పడటమున్నూ, ఎవడన్నా గౌరవిస్తూ ఉంటే, మన పాండిత్యానికి సన్మానం చేసేడని అనుకుంటూ ఉండడమున్నూ ''సర్వభావేన'' అవదు. ఈ రెండూ దాటిన తర్వాత నీకు రావలసిన స్థితి ఉన్నది, దానికోసం ఇవన్నీ. ''తథా మానావమానయోః'' అవమానం కూడా నాండి. పోనీ అది తీసేయండి. నీ యిష్టం కాదు అన్నాడు. మానం, అవమానం అంటే ఏమీ లాభం లేదు. మానం ఉన్నపుడు అవమానం ఉంటుంది. పదిమంది మనల్ని గొప్పగా అనుకుంటే తప్పకుండా ఇంకో ప్రక్కనించి ఇట్లాంటి వాళ్ళని చాలమందిని చూసాం, ఇదంతా ప్రోపగాండా వ్యవహారం అనే వాళ్ళుంటారు. ఏది రైటంటే అదీ రైటే. యిదీ రైటే. ఒక ఆవిడ పాపం అకస్మాత్తుగా సిద్ధురాలై రోడ్డమ్మట నడుస్తూంటే నువ్వు సిద్ధురాలివి, నువ్వు మహానుభావురాలివి అన్నారు సరే అయిపోయింది. మర్నాడు ఇంకొకళ్ళు ఒళ్ళు పొగరు, ఒళ్ళు మదం ఎక్కింది, ఒంటిమీద బట్టకూడ చూసుకోకుండా నడుస్తోంది అన్నారు. తుండుగుడ్డ ఒకటి వేసుకొంది భుజాన. ఇటు అటు బజారున నడిచి వెళుతూ యింటికొచ్చి ముళ్ళు వేసింది. ఏమిటి అని అడిగితే ఇటు ముళ్ళు అన్నీ అందరూ నన్ను

పొగిడినవి, ఇటు ముళ్ళన్నీ అందరూ నన్ను తిట్టినవి అని చెప్పింది. అవధూత పిచ్చమ్మ అని బందరు వెళ్ళేటువంటి దారిలో ఇప్పటికి కూడ ఆలయం ఉన్నది. మానావమానములన్నీ దాటిపోయిన తర్వాత యోగాభ్యాసం చేయాలిగాని, ఈ లోపల యోగాభ్యాసం గాని, ఏదన్నా మంత్రం పేనటంగాని మొదలెడితే కర్మ (accelerate) వేగం పుంజుకుంటుంది. దానివల్ల జీవితంలో మిగిలిన కర్మ ఫలములన్నీ గబగబ ముందుకు నెట్టబడతాయి. మహా ఆపదలు అన్నీ ముందుకు వస్తున్నట్టుగా ఉంటాయి గనుక అవి సర్దుకున్నైనా ప్రారంభించు, వస్తే వచ్చినాయి. వాటంతట అవి సర్దుకుంటాయి అని చేసినా సరే. కాని చేయటం మొదలెట్టిన తర్వాత మాత్రం నీకు కన్నాలు ఏవైతే ఉన్నాయో అవన్నీ బయటపడతాయి. వాటిని ఆపటానికి ఎవరి తరమూ కాదు. ఇవి యిబ్బంది కలిగించే ప్రదేశాలు (most inconvenient sites) ఉద్యోగంలో గాని, బయటగాని, బంధువుల్లోగాని, స్నేహితుల్లోగాని, అన్నిచోట్ల కూడ, యితరులతో మనం నిస్సహాయంగా ఉన్నటువంటి సన్నివేశాలు బయటపడతాయి. అపుడేం చేయాలి అని కృష్ణుడు నారదుణ్ణి అడుగుతాడు. భాగవతం దశమ స్కంధము ఉత్తరభాగంలో కృష్ణుడంత వాడికి అలాంటి స్థితి వచ్చిందని చెప్పాడు. భాగవతంలో కృష్ణుడు వృద్ధుడు అవుతుండగ యాదవులలో, బంధువులలో, తన భార్యలలో, పిల్లలలో అందరూ కూడ ఎవళ్ళ మార్గాన వాళ్ళు బాగుపడేవాళ్ళు బాగుపడటం, చెడిపోయే వాళ్ళు చెడిపోవటం జరుగుతోంది. ఆ స్థితిలో ఉండగ నారదుడు వస్తే నవ్వుతూ కృష్ణుడు అన్నాడు. ఇపుడేమిటి చేయాలి అన్నాడు. ఇలాంటి పరిస్థితిలో ఎవడికి కావాల్సినది వాడిని చేయనీయటమే. మనం వెళ్ళేటువంటి మార్గంలో మనం వెళ్ళటమే అన్నాడు నారదుడు. 'ఆ' 'ఉ' అన్నట్లైతే అదంతా వీడి మీదకి దుష్కర్మ క్రింద తగుల్కొని వాళ్ళకి వీడికి సంవాదము, చర్చలు, ఎవడు రైటు యివన్నీ వస్తాయి. వీడు వెళ్ళే మార్గం ఆగిపోతుంది. లోకానికి కృష్ణుడు మార్గం చూపించటం కోసమని నారదుణ్ణి ప్రశ్న వేయటమున్నూ, నారదుడు సమాధానము చెప్పటమున్నూ దశమ స్కంధంలో ఉన్నది. యోగాభ్యాసం చేసేవాడికి ఇలాంటి స్థితి వచ్చినపుడు, నిస్సహాయుడైనపుడు ఎవడు ఏది చేస్తున్నా మాట్లాడక ఊరుకో అన్నాడు. నీదాకా రారు అంతవరకు నేను చూస్తాను అన్నాడు. నువ్వు ఎవడిదాక వెళ్ళకుండా ఉంటే ఎపుడు రారు.

నిన్ను బట్టే ఉంటుంది. మనకి ఎదుటివాడి నుంచి ఎంతదూరమో, ఎదుటి వాడికి మననించి అంతే దూరం. ''శృంగేరి వహిరస్మాకం శృంగేరిణో బహిః'' అన్నాట్ట. మేము శృంగేరినుంచి బయటే ఉంటాం. లోపలికి ప్రవేశించం శృంగేరి మీనుంచి బయటే ఉంటుంది అన్నారుట. మిమ్మల్ని రానీయదు లోపలికి అన్నాడు. యిక్కడ పతంజలి యోగ సూత్రాలకి వ్యాఖ్యానం రాసిన దాంట్లో ''సబీజ సమాధి'', ''నిర్బీజ సమాధి'' అని రెండు పదములను తీసుకొని వ్యాఖ్యానకారులు వేరుగా వివరించారు. సమాధి రెండు విధములు. ఒకటి సబీజ సమాధి, రెండు నిర్బీజ సమాధి లేదా సవికల్ప సమాధి. నిర్వికల్ప సమాధి. సవికల్ప సమాధి అనగా తను పొందుతూన్నటు వంటి యోగస్థితి, దాంట్లో ఉన్నటువంటి అనుభవాలు అవన్నీ తనకు తెలుస్తూ ఉంటాయి. యిది ధారణ అని తెలుస్తూ ఉంటుంది, ఇది ధ్యానం అని తెలుస్తూ ఉంటుంది, ఇది సమాధి అని తెలుస్తూ ఉంటుంది. ఇది సంయమము. ఇది సంయమము. అని చెప్పి నువ్వు అనుభవిస్తూ ఉంటావు. నువ్వు అనుభవిస్తూ ఉండి, ఆ అనుభవం నీకు తెలుస్తూ ఉండటం అనేటువంటి దానిపేరు సబీజ సమాధి లేక సవికల్ప సమాధి అన్నారు. నువ్వు అనుభవిస్తున్నటువంటి సంతోషంగాని, ఆనందంగాని, దీని సంస్పర్శగాని అనుభవిస్తున్నట్లు తెలియటం లేకుండా నువ్వు అందులో ఉండిపోతావు. దానిపేరు నిర్బీజ సమాధి అన్నారు. ఈ వివరణను మనము సర్వేసర్వత్రా అంగీకరించనట్లైతే నిర్వికల్ప సమాధి వచ్చినవాడు, శరీరం చేత ఎక్కడికి కదలటం అంటూ సాధ్యం కాదు. ఎందుకంటే వాడికి శరీర స్థితి లేదు. మానసిక స్థితిలేదు. ఇంద్రియముల స్థితి లేదు. ఒకానొక అపరిమితము, అవ్యక్తము అయినటువంటి స్థితిలో ఉండిపోయినాడు. అలాంటి మార్గములు కూడ యోగాభ్యాసంలో ఉన్నాయి. గనుకనే పతంజలి యోగాభ్యాసానికి వ్యాఖ్యానం రాస్తూ అవి రాసారు సమాధి అనే మాటకి అన్నారు. కాని పతంజలి యోగాభ్యాసంలో మనకి ఇస్తున్నటువంటి సూత్రాన్ని బట్టి ఏం చెబుతున్నాడు. ''తస్యభూమిషు వినియోగః'' మీ యోగాభ్యాసమంతా ఆయా లోకవముల యందు సమన్వయం చేసుకొని వినియోగం చేసుకుంటున్నారు. అంటే మీరు ఒక శాస్త్రం చదువుకుంటున్నారు గురువుదగ్గర అనుకోండి. దానియందు దీన్ని వినియోగం చేసుకుంటే ఏమౌతుంది? సబీజ సమాధి, తప్పా! అలాగే వేదం చదువుకుంటున్నారు.

వేదం అనగా మీకేమిటో దర్శనం యివ్వాలంటే మీరు చేస్తున్నటువంటి యోగాభ్యాసాన్ని దాని మీదకి ప్రసరించండి ఏది? మీ ప్రజ్ఞా లోకము అన్నాడు చూడండి దాన్ని ప్రసరింపజేస్తే వేదమనగా యిది అనేటువంటి వెలుగు వెలుగుతూ, వేదంలో ఉన్నటువంటి శబ్దములు, అర్థములు, మంత్రములు, స్వరములు మొదలైనవన్నీ కూడ తెలుస్తాయి. అలాగే ఏదైనాసరే దాని పరమార్థము మీకు తెలుస్తూ, పరమార్థంతో పాటు దాంట్లో ఉన్నటువంటి విశేషార్థములు సకలము తెలుస్తాయి. సకలము అంటే ఏమిటి? కలములు అంటే ముక్కలు, భాగములు. భాగములతో సహా సమస్తం తెలిసేటువంటిది. యిలాగ గురువు దగ్గర శిష్యుడు బ్రహ్మచారియై యోగాభ్యాసం చేసి విద్యలు అభ్యసింపవచ్చునా? రాదా? భార్య, భర్త దగ్గర యోగాభ్యాసం అభ్యసించి దాంపత్యము చేయవచ్చునా? రాదా? చేయరాదు అన్నట్లైతే సీతారాములు, అరుంధతి - వశిష్ఠులు, అనసూయ - అత్రి మహామునులు మొదలైన వాళ్ళ జన్మలన్నీ వ్యర్థమని చెప్పాలి. ఋషులు కాదని చెప్పవలసి ఉంటుంది. మరి వాళ్ళెల్లాంటి ఋషులు, ఎంతటివాళ్ళు. అత్రిమహర్షి, అనసూయ ఆశ్రమంలో ఉంటే శ్రీరామచంద్రుడు, లక్ష్మణుని, సీతాదేవిని తీసుకొని వాళ్ళ ఆశ్రమానికి వెళ్ళాడు. ముసలివాడయిపోయి ''ఓయీ! నాయనా రామచంద్ర శిశువా'' అన్నాట్ట మహర్షి. రాముణ్ణి పట్టుకొని ఒరేయ్ పిల్లవాడా! అన్నాట్ట అంటే ఎంతవాడు. అని లోపలికి చూసి ''రారాయటందో'' రాలేదు రాలేదు, అడవిలో తిరుగుతున్నాడు, మనింటికి రాలేదు అన్నావే ఎన్నిమాట్లో వచ్చిరి, వచ్చారు చూడు అన్నాట్ట అనసూయతో. చూడు వాళ్ళల్లో నీలంగా ఉన్నాడు. ''ఇంద్ర నీల శకలాకృతి'' ఇంద్రనీలం ముక్కలాగ నీలంగా ఉన్నాడు వాడెవడనుకున్నావు ''మైథిలునల్లువాడు'' మన జనకుడి అల్లుడు అన్నాట్ట. అంటే వీడూ జనకుడున్నూ ఒక కోవలో వాళ్ళు. అత్రిమహర్షి అంటే బ్రహ్మవిద్య, యోగాభ్యాసమునకు పరమైనటువంటి స్థితిలో ఉన్నవాడు. అందుకని వీడు వాడు చిన్నప్పటినించి కలుసుకున్నవాళ్ళు కనుక వాడి అల్లుడు అంటున్నాడు. ఎంత ఋషులైతే రాముణ్ణి ఒరేయ్ అనే స్థితిలో ఉన్నారో. వాళ్ళకి దాపంత్యము చెల్లునా చెల్లదా. వాళ్ళు యోగులు అవునా? కాదా? వాళ్ళకి నిర్వికల్ప సమాధి ఉందా లేదా అనుకుంటే, మేము ఈ స్థితిలో వెళ్ళిపోతున్నాము. హాయిగా ఉంది ప్రాణానికి. సమాధులు గిమాధులు ఎందుకయ్యా కటతారు మాకు అంటారు వాళ్ళు. అందుకని మనం చెప్పుకునే సంప్రదాయంలో

లోపం ఉన్నది. శరీరము ఒకచోట పడేసి, ఈ భూమ్మీద సూర్యగ్రహం మీద, మొత్తం గ్రహాలమీద, నక్షత్రాల మీద, అన్నింటిలోకి సర్వాంతర్యామిత్వాన్ని అపరిమితత్వాన్ని పొందినటువంటి ప్రజ్ఞలో యింక శరీరం ఎక్కడికీ కదలకుండా ఉన్నటువంటి ఒకానొక స్థితిని సమాధి అని చెప్పే సంప్రదాయం ఇతర యోగాభ్యాసములలో ఉన్నది. అలా పొందినపుడు దాన్ని నిర్బీజ సమాధి అని అంటారు. దానికి ముందున్నటు వంటిది సబీజ సమాధి అంటారు. పతంజలి యోగసూత్రాలలో మనకి ఆ అర్థమే రాశారు. తర్వాత నిర్వికల్ప సమాధి పొందినవారు వారిని అనుగ్రహించారు, వీరిని అనుగ్రహించారు. యిన్నివేల శరీరాలలో పనిచేసారని తర్వాత చెబుతారు. అందుచేత యిక్కడ సబీజ సమాధి. నిర్బీజ సమాధి అంటే అందులో మనం చెప్పినటువంటి అర్థాలు కావు. బీజం అనేటువంటి మాటకి అర్థమేమిటంటే motive. Motive అనేటువంటిది బీజం అంటారు. సబీజ సమాధి అంటే motives తో ఉన్నటువంటి సమాధి కలవాళ్ళు అని అర్థం. నిర్బీజ సమాధి అంటే motives లేనటువంటి సమాధి కలవాళ్ళు అని అర్థం. అంటే యోగాభ్యాసం చేస్తూ ఎందుకు చేస్తున్నారు అనే స్థితి లేనివాళ్ళు. మొదటినుండీ రెండు రకాల వాళ్ళుంటారు. ఇది మనకి ఎందుకు పనికొస్తుంది అంటే వాళ్ళని ఒక కేటగిరిలో వేయండి. చేస్తూంటే క్రమంగా దాంట్లోకి లీనమైపోయే వాళ్ళని ఒక కేటగిరిలో పడేయండి. నన్ను I.A.S. Officer గా వేశారు. అంటే మనం ఎప్పటినుంచి కోడి పెట్టలని పడుతూ ఉండచ్చు, లేదా భద్రాచలం అడవుల్లోకి వెడితే జింకచర్మం, పులిగోళ్ళు, పావురాయిలు, తర్వాత నెమలి పిట్టల గుడ్లు పడుతూ ఉండచ్చు అని అక్కడ డ్యూటిలో చేరిన రోజునుంచే ఆ ఉద్దేశాలు ఉన్నటువంటి వాళ్ళుంటారు. ఇంకొక జాతి వాడికి ఆర్డరు పుచ్చుకుంటూనే మనం జాతికి ఎలా సహాయం చేస్తాం. పాపం ప్రజలకి ఎలా సహాయం చేయగలం. మనం చదువుకుంటూ ఉండంగ తెల్లవారిలేస్తే యింతమంది బీదవాళ్ళని చూస్తున్నాం కదా. వాళ్ళకి ఎలాగ పరిష్కారం అని ఆవేశపూరితంగా ఉండేవాళ్ళూ ఉంటారు. కోసినా వాడు వీడు అవ్వడు. వీడు వాడు అవ్వడు. అది పుట్టుకచేత ఉంటుంది. అలాగే యోగాభ్యాసం చేసినా, సబీజం నిర్బీజం కాకూడదా? తప్పకుండా అవ్వచ్చు. కాని వాడిప్రజ్ఞ కాదు. వాడి తెలివితేటలు కాదు. వాడి సామర్థ్యము కాదు. వాడి ప్రయత్నంలో లేదు. వాడి చేతిలో లేదు. దేనిమీద ఆధారపడి ఉంది? వాటన్నింటికి మించి ఉంటుంది. Something

beyond. అంటే universal consciousness (విశ్వప్రజ్ఞ)కి individual consciousness (వ్యక్తిగత ప్రజ్ఞ) మధ్యన జరిగే L.C.M మీద ఆధారపడి ఉంది. వీడి చేతిలోది కాదు, దాన్నే భగవదనుగ్రహం అంటారు. వీణ్ణి దైవం అనుగ్రహించాడు అంటారు. అది ఎవడి సాధన మీద ఆధారపడి ఉన్నటువంటి విషయం కాదు. భగవంతుడి యొక్క ప్రపంచంలో జరిగేటువంటి వాట్లల్లో ఐదువేళ్ళు చేతికి ఎలా అయితే ఉన్నాయో, అలాగ భగవంతుడు ప్రకృతిద్వారా చేయించేవి, సృష్టిలో జరిగేవి పంచకృత్యములు అంటారు.




1.సృష్టి, 2.స్థితి, 3.లయము, వీట్లల్లో కనిపించకుండా అంతర్యామిగా ఉండటాన్ని 4.తిరోధానము అంటారు. భగవంతుడు వీట్లల్లోనే ఎలికలో ఎలికగా కన్పిస్తూ, కుక్కలో కుక్కగా కన్పిస్తూ, ఆఫీసరులో ఆఫీసరుగా కన్పిస్తూ, గుమస్తాలో గుమస్తాగా కన్పిస్తూ, L.D.C. లో L.D.C. గా కన్పిస్తూ, U.D.C. లో U.D.C. గా కన్పిస్తూ ఉంటాడు. యింక దేవుడేడి? ఎక్కడున్నాడు? ఈ స్తంభంలో ఉన్నాడా? ఈ గోడలో ఉన్నాడా? అని ఎగురుతూ ఉంటారు. ప్రతీ చిల్లర హిరణ్యకశిపుడు కూడను. బొటనవ్రేలు లేకపోతే మిగిలిన నాలుగు వేళ్ళు పనిచేయవు కదా. ఒక 24 గంటలు రెండు వేళ్ళు కట్టేసుకొని మిగతా 8 వేళ్ళతో పనిచేసి చూడండి. పనిచేయలేరు. అది అనుగ్రహం. ఎందుకు కలుగుతుందో చెప్పగలిగేది కాదు. వాడెందుకు బాగుపడ్డాడు? ఎవణ్ణి అడుగుతావు? వాడెందుకు చెడిపోయాడు అంటే తార్కికంగా సమాధానం

ఉంటుంది. ఎందుకంటె చెడిపోవటం తాత్కాలికం కనుక. వాడెందుకు బాగుపడ్డాడు అన్నదానికి అనుగ్రహం. ఒక్కొక్కడికి తెల్లవారేటప్పటికి వాడి పద్ధతులన్నీ మారుతాయి. తాగుడు మానేస్తార్ట! కాఫీ మానేస్తార్ట! సిగరెట్టు మానేసారుట! ఉల్లిపాయ మానేసారుట! మానేయకపోతే కొంప మునగదు. కానీ మానేసారు అదీ అనుగ్రహం.

అసత్యం ఆడరాదని చిన్నప్పటినుంచి ఎన్ని పుస్తకాలు చదువుకున్నాం. అయినా ఏవండి! కాస్త కాఫీ పొడి ఉంటే యిస్తారా? మళ్ళీ రేపు యిస్తాను. అంటే ఉండికూడ అరెరె! ఈ సాయింత్రమే అయిపోయిందమ్మా అనటం లేదూ? ప్రక్కన కుర్రాడుండి, నిన్ననే కదమ్మా నాన్న పట్టుకొచ్చారు అంటాడు. ఛీ నోర్మూయ్! అంటుంది. అంటే అసత్యమాడామనే కదా! పిల్లవాడు పాడయిపోవడం ఎంతసేపు పడుతుంది. అక్కడ నించి మారాలి. అంటే he is infected beyond repair for life. కనుక ''తదపి బహిరఙ్గం నిర్బీజస్య'' అన్నమాటకి జాగ్రత్తగా మనం సమన్వయం చేసుకోవాలి. తొమ్మిదవ సూత్రం బాగా కష్టం. జాగ్రత్తగా అర్థం చేసుకుందాం. ఇక్కడనించి 3, 4 సూత్రాలు బాగా కష్టమైనవి. అక్కడ నించి పతంజలి సూత్రాలు మొత్తంమీద కష్టమైనవి మూడో, నాలుగో మాత్రమే.

## 9. వ్యుత్థాన నిరోధ సంస్కార యోాభిభవ ప్రాదుర్భావౌ నిరోధ లక్షణ చిత్తాన్వయో నిరోధ పరిణామః॥

వ్యుత్థాన = వ్యుత్థాన సంస్కారము; నిరోధ సంస్కారః = నిరోధ సంస్కారము, అభిభవః = ఆవిర్భావమున్నూ, ప్రాదుర్భావౌ = ప్రాదుర్భావము, నిరోధ లక్షణ = నిరోధ లక్షణము నందు, చిత్తాన్వయోః = చిత్తము పొందునట్టి అన్వయము, నిరోధ పరిణామః = నిరోధమునకు అనుకూలముగా పరిణమించుట.

**చిత్తవృత్తులు మొలుచుచుండుట ఒక విధమైన సంస్కారము. వాని నిరోధమునకు సంకల్పించుట ఇంకొక విధమైన సంస్కారము. అందు మొదటిది పనిచేయుచున్నపుడెల్ల సాధకుడు రెండవ దానిని పనిచేయించవలెను. అపుడు సంస్కారము లన్నియు నిరోధమునకు అనుకూలముగా పరిణామము చెందును.**

**వివరణ :** సంస్కారములు రెండు. వ్యుత్థాన సంస్కారము మరియు నిరోధ సంస్కారము. వ్యుత్థాన, నిరోధ సంస్కారములయొక్క 'అభిభవము, ప్రాదుర్భావము' అను రెండు స్థితులు నిరోధ లక్షణము కలిగిన చిత్తమునకు అన్వయించునది, నిరోధము యొక్క పరిణామమును కలిగించునది అవుతుంది. అష్టాంగ యోగము అభ్యాసం చేస్తూన్న వాళ్ళకి ప్రపంచంలో రెండు రకములైన వాతావరణం ఎపుడూ ఉంటూ ఉంటుంది. మనిషి కదిల్తే వాడి దగ్గర నుంచి సంకల్పముల రూపంలో వచ్చే స్థితి ఒకటిన్నీ. బయట నుంచి వాడి దగ్గరికి వచ్చే వాతావరణము యొక్క ప్రభావము ఒకటిన్నీ, ఇది ప్రతి జీవికి అదిగాని, ఇదిగాని పనిచేస్తూంటుంది. యోగాభ్యాసం లేనివాడికి పేడ, బెల్లంలాగ, రెండూ కలిసే పనిచేస్తూంటాయి. అంటే objective కొంత, subjective కొంత. అంటే లోపలి నించి బయటికి బహిర్ముఖంగా పనిచేసేటువంటి ప్రజ్ఞ. బయటనుంచి లోపలికి పనిచేసేటువంటి ప్రజ్ఞ రెండు ఉంటాయి యోగాభ్యాసం చేసినవాడికి. వాడికి చుట్టుప్రక్కల దృశ్యము ఉంటుందా? ద్రష్ట ఉంటాడు, దృశ్యము వీడికి ఉండదు కాని, అది ఉంటుందని చెప్పాడు. అది నశించదు అన్నాడు. ఎందుకని? త్రిగుణముల యొక్క ప్రభావము అది. మనకు యిచ్చినట్టి క్రమశిక్షణము పరిపూర్తి అయ్యేదాక వాతావరణము యొక్క ప్రభావము మనమీద ఉంటుంది. వాడు

మంచివాడు, వాడు పెద్దవాడు, యింకొకడు దుర్మార్గుడు మొదలైన అభిప్రాయాలు మనకెంతవరకు ఉంటాయి? మనం ఎంతమందిని ఎరుగుదుమో అన్ని రకాల అభిప్రాయాలు ఉంటాయి. అంటే అంత బరువు మన నెత్తిన ఉంటుంది. అవి ఉండవు యోగాభ్యాసం చేసిన వాడికి. యోగాభ్యాసం చేయని వాడికి యివన్నీ ఎందుకుంటాయి? రజస్తమస్సులు, వాటి సామ్యము, వాటి తత్వము, ఈ మార్గంగా జీవికి క్రమశిక్షణము యివ్వటం కోసమని ఉంటాయి. వాడు మంచివాడు కాదంటే వలవల ఏడుస్తూ ఉండటం, లోపల ఆ ఏడుపనే దావానలం; తర్వాత వాడు మంచివాడు కాదు అనేది తప్పని క్రమంగా కొన్ని జన్మలకి తెలియటమున్నూ జరుగుతుంది. అవతలవాడిని గూర్చి ఈర్ష్య పడటం, అందువల్ల మనకి రక్తపోటు పెరగడం జరుగుతుంది. చాల వేలమాట్లు ఈర్ష్య పడ్డపుడల్లా బాధ మనమే పడుతున్నాంగాని, అవతలవాడు పడటం లేదనేటువంటి చిన్న జ్ఞానోదయం ఎరిగి కొన్ని జన్మల తరువాత ఈర్ష్య మానేయటం జరుగుతుంది. దీనికోసం ఏర్పడ్డది ఈ క్రమ శిక్షణ. Nature penalises for what we do. మనం ఏమనుకుంటున్నామో, ఏం చేస్తామో వాటి ఫలితములయొక్క లేత ముదుళ్ళకే ప్రకృతి క్రమశిక్షణము యిచ్చి, మనకు కావలెనంటే శిక్షకూడ యిస్తూ ఉంటుంది. రోగమెందుకు వస్తుంది? నొప్పి ఎందుకు వస్తుంది? బాధ ఎందుకు వస్తుంది? జీవుడికి అనుభవయ్యేటట్లు తెలియచెప్పి దానికి కారణమైన పనులు మరల చెయ్యకుండా కావలసిన క్రమశిక్షణ యిస్తుంది. ఏ పనైనా చేయడమా చేయకపోవడమా అనేది చివరికి ప్రకృతి మనకే వదిలిపెట్టింది. Choice is always with us. అందుకని ఈ రెండూ కూడ యోగాభ్యాసం తెలియనటువంటి వాళ్ళకి ఆ లెవెల్‌లో ఉంటాయి. తెలిసినటువంటి వాళ్ళకింకా వీడిలో ఉన్నటువంటి శరీరము ఉందికదా? ఈ శరీరం నడవాలంటే దీనికి మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం వీడిలో భాగాలు గానే ఉన్నాయి కదా! ఆ భాగాలు నడవటానికి, దాంట్లో త్రిగుణాత్మకమైనటువంటి ప్రకృతి ఉంది కదా! కేవలం దానికోసం తప్ప వీడి ట్రయినింగ్ అయిపోయింది. ఇతరుల కోసం ఉంటాయి. వీడు గేర్లు మార్చుకుంటూ ప్రపంచంలో బండిని నడుపుతూ ఉండాలి అంతే. యోగాభ్యాసంలో పరిపూర్ణుడు, సిద్ధి పొందినటువంటివాడు ఏ స్థితిలో ఉండాలి? శ్రీకృష్ణుడు రాయబారానికి వెళ్ళక మునుపు పాండవులతో ఉన్నపుడు ఎలా ఉన్నాడు? కౌరవులతో ఉన్నపుడు ఎలా ఉన్నాడు? దుర్యోధనాదులతో

ఉన్నపుడు ఎలా ఉన్నాడు? విదురుడితో ఉన్నపుడు ఎలా ఉన్నాడు? తానెలా ఉంటాడు అనేది ఎవరికి? బ్రహ్మదేవుడికి కూడ భారతం 18 పర్వాల చదువుకున్నా తెలీదు. తానెలా ఉండాలి అనేది లేదు కనుక అయిపోయింది. యోగాభ్యాసం చేసిన వాడికి తన స్వభావం అంటూ ఉండదు. ఎదుటివాడి స్వభావానికి అద్దం పట్టేదిగా ఉంటుంది. వీడు అద్దంగా ఉంటాడు. అద్దం ముందుకి వెళ్ళి ఏమండి సార్ అంటే ఏమండి సార్ అంటుంది. ఆ మోస్తరుగా ఉంటుంది వాడి స్వభావం. ఆ సర్దుబాట్లు గురించి చెప్తున్నారిక్కడ.

''వ్యుత్థాన సంస్కారము'' వ్యుత్థానము అంటే ప్రోత్సాహము, ప్రేరణ (initiative) పొందుటకు కావలసిన సంస్కారము. మనం చేయవలసిన కర్తవ్యం ఏమిటి? వాడెవడో జ్వరం వచ్చింది అన్నాడు. ఏదో మనకి తెలిసింది ఒక మాత్ర వేసాము. అదికదా కర్తవ్యం. వాడెవడో మేడమీదనుంచి పడ్డాట్ట. తెలివి తప్పిపోయిందట, తీసుకొచ్చారు. కర్తవ్యం మనది కాదని తెలుస్తోంది, ఎంచేత? ఎముక విరిగితే కట్టు కట్టేవాళ్ళు వేరే ఉన్నారు. క్రాపు చేయించుకునేందుకు లాండ్రీకి వెళ్ళి లాభం లేదు. బట్టలు ఉతికించుకో దల్చుకున్నవాడు బార్బరు షాపుకెళ్ళి లాభం లేదు. మన కర్తవ్యం ఎంతవరకో స్పష్టంగా లోపల తెలుస్తూ ఉండేందుకు చెబుతున్నారు. కర్తవ్యం తెలియడం చాల కష్టం. ''*కిం కర్మ కిమకర్మేతి కవయోఽప్యత్ర మోహితాః*'' భగవద్గీతలో చెప్పాడు. చేయవలసిన పనేమిటి, చేయవలసినది కానిదేమిటో అనేచోట మహానుభావులు అయిన ఋషీంద్రులు, పెద్దలు కూడ చాల కంగారుపడి ఒకదానికొకటి చేసినటువంటి సమయాలు ఉంటాయి. జాగ్రత్తగా చేసుకోండి. ఏరోజు కారోజు ఇది నా పని అవునా కాదా చూసుకునే సూత్రం ఇక్కడ చెబుతున్నారు. మొదటిది వ్యుత్థాన సంస్కారము. వ్యుత్థాన సంస్కారము అంటే impulse to write and meet others. ఇతరులకు ఏమన్నా చెప్పటం కాని ఏదన్నా చేయటం కాని ఏమన్నా యివ్వటం కాని. నేను ప్రపంచానికి సేవ చేస్తాను అంటాను. ఏం చేస్తారు? ఏమన్నా చేస్తాను. ఏమన్నా చేయకండి. ఏదో మీకు చాతనయినది చేయండి. అది వ్యుత్థాన సంస్కారము. అంటే మీకు వచ్చేది ఎంత? మీ ఎదురుగుండా వచ్చిన దృశ్యమెంత? వాడికేం కావాలి? నీ దగ్గర ఏం ఉన్నది? సాధ్యా సాధ్యము లేమి? ఇద్దరి మధ్య వాటికి సంబంధించిన సంస్కారాన్ని వ్యుత్థాన సంస్కారమంటారు. అంటే మనస్సు,

ఇంద్రియములు బయటికి ప్రసరించి పనిచేస్తున్నటువంటి సంస్కారము వ్యుత్థాన సంస్కారము. రెండవది నిరోధ సంస్కారము. దానికి వ్యతిరేకము. ఎలా అయినా మా అబ్బాయికి పచ్చకామెర్లు తగ్గిస్తే 500 రూపాయలు ఇస్తానన్నారనుకోండి. అయిదు వందలు అవసరమా? హోమియోపతి మందుకి ఎంత అవుతుంది? పది నయాపైసలు. కనుక ఐదు వందల రూపాయలు కావాలో, అక్కర్లేదో తేల్చుకోవాలి. కావాలంటే యోగాభ్యాసం జోలికిరాకు. తప్పా? తప్పేమీ లేదుగాని యోగాభ్యాసానికీ, దానికి సామీప్యం (co-existence) లేదు. శుభ్రంగా పుచ్చుకో. భార్యా పిల్లలకి కావాల్సినవన్నీ కొనిపెట్టు. యోగాభ్యాసం మాట ఈ జన్మకెత్తకు. ఇది నిరోధ సంస్కారము అంటే అర్థం. చిత్తవృత్తి నిరోధము అన్నాడే అది జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. మొదటిది వ్యుత్థాన సంస్కారము. వ్యుత్థానము అంటే మాటి మాటికి శరీరమనే కుర్చీలోంచి నువ్వు లేస్తూంటే ఎందుకు లేస్తున్నావో గుర్తుపెట్టుకో మన్నాడం. వారికేదో చేద్దామండి, వీరికేదో చేద్దామండి, వారే మనుకుంటున్నారో, అనుకుంటూండడం. వీరేమనుకుంటున్నారో, మనని గురించి ఏమనుకుంటున్నారో ఎందుకు అనుకుంటారు. వారికేం పని పట్టింది. మనకున్నటువంటి దుర్బుద్ధి తప్ప, వాడు మనని గురించి తిట్టుకుంటున్నా డనుకుంటే వాడంత తక్కువ వాడని (mean fellow) మనం అనుకుంటున్నామని అర్థం. మొట్టమొదటిగా దాన్ని ప్రతిపాదించుకోవడం మనలో ఉన్న నీచత్వం తప్ప, వాడు మనని గురించి తక్కువ అంచనా వేస్తున్నాడనుకోవడం తప్పు. ఒకవేళ వేసినట్లైతే అది వాడికి సంబంధించిన నీచత్వము, మనకి సంబంధించినది కాదు. అది పోనటువంటి వాడు యోగాభ్యాసం దాకా ఆ జన్మకి రాకూడదు. అంటే negetive thinking. అది వ్యాధి లక్షణము. అవన్నీ పోయిన తర్వాతనే యోగాభ్యాసం, వేదాంతం మొదలైనటు వంటివి ఏవైనా యోగాభ్యాసం చేసేవాడు వాడికపుడు ఏది కర్తవ్యమో అది చేస్తూ ఉంటాడు. అంతే. ''ఏం నాయనా! భోం చేస్తావా అని అడిగితే చేయను అంటే ఊరుకుంటాడు. అంటే నిజంగా చేయనని వాడి అర్థం. వ్యుత్థానము అంటే కుర్చీలోంచి లేవటం. వ్యుత్థాన సంస్కారము అంటే అర్థం. లేచి అవతలివాణ్ణి కలవటంలో చేసే సంస్కారము. వాడికేదన్నా కావలసినది చెప్పటమో, వాడికేదన్నా కావలసినది ఇవ్వటమో, కావలసిన

ఉపకారము చేయటమో, భోజనం పెట్టటమో, ఏదన్నా చేయటం, దానిపేరు వ్యుత్థాన సంస్కారము అంటారు. రెండవది నిరోధ సంస్కారము. అంటే చిత్తవృత్తి నిరోధానికి నువ్వు చేసుకునే సంస్కారము. అవతలి వాడేదన్నా నిజంగా అన్నాడనుకో, నీకు సంబంధించినది కాదు కదా! అక్కడ నిరోధ సంస్కారము ఉండాలి. ఒకడు మన గురించి ఏమనుకుంటున్నాడు అనే ఆలోచన జిడ్డు. ఆ జిడ్డు ఒదుల్చుకోవాలి. ఒక రెండు సంవత్సరాలు పోయిన తర్వాత కూడ మనం తప్పు చేసాం. తప్పు చేసాం. అంటే ఇక రైటే చేయదల్చుకోలేదు అని అర్థం. అంటే జిడ్డు వదలదల్చుకోలేదు అని అర్థం. ''న ఆత్మనవ మన్యేత పూర్వాభి రహముచ్యతి'' ఆయుర్వేద శాస్త్రంలో చెప్పాడు. నువ్వు ఇదివరకు చేసినటువంటి బుద్ధి తక్కువ పనులన్నీ తలచుకొని నిన్ను నువ్వు అవమానం చేసుకొని ఆత్మహత్య చేసుకోకు. పురుగులు పడిపోతావు అన్నాడు. ప్రశస్తమైనది ఇపుడేం చేయాలో చూడు. నిన్న ఏం చేశాం, మొన్న ఏం చేశాం అనే జిడ్డు ఎందుకు? కనుక నిరోధ సంస్కారం చాల గట్టిది కావాలి ఇక్కడ. చిత్తవృత్తి నిరోధంలో చేసే సంస్కారం నిరోధ సంస్కారము. యోగాభ్యాసంలో అష్టాంగ యోగం దగ్గరికి వచ్చినటువంటి వాళ్ళు, జిడ్డు ఉంటే ఈ జన్మకి ఎత్తేయాలి. లేకపోతే వెళ్ళడం కష్టం. ఈ సూత్రం అందుకనే చాల కష్టమనిపిస్తుంది, ఇదివరకు చెప్పిన మిగతా అన్నింటికంటె. అంటే ఈశ్వర ప్రణిధానంతో వస్తుంది. తరువాత 'తస్యవాచకః ప్రణవః' అనే దానితో చేయచ్చు. 'ఓం' అని ఉచ్చరిస్తూ, వింటూ ఇవన్నీ చేయచ్చు కాని ఈ జిడ్డు ఉన్నటువంటి వాళ్ళు పది సంవత్సరాలో, ఇరవై సంవత్సరాలో, ముప్ఫై సంవత్సరాలో చేసి వదిలేస్తారు. అప్పుడు చిన్నతనంలో లాగే బుద్ధిహీనులల్లే అయిపోతారు. ఏమైంది ఈ 30 సంవత్సరాలు ప్రోగ్రెస్సు అంటే, తన చుట్టూ గూడు (shell) కట్టుకొని అభ్యాసం చేసాడు కనుక, కపటమైనటువంటి అభ్యాసము కనుక ప్రోగ్రెస్సు రాలేదు. పట్టుపురుగు తనచుట్టూ అల్లుకొని చివరికి అందులో యిరుక్కుపోతుంది. అంటే విషయం తెలుసుకుందుకు పనికివచ్చింది కాని సాధనకు పనికి రాలేదు. తనను తాను మోసం చేసుకున్నాడు కనుక. అందుకని నిరోధ సంస్కారము జాగ్రత్తగా చూసుకోండి. లేకపోతే మాత్రం పట్టుపురుగు యిరుక్కుపోయినట్టు యిరుక్కుపోయి నశించిపోతారు. తన knowledge లో తాను చస్తాడు

యోగాభ్యాసంలో జిడ్డు ఉన్నట్లైతే. అంటే associations అనేటువంటి వాటిల్లో ఇరుక్కొని పడిపోతారు అన్నాడు. మీ ఆశయములు, ఆదర్శములు, మీ నమ్మకములు, మీ తళుకులు యిట్లాంటి వాట్లలో చిక్కుకొని, ఎలా అయితే ప్రమిదతో నూనె దీపం పెడితే అందులో క్రిమికీటకాదులు వచ్చి పడి చచ్చిపోతాయో, అలాగ మన అభిప్రాయములలో పడి చదువుతున్న పుస్తకం అంతా. దీంతోనే చదువుకుంటాము. సాధన ఉండదు. కనుక యిక్కడిదాక మీరు చదువుకుంటే చదవుకున్నారు. యోగాభ్యాసంలో విభూతి పాదంలోకి వచ్చినపుడు ఈ 9వ సూత్రం దగ్గరనించి ఒక్కటి గుర్తుంచుకోండి. అష్టాంగములు అభ్యసించితే మాత్రం, అభ్యసించిన తర్వాత ధారణ, ధ్యాన, సమాధి స్థితులు వచ్చినటువంటి వారికి చిత్తవృత్తి నిరోధం తప్పకుండా వస్తుంది. పెద్ద బ్రహ్మవిద్య ఏం కాదు. అభ్యాసము, వైరాగ్యము కలుగుతాయి. మానవులైన మనకి కలగటానికే తప్పని సరిగా యిచ్చారు గాని ఎవరో కారణజన్ములు, కొమ్ములు మొలిచిన వాళ్ళు, గిట్టలు మొలిచిన వాళ్ళకోసం యివ్వలేదు. మనకోసమే ఇచ్చారు. తప్పనిసరిగా యివన్నీ జరుగుతాయి. ఈ సాధనలో. కాని ఈ సాధన జరిగి ఎనిమిది అంగములు స్థిరత్వము పొంది, సంయమము అనేటువంటి స్థితిలో మీరు అడుగుపెడుతున్న క్షణంలో జిడ్డు ఉన్నదో నశించినదో చూసుకోవాలి. ''సంశయాత్మ వినశ్యతి'' భగవద్గీతలో చెప్పాడు. మన మనస్సు చాల ప్రశస్తమైనది. జాగ్రత్తగా ధారణ, ధ్యాన, సమాధులు అభ్యాసం చేసి, అటుపైన ముందుకు నేను చెప్పబోయే మార్గంలో వెడుతూ ఉండంగ, ఈ వ్యుత్థాన సంస్కారము, నిరోధ సంస్కారము అనేచోట అతి జాగరూకతతో శ్రద్ధ వహించండి అన్నాడు పతంజలి. చమురు, జిడ్డు దానికి అంటనివ్వకండి. అంటే తిరస్కరించటం రావాలి. ప్రాదుర్భావము అంటే పుట్టటము, ఉద్భవించటం, వెలుపలికి రావటం, ప్రసాదించటం, మొలకరావటం, ఈ వ్యుత్థానంవల్ల అభిభవములు కలుగుతాయి. జాగ్రత్త! నువ్వు ఈ శరీరమనే కుర్చీలోంచి లేచి అటు చూద్దాం, ఇటు చూద్దాం, ఇది చేద్దాం, అది చేద్దాం అనుకున్నపుడు చేయవలసినవి చేయి. చేయదలచినవి కొట్టేసేయ్. దానివల్ల 'అభిభవము' అంటే తిరస్కరింపబడుట జరుగుతుంది. అది చాతనయినంత నేర్చుకో. ఎంతో విలువైనవి అని అనుకున్నటు వంటివి, చేద్దామని అనుకున్నటు వంటివి, ఎందుకు పనికిరానివి మనకి అక్కర్లేనివిగా

తెలుస్తాయి. ఏం భయంలేదు. చెయ్యలేదని నలుగురికీ తెలిసింది అది అనుకోకు. ౹లిసినా ఫర్వాలేదు. మన యిష్టమే అని చెప్పు. నలుగురూ అనుకుంటారు ాబట్టి బ్రతికి ఉన్ననాళ్ళు దాని భారం నెత్తిన మోస్తూ కపటంగా బ్రతకటం న్నా, రెండేళ్ళో మూడేళ్ళో పొరపాటు పడ్డామని నలుగురికీ చెప్పేస్తే ఆరోజునించి సరైన పద్ధతిలో జరిగితే యోగాభ్యాసానికి పనికి వస్తాం. లేకపోతే వచ్చే జన్మకి కూడ లాభంలేదు. అంతే. ఏదో ఒక టైములో ప్రతి వాడికి తగుల్తాయి అలాంటివి. అభిభవము అంటే వాట్లని తీసి అవతల పారేయమన్నాడు. అంటే surgical operation లాగ తీసుకోమన్నాడు. అభిభవము అంటే తొలగించి పారేయటం, ఎత్తి పారేయటం, తిరస్కరించి పారేయటం తర్వాత ప్రాదుర్భావము. అంటే దీనివల్ల నిరోధము. చిత్తవృత్తి నిరోధము వల్ల ఏం వస్తాయి? ప్రాదుర్భావము. లోపలినుంచి నీ వెలుగులు, నీ ప్రజ్ఞలు కూడ ఆ లోకంగా ప్రాదుర్భవించి యివతలికి వస్తాయి. కావలసిన పనులుగా వస్తాయి. చిత్తవృత్తులు ఆగిపోతాయి. నిరోధం అయిపోతాయి. దైవవృత్తి నిలుస్తుంది. కనుక మొదటి దానివల్ల అభిభవమున్నూ, అంటే తిరస్కరించుట, రెండవ దానివల్ల ప్రాదుర్భావము కావలసినవి నేర్చుకొనుట వస్తుంది. వీటితో ''నిరోధ లక్షణ చిత్త అన్వయః'' ఈరెండు జరిగితే ఏం జరుగుతుందో తెలుసునా? మీ మనస్సులో నిరోధము అనేటువంటి లక్షణాన్ని అంటించుకున్నటు వంటి చిత్తము ఉన్నదే, దానియొక్క అన్వయము అంటే క్రమము వస్తుంది. ఎవరైతే మహానుభావులు, పెద్దలు మనకి మార్గం చూపించిన పూర్వ తరాల్లో వెళ్ళినటువంటివారు, వాళ్ళు ఎలా బోధించారో, ఎలా పనులు చేసారో, ఎలా నడిచారో, ఆ మార్గాన నువ్వు వెళ్ళటానికి కావలసిన 'చిత్తాన్వయం' వస్తుంది. నీ చిత్తము వృత్తి నిరోధము జరిగిన తర్వాత క్రమాన్వయంలోకి వస్తుంది. ఋషుల మార్గంలోకి వెడుతుంది. తర్వాత యింకా ఏం తెలుస్తుంది? ''నిరోధ పరిణామః'' చిత్తవృత్తి నిరోధంలో క్రమంగా ఆనాటికి ఆనాటికిన్నీ పరిణాము చెందుట అంటే ఏమిటో తెలుస్తుంది అన్నాడు. చిత్తముయొక్క వృత్తి నిరోధంలో మొదటి రోజున చిత్తవృత్తి నిరోధం తప్ప తెలిసేది ఏమి లేదు. క్రమంగా పదేళ్ళు అయ్యేటప్పటికి చిత్తవృత్తి నిరోధం అంటే ఏమిటో మీకు కొంత తెలుస్తుంది. ఇంకో పదేళ్ళు అయ్యేటప్పటికి ఇంకొంత తెలుస్తుంది జిడ్డు లేకుండా ఉంటే. మన జిడ్డులోంచి దిగుతూ ఉంటాయి. ఇపుడు మనం చేస్తున్నవన్నీ. ఇక్కడ ఇది చెప్పటం

కోసం ఈ సూత్రం చెప్పాడు.

వ్యుత్థానం అంటే ఏమిటో కొంత చెప్పుకున్నాం, నిరోధం అంటే ఏమిటో కొంత చెప్పుకున్నాం. ఈ రెండింటికీ సంబంధించిన సంస్కారములు అంటే చెప్పుకున్నాం. 1. వ్యుత్థాన సంస్కారము, 2. నిరోధ సంస్కారము. తర్వాత దీనివలన అభిభవము అనగా తిరస్కరించుట. రెండవదాని వలన ప్రాదుర్భావము. ఇవి చెప్పుకున్నాం. ఈ రెండూ కలుగుతాయి. కలిగి నిరోధ లక్షణమునందు చిత్తము పొందునట్టి అన్వయము తెలియజేస్తాయి అని చెప్పుకున్నాం. తర్వాత నిరోధము నందు జరుగునట్టి నిరోధ పరిణామము. లోకరీతులలో మనం ఎరిగున్నటువంటి పద్ధతులలో కూడ ఈ సూత్రాన్ని ఒక్కమాటు అర్థం చేసుకుంటానికి ప్రయత్నం చేద్దాం.

మనస్సుకి రెండు స్థితులున్నాయి. కేంద్రం నుండి పరిధికి పనిచేసేది ఒక స్థితి. వ్యుత్థానము. దీన్ని objective activity అంటారు. మన నుండి బాహ్య ప్రపంచము వైపునకు పనిచేసేది. అది పనిచేస్తూ ఉంటుంది యోగాభ్యాసం చేయనివాడికి, చిత్తవృత్తి నిరోధం అభ్యాసం చేయనివాడికి. నిరోధ సంస్కారము పనిచేస్తూ ఉంటుంది కాని చిత్తవృత్తి కాదు అక్కడ పనిచేసేది. ఇంద్రియములు మనస్సుని నిరోధం చేసే సంస్కారం ఒక్కటే ఉంటుంది. యోగాభ్యాసం చేయనటువంటి సామాన్యుడికి వేదాంతం చదువుకున్నా, ఏం చదువుకున్నా కూడ రెండు సంస్కారాలు ఉంటాయి. యోగాభ్యాసం చేసేవాడిలోను ఉంటాయి. యోగసిద్ధుడిలోను ఉంటాయి. యోగీశ్వరుడిలోను ఉంటాయి. యోగీశ్వరేశ్వరుడిలోను ఉంటాయి. అంటే ఒక్కొక్కడిలో ఒక్కొక్కలా వుంటాయి. అంతేగాని ఉండకుండా పోయేవి కావు ఎవడిలోను కూడ. మామూలుగా సంసార బద్ధుడైన జీవులలో objective impulse, subjective impulse గా ఉంటాయి. అంటే బాహ్య ప్రపంచం మీద మనం పనిచేస్తున్నటువంటిదిన్నీ ఈ రెండూ కలిసి యుద్ధం చేస్తూ కొట్టుకుంటూ ఉంటాయి వ్యుత్థాన సంస్కారంగాను, నిరోధ సంస్కారంగాను. దేన్ని నిరోధిస్తుంది? చిత్తవృత్తిని కాదు, అభ్యాసం లేనివాడికి చిత్తాన్ని నిరోధిస్తుంది. ఎందుకని? ఒక తెన్నున పోదు. ఒక తీరున పోదాయెను. చుట్టుప్రక్కల నించి చిత్తనిరోధం. అంటే అందులో ఒకటి వినపడకుండా ఇంకోటి చేస్తూ ఉంటుంది. అంటే చాల తేలికగా చాల డబ్బు సంపాదించిన

ఆయన పిల్లలందరికీ ఒక్కొక్కళ్ళకి ఒక్కొక్క ట్రాన్సిస్టర్ కొనిపెట్టాట్ట. తర్వాత ఎవరి టేపురికార్డరు, ఎవరి కాసెట్లు వాళ్ళకి కొనిపెట్టాడు. ఎవడికి కావలసినటువంటి పుస్తకాలు, వారపత్రికలు కొనిపెట్టాడు. వీళ్ళు ఒకే గదిలో కూర్చుని అందరూ ఏం చేస్తున్నార్ట? ఎవడికి కావలసిన ప్రోగ్రాం వాడు ట్రాన్సిస్టర్‌లో వేసుకున్నార్ట పెద్దగా. ఎందుకంటే అవతలివాడు చేసాడని వాడు. వాడు చేసాడని వీడు. కనుక ట్రాన్సిస్టర్‌లో వచ్చే ప్రోగ్రాంలలో ఏ ప్రోగ్రాం ఎవడికి వినపడుతుంది గదిలో ఉన్నవాడికి. ఏ ప్రోగ్రాం ఎవడికీ వినపడకుండా అందరూ కూడ జాగరూకతగా ఒకర్ని ఒకరు రక్షించుకుంటున్నారు. ఇది జరిగేది. చిత్తవృత్తి నిరోధం జరగనటువంటి వాళ్ళకి బయట ప్రపంచం నించి ఏం నిరోధం జరుగుతుంది? చిత్తనిరోధం జరుగుతుంది. ఒక హాలులో సైలెన్సు అని రాసారు అనుకోండి. నిశ్శబ్దంగా ఉండండి. కొంతసేపు అయిన తర్వాత ఎవరో మాట్లాడారు. నిశ్శబ్దంగా ఉండండి అంటాడొకడు. మీరేమిటండి మధ్య అంటాడు. మూడోవాడు నిశ్శబ్దంగా ఉండమంటే ఏమిటండీ ఆగండి అంటాడు. ఒక రెండు నిమిషాలు అయ్యేటప్పటికి హాలులో వాళ్ళందరూ కూడ ఆగండి. నిశ్శబ్దంగా ఉండండి. ఆగండి నిశ్శబ్దంగా ఉండండి అని అరుస్తూంటే ఎవరికి ఏమీ వినిపించదు. నిశ్శబ్దంగా ఉండాలని కూడ తెలియటం పోతుంది. వినిపిస్తే కదా ఆ స్థితిలోకి వస్తుంది ఈ నిరోధం. అభ్యాసం చేస్తున్నకొద్దీ ఎలా పొందుతాడు. ముందర తానేం చేయాలో ప్రపంచంలో అది చేద్దాం ఇది చేద్దాం అనే తాపత్రయం కోసం అవి ఇవి పొందుతూంటే రజోగుణంలోంచి తమోగుణంలోకి, తమోగుణం నించి రజోగుణంలోకి పెండ్యులం కొడుతూ ఉంటుంది జన్మ జన్మలకిన్నీ. అంచేత ఇక్కడ తిరుగుతూన్నపుడు మనం చేసే పనులు చేయవలసినవి ఉండవు. చేయదలచినవి ఉంటాయి. అంటే మనం చేద్దాం అనుకున్నవి ఉంటాయి. మన యిష్టాయిష్టాల్ని బట్టి, మన సరదాని బట్టి ఎక్కడో వేలు పెట్టటం అది అక్కడ ఇరుక్కుపోవటం. యుక్తాయుక్త పరిజ్ఞానము ఉండదు, మనం చేసేటువంటి పనులలో రజస్తమస్సులలో చిత్తము పనిచేస్తున్నప్పుడు మనకేం కావాలో తప్ప మనం ఏం చేయాలో వాటి దగ్గరికి వెళ్ళం. అంటే కార్యం కర్మ దాని దగ్గరికి రాలేం. కార్యం, కర్మ దగ్గరికి రావటానికి పెద్ద పెద్దవాళ్ళు చాల final perfection వచ్చిన తర్వాత కూడ

బోసికినటువంటి చోట్లు ఉన్నాయంటాడు భగవద్గీతలో. వారెవరో చాల మంచివారుటండి. నేను కూడ వెళ్ళొస్తాను ఒకమాటు అని ఆవిడంటే. ఆ మాత్రం సంకీర్తనం మనింట్లో చేసుకోవచ్చులే. వెళ్ళక్కర్లేదు అంటాడు. అంటే కావలసినవి కూడ ఒక్కొక్కపుడు అహంకార మమకారాదుల చేత మానేస్తూ ఉంటాం. ఆ మాత్రం సంకీర్తనం రోజూ సాయింత్రం మనింట్లో చేసుకోవటం లేదా? ఎరగరా మన సంకీర్తనం మొహం, ఎరగనట్లు చచ్చిపోతారేమిటి? టైమెక్కడ చచ్చింది. సంకీర్తనం అని గుళ్ళోకి అక్కడికి యిక్కడికి వెళ్ళటమేమిటి? గుడికి వెడితేనే సంకీర్తనమా? అని అడుగుతాడు. కాని మనలో మాట. వెళ్ళకపోతేనే సంకీర్తనమా? అంటే మన హిందువులు వేసే ప్రశ్నలు చాల ఉన్నాయి. వాడు యింకో మతంలోకి మారిపోయి పుటం పెటితే తప్ప ఆ ప్రశ్నలు పోవు. అలాగే బొట్టు పెట్టుకుంటేనే దైవభక్తి ఉన్నట్లా? రోజూ స్నానం చేస్తేనే శుచి ఉన్నట్లా? ఇలాంటి ప్రశ్నలు వేసేటువంటి ఛండాలుడు ప్రపంచంలో ఎవడైనా ఉన్నాడంటే ఒక్క హిందువే. వాడు మానటమైనా ఎపుడు మానతాడు? ఇంకో మతంలోకి మారిపొయ్యాకే. ఈ లోపల మానడు. ఆ పైన యిలాంటి పిచ్చి ప్రశ్నలు వేయడు. ఊరికే అన్నది కాదు. మీరు గమనించండి. ప్రపంచమంతా తిరిగాను. చాల మతాల వాళ్ళని చూసాను. ఏ మతంలోను ఇలాంటి చిత్రమైన జంతువుల్లేరు. మనలాంటి వాళ్ళు, చాల వయస్సు మీరినటువంటి వాళ్ళు అడిగారు, ఏమండి బొట్టు పెట్టుకుంటేనే దేవుణ్ణి ఆరాధించినట్లా అని, అదేం కాదుగాని పెట్టుకోకపోతేనే ఆరాధించినట్లా? కనుక అలాంటివన్నీ చేస్తాం ఈ రెండో దాంట్లో. అంటే negative retirement (నిరోధ సంస్కారము). ఇది negative progression (వ్యుత్థాన సంస్కారము). దీనివల్ల అభిభవము అంటే తిరస్కరించుట అనే activity జరుగుతుంది. చేయవలసిన పనులవల్ల లోపల చిత్తము యొక్క వృత్తి నిరోధానికి కావలసినటువంటి ప్రయత్నము ప్రాదుర్భావము అవుతుంది. కాని ఈ లోపల అహంకారం, మమకారం మొదలైనవన్నీ పైకి వస్తాయి. అక్కడ దేవాలయం బాగున్నది వెళదాం అంటే దేవాలయానికే వెళ్ళాలా? అన్పిస్తుంది. వారెవరో కట్టించారుట చూద్దాం అంటే, వారెవరో కట్టిస్తే మనం చూడటం ఎందుకు? అక్కర్లేదులే అన్పిస్తుంది. ఇట్లాంటివన్నీ వస్తాయి. అలాగే కృష్ణమాచార్యులకి పతంజలి యోగసూత్రాలలో ఏదన్నా సందేహం

వచ్చిందనుకోండి! శాస్త్రిగారి దగ్గరో, రావుగారి దగ్గరో సమాధానం ఉందనుకోండి వెడతాడా? పుటం పెట్టినా వెళ్ళడు. అక్కడ కూడ నిరోధం వస్తుంది. Positive things లో కూడ నిరోధం వస్తుంది. చిత్తవృత్తి నిరోధానికి ముందు అక్కర్లేనివి బిరడా కొట్టటం చాల వస్తాయి. కృష్ణమాచార్యులు రావుగారి దగ్గరికి ఏమన్నా తెలుసుకుంటానికి వెళ్ళాలంటే ఎన్ని వేషాలు వెయ్యాల్సి వస్తుందో తెలుసునా? మీరెవరూ చూస్తూ ఉండంగ వెళ్ళకూడదు. మరి ఎట్లాగండి? అదేమిటండి మాస్టారూ మీకు తెలియనిది ఆయనని అడగటానికి వెళ్ళారా? అంటే అబ్బే అంటాడు. ఆ ప్రక్కనున్న వాళ్ళు కూడ సాయం చేసేవాళ్ళే ఉంటారు, వారిని అనుగ్రహించడానికి వెళ్ళారు. 'లోకానుగ్రహ బుద్ధ్యా' వెళ్ళారు. అని పదిమాట్లు వాడు సతాయించేటప్పటికి నిజమనిపించదూ? ఇవన్నీ ఎన్ని లక్షలు పోతే నిరోధము అనేటువంటిది ప్రాదుర్భావము కావాలి. చిత్తవృత్తి నిరోధానికి కావల్సిన ప్రాదుర్భావము అంటే ఉద్భవించటం అనేటువంటిది. Positive type of with drawal. బుద్ధుడు చెప్పాడు. withdrawal లోకి వెళ్ళి తర్వాత చెడిపోయిన వాణ్ణి జన్మ జన్మలకి ఎవరు బాగుపరచలేరు. అంతకు ముందున్నటువంటి దాంట్లో చెడిపోయినటువంటి వాడు ఏదో ఒక మార్గంలో భ్రష్టుడై వాడంతట వాడే బాగుపడతాడు అన్నాడు. ఉమనో, వైనో అంతకంటే ఎక్కువపోడు. మహా అయితే శరీరం కుళ్ళుతుంది. ఆ జన్మలో చస్తాడు. మళ్ళీ శరీరం వస్తుంది. అజామీళుడు, నిగమశర్మ మొదలైన కథలు లేవూ. అంతకంటే వాళ్ళు చచ్చేది ఏం లేదన్నాడు. శరీరం పాడవుతుంది, కుళ్ళిపోతాడు, వెధవకంపు కొడతాడు, నలుగురూ చూడకుండా దూరాన్న పారేస్తారు, ప్రాయశ్చిత్తం అయిపోతుంది. క్రొత్త శరీరం దగ్గరికి వచ్చేటప్పటికి మళ్ళీ మామూలుగానే వస్తాడు. అందులో చెడిపోయిందేం లేదు. మనస్సులో గాని, యింద్రియాల్లోగాని, చిత్తంలో గాని, బుద్ధిలోగాని చెడిపోయినవేం లేవు. కాని negative side అంటే with drawal లోపలికి తన్ను తాను వంచుకొని అంతర్ముఖుడు అవుతూండంగ చెడిపోయినటువంటి వాడు కొన్నివేల జన్మలు కూడ అలాగే డిప్ప (shell) కట్టేసి ఉంటాడని చెప్పాడు గౌతమ బుద్ధుడు. చాల జాగ్రత్తగా ఉండాలి. అంటే ఈ ప్రపంచంతో నాకెందుకు? వారెవరో ఏదో చెబుతున్నారుట, ఇంక బాగుపడరు, అయిపోయింది. లేదా మిమ్మల్ని వారెవరో చెప్పమంటురన్నారుట. ఏదో. వాడా! నన్నా! ''ఊహు'' అని మళ్ళీ పుస్తకం చదువుకుంటూ

కూర్చుంటాడు యింట్లో. అంటే ఏమిటి వీళ్ళందరికీ మనం చెబితే బోధపడేది ఏమిటి? అని. అది బయటికి చెప్పడు గాని ఉన్న విషయం అదీ లోపల. అంచేత ఏం చేస్తున్నాడు? ''జీర్ణమంగే సుభాషితం'' లోపల అలాగ ఆ బ్రహ్మసూత్రాలు, విష్ణు సూత్రాలు యివన్నీ పుస్తకాలు పెట్టుకొని పగలు, రాత్రి అలాగ చదువుకుంటూ కూర్చుంటాడు. ఆ టైముకి భార్య ఏదో వడ్డిస్తే సరేలే! ఏడిసావులే! అన్నట్లు భోంచేస్తాడు. ఇది పెద్ద అక్కర్లేదు. నువ్వు ఏడుస్తావు కాబట్టి భోంచేస్తున్నాను అన్నట్టు. ఎవరన్నా దయా దాక్షిణ్యం కావలసినవాళ్ళు, అంటే జబ్బుతో ఉన్నటువంటి వాళ్ళు బీద బిక్కీ మొదలైన వాళ్ళు వస్తే, అవును పూర్వకర్మ వశాత్తు ఎవరికి రావలసినది వాళ్ళకి వస్తుంది, మనమేం చేస్తాం. అంతే అంటాడు. అంటే ఎవరన్నా బండి క్రిందపడ్డా చూస్తూంటాడు. అంటే వాడికి క్షణంలో బండి క్రింద పడవలసినటువంటి యోగము కలదు. అది ఆ సిద్ధాంతము. ఈ రకంగా వెళ్ళిపోతారు సుమా. ఈ వెళ్ళిపోయినటువంటి వాళ్ళు కొన్నివేల జన్మలు అలాగే shell కట్టుకొని negativism లో ఉండిపోతారు అన్నాడు గౌతమ బుద్ధుడు. పగవాడికికూడ వద్దు. అలాంటి స్థితి అన్నాడు. ఇది వైరాగ్యమనేటువంటి అబద్ధాల పేరుతో పిలవబడుతుంది జాగ్రత్త అన్నాడు. ఇది వైరాగ్యం కాదు. కనుక హృదయంలో కన్ను ముందు రావాలి. దాంతో చూడటం మొదలు పెట్టాలి. ఈ కళ్ళతో చూస్తూ వైరాగ్యం అభ్యసించి ఏమీ లాభం లేదు. కనుక ప్రపంచంలో ఉన్నటువంటి ఈ యోగాభ్యాసం మొదలైనవన్నీ కూడ రెండు రకాలని చెప్పాడు గౌతమ బుద్ధుడు. చదువుకునేది చాక్షుషమగు విద్య. అంటే ఈ కళ్ళతో చదువుకొని, చెవులతో విని, బుద్ధితో అర్థం చేసుకొనేది. వీడికీ పనికిరాదు, యింకోడికీ పనికిరాదు. అదీకాక ఒక మార్పువచ్చి, హృదయంతో చదివి, హృదయంతో విని, హృదయంతో అర్థం చేసుకొనే స్థితి వస్తుంది. అప్పటినుంచి వీడు ఒక్క అక్షరం నేర్చుకున్నా అందరికీ పనికి వస్తుంది, వీడికీ పనికి వస్తుంది. కనుక చాక్షుషమైన విద్యలు, హార్ద్రములైన విద్యలు, "The doctrine of the Eye" Blavetsky translate చేసింది, "The doctrine of the Heart" అనే పేరుతో. అంటే కంటికి సంబంధించినటువంటి జ్ఞానము అన్నింటికి పనికి వచ్చేది. దాన్ని గురించి చెబుతూనే, హృదయానికి పనికివచ్చే జ్ఞానంలోకి నువ్వు రాదల్చుకున్నట్లైతే, నీ దగ్గర ఉన్నటువంటివి, ఇపుడు ఏవైతే వేటిమీద అయితే ఆశలు పెట్టుకొని ఉన్నావో, అవన్నీ పోతాయి

ముందు అన్నాడు. అంటే నలుగురు నువ్వు పెద్దవాడివి అని అనుకుంటం. టప్మని ఎగిరిపోతుంది అన్నాడు. అలాగే నీకేదో సంఘంలో ఒక హోదా రావచ్చు. నువ్వు పదిమందికి ఉపకారం చేస్తున్నందువల్ల ఎక్కడికైనా ఏదన్నా కావల్సివస్తే రిక్షా గిక్షా పిలవటం, ఆ రిక్షా డబ్బులు మనం ఎవరితోనో మాట్లాడుతున్నట్లు నటిస్తే వాళ్ళే యిచ్చేస్తారుగా. మరి ఇవన్నీ జరుగుతాయా? జరగవా? ఖచ్చితంగా జరుగుతాయి. రైల్వేస్టేషన్కి ఆటో మాట్లాడండి ఊరెళ్ళాలి నాయనా అని అడిగితే మాట్లాడరూ! మీరు నాతో కూడ మాట్లాడుతూ రండి అంటే రారు. వచ్చాక ఆటో దిగి నవ్వుతూ ఎల్లుండి వస్తాను ఊరినించి అని నేనంటే మీరు ఆటో డబ్బులు యివ్వరూ. డబ్బులున్నా లేకపోయినా దేవుడా అంటూ యిస్తారు. కనుక దాంట్లోకి వెళ్ళిపోకుండా చూసుకోవాలి.

కనుక చిత్తవృత్తి నిరోధము అభ్యాసం కాకముందు, ఈ రెండు జాగ్రత్తలు తీసుకున్నట్లైతే నిరోధ లక్షణ చిత్తము యొక్క అన్వయము తెలుస్తుంది అంటే నిరోధక్షణం అంటే చిత్తవృత్తి నిరోధం యొక్క క్షణం application. Point of application క్షణం అంటే, కనుక దానియొక్క ''చిత్తాన్వయః'' ఆ క్షణంలో చిత్తం యొక్క అన్వయం తెలుస్తుంది. ప్రపంచంలో ఉన్న విషయాలకి చిత్తవృత్తి నిరోధం జరిగినవాడి చిత్తం ఎలా అన్వయిస్తుందో మీకు తెలుస్తుంది. లేకపోతే ఏమనిపిస్తుంది? చిత్తవృత్తి నిరోధం చేసుకున్నాక చిత్తం ఉండదు అనిపిస్తుంది. చిత్తం ఉండకపోదు. కాని చిత్తంగా ఉండదు. మీలో భాగంగా ఉంటుంది. మీరేపని చేస్తుంటే అది ఆ పని చేస్తూ ఉంటుంది. దానిష్టమొచ్చిన పని చేయదు. ఇది దీంట్లో చెప్పినటువంటిది. ఇక్కడ రెండు readings ఉన్నాయి. నిరోధ లక్షణమైతే నిన్న మనం చెప్పుకున్నది. క్షణం అంటే point of application. మనకి ఈ వ్యాఖ్యానం రాసినటువంటి పెద్దలలో ఎక్కువమంది లక్షణం తీసుకున్నారు. ఇద్దరు మాత్రం క్షణం తీసుకున్నారు. అందుకని ఇది కూడ చెప్పుకోకపోతే ఎవరన్నా పెద్దలు మనల్ని నిలేస్తారు. క్షణం అన్నారనుకోండి. మనం లక్షణం అని అప్పుచెప్పుకుంటాం. కనుక ముందు చెప్పుకున్న reading లక్షణం. లక్షణం అంటే మనకి కొంతవరకు బుర్రకి తడుతుంది. క్షణం అంటే point of application అని ఒక్కటే తెలియాలి. ఆ నిరోధ లక్షణం యొక్క

చిత్తాన్వయం తెలియటమో లేకపోతే నిరోధ క్షణంయొక్క చిత్తాన్వయం తెలియటమో ఉంటుంది. అపుడు 'నిరోధ పరిణామః' చిత్తవృత్తి నిరోధం క్రమంగా ఏ step తర్వాత ఏ step జరుగుతోందో చక్కగా కనిపిస్తుంది, ఈ అష్టాంగ యోగం అభ్యాసం చేసిన వాడికి. సంయమము అనేటువంటిది అభ్యాసం చేసి, దాంట్లోంచి తన ప్రజ్ఞ ఇవతలికి వికాసం జరగటం మొదలు పెట్టిన తర్వాత అది దేనియందు apply చేస్తే దానియందు వరుసన వీడికి చిత్తవృత్తి నిరోధం అనేది ఇవ్వాళ్టి కంటే రేపు, రేపటికంటే ఎల్లుండి, ఎల్లుండి కంటే ఆ మర్నాడు, ఈ నెలకంటే వచ్చే నెల, ఈ సంవత్సరం కంటే వచ్చే సంవత్సరం చిత్తవృత్తి నిరోధం అంటే ఏమిటో మీకు చెప్పి, రుచి చూపిస్తూ, నడుస్తూ నడుపుతుంది అది. దాని పరిణామము అనేది అలా క్రమబద్ధంగా వస్తుంది. అంటే "You will experience the stages of the evolution in chitta with nirodha" అది ఇక్కడ చెప్పారు. కనుక ముందు త్రిగుణాత్మక మైనటువంటి స్థితులలో మనం ప్రపంచంలో పొందేటువంటి నానా గందరగోళాల యొక్క అభ్యాసము, రజస్సు తమస్సుల నించి సత్త్వములోకి వచ్చేటువంటి సాధన పతంజలి చెప్పినటువంటిది లేదా భగవద్గీతలో చెప్పబడినది. ఆ సాధనచేస్తూ, చేసినందువల్ల మీకు కలిగేటువంటి మార్పు ఒకటి కలిగిన తర్వాత మీ వ్యూహములు పరిశుద్ధములై, purify అయ్యి, మీ మనో, బుద్ధి, అహంకార, చిత్తాదులు, అన్నమయ, ప్రాణమయ, మనోమయ కోశాదులు, ఇంద్రియములు మొదలైనవన్నీ కూడ, పరిశుద్ధములై, కైవల్యము అనేటువంటి స్థితికి దారితీస్తూ ఉండగ మీకు కలిగేటువంటి స్థితి. అపుడు మీకు ధారణ, ధ్యాన, సమాధులు వచ్చుట ఆ వచ్చినటువంటి ధారణ, ధ్యాన, సమాధులలో సంయమము అనేటువంటి స్థితి మీకు కలుగుట, ఆ కలిగినటువంటి దాన్ని ప్రపంచం మీద మీరు మళ్ళా apply చేయటం, (అదివరకు ఇంద్రియాలు, మనస్సు పనిచేస్తున్నపుడు మీరు ఏమీ apply చేయలేకపోయారు. ఇపుడు ఇంద్రియాలు మనస్సున్నూ మీరు పని చేయించటానికి apply చేయిస్తున్నారు) యోగాభ్యాసంలో కావలసినటువంటి ఈ చిత్తవృత్తి నిరోధం అంటే ఏమిటో రుచి తెలియటము, ఆనాటి కానాటికీ చిత్తవృత్తి నిరోధం బాగా తెలియటం, బాగా బోధపడటమున్నూ వస్తుంది.

## 10. తస్య ప్రశాన్త వాహితా సంస్కారాత్।

తస్య = అతనికి (పై చెప్పిన యోగస్థితి అభ్యాసము చేస్తున్నవానికి) సంస్కారాత్ = సంస్కారము వలన, ప్రశాన్తవాహితా = ప్రశాంతమైన ప్రవాహ లక్షణము.

**వృత్తి నిరోధమును అలవాటు చేయుచున్న చిత్తమునకు రానురాను ప్రశాంతమైన సంస్కారము ప్రవాహముగా కదలివచ్చును.**

**వివరణ :** ఇపుడు చాల విలువైన వస్తువుయొక్క సహాయము తీసుకోమని సలహా యిస్తున్నారు. ఈ పై చెప్పిన స్థితి అభ్యాసం చేస్తున్న వాడికి, అనగా సంయమము అభ్యాసము చేస్తూన్న వానికి సంస్కారము వలన ప్రశాంతమైన ప్రవాహ లక్షణము కలుగును. ఈ అభ్యాసం చేసాక కొంతవరకు మనస్సుమీద కంట్రోలు వచ్చింది. ఆవిడ యింకో గంట బజారుకెళ్ళి రాకపోతే పళ్ళు పటపట లాడుతూ కొరకటం అనేది మానేసారు. భర్త యింకో గంట ఆగి యింటికి వస్తే అనుమానపడి రక్తపోటు వచ్చి పటపటలాడి పళ్ళు కొరకటం మానేసారు. ఎందుచేతంటే అభ్యాసం చేశాక ఆవిడ ఏం చేసిందో ఆవిడకి సంబంధించినది, ఆయన ఏం చేసాడో ఆయనకి సంబంధించినది కాని, ఒకరి దొకరికి సంబంధించినది కాదు. తద్వ్యతిరేకంగా ఉంటే సంతోషించే యోగం ఈ జన్మలో లేదు. అవన్నీ వెళ్ళిపోతాయి ఈ సాధన చేస్తూంటే. ఇవి అసలు లెక్కలోనివి కావు. ఇంట్లో డబ్బులు ఉన్నాయా? లేవా? ఉంటే మొహం ఒకలాగ ఉండేది యిదివరకు రోజుల్లో, లేకపోతే ఒకలాగ ఉండేది, ఎవడికి వాడు మూడు నిమిషాల్లో కనిపెట్టేవాడు. అంటే డబ్బులుంటే నిండు మొహం లేకపోతే సన్నాసి మొహం. అభ్యాసం అయ్యాక డబ్బులుండటంతో సంబంధం లేదు. నెలకు కావలసినవి పడేసుకుంటం అనే ఇంగిత జ్ఞానం వస్తుంది. యోగాభ్యాసం చేసేవాళ్ళకి ఈ మార్పులు వస్తాయి. జంతువులుగా ఉండటం మానేస్తే మనుషులుగా పెరుగుతారు. ప్రక్కవాళ్ళు కూడ మనుషులుగా పెరిగితే తప్ప మధ్యన భాష వాళ్ళకి వీళ్ళకీ అందదు. అదీ వచ్చిన చికాకు. అందుకని బావుంది. అన్ని తేదీలలోను మొహము ఒకేలాగ ఉంటుంది. ఇది రెండవ మార్పు. మూడవ మార్పు అన్ని తేదీలలోను కడుపునిండా అన్నం తింటున్నారు. ఇదివరకు ఏంచేసే వాళ్ళం? 15వ తేదీ వరకు అన్నం

తినేవాళ్ళు, అంటే మిగతా 15 రోజులకి బియ్యం కొనుక్కోవలసిన డబ్బులుపెట్టి సినిమాలకి వాటికి అఘోరించే వాళ్ళు. అవన్నీ పోయాయి. ఈ మధ్య presence of mind కూడ ఒకలాగే ఉంటుంది. మళ్ళీ హఠాత్తుగా మొట్టమొదటిలాగ ఉంది. ఒకరోజున ఏమిటైంది? అంటే ఆవిడకి $105^0$ temperature. అయితే మందు వెయ్యి, అవసరమైతే ప్రక్కన కూర్చో ఆఫీసు మానేసి, అంతేగాని మొహం వెధవ మొహం ఎందుకు? ఇంకొన్నాళ్ళకు ఇదికూడ మారిపోతుంది. క్రమ క్రమంగా ఒక్కొటి ఒక్కొటి జారిపోతాయి. Commonsense లోకి వెళ్ళిపోతాడు క్రమంగా అంటే ఏమిటి? చేయదలచిన పనులనేటువంటి దిక్కుమాలిన పనులన్నీ వదిలిపెట్టి, చేయవలసిన పనులన్నింటిని చక్కగా చేసుకోగలగడం వచ్చేసింది. ఇది వచ్చిన కొన్నాళ్ళ తర్వాత మళ్ళీ మొహం మాడింది అకస్మాత్తుగా. రెండు రోజులు చాల దిగాలుగా ఉన్నాడు. ఆఫీసరు మారి క్రొత్త ఆఫీసరు వచ్చాట్ట. ఎవరో వీడి గురించి చెప్పారుట. వీడికి నోటీసు యిచ్చారు. చూసుకోకుండా. దాంతో మొహం అలా పెట్టాడు. అట్లాంటివి ఒకమాటు అయిన తర్వాత రెండోమాటు నోటీసు వచ్చినా మొహం అలా అవ్వదు. దీనిపేరు ఏమంటాడు. ''ప్రశాంత వాహితా'' పూర్ణిమ, అమావాస్య రావటము ఇట్లాంటి దిక్కుమాలిన పనులుండవు. అంటే జరుగుతూన్న పరిస్థితులను బట్టి మొహంలో మార్పు రావడంలాంటివన్నీ పోతాయన్నమాట. మిన్ను విరిగి మీద పడినా చలించడు. ''*దివిజ కవివరుల్ గుండియల్ దిగ్గురనగ అరుగుచున్నాడు శ్రీనాథు డమర పురికి*'' అని చెప్పాడు శ్రీనాథుడు రెండు నిమిషాల్లో చచ్చిపోతాడనగ. పద్యం చెప్పే presence of mind ఉంది. అదీ కావాలి. ఇక్కడ అందరిని అదరగొట్టాను. అక్కడికి నే వస్తున్నానంటే వాళ్ళ గుండెలు ధన్ ధన్ లాడుతూ ఉంటాయి. నే కాసేపట్లో వెళ్తున్నాను అన్నాడు. కావలసింది అది. మరి స్వయానా తాను చస్తూ అలాంటి పద్యం చెప్పేవాళ్ళు ఎంతమంది ఉంటారు? ఇంకోడు చస్తున్నాడంటే పద్యం చెప్పచ్చు. అంతేగాని తాను వెళ్ళిపోతూ పద్యం చెప్పేవాడు శ్రీనాథుడు ఒక్కడేగాని ఇంకెవరూ కనిపించలేదు. English History of literature లో Shelly ఒక్కడే కనిపించింది. చెడిపోయినటువంటి కోటు వేసుకొని ఎంతదూరం వెళ్ళిపోయాడో కవిత్వం చెబుతూ. వాడికి అదొక సరదా. పోతే అనే పాయింటు లేదు వాడికి. కనుక సంస్కారము వలన

అంటే ఏ సంస్కారము? చిత్తవృత్తి నిరోధం ప్రారంభించి అష్టాంగ యోగమునందు మీకు పట్టు చిక్కి, ధారణ, ధ్యాన, సమాధులయందు మీకు ఏకతానత ఏర్పాటై, సంయమము అనేటువంటి దానిమీద ఒక తివాచీ లాగ మీరు కూర్చొని బండి నడుస్తూ ఉన్నపుడు అందులో సంస్కారం వస్తే, క్రమంగా నాజూకుతనం వస్తుంది, నేర్పరితనం వస్తుంది, క్రొత్తగా సంయమము రావటం కాకుండా. అంటే క్రొత్తగా కారు కొనుక్కున్నవాడు పనులు కల్పించుకొని కారెక్కి తిరగటం కాకుండా మంచి వ్యాపారస్థుడిలాగ, కారు లేకపోతే సాగదు కనుక కారు కొంటాడు. అంటే పనికోసం కారు వీడికి. ఆ మొదటి వాడికి కారుకోసం పని అదీ తేడా. వీడిలో కూడ ఈ మార్పు వస్తుంది. మొట్టమొదటి కారు కొన్నవాడి డ్రైవింగ్‌లాగ కాకుండా పదిసంవత్సరాల తర్వాత డ్రైవింగ్ చేసుకుంటున్న వాడి నాజూకుతనం ఎలా ఉంటుందో, మీ సంయమములో కూడ నాజూకుతనం వస్తుంది. చెయ్యి తిరిగినటువంటి తనం. ఇంకా తీపి అంటే ఏమిటో, పాకం పట్టటం అంటే ఏమిటో, దాని రుచులు చూడడం అంటే ఏమిటో, చూపించటం అంటే ఏమిటో, మీకు తెలుస్తుంది నాయనా అన్నాడు. చూసారా మొట్టమొదటి రోజున యింత బెల్లంముక్క రుచి చూపించారు. అదే బ్రహ్మాండంగా ఉంటుంది. క్రమంగా బాగా పాకశాస్త్రానికి నిపుణత ఉన్నవాడు ఒక ఏడాది బెల్లంముక్క చేతికియిస్తే, ఎన్నివేల రకాలైన పదార్థాలు, పిండివంటలు కనిపెడ్తాడో? బెల్లం కొట్టిన రాయిలాంటి వాడైతే బెల్లమే తప్ప యింకేం ఉండదు. అదిగాక వీడు మంచి వంటవాడు. నోట్లో కొంచెం వేసుకొని యిది అందులో వేస్తే ఎలా ఉంటుంది? ఇందులో వేస్తే ఎలా ఉంటుంది అని చూసి వేస్తాడు. అలాంటి స్థితిలో నీ సంయమము పనిచేస్తుంది అన్నాడు. ఈ సూత్రాన్ని అనువాదం చేసుకుంటంలో **Alice A. Bailey** తికమక పడుతూంటే జ్వాల్‌కూల్ సొంతంగా అనువాదం యిచ్చాడు. 'తస్య' అంటే అతనికి. అది అందరూ చెప్తారు 'to him' ఇది జ్వాలాకూలుడు ఇంగ్లీషులో ఇచ్చినటువంటి అనువాదం. ''ప్రశాంత వాహితా'' అన్నదానికి steadiness of spiritual perception అని యిచ్చాడు. యింక యింగ్లీషులో ఎన్ని యుగాలు పోయినా దీనికి యింకెవ్వడూ ఇంకో పదం వెయ్యటానికి వీల్లేదు. "steadiness of spiritual perception" వస్తుంది అన్నాడు. ఎలా వస్తుంది? దేనివల్ల? 'సంస్కారాత్' సంస్కారము వలన అంటే

through cultivation అన్నాడు. భగవద్గీతలో ''వ్యవసాయాత్మికా బుద్ధిః'' అన్నాడు. అది పట్టుకొని cultivation అని కొట్టాడు. వాళ్ళు masters అంటే. Cultivation పెట్టమన్నాడు. ఆవిడ cultivation ఏమిటంది? భగవద్గీత మళ్ళీ చదువుకో అన్నాడు. ''వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన బహుశాహీహ్యనంతాశ్చ బుద్ధయో అవ్యవసాయినామ్'' వ్యవసాయ శబ్దం మీద చమత్కృతి ఆయన భగవద్గీతలో చేసాడు, ఇంగ్లీషులో ఇక్కడ నువ్వు చెయ్యి అందరికీ పనికి వస్తుంది అన్నాడు. కనుక "through cultivation steadiness of spiritual perception will come to him. Spiritual perception అంటే అర్థం ఏమిటి? ఆధ్యాత్మికానుభూతి లేక ఆత్మానందము లేక కైవల్యము లేక మోక్షశబ్ద వాచ్యము. ఇవన్నీ కూడ ఒకటే అర్థం. ఇవన్నీ దేనివల్ల వస్తాయి? సంస్కారం వల్ల వస్తాయి. నువ్వు సంస్కరించుకుంటూ ఉండటం వల్ల వస్తాయి. అంటే జీవితంలో ప్రతీదీ సమన్వయం చేసుకుంటూ, అలంకారం చేసుకుంటూ ఉండటం వల్ల వస్తాయి. ఆర్టిస్టు ఉంటాడు చూసారా! బొమ్మలు చాల బాగా వేస్తున్న వాళ్ళూ కొంతమంది ఉంటారు యింట్లో. కాని మనిషిని చూస్తే గడ్డము, స్నానము చేయక పోవటము, బట్టలు మార్చక పోవటము, ఒళ్ళంతా కంపు కొడుతూ ఉండటం, గోళ్ళు పెద్దవిగా ఉండటము, ప్రక్కన మనిషి దగ్గరికి రావటానికి వీల్లేని దుర్గంధము కొట్టేటట్టు వాళ్ళు ఆర్టిస్టు అనే పేరుతో ఉంటారు. వాడి గది ఎలా ఉంటుంది? ఆ లోపలికి వాడే వెళ్ళలేడు. మీరు అసలే వెళ్ళలేరు. క్రిందా మీదా పడి ఉంటాయి paintings వేసేవి. వాడి యిల్లెలా ఉంటుంది. అన్ని వస్తువుల్ని తొక్కుకుంటూ వెళ్ళాలి ఏ వస్తువుని తీసుకోవాల్సి వచ్చినా. వాళ్ళు కొందరు ఉంటారు. అదికాక నిజమైన ఆరిస్టు అంటే వాకిట్లోకి వెళ్ళేటప్పటికి వాడు ఆర్టిస్టు అని తెలిసేటువంటి వాళ్ళుంటారు. అంటే వాడు కుర్చీ ఎలా వేసాడు? బల్ల ఎలా వేసాడు? మీరు లోపలికి వస్తూంటే మీకు halts ఎలా వేసాడు? స్వాగతం ఎలా ఏర్పాటు చేసాడు? లోపలికి వెళ్ళిన తర్వాత ఎవరు స్వాగతం చేసుకొని వాడి దగ్గరికి తీసుకువెళ్ళారు, వస్తువుల అమరికలో కూడ ఆర్టు ( కళ) ఉంటుంది. బొమ్మలు వేసినా వేయకపోయినా వాడు ఆర్టిస్టు. ఆ మొదటివాడు ఎంతమంచి బొమ్మలు వేసినా వాడు ఏకదేశమైన ఆర్టిస్టు. ఏకదేశం అన్నమాట. అంటే మిగతా దాంట్లో కాదు.

కనుక జీవితాన్ని cultivate చేసుకోండి. అలంకరించుకోండి. జీవితాన్ని యోగాభ్యాసంతో అలంకరించుకునే వాళ్ళకి వస్తుంది తప్ప యోగాభ్యాసం, వేరే ఒక తోకలాగ అభ్యసించే వాళ్ళకి రాదన్నాడు. ఇందులో మనకి చెప్పిన సహాయము ఏమిటంటే సంస్కారము అనే మాటకి cultivation. దాన్నే మనం ఎరిగున్న పదంలో habit అంటారు. తరువాత జ్వాల్‌కూల్‌గారు వ్యాఖ్యానంలో యిచ్చారు. మొదటిరోజున కాస్త బెల్లంముక్క చేతిలో పెట్టారు. తీయగా ఉన్నది. దాన్నేమంటారు? రుచి అంటాం. అంతేకదా. ఇంద్రియానికి వస్తువుకి ఉన్న సంబంధం. పిల్లవాడికి రెండవరోజున పెట్టారు. మూడవరోజున పెట్టారు. పదిరోజులు పెట్టారు. పదకొండవ రోజున పిల్లవాడు అక్కడికి వస్తాడు. అంటే ఇపుడు బెల్ల ముక్కకోసం వాడి మనస్సు, వాడి నాలికేకాక, యింకొకటి వచ్చింది. దాని పేరేమిటి? ఆ టైముకి వాడక్కడికి వచ్చుట, దానిపేరే అలవాటు habit. అభ్యాసము లేక cultivation అంటే. అదివరకు ఉన్నదా అది. పిల్లవాడిలోను లేదు. బెల్లం ముక్కలోను లేదు. పెట్టేవాడిలోను లేదు. అభ్యాసమనేది దేనివల్ల వచ్చింది. ''అభ్యాస వైరాగ్యం వా తన్నిరోధః'' తీసికెళ్ళి కలుపుకోండి. అభ్యాసము అనే మాటకి అక్కడ ఏమని చెప్పుకున్నాం. కొంతే మనకి బోధపడ్డది. ఈ రోజునుంచి యిన్ని గంటలకి ఈ పని చేస్తాను అని ప్రతిరోజు ఏదో ఒక్కపని పెట్టుకోమన్నాడు మొదట యోగాభ్యాసం చేసేటపుడు. ఉదాహరణకి ఉదయం ఆరు గంటలకి ప్రేయరు చేసుకుంటాం అన్నపుడు చచ్చి చెడి 6 గంటలకి ప్రేయరు దగ్గర కూర్చుంటం అనేది మానేసేయి. చచ్చి చెడి 6 గంటలకి ప్రేయరు దగ్గర కూర్చుంటం అంటే నువ్వు 50 సంవత్సరాలు చేసినా అలాగే ఉంటావు గాని యోగాభ్యాసంలోకి రాలేవు. రావు. లేదా మిగిలినటువంటి వాళ్ళు ప్రేయరుకి కూర్చొని 'ఓం' అని అన్న తర్వాత పరిగెట్టుకువెళ్ళి అక్కడ తుండుగుడ్డ పెట్టి దులిపి కూర్చుంటం ఏం లాభం లేదు. ఎపుడు లాభం ఉన్నది. దైవ దర్శనానికి ఎపుడు లాభం ఉంటుంది. మనం వేచి ఉండాలి. ''ద్వారే వసంతి వర యత్ర యతోత్తమాంగః'' అంటే అర్థం ఏమిటి? ఆరు గంటలకి ముందు మీరు అన్నీ రెడీ చేసుకొని అగరత్తు అక్కడ పెట్టుకొని ఒక నిమిషమో, రెండు నిమిషాలో, మూడు నిమిషాలో, నాలుగు నిమిషాలో అందరు అక్కడ కూర్చోండి. ముందు కూర్చొని ఏం చేస్తాం? అనే దారిద్ర్యస్థితి మీకు పోవాలి.

కూర్చోక ఏం చేస్తాం అంటే సమాధానం లేదు కదా. అపుడు మీకు 6 గంటలు ముఖ్యం కాదు. అంటే రోజూ అదే టైముకి చిత్తమునకు ఉద్రేకము, ఉద్వేగము అంటే programme tightness, programme tension, programme consciousness అనేవి లేకుండా 24 గంటలను మీరు చక్కగా విభాగం చేస్తున్నారు 6 గంటలనే టైముతో. కొన్నాళ్ళు పోయిన తర్వాత సాయంత్రం 6 గంటలు కూడ పెట్టుకున్నారు. మీరే పెట్టుకున్నారు. ఎవరూ పెట్టమనలేదు. ఎవరి మొహమాటానికీ పెట్టినవి కావు. ఇపుడేం చేసారు? 24 గంటలని రెండక్షరముల ఛందస్సుగా విభజించుకొన్నారు. ఇలాగే ఆఫీసుకి బయలుదేరి వెళ్ళటానికి యింటిదగ్గర ఎన్నింటికి బయలుదేరితే ప్రశాంతంగా మనస్సు హడావుడి పడకుండా అరెరె టైమైపోయింది అనేటువంటిది లేశమాత్రం లేకుండా ఆఫీసులో 5 నిమిషాలు తక్కువ 10 గంటలకి ఉంటావో చూసుకోవాలి. దాన్ని backward working అంటారు. చిన్నప్పుడు chemistry class లో experiments తప్పితే results వెనక్కి cook up చేసేవాళ్ళం. అలాగ 9.20కి బయల్దేరుదాం అనుకోవాలి. 9.15కే భోజనం అయిపోవాలి. అంటే 9 గంటలకి భోజనానికి కూర్చోవాలి. 9 గంటలకి భోజనానికి కూర్చోవాలంటే టైముకి వంట పూర్తికావాలి. ఇలాగ ఒకదాని తరువాత ఒకటి చూసుకోవాలి. అంటే ఇలాంటి తొక్కిడులు లేకుండా ఉండేటువంటివి ఒకటి, రెండు, మూడు, నాలుగు, ఐదు, సంఖ్య పెంచుకుంటూ వెళ్ళండి. అలా వెళ్ళినపుడు జ్వాలాకూలుడు చెప్పిన cultivating చేస్తున్నారు. మొట్టమొదటి రోజున మీ దగ్గర అభ్యాసం లేదు. రెండవ రోజున చేసినపుడు మీకు తెలియదు ఉందో లేదో. మూడవ రోజున మీకు తెలీదు. ఒక పదిహేను రోజులు, 20 రోజులు అయ్యేప్పటికి మీకు తెలిసేటట్లు స్పష్టంగా అభ్యాసం అనేటువంటి ఒక క్రొత్త మిత్రుడు మీ దగ్గరకొచ్చి కూర్చుంటున్నారు చూసారా. Conditioned reflex అనేదాన్ని positive way లో ఉపయోగించుకునే పద్ధతి.

అన్నం ఎదురుగుండా ఉంటే నోట్లో లాలాజలం ఊరుతుంది. అది conditioned reflex అంటే ఏమైంది. అంతకుముందు కుక్క ఉన్నది. అన్నం ఉన్నది. లాలాజలం ఉన్నది. కాని పెట్టేవాడు లేడు. ఇపుడు ఏమొచ్చింది. నాల్గవది అభ్యాసము అనేటువంటిది వచ్చింది. అభ్యాసమనేది వేరే ఒః

దేవతామూర్తి. ఆయనని తెలియటం చాల కష్టం. దానిని కొద్దో, గొప్పో చాతయినంతవరకు మనకి తెలియజేయటం కోసమే పురుషమేధంలో అభ్యాసమూర్తి అనే ఒక పాత్రని మొట్టమొదటి అధ్యాయంలో ప్రవేశపెట్టి, తరువాత అధ్యాయాల్లో వాళ్ళల్లోను, వీళ్ళలోను దూరి ప్రత్యక్షంగా పనిచేయించటం, పరోక్షంగా పనిచేయించటం జరిగింది. అంటే ఆ పాత్ర ప్రపంచ సాహిత్యం (World literature) లో ఎక్కడా లేదు. అభ్యాసమూర్తి అంటే the angel of habit. ఇంగ్లీషులో కూడ అది తర్జుమా చేసిన తర్వాత మొన్న లండన్‌లోనూ అడిగారు. ఏ literature లోనైనా the angel of habit అనే పాత్ర ఉందా అని. ఎక్కడా లేదు. కాని మీకు పతంజలి నిండా, భగవద్గీత నిండా ఏం చదువుకున్నా ఉన్నదదే. ఎవళ్ళూ ఎత్తిచూపినట్లుగా లేదు. కనుక అభ్యాసము ఎంత గొప్పది? దాని బలమెంత? దాని తాహతు ఎంత? చూడండి. చిన్నప్పటినుంచి కాఫీ తాగుతున్నారు, చిన్నప్పటినుంచి సిగరెట్లు తాగుతున్నారు, ఇంటరు చదువుతూ ఉండంగ ఒక ఆర్టికల్ చదివాను. కాఫీ ఏ విధంగా శరీరానికి అనారోగ్యమో. మానామూ? ఎంచేత? మనం చదువుకున్నది కాఫీని గూర్చి, కాఫీతో మనకున్నటు వంటిది అభ్యాసం తప్ప విజ్ఞానం కాదు. చూసారా? విజ్ఞానము అభ్యాసాన్ని మార్చగలదా? లేదు. కాని తర్వాత కాఫీ తాగినందువల్ల వయస్సుని బట్టి ఏమేమి నష్టాలు వస్తాయో కొన్నివేల పుస్తకాలు చదువుతాం. మానామూ? ఎంచేత? కాఫీతో మనకున్న సంబంధము అభ్యాసము, ఈ చదువుతూ ఉన్నటువంటి దానితో ఉన్న సంబంధము విజ్ఞానము. ఇది దమ్మిడీకి పనికిరాదు. అభ్యాసము యొక్క బలమెంత? ఈ ప్రపంచంలో మనకు తెలిసిన సమస్త విషయాల్ని గురించి కూడ ఏ రకంగా వచ్చి బతిమాలినా మనం బాగుపడం ఒక అభ్యాసం వల్ల తప్ప. ఇంకోదాని వల్ల దేనివల్ల కాదు. అందుకని ఈయన ఏం చెప్పాడంటే, మీకున్న అభ్యాసాలు మార్చటానికి వీల్లేకుండా ఒక line of force తయారవుతుంది. దాని కెదురేం లేదు. ఏం లాభం లేదు. అపుడు ఏం చెయ్యాలి? నువ్వు ఇంకో దుకాణం స్థాపించు. యమము, నియమము వీటిల్లో ఏదో ఒకటి ప్రారంభించు. క్రమంగా కొన్నాళ్ళు అయ్యేటప్పటికి ఇందులో ఉండి ఇంకొక దానికి టైముండదు. ఇంకొన్నాళ్ళు అయ్యేటప్పటికి మిగిలినవన్నీ పోతాయి. ఇపుడు వీటితో యమము, నియమములతో వచ్చిన

సంబంధం విజ్ఞానము కాదు. అభ్యాసము. దురభ్యాసానికే అంత మహాశక్తి ఉంటే సదభ్యాసానికి ఎంత మహాశక్తి ఉంటుంది? మిమ్మల్ని ఏదీ చలింపచేయలేదు జన్మ మొత్తం మీద. అందుకని యిక్కడ పతంజలి ఏం చెపుతాడంటే, వాడి సహాయం తీసుకోండి నాయనా, cultivation అంటే అర్థం అది. సంస్కారము అనేటువంటి మాటకి పతంజలి చెప్పినది యిపుడు చెప్పినటువంటి అర్థం. దీన్ని మీరు చేస్తున్నటువంటి సంస్కారంగా మార్చుకోండి గాని, వేడుకగా చేయకండి. వేడుకగా ఎన్నాళ్ళు చేస్తాం యోగాభ్యాసం? ఒక పదిరోజులు చేస్తాం. నెలరోజులు చేస్తాం. రెండు నెలలు చేస్తాం. లేకపోతే ఒక ఏడాది చేస్తాం. తర్వాత మూల పడుతుంది. ఏమండి, యోగాభ్యాసం చేస్తున్నారా అంటే ఈ మధ్య చేయటం లేదండి అంటాడు. ఎంచేతండి చేయటం లేదు, ఏమిటోనండి చేయటంలేదు. ఎందువల్ల? మనకి వేడుకగా చేసాం కాని అభ్యాసంగా స్థాపింపచేయలేదు. కనుక engraft a new positive habit. ఒక నూతనమైనది, నిర్మాణాత్మకమైనది అభ్యాసం చేయి. నేర్చుకొని ఏమీ లాభం లేదు. అర్థంచెప్పి ఏం లాభం లేదు. అంతరార్థాలు చెప్పుకున్నా ఏం లాభం లేదు. దేవుడు అలాంటివాడు ఇలాంటివాడు అని చెప్పుకొని ఏం లాభంలేదు, వాడికి నీ ఓటు అక్కర్లేదు. పదిమాట్లు దేవుణ్ణి గురించి చెప్పుకుంటే ఉబ్బిపోయేవాడు కాదు దేవుడు. జాగ్రత్తగా ఉండాలి. ఎంతమందిని మనలాంటి వాళ్ళని చూసాడు. చాల కోటానుకోట్లు చూసాడు. కనుక అభ్యాసము అనేటువంటి దాన్ని మార్చటానికి కావలసిన రహస్యమైన విద్య ఒక్క యోగాభ్యాసంలో ఉందిగాని యింకొక దాంట్లో లేదు. అభ్యాసములుంటే మార్చాలంటే ఏం చేయాలి? అభ్యాసాన్ని ఆపకూడదు. ఇంకొక అభ్యాసం మొదలు పెట్టాలి. అంటే start a fresh and more significant nucleus అంతే. అభ్యాసాన్ని ముట్టుకోకు ఉండనీయ్ ఎక్కడికి పోతాయి. వాటంతటవే పోతాయి. నువ్వు యింకోటి మొదలుపెట్టు అవి పోవాలంటే. అంతేగాని వాట్లని పోవాలని నువ్వు కూర్చున్నావంటే నువ్వు పోవాలని అవి కూర్చుంటాయి. నువ్వు పోవాల్సిందే గాని అవిపోవు. అందుకని ఇక్కడ అన్నింటికంటే బలవత్తరమైనది ఏది? మనం తింటున్నటువంటి ఆహారం కాదు. మనం నేర్చుకునేటువంటి విజ్ఞానం కాదు. మనం చదువుకున్నటువంటి శాస్త్రాలు కావు. భగవద్గీత, బైబిలు మొదలైన పరమ

పవిత్రమైన గ్రంథాల్లో ఉన్నటువంటి "Love thy neighbour" అనేటువంటి వాక్యాలు కావు. తెలిసినవా యివి అన్నట్లుగా ఉంటాయి. అవి మనవి అయినప్పుడు కదా పనికివచ్చేది. మనం మనంగానే ఉంటాం. అవి అవిగానే ఉంటాయి. వ్యాఖ్యానం చేయమనలేదు. బోధపరచడం, వ్యాఖ్యానం చేయడం దొంగవేషం అన్నాడు. దేవుణ్ణి గురించి గాని, యోగాభ్యాసాన్ని గురించిగాని, వేదాంతాన్ని గురించి గాని, బోధపరచడం చేయమని కాదు చెప్పింది. ఏదో ఒకటి మొదలు పెట్టమన్నారు. అందుకనే మొట్టమొదట దీనిపేరు అనుశాసనము, Instruction అన్నాడు. ఈ సూత్రం చాల విలువైనటువంటి సూత్రం. మళ్ళా చూసుకోండి ''తస్య ప్రశాంత వాహితా సంస్కారాత్'' 'తస్య' అంటే వాడికి, అష్టాంగ యోగమునందు విప్లవం లేకుండా సరైన అభ్యాసం జరుగుతున్న వాడికి ''సంస్కారాత్'' అంటే ఈ చెప్పబడిన అభ్యాస వైరాగ్యాదులు మొదలైన వాటి సంస్కారము వలన, నాజూకుతనము వలన 'ప్రశాంత వాహితా' జీవితము అనేది ప్రశాంతముగా ప్రవహించుట జరుగుచున్నది. జీవితమంటే తానే, జీవితం అని వేరేలేదు ఉన్నట్లనిపిస్తుంది గాని. జీవితం అంటే తన consciousness కదా, ఏమిటోనండి జీవితం ఒకలాగ ఉంటోంది. వేరే ఎక్కడో ఉన్నట్లు బజార్లో. మనం ఎలా ఉంటే అలా ఉంటుంది జీవితం. అక్కడికీ ప్రయత్నం బాగానే చేస్తున్నాం, జీవితమే బాగోలేదు. అంటే నేను వేరు, జీవితం వేరు అని అర్థం. వాడు ఏనాడూ బాగుపడడు. నా ప్రయత్న లోపం లేదండి. కాని జీవితమే తిన్నగా నడవటం లేదు అంటాడు. ఉండదు, తానే జీవితం కనుక. ఆ మధ్యన సందులన్నీ తొలగిపోతాయి. ఈ సంస్కారం అభ్యాసం చేస్తున్నపుడు. అంటే మార్కెట్ కెళ్ళినా, పెద్దవాళ్ళ దగ్గరకెళ్ళినా, వాళ్ళతో మాట్లాడుతున్నా, ఆఫీసుకెళ్ళినా, ప్రక్కవాళ్ళతో మాట్లాడుతూ ఉన్నా, మన పై ఆఫీసరుతో మాట్లాడుతూ ఉన్నా, మనకింద గుమస్తాతో మాట్లాడుతున్నా, యింటికి వచ్చినా, రిక్షా ఎక్కినా, ఆటో ఎక్కినా, భార్యతో మాట్లాడుతున్నా, యిన్నింటితో పాటు మీరు యోగాభ్యాసం చేస్తుంటే, అభ్యాసం అని చెప్పబడేటు వంటి సంస్కారము. వచ్చి దానివలన ''ప్రశాంత వాహితా'' ప్రశాంతమైన సంస్కారము ప్రవాహముగా కదలివస్తుంది.

## 11. సర్వార్థ తైకాగ్రతయోః క్షయోదయౌ చిత్తస్య సమాధి పరిణామః

సర్వార్థత = సమస్త ప్రయోజనములు, ఏకాగ్రతయోః = ఏకాగ్రత కలుగుట, క్షయ = లీనమవ్వటం, ఉదయౌ = ఉదయించడం, చిత్తస్య = చిత్తమునకు, సమాధి పరిణామః = సమాధి పరిణామము.

**క్రమముగా అన్ని విషయములయందు చిత్తము చిందించు చుండుట మానును. ఒకే మార్గముగా (జీవిత విధానము) ప్రవహించుట జరుగును. అదియే సమాధి గనుక దానికి కావలసిన మార్పు కలుగును.**

**వివరణ :** ఎనిమిదవది అయినటువంటి సమాధిలో కూడ చక్కని పరిణామము వస్తుంది. అది ఎలా వస్తుందో చెబుతున్నారు. అభ్యాసము అనేది పెట్టుకొని ''అభ్యాస వైరాగ్యాభ్యాం తన్నిరోధః'' బియ్యం కొనుక్కునేందుకు, పాలడబ్బా కొనుక్కునేందుకును సినిమా యందు వైరాగ్యం ఎలా అయితే పుట్టిందో, అలాగే తాను 24 గంటల్లో మళ్ళీ మళ్ళీ చేస్తూండేటువంటి దానికి అభ్యాసం అనేది. అభ్యాసము, వైరాగ్యము అనే రెండింటిలో చేస్తూన్నటువంటి సాధనలో ''సర్వార్థత, ఏకాగ్రతయో, క్షయో, దయౌ, చిత్తస్య, సమాధి, పరిణామః'', 'సర్వార్థత' అంటే అర్థములు అనగా ప్రయోజనములు. పురుషార్థములు తెలుసు కదా. ధర్మము, అర్థము, కామము, మోక్షము. అదిగాక సర్వార్థములు అంటే సమస్త ప్రయోజనములు. 'సర్వార్థత' అంటే సమస్త ప్రయోజనములు కావలసినటువంటి వాటియందు అమలు పరచుట. ఇంతకు ముందు చిత్తాన్ని వృత్తి నిరోధం చేసారు. ఇపుడు ''తస్య భూమిషు వినియోగః'' చిత్తము భూముల యందు వినియోగం చేస్తున్నారు. కనుక ఆ చిత్తాన్ని సర్వార్థత యందును, అంటే ప్రపంచంలో తెల్లవారి లేస్తే మీకు కావలసినటువంటి, యితరులకు కావలసినటువంటి ప్రయోజనములు అన్నింటి యందును, అంటే మనం చేయదలచుకున్నవి కాకుండా కావలసిన వాట్లల్లో (needs, desires కావు) వినియోగం కావాలి. తర్వాత 'ఏకాగ్రతయోః' ఏకాగ్రత అంటే పతంజలి, భగవద్గీత మనకి చెప్పినటువంటి ఏకాగ్రత, మనస్సుకి ఏకాగ్రత కాదు. చిత్తవృత్తి నిరోధం వచ్చాక, అష్టాంగ యోగం అభ్యాసం చేస్తున్నవాడి మనస్సుకి ఏకాగ్రత ఏమిటి? 60 ఏళ్ళు వచ్చాక మళ్ళీ పెళ్ళి అన్నట్టు. అది అయిపోయింది. ఇపుడు ఏకాగ్రత అంటే అర్థం

జీవితమునకు ఏకాగ్రత. అంటే రెండు మూడు ప్రయోజనాలు (interests) ఉన్నవాడు జీవితంలో యోగాభ్యాసానికి పనికిరాడు. అయితే మిగతాదంతా తీసిపారేయడం కాకుండా దీనికి వశంలో ఉండేటట్లు చేసుకోగలగాలి. తాను చేసుకునే యోగాభ్యాసానికి మిగిలినటువంటి కార్యక్రమము లన్నిటిని వీలయితే వంచండి. లేకపోతే వాట్లని నిర్దాక్షిణ్యంగా వదిలేయాలి. కొన్ని కొన్ని పాదులు పెడితే ఎట్లా అయితే పందిరి క్రిందకి వచ్చి చక్కగా పాకుతాయో, అలాగ మీరు చేస్తున్న పనులు నీ యోగాభ్యాసానికి పనికొచ్చేటు వంటివి అయితే దీని క్రిందకి వస్తాయి. రోజూ కాసేపు హోమియో డిస్పెన్సరీలో పనిచేద్దాం అనుకుంటే, అయితే 6 గంటల ప్రేయరో అనిపిస్తుంది. చేయండి. డిస్పెన్సరీ టైముకి అడ్డం కాదా? ఎన్నడూ కాదు. ఎందుకంటే డిస్పెన్సరీ టైముకి చిత్తవృత్తి నిరోధము అభ్యాసం చేస్తున్నారు. అక్కడికి వచ్చేవారు మీ చుట్టములు, మీ స్నేహితులు కాదు, మీకు కావలసినవారు అసలే కాదు. వారి యోగక్షేమాలు చెయ్యడం, బాగున్నారా? అయ్యా అని అడగటం, వాళ్ళకేమన్నా కొద్దిగా తేడాగా ఉంటే మీకు చాతనైనది మందో, మాకో, సలహానో మొదలైనవి ఇవ్వటం చేస్తూన్నపుడు వ్యాధి ఎవరికి నయం అవుతోంది. అవతలి వాళ్ళకి అనుకోవడం ఒళ్ళు పొగరు. మన మనస్సుకి. కనుక ఒక గంటో, అరగంటో డిస్పెన్సరీలో పనిచేస్తూంటే జబ్బు పనిచేస్తున్న వాళ్ళకి నయమౌతోంది. అది గుర్తుంచుకోవాలి. ఎవరికి మందులిస్తున్నామో వాళ్ళకి నయమవ్వటం అక్కర్లేదు. ఇంకో చోటికి వెళ్ళినా నయమౌతుంది. ఏ గాడిదైనా యిస్తాడు ఆ మందులు. సత్యమది. కనుక ఏకాగ్రత అంటే జీవితానికి ఒక మార్గం. యోగాభ్యాసం చేద్దాం అనుకున్నాం అనుకోండి. డిస్పెన్సరీ కార్యక్రమం చేద్దామనుకున్నాం. భాగవతం రాద్దాం అనుకున్నాం. పతంజలి యోగసూత్రాలు పాఠం చెబుదాం అనుకున్నాం. ఇవి యోగాభ్యాసానికి పనికొస్తాయా? పనికిరావా? ఇందులో ఏ ఒక్కటి పనికి రాకపోతే నిర్దాక్షిణ్యంగా ఎత్తేసేయ్. పనికొస్తే యోగాభ్యాసానికి దాన్ని వాడు. అంతేగాని ఫాషను కోసమో, పేరు కోసమో, పేపర్లో ఫొటో పడటం కోసమో, లేకపోతే ఊళ్ళో ఇన్ని సంవత్సరాల నించి ఈయన హోమియో మందులిస్తున్నాడని చెప్పి సన్మానంచేసి, మెడలో ఒక వడియాల గుడ్డలాంటి శాలువా వేయటం కోసమో, అట్లాంటి వాటికోసం చేయకు. అప్పుడు ఏకాగ్రత అనే మార్గం పొందుతాడు. అంటే అర్థం ఏమిటి? ఒక

వైపుకి జీవితం నడుస్తోంది. ఎలా అయితే దేవాలయం కడుతూన్నటువంటి వాడు ఒక గర్భాలయం కేంద్రంగా నిర్మాణం చేస్తాడో, power house కడుతూ ఉన్నటువంటివాడు ఆ power house ఎలా అయితే కేంద్రానికి దృష్టి ప్రసరించి అన్ని ప్రక్కలనించి నిర్మాణం చేస్తాడో జీవితాన్ని ఒక power house గా మీరు కడతారు. కట్టినపుడు ఏకాగ్రత వస్తుంది. మీరు పదిమందితో చేసేది ''సర్వార్థత''. సర్వార్థత ఏకాగ్రత అంటే your activity with every one should give the direction of your own life. ఇది ఏకాగ్రత అంటే. concentration కాదన్నాడు. ఈ సర్వార్థత ఎలా వస్తుంది? అభ్యాసం చేయమన్నాడు కదా. కనుక ఈ సర్వార్థత అనేదానికి అభ్యాసం తయారు చేసుకుంటంలో ఉంటుంది. అంటే క్రొత్తవాడు వస్తేనో, డబ్బుగలవాడు వస్తేనో, ఎలా మాట్లాడడమో అభ్యాసం చేస్తారు. బీదవాడు వచ్చాడు మందు కావాలి అన్నాడు. టైమయిపోయింది అని చెప్పాం. బావుంది. పెద్దవాళ్ళెవరైనా టైమయిపోయాక ఆఖరి క్షణంలో వచ్చారనుకోండి. ఆ బీదవాడికి టైమైపోయిందని చెప్పి, ఈ పెద్దాయనికి మందిస్తావా? లేకపోతే యిద్దరికీ యిస్తావా? యిద్దరికీ మానతావా? You should have some happy policies. ఒక policy (పద్ధతి) పెట్టుకోవాలి. ఆ పాలసీ ప్రకారం వెడుతూ ఉండు. stiffness వద్దు. adoptability పెట్టుకో. Principle పోనీయకు. అంటే ప్రాణం పోతోందన్నచోట పరిగెట్టు, ఎవడికైనా తలవంచు, వంగు. నువ్వు వెళ్ళు అక్కడికి. You should have your own standard of procedure. సర్వార్థత అభ్యాసం చేయి. జ్వాలాకూలుడు ఈ సర్వార్థత అనేటువంటి దానికి "establishing habit" అని explanation ఇచ్చాడు. చాల సమంజసమైనటువంటి విషయం 'సర్వార్థత', అంటే అలవాటు స్థిర పరచుకోవడం (establishing a habit). తర్వాత 'ఏకాగ్రత' అన్నదానికి "one direction for life" అంటే ఈ జన్మకి ఇది మార్గం. అది ఏకాగ్రత. అంటే మనం చేసే పనులు ఆ మార్గం కోసం చేస్తున్నామా? ఆ మార్గానికి కానివి ఉంటే ఎత్తేయండి. 'The Law of right relationship' అనే పుస్తకంలో synthasize your activity అన్నాడు. అంటే నీ దేశకాలములతో, నీ క్రియాశక్తిని సమన్వయము చేసుకొనుము. అది చేస్తూంటే నీకు 'క్షయోదయా' చిత్తము క్షయము అవుతుంది. ఉదయమూ అవుతూ

ఉంటుంది. చిత్తము క్షయమవ్వటం 'వృత్తి నిరోధము'. చిత్తము ఉదయమవ్వటం అంటే మళ్ళీ పైకి వస్తూంటుంది. ఎవడు వీడు? అన్నపుడు పైకిరాడు. objective activity లోకి వెడితే మనస్సు పైకి వస్తుందా? లేదా? తలుపు కొడుతున్నారు. ఎవరు వారు? అన్నపుడు చిత్తము ఉంటుందా? ఉండదా? తరువాత రెండు నిమిషాలు మాట్లాడాక చిత్తము ఉండదు. జీవితంలో రోజుకి కొన్ని లక్షల మాట్లు చిత్తము పుట్టటమున్నూ, చిత్తము లీనమవ్వటమున్నూ జరుగుతూ ఉంటుంది. కనుక ''క్షయోదయౌ'' అంటే క్షీణించుట, ఉదయించుట. ఇందులో ఈ క్షయము అనేటటువంటి పదంకోసం భగవద్గీతలో 'అంత్యకాలము' అని వేసారు. ప్రయాణ కాలము అని చెప్పి, అంటే శరీరము వదిలిపెట్టేటువంటి కాలము అని మనం చెప్పేసుకున్నాం, అలాకాదు. మనస్సు లీనమయ్యే టైములో మనస్సు ఏం తలచుకుంటూ ఉంటుందో, మళ్ళీ యివతలకి వచ్చేటువంటి టైముకి దానినే తలచుకుంటూ ఉంటావు అని చెప్పాడు. అలాగే నిన్నరాత్రి నిద్రపోబోతూ ఏపని చాల శ్రద్ధతో సగంచేసి పడుకుంటావో, రేపు మళ్ళీ నిద్రలేచిన తర్వాత ఆ పనితోనే మొదలు పెడతావు. లేదా ఈ జన్మ దేనికోసమని చెప్పి, జీవితమంతా సాధించటానికి ప్రయత్నం చేస్తూ మధ్యలో చచ్చిపోతావో, వచ్చే జన్మ అక్కడనించి ప్రారంభిస్తావు. ఇది భగవద్గీతలో చెప్పింది. ఈ చివరి అర్థం ఒక్కటే తీసుకున్నాము. ''స్మరణ్ ముక్త్వా కళేబరం'' భగవన్నామ స్మరణ ఎందుకంటే చిట్టచివరి క్షణాల్లో చేయడం కోసం ఒక్కటే. ఈ సూత్రాలు చెబుతూంటే 1975వ సంవత్సరంలో జెనీవా నగరంలో 75 సం॥లు పైబడిన ఆవిడ 18 కి॥మీ దూరం నించి వచ్చేది. ఆవిడ అడిగింది. మీరు చిట్టచివరి క్షణంలో ''భగవన్నామ స్మరణ చేస్తే'' అని చెప్పారే ఆ టైములో భగవన్నామ స్మరణ జ్ఞాపకం వచ్చేస్థితి మనకి వచ్చిందో లేదో పోకముందు తెలియాలి కదా, ఎలా తెలుస్తుంది అని అడిగింది. అంటే పోయేటప్పుడు రాలేదని తెలిస్తే ఏం లాభం, ఆ ముందు తెలిసేది ఎట్లాగు అని అడిగింది. అపుడు త్రికరణ శుద్ధిగా చెప్పాను. ఈ ప్రశ్న యింతవరకు నే ఎరిగున్న వాళ్ళల్లో వచ్చింది నీ ఒక్కర్తికే. నీకు ఎవరైతే త్రికరణ శుద్ధి యిచ్చారో నీలో ఉన్నటువంటి వాడు, వాడే దానికి కావలసినటువంటి పరీక్ష, దానిని నెగ్గటం, దానిని నీకు తెలియటం కూడ యిస్తాడని చెప్పాను.

నమస్కారమని వెళ్ళిపోయింది. ఒకరోజు మీ యింటికి రావచ్చునా లెక్చరు అయిన తర్వాత అంటే రాత్రి 12.30 అవుతుంది. తప్పకుండా రావచ్చును అన్నాను. వచ్చిన తర్వాత సరిగ్గా మీరు చెప్పినట్లు జరిగిందండి అంది. ఏం జరిగింది? వారంరోజులు లోపలనే ఈవిడ మళ్ళీ వెనక్కి తిరిగి వెడుతూంటే మధ్యలో ఒక నది ఉన్నది. ఆ నదిపైన వంతెన ఉన్నది. ఆ వంతెనకు అటు ఇటు పిట్టగోడలు బద్దలు కొట్టేసి మళ్ళీ కడుతున్నారు. దాని మీంచి వెడుతూంటే అటునించి ఇటునించి వచ్చే కార్లు తప్పించుకోబోయి నదిలో పడిపోయింది. జరిగిన కథ యిది. ఆవిడ ఉన్నది యిప్పటికినీ జెనీవాలో, మోటారు సైకిల్ అక్కడ వంతెన మీద పడ్డది. మనిషి నదిలో పడ్డది. ఏమైందో ఎవరికీ తెలియదు. అందరూ కార్లు ఆపారు. వెళ్ళారు. చూసారు. అంతే ఆ వంతెన బాగు చేయటానికి రబ్బరు పరంజాలు పెట్టారు. అందులో పడ్డది. మరి అలాంటి త్రికరణ శుద్ధైనటువంటి ప్రశ్న వచ్చిన వాళ్ళకి పలుకుతాడా దైవం? నీకు నాకు పలుకుతాడా? పడుతూన్న క్షణంలో 'ఓం నమః శ్శివాయ, ఓం నమః శ్శివాయ' అనుకున్నదిట. యింక చాలు మనం పోయినా, ఉన్నా అనుకున్నది, ఇలా జరిగింది. నాకు పరీక్ష అయిపోయింది. అని ''మా యింటికి ఒక్కమాటు రండి'' అంది. అప్పటికి 12 సంవత్సరాల క్రిందట ఒక స్వాములవారు దక్షిణ భారతదేశం నించి వెళ్ళి పారిస్‌లో ఆశ్రమం కట్టుకొని ఉండిపోయినారు. ఈవిడ కసాయి దుకాణం పెట్టుకొని ఉన్నది. ఈవిడ యింటికి ఆహ్వానిస్తే వెళ్లి ఈవిడని స్నానం చేయమని చెప్పి, పంచాక్షరీ మంత్రం ఉపదేశించారు. అప్పటినించి ఆవిడ ఆ మంత్రం చేసుకుంటోంది. పెద్దలు ఎవరొచ్చినా వాళ్ళు చెప్పిన ప్రవచనాలు వింటానికి వస్తుంది. ''నాకు యింక వెళ్ళిపోతూండంగ వాణ్ణే స్మరిస్తాను అనే సంగతి నిర్ణయమై పోయింది. యింక ఫర్వాలేదు. ఉన్నా పోయినా'' అంది. ఆ ప్రశ్న ఎవరికి వస్తుంది? ఆ జవాబు ఎవరికి వస్తుంది? ఆ త్రికరణశుద్ధి అయిన ప్రశ్న వచ్చిన వాళ్ళకే వస్తుంది. సర్వార్థత, ఏకాగ్రత అనే రెండింటికిన్నీ, establishing the habit న్నూ, establishing one direction in life న్నూ అర్థం ''క్షయోదయౌ'' అంటే చిత్తము లీనమగుట, ఉదయించుట. ఒక్కొక్క పరిస్థితుల్లో చిత్తము పుడుతూ ఉంటుంది బయటికి. ఎవరో వచ్చారుట అనంగానే, తలుపు తట్టి పిలుస్తున్నారుట అన్నప్పుడు, ఆఫీసులో ఎంక్వయిరీ

వచ్చింది అన్నప్పుడు, చిత్తం పుట్టదూ? తప్పకుండా పుట్టుతుంది రోజుకి కొన్ని వేలమాట్లో, లక్షలమాట్లో, తర్వాత మళ్ళీ లయమౌతుంది. అదీ ప్రయాణ కాలమంటే. ఆ లయమవ్వటం ప్రయాణ కాలం. ఆ పుట్టటం మళ్ళీ జన్మకాలం అంటారు. కనుక 'క్షయోదయౌ' క్షయము, ఉదయము కలుగగా (merging and emerging). Merging అంటే మనస్సు లీనమవ్వటము, emerging అంటే మళ్ళీ ఉదయించటం. యివన్నీ కలిసి 'చిత్తస్య' చిత్తమునకు 'సమాధి పరిణామః' యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధి ఎనిమిదింట్లో కూడ మీకు మంచి రుచైనటువంటి పాకం, మంచి రకమైనటువంటి సువాసన కల వంటకంలాగ తయారౌతుంది సమాధి. కనుక 'సమాధి పరిణామః'' అన్నదానికి constant power of absorption. సమాధి అన్నదానికి absorption అంటే మనం దానితో absorb అయిపోయి అది ఉండటం. చివరికి సమన్వయం ఏమిటి? నీకు దినచర్యలో యోగాభ్యాసం చేస్తూ ఉండంగ సర్వార్థత కల్గినపుడు చిత్తము పుడుతూ ఉంటుంది బయటికి. బయట వాడొచ్చాడు. ఆ వస్తువులు కావాలి, ఈ వస్తువులు కావాలి, బజారు కెళ్ళాలి లేకపోతే ఆఫీసు కెళ్ళాలి. రైలు టైమింగ్సు ఏమిటి? కారు టైమింగ్స్ ఏమిటి? అన్నపుడు చిత్తానికి సర్వార్థత. తర్వాత యివన్నీ కూడ మీ జీవిత మార్గానికి సమన్వయం చేసుకొని, దానికి కావలసివస్తే ఆ ప్రయాణం చేస్తున్నావు. లేకపోతే మానేస్తున్నావు. ఎక్కడో సాహిత్య సభలున్నాయిట. అంటే దణ్ణంపెట్టి ఊరుకుంటున్నాం, ఎందుకు అంటే మీకు నాకు సంబంధం లేదు. అవి ఏకాగ్రతకు సంబంధించినవి కావు. యోగాభ్యాస మార్గానికి సంబంధించినది కాదు కనుక. అందుకని 'సమాధి పరిణామః' సమాధి యొక్క పరిణామం నీకు తెలుస్తుంది నాయనా. Constant power of absorption. నీవు నీ సమాధిలోకి ఎలా absorb అయిపోతున్నావో, సమాధి నీవు పొందటం కాదు. సమాధి నిన్ను పొందుతూ ఉన్న స్థితి వస్తుంది. ఒక క్రొత్త రకమైనటువంటి ఆఫీసు, ఇల్లు అక్కడే, ఆఫీసు అక్కడే, భార్యాపిల్లలు అక్కడే, అన్న పానీయాదులు అక్కడే, మనం చేసుకునేటువంటి వృత్తి వ్యాపారాదులు అక్కడే అనేటువంటి భ్రాంతి వ్యాపించి ఉండి జీవితమంతా దానియందు అంకితమైనటువంటి స్థితి. గనుక సమాధి మనకు రావటం అనే

స్థితిపోయి, మనం సమాధియందు ప్రవేశించటం అనే స్థితి వస్తుంది. ఆ తేడా గమనించుకోండి. ఈ మార్పు వస్తుందని చెపుతున్నాడు పతంజలి. అంటే the activity gradually leads you into yoga, not yoga into you. యోగమును నీ దగ్గరికి పట్టుకురావటం కాకుండా, యోగము అభ్యాసం, సాధన చేయటం కాకుండా, నిన్ను యోగం తన బాహువులలోకి తీసుకుంటుంది. ఎలా అయితే తల్లి బిడ్డను తన దగ్గరికి తీసుకుంటుందో అలా తీసుకుంటుంది. అంటే కోతిపిల్లలాగ కాదు, పిల్లిపిల్లలాగ. కోతిపిల్ల ఏం చేస్తుంది? కొమ్మ మీంచి కొమ్మమీదకి ఎగురుతూ ఉంటుంది. పిల్లతో ఏం సంబంధం లేదు. పిల్ల తనని తాను గట్టిగా పట్టుకొని రక్షించుకోవాలి. అలాంటి యోగాభ్యాసం కాకుండా, పిల్లి పిల్లలాగ అన్నాడు. పిల్లి ఏడుమాట్లు పడుతూ లేస్తూ ఇక్కడనించి అక్కడికి, అక్కడినించి ఇక్కడికి పిల్లని తిప్పుతుంది. రక్షణభారం తల్లిది. పిల్లది కాదు. కనుక దీన్ని 'మార్జాల కిశోర న్యాయము' అన్నారు. ఆ మొదటి దాన్ని 'మర్కట కిశోర న్యాయము' అన్నారు. కనుక సమాధి దాంట్లోకి నిన్ను తీసుకుంటుంది. ఒక నదీ ప్రవాహంలో పడవ ఎట్లా అయితే వెడుతూ ఉంటుందో, నీ జీవితం అందులోకి వెళ్ళిపోతుంది. ఏం కంగారుపడకు. Nothing is lost. Everything is gained.

Super-human powers అనుకున్నటువంటి వాళ్ళు ఫూల్స్ అన్నాడు మాస్టర్ మోరియా. Super - human powers కాదు అవి, powers that are lagitimate to the human being అది ఆయన అన్నది. మానవుడు తాను మనస్సుని, ఇంద్రియాల్ని, సద్వినియోగం చేసుకుంటే తనకు కలిగేటువంటి మానసిక శక్తులు అవి. ఎలా అయితే జ్ఞాపకశక్తి మనకి సహజమో, ఎలా అయితే మనుష్యుల్ని గుర్తుంచుకొని, ఏవయ్యా బాగున్నావా? ఏవమ్మా బాగున్నావా? అనటం సహజమో అలాగ అవీ సహజమే. ఇవన్నీ బ్రహ్మాండమైన శక్తులా? కొంప మునిగిపోయే శక్తులా? కాని శక్తులే. అవి లేకపోతే పది సంవత్సరాలు పోయిం తర్వాత చూస్తే నువ్వా, ఎక్కడున్నావు అని ఎలా అడగగలం. అవన్నీ శక్తులు కావా? అలాంటివి మనం వాడుకుంటూ ఉన్నవి, వాడుకుంటం చాతకానివి, మనకోసం ఏర్పాటైనవిన్నీ కొన్ని వేలున్నాయి

లోపల. దానికోసం యోగాభ్యాసం. కాని వీటిని మహిమలు మొదలైన పేర్లతో పిలిచేవాళ్ళు ఈ ఛాయలకి రాకూడదు. వాళ్ళకి గంజాయో, భంగో కొట్టే యోగాభ్యాసాలున్నాయి, అటు వెళ్ళండి, అంటే బు(ర యింకో లోకాల్లోకి వెడుతూ ఉంటుంది. పైన తిరుగుతూ ఉంటుంది. ఏవేవో కనిపిస్తాయి. అంటే అవి self - mistification schools of thought, self - stupification methods. యిందులో మిస్టరీ ఏమీ లేదు. ఉన్నదేదో మీరు చేసుకున్నటువంటి హిస్టీరియాయే. అంటే as plain as a materialist. పతంజలి గాని, భగవద్గీత గాని, ఈ రెండు పుస్తకాలు సవ్యంగా చదువుకున్నటువంటి ఒక రష్యా శా(స్త్రజ్ఞుడు ఎలా మాట్లాడతాడో, అలాగే మాట్లాడతాడు. గనుక పతంజలి యోగ సూ(త్రాలలో యిక్కడ చదువుకొని వెడుతూంటే అలాగ నారింజ కలర్‌లో రంగులు కన్పిస్తాయి. లేకపోతే అలా ఎవరెవరో పోతున్నట్టు కన్పిస్తారు. వస్తున్నట్టు కన్పిస్తారు. అది హిస్టీరియా అని అర్థం కాని, యోగాభ్యాసం అని అర్థం కాదు. జా(గ్రత్త. అది మానసిక వ్యాధి. యోగాభ్యాసానికి సంబంధించినది కాదు. మాస్టర్ మోరియా గారు అదే చెప్పారు. పాపం ఆరోజుల్లో బ్లావెట్స్కీతో పాటు మాస్టర్ మోరియాగారి దగ్గర, కుత్‌హుమీగారి దగ్గర యివి నేర్చుకుంటం కోసం చేరినటువంటి వాళ్ళు కొంతమంది ఉన్నారు. వచ్చే తెలివి, పోయే తెలివి, ఎవరో బ్లావెట్స్కీ, అనిబిసెంటు అలాంటి వాళ్ళకి తప్ప. అందులో A.P. సిన్నెట్ అని ఒకడు ఉండేవాడు. వాడు అక్కడ్లేని ఉత్తరాలన్నీ రాస్తూండేవాడు గురువు గారికి. మనం ఈ సంస్థ పెట్టాం గనుక ఒక పది, పదిహేను సంవత్సరాల పాటు యివన్నీ పకడ్బందీగా చేశాక భారతీయుల్ని ఎవర్నీ ఇందులో మెంబర్లుగా జేరకుండా పాశ్చాత్యులతోనే నడిపిస్తే బాగుంటుందని ఒక ఉత్తరం రాసాడు. అంటే ఆయన (వ్రాసాడు. నీ తెలివికి నేను చాల విచారిస్తున్నాను. నువ్వు గురువుగా ఎన్నుకున్నటువంటి నేను భారతీయుణ్ణి. I pity your common sense. అంచేత ముందు వాణ్ణి తీసేయమన్నాడు. మోరియాగారు వాడికి రాసినటువంటి ఉత్తరాలన్నీ అలాగే సమాధానాలొస్తాయి. యోగాభ్యాసం వల్ల ఏం వస్తుంది? అని రాసాడు. ఏమీరాదు. అని మాస్టర్ మోరియాగారి సంతకంతో ఉన్నాయి చదవండి. A.P. Sinnet's Mahatma letters అనే పుస్తకంలో వేసారు. అయితే ఎందుకు చేయటం? అని వీడొక ఉత్తరం. ఎవరు

చేయమన్నారు? అని ఆయన సమాధానం. తర్వాత వీడు సవ్యంగా అడిగితే సమాధానం చెప్పాడు. యోగాభ్యాసం మన దగ్గర ఉన్నవేమన్నా పోగొట్టుకుంటానికి గాని, ఏమన్నా రాబట్టుకునేందుకు కాదు. ఏం పోవటం కోసం అంటే దుఃఖము, దిగులు మొదలైనవి ఏవో కొన్ని చెప్పాడు. ఇంతకు మించి యోగాభ్యాసం ఏమీలేదు. ఉన్నదని నీవు భ్రాంతి పడితే మేము బాధ్యులము కాము. ఆ ఉత్తరాలు చదవాలి. చాలా ఆశ్చర్యకరంగా ఉంటాయి. పతంజలి కాని, శాస్త్రకారులు గాని, భగవద్గీతా కారుడు గాని యిచ్చిన వాట్లల్లో మీరు ఉన్నదని భావించినట్లైతే మిమ్మల్ని మీరు మోసం చేసుకున్నారుగాని వాళ్ళు బాధ్యులు కారని రాసాడు. ఏదో కళ్ళు మూసుకుంటే ఒక స్థితి వస్తుంది. మనకున్న కష్టాలు మొదలైనవి మర్చిపోతాము. ఇలాంటి తుక్కు అభిప్రాయాలు ఉన్నట్లైతే యోగాభ్యాసము చేయకండి. ''ఆగమాపాయినో నిత్యాత్వాం తితిక్ష స్వభారతా'' చలికాలం చల్లగా ఉంటుంది నిజమే, వేసవికాలం వేడిగా ఉంటుంది నిజమే. దీనికెట్లాగ అంటే ఓర్చుకోవడమే అంటే తితిక్ష. నీ మనస్సు యింతకంటే పెద్ద విషయంలో లీనమై ఉంటే నీకు చలి, వేడి ఉండవు కాని, ఈ చలి, వేడితో నువ్వు పోట్లాడుతూ ఉన్నంతసేపు నీ బ్రతుకు కుక్కలాగే ఉంటుందన్నాడు. చూసారా! కనుక యిక్కడ దాకా మనకు అష్టాంగములు వివరించి తీసుకొచ్చి, పదకొండవ సూత్రంలో సర్వార్థత, ఏకాగ్రత చెప్పారు. సామాన్య మానవుడు యిలా అందర్నీ చూస్తుంటే వాళ్ళు కనిపించి, వాళ్ళు గుర్తొచ్చి, ఆయన కనిపించి, ఆయన గుర్తుచ్చి, రోడ్డుమీద వెళ్తూంటే ఒక్కొక్కళ్ళు కనిపిస్తారు. ఆయనతో నిన్న, మొన్న, కిందటి నెలలోను, కిందటి సంవత్సరంలోను జరిగినటువంటి సన్నివేశాలు గుర్తొస్తాయి. కొన్ని మంచివి ఉంటాయి. కొన్ని దిక్కుమాలినవి ఉంటాయి. కొన్ని భయపడేవి ఉంటాయి. యోగాభ్యాసం మొదలు పెట్టాక ఇవన్నీ తొలగిపోగా రానురాను కొంచెము తక్కువగా పనిచేయటం మొదలు పెడతాయి. తరువాత మరీ తక్కువగా పనిచేస్తాయి. తరువాత పనిచేయవు. పనిచేయవు అంటే చేయవలసినవి చేయటం మిగతా చేయదలచుకున్నవి అన్నీ క్షాళనం అయిపోతాయి. ఇలా క్రమంగా వస్తూండగ లేత మొదుళ్ళు ఉంటాయి. సమస్యలు అన్నటు వంటివి కొన్నాళ్ళు ఉన్నట్టు కన్పిస్తాయి. తర్వాత ఏమీ లేవు. అంటే యింకొకడు చూస్తుంటే, ఆనాడు మీకా సమస్య ఎంత ఉందో,

ఈనాడు ఆ సమస్య అంతే ఉందని వాడికి అనిపిస్తూ ఉంటుంది. మీకా సమస్య తీరలేదు. కాని మీకు మాత్రం ఆనాడు సమస్య ఉన్నది. ఈనాడు సమస్య లేదు. ఈ స్థితిలో వచ్చి వచ్చి బాగా యోగాభ్యాసంలో పరిపూర్ణత వచ్చిన తర్వాత కూడ సమాధి స్థితిలో కూడ లేత మొదుళ్ళు సర్దుకుంటూ వస్తారు. చక్కగా ఒక రకమైన developing evolution ఉంటుంది నాయనా. మీ సమాధి గూర్చి మీ అనుభూతిలో కూడ సమాధి స్థితి ఒక్కటేగాని, సమాధిని గూర్చి మీ అనుభూతి ఒకటి కాదు కదా. ఇవాళ ఒకటి రేపొకటి ఎల్లుండి ఒకటి మీరు పొంది క్రొత్త కాపురం లాగ ఉంటుంది మొదట. తర్వాత పదేళ్ళ భార్యా భర్తల కాపురంలాగ ఉంటుంది. ఆ తర్వాత ఇరవై ఏళ్ళ తర్వాత మంచి భార్య భర్తల కాపురంలా ఉంటుంది ఈ సమాధి స్థితి. సమాధి అంటే ఇంక కళ్ళు మూసుకొని కూర్చునేదని, కళ్ళు తెరిస్తే సమాధి కాదని, తిరుగుతరాంటే సమాధి కాదని యిట్లాంటి పిచ్చి అభిప్రాయాలుంటాయి. సమాధి వచ్చిందనుకోండి. చిల్లర విషయాలకి చెదరటం లేదు. భార్య రోజూ సినిమాకి వెళ్ళటానికి నిర్ణయించుకుంది. ఆవిడ సంతోషం ఆవిడది అనుకున్నాడు. మనస్సు చెదరలేదు. కాలు నొప్పిచేసి వాచిందట. ఇది భార్య లాంటిది కాదు. బుద్ధి తెలిసినప్పటి నుంచి ఈ కాలుతో identify అవుతూ బ్రతుకుతున్నాం. కాలు, అందులో ఉన్నటువంటి సప్తధాతువులు, చీము, నెత్తురు అవి మనం అనుకొని బ్రతుకుతున్నాం కదా. కూర్చుంటానికి వీల్లేదు. లేవటానికి వీల్లేదు. సమాధి ఏమైనది. సమాధి కొంచెం ఆపి, దీని సంగతి అని ఆలోచిస్తాం. అంటే తన దగ్గరి కొచ్చేసరికి సమాధి చెదురుతుంది. ఏమైందిపుడు, ఈ కాలు నయమవుతుందా? నయం కాకపోతే ఏం చేస్తాం? నయమైతే సరే. నయం కాకపోతే వీడి సమాధి స్థితి దాని మీదకి కూడ ఎక్కుతుంది. ఏమిట్రా ఉపన్యాసాలు యిస్తున్నాను, మందులు యిస్తున్నాను, యూరప్ అది వెడుతున్నాను. వీటి అన్నింటికి అడ్డు బడుతుందా ఏమిటి? అంటే కీర్తిమీద తొందర ఒకటి ఉంటుంది కదా దిక్కుమాలినది. ఎంత గోక్కున్నా తీరదు. అది చర్మవ్యాధి లాంటిది. ఉన్న వ్యాధి కాక పెద్దవ్యాధి ఒకటి లోపల ఉంటుంది. ఈయనకి కూడ జబ్బు చేసిందని నలుగురూ అనుకుంటున్నారా? అనుకోక చస్తారా. జబ్బుచేస్తే. ఏం వాళ్ళకి చేస్తే అనుకుంటంలేదు. అంటే యివన్నీ క్షాళనం అవుతాయి. ఒక్కొక్క

లెవల్‌లో సమాధి పొందుతూ ఉంటే ఒక్కొక్క లెవెల్‌లో కొంత కొంత కిలం క్షాళనం అవుతుంది. కనుక యిన్ని దౌర్బల్యాలు మనలో ఉన్నాయే, కాలు నెప్పిపెడితే చెదరిపోయే సమాధి ఏమిటి? అంటే రేపు కాలు నెప్పిపెట్టినా చెదరని సమాధికి దారితీస్తుంది. ఇది రాకపోతే అదిరాదు. సోడాబుడ్డీ కొట్టినట్లు బుస్ బుస్‌మని లోపలవన్నీ పైకి రావాలి. అది యిక్కడ చెబుతోన్నది. క్రమ పరిణామము. సమాధి స్థితులలో చివరికి ఏ స్థితి వస్తుందంటే ఏ పరిస్థితిలోనైనా సరే మీరు సమాధి స్థితిలోనే ఉంటారు. అది కావాలి. అపుడు మాత్రమే సాధ్యము. చివరి క్షణంలో శరీరం వదిలిపెట్టటం. అది సాధ్యంకాని వాడు ఏం చేస్తాడు? శరీరం వదలడు. చనిపోతాడు. ప్రపంచంలో చివరి క్షణాలు రెండు రకాలు. చనిపోయేవాళ్ళు కొంతమంది. శరీరం వదిలిపెట్టేవాళ్ళు కొంతమంది. ఎవడికైతే చనిపోతూన్న క్షణాల్లో కూడ సమాధిస్థితి ఉంటుందో వాడు చనిపోడు. శరీరాన్ని వదిలిపెడతాడు. అంటే శరీరాన్ని వదిలాక కూడ వాడు చూస్తూనే ఉంటాడు. ప్రకృతి ఏం చేస్తుందంటే వాణ్ణి శరీరంలోంచి బయటికిలాగే క్షణంలో వాడికి తెలియకుండా తెలివి తప్పిపోయేట్లు చేస్తుంది. మృత్యుభీతి ఉన్నటువంటి వాడికి యింకో ఐదు నిమిషాల్లో పోతాడనగా తెలివి తప్పేట్లు ఎందుకు చేస్తుంది ప్రకృతి? తెలివిలో ఉండంగ శరీరం వదుల్తూంటే గుండె పగుల్తుంది. షాకు వస్తుంది జీవుడికి. ఆ కారణంగా వచ్చే జన్మలో మృత్యుభీతి అనేటువంటి ఒక రకమైన దుస్సంస్కారము క్రింద అహోరాత్రాలు వేటాడి వెంటాడుతుంది. కలవచ్చినా చస్తున్నట్లు వస్తుంది. అందుకని ప్రకృతి, మృత్యుభీతి మనకి ఎంత ఉందో, అంతసేపు తెలివి తప్పేట్లు చేసి, బుర్రమీద కొట్టేసి యివతలకి లాగేస్తుంది. మరీ ఎక్కువ మృత్యుభీతి ఉంటే గంటసేపు తెలివి తప్పుతుంది. యింకా ఎక్కువ మృత్యుభీతి ఉంటే ఒక రోజంతా తెలివి ఉండదు. యింకా ఎక్కువ ఉంటే ఒక నెలంతా ఉండదు. ఆర్నెల్లు తెలివి లేకుండా కట్టెల్లే మంచంలో పడిపోయి దుర్వాసన కొట్టినవాళ్ళు లేరా? ఎంచేత అంటే మృత్యువు మీద అంత భీతి అన్నమాట. కనుక చస్తూన్న క్షణాల్లో బ్రతికుంటే వచ్చే జన్మకి సరిపడ షాక్ తినేవాడు. చస్తూన్న క్షణాల్లో చచ్చి ఉన్నాడు. కనుక బ్రతికిపోయాడు. అది ప్రకృతి చేసే ఆశ్చర్యకరమైన విషయం. ఆవగింజంత మృత్యుభీతి ఉన్నాసరే దానికి తగినంతసేపు తెలివి తప్పిపోయి చస్తాడు తప్ప, శరీరం వదిలిపెట్టడు. కనుక శరీరం వదలిపెట్టాలి చనిపోకుండా.

''ఏను మృతుండ నౌదునని'' కదా పరీక్షిత్తు ప్రశ్నించినది. అలాంటివాడు వేసిన ప్రశ్నకి శుకయోగి చేసినటువంటి పరమోపదేశానికి ఏడు రోజుల్లో చిట్టచివరికి పరీక్షిత్తు చనిపోయాడని చెప్పలేదు? ''దేహము విడచె నధిపా'' అన్నాడు. చచ్చిపోకుండా దేహము విడిచిపెట్టాడు. అది శుకయోగి చేసినటువంటి పరమ ప్రసాదము. ఇక్కడ పతంజలి చేసేటువంటిది కూడ అదే. అంటే అదివరకు యోగాభ్యాసం చేయటం నువ్వు మొదలుపెట్టిన తర్వాత ఇప్పటివరకు రానంత కష్టం మళ్ళీ వస్తే మళ్ళా ఒకమాటు నీకు సమాధి చెదరడం అవుతూ ఉంటుంది. ఎంచేత? అపుడు కూడ చెదురుబాటు అవ్వకుండా నీకు వైద్యం జరగ గలందులకుగాను. చూశారా. జీవుడికి ఎక్కడ వైద్యప్రక్రియ జరుగవలెనో, అక్కడ చెదురుబాటు చేస్తూ ఉంటుంది ప్రకృతి. అలా కాకుండా ఆ జన్మ అయిపోయి, దానిమీద భయం తీరినటువంటివాడు డబ్బు ఏం పెద్ద లెక్కలోది కాదండి. ఇంట్లో నలుగురు హాయిగా ఉంటే, ఎవరికీ సుస్తీలు లేకుండా అనుకుంటాడు. ఎవరికైనా కొంచెం జ్వరం వచ్చిందంటే గుండెల్లో పోటు పొడిచినట్లు ఉంటుంది వాడికి. ప్రతిరోజూ ఎవరో ఒకళ్ళకి ఒళ్లు వెచ్చబడుతూ ఉంటుంది. ఆ జన్మంతా దానిమీద కొడుతుంది. డబ్బులక్కర్లేని వాడికి డబ్బుమీద ఉండదు, అడక్కుండా వస్తుంది. మనకి పుండు ఎక్కడ ఉందో, ప్రకృతి నివారణ అక్కడ కొడుతూ ఉంటుంది జన్మ మొత్తంమీద. ఆ జన్మకి **healing** ఎక్కడ కావాలో అక్కడ చేస్తూ ఉంటుంది. యోగాభ్యాసం చేస్తూ ఉన్నపుడు కూడ యిది చక్కని ప్రక్రియలో జరుగుతూ ఉంటుంది. అంటే ఏ దెబ్బ యిదివరకు తగల్లేదో, ఏదెబ్బ తగిలితే సమాధి చెదురుతుందో, ఆ దెబ్బ వస్తుంది. రాకపోతే ఆ దెబ్బని దాటి మీరు సమాధి పొందటానికి యింకొక మార్గం గీపెట్టుకున్నా లేదు. అది చెబుతున్నాడు. ఈ స్థితిలో యిలాగ ప్రతిరోజూ సర్వార్థత ఉంటుంది కదా. అందర్నీ చూస్తూంటాం. అన్నీ చూస్తూంటాం. అందరూ గుర్తుంటారు. వాళ్ళమీద అభిప్రాయాలు ఉంటాయి. ఆ రోజుకారోజు క్రమంగా ఇవన్నీ పోతూండాలి. అందరూ కనిపిస్తూనే ఉంటారు. ఈ నిమిషంలో వాడికి ఏం కావాలి? ఈ నిమిషంలో మనం ఏం మాట్లాడాము. అది తప్ప నిన్న వాడిలా అన్నాడే, మొన్న వాడలా చేసాడే, వీటికి సంబంధించినటు వంటివి ఊరికే రిజిష్టరు అయ్యి లోపల ఉంటాయి కాని పనిచేయవు. ఎలాగ? శనగగింజ లుంటాయి.

పేరంటం అయిన తర్వాత నీళ్ళుజల్లి అట్టేపెడితే మర్నాడు జేబు రుమాలులో యిలా తోకలల్లే మొలుస్తూ ఉంటాయి. అదివరకు అలా ఉండేవి మన దగ్గర ఉన్న అభిప్రాయాలు. ఇపుడేం చేసారు. రెండు మూడు రోజులు ఆ మొలవటం చూసి మంచి పదునుకు రానిచ్చి, యిల్లాలు వేయించేసింది నూనెలో వేసి. మీరెన్ని పూటలు లెక్కపెట్టినా ఆ తోకలు ముందుకురావు. ఆ వేయించినటువంటి శనగలకి తోకలు ఎట్లా అయితే ముందుకు రావో మీలో ఈ మార్పు వచ్చిన తర్వాత మిగతా వాళ్ళని గురించిన అభిప్రాయములు యింకలేవు. అయిపోయింది. డబ్బుని గురించి అంతే. ఆస్తిని గురించి అంతే. వ్యక్తుల్ని గురించి అంతే. ఉన్నది ఒక్కడే అందరిలోను. ఎందుకని? ద్రష్ట, దృశ్యము అనేటువంటి రెండు ఉండటం తొలగిపోయినాయి. కనుక సర్వార్థత తప్పదు. ఏకాగ్రత తప్పదు. ఏకాగ్రత అంటే జీవితం మొత్తానికి పరమావధి జాగ్రత్త. ఏకాగ్రత అంటే concentration కాదు. మళ్ళీ చెబుతున్నాను. సర్వార్థత అంటే అందరి యెడల ఇంద్రియాలతోను, మనస్సుతోను, యోగాభ్యాసానికి ముందు వృత్తి చేయటమున్నూ, యోగాభ్యాసం మొదలు పెట్టిన తర్వాత వాళ్ళు కన్పిస్తూంటే వృత్తి ప్రారంభం కాబోతూంటే వృత్తి నిరోధం చేయటమున్నూ, అంటే వృత్తి ప్రారంభం కాబోతోంది. వారు వచ్చారు. అమ్మో వారా! అంటే చిత్తానికి వృత్తి లేకుండా ఎలా ఉంటుంది? వాడెవడో వచ్చాడంటే మనని చూడ్డానికి ఎంత యోగి పుంగవుడికి మాత్రం, ఎవడికైనా అంతే. మరీ పుంగవుడు కుంజరమైతే మత్తెక్కుతుంది తప్ప వారెవరో వచ్చారుట అంటే చిత్తవృత్తి వస్తుంది. వెంటనే మళ్ళీ చిత్తవృత్తి నిరోధం వస్తుంది. వచ్చిన ప్రతి సర్వార్థత కూడను ఏకాగ్రతకి దారి తీస్తూన్నది. అంటే ఏ పంచపాత్రతోగాని, ఏ గిన్నెతోగాని, ఏ తపాళాతోగాని, ఏ కావిడితోగాని నీళ్ళు తీసుకువచ్చినా, ఆ నీళ్ళన్నీ కూడా యింట్లో వినియోగానికి ఎలా అయితే చేస్తున్నామో, అదే మోస్తరుగా మనం చిత్తంతో చేసేటువంటి వృత్తులు మళ్ళీ బయలుదేరటానికి జరిగేటువంటి ప్రతి ప్రయత్నమునందు చిత్తవృత్తులన్నీ ఆగిపోతాయి. అలాగ తెల్ల కాగితంలాగ ఉంటుంది. జన్మ అని అనుకోకండి ఎన్నడూ. ''మనస్సు దిమ్మరపోయి ప్రాణంబుల్ ఠావుల్ దప్పెన్'' అన్నాడే అదిగో అప్పుడు తప్ప చిత్తవృత్తులు లేకుండా ఉండవు. కనుకనే ప్రపంచంలో చుట్టూ జరుగుచున్నటు వంటి వాటిల్లో సంయోగములు, వియోగములు

జరుగుతూ ఉంటాయి. పదిహేనేళ్లు కలిసి ప్రక్కన ప్రక్కన ఉన్నటువంటి స్నేహితులు ఇంకో ఊరు వెళ్ళిపోయారు లేదా ఉద్యోగం మానేసి వ్యాపారంలో చేరారు. చిత్తవృత్తి ఉండదా? ఉండదని కోసినటువంటి వాణ్ణి మనం డంబాచారి అని వదిలిపెట్టాలి. వాడి దగ్గర మనం నేర్చుకునేదేం లేదూ. తప్పకుండా ఉంటుంది. వేదవ్యాసుడికి కాశి విడిచి పెట్టుతూంటే చిత్తవృత్తి లేదా? పురాణం అబద్ధమా? అలా చెయ్యి పెట్టుకొని ఏడుస్తూ వెళ్ళాడు కాశి విడిచిపెట్టి, వెళ్ళమని విశ్వేశ్వరస్వామి శపించి పంపిస్తే, ఏం వ్యాసుడికి ఎక్కడ అయితే ఏమి? ఇంతకాలం శిష్యులకు ఇక్కడ బ్రహ్మవిద్య చెప్పామే, ఈ స్థానం విడిచిపెట్టి వెళ్ళాల్సి వచ్చింది. భళ్ళున వచ్చేసింది. అగస్త్య మహర్షిని ఇలాగే శపించాడు. కాశీపట్టణము వదిలిపెట్టి వెళ్తే లోపలినించి ఒక మంట వచ్చింది. ''ఉదరమునం దాగి ఉన్న జౌరవ గంధి'' వెనక సముద్రాలు తాగేడు కదూ. ఆ బడబాగ్ని లోపల దాగియుండి టక్కున కొట్టిందా అనిపించిందిట. అంత బాధ వచ్చింది. తెనాలి రామకృష్ణుడు చెప్పాడు పాండురంగ మహత్యంలో. తప్పా! మరి యోగి ఏమిటి? అనటానికి వీల్లేదు. మనం కాదు నిర్ణయం చేసేది. సీతాదేవిని రావణాసురుడు ఎత్తుకెళ్ళినపుడు శ్రీరాముడు గొంతెత్తి హోరుహోరుమని ఏడిచాడుట. రామాయణంలో ఉన్నది. వాడు వీడు ఊరికే రాసింది కాదు. రాముడు ఏడుస్తాడా? ఏడవలేదండి. నవ్వాడు అంటే ఏం లాభం. రాముడు యోగికాదా. రాముడు తేల్చవలసింది అది. యివన్నీ కూడా జాగ్రత్తగా మనని ఆలోచించుకొని యిటుపైన ముందుకు వెళ్ళమంటున్నాడు. ఇవన్నీ అట్టే పెట్టుకొని ముందుకు వెళితే రేపు మనకి వచ్చే సన్నివేశాలలో నానా వ్యవహారాలు రొచ్చు రొచ్చుగా ఉంటుంది. ఇదేమిటండి సమాధి అన్నారు. యింకా వాసన కొడుతూనే ఉంది అన్నట్టుగా ఉంటుంది. అంటే అవన్నీ పరిశుద్ధమై క్షాళనం ఆనాటి కానాటికి అవ్వటానికి సిద్ధంగా ఉండాలి ఏనాడైనా సరే. ఇది క్షాళనం అయిపోతే ఆ తర్వాత (next day) ఉండదు. ఆ స్థితి వస్తుంది. అందుకని యిక్కడ సర్వార్థత అన్నది నలుగురిలో దేనికి పనికి వస్తుందన్నాడు జ్వాలాకూలుడు, establishing a habit అన్నాడు దాన్ని. అంటే ఇందరితోను చిత్తవృత్తితో బయటికి రావటానికి చేసే ప్రయత్నంలో establishing a habit అనేది జరుగుతోంది. మీరు చిత్తవృత్తి నిరోధానికి చేస్తున్న ప్రయత్నము నందు అభ్యాసము అనే ఒకానొక క్రొత్త

దేవత అధిదేవత పుట్టుతుందన్నాడు. అలాగే 'ఏకాగ్రత' అంటే one direction in life. 'క్షయోదయౌ' ఈ రెండూ కూడ మనస్సు ఉదయిస్తున్నపుడు, మనస్సు లయమౌతున్నపుడు ఉంటాయి. మనస్సు వారెవరో వచ్చినపుడు ఉదయిస్తుంది. మళ్ళీ లయిస్తుంది. అంటే వెంటనే మనం యోగాభ్యాసంలోకి తీసుకోవాలి కదా! ప్రయత్నం ఎందుకని? యోగాభ్యాసానికి మొట్టమొదటగా చేయవలసింది ఏమని చెప్పాడు. ''అభ్యాస వైరాగ్యాభ్యాం వా తన్నిరోధః'' ప్రతిక్షణం ప్రతిక్షణం "you repeat, repeat, repeat your effort, repeat the attempt" అభ్యాసం అంటే repetetion. Practice కాదు జాగ్రత్త. ఈ శాస్త్రంలో ఈ విషయం అభ్యస్తం అంటాడు. అంటే అర్థం ఏమిటి? మళ్ళీ మళ్ళీ చెబుతున్నాం, రెండోమాటు మూడోమాటు చెబుతున్నాం practice చేయండి అని అర్థంకాదు. అభ్యాసము, అభ్యస్తము అనే మాటకి శాస్త్రకారులు యిచ్చిన అర్థం repetetion ఏం వస్తుంది? మొదటి రోజున కాఫీ యిచ్చారు ఏం వచ్చింది? నేను, కాఫీ, యిచ్చినవాళ్ళు తప్ప ఇంకొకళ్లు లేరు. రెండవరోజున యిచ్చారు. ఏడాది అయ్యింది. మళ్ళీ యిచ్చారు. యిపుడేమైంది? నేను, కాఫీ, యిచ్చినవాళ్ళు+అభ్యాసం. రెండవ రోజున కాఫీ అడగను. కాని ఏడాదయిన తర్వాత కాఫీ అడుగుతాను. అడగటం అనే ఒకానొక రాక్షసుడు అధిదైవతము మన అభ్యాసాన్ని బట్టి మన నెత్తినవచ్చి కూర్చున్నాడు. వాడు బలీయుడు, మనం బలీయులం కాదు. వాడు మన అదృష్టం బాగుండి దైవతం అధి దైవతం గనుక అయినట్లైతే యోగాభ్యాసాల్లో చేసేటువంటి ఏదో ఒక అభ్యాసం చేస్తాం. అదిగాక రాక్షసుడు గనుక అయినట్లైతే కాఫీగాని, చుట్ట, బీడి, సిగరెట్టు మొదలైనవి కాని, కల్లు మొదలైన కకారకూటంగాని ఇవి ఏవో చేస్తాం. అంతేగాని ఏదైనా అంత బలం ఉండదు. మెడకాయ ఇట్లా తప్పుకుంటుంది. మనం చదువుకున్న చదువులు పనికిరావు. మనం చేసే ప్రయత్నం పనికిరాదు. పోరాటం పనికిరాదు. తిరస్కారం పనికిరాదు. కాఫీ మొదలైనవి మంచిది అవునో కాదో తెలియటం దమ్మిడీకి పనికిరావు. మనం నేర్చుకున్న సమస్త జ్ఞానము భగవద్గీత, భారతం, భాగవతం, ఉపనిషత్తులు దమ్మిడీకి పనికిరావు. ఒక గడ్డిపరకకు కూడ సాటిరావు. మనం తాగటం నేర్చుకున్నట్లైతే అయిపోయింది కదా. అందుకని యిక్కడ ఏమంటున్నాడంటే మనస్సు లీనమవ్వటం మొలవటం, లీనమవ్వటం

మొలవటం, జరుగుతూ ఉంటుంది ఎప్పటికప్పుడు. లీనమనేది నువ్వేం చేస్తున్నావు అభ్యాసం చేస్తున్నావు. మొలిచినటువంటి దాన్ని మొలవద్దు అని మళ్ళీ ఏం చేస్తున్నావు? దీనివల్ల పోట్లాడుతున్నవా మనస్సుతో. అది ఎన్నడు చేయద్దు అన్నాడు. ఏం చెప్పాడు ఏం చేయమన్నాడు? మళ్ళీ ఒక్కమాటు పర్యాలోకనం చేసుకోండి. ఈశ్వర ప్రణిధానం చేయమన్నాడు. ఎలా చేయమన్నాడు. నీ ఉచ్ఛ్వాస నిశ్వాసలలో ఉన్నటువంటి గమనాన్ని గురించి ఆలోచించు. దాంట్లోంచి ఓంకారం ఉచ్చరిస్తూ దాన్ని విను. అపు డేమౌతుంది. నీ అభ్యాసం వచ్చేస్తుంది. యిలాగ ఏడాది చేయి. నీ కాఫీ అభ్యాసం భస్మమై పోతుంది. అంతేగాని అభ్యాసంతో పోరాడితే, నీచుడు, వ్యాజ్యాడు అయినవాడితో కోర్టులో దిగితే ఏమౌతుందో అంతే. ఇహ బయటకి రాము. ఇది వీరు చెప్పినటువంటి మార్గం, చిత్తక్షయము. చిత్త ఉదయము. దీన్నే భగవద్గీతలో చిత్తము ప్రయాణకాలము, ఉత్పత్తికాలము అన్నాడు. ప్రయాణ కాలంలో ''స్మరణ్ ముక్త్వా కళేబరం'' నన్ను స్మరిస్తూ శరీరం వదిలిపెడితే అన్నాడు. అంటే కొన్ని క్షణాలు వదలిపెట్టటం అంటే నిద్రపేరుతో కొన్ని గంటలు వదిలిపెట్టటమైనా అంతే. మృత్యువు పేరుతో శరీరం వదిలిపెట్టటమైనా ఒకటే **formula** చిత్తానికి అన్నాడు. చచ్చిపోవటాన్ని గురించి చెప్పలేదు. చచ్చిపోవటాన్ని గురించి చెప్పటం ఎందుకు అనవసరంగా. పెద్ద పుస్తకాల్లో ఎలా బ్రతకాలో చెప్పాలి గాని నువ్వు చచ్చేటపుడు స్మరించుకునేందుకు అని చెప్పేందుకు పుస్తకం అక్కర్లేదు. అందుకని ''చిత్తస్య సమాధి పరిణామః'' క్రమంగా ఆ చిత్తానికి సమాధి పరిణామము వస్తుంది. సమాధిలో క్రమంగా యింకా మంచి సమాధి, ఇంకా మంచి సమాధి. నిన్న దేనితో అయితే నీ సమాధి చెదురుబాటయ్యిందో యివాళ దానితో కాదు. యివాళ దేనితో చెదిరిందో రేపు దానితో కాదు. అలాంటి సమాధి చక్కగా పరిణమించుట అనే స్థితి వస్తుంది. ఇది రోజూ చేసే అభ్యాసం వల్ల వస్తుంది.

## 12. తతః పునశ్శాన్తోదితౌ తుల్య ప్రత్యయౌ చిత్తస్యై కాగ్రతా పరిణామః।

*తతః = అటుపైన (పైన చెప్పిన సమాధి స్థితి వచ్చాక); పునః = మరల; శాన్తోదితౌ = (శాంత+ఉదితౌ) శాంతము చెందునట్టి చిత్తము, ఉదితౌ = ఉదయించునట్టి చిత్తము, తుల్యప్రత్యయౌ = సమాన లక్షణము కలుగుట, చిత్తస్య = చిత్తమునకు, ఏకాగ్రతా పరిణామః = ఏకాగ్రత యందు చక్కని పరిణామము కలుగును.*

**అపుడు చిత్తవృత్తులను శాంతింపజేయు సంకల్పము, అందలి చిత్తవృత్తుల రూపమైన చిత్తవృత్తి పుట్టుటయు, ఈ రెండును ఒకే గమ్యము వైపుగా కదులుచున్నవి గనుక ఏకాగ్రత లభించును. (ఏకాగ్రత అనగా జీవితము, సాధన ఒకటిగా కదలివచ్చుట).**

**వివరణ :** ఇది కూడ కొంచెం కష్టమైనటువంటి సూత్రమే. జాగ్రత్తగా అర్థం చేసుకోవాలి. ఇక్కడ ఉన్న ఏడెనిమిది సూత్రాలు ''క్లేశో మధికస్తర స్తేషాం'' అన్నట్లుగా ఉంటాయి. ఇంతకు ముందువి కావు. తర్వాతవి చాల బావుంటాయి. వీట్లని గ్రంథ గ్రంథులు అంటారు. అభ్యాసం సంగతి అలా ఉంచి, యోగాభ్యాసంలో సూత్రాలు చదువుకుంటంలోనే ఆగిపోయే వాళ్ళం చాలమందిమి ఉంటాం. ''ఏచిద్భగ్నా శుద్ధ్యుపాస్యే'' అని వ్యాకరణం చెప్పుతున్నారు. ఆ మర్నాడు గురువుగారు మార్కెట్ దగ్గర ఎదురు పడితే వీడు సందులోకి వెళ్ళిపోయాడు. మళ్ళీ వ్యాకరణం చెబుతాడేమోనని భయం. ఎందుకని శుద్ధిః + ఉపాస్య, శుద్ధ్యుపాస్య చెప్పిచెప్పి చట్నీచేసి పారేసాడు గురువుగారు. యణాదేశ సంధి అంటే ఏమిటి? యణులు అంటే ఏమిటి? ఆదేశము, ఆగమము తేడా ఏమిటి? అంటూ యిక్కడ ఆదేశము ఎందుకయ్యింది? ఇవన్నీ ఒక్కరోజులోనే రుద్దేశారు. వాడికి రెండు మూడు రోజులు చెపితే బాగుండేది. మర్నాడు గురువుగారు కన్పిస్తేనే పక్కనించి తప్పుకున్నాడు. గ్రామరు చెపుతాడేమోనని భయం. అలాంటి సూత్రాలు యివి. ''తతః, పునః, శాంతః, ఉదితౌ తుల్య ప్రత్యయౌ, చిత్తస్య, ఏకాగ్రతా

పరిణామః'' అని విడదీయాలి. 'తతః' అంటే అటుపైన, అంటే ఇపుడు చెప్పినటువంటి సాధన మీరు చక్కగా చేస్తూండంగ, అంటే మీకు వచ్చినటువంటి సమాధిస్థితి ఆనాటి కానాటికి నునుపు తేలుతూ ఉండంగ, ఆనాటి కానాటికి అదే పదార్థములతో నేర్పు వచ్చినకొద్దీ వంట ఎంత రుచిగా ఉంటుందో, అలా సమాధి చక్కగా పరిణమిస్తుంది. ఆ స్థితికి వచ్చాక 'తతః', 'పునః', మరల ఇటుపైన ఇంకో స్టెప్ చెబుతున్నాడు. 'పునః' అంటే మరల, 'శాంత ఉదితౌ' శాంతము చెందునట్టి చిత్తము, ఉదయించునట్టి చిత్తము, ఏడాదైన తర్వాత వాట్లతో మీకున్న చుట్టరికం కూడ మారుతుంది. అవి 'తుల్యప్రత్యయౌ' సమానమైనటువంటి లక్షణములుగా అవుతాయి. అంటే వారెవరో వచ్చారుట అని మనస్సు టక్కున పైకిలేస్తూ ఉండటమున్నా, మనస్సు మళ్ళీ లీనమవుతూ ఉండటమున్నా రెండూ ఒక్కటే అనే స్థితి వస్తుంది. అది అనుభవించవలసినదే కాని చెపితే నమ్మరు. మొదట్లో ఏమవుతోంది. ఎవడో ఒకడు వచ్చి డిస్టర్బ్ చేయడం జరుగుతోంది, ఎంత నిష్ఠగా కూర్చుందామన్నా సముద్రంలో అలలులాగ మనస్సుకి ఉదితమే కాని, శాంతం లేదు. అంటే సముద్రంలో కొన్ని నిమిషాల ముందు మీరు చూస్తే ఒక అలవచ్చి బ్రద్దలై యింక ప్రశాంతం అవుతుంది అనుకునే లోపల రెండవ అలవచ్చి బద్దలవుతూ ఉంటుంది. అలలు వచ్చి బ్రద్దలవ్వటమే కాని ప్రశాంతి లేదు. అంటే ఆ స్థితి ఉదితమే కాని, ప్రశాంతి లేని దుస్థితిలో ఉంది వీడి అభ్యాసం.

ఎవడికి ఎక్కడ క్షాళనం జరగాలో, ఎవడికి ఎక్కడ మర్దనం జరగాలో, భావన జరగాలో, ఎవడికి ఎక్కడ కిలం పోవాలో, మకిల పోవాలో, ఏ పాత్ర ఎక్కడ క్షాళనం జరగాలో, మనచేత పని చేయిస్తున్నటువంటి, త్రిగుణాత్మకమైనటువంటి ఆ పరా ప్రకృతికి తెలుసునుగాని, ఎవరికి తెలుసును. 'తతః', 'పునః' అంటే సమాధి స్థితి చక్కగా రుచికరంగా లొంగిన తర్వాత అంటే నువ్వు ఏ వాతావరణంలోనైనా సరే, ఏ పరిస్థితుల్లోనైనా సరే, సమాధి స్థితినుంచి చెదురుబాటు రాకుండా ఉండేటువంటి స్థితిలోకి వచ్చాక, యింట్లో, ఆఫీసులో, ఇంటి పరిస్థితుల్లో, ఎవర్కైనా సుస్తీ చేసిన పరిస్థితుల్లో డబ్బు

యిబ్బందిగా ఉన్న పరిస్థితుల్లో అయినా సరే క్రమంగా మనం చేస్తున్న పొరపాట్లు తగ్గిపోతాయి. గనుక వికల్పం కలిగించే పరిస్థితులు కూడ తగ్గుతూ ఉంటాయి ఆనాటికి ఆనాటికి. ఎందుకంటే చేయవలసినవి చేసి, చేయదలచినవి చేయటం మానేస్తున్నారు కదా. అంటే ''కార్యం కర్మముక్త సంగ సమాచరా'' 'కార్యంకర్మ' అంటే చేయవలసినవి చేయి. చేయదలచినవి మానేయి అన్నాడు. చేయాల్సిందేదో నీ దగ్గరికి వస్తుంది. ఫాన్సీకోసం చేసేదైతే యిరుక్కుంటాడు. అందుకే వేలు పెట్టకు ప్రతిదాంట్లో అన్నాడు. అందుకని 'తతః పునః' అపుడు మళ్ళీ చక్కని ప్రశాంతమైనటువంటి సమాధి స్థితి వచ్చి, దాని రుచి తెలిసి నిగ్గులు తెలిసి 24 గంటలు తైల ధారవలే అవిచ్ఛిన్నంగా నీకు అంతర్యామి స్థితి ఉంటుంది. చూసారా, ధారగా పోస్తూంటే నీళ్ళధార వేరు, తైలధార వేరు. నీళ్ళధారలో బడబడ మధ్యన ఖాళీలు ఉంటాయి. తైలధారలో ఖాళీ ఉండదు. అలా వస్తుంది ఆ స్థితి. అప్పుడు 'శాన్తోదితౌ' శాంతస్థితి, ఉదితస్థితి, రెండూ కూడ మనస్సులు, అంటే merging and energing of mind. అది వరకు ప్రతిక్షణం, పైకి లేవటం, దాన్ని నవ్వు మళ్ళీ లీనం చేయటం, లేవటం, లీనం చేయటం అంతకంటే తక్కువ ప్రయత్నంలో చేస్తూ, బాగా నీకు వచ్చిన తర్వాత మనస్సు మీద స్వామిత్వం వస్తుంది. యాభైఏళ్ళు బొంబాయిలో ఉన్నటువంటివాడు సాయంత్రం పూట మంచి రద్దీ సమయంలో వెడుతూంటే వస్తున్నటువంటి ట్రాఫిక్‌ని, ఆ మనుష్యులని చూస్తాడు కాని ఎవర్నీ చూడడు. చక్కగా అలా పువ్వల్లే డ్రైవ్ చేస్తూ ఉంటాడు. నీతో మాట్లాడుతూ ఉంటాడు. ఒక ప్రక్కనించి ఏమవుతోంది? చూచుట, చూడకపోవుటా? అని మధ్యన ఉన్నటువంటి భేదము నశించెను. అంత రద్దీగా ఉన్న రోడ్లమీద కూడ మీతో మాట్లాడుతూ డ్రైవ్ చేస్తున్నాడు. మనం కూడ అలా చేస్తే తెలుస్తుంది. యోగసూత్రాలు బట్టీపట్టినా, శాస్త్రాలు బట్టీ పట్టినా ఇది తేలేది కాదు అది ఈ సూత్రంలో చెప్పినటువంటి అంశము. 'శాన్తో దితౌ' మనస్సు శాంతమవ్వటమునన్నా, మళ్ళీ ఉదితం అంటే పుట్టటమునన్నా 'తుల్యప్రత్యయౌ' సమాన లక్షణములు కలవి అయిపోతాయి నాయనా అన్నాడు. ఏమి ఆశ్చర్యం. అనుభవిస్తే తెలియవలసిందే కాని లేకపోతే తెలిసేది కాదది.

టైపు చేయడం తెలియనివాడిని కూర్చోబెట్టి a s d f లు కొట్టిస్తే అదే బ్రహ్మవిద్య వాడికి. ప్రారంభంలో a s d f లు కొట్టించి అది అయిన తర్వాత కొన్నాళ్ళు రెండు అక్షరాల పదాలు, మూడు అక్షరాల పదాలు కొట్టించి చివరికి కొన్నాళ్ళు అయ్యాక క్రమంగా కొట్టవలసిన ప్రక్కనున్న కాగితం వైపు చూస్తూ టైపు మిషన్ వంక చూడకుండా టపటప కొట్టేస్తాడు. ఆ విషయం అభ్యాసం చేసినవాడికి తెలుస్తుంది. లేనివాడికి, లేదా రెండు మూడు రోజులు చూసి ఇవతలకి వచ్చినటువంటి వాడికి నిజమా అనిపిస్తుంది. అలాంటి స్థితి ఇది. ఈ చూడకుండా టైపు కొట్టినంతసేపు ఏది టైపు కొడుతున్నావో, అందులో వాక్యాలుగాని, ఆ పేరాగ్రాఫులు గాని, అందులో ఏం చెప్పారో అవి మళ్ళీ వేరే చదువుకుంటే తప్ప నీకు తెలియదు. తెలిస్తే తప్పులు కొడతాడు. If the typist is conscious of the matter he is a very bad typist. సరిగ్గా అభ్యాసం చేసి, ఆ డబ్బావైపు చూడకుండా టైపు చేసిన వాడికి ఆ స్థితులన్నీ వెళ్ళిపోయి, దాని వంక చూడనే చూడడు. అవి నడచిపోతూంటాయి. ఏ పుస్తకం టైపు చేసినా దానిలోని అక్షరాలు కూడ లోపల అంటనటువంటి నిర్లిప్తత వచ్చేస్తుంది. టైపుకొట్టి యివతలకి వచ్చేటప్పటికి ఏం మాటలు కొట్టేవురా అంటే ఏమో! ఈ రెండు స్థితులు ఉంటేనే టైపు రైటింగ్‌లో సిద్ధుడు. కనుక 'తుల్య ప్రత్యయౌ' సమానమైన లక్షణములు కలిగినవి అవుతాయి. శాంతి ఉదితములు అంటే మనస్సు ప్రశాంత మవ్వటమున్నూ, మనస్సు లేవటమున్నూ రెండు కూడ ఒకే లక్షణముగా ఉంటాయి. లేవనూ లేవదు. ప్రశాంతం కాను కాదు. రెండూ తనలో గర్భితము చేసుకున్నటువంటి అస్థిత్వమునందు ఉంటుంది. Existence, being ఇవేవి ఉండవన్నారు. H.P.B. అంటే పరబ్రహ్మ స్థితి. పరబ్రహ్మని చూస్తే ఇంకేం కనిపించవుట అంటే పొరపాటు. ఆయనలో అన్నీ ఉన్నాయి అని తెలియాలి. అది చూశాక యింకేం ఉండదు. కనిపించకపోవటం కాదు. కనుక 'తుల్యప్రత్యయౌ' ఈ తుల్యమైనటువంటి ప్రత్యయములు వచ్చి ఏకమై (identify) పోతాయి. అపుడు 'చిత్తస్య' నీ చిత్తమునకు 'ఏకాగ్రతా పరిణామః' ఏకాగ్రతయందు నిజమైనటువంటి చక్కని పరిణామము కలుగును. ఏకాగ్రత అంటే జీవిత

పరమావధియందు direction of your life అని చెప్పారు కదా! 'తతః' అటు పిమ్మట 'పునః' మరల 'శాంతోదితౌ' శాంతించి మళ్ళీ ఉదయిస్తూన్నటువంటి చిత్త స్థితులు రెండును 'తుల్య ప్రత్యయౌ' సమాన లక్షణములుగా, పూర్తిగా కలిసినవిగా అయిపోయినవియై, అంటే శాంతించనూ శాంతించదు, ఉదయించనూ ఉదయించదు. యింక ఏముంటుంది? చిత్తం ఉంటుంది. వృత్తి ఉండదు. అందుకనే మొట్టమొదటిగా పతంజలి గారు జాగ్రత్తపడ్డారు. చిత్తవృత్తి నిరోధంగాని, చిత్త నిరోధం కాదు అన్నారు. ఇలా మనస్సు బిగించాలని కళ్ళెం వేసుకొని పది, ఇరవై సంవత్సరాలు ప్రయత్నంచేస్తే, చిత్త నిరోధానికి ప్రయత్నం చేస్తున్నట్లు సాధ్యం కాదు. కృష్ణుడు అన్నాడు. ''అసంశయం మహాబాహో మనోదుర్నిగ్రహం చలం'' మనస్సుని నిగ్రహించటం అనేటువంటిది ముమ్మాటికీ సాధ్యంకాదు. సందేహం లేదు. దానికోసం ప్రయత్నం చేసినవారు జీవితాన్ని వ్యర్థం చేసుకొని దాంట్లో చచ్చిపోతారు. Concentration కోసం ప్రయత్నించిన వాళ్ళకి ఎన్నేళ్ళు చేసినా ఒక్క పిసరు వచ్చినట్టు, నిలబడ్డట్టు, మళ్ళీ పోతున్నట్టు ఉంటోంది. చివరకు ఏమీ వచ్చేది లేదు. కాబట్టి concentration కాదు కావలసింది, relaxation of the lower mind on the back of the higher mind. అంటే concentration కి opposite జరగవలసింది. అప్పుడు చిత్తానికి నిజమైన ఏకాగ్రత వస్తుంది. జీవితం అనేది ఒకే వైపుకి ప్రవహిస్తున్న నదిలాగ వస్తుంది. అన్ని ప్రక్కలకి తలోకాస్త కాలవల్లాగ, పంపుగొట్టాలు లాగ ఉండకుండా ''వ్యవసాయాత్మికా బుద్ధిః ఏకేహ కురునందన'' వ్యవసాయాత్మికమైనటువంటి బుద్ధి ఒకే మార్గంలో వెడుతుంది. ఒకే పాయింటు మీదకి, ఒకే సబ్జక్టు మీదకి వెడుతుందని కాదు. జీవితాన్ని లైన్లో నడిపిస్తుంది. లేకపోతే యోగాభ్యాసం అనవసరం. సరిగ్గా జ్వాలాకూలుడు యిదే యిచ్చారు. కనుక చిత్తానికి ఏకాగ్రత వచ్చి అంతే గాకుండా దాని పరిణామం మీద చక్కగా నిలిచేట్లు చేస్తుంది. అంటే ఏకాగ్రతలో ఉన్నటువంటి రుచులు కూడ మీరు సోపానక్రమంలో అనుభవిస్తారు. జీవితంలో 24 గంటలూ ఒకే స్థితి ఉంటుంది. ఒకే స్థితికోసం జీవిస్తారు. ఇంట్లో జీవితం ఒకే స్థితికోసం ఉంటుంది. ఆఫీసు

జీవితం ఒకే స్థితికోసం ఉంటుంది. ''తదర్థ్రం కర్మ కౌంతేయ ముక్త సంగ సమాచర'' అన్నాడు. జీవిత పరమార్థం ఒకటి పెట్టుకో. దానికోసం చేయి. చూశారా ఒక దేవుడి బొమ్మో లేకపోతే ఒక పటమైనా పెట్టి, చేసుకున్న వంటని నైవేద్యం పెట్టిన తరువాత తినేటువంటి వాళ్ళు ఇంట్లో ఉన్న భోజనానికిన్ని, అలా గాకుండా ఎవరి యింట్లో వాళ్ళు ఇంతకూడు వండుకుని తినేవాళ్ల యింట్లో ఉన్న భోజనానికిన్నీ శుచిత్వంలో ఎంత తేడా ఉంటుందో, జీవితంలో ఏకాగ్రత ఉన్నవాడికి, లేనివాడికి అంతే తేడా ఉంటుంది. పశుప్రాయమైన జీవితం (beastly living) ఉంటుంది. తెలిసినా తెలియక పోయినా దేవతార్చనో, ఓ దేవుడి పటమో పెట్టుకొని నైవేద్యం పెట్టి తినడం ఉచితం. ఏదన్నా విగ్రహం పెట్టుకుంటే దానికి నైవేద్యం పెట్టాలి కాబట్టి విగ్రహం పెట్టం ఈ కలియుగంలో. విగ్రహం పెట్టినా మనం పెట్టినది తినడు. పటం పెట్టినా మనం పెట్టినది తినడు. ఒక్కరోజున మనం పెట్టిన దాంట్లో కొంచెం ముక్క తీసుకుంటే మళ్ళీ మర్నాడు ఇంక నైవేద్యం పెట్టం. వాడు తినడని తెలుసు కాబట్టి నైవేద్యం పెడుతున్నాం. దేవుడికి నైవేద్యం పెట్టటంకోసం చేసినా ఫలితం తినేవాళ్ళ రూపంలో ఉన్నటువంటి వాసుదేవుడికే. ఈ రహస్యాలు తెలియవు. కనుక వీడి యింట్లో ఉన్నటువంటి శుచి, శుభ్రం మొదలైనటువంటివి, ఆ మొట్టమొదటి వాడి యింట్లో ఎన్నడూ ఉండవు. అంటే ప్రయోజనం (motive) అనే దాన్నిబట్టి ఉంటుంది. అందుకని శుభ్రమైన పరిణామం ఏకాగ్రతా పరిణామము. జీవితం ఒక మార్గాన వెళ్ళటం అనేటువంటి దాంట్లో పరిణామం వచ్చి, ఆ మార్గంలో వెళ్ళటం, అది తప్పి ఒక్క పిసరు అటుగాని, ఇటుగాని నడిచేటువంటి పనిగాని, ఊహగాని, మాటగాని చెయ్యవు. పొరపాటున కూడ ఆయనకి అలాంటి ఊహ రాదు. ఆయన కాలు గిన్నెలకి గాని, మనుష్యులకి గాని నడుస్తుంటే ఎందుకు తగలదు. మనం నడుస్తూంటే అనేకమాట్లు వస్తువులకి కాళ్ళు తగిలి కిందపడిపోతూ ఉంటాయి కదా. చేతులు అద్దానికి తగిలి అద్దం ఎన్నిమాట్లు పడిపోతుంది. దువ్వుకుంటూ ఉంటే దువ్వెన ఎన్నిమాట్లు పడిపోయింది. ఇట్లాంటి అపరిపూర్ణతా చర్యలు వాడికి జరుగవు. ఎన్నాళ్ళు పరిశీలించినా వాడి కాలు

ఒక వస్తువుకి కాని, ఒక మనిషికి కాని తగలదు. వాడు జాగ్రత్త పడక్కర్లేదు. వాడికా స్థితి వచ్చేసింది. తుల్యప్రత్యయములై పోయినాయి. జాగ్రత్త పడటం, పడకపోవటం రెండింటిలో భేదం నశించింది. అంటే instinctively he is cut. He is alert అనే స్థితిపోయింది. He is aware అన్న స్థితి వచ్చింది. అంటే alertness అనే దుస్థితి నించి awareness అనే సుస్థితికి వచ్చాడు. ఈ మార్పు వస్తుంది. ఎవరన్నా వాణ్ణి తిట్టినా, అవతలివాడు ఎందుకు తిట్టాడో అర్థం చేసుకునే పద్ధతిలో ఉంటాడు. అయ్యో మనం ఈ పొరపాటు చేసామే, జీవితంలో మనకింత ఆపద కలగబోతూంటే ఆయన ఇటు తిప్పి చెప్పాడు కనుక మనకి అర్థమైంది అని తెలుస్తుంది గాని తిట్టాడే అనే పాయింటు ఉండదు. అలాంటి వాళ్ళున్నారు. నరజన్మ ఎత్తినందుకు జీవిత దృక్పథం ధన్యంగా ఉండాలి. పశుత్వానికి సంబంధించిన జీవితం కాకుండా, జీవిత పరమావధి తెలిసినటువంటి పద్ధతి ఉండాలి. దాంట్లో అప్రయత్నంగా యివి జరుగుతాయి. ప్రయత్నంచేత ఎన్నాళ్ళో చేయలేరు యిలాంటివి. స్నానంచేసి తాడుమీద తుండుగుడ్డ వేస్తే నాలుగు అంచులు కూడ సరిగ్గా indentical గా ఉంటాయి. అలాంటి తేడా కూడ రాదు. Perfection కోసం పనిచేసే వాళ్ళు అలా ఉంటారు. Perfection కోసం పనిచేద్దామని అనుకున్నవాడు ఎన్నడూ చేయలేడు. టెన్షన్ వస్తుంది. B.P. వస్తుంది. పడిపోతాడు. ఏం లాభంలేదు. ఇక్కడ ఆ స్థితిని గురించి చెబుతున్నాడు. ఏకాగ్రతా పరిణామము అంటే అర్థము అది. జాగ్రత్తగా మనం గమనించుకోవాలి. ఇక్కడ జ్వాలాకూలుడు ఏమని వివరించాడో చూడండి. అదికూడ తీసుకోండి. ఎందుకంటే చాల ఉత్తమోత్తమమైన మహాసూత్రాల్లో ఒక సూత్రం గనుక. 'తతః పునః' అన్న మాటలకి 'Then again' అని యిచ్చాడు. 'శాన్తోదితౌ' అన్న రెండింటికీ The merger and the emerger అని యిచ్చాడు. అని బ్రాకెట్సులో ఏమని యిచ్చాడంటే (The mind controlled and the controller) ఏకాగ్రత అన్నదానికి one direction for life. 'పరిణామః' అంటే evolution. 'చిత్తస్య' అంటే to the chitta. ఇది ఆయన ఇచ్చినటు వంటిది. ఇపుడు మనం చెప్పుకున్నటువంటి వ్యాఖ్యానంతో

సరిపోయింది. ఈ నాలుగైదు సూత్రాలకి ఒక (caution) హెచ్చరిక యిచ్చాడు. శిష్యురాలికి ఈ చోటనే పది పన్నెండు సూత్రాలకి ఆయన వ్యాఖ్యానం రాసారు. మిగిలినవన్నీ ఆమెనే రాసుకోమన్నాడు. ఆయన రాసిన పుస్తకం కాదు. ఏలిస్. ఏ. బెయిలీ పతంజలి యోగ సూత్రాలకి కూడ నేను రాస్తాను, మీరు చెప్పండి అంది. నువ్వు నెగ్గలేవు వద్దన్నాడు. నేను సొంతంగా రాస్తాను, క్లిష్టమైనపుడు అడుగుతాను చెప్పండి అంది. అలాగే తప్పకుండా చెబుతాను అన్నాడు. కాని చాల కష్టపడిపోతావు, పెద్దదానివి అయిపోయినావు అన్నాడు. వయస్సు అప్పటికి చాల వచ్చేసింది ఏలిస్. ఏ. బెయిలీకి. శరీర ఆరోగ్యం కూడ మాట వినటం లేదు. కష్టపడిపోతావు. పోనీ ఏంపోయింది యింకోళ్ళు రాస్తారు కదా అని కొన్నాళ్లైన తర్వాత అన్నాడు. కాదు రాస్తాను అని మొదలు పెట్టింది. "The light of the soul" అని ప్రారంభం చేసి రాస్తూంటే ఎక్కడెక్కడ యిబ్బంది కలిగిందో అక్కడక్కడల్లా మనస్సుతో ఆయన్ని ఆవిడ పిలవటం, ఆ పిలిచిన చోట ఆయన అనువాదము, వ్యాఖ్యానము, వివరణము ఇచ్చారు. ఇక్కడ యిచ్చినటువంటి ఏడెనిమిది సూత్రాలకి స్వయంగా తాను కూర్చోపెట్టి చెప్పారు: మొదట్లో ఆయన ఏం చెప్పాడంటే వ్యాఖ్యానకారులు ఒక్కొక్కపుడు ఒక్కొక్కలాగ వివరించారు (ఈ 7,8 సూత్రాలకు) కాని చదివినటువంటి వాళ్ళు ఎవరూ కూడ వీటితో యోగ దర్శనము పొందుటలేదు. అందుచేత మొహమాటం లేకుండా నేను అభ్యాసం చేసినవి మా గురువులైన మోరియాగారు, కుత్‌హూమిగారు అనే వాళ్ళదగ్గర నేను అభ్యాసం చేసిందిన్నీ, నా శిష్యులైన బ్లావెట్స్కీ, ఏలిస్ ఏ. బెయిలీ మొదలైన వాళ్ళకి నేను అభ్యాసం చేయించినదిన్నీ యిక్కడ నా అనుభవ పూర్వకంగా చెబుతున్నాను. కావాలంటే తీసుకోండి. లేకపోతే వీళ్ళిద్దరికే పనికొస్తుంది అన్నారు. అట్లాంటి గడ్డు అయిన సన్నివేశాలు యివి, గ్రంథ గ్రంథులు. అంచేత 20వ శతాబ్దంలో జ్వాలాకూలుడి యొక్క వివరణ ఈ 7,8 సూత్రాలకు లేనట్లయితే, ఆకాశంలో ఏదో జరుగుతోందిట, మానవ లోకంలోది కాదుట, వాళ్ళేదో పెద్ద దేవలోకంలో విషయాలు చెప్పారు, మనకి బోధపడేవి కావుట అనేది మిగుల్తుంది. మనం చేయటానికి ఏం మిగలదు.

## 13. ఏ తేన భూతేన్ద్రియేషు ధర్మలక్షణావస్థా పరిణామా వ్యాఖ్యాతాః॥

ఏ తేన = దీనివలన (పై చెప్పిన మార్పు మీలో వచ్చుట వలన), భూతేన్ద్రియేషు = భూతముల యందును, ఇంద్రియముల యందును, ఇంద్రియార్థముల యందును, ధర్మలక్షణావస్థా = ధర్మములు, వాటి లక్షణములు, వాటి అవస్థలు, వాఖ్యాతాః = వివరింపబడినవి.

**దీనివలన దేహములోని పంచభూతముల యందును, ఇంద్రియముల యందును, వానివాని ధర్మముల యందును, లక్షణముల యందును చిత్తముయొక్క స్థితిగతుల యందును (ఒక లోకాతీతమైన) మార్పు వచ్చునని చెప్పినట్లే.**

**వివరణ :** 'ఏతేన' అంటే దీనివలన, దేనివలన? ఈపై రెండు సూత్రములలో చెప్పిన మార్పు మీలో వచ్చుట వలన, ఆ పరిణామమును మీరు గుర్తెరిగి రుచి చూచుట వలన, అనగా చిత్తము శాంత మగుటకును, ఉదిత మగుటకును భేదము లేని స్థితి వచ్చుట వలన, అంటే మనస్సు పుట్టటం, మనస్సు లయమవ్వటం అనే భేదం నశించటం అనేది మీకు రావటం వలన ఏమి వస్తుందో చెబుతున్నారు. ''భూతేన్ద్రియేషు'' నీ దేహంలో ఉన్నటువంటి భూతముల యందును, ఇన్ద్రియముల యందును కూడ మార్పు వస్తుంది. భూతములు అంటే పంచభూతములు పృథివి, ఆపస్, తేజో, వాయు రాకాశములు. శరీరం నిర్మాణము అవుతుంది. యివికాక యింద్రియములు (జ్ఞానేంద్రియములు, కర్మేంద్రియములు). ఈ ఇంద్రియములలో పనిచేస్తున్నటువంటి అబద్ధాల నేను లేక జీవుడు, ఆ లోపల ఉన్న నిజమైన నేను లేక ఈశ్వర శబ్ద వాచ్యుడు. ఇది కదా ఈయన ఇచ్చినది. పతంజలిగాని, భగవద్గీతలోగాని, ఉపనిషత్తులలోగాని, పురాణములలోగాని మార్పు లేకుండా మన కిచ్చినటువంటి ఒకే ఒక్క వ్యూహమిది. ఇందులో 'భూతేషు ఇన్ద్రియేషు చ'' అంటే భూతముల యందును, ఇన్ద్రియముల యందును, అంటే ఇంకా ఈ ఇన్ద్రియముల యొక్క అర్థముల యందు. ఇన్ద్రియార్థములు అంటే కంటికి లైటు నందును, చెవికి శబ్దము నందును, ముక్కుకి సుగంధము, దుర్గంధము మొదలగు వాటి యందును ఉంటుందన్నమాట. 'ధర్మ లక్షణావస్థా'

ఇక్కడ కొత్తవైనటువంటి స్థితులు వస్తాయి. ఇదివరకెలా ఉన్నాయి? నిద్రపోతూంటే లైటు వేసారు. అంటే లైటుకి కన్ను respond కాదా! పిల్లవాడు రెండురోజులైంది పుట్టి అప్పుడే పడుకున్నాడు ఉయ్యాలలో. గది చీకటిగా ఉంది. పక్కని లైటు వేసాం. తర్వాత వాకిట్లో పెద్ద పిల్లవాడు ఏం చేసాడు? ఆటంబాంబు పేల్చాడు. అంటే దీపావళి సందడి. ఉయ్యాలలో కుర్రాడు ఉలిక్కిపడ్డాడు. రెండు రోజులే కదా పుట్టివాడు. నాలిక మీద పాలచుక్క రాస్తే 'ఆ' అన్నాడు, ఇట్లాగ పంచేంద్రియముల యొక్క అర్థములు. వాడు అలా అన్నాడు. ఇలా అన్నాడు. పిల్లవాడంటున్నాం గాని మనం కూడ అంతే. కాకపోతే యింగ్లీషులోనో, హిందీలోనో, సంస్కృతంలోనో, తెలుగులోనో అంటున్నాం. వాడు సూటిగా అంటున్నాడు, వాడు అవేమి ఎరగడు కనుక. చక్కెరవేసి నాలికమీద పాలువేస్తే, వాడికి చక్కెర, పాలు, తీపి అనేటువంటి పదములు అడ్డము లేవు గనుక సూటిగా అనుభవిస్తున్నాడు. మనం పదములు, పదార్థములు మొదలైన దరిద్రమంతా పెట్టుకొని అనుభవిస్తున్నాం. కుర్రాడికి లైటే ఉంటుంది గాని లైటు అనే పేరుండదు. కనుక ఆ స్థితిలో ఉన్నటువంటి వాళ్ళం అంటే యోగాభ్యాసంలో ధారణ, ధ్యాన, సమాధి స్థితులలో చక్కని పరిణామము వచ్చాక సంయమము అనే స్థితిలో బాగా ఆరితేరి దరిచేరి మీకు వచ్చిన తరువాత ధర్మము లుంటాయి. ''ధర్మ లక్షణావస్థా'' అంటే ఉప్పు ఉప్పగా ఉంటుంది. చక్కెర తియ్యగా ఉంటుంది. నీరు ఎత్తునించి పల్లానికి ప్రవహిస్తుంది. నిప్పు పల్లం నించి పైకి మండుతుంది. ఇవి ప్రకృతి ధర్మములంటే, ప్రకృతి ధర్మములు, సృష్టి ధర్మములు, మానస ధర్మములు, ఇంద్రియ ధర్మములు మొదలైనవి. ఇపుడు అవి, మనం వాటికి నేర్పినటువంటి నీతితో పనిచేస్తున్నాయి. ఈ అభ్యాసమైన తర్వాత ఈ న్యూసెన్సు అంతా పోతుంది. కేవలం ధర్మములు మిగుల్తాయి. ''తాని ధర్మాణి ప్రథమా న్యాసన్'' సృష్టి లేకుండా ఉన్నపుడు కూడ, చోటులో ఈ ధర్మాలన్నీ ఉన్నాయి. సృష్టి ఆ ధర్మాల ప్రకారం వస్తుంది. పుట్టగానే కుర్రాడు ఆ ధర్మాల ప్రకారం శ్వాస పీలుస్తాడు. వాడికి రసాయన శాస్త్రం రాకపోయినప్పటికి ఆక్సిజన్‌నే పీలుస్తాడు. కార్బన్‌డయాక్సైడే వదుల్తాడు. వాడికి నాలికమీద పాలచుక్కలు వేస్తే చప్పరించటం అనేటువంటిది చేస్తాడు. కాని కొంత పెద్దవాళ్ళం అయిన

తర్వాత మనమేం చేస్తున్నాం, వక్క కూడ చప్పరిస్తున్నాం. వాడి నాలికమీద వక్క వేస్తే చనిపోతాడు. ఎందుకంటే చప్పరించకూడదు గనుక. మనం మెల్లిగా కూడనిది అభ్యాసం చేసి బ్రతక గలుగుతున్నాం. అలాగే మనం కాఫీ కూడ చప్పరించ గలుగుతున్నాం. కుర్రవాడికి మొట్టమొదటి పూట కాఫీపోస్తే అసహ్యించుకుంటాడు. రెండవరోజున మూడవరోజున పోస్తే మన adults వలన adulterate అయ్యి, వాడు కూడ కాఫీ తాగటం మొదలు పెడతాడు. కొంచెం పెద్దవాడైన తర్వాత మనం చేసేవన్నీ అలవాటవుతాయి. కాని క్రమంగా మళ్ళీ re-establish అవుతుంది. అంటే అపుడే పుట్టిన కుర్రవాడికి కేవలం ఉన్న ధర్మములు మాత్రమే పనిచేస్తాయి. తీపితీపిగా ఉంటుంది. పులుపు పులుపుగా ఉంటుంది తప్ప, నోట్లో వక్క వేసుకుంటే హాయిగా ఉండడం ఉండదు. కాని మనం అభ్యాసం చేసుకొని తింటున్నాం గనుక బావుంటుంది. బావుండటం అంటే ఏమిటి? బావుండక పోవటం అభ్యాసం చేయటాన్ని బావుండటం అంటున్నాం. అంతే కదా? ''అనగనగ రాగ మతిశయిల్లుచు నుండు తినగ తినగ వేము తీపియగును'' అన్నాడు వేమన. మొదట మాటు తింటే ఏడిసినట్లుంటుంది. రెండవమాటు తింటే తక్కువ ఏడిసినట్లు ఉంటుంది. ఒక నెలరోజులు తింటే తియ్యగా ఉంది అంటాడు. మనం వక్క తింటున్నా అంతే కదా. వక్క, చుట్ట, బీడి మొదలైనవన్నీ ప్రాణానికి కావలసినవా? నాలికకి కావలసినవా? ఇంద్రియాలకి కావలసినవా? కన్నంలోంచి వాళ్ళు వీళ్ళు ఏమన్నా చేస్తున్నారేమో అని చూసినా అంతే. అంటే కంటికి కావలసినవా? వాళ్ళు వీళ్ళు ఏం చెప్పుకుంటున్నారో కన్నంల్లోంచి చెవులతో విన్నా అంతే. అంటే చెవులకి కావలసినవా అవన్నీ. అక్కర్లేనివన్నీ పనిచేస్తూన్నటువంటివి క్రమంగా పోతాయి. అవిపోయి అపుడే పుట్టినటువంటి పసిపిల్లవాడికి పంచభూతములు ఇంద్రియములు, ఇంద్రియార్థములు ఏ స్థితిలో ఉంటాయో, ఆ స్థితిలో అంటే ''ధర్మలక్షణావస్థాః పరిణామాః'' ధర్మము లక్షణముగా కలిగినటువంటి స్థితులు పరిణామములుగా కలవి వస్తాయి. మనకి ఏమిటి లక్షణంగా ఉంటుంది భోజనం చేసాక. చక్కగా ఆకు, వక్కయిస్తే లక్షణంగా ఉంటుంది. అది లక్షణంగా ఉండదు వాడికి. తినవలసిన పదార్థం తింటే లక్షణంగా ఉంటుంది. త్రాగవలసిన పదార్థం

తాగితే లక్షణంగా ఉంటుంది. అలాగే మనకి కూడ లక్షణంగా ఉండటం మొదలుపెడతాయి. మనం చేసిన వెధవ పనులన్నీ క్రమంగా తగ్గిపోతాయన్నాడు. పంచభూతాలకి కూడ శరీరము అంతే. తినకూడనివి తినడు. నాలికమీద ఇహ పడదు అంటాడు ఈ స్థితి వస్తే. అలాగే త్రాగకూడనివి తాగడు, చూడకూడనివి చూడడు, వినకూడనివి వినడు. అదివరకు కాలేజీల్లోను, ఆఫీసులోను చాలమాట్లు వాడిది, వీడిది ఉత్తరాలు చింపి చదివినటువంటి వాళ్ళం ఉంటాం. ఇప్పుడు అటువంటివి చదివితే తేలు కుట్టినట్లు ఉంటుంది. పొరపాటున చేస్తే రెండు మూడు రోజులు మరణవేదన అనుభవిస్తాడు. కనుక ఇహ చెయ్యడు. అంటే స్వాభావికంగా పరిశుద్ధి చెందుతాడు (instinctively he is pure). అప్రయత్న కృతమైనటువంటి ధర్మలక్షణావస్థా పరిణామము వస్తుంది అన్నాడు. పరిణామములు వస్తాయి అంటే ఏవి ధర్మములో అవే వాడియొక్క అవస్థలుగా, స్థితులుగా, వాడి మనస్సుయొక్క లక్షణములుగా (ఆ చిత్తము యొక్క) పరిణామములు వచ్చి, ఆ పరిణామములు వీడిలో కలుగుతాయి. 'వ్యాఖ్యాతాః' ఇవి ఈ నాల్గైదు సూత్రాల్లోంచి వివరింపబడిన మార్పులు. ఇవి శరీరందాకా వస్తాయి, శరీరంలో ఉన్న కణముల వరకు వస్తాయి. ''మహాయజ్ఞైశ్చ బ్రాహ్మీయం క్రియతే తనుః'' అశ్వమేధ పర్వంలో వేదవ్యాసుల వారితో శ్రీకృష్ణుడు ధర్మరాజు గురించి చెబుతున్నాడు. యుద్ధంచేసి వాళ్ళని చంపాం, వీళ్ళని చంపాం అని ఉసూరు మంటున్నాడు. పంచభూతాల్లో ఏవో దోషాలున్నవి. ఈయనచేత అశ్వమేధ యజ్ఞం చేయించు అన్నాడు. అలాంటి మార్పు వచ్చేస్తుంది. అంటే meta-morphosis, down to the cells of the body అన్నాడు జ్వాలాకూలుడు. మసాలాలు మానేసి, పప్పు పదార్థములు, చమురు పదార్థములు, ద్రవ్యములు అంటే పాలు, పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి అవి తిన్నపుడు ఆవుమాంసం ఎందుకు తినకూడదు? యోగాభ్యాసం చేసేవాడు తినకూడదు. ఎందుకంటే యివన్నీ యిచ్చినటువంటి ఆవుకూడ బ్రతికుండాలని కోరితే యోగాభ్యాసానికి పనికొస్తావుగాని, అది కోరనివాడు యోగాభ్యాసానికి పనికిరాడు. ఎందుకంటే యోగాభ్యాసం నీ చిత్తంలో రావలసిన మార్పు తప్ప, ఒంట్లో కొవ్వులోను, మదంలోను రావలసిన మార్పు కాదు. అందుకని అక్కర్లేనటువంటి ప్రశ్నలు

వేసి ఏమీ లాభం లేదు. కావాలంటే చేయడం, లేకపోతే మానేయడం. ఎవడి హృదయం వాడిది. అందుకని ధర్మలక్షణావస్థ వచ్చి పరిణామం వస్తుంది శరీరంలో. పండ్లు తినండి. పండ్లరసాలు తాగండి. తేనె తీసుకోండి అన్నాడు జ్వాలాకూల్ మహర్షి. ఇప్పటికీ తేనె తప్ప యింకోటి త్రాగని వాళ్ళున్నారు. కోయగూడెంలోంచి రాజు ఒకాయన చూద్దామని వచ్చాడు. మేము తేనె తప్ప యింకోటి తాగం కనుక ఈ వయసులో కూడ నల్లగా ఉంటుంది మాజుట్టు చూడండి అన్నాడు. మీరు కాఫీలు అవి త్రాగుతారు కనుక మీజుట్టు తెల్లగా అయిపోయిందంటే అందరూ నవ్వారు. అటువంటి వాళ్ళని చూచి నేర్చుకోవాలి. బెర్నాడ్‌షా చెప్పాడు **Men laugh because they can not weep.** ఒక వయస్సు దాటిన తర్వాత ఏడవటానికి మనకి స్వేచ్ఛ లేదు కనుక నవ్వుతాము అన్నాడు. సైకిలు మీంచి కిందపడి లేచి నవ్వుతాము. పిల్లవాడయితే ఏడుస్తాడు. బెర్నాడ్‌షా గమ్మత్తుగా చెప్పాడు.

ఆహారం మార్చాలి. తేనె త్రాగమన్నారు. పళ్ళు తినమన్నారు. ఆహారం అనే అధ్యాయంలో **"Ponder on this"** అనే పుస్తకంలో. జ్వాలాకూలుడు చెప్పాడు. చిట్టచివరికి నిమ్మ, నారింజ మొదలైనవాటి రసంచేత శరీరాన్ని నిరంతరం పోషణం చేస్తూ ఉండండి అన్నారు. అలాచేస్తే పదేళ్ళలో ఆరోగ్యంలో రావలసిన మార్పు వస్తుంది. ఒకటి రెండు జన్మలలో పంచభూతాలలో రావలసిన మార్పు వస్తుంది. ఈ లోపల రాదు. లేదా పదేళ్ళలో యోగాభ్యాసం కూడ చేస్తే పంచభూతాల్లో రావలసిన మార్పు వస్తుంది. అది జ్వాలాకూలుడు చెప్పింది. పదేళ్ళలో ఊరికే ఆహారం మార్చుకొని తింటూ ఉంటే ఏమవుతుంది? ఆరోగ్యంలో మార్పు వస్తుంది అన్నాడు. మంచి రంగు వస్తుంది. శుభ్రంగా దబ్బకాయలాగ తయారవుతాడు మనిషి. ఇవన్నీ బాగుంటాయి. ధాతువులలో మార్పు రావాలంటే రెండు మూడు జన్మలు పడుతుందన్నారు. లేదా యోగాభ్యాసమున్నా, ఇది కలిపి మొదలుపెట్టు. ఈ జన్మలోనే పదేళ్ళలో వస్తుందన్నాడు. కనుక ''ఆహార శుద్ధౌ సత్వ శుద్ధిః'' ఆహార నియమం దగ్గర కోతలు కోసేవాడు, శాకాహారం గొప్పదా, మాంసాహారం గొప్పదా అని చర్చించేవాడు, తప్పుడు లౌకిక అభిప్రాయములు కలవాడు యోగాభ్యాసానికి పనికిరాడు ఈ జన్మకి. కనుక 'ఏతేన' దీనిచేత అంటే పై చెప్పబడిన విధానము చేత 'భూతేన్ద్రియేషు'

పంచభూతముల యందు, ఇంద్రియముల యందు, ఇంద్రియార్థముల యందు 'ధర్మలక్షణా వస్థా పరిణామాః' ధర్మములు వాటి లక్షణములు, వాటి అవస్థలు, వాటి పరిణామములు, 'వ్యాఖ్యాతాః' చక్కగా వివరింపబడినవి సుమా. దీనికి జ్వాలాకూల్ మహర్షి చెప్పిన అనువాదం కూడ చెబుతాను. 'ఏతేన' అన్నదానికి through this process. భూతేన్ద్రియేషు అన్నదానికి aspects of everything and every object. అంటే మన శరీరంలో ఉన్నటువంటి అణువణువు, కణం కణం ధ్గరనించి, మనచుట్టూ ఉన్నటువంటి ఇంద్రియార్థములు వీటి సమస్తమూ, వీటిదగ్గర నించిన్నీ అని అర్థం. 'ధర్మలక్షణా వస్థా పరిణామాః' అన్నదానికి ఈ మొత్తానికి their characteristics bestowed by nature, their characteristics which are of highly symbolic in nature, specific in time and other conditions are made known to you. అంటే యిక్కడ ఈ సూత్రాల్లో వివరించామని కాదు ఆయన చెప్పింది. ఇది అభ్యాసం చేసినందువల్ల తెలుస్తుంది. వ్యాఖ్యాతం అవుతుంది అన్నాడుగాని, సూత్రాల్లో కాదు. యిక్కడ జాగ్రత్తగా అది సూచన (point out) చేసారాయన చూడండి. అంటే ఈపై చెప్పిన సూత్రములలో వివరింపబడిన సాధన అభ్యాసం చేస్తూంటే ఇందులో చెప్పబడిన అర్థము వివరింపబడినట్లు you will know it will realise it. అపౌరుషేయమైన వివరణం గురించి చెప్పారిక్కడ.

Appearence and disappearence of mind అనేటువంటి శీర్షికలో ఈ మూడవ అధ్యాయంలో చెప్పబడిన మనస్సుయొక్క ఆవిర్భావము, తిరోధానవము, నిద్రపోతూండంగ మనస్సు ఉండకపోవటం అవన్నీ మామూలుగానే జరుగుతాయి గాని ఎవరికీ తెలీదు. నిద్ర మెలకువ వచ్చిన తరువాత అంతకు ముందు మనం నిద్రపోయామని తెలియాల్సిందేగాని నిద్రపోతూండంగ నిద్రపోతున్నామని ఎవడికి తెలుస్తుంది. తెలిస్తే అది నిద్రకాదు. అందుకని మనస్సు ఆగిపోవటం, తెలియటం అనేది యోగాభ్యాసం చేసినవాడికి తప్ప, యింకెవడికీ తెలియటానికి అవకాశం లేదు. లేదా చాల పర్యాయములు వాతావరణాన్ని పరిస్థితుల్ని బట్టి, మనస్సు ఆగిపోవటం అనేది జరిగి ఉండికూడ, తను గమనించక పోవటము జరుగుతుంది. మనస్సు ఆగిపోవటం

అనేది పెద్ద బ్రహ్మాండమైన బ్రహ్మవిద్య కాదు. మనకి వారానికి ఒకమాటో లేదా ఒక్కొక్కపుడు రోజుకి రెండు మూడు మాట్లో జరుగుతూ ఉంటుంది. ఉదా: ఉత్తమమైనటువంటి సంగీత కచేరీకి వెళితే ఆ సంగీత కచేరీ ప్రారంభించేటప్పటికి కచేరీలాగే ఉంటుంది. అక్కడ కూర్చున్నవాళ్లు ప్రతి యిద్దరూ మాట్లాడుకుంటూ ఉండటం వాడు ఏ ఊళ్ళో ఉన్నాడో, ఆ కచేరీ ఎక్కడ జరుగుతుందో, ఏ వారమో, అప్పుడు టైమెంతో యిట్లాంటివన్నీ కూడ పనిచేస్తూ ఉంటాయి. అదికాక ఒకళ్ళతో ఒకళ్ళు మాట్లాడుకుంట మొదలైనవి ఉంటాయి. కచేరీ మొదలు పెట్టేసరికి దాంట్లో లీనమై తాను వెళదామనుకున్న టైము దాటిపోతుంది. వాడు సంగీతం విన్నవాడు. మిగతా వాళ్ళకి పిచ్చాపాటి కబుర్లు మిగుల్తాయి. మిగిలినవి విన్నారు. విన్నవాడికి పాడుతున్న ఆయన ఉండడు. పాడుతున్నది ఉండదు. ఈయన వినటం ఉండదు. తను వింటున్నానని ఉండదు. పాట ఒక్కటే ఉంటుంది. దానిపేరే అనుభూతి (experience) అంటారు. అది అరగంట ఉండొచ్చు, గంట ఉండచ్చు. ఆ చుట్టు ప్రక్కల ఎవడన్నా సోడా అని అరవకుండా ఉంటే రెండు గంటలు కూడ ఉండచ్చు. అలాంటి దానియందు మనస్సు ఉదయించటం (emerge), మనస్సు లీనమవ్వటం (merge) రెండు చెప్పాడు. వాట్లని గురించి లీలలు చెప్పాడు. మనస్సు మీద యిదివరకు చెప్పబడిన ఎనిమిది అంగములలోను అభ్యాసం క్రమబద్ధంగా చెప్పిన ప్రకారం చేయక పోయినట్లైతే, ఈ రెండింటి మీద మాస్టరీ లొంగదు. యోగాభ్యాసంలో ఆచరించేందుకు ఏదైనా ఉంటుంది కాని, నేర్చుకునేందుకు ఏం ఉండదు. ఈ పరిమితుల (limitations) మధ్య యింతవరకు చెప్పుకుంటూ వచ్చి 'ఏతేన భూతేంద్రియేషు' అన్నాడు. అంటే ఈ చెప్పబడిన సాధన నీకు వచ్చిన తర్వాత ఎవరన్నా కనిపించంగానే మనస్సు పైకి లేస్తుంది. తర్వాత వెంటనే శాంతిస్తుంది. రెండు నిమిషాలు. అలా కూర్చున్నపుడు ఎవరో వారు వచ్చారుట అనగానే మనస్సు లేవదు. మరి వారు వచ్చి కూర్చున్నారు. రెండు నిమిషాలైన తర్వాత లేచినది. మళ్ళీ శుభ్రంగా పడుకుంటుంది. అష్టాంగ యోగసాధన చేసిన తర్వాత యిలాంటివి కరతలామలకమై పోతాయి. తర్వాత యింకొంత కాలం పోయిన తర్వాత ఉద్భవించుట, మనస్సు లీనమగుట అను రెండింటికీ

ఒకే అనుభవము కలిగేటువంటి స్థితి వస్తుంది. ఆ రకంగా నుసుపు దేలుతావు అన్నాడు. అంటే వీడు మంచి రద్దీగా ఉన్న సిటీలో కారు తోలుతున్నాడంటే కళ్ళు మూసుకొని తోలుతున్నాడా, తెరిచి తోల్తున్నాడా అనే సందేహం వస్తుంది. ప్రక్క స్నేహితునితో మాట్లాడుతూ తోలుతూ ఉంటాడు. అడిగినదల్లా చెబుతూ ఉంటాడు. వాడి వంకే చూస్తూ ఉంటాడు. వాడితో మాట్లాడుతూ ఉంటాడు. గమ్యము చేరినట్లు వాడికి తెలీదు, వీడికీ తెలీదు, కారు ఆగుతుంది. ఆ స్థితి డ్రైవింగ్ చేస్తూన్న వాడికి ఎలా అయితే వస్తుందో అలాంటి స్థితి వస్తుంది ఈ అభ్యాసం సిద్ధించిన వానికి. అంటే మనస్సు ఉదయించటం, మనస్సు లీనమవటం రెండూ ఒకే పరిపూర్ణతకి వస్తాయి. ఈ చెప్పబడిన పద్ధతివల్ల ease వస్తుంది. అనగా మనం చేయవలసిన పనులకి మన ప్రయత్నం ఉంది అనేటువంటి దురభిప్రాయం ముందు తొలగిపోతుంది. సంకల్పం ఉంటుంది కాని ప్రయత్నం ఉండదు. ప్రయత్నమంతా వ్యర్థమే (waste). అయితే ప్రయత్నం ఉండకుండా పనులు చేస్తారా? తీగమీద మొగ్గలేస్తున్నాడు సర్కసులో. ప్రయత్నంతో మొగ్గలేసే స్థితిలో ఉంటే క్రిందపడి ఒళ్ళు విరుచుకుంటాడు. ప్రయత్నం దాటిన తర్వాతనే ప్రజల దగ్గరికి వస్తున్నాడు. కనుక ప్రయత్నముచేత పనులు చేసే దౌర్భాగ్యస్థితి నిత్యజీవితంలో పోతుంది. ఒకోసారి నిద్ర పట్టదు. ఎందుకంటే రేపు చేయాల్సిన పని ఇవాళ నిద్దట్లో చేస్తూ ఉంటాడు. వీడు నిద్రమాత్రలు తినాల్సొస్తుంది. రేపటి పని ఇవాళ చేస్తున్నాడు. వీడికి కంట్రోలు రాలేదు. కాని ఈ సాధన చేసిన వాడికి ఏం వస్తుంది? 'ఏతేన భూతేన్ద్రియేషు' ఈ పద్ధతిలో భూతములు, ఇన్ద్రియములు, జీవరాసులు, వాటి శరీరంలో ఉన్న పంచభూతములు, వాటి యింద్రియములు, వాటి యెడల 'ధర్మ లక్షణావస్థా పరిణామాః వ్యాఖ్యాతాః' ధర్మములు, లక్షణములు, చక్కటి పరిణామములు వస్తాయి. ధర్మములంటే properties. Properties of matter శరీరంలో, properties of emotions, properties of mind, properties of will. ఈ వ్యూహంలో ఉన్నటువంటి దాంట్లో ప్రతిదానికి ఉన్న ధర్మములు. తర్వాత లక్షణములు అంటే qualities. అంటే ఆయన మహానుభావుడు. ఆ మహానుభావుడు అన్నవాడికిన్నీ, వీడు స్కౌండ్రల్ అన్నవాడికిన్నీ భౌతిక శరీరం ధాతువులు తీసి

పరీక్షచేస్తే ఏమీ తేడా ఉండదు. అవి qualities అంటే. ఇతడు చాల ఆరోగ్యంగా, శరీరములో జబ్బు లేకుండా ఉంటూ ఒకడు గొంతు కోసినా అబద్ధం మాట్లాడడు, ఇంకొకడు అబద్ధం తప్ప ఇంకోటి మాట్లాడడు. వాళ్ళిద్దరికి రక్తపరీక్ష చేయిస్తే రెండూ ఒకలాగే ఉంటాయి. ఏమీ తేడా ఉండవు. వీడు అబద్ధం ఆడతాడు అని రక్తపరీక్షలో ఏం రాదు. అందుకని qualities అంటే ఏమిటి? గుణములు, ధర్మములు. ఒక యినుపముక్క తీసుకొని దాంట్లో ఉన్న లోహాన్ని కెమికల్ టెస్టు చేస్తే వచ్చే ధర్మములు. దాన్ని ఒక అయస్కాంతంతో స్పృశించినపుడు దాంట్లో పనిచేసే దాని పేరు గుణములు. అయస్కాంతాన్ని, యినుప ముక్కని విడివిడిగా భౌతికంగా పరీక్షచేస్తే ఏమొస్తుంది? మళ్లీ ఎలక్ట్రాన్స్, ప్రోటాన్స్, ఐసోటోప్స్ అవతలకి తీసి భౌతిక లోకాన్ని వదలిపెట్టి శక్తిమయంలోకి వెళ్ళాలి. ప్రస్తుత విజ్ఞాన శాస్త్రానికి అంత తాహతు లేదు. (The modern science is not yet competent to do). యింకో 50 సంవత్సరాలు పడుతుంది. Polymerisation ఎక్కడ అవుతున్నాయి? ఎలక్ట్రాన్ దగ్గరా? ప్రోటాన్ దగ్గరా అన్న చోటికి వెళ్ళాలి. అక్కడ భౌతిక లోకం ద్రవ్యమయ లోకాన్ని వదిలిపెట్టి మీరు శక్తిమయ లోకంలోకి వెళ్ళుతున్నారు. అంటే the plane of matter నించి the plane of energies లోకి వెడుతున్నారు. Modern science is not yet prepared to teach these things. It is just an infant. కనుక ఇనుముకి అయస్కాంతానికి తేడా in terms of behaviour చెప్పాల్సిందేగాని, in terms of structure చెప్పటానికి ఏంలేదు. కనుక ధర్మములు, గుణములు, ఇవి మీకు అప్రయత్నంగా ఎవరు చెప్పనక్కర లేకుండా, పాఠ్యపుస్తకంలో చదవనక్కర లేకుండా, చూడటంవల్ల, ముట్టుకుంటం వల్ల, వస్తువుల్ని సంబాళించు కోవటం (tackle) వల్ల, మీకు ఆటోమేటిక్‌గా తెలుస్తాయి అన్నాడు అభ్యాసం చేస్తూంటే. ఒక అయస్కాంతం ముక్క, ఒక యినుపముక్క వాడికి యిచ్చారనుకోండి. అంతకు ముందు వాడు అయస్కాంతం అనే పేరు ఎరుగడు. అయస్కాంతం అంటే ఏమిటో తెలియదు. యిన్ని యినుప ముక్కలు అక్కడ పడేసి, పదినిమిషాలు తరువాత మీరు వెడితే వాడు మీకు అయస్కాంతం అంటే ఏమిటో బోధపరుస్తాడు. ఎలా సాధ్యం. కన్ను తెరిచి

మనం దాన్ని చూచి వెలుగు అంటున్నాం. అపుడే పుట్టిన కుర్రాడు కన్ను మిటకరిస్తున్నాడు. వెలుగు అనే పేరు వాడి దగ్గర లేదు. వెలుగు అనే పేరు మన దగ్గర ఉన్నది. మిగతా పదార్థం యిద్దరికీ సమానమే కదా. కనుక కుర్రవాడు ఏ స్థితిలో స్వీకరిస్తున్నాడో వీడూ ఆ స్థితిలోనే స్వీకరిస్తాడు. మనం ఆ స్థితిలో స్వీకరించేటువంటి అర్హతను కోల్పోయాము. ఎందుకని? లైటు అనే మాట ఒకటి దానికి మనకి మధ్యన ఉంది. That is light అని చెప్పుకొని యిది కాంతి, యిది వెలుగు అని అనువాదం చేసుకోకపోతే బ్రతుకు లేదు మనకి. ఈ అనువాదపు వాక్యముల ద్వారా మాత్రమే బ్రతుకుతున్నాము. ఇది చక్కెర అంటాము. పిల్లవాడికి ఆపేరు తెలీదు. కాని డబ్బా టప్‌మని చప్పుడయ్యేటప్పటికి పరిగెట్టుకు వస్తాడు. అంటే చక్కెర అనే పేరు తీసేస్తే మీకు తెలిసినంతా ఆ పిల్లవాడికి తెలుసునా తెలీదా చక్కెర అంటే. చక్కెర అనే పేరు అడ్డం లేదు వాడికి ఇంకాను. ఈ తేడా ఉంది. అందుకని వాడికి ఏం చేసినా ధర్మలక్షణ అవస్థలు, వాటియొక్క పరిణామం తెలుస్తుంది. దీంట్లో అవి వ్యాఖ్యాతాః వివరింపబడినవి, ఎక్కడ? సూత్రాల్లో కాదు. మనం చేసిన యోగాభ్యాస సాధనలో, యింతవరకు చెప్పబడిన దాంట్లో, మనకు ప్రకృతిచేత, మనచుట్టూ ఉన్న వాతావరణం చేత వివరింపబడినవి. ఉదాహరణకి క్రొత్తవాడెవడన్నా వస్తాడనుకోండి, వాడికి క్రొత్తవాడు అని ఉండదు. ఎందుకని? క్రొత్తవాడనేది ఒక మానసిక లక్షణం (mental symptom). క్రొత్తవాడు పాతవాడు అనేది ఒక పశుప్రాయమైన స్వాభావిక ప్రవృత్తి తప్ప అసలు క్రొత్తవాడనే మాట ఏమిటి? మన దగ్గరున్నటువంటి మానసిక వ్యాధి లక్షణం కాదూ క్రొత్త వాడన్నది. అది పోతుంది. పుట్టుకచేత క్రొత్తవాళ్ళు అని ఉంటారా? అంటే ఈయన భర్తగారు అన్నట్లు. ఎట్లా అవుతాడు? ఫలానా ఆవిడకి భర్తగారు గాని, పుట్టుకచేత భర్త కాడు. అందుచేత యోగాభ్యాసం ఉన్నవాడికి అవన్నీపోతాయి. మనం ఏవైతే ఈ లక్షణాల ద్వారా మాత్రమే జ్ఞానము ఆర్జించుకొనటానికి నోచుకొని పెట్టిపుట్టి ఉన్నామో, అవి పోతాయి. దానివల్ల ఎవరైనా వచ్చేటప్పటికి వీరు ఎవరో క్రొత్తవారు అనే పాయింటు ఉండదు. రండి, కూర్చోండి అంటాడు. వాడు వస్తూ ఉండటం, కూర్చుంటూ ఉండటం, కూర్చుని లేస్తూ ఉండటం, వాడు మాట్లాడుతూ

ఉండటం, లేదా వాడు అందులో నసుగుతూ ఉండటం, లేదా straight to the point అని చెబుతూ ఉండటం. దాన్నిబట్టి మీరు ఆరు మాసాలు తర్వాత వాణ్ణి గురించి ఏం తెలుసుకుంటారో, ఆరు నిమిషాల్లో తెలుసుకుంటాడు వాడు. మనకి తెలుసుకుంటానికి బోల్డన్ని అడ్డంకులు, complex లు, limitations ఉన్నాయి. భారతీయుడా? కాదా? స్వదేశీయుడు వస్తే ఒకలాగ, విదేశీయుడు వస్తే ఒకలాగ ప్రవర్తిస్తామా? చెయ్యమా? అక్కడిదాకా ఎందుకండి? ఒక పాతికమంది విదేశీయులు కన్పిస్తే మళ్ళీ మర్నాడు వాళ్ళల్లో ఎవడన్నా ఒకడు కనిపించి 'హలో' అంటే వాడు గుర్తుంటాడా? అందరూ ఒకలాగే ఉంటారు. కాకపోతే కొందరికి బట్టతల, కొందరికి క్రాపు ఉంటే తప్ప, మనకి వాడితో బాగా పరిచయమయ్యే వరకున్నూ. పల్లెటూళ్ళు వెళ్ళనటువంటి వాళ్ళకి ఆ చేనుగట్టు మీద ఒక 50 గేదెల్ని తీసుకెళ్ళి మేపుకొని వస్తూండేవారు కుర్రవాళ్ళు. ఏ గేదె ఎవరిది అనేది ఎలా గుర్తుంటునేది వైజాగ్‌లో ఉన్నవాడికి పెద్ద సమస్య. వీడు గేదె అనే పేరుతోను, దాని నల్లని రంగుతోను, దాని ఆకారము, నాలుగు కాళ్ళు, ఇదివరకు చూసినటువంటి పరిచయంతోను, దాని కొమ్ముల యొక్క నిర్మాణంతోను, గిట్టలతోను, దానితోక నిర్మాణంతోను ఇలాంటివి ఒక వెయ్యి విషయాలు దగ్గరగా పెట్టుకొని గేదె అనే నిర్ణయానికి వస్తున్నాం మనం. వీడు ఆ నిర్ణయానికి రాడు. అవన్నీ ఎత్తి పారేస్తాడు. అవి ఎత్తి పారేస్తే, సూటిగా ఒక జీవం అక్కడికి వస్తుంది. గేదె అనే పేరు అక్కర్లేదు. మనకేం తెలుసునో అదిన్నీ ఇంకా తెలియవలసినవి ఇది పాలిస్తుందా లేదా, చూడిదా పాడిదా అన్నీ తెలుస్తాయి వాడికి చూసేటప్పటికి. 'ధర్మలక్షణా వస్థా'' ''పరిణామ'' దానియొక్క ధర్మములు, లక్షణములు పరిణామములు కూడ వ్యాఖ్యాతాః వ్యాఖ్యానింప బడినవి, వివరింపబడినవి, అనగా పతంజలి చేతకాదు, మీరు చేస్తున్న అభ్యాసంవల్ల, మీ వాతావరణం చేత, మీ పరిస్థితులచేత, మీ చుట్టూ వున్న మనుషులచేత, వాళ్ళ సంభాషణలచేత, మీ దగ్గర జరుగుతూ ఉన్నటువంటి సన్నివేశములచేత అన్నాడు.

## 14. శాన్తోదితావ్యపదేశ్య ధర్మానుపాతీ ధర్మీ।

శాంత+ఉదిత = శాంతించినట్టి చిత్తము, ఉదయించినట్టి చిత్తము, అవ్యపదేశ్య = చూపించి చెప్పుటకు వీలు లేనటువంటివి, ధర్మాను పాతి = ధర్మముల యందు అనుగమము చెందునది, ధర్మీ = ధర్మములు కలది.

**నిరోధింపబడినవి, మరల వర్తించుచున్నవి, నిర్దేశించుటకు లొంగక సూక్ష్మమైనవి అగు ధర్మము లన్నిటియందును వర్తించు వస్తువే ధర్మి అనబడును. (ధర్మియనగా దేహేంద్రియాది ధర్మము లన్నిటియందును వర్తించువాడు. వాని కధిపతి అతీతుడు.) అది తా నగును కనుక సాధనకు సమస్త సూక్ష్మ ధర్మములును తెలియును.**

**వివరణ :** శాంత, ఉదితా అంటే శాంతించినట్టి చిత్తము, ఉదయించినట్టి చిత్తము (The emerged mind and the merged mind). అంటే ఎవరన్నా వచ్చారనేటప్పటికి పనిచేస్తున్న మనస్సు, మళ్ళీ లోపలికి ఉపసంహరింపబడిన మనస్సు. ఈ ఉపసంహరణాన్నే భగవద్గీతలో 'కూర్మోంగాని సర్వసః' అన్నాడు. ఏమన్నా అపాయం వచ్చినపుడు తాబేలు ఎలా అయితే కాళ్ళని, తోకని, తలకాయని డిప్పక్రిందకి లాగేసుకుంటుందో అలాగే తన delicate non-physical sheets అన్నీ కూడను వెనక్కి లాక్కోనబడతాయి. దానివల్ల బయట వాతావరణం నీ మనస్సుని పిలవటం ఉండదు. అంటే చిత్తవృత్తి ఉండదు. అపుడు మీ మనస్సు కావాలంటే వాతావరణంతో పనిచేయించటమే గాని, వాతావరణం మీ మనస్సుని పిలవటం ఉండదు. మీ ప్రక్కని ఉన్నవాళ్ళమీద పనిచేయటం ఉంటుంది. ఇది ఎనిమిది అంగములు యోగాభ్యాసం చేయటం అయిన తర్వాత వచ్చినటువంటి మార్పు. యోగాభ్యాసం ఎనిమిదో అంగము అయ్యేటప్పటికి అలా కూర్చొని కదలడు, అలా ఉండిపోతాడు. వీడిమీద సమాధి కట్టించేస్తాం అని అనుకోకండి. పతంజలి చెప్పే యోగాభ్యాసంగాని, భగవద్గీతలో చెప్పే యోగాభ్యాసంగాని అలాంటి పిచ్చి యోగాభ్యాసాలకి సంబంధించినది కాదు. It is dynamism అర్జునుడికి కృష్ణుడు యోగాభ్యాసం చెప్పొట్ట అంటే అర్జునుడు సమాధి కట్టించుకోలేదు కదా. యుద్ధం చేసాడు. తర్వాత అలా మనందర్నీ యుద్ధం చేయమని కాదు. ''ఎవడు ఏది చేయాలో అదివాడు చేయాలి. ఎవడు చేయవలసిన పని వాడు అంతకంటే బాగా

చెయ్యగలగడానికి చూడాలి. నిన్ను నీవు అవమాన పర్చుకోకు. చిన్నచూపు చూడకు. లోపల ఉన్నవాడు మంచివాడు.'' అది భగవద్గీతలో మొదటినించి చివరి దాక ఇవ్వబడిన సందేశం. Positive dynamism తప్ప, negative phylosophy కాదు. 'శాంత' 'ఉదితా' శాంతించిన మనస్సున్నా, ఉదితా అంటే ఉదయించిన చిత్తము 'latent or manifest', ఇది జ్వాల్‌కూల్ గారు ఇచ్చిన translation ''అవ్యాపదేశ్య ధర్మాను పాతీ'' అవ్యాపదేశం వ్యపదేశ్యం అంటే ఇదమిద్ధం అని చెప్పడం. ఇక్కడ డస్టరు ఉంది అని చెప్పడం వ్యపదేశ్యం. సాయంత్రం నాలుగింటికి వచ్చామనుకోండి. ఇక్కడ డస్టరు ఉండదు కదా. మీరిక్కడ డస్టరు ఉందని చెప్పగలరా? కాని మీరు జాగ్రత్తగా గమనిస్తే యిక్కడ డస్టరు ఉంటుంది సాయంత్రం 7 గంటలకి అని, 4 గంటలకే మీరు చెప్పగలరు. మనంచేసే 24 గంటల పనులలో చాల పనులలో మనం చూసి చెప్పవలసినవి కాకుండా, చూడకుండా చెప్పగలిగినవి, చెప్పేవి చాల జరుగుతున్నాయి. లేకపోతే మనం చేసే పనులు మనం చేయలేం ప్రపంచంలో. కనుక 'వ్యపదేశం' అంటే చూపించి చెప్పటానికి ఇంకా వీలుగా లేనటువంటిది. దీన్ని 'ఆగామి' (would be existence) రాబోయేటువంటిది అంటారు. 4 గంటలకి మీరు భవిష్యత్తు విషయాన్ని (future tense) వర్తమానము (present tense) లో చూడగల్గుతున్నాం. భూతకాలము (past tense) ను మనం వర్తమానంలోనే చూసుకుంటున్నాం. భూత, భవిష్యత్‌లలో వర్తమానము (past, present, future) లనేటు వంటివి అశాస్త్రీయము. అవి మన సౌకర్యంకోసం, మనం చేసుకున్న విభాగాలే. భూత, భవిష్యత్, వర్తమానాలు ఏవి? ఇవన్నీ మూడుగా ఎక్కడున్నాయి? చిత్తం అంటే మనస్సు, యింద్రియములు. అవి లేకపోతే అసలు ఎలా మాట్లాడతాము. దాని వెనక్కి వెడితే మూడుగా లేవు. ఒకటిగానే ఉన్నాయి బుద్ధిలో. ఒకటిగా ఉండకపోతే పొద్దున్న వచ్చి మీరు సాయంత్రం యిక్కడ యోగా క్లాసు ఉంటుందని ఎలా చెబుతారు. అంటే మూడుగా మనకు తెలియకపోయినా సాయంత్రం యోగాక్లాసు ఉంటుందని తెలియటానికి వీల్లేదు. ఒకటిగా దాని వెనుక తెలిసిన dimension ఉండకపోయినా యోగాక్లాసు సాయంత్రం ఉంటుందని మనం చెప్పటానికి వీల్లేదు. అంటే రెండు dimensions వేరే వేరే. ఈ రెండూ కాక ఇవి ఏం జరిగినా మనతో సంబంధం

లేదు అనే dimension ఒకటి ఉంటుంది అది మీరు. ఇదంతా మీరు అని అనుకుంటున్నారు గనుకనే ఈ జబ్బులు చేయటం. ఈ గుండె జబ్బులు, B.P. లు, రోగాలు, నిద్ర పట్టకపోవటం, వాడెందుకు వచ్చాడు, వీడేం చేస్తున్నాడో, ఇవన్నీ ఎంచేత? దీంతో ఏకమై (identify) జీవిస్తున్నాడు. మనస్సు, బుద్ధులతో పాటు ఉంటున్నాడు. అంటే చిత్తం పనిచేస్తోంది, చిత్తం చిత్తం అని. పై ఆఫీసరుకి బూట్లతో సహా దండం పెట్టాలి. ఆ లోపలనుండి బ్రతుకుతే వాణ్ణి అవమానించక్కర్లేదు. నీ పని యింతకంటే బాగా చేయచ్చు. వాడిలో అంతర్యామిని చూస్తావు. అంటే అందరిలో ఉన్న భగవంతుణ్ణే వాడిలోను చూస్తావు. అంతకుముందు పశు స్వభావంతో, దైవభీతితో (God fearing) ఉంటావు. యిపుడు భగవంతుడిలో (God minded) గా ఉండటం మొదలు పెడతావు. దైవభీతి ఉన్నవాడు నేరస్థుడు. దైవభీతి అంటే వాడు చూస్తుండగ తిన్నగా చేయటం. వాడు చూడకపోతే మనిష్టం వచ్చినట్లు చేయటం. నాన్నగారు అంటే భీతి ఉన్నటువంటి వాడు దగాకోరు అవుతాడు.

మనస్సు, బుద్ధి, ఇంద్రియములు, చిత్తం యివేం ఉండవు. ''యో బుద్ధే పరతస్తుసః'' కనుక వ్యపదేశ్యం కానటువంటి స్థితిలో కూడ అంటే బల్లమీద డస్టరు పెట్టినపుడు కూడ, నిన్న సాయింత్రం పతంజలి యోగాక్లాసుకి ఒక ఐదు నిమిషాలు వచ్చి కూర్చుంటే రేపు ఉదయం మీరు వచ్చాక కూడ ఇక్కడ ఈబల్ల, దీనిమీద డస్టరు రెండూ కూడ సాయింత్రం అయ్యేటప్పటికి ఉంటాయని మీరు చెపుతారు. దాన్నే 'అవ్యపదేశ్యం' అంటారు. అంటే (not yet formed) భూతకాలము (past) అనేటువంటిది భవిష్యత్ కాలము (future) అనేటువంటిది రెండూ కూడ వర్తమానం (present) లో ఉన్నటువంటి భాగాలు క్రింద తీసుకొస్తుంది. తర్కంలోకి వస్తే అది తెలుస్తుంది. అంటే ఒక భారతీయ విధానంలోనే ఈ విషయం ఉంది. మిగతా తర్కాలలో ఈ విషయం లేదు. విల్‌జెరెంటు మాత్రం తన ఫిలాసఫీలో కొంత చర్చించారు. అనంత వర్తమానం (eternal present) ఉందిగాని, భూత, భవిష్యత్తులు (past and future) లేవని, కొపెన్స్కీ అన్నవాడు "The fourth way." అనే పుస్తకంలో చర్చించాడు. గుర్‌జిఫ్ తన బోధనలలో చెప్పాడు. మిగిలిన పాశ్చాత్యులకి ఇది క్రొత్త dimension. కనుక 'వ్యపదేశ్యం'. 'అవ్యపదేశ్యం' అంటే రాబోయేటు వంటిది. దీన్నే ఆగామి అంటారు. శాంతమైన మనస్సు,

ఉదయించినటువంటి మనస్సు 'ధర్మాను పాతి' ధర్మముల యందు 'అనుపాతి' అనుపాతము చెందినది. అనుపాతం అంటే అనుగమము చెందినది. అంటే ఎక్కడికైనా వెడితే మీరు అర్థం చేసుకోదల్చుకున్నట్లు అర్థం చేసుకోవడం అనేది పోతుంది. అక్కడ ఉన్నది అర్థం చేసుకుంటం అనేది వస్తుంది. అంటే మనం చూడదల్చుకున్న విధానంగా చూడటం అనేటువంటి వ్యాధి తగ్గిపోతుంది. ఉన్నది సులభంగా బోధపడుతుంది. ఎందుకంటే వాడు చూడదల్చుకున్న విధానం అనేటువంటి exposed sensitive plate పాడయిపోయింది తీసేసి, unexposed ever-sensitive plate పెట్టబడ్డది వాడి లోపల. కనుక ఉన్న విషయం యొక్క ఫొటోలు పడతాయి గాని, వీడి దగ్గర వేసుకున్నటువంటి పిచ్చి ఫోటోగ్రాఫుల మీద, బొమ్మలమీద బొమ్మలులా మీద పడుతూన్నటువంటి అభిప్రాయములు (impressions) ఉండవు. ఎరిగున్నవాడు వచ్చినా ఆ టైమపుడు వాడికి నీకు transaction ఏం కావాలో అదే ఉంటుంది. ఎరగనివాడు వచ్చినా అదే ఉంటుంది. అంటే commu-nistic set up లో ఉన్నట్టుగా heartless గా ఉండదు.

కనుక అవ్యపదేశ్యం అనేటు వంటిది వచ్చి 'ధర్మాను పాతి' ధర్మమును అనుసరించుట అనే పద్ధతి వస్తుంది. ఇక్కడి ధర్మము లేమిటి? ఎవరూ లేనపుడు యోగాభ్యాసం చేస్తున్నవాడు వచ్చాడనుకోండి, ఒక నిమిషం అలాగ చూస్తాడు. ఇక్కడ ఏదో పదిమందికి పనికివచ్చే పని రోజూ జరుగుతున్నట్లుగా నాకనిపిస్తోంది అంటాడు. మనకి ఏదో అద్భుతం, ఆశ్చర్యంగా అనిపిస్తుంది. వాడికి అది ఆశ్చర్యం కాదు. ఏం తెలియని వాడికి అది విచిత్రం, తెలిసిన వాడికది విచిత్రంకాదు. కనుక అవ్యపదేశ్యం తెలుస్తుంది ఈ యోగాభ్యాసం వచ్చినటువంటి వాడికి. ఈ యోగాభ్యాసం వచ్చినటువంటి వాడికి మనకి తెలియనటువంటిది తెలిస్తే ఎలా అయితే మనకి అద్భుతమో, కొంచెం తెలిసినవాడికి అద్భుతం కాదో, తెలిసినవాడికి అద్భుతం కాదుగాని అది నిజం (truth). ఈ మూడు దశలు (levels) ఉన్నాయి కదా. దీన్ని గురించే టాల్‌స్టాయ్ ఆయన ఆత్మకథ "Reminicences" అనే పుస్తకంలో మూడు అధ్యాయాలు రాసాడు. "How we believe." మొట్టమొదటి దేవుణ్ణి, బైబుల్ని మనం ఎలా నమ్ముతాము? 'Like an idiot of a christian I believed' అన్నాడు. రెండవది "How we disbelieved". "As a

materialist I disbelieved" అని రాసాడు. మూడవది 'How I again believed' అనే అధ్యాయం రాసాడు. అందులో ఉంది కావలసిన విషయం. అంటే 'like a theologist and like a man of christ I believed, not as a christian' అన్నాడు. అంటే ఈ మాటు నేను క్రీస్తుని నమ్మినది క్రిస్టియన్‌గా కాదు. క్రీస్తుకి సంబంధించిన మనిషిని అవుతానేమో చూద్దాం అని నమ్ముచున్నాను అన్నాడు. చూసారా! ఆ dimension రావాలి. అందుచేతనే పాపం ఈ అధ్యాయాలు ఉన్నాయని తెలియక మొట్టమొదటిగా టాల్‌స్టాయ్‌ని కూడ అభ్యుదయ కవులలో లెక్కవేసుకొని పుస్తకాలు అమ్మేసారు. తర్వాత ఈ అధ్యాయా లున్నాయని తెలిసేక ఆయన పేరు లైబ్రరీల్లోంచి తీసేసారు. ఇక్కడ శాంతము, ఉదితము, అవ్యపదేశ్యము మూడు కూడ ధర్మానికి అనుగమనంగాను, ధర్మానుపాతంగాను వెడతాయి అన్నాడు. అంటే యిక్కడికి వచ్చేటప్పటికి మనస్సు ఉద్భవించినా, మనస్సు లీనమైనా రెండూ ఒకే స్థితిలో ఉంటుంది. గనుక యిక్కడున్న ధర్మాలు వాడికి reflect అవుతాయి గాని, వాడి impressions ని అర్థం చేసుకుంటుం ఉండదు. ఒక్కొక్క యింట్లో ఎపుడూ పిల్లలు రాత్రిపూట 'ఓ ఓ' అని ఏడుస్తుంటారు. ఎన్ని మందులిచ్చినా, ఏం చేయించినా లాభం ఉండదు అంటాడు. ఇలాంటి ఒకాయన వచ్చి ఈ యిల్లు కట్టేముందు ఇక్కడ కసాయి దుకాణం ఉండేది. అంటే దాని తాలూకు సూక్ష్మమైనటువంటి disturbances అక్కడ ఉన్నాయి. పిల్లలు నిద్రలోకి పోయేటప్పటికి వాళ్ళని disturb చేస్తున్నాయి. అంటే ఆ చచ్చిపోయిన జంతువులుండవు అక్కడ. కాని అక్కడ జరిగినటువంటి దాంట్లో ఉన్న disturbance యొక్క impressions space లో ఉంటాయి. ఇంకేం ఉండవు. ఆ నిద్రలోకి పోయేవాడు ఉలిక్కిపడి ఏడుస్తూ ఉంటాడు. దీన్నే etheric disturbances and astral disturbances అని అంటారు. 21వ శతాబ్దంలో వీట్లను గురించి చెప్తారు. ఈ శతాబ్దంలో వీట్లని గురించి చెప్పే తాహతు యూనివర్సిటీలకు యింకా రాలేదు. పిల్లలు ఎందుకేడుస్తారు? యిల్లు ఏ పద్ధతిలో ఉంది మొదలగు విషయాలు బోధిస్తారు. మా బంధువులు ఒకాయన యింట్లో ఒకడి తర్వాత ఒకడికి జబ్బులుగా ఉన్నాయి అని బాధపడుతున్నారు. యింకో బంధు వొకాయన మా నాన్నగారి గురువుగారు, యివన్నీ కూడ బాగా అభ్యాసం చేసిన పారంగతులు అక్కడికి వచ్చి యింట్లోకి వస్తూనే

ఆయన్ని పిలిచి ఈ యిల్లు అంత మంచిది కాదు ఉండటానికి అన్నాడు. ఏమిటి? అని అడిగితే ఇపుడొద్దు దీని సంగతి రాత్రికి చెబుతాను అని, ఈ యిల్లు గలవాణ్ణి రాత్రి 12 గంటలకి రమ్మను అన్నాడు. 12 గం॥లకి వచ్చాడు యిల్లు కలవాడు. ఒక పలుగు పార తెప్పించండి అన్నాడు. తెప్పించాడు. అపుడు చెప్పారు మీ వదినగారు భర్త పోయినటువంటి వెధవ ఆవిడ పొలాల మీద వచ్చే డబ్బులు వసూలు చేసుకొని వెళ్ళటానికి వస్తే, భోజనం పెట్టి, తాంబూలంలో విషంపెట్టి చంపి ఇక్కడ ఈ రాతికింద పాతి పెట్టావు కదా, ఇపుడు ఆ అస్థిపంజరం ఇక్కడ ఉన్నది అని చెప్పాడు. తియ్యి అన్నాడు ఆ రాత్రి. నీకే మంచిది కాదు. నేను నిన్నేమీ బయట పెట్టటానికి రాలేదు. ఉన్నవాళ్ళకి మంచిది కాదు. నీకూ మంచిది కాదు తియ్యి అన్నాడు. గజగజ లాడిపోయి తీస్తే నిల్చున్న మనిషి అస్థిపంజరం ఉన్నది ఉన్నట్లుగా ఉంది. కనుక శాంతము, ఉదితము ఇవి miracles అనుకుంటాడు తెలియనివాడు. అందుకనే బ్లావెట్‌స్కీ "The science of spiritualism" అనేటువంటి దాంట్లో మొదటి అంశం. There is no miracle అంది. అంటే everything is the result of the law immutable and unchangeable that is ever taking place in nature. అది అర్థం చేసుకున్నటు వంటివాడు, దాన్ని సైంటిఫిక్‌గా అర్థం చేసుకుంటాడు. చాతకానటువంటివాడు miracle అంటాడు అంతే. ఈరోజు science కి miracles అయినటువంటివి రేపటి సైన్సుకి సైంటిఫిక్ అవుతాయి. ఈరోజు దేనియందైతే మానవుడు గుడ్డివాడో, దాన్ని సైంటిస్టు కూడ miracles అంటాడు. కనుక మనకున్న అజ్ఞానాన్ని బట్టి miracles ఉంటాయి. అదీ ఇక్కడ ఈ సూత్రంలో చెప్పినది. ఉదాహరణకి నేను కూర్చొనే కుర్చీలో ఎవడో వచ్చి కూర్చుని అబ్బ! ఎవరు మీకీ పాతాలు చెబుతూంది, ఆయనకి కాళ్ళు బాగా నెప్పులు ఉన్నట్టున్నాయి అంటాడు. ఎందుకని ఈ కుర్చీలో రోజూ కూర్చున్నవాడికి కాళ్ళు నెప్పులున్నాయి. ఇవన్నీ ధర్మము యొక్క అనుపాతి. అంటే properties ని అనుసరించి తూచి చూస్తాడు. అంటే వాడి మనస్సుగాని, కన్నుగాని, చెవిగాని, ముక్కుగాని, నాలికగాని, శబ్ద, స్పర్శ, రూప, రసగంధము లైనటువంటి పంచేంద్రియములు, ఇంద్రియార్థములు ఇవన్నీ కూడ చక్కగా అక్కడ ఉన్నదాన్ని గురించి పనిచేస్తాయి. ఎందుకంటే లోపల ఉన్న దుమ్ము తుడిచేసారు

గనుక. అద్దంమీద వేరే రంగుంటే గోడ మీదున్న రంగేం పడుతుంది. అలా కాకుండా అద్దం శుభ్రంగా ఉంటే ఆ రంగు పడుతుంది. అలా తయారవుతాడు మనిషి అని చెప్పాడు. కనుక 14వ సూత్రం లక్షణమిది.

చివరికి 'ధర్మి' అనే పదం ఉంది. 'ధర్మి' అంటే ధర్మములు కలది. ఒక పువ్వు మొగ్గ ఉందనుకోండి. దీన్ని మనం పువ్వు లేకపోతే మొగ్గ అనే పేర్లతో చెబుతున్నాం. కాని మనం పువ్వుని చూడటం లేదు, మొగ్గనీ చూడటం లేదు. రంగు, వాసన, ఆకారము, సంఖ్య ఇట్లాంటివి అనేకములైన వాటి L.C.M. ని మనం చూస్తున్నాం. దానికి పువ్వని పేరు పెట్టాం. దాన్నే పెద్దలు 'శతపత్ర పత్రభిత్తి' అంటారు. అంటే ఒక వంద తామర పువ్వు రేకలు బొత్తుగా పెట్టి, బాగా వాడిగా ఉన్న సూది ఇటునించి అటు గుచ్చండి అన్నాడు. కసక్కని ఒక్కమాటే దిగుతుందా? మెల్లిమెల్లిగా దిగుతుందా? అన్నాడు. ఒక్కమాటే ధిగుతుంది అన్నాడు. ఒక్కమాటేమిటి? ప్రతి రేకలోకి దిగి యివతలికి వచ్చి, తర్వాత రేకలోకి దిగి యివతలకి వచ్చి తర్వాత రేకలోకి, అలాగ దిగుతుంది గాని ఒక్కమాటే దిగదు. నీ కంటికి ఒక్కమాటు దిగినట్టు కన్పిస్తుంది. కనుక తామర రేకుని చిల్లుపొడవటంలాగ అని చెప్పాడు. లేకపోతే మనకి బోధపడదు. బొత్తికి చిల్లుపెట్టాం అనుకుంటున్నాం. అందుకని ఈ మొత్తాన్ని 'ధర్మి' అంటారు అంటే ధర్మముల యొక్క సముదాయము కలది. అంటే the aggregate of property. మనం ఏదో ఒక పేరుతో పిలుస్తాము. వెంకయ్య, పుల్లయ్య అని పిలిచినట్టు పువ్వు, మొగ్గ, బొడ్డు యిట్లాంటి పేరుతో పిలుస్తూంటాము. విచ్చుకోకపోతే బడ్డు, విచ్చుకుంటే పువ్వు అంటాము. అది మనం పెట్టే పేరు తప్ప దానికి సంబంధించినది కాదు. అందుకని ధర్మి అన్నాడు, అంటే ధర్మములు కలిగినటువంటి ఒక మొత్తం. అంచేత మనం చెప్పిన పేర్లల్లో సత్యం లేదు. ఏది మన మనసులోంచి తొలగిపోవాలో అవి క్రమంగా డస్టరు పెట్టి తుడిచేస్తున్నారు. అష్టాంగ యోగం చెప్పటం అయిపోయింది కనుక దానికి అడ్డం వచ్చేవి మన దగ్గర ఏం ఉంటాయో అవి తొలగిపోవాలి. కనుక 'ధర్మి' అంటే the aggregate of the properties for which we give an imaginery name. ఉట్టి పేరు పెట్టేటువంటి వస్తువు పువ్వు, కాయ అంటాం. ఇది జామకాయ అంటాం.

ఏమిటి ఉంటుంది. ఒక గుండ్రని ఆకారము. మనం చూసేది జామకాయని చూస్తామా? గుండ్రని ఆకారం చూస్తున్నామా? ఆకుపచ్చని, పసుపుపచ్చని మధ్యన ఆ రంగులు చూస్తున్నారు, ఒక రకమైన వాసన చూస్తున్నారు. దాని తొడిమ చూస్తున్నారు. దాని ఆకు చూస్తున్నారు. యిట్లాంటివి మనకి తెలిసినవి తెలియనివి ఒక వెయ్యి చూస్తున్నాం. ఆ మొత్తాన్ని జామపండు అంటున్నాం. అది ధర్మి అంటే. కనుక శాంతమైన, ఉదితమైన మనస్సు, మీరు గమనిస్తూన్నటువంటి environment లో అవ్యపదేశ్యమైనవి అనగా అక్కడ ఉన్నా, లేకపోయినా, ఇంకా సిద్ధంగా ఉన్నా, సిద్ధంగా లేకపోయినా, తెలిసిపోతాయి. ఉదాహరణకు పదేళ్ళ క్రిందట హైదరాబాదులో ఒకాయన ఉన్నాడు. ఓ బల్లమీద కూర్చుని ఆఫీసులో ఒక అమ్మాయి రోజూ పనిచేస్తోంది. గర్భిణి. రోజూలాగే ఆరోజు కూడ వచ్చి పనిచేయటానికి కూర్చోబోతూంటే పిలిచి, యివాళనించి అటుప్రక్కన కూర్చొని పనిచేసుకో అన్నాడు. ఎందుకండి అంది. ఏమో నాకు అట్లా అనిపించింది అన్నాడు. సరేలే అని మళ్ళీ లాక్కుని కూర్చోబోతుంటే మళ్ళీ పిలిచి నేను చెప్పాను కదా అక్కడ వేయించుకోమని అన్నాడు. ఆవిడ నవ్వుకొని మళ్ళీ కూర్చోబోతుంటే ఆ ఫైలు యిట్లా పట్టకురా అన్నాడు. ఆ ఫైలు పట్టుకు రావడానికి ఆవిడ లేచింది. పైనించి తిరుగుతున్న ఫాన్ కిందపడ్డది. మనిషి అక్కడ ఉన్నట్లైతే ముక్కలైపోయి ఉండేది. ఆ విషయం ముందు తెలుసునా ఆయనకి. తెలియక్కర్లేదు. ఆ మొత్తం సంఘటన అంతా (incident as whole) తెలుస్తుంది. మనస్సుకి కాదు తెలిసేది. 'instinct' ని follow అవ్వటం చాతవ్వాలి. అది పడుతుందని మనస్సుకి తెలియదు. instinct కి తెలుస్తుంది. instinct కి తెలిసి మన mind కి తెలీదంటే ఏది పైది? కనుక మనలో వెనుకబడి ఉన్నదాన్నేమో గొప్పది (superior) అనుకుంటాము. మనకి సహాయం చేస్తున్న దాన్ని తక్కువది (inferior) అనుకుంటాము. reflexes, instincts యివన్నీ కూడ sub-conscious level లో ఉన్నటువంటివి అనిచెప్పి, పనికిరాని విశ్లేషణ యిస్తారు psyco-analysis. బజారులో అరటి తొక్కమీద కాలువేసి జారి పడబోయారు. పడబోతూంటే చేయి అడ్డం పడుతుంది కదా. పడబోతున్నామని తెలిసి మనం చెయ్యి అడ్డం పెట్టామా లేక అప్రయత్నంగా పెట్టామా? అప్రయత్నంగా పెట్టాము. దాన్నే reflex action అంటాం. అలా

కాకుండా పడబోతున్నామని తెలిసి చెయ్యి చాచమని మీరు ఎరిగున్న మనస్సుతో చేస్తే ఎముక విరిగేది. కాలుజారిన తర్వాత పడబోతున్నారని మనస్సుకి తెలిసి చెయ్యి క్రింద పెట్టరా అని మనస్సు చేతికి చెప్పిందనుకోండి. దొంగలు పడ్డ ఆరునెలలకి కుక్కలు మొరిగాయి అన్నట్లు ఉంటుంది. అది మనం ఎరిగున్న mind. సైకాలజీవారు ఈ మనస్సు reflex, instincts కన్నా పెద్దదంటారు. చాల జాగ్రత్తగా ఉండాలి. 21వ శతాబ్దం మధ్యలోకి వచ్చేటప్పటికి ఇంతవరకు ఉన్నటువంటి సైకాలజీ, పేరా సైకాలజీ పుస్తకములన్నీ కూడ చలిమంట కాచుకోడానికి ఉపయోగపడతాయి. కనుక 'ధర్మి' అనే దానికి అర్థం ఇది. కనుక శాంతము, ఉదితము అయి, అవ్యపదేశ్యమైనటువంటి పద్ధతులలో ఎక్కడైనా సరే అక్కడ ఉన్నది నీకు పనిచేస్తుంది. అప్పుడు నీ instinct, reflexes పనిచేస్తాయి కాని, నీ conscious mind పనిచేయదు. మన మెరిగివున్న మనస్సు మొత్తం అంతా ఎంత ఉంటుంది? మనం అడక్కుండా లోపల పనిచేస్తున్నవి. మన ఊపిరితిత్తుల్ని, గుండెకాయని, జీర్ణశక్తిని పనిచేయిస్తున్నవి, మనం నిద్రపోతున్నపుడు శరీరంలో కావలసిన అన్ని భాగాల్ని పనిచేయిస్తున్నటు వంటి మనస్సులన్నీ కూడ ఎన్ని ఉంటాయండి? ఇవి అన్నీ కలిసి మొత్తం 99 ఉంటే conscious mind ఒక్కటే. ఈ ఒక్కదాన్ని పెట్టే బ్రతుకుతున్నాం మనం. మార్కులు తెచ్చుకున్నా దానితోనే, పరీక్ష కాపీ కొట్టినా దానితోనే. బజారుకి వెళితే వంకాయలు పుచ్చులేకుండా చూసుకోవడం దానితోనే, ఒక పదిపైసలు తక్కువకి బేరం ఆడదామని మనం అనుకుంటే, ఇరవై పైసలు ఎక్కువ ముందు చెప్పి పదిపైసలు తగ్గిద్దామని వాడనుకుంటే, తగ్గిస్తే సంతోషించటం దానితోనే. ఇదిదాటి పనికిరాదు ఈ మనస్సు. కనుక మనమంతా బ్రతుకుని బ్రతుకుతున్నాం. నిద్రపోతూ ఉండంగ శ్వాస వదిలిపెడితే ఈ మనస్సు ఏమవుతుంది? నిద్రపోగానే తీసికెళ్ళి అవతల పారేయాల్సి వస్తుంది. చచ్చిపోతాడు. అందుకనే బ్రతుకనేది ఈ conscious mind చేతిలో పెట్టరు. యోగాభ్యాసం చేసేవాడికి ఈ మనస్సు యొక్క పరిమితులు తెలియజేస్తారు. కనుక యివి supra - conscious minds తప్ప, sub - conscious minds కావు. దీన్ని Deva kingdom అంటారు. మన మనస్సు human kingdom. శరీరంలో ఉన్నటువంటి ధాతువులు animal kingdom. మనం తింటున్నటువంటి ఆహార పదార్థాలు animal and plant

kingdom. ఈ పని చేస్తున్నవాళ్ళు) deva kingdom. Deva kingdom దగ్గరికి modern science యింకా రాలేదు. ఒక శతాబ్ది దగ్గరినుంచి పాశ్చాత్య దేశాల్లో జ్వాల్‌కూల్ తన శిష్యుల్ని తయారుచేసాడు. యూరప్‌లో కొన్ని వేలమంది ఉన్నారు. Alice. A. Bailey రచనలద్వారా దేవతలనగా ఏమిటి? ఎంతమంది ఉంటారు? సృష్టి అంటే ఏమిటి? పితృదేవత లనగా నేమి? యివన్నీ తెలియజేసి ఎవరెవరు ఎక్కడ పనిచేస్తూంటారో, ఏ భాగంలో ఎక్కడ ఎవరు పనిచేస్తూంటారో, సూర్యుడిద్వారా కిరణాల్లోంచి ఎవరు వస్తారో, చంద్రుడిద్వారా కిరణాల్లోంచి ఎవరు వస్తారో మొదలైన విషయాలు బాగా పరిచయం ఉన్నవాళ్ళు. కనుక శాంతి, ఉదితము, అవ్యపదేశ్యము, ధర్మానుపాతి అయినటువంటిది ధర్మి. అది చెప్పాడు. అంటే manifest mind గాని latent mind గాని, రాబోయేటువంటి unmanifest environment లో అన్నమాట. ధర్మానుపాతి అంటే ధర్మములను అనుసరించి మాత్రమే వెడుతుంది. వీడి imagination వెళ్ళదు. యిక్కడ యిలాంటివాడు ఉండేవాడు అని ఉండదు. ఎలాంటి వాడున్నాడో అక్కడ, వాడి మనస్సులో అలాంటి reflection బొమ్మ వస్తుంది. ఒకడు కూర్చొని ఉంటే ఆయన చూసి ఒక పదినిమిషాలు మాట్లాడక నువ్వు యిదివరకు కొన్ని సంవత్సరాలు గడ్డం పెంచావా? అని అడిగాడు. ఎట్లా చెబుతారు? కనిపిస్తాడు వీడు గడ్డంతో. అవునండి, పెంచానండి అంటాడు. అదీ యిపుడు చెప్పిన సూత్రంలో. అది తెలియని వాళ్ళు miracle అనుకుంటారు.

## 15. క్రమాన్యత్వం పరిణామన్యత్వే హేతుః।

క్రమ = క్రమమునందు, అన్యత్వం = అంతరత్వం, పరిణామ = పరిణామమునందు, అన్యత్వే = వచ్చు భేదములే, హేతుః = కారణము.

సాధకులున్న స్థితిభేదమును బట్టియే వారిలో కలుగుచున్న మార్పులును వేరు వేరుగా నుండును. (యోగాభ్యాస మొక్కటే అయినను వేరు వేరు యోగములను స్థాపించు గురువులును, అనుభవ భేదములను పొందుచున్న శిష్యులును కనిపించుచున్నారు. వారున్న స్థితులలో గల పరస్పర భేదమే దీనికి కారణము).

**వివరణ :** పై చెప్పిన దానిని బట్టి సాధనలో ఇంతవరకు వస్తే ఎక్కడ ఏం ఉన్నదో తెలుస్తుంది అన్నారు. కాని నలుగురు యోగాభ్యాసం చేస్తే నలుగురికి ఒక్కటే విషయం తెలుస్తుందా? తెలీదు. ఎందుచేత తెలియదో అది చెప్తున్నారు. మొట్టమొదట మనకు తెలిసిన ఉదాహరణలు చెప్పుకుందాం. ఆయన చాల లోతైనవి చెప్పాడు. గనుక క్రమం అన్నాడు. అందుచేత మనం ఎరిగి ఉన్న పైపై ఉదాహరణలు చెప్పుకుని, అపుడు అసలు దగ్గరికి వెళ్దాం. ఇందాక చెప్పుకున్న పువ్వుని మనం చెట్టుమీద చూసాం. గోడమీద నించి అవతలకి కన్పిస్తోంది. యోగాభ్యాసం చేయనటువంటి వాళ్ళు ఒక నలుగురు ఆ పువ్వుని చూసారు. ఒకడికి వెంటనే కోసుకుందామని అనిపించింది. రెండోవాడికి పువ్వు రంగు బాగుంది అనిపించింది. మూడోవాడికి ఇది మా ఆవిడ తలలో ఉంటే బాగుంటుంది అన్పిస్తుంది. నాలుగో వాడికి ఆ పువ్వు చెట్టునే ఉండనిస్తే ఇంకా ఎక్కువ గంటలు ఉంటుంది అన్పిస్తుంది. ఐదవవాడు బోటనీ ప్రొఫెసరు అనుకోండి. వాడికి అందులోని భాగాలు బోటనీలో ఉన్నట్లు కన్పిస్తాయి. ఇందులో కనిపిస్తున్నది ఒకే పువ్వు అయినా అందరికీ ఒకటిలా కనిపించదు. ఎవడిలోకం వాడిదే. 'గ్రుడ్డివాడు - ఏనుగు' కథలాగ. మొదటివాడి పువ్వు రెండోవాడికి లేదు. అక్కడ చూస్తున్న పువ్వు ఒక్కటే అనుకుంటున్నారు గాని చూస్తున్నది లోపలినుంచి అని అనుకోవటంలేదు. ఇది తెలియకనే గుళ్ళో దేవుడు ఏం ఉంటాడు. విగ్రహంలో దేవుడు ఏం

ఉంటాడు అంటూ ఉంటారు. దేవుడు చూచేవాడికా? చూడబడే వాడికా? స్విచ్ ఆపేశాం అనుకోండి. అందులో లైటేం ఉంటుంది. లైటు ఎవడికి? వేసుకొని వాడుకునే వాడికా? దీపానికా? చింతపండు పుల్లగా ఉంటుంది. చింతపండుకా? నాలికకా? చింతపండు పుల్లగా ఉండదు. చింతపండుకి నాలికయొక్క reaction పుల్లగా ఉంటుంది. యివాళ అన్నం వండేము అంటాం. అన్నం వండితే తగలడుతుంది. నీళ్ళతో బియ్యం వండుతాము. కూర వండాము అంటాము అంటే పాడయిపోతుంది. కూర వండటమేమిటి? వండితేనే కూర అవుతుంది. పాలు కాచాము. ఫర్వాలేదు. పచ్చిపాలు అయితే కాచవచ్చును. చారు కాచాము అంటాం. కాస్తేనే చారు అవుతుంది. ఆ చారు మళ్ళీ కాస్తే తగలడుతుంది. కాని మనం భాష అలా వాడతాము. సీసా పగిలింది. దానికేమన్నా ఒళ్ళు పొగరా పగలటానికి. కొట్టాడెవడో. లేకపోతే టప్‌మని పగుల్తుందా? సీసా పగలటం ఏమిటి? పుస్తకం పడ్డది బల్లమీంచి, పుస్తకం గభాల్న పడ్డదా? పడలేదు. అది ఒప్పుకుంటానికి యిష్టంలేక పడ్డది అంటాం. కాలు బల్లకి తగిలింది, తగిలిందా? మనం తగిలించుకున్నామా? దానంతట అదిపోయి అట్లా తగిలిందా? చూస్తుంటే. మనం అక్కరలేకుండా వాడే వాక్యాల్లో తొంభైశాతం అర్థవంతములు కావు. కళ్ళకి blindspots అని ఎలా ఉంటాయో, మనస్సుకి blind spots కొన్నివేలు, వేలు ఉంటాయి. యోగాభ్యాసం చేస్తూంటే అవి పోవాలి. లేకపోతే యోగాభ్యాసం కాదది. యిక్కడ 'క్రమాన్యత్వం'. కనుక ఈ పువ్వు ఒక్కొక్కడికి ఒక్కొక్కలా కనపించటం దేనివల్ల? వాడిదివరకు పువ్వుల్ని గూర్చి, ఆ జన్మలో ఉన్న కృషివల్ల అనుకున్నాం కదా. ఒకడు చూచి ఈ పువ్వు కోసేసుకుందాం అని అనుకుంటాడు. ఎక్కడ పువ్వు చూసినా కోసేయటమే, చెట్టుని ఉంచనివ్వరు. అంటే ఏమని తెలుస్తుంది? వాడికి పిల్లనిచ్చినా అలాగే ఉంటుంది. దాన్ని అనుభవించటం, పిల్లలు పుట్టాక అవతల పారేయటం తప్ప, కుటుంబం, భార్య, పిల్లలు అనేవి ఉండవు. పువ్వు కనపడగానే చెట్టునించి కోసేబుద్ధి ఉన్నవాడికి ఎన్నడూ పిల్ల నివ్వకండి. Because he is not fit to be a husband. ఒకాయన చెప్పాడు. ఆయన మంచి కవిగారు, పిల్లనిచ్చాను అని

బాధపడుతున్నాడు. గోళ్ళు పెంచుకున్న వెధవకి లేత అరటియాకులో అన్నం పెట్టినట్లైంది అన్నాడు. తను అన్నం తినలేడు. ఈ లోపల చిరిగిపోతుంది ఆకు అంతాను. పిల్ల వయసేమో అరిటియాకు అయిపోయిందిట. వీడేమో గోళ్ళు పెంచుకున్న వెధవ కనుక అనుభవించలేక సంసారం పాడు చేసుకున్నాడు అని చెప్పాడు. కవి కనుక అలా చెప్పాడు. విశ్వనాథ సత్యనారాయణ గారితో చెప్పుకుంటూ ఏడ్చాడాయన. కనుక వాడు పువ్వుని గూర్చి అంతకు ముందు ఎట్లాంటి జీవితం నడిపాడో, దాన్నిబట్టి ఉంటుంది వాడు చూసే పువ్వు. 'క్రమాన్యత్వం' క్రమము నందు అన్యత్వం ఉంటుంది. There is difference in the procedure to each fellow and there is a difference in approach to each fellow. క్రమమునందు అన్యత్వము అంటే ఇతరత్వం ఉంటుంది. అంటే మనం చెప్పుకోవాలంటే the personal element in the stage of development. అది క్రమాన్యత్వం అంటే. పదిమంది క్లాసులో ఉంటే, పదిమందీ పరీక్ష పాసవుతున్నారా? పదిమందీ ఫీజ్ కట్టుతున్నారు కదా! పదిమందీ పాఠాలు వింటున్నారు కదా! అందుచేత 'క్రమాన్యత్వం' అంటే personal element అన్నమాట. ఒక్కొక్కడు లెక్చరర్ తిన్నగా చెప్పలేదు, పరీక్ష తప్పాను అంటాడు. అదే క్లాసులో ఫస్ట్ మార్కు వచ్చిన వాడుంటాడు. మా లెక్చరర్ గారు ఒక్కమాటు చెప్తే చాలు. నేవెళ్ళి చదవక్కర్లేదు అంటాడు వాడు. అందుకని 'క్రమ అన్యత్వం' యోగాభ్యాసం చెయ్యని వాళ్ళల్లో యిలా పువ్వుని చూసిన వాళ్ళల్లో యింతమంది ఎట్లా ఉన్నారో చూడండి. తోటలో చాల పువ్వుల్ని పెంచాడు కాని ఒక్క పువ్వు కోయలేదు. అన్నిటినీ చూసి ఆనందించాడు కోయకుండా. కనుక ఎవడెవడు ఏరకంగా పువ్వుని approach అయ్యాడో, వాడు వాడు ఆ పువ్వుకి ఆ రకంగా response మారినట్లు. యోగాభ్యాసం చేసి పరిపూర్ణత వచ్చినటువంటి వాళ్ళల్లో కూడ, ఎవడెవడు క్రమాన్యత్వం పొంది ఉన్నాడో, stage of development లో personal element పొంది ఉన్నాడో, దాన్ని బట్టి ఉంటుంది. సమాధి స్థితి వచ్చేటప్పటికి. శిష్యులకు చెప్పాడు. నీళ్ళు కలుపనటువంటి పాలు, కుండలో పోసి, తోడుపెడితే బాగా గడ్డగా

తోడుకున్నాక, మర్నాడు పొద్దున్న ఆ పెరుగు పడదోసి చూస్తే ఎలా ఉంటుందో అలా ఉంటుంది సమాధి అన్నాడు. కాదనటానికి వీల్లేదు. యింకొకడు సమాధి ఎలా ఉంటుంది అని అడిగితే ఏం చెబుతాడు, ఈ మనస్సు పనిచేస్తుండగ ఏం చెబుతానోయ్! అంటూ కూర్చోపెట్టి ఒక ఐదు నిమిషాలు వాడు కొంచెం సమాధిలో manipulation చేసి, ఈ 5 నిమిషాలు నువ్వేం చేసావు? అంటే ఏమో నాకేం తెలీదండి, అంటే అదే సమాధంటే అంటాడు. మూడవవాడు సమాధంటే ఏమిటి? అనడిగితే మనం ఎరిగున్నటువంటి ప్రపంచంలో ఉన్నటువంటి స్థితులేవి కానిదేదో అది అని చెబుతున్నాడు. అంటే అది నేతి సిద్ధాంతం అంటారు. అంటే న.ఇతి. ఇదికాదు అన్నమాట సిద్ధాంతం. అంటే ఇవన్నీ ఏవైతే కాదో అది అంటాడు. ఇందులో చెప్పిన వాడెవడూ అనుభవించక పోలేదు. ప్రతివాడు అనుభవించినవాడే కాని ఎలా చెబుతున్నారు? వాడికి వంగతోట ఉంటే వంకాయ కూర తింటున్నట్లు ఉంటుందని చెబుతున్నారు. వాడికి ఏది యిష్టమో అది తింటున్నట్లుందని చెప్పుతున్నారు. కనుక 'క్రమాన్యత్వం' క్రమమునందున్న అన్యత్వం ఉన్నదే, యితరత్వం అంటే personal element in the stage of development అది. దీనికి 'పరిణామ అన్యత్వే' పరిణామము నందు వచ్చు భేదముల యందు అంటే for the various manifestations. అంటే వాటిని గురించి వీడి జీవితంలో నడచిన దాన్నిబట్టి అనేక రకాలైన approaches వస్తూంటాయి. వీడు అభ్యాసం ఏ గురువు దగ్గర చేసాడు, లేదా గురువు ఎలా చెప్పినా తాను స్వతంత్రించి చేసాడా? లేకపోతే వాడు చెప్పినట్లు చేసాడా? లేదా సున్నితంగా, నాజూకుగా చేసాడా? బండపని చేసాడా? అనే దాన్నిబట్టి ఉంటాయి. యోగాభ్యాసం తొందరగా వచ్చేసేయాలి. అంచేత రాత్రి, పగలు అలా కూచొని గడగడ concentration తో చేసాడు అనుకోండి. తలకాయ నెప్పి వచ్చేసింది. గురువేం చెబుతాడు. యోగాభ్యాసం చేస్తూంటే మధ్యలో బోల్డన్ని విఘ్నాలు వస్తాయి, తలనెప్పి వస్తుంది, పట్టించుకోకూడదు అంటాడు. తలనెప్పిరాదూ? యోగాభ్యాసం తిన్నగా చేస్తే రాదు. అంటే చివరికి ఎట్లాగో గురువు అనుజ్ఞవల్ల సమాధిస్థితి వచ్చింది అనుకోండి.

అలాంటివాడు ఇది చెబుతూ మధ్యలో బోల్డంత తలనెప్పి వస్తుంది, భరించాలి అని చెబుతాడు. యిలాంటివన్నీ ఉంటాయి యోగాభ్యాసంలో. సాధనలో గాని చివరలోగాని అసౌకర్యం వచ్చినా, మనలో లోపం వల్ల వస్తుందిగాని, యోగాభ్యాసం వల్ల రాదు అది గుర్తుపెట్టుకోండి. ఎన్నడూ కూడ, ఏ స్టేఫ్‌లోనైనాసరే. అందుకని ''క్రమాన్యత్వం పరిణామాన్యత్వే హేతుః'' హేతువు అంటే కారణం అన్నాడు. ఇలా ఆలోచించటానికి వీడి thinking principle యొక్క స్వభావం కారణం.

అంటే క్రమములో ఒకడినించి ఇంకొకడికి అన్యత్వం వస్తుంది అన్నమాట. అంటే పదిమంది యోగాభ్యాసం చేసినా, సమాధిలో అనుభవించినటు వంటిది ఒకటే అయినా, యివతలికి వచ్చిన తర్వాత, దాన్ని గురించి చెప్పుకుంటంగాని, దాన్ని గురించి తలచుకుంటంగాని, ఎవడి అనుభూతి (pictures) వాడిదేగాని, ఒకడి అనుభూతి (picture) ఇంకొకడికి తన్నుకున్నా రాదు. దీనికంటే పై లెవల్‌కి వెళ్ళాక వస్తుంది. తరువాత చెబుతాడు నాల్గవపాదం. కనుక ఒక వందమంది గురువులుంటే ఎవడి గోల వాడిదే. అందరూ గురువులమే నంటున్నారు. కాని యిక్కడికి వచ్చేటప్పటికి లఘువులైపోతారు, personal element ఉంటుంది. అది చెబుతున్నారు.

## 16. పరిణామత్రయ సంయమాదతీతానా గతజ్ఞానమ్।

పరిణామత్రయ = మూడు పరిణామములును, సంయమాత్ = సంయమము చెందుట వలన, అతీత = జరిగిపోయినదిన్ని, అనాగత = జరగబోయే దిన్నీ, జ్ఞానం = జ్ఞానం (వస్తుంది).

మూడు విధములైన మార్పులను సంయమముతో చూచుట వలన జరిగినవి, జరుగుచున్నవి తెలియును (ధర్మములలోను, లక్షణములలోను, స్థితిగతులలోను కలుగు మార్పులే మూడు విధములైన మార్పులు).

**వివరణ :** పరిణామత్రయము అంటే చూస్తున్నవాడు, చూడబడుతున్నటు వంటి వస్తువు, చూచుట అనేటువంటి ప్రత్యయము. ఈ మూడు పరిణామము చెంది ఏకత్వానికి రావటమే కదా యోగాభ్యాసం అంటే. అభ్యాసము అయినకొద్దీ ఈ మూడు ఉండవు. పరిణామత్రయము అంటే ఇది. అంటే doing, doer and the done. The seer and the object to be seen and the act of seeing. ఈ మూడు లేనిదే ఏది లేదు. ఆలోచిస్తున్నారనుకోండి. ఆలోచించబడుతున్న వస్తువు, ఆలోచించుట అనే ప్రక్రియ, ఆలోచించువాడు ఈ మూడు ఉన్నాయి. దీన్ని మూల త్రిభుజము (the basic triangle) అన్నాడు పైథాగరస్. ఈ మూల త్రిభుజం కనుక లంబకోణం (right angle) అయినట్లైతే మనల్ని యోగాభ్యాసంలోకి తీసికెళ్తుంది. అందుకోసమనే right angle triangle చెప్పారు. మిగతావన్నీ ఏం చెప్పాలో తెలియక వదిలేసారు. పైథాగరస్ యిచ్చిన యిటువంటి పాఠములు 33 సంపుటములున్నాయి. కనుక 'పరిణామ త్రయ సంయమాత్' ఈ మూడింటి యొక్క పరిణామము సంయమము జరుగుట వలన. సంయమము అంటే ధారణ, ధ్యాన, సమాధులు మూడున్నూ ఏక కాలమునందు మనమీద పనిచేసి మనం ఆ స్థితిలో ఉండుట. దీన్నే Master C.V.V. గారు "simultaneous existence of consciousness in all planes is yoga" అన్నారు. అంటే పై లోకాల్లో (plane) కి వెళ్తూంటే క్రింద లోకాల్లో వెలుగు ఆరిపోవటం కాదు. మేము క్రిందవన్నీ చూడం పైవే చూస్తాం అంటే

మనకి ఎవడో యింత ముద్ద తెచ్చిపెడుతూ ఉండాలి. ఏకకాలంలో (simultaneous) వరుసన పై లైట్లు వెలుగుతుంటే క్రిందలైట్లు ఆటోమేటిక్‌గా వెలుగుతాయి. మనతత్వం (constitution) లో క్రిందలైటు వెలిగిన వాడికి పైలైటు వెలగదు కాని, పైలైటు వెలిగిన వాడికి క్రింద లైటు ఆటోమేటిక్‌గా వెలుగుతుంది. ప్రకృతిలో ఆ రకమైనటువంటి ఏర్పాటు స్వయం సిద్ధంగా ఉంది. When we begin to know the higher thing, lower things get cancelled అనుకునేవాడు అవివేకి. క్రొత్త సత్యములు తెలిస్తే పాత విషయాలు మాయమవుతాయి అనుకోకూడదు. జ్వాల్‌కూల్ మహర్షి చెప్పారు. "Every new thought throws light upon the already existing truth in your mind". ఆ dimension వస్తుంది. అంటే ఇదివరకు మన మెరిగివున్న విషయములకు మన మెరిగివున్న ప్రతి క్రొత్త విషయములు కూడ ఇదివరకు మన మెరుగని సమన్వయాన్ని తెలుపుతుంది. అంతేగాని ఉన్నవాటిని తీసేసి వీటిని కూర్చోపెట్టి ఉండదు. అంటే మనకేదన్నా క్రొత్త ఉద్దేశ్యం (idea) వస్తే, క్రొత్త సత్యం తెలిస్తే, క్రొత్త పుస్తకం చదువుకుంటే, అది వరకు చదువుకున్న పుస్తకాల్లో మన మెరిగి ఉన్న విషయాలు యింకా బాగా అర్థం అవ్వటం మొదలు పెడతాయి. ఆ స్థితి వస్తుంది యోగాభ్యాసం చేస్తూంటే. కనుక ''పరిణామ త్రయ సంయమాత్''. ఈ పరిణామత్రయం యొక్క సంయమము జరగటం వల్ల ''తస్యభూమిషు వినియోగః'' (6వ సూత్రం). దాన్ని ప్రపంచంలో అనేక దృక్పథముల యందు వినియోగించుకోగలరు యికనుంచి అని చెప్పారు. అందులోని ప్రయోజనాలు ఒక్కొక్కటే చెబుతున్నారు. ఉదాహరణకు ఎవరైనా అన్నం తింటున్నా రనుకోండి. ఆ తింటున్న అన్నం, తింటున్నవాడు, తింటున్న విధానము మూడున్నూ సమానంగా కనిపిస్తాయి యోగాభ్యాసం చేసినవాడికి. అప్పుడు వాడు తినాల్సిందే తింటున్నాడో, తినకూడనిది కూడ తింటున్నాడో తెలుస్తుంది. తినకూడనిది రుచికోసం తింటే రోగం వస్తుందని తెలుస్తుంది. రేపువాడు మందుకి వస్తాడని చెబుతారు మీరు. వాడు రుచిని తినటం కోసం ఉపయోగించుకోకుండా, రుచికోసం తింటున్నాడు. రుచికోసం తినేవాళ్ళు రోగులు, రుచిని తినటంకోసం ఉపయోగించే వాళ్ళు భోగులు. అంటే

యోగులు. తినటానికి పెట్టిపుట్టిన వాళ్ళు. ఎవడైతే తినటానికి రుచిని ఉపయోగించుకున్నాడో వాడు పెట్టి పుట్టినవాడు. ఎవడైతే రుచికోసం యింకాస్త కక్కుర్తిపడి తిన్నాడో, వాడు రోగి. పరిణామత్రయం సంయమం చెందుట వలన, వాణ్ణి చూడగానే తినవలసినవి తింటున్నాడో, తినకూడనివి తింటున్నాడో వాడి కళ్ళల్లో తెలుస్తుంది. వాడి చూపుల్లో తెలుస్తుంది. తినకూడనివి తింటున్నపుడు చూపులు ఒకలాగ ఉంటాయి. డాక్టరు తినవద్దన్నవి తింటున్నపుడు ఇంకోలాగ ఉంటాయి. తినమన్నవి మాత్రమే తింటున్నపుడు ఒకలాగ ఉంటాయి. తినమన్నవి కూడ తినకుండా ఉన్నపుడు ఇంకోలాగ ఉంటాయి. ఇవన్నీ కూడ ఊరికేవాడు అన్నం తింటూ ఉండగ చూస్తే ఆటోమేటిక్‌గా తెలుస్తాయి. ''అతీత అనాగత జ్ఞానమ్'' ఇదివరకు వీడి ఆరోగ్యం ఎట్లా ఉంది? ఎలా అన్నం తినేవాడు. ఇపుడు ఎలాంటి మార్పు వచ్చింది. రేపు రాబోయే రోజుల్లోను, వారాల్లోను, నెలల్లోను, సంవత్సరాల్లోను వీడి తిండి ఎట్లా ఉంటుంది, ఎట్లా పడిపోతుంది, ఎట్లా పెరుగుతుంది, ఇవన్నీ సినిమాలాగ చెప్పగలుగుతాడు అన్నారు. ఇది ఏమీ అద్భుతం (miracle) కాదు. ఇవన్నీ ఇపుడు చూసిన దాంట్లో ఇమిడి ఉంటాయి అన్నాడు. మేడమ్ బ్లావెట్స్కీ దీన్ని గురించే 'Isis Unvield' లో వ్రాసింది. మఱ్ఱి విత్తనంలో రాబోయే మఱ్ఱి చెట్టున్నూ, ఇదివరకు ఉన్న మఱ్ఱి చెట్టున్నూ ఎలా అయితే యిమిడి ఉన్నవో, అలాగ నువ్వు చూస్తున్న ప్రతి సన్నివేశములో ఒక మఱ్ఱిగింజలాగ దాని ముందున్నది, రాబోయేది యిమిడి ఉన్నది. కనుక భూత, భవిష్యత్, వర్తమానాలు అనేటువంటివి చూస్తూ ఉండటం ''తదతీత అనాగత జ్ఞానం'' అంటే. 'It is commen sense protracted' అంది బ్లావెట్స్కీ 'Isis Unvield' లో. సాధారణ ప్రపంచ జ్ఞానాన్ని మనం మామూలుగా వాడం అంది. "It is wrongly called common sense because it is rarely used" అంది. common గా వాడితే కదా common sense. లోపల ఎక్కడో అట్టే పెట్టిన applied sense నే వాడతాంగాని, common sense ని వాడటం చాల తక్కువ. కాని protracted use of common sense చేస్తాడు యోగాభ్యాసంలో ఉన్నటువంటి వాడు. అది ''పరిణామ త్రయ సంయమాత్''. మూడు పరిణామములు సంయమము

చెందుటవలన అంటే త్రిభుజము (the triangle) అనేటువంటి దానియందు పరిణామం చెందుట ఫలన, వీడిలో ఉన్నటువంటి evolution పెరగటంవల్ల, ఏ పనిచేసినా three fold activity ఉంటుంది. పాఠం చెబుతున్నాట్ట అంటే చెబుతున్నవాడు, చెప్పటం, పాఠం మిగుల్తాయి. పాఠం వింటున్నాట్ట అంటే వింటున్నవాడు, పాఠం, వినటం మూాడు ఉంటాయి. ఈ మూడున్నూ ఒక్కమాటుగా కనిపిస్తాయి. భూత భవిష్యత్కాలములు తెలుస్తాయి. యిదివరకు ఏం చేసాడో, ఏవేం నేర్చుకున్నాడో, ఎట్లా చదువుకున్నాడో రెండు నిమిషాలో, ఐదు నిమిషాలో చూసాక అర్థమైపోతుంది. ఉదాహరణకు వీడు ఎక్కడో భార్యని హత్యచేసి సన్యాసుల్లో కలిసి ఇక్కడి కొచ్చాడు అని చెబుతాడు. ఎట్లా తెలుసు వీడికి అంటే ఈ ఐదు నిమిషాల్లో వాడిని పట్టాడు. భార్యని హత్యచేసి ఏం చేసాడంటే కేసురాకండా కాషాయం కట్టాడన్నమాట. షిరిడీ సాయిబాబా దగ్గరికి ఒకాయన వచ్చాడు. హిమాలయాలు దగ్గరినించి కన్యాకుమారిదాకా తిరిగాను, కృష్ణుణ్ణి నాకెవరూ చూపించలేదు. నేను కృష్ణ భక్తుణ్ణి, నిరంతరం కృష్ణ జప ధ్యాన పారీణుడిని అంటూ అటు తిరిగి నించున్నాడు. షిరిడీ సాయిబాబా వీడివంక చూడలేదు. తరువాత తిరిగి నుంచొని కర్రపెట్టి నేలమీద కొట్టితే దుమ్ము లేచింది అక్కడ. ఇంతే నీకు కనిపించేదన్నాడు. ఎంచేతంటే భార్య చనిపోతే చూచి, నువ్వు లేకపోతే ఉండలేని చిన్న పిల్లని వదిలిపెట్టి, సన్యాసం పుచ్చుకొని హిమాలయం వెళ్ళిన వాడికి కృష్ణుడేం కనిపిస్తాడు. అది వైరాగ్యం అనుకున్నటువంటి పశువువి కదా నువ్వు అన్నాడు. గడగడ వణికిపోయాడు. జాలేసింది బాబాగార్కి, యిటు చూడన్నాడు. తిరిగి చూస్తే గోపాలకృష్ణుడు వేణువూదుతూ ఐదునిమిషాలు కన్పించాడు. హంసతూలికా తల్పాల్లో వుండేవాడివి ఈరోజున పాడుపడ్డ మసీదులో ఉంటున్నావేం అని అడిగాడు వీడు. నాకెక్కడ ఉండటం ఏమిటి? నావాళ్ళెక్కడ ఉన్నారో అక్కడ నేను ఉంటాను. అదీ నా కంటలేదు, ఇది నా కంటలేదు అన్నాడు. అదీ అతీత జ్ఞానమంటే.

పరిణామత్రయం ఒక్కోడికి ఒక్కొక్కలాగ ఉంటాయి. భోజనం చేయుచున్నవాడు 'కర్త', భోజనము చేయుచుండుట క్రియ, భోజన పదార్థము 'కర్మ'. వ్యాకరణంలో వీటిని కర్త, కర్మ, క్రియ అంటారు. వేదాంత

శాస్త్రంలో 'త్రిపుటి' అని అంటారు. The three fold dimension of the intellect. ఈ మూడింటిలో equal distribution of energies apply అయినపుడు మాత్రమే ''త్రయమేకత్ర సంయమః'' అవుతుంది. ధారణ, ధ్యాన, సమాధులు సంయమంగా ఒకచోటికి వచ్చి ''తస్య భూమిషు వినియోగః'' అనేక నీ జీవిత సన్నివేశములలో ప్రతిదాని యందు ఈ సంయమాన్ని వినియోగము చేయుదువు గాక అని చెప్పాడు. దేనియందు వినియోగం చేస్తాడు. నిద్రపోతూండగ నిద్రపోవుటయందు వినియోగం చేస్తాడు. అన్నం తింటూ ఉండగ ఆ తినటం యందు వినియోగం చేస్తాడు. అందుకనే యోగికి గాఢ నిద్రలో ఉన్నప్పటికి అన్నీ తెలుస్తూ ఉంటాయి. నిద్రపోతూ ఉన్నా చూడగలడు. ఆ చూస్తూన్నవాడు వేరుగా ఉంటాడు యోగిలో. ఒకాయన ఆశ్రమానికి వెళ్ళినప్పుడు ఈయన ఎన్నింటికి నిద్రపోతాడు అని అనుమానం వచ్చింది. ఆయన్నే పాకలపాటి గురువుగారు అంటారు. రాత్రి పన్నెండు గంటలకి లేచి చూచాడు, ఏం బాబు ఏం కావాలి? అన్నాడు. మళ్లీ పడుకున్నాడు. ఒంటిగంటకి లేచి చూచాడు. ఏం బాబు కొత్తగా ఉందా అన్నాడు. మళ్ళీ పడుకున్నాడు. రెండు గంటలకి లేచి చూసాడు. నవ్వాడు ఆయన. మూడు గంటలకి లేచి చూసాడు. మళ్ళీ నవ్వాడు. నాలుగు గంటలకి లేచాడు. లే అన్నాడు. కొండమీద ఉన్నది ఆ యిల్లు. ఇంటిచుట్టూ తీసికెళ్ళి ఆకాశంలో నక్షత్రాలు, తారకలు, ఆ కొండకి దిగువుగా ఉన్నటువంటి మొక్కజొన్న చేలు, వాటి కండెలు ఆ తెల్లవారు జామున చూపించి క్రింద ఉన్నటువంటివి పల్లె గ్రామాలు అనిచెప్పి వెళ్ళి పడుకో అన్నాడు. ఆయనెప్పుడు పడుకుంటాడు అనేది ఈయన అనుమానము. ఈయన అడగలేదు. ఆయనే చెప్పాడు ఆ మర్నాడు. 'యోగిలో నిద్రపోయేవాడు ఒకడుంటాడు. నిద్రపోతూంటే చూస్తుండేవాడు ఒకడుంటాడు' అని చెప్పాడు. యోగనిద్ర అంటే అవన్నీ తనయందు లీనమవ్వటం, అంటే ఎవరియందు యివన్నీ లీనమై ఉన్నాయో, వాడు మేల్కొని ఉండటం. మనం నిద్రపోయేటువంటి స్థితి కూడ వాడియందు లీనమైపోయి ఉంటుంది. మామూలుగా అయితే మనకి వాడికీ contact, connection ఉండదు గనుక మనం మొత్తం నిద్రపోతూ ఉంటాము. అంటే వాడు మేల్కొని ఉన్నా, వాడికీ

మనకీ కనెక్షన్ లేదు. కాని ఆ లోపలివాడికి, వీడికి యోగాభ్యాసంలో కనెక్షన్ వచ్చినటువంటి వాడికీ మనం నిద్రపోయినంత ఆయనలో కూడ నిద్రపోయేటువంటి వాడు నిద్రపోతూ ఉంటాడు. ఆపైన చూస్తూ ఉండేటు వంటివాడు చూస్తూ ఉంటాడు. అంటే జీవుడు నిద్రపోతూ ఉంటాడు. ఈశ్వరుడు చూస్తూ ఉంటాడు. ఇలాంటి స్థితి రావాలి. భోజనం చేస్తున్నప్పుడు ఆఫీసు సంగతి ఆలోచించే దౌర్భాగ్యులమే చాల మందిమి. అటువంటప్పుడు పరిణామత్రయం ఎక్కడినుంచి వస్తుంది. పరిణామత్రయం ఏమిటి? ఇవాళ కుర్రవాడి పుట్టినరోజని యింట్లో పంచభక్ష్య పరమాన్నాలు చేసారు. వాణ్ణి ఆశీర్వదించండి అని చేతికి బొట్టు అందించి అక్షింతలు ఇస్తోంది భార్య. కొడుకు మొహం వంకచూస్తే వీడికి ఆ కోర్టులో మొదటి ముద్దాయి, రెండో ముద్దాయి కనిపిస్తున్నారు. ఎందుకని? వీడు ఇంకో అరగంట ఆగి, కోర్టుకి వెళ్ళటం గురించి ఆలోచిస్తున్నాడు. అంటే work while you work, play while you play ఉండదు. వాళ్ళువళ్ళో ఎక్కడో క్రికెట్ ఆడుతూంటే, యిక్కడ ట్రాన్సిష్టరులో వింటున్న వాడిలాగ ఉంటాడు. అంటే వీడికి క్రికెట్ అంతా వీడి ట్రాన్సిష్టర్‌లో ఉంటుంది కాని, నిజమైన లోకం సత్యమైన లోకంలో ఉండదు. అట్లాంటి వాడికి ఈ త్రిపుట భేదనం ఉండదు. అంటే equal distribution of energies by applying in the three centres ఉండదు. కనుక కోర్టు గురించి ఆలోచిస్తూ భోంచేసినవాడు తనయందు తానుండడు. తను ఎక్కడ ఉంటున్నాడు? కోర్టులో. మరి క్రియ అంటే భోజనం చేయటం, చేయటం ఎక్కడ ఉంటుంది? వాడియందు ఉండదు. కేవలం పశుప్రక్రియ. అంటే చెయ్యి నోరూ ఆటోమేటిక్‌గా కదుల్తూ ఉంటాయి (automatic activity of the hand and mouth జరుగుతూ ఉంటుంది). అంటే కప్పనిగాని, కుక్కనిగాని, పామునిగాని చంపేసాక ఇంకొన్ని గంటలపాటు ఎగురుతూ ఉంటాయి. అలా తింటూ ఉంటాడు వీడు అన్నం. అంటే వీడు తినడు. వీడి నోరు తింటూ ఉంటుంది. మెడికల్ కాలేజీలో కప్పని చంపి కట్టేసి, శిలువకొట్టి, గుండెకాయ అవన్నీ పెడతారు. 48 గంటల వరకు ఆ గుండెకాయ కొట్టుకుంటూ ఉంటుంది. కప్ప జీవించి ఉందని అనగలమా! అయినప్పటికీ గుండెకాయ పనిచేస్తూంది. ఆ గుండెకాయ ఎలా అయితే

పనిచేస్తోందో వీడిలో ఉన్న యాతనామయ లోకములు, వాటిని యమలోకాలు అంటారు, అవి పని చేస్తూంటాయి. యమించి పని చేయించే లోకాలు. బ్రతికి ఉన్ననాళ్ళు యమించి పని చేయించినవి. వీడు లేకపోయినా, వీడు నిద్రపోతున్నా వీడి ఊపిరితిత్తుల్ని, గుండెకాయని కొట్టించేవి అవే. అవే యమలోకాలంటే. ఆ లోకాల్లో కూడ మనం నిద్రపోతూన్నా మేల్కొనేట్లు ఉండేశక్తి పేరు సావిత్రి అంటారు. అంటే సత్యవంతుడు అక్కడికి వెళ్ళేటప్పటికి he is lost. మళ్ళీ ఆవిడ పట్టుకొస్తుంది. వాడు పోతాడుగాని ఆవిడపోదు. నిద్దట్లోకైనా వెళతాడు. నిద్దట్లో కూడ ఆవిడ ఉంటుంది. శరీరం వదిలిపెట్టినా ఈ వదిలిపెట్టిన వాడు పోతాడు ఆవిడ ఉంటుంది. అందుకనే వీణ్ణే నేను చేసుకుంటాను అంటే వీడు చనిపోతాడు అని చెప్పారు సావిత్రి కథలో. అంటే జీవుడు చనిపోక ఏమౌతాడు? అయినప్పటికీ ఆవిడ వీణ్ణే చేసుకుంటాను అన్నది అంటారు. అది సావిత్రి కథలో ఉన్నటువంటి విషయం. యోగ రహస్యాల్ని గురించినటువంటిది. అందుకనే 35 సంవత్సరములు శ్రమించి అరవింద యోగీంద్రులు ఆంగ్లభాషలో 'సావిత్రి' అనేటువంటి ఒకానొక ఋగ్వేదం మనకి యిచ్చాడు. యిది చదివినవాళ్ళు చాల తక్కువ. ఇంగ్లీషు వాఙ్మయం క్లాసులో ఎవరికో అందులోని 7,8 లైన్లు పాఠ్యభాగంగా వేసారు. ఓ కుర్రాడు ఈ పాఠం చెప్పండి సార్ అని వచ్చాడు. అదేమిటిరా! ఇంగ్లీషు డిపార్టుమెంటులో చదువుతున్నావు. నీకు నేను పాఠం చెప్పటమేమిటి అంటే వాళ్ళు చెప్పనూ చెప్పారు, నాకు బోధపడనూ లేదు అన్నాడు. వ్యూహం (concept) అర్థమైతే బోధపడే విషయమే తప్ప, ఇంగ్లీషు పదజాలం తెలిస్తే బోధపడే విషయం కాదు. ఒకసారి తిరుపతి వెంకట కవులు గద్వాలు సంస్థానానికి వెళ్ళారు. వాళ్ళ దగ్గర 'క్షీర నైషధము' అనే సంస్కృత కావ్యం ఉంది. ఎవడికీ బోధపడలేదు. చాల ఆశ్చర్యకరమైనది. చెబుతూన్న కొద్దీ అర్థాలు వస్తాయి. ఆ కావ్యం అలా రాసారు ఆయనెవరో. అది యిచ్చి దీన్ని అనువాదం చేస్తారా అని అడిగారుట. తిరుపతి శాస్త్రిగారు కంగారు పడుతున్నారు. ఎందుకంటే చాల నిజాయితీ కలవాడు యిద్దరిలో. వేంకట శాస్త్రి అన్నాడు. అదెంతసేపు, మేము ఇలాంటి కావ్యాలు చాల చూసాము అన్నాడు. ఎన్నాళ్ళల్లో చేస్తారు అంటే నెలరోజులలో చేస్తాం అన్నాడు. ఇంటకి

వచ్చాక తిరుపతి శాస్త్రి అడిగాడు, ఏమిరా వేంకటశాస్త్రి నువ్వు ఆ పుస్తకం చూసావా అన్నాడు, చూడలేదు అన్నాడు. మరి ఏమిటి అనువాదం చేస్తానన్నావు. అవ్వకపోతే అవమానం అవ్వదా అన్నాడు. అదికాదు మనకి బలమైన పాయింటు ఒకటి ఉంది అన్నాడు. ఏమిటి అంటే ఇంతవరకు ఎవడికీ అర్థం కాలేదు ఆ పుస్తకం. అంచేత నైషధం కథ మనకు తెలుసు కదా. 'నలోపాఖ్యానం' ఇందులో శ్లోకాలకి టీకా తాత్పర్య అర్థములు తెలుసుకదా. మిగిలినటు వంటిది మన కవిత్వంలో మనం చేసేటువంటి చమత్కృతులు ఉన్నాయి కదా. ఇంకవాడు కాదంటే అందులో ఉన్న అర్థం వాడు చెప్పి తీరాలి కదా. అంచేత ఎవడూ కాదనలేడు అన్నాడు. అప్పటికి 28 రోజులు అయిపోయింది. ఇంక రెండు రోజులే ఉంది. ఏమిరా వేంకటశాస్త్రి అనువాదం అన్నావు ఏది? అని అడిగాడు పాపం తిరుపతి శాస్త్రి. ఎందుకన్నయ్యా కూర్చో అన్నాడు. ఆ రాత్రి తెల్లవారే సరికి శ్లోకాలు చూస్తూ పద్యాలు చెప్పేసేసాడు. తిరుపతిశాస్త్రి రాసేసాడు. చక్కగా పూర్తిచేసారు. అయ్యిందా అంటే బ్రహ్మాండంగా అయ్యింది అన్నారు. చదవండన్నారు. పండితుల్ని మూలం దగ్గర పెట్టుకోండి అన్నారు. ఒక్కొక్క పద్యం 7,8మాట్లు వీడు చదవటం, ఇందులో శ్లేషలు, అర్థాలు, వ్యంగ్యాలు అన్నీ ఉంటాయి కదా. వీడు అందులో చూసుకోండి అనడం. ఏం చూసుకుంటాడు? తత్ఫలితంగా చివరికి గజారోహణ మహోత్సవం చేసారు వాళ్ళకి. ఆ పద్ధతిలో ఉంటుంది. కనుక కర్త, కర్మ, క్రియ లేదుకదా. మనస్సు భోజనం మీద ఉంటే కదా భోజనం తింటూన్నది. భోజనం తినడం ఎప్పుడు ఉంటుంది? మనస్సు భోజనం యందుండి రుచి ఆనందిస్తూంటే నాలిక భోజనం చేస్తుంది. పొట్ట తింటోంది. ఎందుకంటే జీర్ణమై శరీరం జీవించి ఉండాలి కనుక. అందుకని మూడింటికి సమపాళము లేదుకదా. మూడింటికి సమపాళము ఎపుడైతే లేదో పరిణామ త్రయమేది? మూడూ పరిణామము చెందేది ఏది? లేదుకదా. అలాగే అబ్బాయి అన్నం తింటున్నాడనుకోండి, మనకి అబ్బాయి అన్నం తినటమే కదా. కాని మనం తినటము ఒక్కటే చూస్తాం. ఎంత తిన్నాడు అని. అబ్బాయిని చూడం. క్రియ చూడం అంటే శుభ్రంగా భోంచేసాడు. ఎవడు అనే పాయింటు లేదు. శుభ్రంగా భోంచేయటమే. అంటే మనస్సులోంచి ఈ రెండూ పోతాయి.

యింకొకరు కుర్రాణ్ణి చూస్తాగు. ప్రక్కవాళ్ళ కుర్రాడు అన్నం తింటున్నాడు. అపుడేం చేస్తాం? అదికూడ కర్మ చూస్తాం, వాడు అవ్వటానికి నాలుగో ఏడేగాని ఇంత పట్టాడండోయ్, మావాడు రామరామ ఇంత అంటే ఇంతే (కొంచెం) అంటారు. దీనిమీదే ఉంటుంది ఎంతసేపు వీళ్ళ దృష్టి. మూడూ ఉండవు. బజారుకెళ్ళి కూరలు కొనుక్కు రావాలి. వెళ్ళేవాడు, వెళ్ళటం, కొనటం కదూ. వీడి మనస్సు ఎక్కడ ఉంటుంది. ఆ బజారుకి వెడుతూంటే దారిలో వాడెవణ్నో పలకరించాలి, మాట్లాడాలి. లేదా ఆలస్యమైపోతే యింటికి వస్తూ, ఆ మధ్యలో మసాలాదోశ తినేసి వద్దాం అనుకుంటాడు. అంటే దీనియందు లేదు. దేనియందు ఉంది? తనయందున్నూ, ఇంకా తను ఇంట్లో చెప్పకుండా చేద్దాం అనుకున్న ప్రోగ్రాంలు ఉన్నాయే వాటియందూ ఉంటుంది. చెప్పకూడని పనులమీద రాత్రి బయటికి వెళ్ళి వచ్చేవాడు సినిమాకి వెళ్ళొస్తాను అని చెప్పాడు కదా. వాడు సినిమా చూచుట, సినిమా హాలు. ఇదే లేదుగా అసలు. కనుక ఎపుడూ కూడ పరిణామత్రయం లేదు. యోగాభ్యాసంలో యివన్నీ సర్దుకుపోతాయి. గనుక systamatise అయిపోతాయి గనుక, మనస్సు ఉదయిస్తున్నపుడు, అస్తమిస్తున్నపుడు, లయమవుతున్నపుడు కూడ ఒకే స్థితిలో ఉంటుంది. కనుక పరిణామత్రయము చక్కగా వస్తుంది. అది వచ్చేటప్పటికి దానియందు సంయమము అనేది వీడు అభ్యాసము చేస్తాడు. అంటే ఏది చూచినా మూడింటికి సమపాళంగా చూస్తాడు. బజారుకి వెడుతున్నాడంటే బజారుకి వెళ్ళటం కోసమే వెడతాడు. అంతేగాని ఇంకో పనిమీద వెడుతూ బజారుకి ఈ పనిమీద వెడుతున్నాను అనుకోనూ అనుకోడు, చెప్పనూ చెప్పడు. ఇంకో పనిమీద వెడుతున్నాను అంటే ఇంకో పనిమీదే వెడుతున్నాను అని చెప్తాడు. ఏం భయం. పాపం భార్య చెబుతుంది, అయోమయం ఇల్లాలు, వారు బజారుకి ఆనపకాయ తేవటానికి వెళ్తున్నారని. ఆనపకాయ తేవటానికి వెళ్తున్నారుట కదా అని అడిగితే అబ్బే కాదండి ఊరికే మా ఆవిడతో అలా చెప్పాను. ఆనపకాయ లేదు దిబ్బలేదండి, నేనేదో నశ్యం డబ్బాలో వేయించుకుందామని వెడుతూంటే, ఏమండి కూరగాయలకి వెడుతున్నారా? ఆనపకాయ తెస్తారా? అంది. అందుకే వెడుతున్నాను అన్నాను సరదాకి, అని శుభ్రంగా చెప్పేస్తాడు. ఇంటికి వచ్చాక ఆవిడతో కూడ

చెప్పేస్తాడు, కనుక పరిణామత్రయం సంయమం. Be truthful to yourself. నీకు నువ్వు నిజాయితీగా ఉండు. సత్యం పలుకు అన్నాడు. అలా చేసినపుడు పరిణామ త్రయం వస్తుంది. అప్పుడు ఏ వస్తువుని చూచినా అలా పరిణామత్రయంతోనే చూస్తాడు. ఎవరైనా కూర్చున్నవాళ్ళని చూస్తే ఆ కూర్చున్న ఆయన, చూస్తూన్న మనము, ఆయనకి, మనకీ మధ్యన ఉన్న క్రియస్వరూపమైన చూచుట మూడింటిని సమానంగా చూస్తాడు. ఎపుడైతే అలా చూసాడో, ఆయన ఇది వరకు ఏమేమిటి పద్ధతిగా ఉండేవాడో, ఇపుడే పద్ధతిగా ఉంటున్నాడో, రాబోయే సంవత్సరాల్లో ఏ పద్ధతిగా ఉంటాడో శుభ్రంగా తెలుస్తుంది. లేదా ఆయన ఆరోగ్యం పనిమీద వచ్చాడనుకోండి. మీరు డిస్పెన్సరీలో పనిచేస్తున్నారనుకోండి. ఆయన ఆరోగ్యం ఇదివరకు ఏ పద్ధతిలో ఉండేది. ఇపుడెలా ఉంటోంది. ఇటుపైన సంవత్సరాల్లో ఎలా ఉండబోతోంది, మీకు రెండు నిమిషాల్లో శుభ్రంగా అద్దంలో చూచినట్లు తెలిసిపోతుంది. దాన్నిబట్టి మీరు చేయవలసి నటువంటి కర్తవ్యం. మీరు మందో, మాకో, మంత్రమో, పద్ధతో చెబుతారు. అంటే వాణ్ణి అడిగితే సమాచారం తెలుసుకోవడం ఒకటే గతికాదు మనకి. కాని అడగటం మానడు. ఎంచేత సరిచూచుకుందుకు (verification process) అంటే మరొక్కమాటు తాను చూచినది సత్యమని తెలియటానికి అంతేగాని, చెప్పకుండా తెలిసింది చూసావా అనడానికి కాదు. అది యోగాభ్యాసం చేసేవాడు ఎపుడూ చేయడు. వాడు చెప్పినదే వాడికి తెలుస్తుంది స్పష్టంగా. చాల ఆపదలో ఉండి, ఏదో దిగులులో ఉండి, వచ్చి కూర్చున్నాడనుకోండి, వెంటనే నీ మనస్సులో ఆ దిగులు తగుల్తుంది. వాడు చెప్పినది ఇది సరిపోతుంది. అలాగ ''అతీత, అనాగత జ్ఞానం'' వస్తుంది. అతీతం అంటే జరిగిపోయినదిన్నీ అనాగతం అంటే జరగబోయేదిన్నీ, ఈ రెండింటి జ్ఞానమున్నూ అప్రయత్నంగా వస్తుంది నాయనా. ఎందుకంటే మీ దగ్గరకు వస్తే అద్దం దగ్గరికి వచ్చినట్లే. ఈస్థితి నీకు వచ్చాక, నువ్వు అద్దం దగ్గరికి వెడితే ఎలా ఉంటుందో, అలా ఉంటుంది. ఈ సంయమాన్నే ఇంకొక దానికి వినియోగం చేయండి. ''తత్రభూమిషు వినియోగః'' అన్నాడు కదూ!

## 17. శబ్దార్థ ప్రత్యయానా మితరేతరాధ్యా సాత్సఙ్కరస్త త్ప్రవిభాగ సంయమాత్సర్వ భూతరుతజ్ఞానమ్।

సర్వభూత = సమస్త జీవరాసులయొక్క, రుతం = కంఠధ్వని, జ్ఞానం = జ్ఞానము, శబ్దార్థ = శబ్దములయొక్క అర్థములు, ప్రత్యయానాం = ప్రత్యయములకు, యితరేతర = పరస్పర, అధ్యాసాత్ = ఆరోపణ, సఙ్కర = పొడయిపోయిన, తత్ = దానిని, ప్రవిభాగ = చక్కగా విభజించుకొనుట యందు, సంయమాత్ = సంయమము కలుగును.

ఒక వస్తువు, దానికి వాడునట్టి శబ్దము, ఆ శబ్దమునకు కల్పింపబడిన అర్థము అను మూడింటిని వాడుటలో సంకులత్వ మున్నది. దానియందు సంయమము చేసినచో ఈ సంబంధము చక్కబడును. అపుడు ఏ జీవి చేయుచున్న కంఠధ్వనికైనను అర్థము తెలియును.

**వివరణ :** 'సర్వభూత' అంటే సమస్త జీవరాసులయొక్క, 'రుతం' అంటే కంఠధ్వని. అంటే ఏ జంతువు, ఏ పిట్ట గొంతెత్తి అరచినా, ఏ మనిషి మూలిగినా, 'ఆ' అన్నా 'ఊ' అన్నా వాడు ఏమి లోపల ఉద్దేశించి అంటూ ఉన్నాడో, అది మీకు తెలుస్తుంది. ఈ ధారణ, ధ్యాన, సమాధులు సంయమంచేసి, ఒకదాని యందు వినియోగంచేస్తే అది సర్వభూతరుత జ్ఞానము. దేనియందు వినియోగం చేయాలి? అది జాగ్రత్తగా అర్థం చేసుకోవాలిక్కడ. మనం మాట్లాడుతూంటే ప్రతిదానికి శబ్దము, అర్థమూ ఉంటాయి కదా. ఆ రెంటియొక్క ప్రత్యయము అంటే మన మనస్సులో శబ్దానికి అర్థానికీ మధ్యన ఉన్న సంబంధాలు. ఆ ప్రత్యయములకు, ''యితరేతర'' అంటే పరస్పర, అంటే దీనికి దానిమీద, దానికి దీనిమీద ఉన్నా 'అధ్యాసాత్' అధ్యాసము అంటే ఆరోపణ. అంటే super imposition ఈ బల్లమీద ఈ గుడ్డవేస్తే అధ్యాసము అంటారు. కన్పిస్తున్నది బల్లకాదు గుడ్డ. అలాగే మనం మాట్లాడే శబ్దములు, అర్థములు, వస్తువులు ఉన్నాయి. వాటిలో మనం శబ్దం మీద అర్థం, అర్థం మీద శబ్దం, ఒకదాని మీద ఒకటి పరచుకుంటున్నాం, అధ్యాసం చేసుకుంటున్నాం మనస్సుకి అని చెబుతున్నాడు. అలాగే అరటిపండు. అరటిపండు అనే పదం ఒకటి, రెండవది ఈ పదానికి

అర్థం. మూడోది వస్తువు కదా. ఈ మూడు ఒకదాని మీద ఒకటి అధ్యాసం చేసుకుంటున్నాం అంటే ఇందులో ప్రతి ఒక్కటి మిగతా రెండింటివల్ల నిలబడి ఉంది. ఇలాగ మనం శబ్దాలకి అర్థాలున్నూ, అర్థాలకి శబ్దాలున్నూ అధ్యాస చేసుకుంటున్నాం. మాట్లాడుతూన్నపుడు. ఎలాగంటే? పండితుడైన వాడిని శుభ్రమైన వాడిని తీసుకొని, ఏమయ్యా 'మండూకః' అంటే కప్ప ఎలా అయ్యింది అని మనం అడుగుతాం. వాడేం చెబుతాడు. ''మండం ఊకయః ఇతి మండూకః'' అని చెబుతాడు. మండం అంటే కోనేరు. దాన్ని అలంకరించును కనుక మండూకం. అంటే వ్యుత్పత్తి చెబుతున్నాడు. Etimological dictionary అంటారు దీన్ని. అహ! అలాగా అంటాం. పితృ అంటే తండ్రి. పితృ అని ఎందుకు అన్నారు తండ్రిని. 'ప' అంటే రక్షించుట, పోషించుట. రక్షించువాడు లేక పోషించువాడు. కనుక తండ్రి. ఇది వ్యుత్పత్తి. దేనివల్ల పుట్టింది ఈ వ్యుత్పత్తి. అర్థంమీద శబ్దము, శబ్దంమీద అర్థం అంటించటం మనం చేశాం. ఇంకొంచెం పైకి వెడితే 'ప' అంటే రక్షించటం అని ఎవరు చెప్పారని అడిగితే, అది అంతే ఫో! అన్నాడనుకోండి. అప్పుడు 'ఫ' అని ఎలా అన్నాం. అది మనం చెప్పిన అర్థమే. వ్యుత్పత్తు లంటే శబ్దాలకి ఇలా చెబుతున్నవే కదా. హృదయము అంటే హృత్+ అయము. ఇదిగో ఇక్కడ ఉన్నాం అని. అర్థం బాగానే ఉంది, హృత్ అన్నదానికి ఇదిగో ఇక్కడ అని ఎవడు అర్థం చెప్పారు. మనమే కదా, అక్కడ ఒక పెద్ద శూన్యత (vaccume) ఉంది. అంటే క్రింద మనం శూన్యం (vaccume) చూసుకోకుండా, ప్లాట్‌ఫారమ్ ఉంది అనుకొని ఎగురుతున్నాం. ఏ భాషకైనా ఉంది ఈ శూన్యత. సంస్కృతం ఒక్కదానికే కాదు. ప్రతిదానికీ వ్యుత్పత్తి చెప్పి పెట్టారు. 'చంద్ర' చంద్రుడు. 'చెద్' ఆహ్లాదమును కలిగించుట. ఒక ధాతువు వలన ఆహ్లాదము కలిగించువాడు కనుక చంద్రుడు అన్నారు. ఫెలాలజీ ప్రొఫెసరు అటునించి ఇటు చెప్పుతాడు. ''నేను అన్నం తినుచున్నాను.'' నేను అన్నది కర్త. అన్నము అన్నది కర్మ. తినుచున్నాను అన్నది క్రియ. ఇలా ఉంటుందా వాక్యం ఎపుడన్నా. వాక్యం మొత్తం పుడుతుంది. ఎలా అయితే పుట్టిన పిల్లవాడికి తలకాయ, గుండెకాయ, ఇవన్నీ సమకాలికంగానే యిమిడి ఉన్నాయో అలా. ఒక్కొక్కటి ఒక్కొక్కమాటు

పుట్టలేదు. కనుక వాక్యం ముందు పుట్టింది. పదాలు ముందు పుట్టలేదు. అసలు పదాలు తయారవక మునుపే వాక్యం పుట్టింది మనస్సులో. వాక్యం అంటే ఏమిటి? వ్యూహం, అభిప్రాయం (concept). పిల్లవాడు మాట్లాడుతూంటే చూడండి. ఆకలైతే వంటింటి దగ్గరికి వెళ్ళి అన్నం అంటాడు. వాడన్న అన్నం అనే మాటకి నామవాచకమని (noun) అర్థమా? ఎప్పుడూ కాదు. అది ఒక వాక్యం. జాగ్రత్తగా అర్థం చేసుకోండి. కుర్రవాడు అన్నం అంటే నామవాచకం కాదు. పిల్లవాడు అన్నం అంటే నేను తింటాను అనే వాక్యానికి అర్థం. ఆ మొత్తం అంతా వాడు అన్నం అనేటువంటి పదంలో ఉచ్ఛరిస్తున్నాడు. కారు అంటాడు. వాడికేదో ఉద్దేశ్యం ఉంటుంది. అందులో ఎక్కుదామనో, తీసికెళ్ళమనో, కుర్రవాడు రెండే అక్షరములు మాట్లాడినా అది వాక్యమా? లేకపోతే వేరే వేరే పదములా? అందుకనే క్రొత్తభాష నేర్పేటపుడు వ్యాకరణం (grammer) దగ్గరనించి నేర్పితే వాణ్ణి పుటం పెట్టినా ఆ జన్మకి అర్థం కాదు ఆ భాష.

కనుక శబ్దానికి, అర్థానికీ మధ్య ఉన్నటువంటి ప్రత్యయములు (inter-relation ship) వానియొక్క ''యితరేతరాధ్యా సాత్'' ఒకదాని మీద ఒకటి మనల్ని నిలబెట్టి మేకులు కొట్టటం. అంటే super imposition, mutual super-imposition. ఆ రెండింటికీ మధ్యలో మనం చెప్పే దాంట్లో ఏభాషైనా తీసుకోండి. ఎంత మహా పండితులనుకున్నా అడుగున ఒక వాక్యం ఉన్నది. దానిమీద గంతులేస్తున్నాము. ఇంగ్లీషులో చూడండి. టేబుల్ అంటాం. దేన్నిబట్టి అన్నారు. 'టే' అని ఉన్నది గనుక పెద్దదిగా ఉన్నది కనుక అట్లా వెడల్పు తక్కువగా ఉన్నది గనుక 'ble' అన్నారు. కుక్కని చూసి వాడు భౌ! భౌ! అన్నాడు. అంటే వాడి భాషలో భౌ అంటే కుక్క అని వచ్చింది. అయితే dog అని ఎందుకంటున్నావు. వీడు కుక్క అని ఎందుకు అంటున్నాడు. కనుక dog అనే పేరుకి కుక్కకీ ఉన్న సంబంధం రైటా? కుక్కటం అనే పేరుకి కుక్కకి ఉన్న సంబంధం రైటా? నాయీ అనే పేరుకి కుక్కకి ఉన్న సంబంధం రైటా? చూసారా అరవంలో ఒక కుక్క, హిందీలో మంగలి అవుతాడు. మద్రాసు వెళ్ళితే నాయీ అంటే కుక్క. ఉత్తర హిందూస్థానము

వెళ్ళి నాయీ అంటే గడ్డం చేయమని. 'నాపితా' అనే మాట సంస్కృతంలో ఉంది. అందులోంచి వచ్చింది. అంటే గడ్డం చేసేవాడు. కనుక మద్రాసులో కుక్క ఉత్తర హిందూస్థానందాకా వెళ్తే గడ్డం చేసేస్తుంది. అంటే ఏ భాషలో అయినాసరే, ఒక లెవెల్ దాటి వెళ్ళిన తర్వాత accepted idiocy అయిపోతుంది. ఇది కుక్క అని ఎందుకు అన్నారంటే ఆ common understanding లేకపోతే బతకలేరు కనుక కుక్క అని అన్నాడు. మొదటివాడూ రెండవవాడూ కూడ కుక్క అని ఎందుకనాలి. తట్ట అనకూడదా. అందరూ అంగీకరించారు. అంతే అంతకంటే రైటు లేదు. ఇది కాకుండా ఇందాక చెప్పిన పాండిత్యపు రైటుచూసి ఏడుస్తూ ఉండేవాడికి చచ్చినా మాట్లాడుతున్న వాడియొక్క ఉద్దేశ్యం, ఆ మాట్లాడుతున్న శబ్దములలోంచి తెలియదు. ఆ భాష యిద్దరికీ వచ్చినాసరే. వాడూ తెలుగువాడే వీడు తెలుగువాడే అయ్యి ఉండికూడ, భాషని గురించి ఎంతవరకు తెలుసును. అంటే ఇపుడు చెప్పినంతవరకే తెలుసును. అనగా ఇది కుక్క అని ఎందుకన్నారు? అంటే మొహం 'కు' అల్లే తోక 'క్క' అల్లే ఉంది కనుక అంటాడు. ఒకాయన 'బ' అనేటువంటి దాంట్లోంచి బాతు పుట్టింది అన్నాడు. ఆంజనేయుల వారి బొమ్మవేసి ''శాస్త్రి'' ప్రక్కనవ్రాస్తే ఆంజనేయ శాస్త్రి అని అర్థం. శ్రీరాములవారి బొమ్మవేసి శర్మకు అంటే రామశర్మకు అని అర్థం. దాన్ని భాషా శాస్త్రము అనేవాడు. ఆ స్థితిలో ఉన్నవాడు ఇద్దరికీ ఒకే భాష వచ్చినా, సైకాలజీ చదువుకున్నా, ఫొనెటిక్స్ చదువుకున్నా, ఒకడి భాష ఒకడికి అర్థం కాదు. ప్రతి యిద్దరి మధ్య యిలాంటి విఘాతం ఉంటూనే ఉంటుంది. భాషా విభేదమది. ఒకడు గుమస్తా. ఇంకోడు కోర్టులో అమీను అనుకోండి. ఇంకొకడు డాక్టరు దగ్గర పనిచేస్తున్నటువంటి అటెండెంటు అనుకోండి. ఇంకోడు ప్లీడరు దగ్గర పనిచేస్తున్న గుమస్తా అనుకోండి. వీళ్ళందరూ మాట్లాడితే ఒకే వాక్యానికి ఒకే అర్థం వస్తుందా? రాదు. ఫలానా తారీఖు అనేప్పటికి మీకు, నాకూను శివరాత్రి రుద్రాభిషేకం గురించి చెబుతున్నా డనిపిస్తుంది. ఇంకోడు క్రొత్తగా జ్యోతిషం నేర్చుకుంటున్నవాడు, శని గురించి ఏమన్నా చెబుతున్నాడేమో అని అనుకుంటాడు. ఇంకొకడు 12వ తారీఖు అనేటప్పటికి

గాద్దున్న పదిగంటల వరకే బ్యాంకులు ఉంటాయి, సాయంత్రం ఉండవు అని గాడి ఉద్దేశ్యం కామోసు అని వాడనుకుంటాడు. అంటే ఎవరి అర్థం వాడిదే కదా! అందరికీ ఒకే అర్థం ఉంటుందా? కనుక ఒకే భాష మాట్లాడుకుంటున్న వారికి కూడ శబ్దార్థాలు అర్థమవ్వటం ఎవడికి అర్థమయ్యేది వాడికి అర్థమవ్వటమేగాని, ఒకడు మాట్లాడేది ఒకడికి అర్థం కావటం లేదు. అంగీకరించి తీరాలి. లేకపోతే అభిప్రాయ భేదాలు ఎందుకొస్తాయి? అందుకని ప్రతి ఇద్దరికి మధ్య భాష ఒక్కటే అనుకుంటున్నారు. పొరపాటు. ఇలాగ మధ్యన ''సఙ్కరః'' పాడైపోయింది నాయనా అంటున్నారు. ప్రతివాడికి శబ్దార్థానికిన్నీ, వాడు వాటిల్లో బిగించుకున్న సంబంధానికిన్నీ శబ్దార్థం సరిగా లేదు. అక్కడ బాగుచేసుకోండి ఒక్కమాటు అన్నాడు. అంటే మాట్లాడుతున్న వాడు, ఆ మాట్లాడుతున్న శబ్దాలు, అర్థాలు నిఘంటువులోని అర్థాలు, విశేషార్థాలు కాదు కావలసింది. వసు చరిత్ర చదువుకున్నారనుకోండి. విశేషార్థాలు వేరేగా ఉంటాయి. ఒకటి చెబితే ఇంకో అర్థం వస్తుంది. ''చిగురున్ గైదువు జోదు'' అంటే చిగురుటాకుని, కైదువుగా ఆయుధంగా తీసుకున్నటువంటి యోధుడు, మన్మథుడు. కావ్యం అయితే ఇలా ఒక అర్థం. stand అంటే నిల్చోండి. under stand అంటే క్రింద నిల్చోమనా? అలాగే with stand అంటే నీతో నువ్వు నిల్చోమనా? not with standing అంటే ఇవేవి అర్థంకాదు. మూడో అర్థం వస్తుంది. అందుకని ఇవన్నీ కూడ మన గుడ్డి మాలోకంలో ఉన్నటువంటి అర్థాలు. ప్రతిభాషకిన్నీ, ఆ భాష మాట్లాడు వాడికిన్నీ ఉన్న సంబంధములు మాత్రమే. అందుకని 'సఙ్కరః' అంటే కలుషితం అయిపోయాయి. polluted, confused. ఏమిటి కలుషితం చేసారు, 'యితరేతర ఆధ్యాసాత్' శబ్దార్థములకు మధ్య ఉన్నటువంటి సంబంధం, ఒకదానితో ఒకటి ముడిపెట్టుకుంటం, అలా పెట్టుకున్నారు. గడియారం పెట్టెలో పెట్టి మేకులు కొట్టి దానిని పార్సిల్ చేసే బదులు గడియారం పెట్టెలో పెట్టి గడియారం మీదే మేకులు కొట్టుకుంటున్నారు, అలా ఉన్నాయి ఈ పదాలు, అర్థాలు వాడుకుంటం అన్నాడు. గడియారం మీద మేకులు కొడితే అమ్మకం కాదు. గడియారం పెట్టెలో పెట్టి పైన మేకులు కొట్టాలి. శబ్దానికి అర్థానికీ మనం చెప్పుకునే శబ్దార్థాలు యిలా ఉంటాయన్నాడు.

'యితరేతరాధ్యాసాత్' ఒకదానితో ఒకటి అధ్యాసం చేయుట, అతికించుట, నిలబెట్టుట, పేర్చుట, శబ్దం మీద అర్థం పేర్చటం, అర్థం మీద శబ్దం పేర్చటం, యిది ప్రతి భాషలోను మాట్లాడేవాళ్ళు సరిగ్గా పేర్చుకోలేరు కాస్త మార్చుకోండి అన్నాడు. ఎందుకని? శబ్దార్థముల యొక్క ప్రత్యయము, పరస్పరత్వము అనేదొకటి తెలుసుకోండి. 'సఙ్కరః' సంకరము ఉన్నది. ''తత్ప్ర విభాగ సంయమాత్'' 'తత్' అంటే అది, ''ప్రవిభాగము'' అంటే చక్కగా విభజించుకొనుట, విభాగము చక్కగా ఉండాలి. వేదాలకి అర్థం చెబుతూ మాక్సుముల్లర్ ''ఫైలాలజీ'' ఫొనెటిక్స్ అంటే బ్లావెట్‌స్కీ Secret Doctrineలో అది తప్పని బాహాటంగా చెప్పింది. **"Grimm's law is no philosophy. The old scholar has the corpses of his own linguistics, monuments in his own brain and worked out the superimposition upon the vedic texts"** అని రాసింది. అంటే తాజ్ మహల్‌లాగ గోరీలు కట్టుకునేటువంటి పాండిత్యపు శబ్దార్థాలు బుర్రలో పెట్టుకొని అది వేదమంత్రాల మీదవేసి రుద్దుతున్నాడు (మాక్సుముల్లర్) అన్నది. తట్టుకోలేక పోయినాడు. మాక్సముల్లర్ అంటే ప్రపంచంలో అందరూ బ్రహ్మరథం పట్టేరు. మనవాళ్ళు ఎవరికైనా వేదం చెప్పమంటే చెప్పనివ్వరు. మాక్సుముల్లర్ నేర్చుకున్నాడంటే వారు పరమగురువులు అన్నారు, బ్లావెట్స్కీ దుమ్ము దులిపి అవతల పారేసింది. 'యితరేతరాధ్యాత్ సంఙ్కరస్తత్ప్ర విభాగ సంయమాత్'' వాటిని చక్కగా విభజించుకోమన్నాడు. అప్పుడు భాషల్ని గురించి మనం మాట్లేడే దుర్వాసనా భూయిష్టమైన, నీచమైన, తుచ్ఛమైనటువంటి మాటలన్నీ ఆగిపోతాయి. ఏ భాషని గురించైనా అంతే. ప్రతివాడు వాడి భాషని గురించి అలా మాట్లాడతాడు. యోగాభ్యాసానికి రాదల్చుకున్నవాళ్ళు యిలాంటివన్నీ వదుల్చుకుని మనిషిగా రండిగాని, ఇంగ్లీషు వాడిగానో, సంస్కృతం వాడిగానో, తెలుగు వాడిగానో, క్రైస్తవుడిగానో, మహమ్మదీయుడు గానో, హిందువుడి గానో రాకండి అన్నాడు. భాషకీ, మీకు. ఉన్న సంబంధం ఊరికే సదుపాయం కోసం పెట్టుకున్నది. అంతకంటే సత్యం లేదు. అసత్యం, అబద్ధం అని చెప్పి తెలుసుకోండి. తర్వాత అసలైన సంబంధం వస్తుంది మీకు మాట్లాడుతున్న వాడు, మాట్లాడబడు

తున్నటువంటి శబ్దము, మాట్లాడుట అనేటువంటి ప్రక్రియ అవి మూడు మిగుల్తాయి. ఇంతవరకు పైన చెప్పుకున్న విషయాలన్నీ అక్కరికి వచ్చేవి కావు. అందుకని అసలుది మనకి అందాలంటే సంకరం పోవాలన్నాడు. సంకరం అనే మాటకి చెడ్డ అర్థం ఏంలేదు. ఒకదానికొకటి గజిబిజి చేసుకోవడం అని అర్థం అంతే. కలుషితం చేసుకుంటున్నారు. అదిపోయి ప్రవిభాగము జరిగితే అపుడు సంయమము దీనిమీద అనుసంధానం (apply) చేస్తావు. తెలియకుండా ఎవరన్నా మాట్లాడుతూంటే మనకు తెలియకుండానే ఆ మాట్లాడుతున్న శబ్దానికీ, అర్థానికీ ఆ మనిషికి ఉన్న సంబంధం ఎత్తేసి పోతుంది. ఇంక మాట్లాడుతున్న మనిషి, మాట్లాడటం, మాట్లాడ బడుతున్నటువంటి శబ్దం, కంఠధ్వని ఈ మూడే మిగుల్తాయి. ఈ మూడింటి యందు సంయమము అనేది apply చేస్తే ''సర్వభూతరుత జ్ఞానమ్'' వస్తుంది. ఎవడు ఏది ఏభాషలో మాట్లాడుతున్నా, వాడికి ఆకలేస్తోందో, దప్పిక కలిగి ఉందో ఏదో నువ్వు చెప్పగలుగుతావు ఆ గొంతు వింటే అన్నాడు. గొంతు వింటే చెప్పగలగటం ఇది. భాష వింటే చెప్పగలగటం కాదిది. వాడికి గొంతుకికీ ఉన్నటువంటి vital realtionship నీకర్థమవుతుంది.

Before that you have to remove all the non-sensical scientific trash. చాల జాగ్రత్తగా గమనించుకోవాలి. యిది ఎవడూ చెప్పగలిగింది కాదు, చెప్పింది కాదు. దాదాపు ఇంకొక నాలుగైదు శతాబ్దాల వరకు యూనివర్సిటీస్‌లో ఈ కోర్సులు పెట్టగలగటం కాని, అందులో ఉన్న ప్రొఫెసర్లు వీటిని గురించి మాట్లాడగలగటం కాని, దానికి కావలసినటువంటి పరిణామం ప్రపంచానికి ఇంకా రాలేదు. నాలుగైదు శతాబ్దులు పడుతుంది. మాట్లాడుతున్న వాడున్నూ, మాట్లాడటం అనేటువంటి వాడు చేస్తున్న పనిన్నీ, వాడి కంఠంలోంచి వస్తున్న ధ్వనిన్నీ మూడే మిగుల్తాయి. వాడు మాట్లాడే మాటల అర్థాలు వినే బదులు, మాటలు వినే బదులు వాణ్ణే వినటం అలవాటు చేసుకుంటారు. కేవలం మాట్లాడుతున్నవాడు, వాడి కంఠధ్వని మాట్లాడటం ఈ మూడింటి యందు మీ ప్రజ్ఞ మిగుల్తుంది. అదే వింటారు. తెలుగులో చెప్పాలంటే మాట్లాడుతున్న వాణ్ణే వింటారుగాని, వాడు మాట్లాడుతున్న మాటల్ని వినరు. అప్పుడు వాడికి ఆకలిగా ఉంటే

ఆకలిగా ఉందని, దప్పికగా ఉంటే దప్పికగా ఉందని, శోష వస్తూంటే శోష వస్తోందని, భయమేస్తే భయమేస్తోందని తెలుస్తుంది. ఇంగ్లీషు వాడు 'ఓహో' అని నవ్వాడనుకోండి. మనకర్థం కాదా? ఇంగ్లీషులో నవ్వుతున్నాడా? భార్య, భర్త అరవంలో సంసారం చేస్తున్నారనుకోండి. బోధ పడదా? హిందీవాడు, తెలుగు రాదు బొత్తిగా, ఏడుస్తున్నాడనుకోండి. మనకి తెలీదా? హిందీలో ఏడుస్తున్నాడా వాడు. కనుక రుత జ్ఞానములు భాషలకి అతీతములైన విషయములు. కంఠధ్వనికి, మనిషికి సంబంధం ఉన్న జ్ఞానం. Universal language దగ్గరికి వెళ్ళటం చాతవుతుంది మీకు. అది చాతవ్వాలంటే ఆపైన చెప్పుకున్న scientific trash పోవాలి ముందు. శుభ్రంగా నలుగు పెట్టుకొని తలంటు పోసేసుకోవాలి. ఇవి ఎత్తి అవతల పారేసి దానిని చక్కగా ప్రవిభాగము చేసుకొని శబ్దార్థములను, వాటియొక్క ప్రత్యయములను, వాటి అధ్యాసన సంకరత్వము లేకుండా ప్రవిభాగము చేసుకొని దానియందు సంయమము మీరు apply చేస్తే ''సర్వభూతరుత జ్ఞానమ్'' సర్వ జీవరాసుల కంఠధ్వని యొక్క జ్ఞానము వినిపిస్తుందన్నాడు. జ్వాల్‌కూల్‌గారు అనువాదం ఏమిచ్చారో చూద్దాం ఈ సూత్రానికి. జాగ్రత్తగా రాసుకుంటం చాల అవసరం ఇలాంటి చోట. జ్వాలాకూలుడు యిచ్చింది కాక, యింకెవరిది పరమ ప్రమాణము ఉండదు. వివేకానంద యిచ్చినది ఒకటి ఆయన అంగీకరించారు. జ్వాల్‌కూల్ మహర్షి చెప్పిన దేమిటంటే ఏ శబ్దము ఏ పదార్థాన్ని తెలియజేస్తుందో, ఏ పదార్థము ఏ శబ్దాన్ని తెలియజేస్తుందో, మన భాషలో idea అంటాం. మనం దాన్ని తెలియక, అంటే ఆ శబ్దం ఉచ్చరిస్తున్నపుడు మనసులో ఏముందో అదిన్నీ, శబ్దము దానికి వాడే అర్థమున్నూ, అర్థము దానికి ఉపయోగించే శబ్దమున్నూ అది ఉచ్చరిస్తున్నపుడు మనస్సులో ఉన్నటువంటి సంకల్పమున్నూ, అవ్యవస్థితం అయిపోయాయి.'' అది సంకరం అంటే. "The sound that which it devotes (the object) and the embodied spiritual essence (idea) are usually confused in the mind of the perceiver. By concentrated meditation on these three aspects comes an inclusive comprehension of the sound utterd by all forms of life". జాగ్రత్తగా రోజూ ఒక్కమాటు ఒక నెలరోజులో రెండు

నెలలో చూసుకుంటే ఈ అనువాదం అంటే ఏమిటో, ఈ సూత్రం అంటే ఏమిటో, క్రమంగా మనలోకి germinate అవుతుంది. ఇది జ్వాలాకూలుడు ఈ సూత్రం గురించి యిచ్చినటు వంటిది. ఇక్కడ వ్యాఖ్యానం ఎవరి యిష్టమొచ్చినట్టు వాళ్ళు రాసారు. ఉదాహరణకి ఎరగని భాష ఒక వాక్యం మాట్లాడితే ఆ భాష మొత్తం మిగతాది మాట్లాడేస్తాడు యోగి అన్నారు. అదే తప్పు అన్నారు. అలా అయితే అసలు సూత్రంలో చెప్పిందేముంది. ఒక్కొక్కపుడు, ఒక రకమైనటువంటి తన్మయ స్థితి అంటే పూనకం లాంటి స్థితిలోకి వెళ్ళి వాళ్ళెరగనటువంటి భాషలు డబడబ మాట్లాడేయటం కూడ విన్నాము. ఇంగ్లీషు ఒక అక్షరం రాదండి ఒకావిడకి. టకటక చాల చక్కటి శైలిలో మాట్లాడేస్తుంది ఆకాసేపూ. తరువాత ఒళ్ళు తెలియకుండా పడిపోయి ఉంటుంది. మళ్ళీ తెలివి వచ్చాక ఒక అక్షరం రాదు. ప్రాణాయామం, యమ, నియమాలు మొదలైనటువంటి యోగాభ్యాసాలు ప్రారంభించినప్పటి నుంచి అన్నం తినటం మానేసింది, మంచినీళ్ళు తాగుతోంది కాస్త. అలాగ క్రింద పడుకుంటోంది, ఇలాంటివన్నీ చేసి పైత్యం గింగురెత్తుకు పోయింది. భోజనం గీజనం మానేసారు కదా. భగవద్గీతలో భోజనం మానేయమన్నాడా? పతంజలి మానేయమన్నాడా? ''యుక్తాహార విహారస్య యుక్తచేష్టస్య కర్మసు''. నాయనా ఎంత తినాలో అంత తిను, ఎక్కువ తిన్నవాడికి యోగాభ్యాసం లేదు. తక్కువ తిన్నవాడికీ యోగాభ్యాసం లేదు అన్నాడు. ''న చాతి స్వప్నశీలస్య'' ఎక్కువ నిద్రపోయే వాడికి, నిద్రపోకుండా చీట్లపేక ఆడుకునే వాడికి కూడ యోగాభ్యాసం లేదు అన్నాడు. అంటే సమపాళంగా జీవించడం చాతనైన తర్వాత యోగాభ్యాసం వస్తుంది. ఈ సాధన చేసేటపుడు ఏమీ తినకుండా ఉపవాసాలు చేస్తూ, కాసిని పాలు త్రాగి, కాసిని మంచినీళ్ళు త్రాగి, ఒకవారం రోజులుండి, ప్రాణాయామం చేసి, యమ, నియమాదులు స్థండిల శయనం మొదలైనటువంటివన్నీ చేసి, యింట్లో చాకిరీ మొదలైనవి అందరికీ చేస్తూంటే (అవన్నీ మళ్ళీ మానకూడదని ఒక ఉద్దేశ్యం). నాదాలు వినిపిస్తాయి. ఆహారం అదీ లేదుగా, చెవులు గింగురు లెత్తితే అది ఓంకారం వినిపిస్తోందని అనుకుంటారు. ఇంకొన్నాళ్ళయ్యేటప్పటికి ఏమవుతుంది? పడిపోయి టకటక ఇంగ్లీషులో మాట్లాడేసింది ఐదు నిమిషాలు. లేచాక ఇంగ్లీషు లేదు, ఏమీలేదు.

యోగాభ్యాసంలో మహిమ లొచ్చినాయి. తెలియని భాష మాట్లాడుతోంది ఈవిడ అన్నాడు ఒకాయన. ఇంకొకాయన దెయ్యం పట్టిందన్నాడు. ఇంగ్లీషు వచ్చినవాడు ఈవిడని పట్టాడన్నారు. ఇంగ్లీషులో పట్టాడు. అంచేత వాడు ఈవిడ వంటిమీద ఉన్నంతసేపూ, ఇంగ్లీషులో దంచేస్తోంది. ఆపైన మళ్ళీ మామూలే ఏముందండి అన్నాడు. అదేంకాదు. చిన్నతనంలోనే వాళ్ళ నాన్నగారు బాయరుగారు. ఆయన మాట్లాడిన ఇంగ్లీషు అంతా కూడ ఈవిడకు వచ్చేసిందన్నాడు ఇంకొకాయన. ఎవరైనాసరే చిన్నతనంలో విన్నవన్నీ ముద్రలు పడి లోపల ఉంటాయి, ఒకానొక పరిస్థితుల్లో అవి బయటికి వస్తాయి. అందరికీ ఉంటాయి. మనం ఎరగని భాషల్లో ఎక్కడైనా విన్నటువంటివీ, రైల్లో కూర్చుంటే మనం ఎరగని భాషల్లో అన్నీకూడ కాసెట్లు బుర్రలో తిరుగుతూ ఉంటాయి. పెద్ద లైబ్రరీ ఉంటుంది. అవి ఎలా మనం బయటికి తీసుకోవాలో తెలియక తర్వాత తగలబెట్టి అవతల పారేస్తూ ఉంటాము. ఆవిడకి ఏమైంది? కూడని విధంగానే రేకెత్తించబడింది wrong stimulation జరిగింది. ఈ తెలివిలోంచి ఆ తెలివిలోకి వెళ్ళిపోయి వాళ్ళ నాన్నగారు ఆ యింగ్లీషు మాట్లాడుతున్నటు వంటివి వాకిట్లో విన్నవి టకటక మాట్లాడేసింది. మళ్ళీ ఈ తెలివిలోకి వచ్చేటప్పటికి అదిలేదు. దానికి దీనికి మధ్యన వేల మైళ్ళ దూరం ఉంది. ఇలాంటి అర్థాలు చెప్పుకోకూడదు అన్నాడు. ఏ భాషైనాసరే అర్థమవుతుందా అంటే 'సర్వభూతరుత జ్ఞానం' అన్నాడు. జాగ్రత్తగా చూడాలి. రుతం అంటే శబ్దం, కంఠధ్వని. సర్వ జీవరాసులయొక్క కంఠధ్వని తెలుస్తుంది. అది ఆయన చెప్పినది. అంటే చెవికి కంఠధ్వని వినిపించని జీవరాసులను కూడ వినేవాళ్ళున్నారు. ''చలి చీమనేనియు చాద్రొక్క శంకించు పలుక డెన్నడు మృషాభాషణముల'' తెనాలి రామకృష్ణుడు పుండరీక మహర్షి తపస్సు చేస్తూంటే చెప్పాడు. స్నానం చేయటానికి నది దగ్గరికి వెడుతూంటే చీమ ఆయనకి అడ్డంగా వెడుతోంది. కాలు దానిమీద పెట్టబోతే 'ఆ' అని చీమ మనస్సులో అనుకుంటుంది ఏదో కాలు మీద పడబోతోందని. అది ఆయనకు వినబడుతుంది. కాలు పెట్టడు దానిమీద అన్నాడు. ఆ చీమ కంఠం కూడ వినిపించేదిట. కంఠం అంటే వినబడే (audiable) కంఠమే కాదు. మానసిక (mental) కంఠం కూడ వినగలడు. అదివాడు చెప్పింది. అందుకనే బుద్ధుడు

చెప్పాడు. నువ్వు తథాగతుడవై మార్గాన పడేముందు ఈ భూగోళం మీద ఉన్నటువంటి ఏ జీవరాసి కన్నీళ్లైనా సరే నేలమీద పడే లోపల, నీ గుండెల మీద పడాలి. ఆ దీక్ష నీవు తీసుకొని నెగ్గినట్లైతే నువ్వు తథాగతుడవి అవుతావు. లేకపోతే అధోగతే. నెత్తిన చెంగు వేసుకొని వెళ్ళిపోవటమే అన్నాడు. అలాగే రామకృష్ణుడు, రమణ మహర్షి లాంటి వారు వినేది భాషకాదు. అవతల మనిషిని వింటారు. అది చెబుతున్నది. భాష వింటే అర్థమవ్వటం పెద్ద ప్రశ్న కాదు. మనిషిని వినగలగటం 'సర్వభూతరుత జ్ఞానమ్.' రమణ మహర్షి ఎన్నోమాట్లు చూపించారు అలాంటివి. ఒకడు కాగితం మీద లిస్టు రాసుకొచ్చాడు. వేదాంతపు సందేహాలు. ఒక్కొక్కటే వాడు చదువుకుంటున్నాడు. అన్నీ అయిన తర్వాత మళ్ళీ బొడ్లో పెట్టేసుకున్నాడు. ఏం? అవి అడగవేమిరా అప్పా అన్నాడు. అవి సందేహాలు ఏమిటండి? తీరిపోయినాయి అన్నాడు. ఏమైంది? వాడు మనస్సులో చదువుకుంటూ ఉండంగానే ఈయన వాణ్ణి విన్నాడు. వాడికి చెప్పాడు. ''గురోస్తు మౌనం వ్యాఖ్యానం శిష్యాస్తు ఛిన్న సంశయాః'' ఒకమాటు దక్షిణామూర్తి జయంతి ఉత్సవాలు చేసుకుంటూ ఆ ప్రక్క గ్రామంలో ఉన్నటువంటి వాళ్ళు రమణ మహర్షిని పిలిచారు. దక్షిణామూర్తి తత్వాన్ని చెప్పమన్నారు. రాత్రి 8 గంటలకి అందర్నీ అక్కడ కూర్చోబెట్టి అభయముద్రగా చెయ్యిపెట్టారు. ఏమీ చెప్పలేదు. వాళ్ళెక్కడున్నారో వాళ్ళకి తెలీదు. ఈయనెక్కడున్నారో ఈయనకి తెలీదు. రాత్రంతా గడిచిపోయింది. తెల్లవారుజాము అవుతుండగ లేచి నవ్వి ఇది దక్షిణామూర్తి అంటే అని, వెళ్ళిరండి అన్నాడు. ఆయన జీవితం చదవండి. అందులో ఉన్నది. అంటే తెల్లవారే దాకా అలాగే చిరునవ్వుతో నిల్చొని ఉన్నాడు. వారే ''మౌనవ్యాఖ్యా ప్రకటిత'' అంటే భాష అనే శబ్దార్థాల ద్వారానే కాదు మనిషినించి మనిషికి వస్తూంటుంది. అలవాటు చొప్పున మనం గతిలేక శబ్దార్థాలతో మాట్లాడుకుంటున్నాం. చిన్నప్పటినించి మన కాళ్ళకి ఒక్కొక్క గజం కర్రలు కట్టి నడవటం నేర్పారు అనుకోండి, మామూలుగా నడవనీయకుండా మనం పెద్దవాళ్ళం అయ్యేటప్పటికి ఎలా నడవటం అలవాటవుతుంది. కర్రలు లేనిదే నడవలేము. అలాగ మనం భాషలేనిదే మాట్లాడుకోలేము.

## 18. సంస్కార సాక్షాత్కరణా త్పూర్వజాతిజ్ఞానమ్।

సంస్కార = సంస్కారములు, సాక్షాత్కరణాత్ = సాక్షాత్కారము వలన, పూర్వజాతి జ్ఞానమ్ = పూర్వజన్మ జ్ఞానములు కలుగును.

**తనకున్న పూర్వ వాసనలను సంయమముతో విడమరచి చూచుకున్నచో తన పూర్వజన్మల జ్ఞానము, జీవుల జన్మలు ఎట్లు కలుగుచున్నవో అట్టి సృష్టి జ్ఞానము కలుగును.**

**వివరణ :** 'సంస్కారములు' అనే మాటకి అర్థము ఉపనయన సంస్కారము, జాతకర్మ సంస్కారము లాంటివి గాక అసలు సహజంగా సంస్కారం అంటే ఏమిటో తెలుసుకోవాలి. మనం ముగ్గురో నల్గురో ఉన్నాం అనుకోండి. జీతం సమానంగా పంచండి అన్నారు అనుకోండి. అపుడు మీ మనస్సులోను, నా మనస్సులోను ఒక అభిప్రాయం వస్తుంది. అభిప్రాయంతో పాటు ముగ్గురూ వస్తారు. తర్వాత సమంగా పంచండి అన్నారు కదా. ఈ మూడింటి మధ్య సమానంగా దూరం ఉండి, equilateral triangle △ లాంటి ఒక భావము వస్తుంది. చిన్న పిల్లాడికి అసలు మూడు అనే పేరు రాదు. వాడి చేతికి మూడు చాక్లెట్లు యిచ్చి, వారికి యివ్వండి అంటే ఇచ్చి వస్తాడు. ఇంకోమూడు యిచ్చి వారికివ్వండి అంటే యిచ్చి వస్తాడు. ఇంకో మూడు యిచ్చి ఇంకొకళ్లకి యివ్వండి అంటే యిచ్చి వస్తాడు.

భాష ఏదైనా క్రొత్తది మొదటిరోజు యిలాగే నేర్చుకుంటున్నాం. ఇంతకంటే వేరేగా ఏమీ నేర్చుకుంటం లేదు. కనుక ముందర భావము ఉంటుంది. దీనిపేరు భావరేఖ లేక భావ చిత్రము thought, thought form అంటారు. ప్రతి భావానికీ దాని రూపం మన మనస్సులో ఉంటుంది. మనకి తెలీదు. కనుక భావము, భావము యొక్క రేఖా స్వరూపము, ఈ రెండు తప్పనిసరిగా ఉంటాయి. అనిబిసెంటు, లెడ్ బీటరు ఇద్దరూ కలిసి ఇప్పటికి 125 సంవత్సరముల క్రిందటి thought forms అని ఒక సశాస్త్రీయమైన గ్రంథం రాసారు. 20వ శతాబ్దిలో ఇంకా చదువుకునేందుకు అర్హత వచ్చినటువంటి వాళ్ళం తక్కువమంది ఉన్నాం కనుక, ఆ పుస్తకాలు వేచి వున్నాయి. 21వ శతాబ్దం మధ్యలోకి వచ్చేప్పటికి విశ్వవిద్యాలయాల్లో అవి పాఠ్యాంశములుగా పెట్టుకుంటారు. ఆ వికాసం (evolution) ఇపుడు లేదు గనుక పుస్తకాలు ఆగి ఉన్నాయి. కనుక ఆ పుస్తకం మీరెప్పుడన్నా చదివితే ఇపుడు చెప్పింది

తెలుస్తుంది. ధ్యానం చేస్తున్నారనుకోండి. మనస్సులో పరమ ప్రశాంతి మీకు కలిగిందనుకోండి. అపుడు మీ వంక, యివి రెండు తెలిసి అభ్యాసంచేసి, వాటియందు సంయమము నేర్చినవాడు గనుక చూస్తే, మీరు కూర్చుని ఉండగ మీ చుట్టూ ఒక అద్భుతమైన, తేజోమయమైన గోపురము కన్పిస్తుంది వాడికి. కంటికి కాదు, మనస్సుకి. మనకి కనిపించటం అంటే కంటికే. వినిపించటం అంటే చెవికే. వినిపించటం కనిపించటం కూడను మనస్సుకి అనే స్థితికి మనం ఇంకా రాలేదు పరిణామ క్రమంలో. కంటిద్వారా మనస్సు చూస్తోంది. చెవిద్వారా మనస్సు వింటోంది. కన్ను చూడటం, మనస్సు వినడం అనే ప్రాథమిక స్థితి (primitive state) లో మనం ఉన్నాం. పంచేంద్రియాల యొక్క ప్రవృత్తులన్నీ కూడ అంతే. కనుక వాడి మనస్సుకి నీ చుట్టూ ఉన్నటువంటి ఈ thought form ఈ భావమయ రేఖ కనిపిస్తుంది. ఇంకొకడు మీ పక్కని కూర్చొని ధ్యానం చేస్తున్నాడనుకోండి. వాడు మీకన్నా చాలా బాగా ధ్యానం చేయాలి. మిమ్మల్ని మించిపోవాలి అని అనుకున్నాడనుకోండి. అపుడు వాడి ధ్యానంలో ఆ భావరేఖ యొక్క రూపం వంకర తిరుగుతుంది. నీలో అసూయ ఉన్నది. ధ్యానం చేస్తూంటే సర్దుకో అని చెప్పేస్తాడు లేవంగానే. వాడికంటే బాగా ధ్యానం చేద్దాం అని కూర్చున్నావు కనుక వాడికంటే అనే అభిప్రాయం పోనిదే నీకు ధ్యానం రాదు అని చెప్పేస్తాడు. వాడి భావమయ రేఖలన్నీ చెల్లాచెదరై కన్పిస్తాయి. చాల బాధపడుతున్నాడు. మనస్సు నిలబడలేదని పాపం. ఒరేయ్ అలా బాధపడి లాభంలేదు. కొన్నాళ్ళు వదిలేసేయ్, ప్రశాంతంగా తిరిగిరా. మళ్ళీ చెయ్యి అని చెబుతాడు వాడికి సలహా. ఎందుకంటే he made a wrong approach. ఆ wrong approach తో పెట్టి నొక్కినా రుద్దినా ఏం లాభంలేదు. వదిలేయాలి. ఇలాంటి వన్నింటినీ అనిబిసెంటు, లెడ్‌బీటరు రేఖా చిత్రాలద్వారా (diagramatic) బోధపరుస్తూ యిచ్చారు. వీట్లని thought forms అంటారు. ఇక్కడ 'సంస్కారం' అనే మాటకి అర్థం thought form. సంకల్పం అనేది మనకి ఎలా పుడుతుందో మనం గమనించగలగటం చాతనవ్వాలి. Thought మొట్టమొదట కదలికగా వస్తుంది. కదలికగా అంటే చోటుకాదు. చోటులో భౌతికమైన కదలిక కాకుండా మానసికమైన కదలిక వేరే ఉందని తెలియాలి. Mental dynamics అని ఒక సబ్జక్టు ఉందని తెలియాలి. ఫిజిక్స్ వాడికోసం నిరీక్షిస్తూ ఉండకూడదు. వాడు అంగీకరించేటప్పటికి ఇంకో రెండు,

మూాడు శతాబ్దాలు పడుతుంది. కనుక movement on the mental plane. జ్వాలాకూలుడు A.A. Baily గ్రంథాలలో యిచ్చారు. మానసిక కక్ష్యలో కదలిక, దాని ప్రతిబింబమైనటువంటి భౌతిక కక్ష్యలో కదలిక లేక Loco-motion or displacement యివి తెలియాలి. మానసిక కక్ష్యలో కదలికనే thought అంటాము. బోధపడినంత వరకు బోధపడుతుంది. మెల్లిగా బోధపర్చుకోవాలి. ఆయన చెప్పాడు. ఇవి 21వ శతాబ్దము నాల్గవ పాదంలో ఉన్నటువంటి విద్యార్థుల కోసం రాస్తున్నాను. మిగతావాళ్ళు చాతనయినంత వరకు చదువుకోండి అన్నాడు. కనుక ముందు మానసికమైన కదలిక వస్తుంది. అపుడు మనలో 'శక్తి చాలనము' జరుగుతుంది. అంటే the flow of energy. ఎపుడైతే అభిప్రాయమన్నది మనస్సులో మెదిలిందో, అపుడు సముద్రంలో అలలు ఎలా అయితే కదుల్తున్నాయో అలా మనలో ఉన్న శక్తిమయ తరంగములు కదుల్తాయి. శక్తియొక్క చాలనము కదుల్తుంది. శక్తి మనలోకి ఎక్కడనించి వస్తున్నది. మన చుట్టూ ఉన్న ఆకాశంలోంచి వస్తూన్నది. ఎందుకంటే akasam (ఆకాశం) is nuetral of energy. ఇది కూడ 21వ శతాబ్దానికి వెడితేగాని ఫిజిక్స్‌కి అర్థమయ్యేవి కావు. చోటులోంచి electro magnetic fields దాకా వెళ్ళామనుకోండి. అది దాటి శక్తి చోటులోంచి వస్తున్నదని, మనకి వినియోగపడి మళ్ళీ చోటులోకి వెళ్ళిపోతున్నదని, చోటు అనేది శక్తియొక్క ఒకానొక తటాకమని మనకి తెలియటానికి ఇంకొక 50 సంవత్సరాలలో ఎవడికి వాడికి తెలిస్తే తెలియవచ్చుగాని, సైన్సు అంగీకరించాటానికి చాల టైము పడ్తుంది. దానికోసం కాసుకొని కూర్చోవద్దు. ఇవి బాగా far too advanced concepts. అందుచేత భావం కదిలేటప్పటికి శక్తి చాలనమవుతుంది. అందుకనే energy follows thought అన్నారు. అనగా నీ కభిప్రాయము మనస్సులో ఎపుడు కదులునో, అపుడు నీలో ఉన్నటువంటి శక్తి కదులుచున్నది. నీ మనస్సులో ఎపుడు ఏ అభిప్రాయము మెదలునో, నీలో ఉన్నటువంటి శక్తి మెదలుచున్నది, కదలుచున్నది. ఈ కదలటం పనికొచ్చేటట్లా లేక ఏదన్నా దెబ్బ తగిలేటట్లా? రెండు రకాలుగా కదలచ్చు. ఒక నది ప్రవహించుచున్నది అంటే కట్టల మధ్యన లాకుల్లోంచి ప్రవహిస్తే, పదిమందికి నీళ్ళకి, పంటకి, వ్యవసాయానికి పనికొస్తుంది. కట్టతెగి ప్రవహిస్తే వినాశానికి పనికొస్తుంది అదే శక్తి. కనుక మనస్సులో అభిప్రాయములు అనేటువంటివి మెదులుతూ ఉంటే వాటివల్ల

కదుల్తూన్నటువంటి శక్తియొక్క కదలిక నీ అభివృద్ధికి పనికొస్తోందా? నీ వినాశానికి పనికొస్తోందా? దానిమీద ఆధిపత్యం పొందాలి. దానికి thought forms తయారు చెయ్యటం నేర్చుకోవాలి. రెండు బొమ్మలు తీసుకొచ్చి, చదువు రానటువంటి మొద్దుని కూడ ఈ బొమ్మ బాగుందా? ఈ బొమ్మ బాగుందా అంటే ఈ బొమ్మ చక్కగా ఉందంటాడు. అంటే మనస్సుకి regularity, irregularity అనేది మనం అనుకున్న చదువుకి సంబంధించినది కాదు. వాతావరణం చల్లగా ఉందని, వేడిగా ఉందని చెప్పడానికి ఇంగ్లీషు రావాలా? ఆక్సిజన్ పీల్చటానికి కెమిస్ట్రీ రావాలా? కెమిస్ట్రీ వస్తేగాని ఆక్సిజను పీల్చకూడదంటే చచ్చిపోతాడు. తర్వాత యింక పీల్చక్కర్లేదు. అది తెలుసుకోవాలి. అందుకని పనికొచ్చే భావరేఖలు పుట్టించటం నేర్చుకోవాలి యోగాభ్యాసంలో. అంటే ఫలానా వారిని చూసి వద్దామా వెళ్ళి అని మీరన్నారనుకోండి. యోగాభ్యాసం చేయని క్రితం ''వాడి మొహం, వద్దండి'' అని సమాధానం వచ్చేది, యోగాభ్యాసం చేసాక ఫర్వాలేదు చూసి వద్దాంలెండి అంటాడు. వాడు మంచివాడు కాదన్నారు కదా యిదివరకు, అంటే ఏమిటో అపుడు అలా అనుకున్నాను. పొరపాటు యిపుడు వెడదాం రండి అంటాడు అంతే. అంటే వీడిలో పూర్వం వచ్చిన negative thoughts పుట్టించటం మానేసాడు, positive thoughts పుట్టించటం మొదలు పెట్టాడు. మార్పు మాట్లాడేటువంటి సంభాషణలలో కూడ 'ఆ' నేను వెడుతున్నాను బజారుకి అనే వాళ్ళం యిదివరకు. యోగాభ్యాసం మొదలు పెట్టాక నిజమైన పద్ధతిలో నేను ఇన్ని గంటలకి బజారుకి వెళ్ళవలసింది. నీకేమన్నా ప్రోగ్రాం ఉందా? మనం ఇద్దరం కలిసి వెడదామా? అంటాడు. ఇదీ పద్ధతి. సాయింత్రం 6 గంటలకి ప్రేయరు ఉన్నది. క్రొత్తవారెవరో వచ్చారు. మీ కభ్యంతరం లేకపోతే ప్రేయరుకి కూర్చుందామా అంటాడు. లేదా ప్రేయరు చేసి వచ్చేదాక మీరు వేచియుండండి అని చెబుతాడు. యోగాభ్యాసం లేనివాడు ఏం చేస్తాడు? ప్రేయరు ముందువస్తే కూర్చోమను అంటాడు. అయ్యేవరకు మాట్లాడడు. వీడు కూర్చొని ప్రేయరు చేసేస్తాడు. Pious Aristrocracy అనే ఒక పశు ప్రవృత్తి ఉంటుంది. అంటే అభ్యాసం చేయనివాడు వాడున్నూ, చేసినవాళ్లం మనమే అనేటువంటి పశుప్రవృత్తి మనలో ఉంటుంది. ఇలాంటివాడు క్రొత్త చోటుకి వెడితే తెల్లవారుజామున లేచి, గాయత్రి మొదలు పెడతాడు యింట్లో పిల్లలందరూ లేచేట్లు. యోగాభ్యాసం చేసిన తర్వాత తాను గాయత్రి

చేయదల్చుకుంటే ఊరిబయటికో, చెట్టు కిందికో, నది ఒడ్డుకో పోయి చేసుకొంటాడు. వాళ్ళ పిల్లల్ని గాబరా చేయడు గాయత్రికోసం. మనం చేయకపోతే లోకానికి ఏమి నష్టమని తెలుస్తుంది. అంటే తరహా మారిపోతుంది. అటువంటి భావరేఖలు తయారు చేసుకుంటాడు. జపం చేయాలంటే జింక చర్మం ఉండాలి అంటాడు. జపం చేయాలంటే జింక చర్మం ఎందుకు? జింకని చంపాలా? కింద కూర్చోవటమే? ఒకాయన తపశ్శక్తి కిందకెళుతుంది అన్నాడు. ఒకవేళ వెళ్ళటం అంతగా నిజమైతే ఏమిటి? యిలాంటి అర్థరహితములైన భావనలు పోతాయి. ''సంస్కార సాక్షాత్కరణాత్'' సంస్కారములంటే యివి. సంస్కరింపబడిన, పవిత్రమైన, శుభమైనటువంటి భావరేఖలు positive thoughts వస్తాయి. ఫలానా వారికెట్లా ఉందండి. వారు ఏం చేస్తున్నారు? వాడా? వాడికి రోగం వచ్చింది, అనే బదులు యోగాభ్యాసం చేసాక, ఫలానావాడు ఏం చేస్తున్నాడు? ఈమధ్య కొంచెం అనారోగ్యంగా ఉన్నారని విన్నాను అంటాడు. తేడా ఉంటుంది ఆ చెప్పే విధానంలో. అలాంటివాళ్ళు మాట్లాడుతూ ఉన్నా, ఊహిస్తున్నా, మనస్సులోంచి వచ్చే diagramatic గా ఉండేటువంటి pictures ఎలా ఉంటాయో, అవి చూపించటానికి వచ్చినవే మనకి దేవాలయాల్లో పైన వేసేటువంటి పద్మాలు, అష్టదళాలు, షట్ దళాలు, పంచముఖాలు మొదలైనటువంటి regular forms and designs, చర్చియొక్క నిర్మాణానికి గోపురములు, సిమెట్రీ మొదలైనవన్నీ కూడ. మానవుడు ఒక్కొక్క జాతినుండి ఒక్కొక్కరకంగా దృశ్య ప్రపంచం నుండి అదృశ్యమైనటువంటి పరబ్రహ్మం దగ్గరికి తాను నిర్మాణం చేసుకురావటానికి చేసిన ప్రయత్నాలు. వాటికి diagramatic representations ఉండబట్టే వాట్లని నిర్మాణాలుగా దేవాలయాలుగా మానవుడు కట్టాడుగాని, మనస్సులో అవిలేకుండా బయట దేవాలయం కట్టకలడా ఎవడైనా? అలా కడుతూంటే యిల్లు వస్తుందా? ఎన్నడూ రాదు. యిల్లు మొత్తం ప్లాను వేసుకొని ఆ ఖాళీ స్థలంలో యిల్లు కట్టాక ఎలా ఉంటుందో చిన్న కిటికీ చువ్వల దగ్గరనుంచి చూడగలిగిన వాడికే యిల్లు వస్తుంది. లేకపోతే అయోమయంగా ఉంటుంది. అందుచేత అభ్యాసం చేయటంలో ఈ రకమైనటువంటి మానసికమైన ఒక స్థితిలోకి వస్తాడు. లేకపోతే మొట్టమొదట దేవాలయం కట్టేటువంటి వాడికి యిలాగ కట్టు, గోపురం కట్టు, చర్చి టవర్ కట్టు అని ఎవరు చెప్పారు? ఒక్కొక్క

జాతియొక్క దేవాలయం నిర్మాణం పద్ధతి, గర్భాలయం కట్టు, ప్రదక్షిణం చేయటానికి అని ఎవరు చెప్పారు? ఇవన్నీ కూడ మనిషికి positive thought develop అవుతూంటే, ఇవతలికి దాని diagramatic representation వస్తుంది. అంటే సంస్కారము లనేటువంటివి వస్తాయి. కనుక ''సంస్కార సాక్షాత్కరణాత్'' సంస్కారములు చక్కగా సాక్షాత్కరిస్తాయి. రూపకల్పనతో సాక్షాత్కరిస్తాయి. అంటే మనుషులు వస్తూ ఉంటే వాడు ఏ సంస్కారం కలవాడు, ఎంత సంస్కారం కలవాడు అనేటువంటిది తెలుస్తాయి. మహానుభావుడు వస్తూంటే పద్మములు, మొగ్గలు విచ్చుకున్నటువంటి పద్మములు, అష్టదళములు, షట్దళములు, త్రికోణములు మొదలైనవన్నీ కనిపిస్తాయి వాడిచుట్టూ, లేదా అయోమయం. అవతలి వాడిని ఏడిపించి వీడు ఏడ్చేటువంటి వాడైతే చిక్కిరి చిక్కిరి గీతలన్నీ కనిపించి దాంట్లో వీడు నడుస్తూ ఉంటాడు. Thought forms అనే గ్రంథంలో యివన్నీ రేఖా చిత్రాలుగా యిచ్చారు. కనుక యివి సంస్కారమన్నా సాక్షాత్కారమన్నా. ఆ సాక్షాత్కార మయ్యేప్పటికి ''పూర్వ జాతి జ్ఞానమ్'' వీడు పూర్వం ఏ జాతివాడో తెలుస్తుంది. అంటే బ్రాహ్మడో, హరిజనుడో, కమ్మవాడో, అట్లాకాదు జాతి అంటే. పూర్వ జన్మలో వీడు ఏ రకమైనటువంటి జీవితం జీవించాడో తెలుస్తుంది. వాడి ప్రవర్తననిబట్టి వాడు పూర్వజన్మలో ఎలా బ్రతికాడో, ఏం చేసాడో స్పష్టంగా తెలుస్తుంది. ఒక్కొక్కడు భోంచేసి వెళ్ళాక పొరపాటున ఆ విస్తట్లో యింకొకడు కూచుంటాడు. అంత శుభ్రంగా ఉంటుంది. వీడెవడో తత్వ సంబంధమైన జీవితం (mystic life) నించి వచ్చాడని తెలుస్తుంది. 'పూర్వ జాతి జ్ఞానమ్' అంటే పూర్వజన్మ జ్ఞానము అంటే వంశ వృత్తాంతం కాదు. వాడి జాతియొక్క జ్ఞానాన్ని తెలియజేస్తుంది. ఏరకంగా జీవించాడో తెలుస్తుంది.

కనుక సంస్కార సాక్షాత్కారము వలన పూర్వజాతి జ్ఞానము కలుగుతుంది. పూర్వజన్మ సంస్కారములు అందరియందు ఉంటాయి. వాటిని సాక్షాత్కారము చేసుకోవాలి. మనం సాక్షాత్కారము అనే పదం సామాన్యంగా వాడుతూ ఉంటాము. 'పతంజలి' వరసన ఒక్కొక్క సూత్రంలోనే వాడుతున్నాడు. కనుక దాని అర్థం కూడ మనం చూసుకుందాం. సాక్షాత్కారం అంటే 'స' అక్షాత్కారము 'స అక్షాత్' అంటే కంటితో, కంటి వలన కలిగేటువంటి దర్శనముతో కూడినది. అంటే అర్థం మనం సామాన్యంగా

చెప్పుకోవలసినది ప్రత్యక్ష జ్ఞానము. అది సాక్షాత్కారమంటే. లోకంలో మనం విషయాన్ని తెలుసుకోవడం రెండు రకాలుగా ఉంటుంది. ఒకరకం పరోక్షజ్ఞానం, ఇంకో రకం ప్రత్యక్షజ్ఞానం. ప్రత్యక్ష జ్ఞానం తెలుసుకుంటేనే సాక్షాత్కారము వస్తుంది. ఒకవ్యక్తి ఇంకొక వ్యక్తికి కూడ సాక్షాత్కరించవచ్చు. పది సంవత్సరాలో, ఇరవై సంవత్సరాలో భార్యా భర్తలుగా ఉంటూ ఉండికూడ, లేదా ప్రక్క ప్రక్క యింట్లో ఉండి, అన్నదమ్ములుగా ఉంటూ ఉండికూడ కంటి చేతనే పట్టుకొనబడుదురు. ఉదాహరణకు కొంతమందిని వాళ్ళు లేనపుడు మీరు తల్చుకుంటే వాళ్ళరూపం తొందరగా గుర్తు వస్తుంది. కొంతమంది రూపం తొందరగా గుర్తురాదు. కొంతమంది రూపం గుర్తేరాదు. దేనిమీద ఆధారపడి ఉంటుంది. వాళ్ళతో మీరు ఎన్ని ఎక్కువ సంవత్సరాలు కలిసి ఉన్నారో దానిమీద ఎన్నడూ ఆధారపడి ఉండదు. లేదా వాళ్ళతో మీరు ఎంత దగ్గరగా కలిసి ఉన్నారో అనే దాంతో ఏనాడు ఆధారపడి ఉండదు. ఒకే ఆఫీసులో ఇద్దరు కలిసి పనిచేస్తున్నా సరే, పది సంవత్సరాల తర్వాత కూడ వాడికి వీడికి సాక్షాత్కారము ఉండదు. వాణ్ణి చూస్తున్నంతసేపు వాడి ముఖ కవళికలు మొదలైనవి వీడికి కనిపించవు. కాని వాడితో మాట్లాడుతూ ఉంటాడు. వాడు వీడితో మాట్లాడుతూ ఉంటాడు. వాడి ముఖ కవళికలు వీడు వీడి ముఖ కవళికలు వాడు పట్టించుకోరు. వీడి కంఠధ్వని వాడు, వాడి కంఠధ్వని వీడు పట్టించుకోడు. వీడు మాట్లాడుతున్న తరహా వాడు, వాడు మాట్లాడుతున్న తరహా వీడు పట్టించుకోరు. ఎంచేత ఆసక్తి లేదు. ఇంతకీ మన ప్రక్కవాడే కదా అని. ఒక్కొక్కపుడు ఏదన్నా క్రైమ్ నవల చదివినపుడు అది జరగనటువంటి దృశ్యం ఆ క్రైమ్ చేసినవాడు, చేయబడినవాడు ఎక్కడ జరిగిందో ఆ ప్రదేశం మొదలైనవన్నీ కూడ అన్ని వివరాలతో లోపల ముద్ర పడతాయి. సాక్షాత్కార పడతాయి. అంటే అర్థం ఏమిటి? వాడికున్న అభిరుచి తెలుస్తుంది. దానినిబట్టి వాడికున్న సంస్కారం ఎలాంటిదో తెలుస్తుంది. వాడికి అన్నమీదగాని, తమ్ముడిమీదగాని, తండ్రిమీదగాని, మిత్రులమీదగాని, భార్యమీదగాని, పుత్రులమీదగాని, సాక్షాత్కారం కలగలేదు. ఏదో ఒక క్రైమ్ నవల చదివితే నిద్దట్లో కూడ గుర్తు వచ్చేటట్లుగా, కలవరించినా అదే కలవరించేటట్లుగా ఎందుకు తొల్చుకొని పడ్డది. వాడి మనస్సులో, వాడి హృదయంలో రూపొందించుకొన్న శక్తిని ఒక బంకమట్టిగా, ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌గా మనం భావించినట్లైతే అది దేనిని స్వీకరించుటకు సిద్ధముగా

ఉన్నదో, ఆ బొమ్మలనే అంటుకోనిస్తుంది. మిగిలిన వాటిని అంటుకోనివ్వదు. దూరంగా ఉంచుతుంది. ఇది దేనిని అంటుకోనిస్తుంది, దేనిని అంటుకోనివ్వదు అనేది క్రిందటి జన్మలో వీడు దేనిని అంటుకున్నాడు, దేనిని అంటుకోలేదు, దేనితో తిరిగాడు, దేని దేనితో తిరగలేదు, ఎలాంటి వాళ్ళతో స్నేహం చేసాడు, ఎలాంటి వాళ్ళతో స్నేహం చేయలేదు, ఏవేం పనులు చేసాడు, ఏవేం పనులు చేయలేదు అన్న దానిమీద ఆధారపడి ఉంటుంది. దాన్నిబట్టి ఈ జన్మలో వాడికి దేనిమీదైనా కుతూహలం ఉండడం, ఉండకపోవడం ఉంటుంది. ఏరా నువ్వు నవల్స్ చదువుతావా? అనడిగితే నాకు ఆ అభిలాష లేదు అంటాడొకడు, కాని ఒక్కొక్కడు ఎవడూ అడగక్కర లేకుండా వాడంతట వాడే ఊళ్ళో ఎక్కడ నవలలు ఉన్నాసరే, ఊదేసేస్తాడు. నవలన్నా, నవల చదవటం రెండూ కనుక స్టాండర్డు అయినట్లైతే అందరూ ఒకేలా చదవటం అన్నా చదవాలి. అందరూ ఒకేలా మానేయటమన్నా మానేయాలి. అందరూ ఆసక్తి లేకుండా అయినా చదవాలి. అంటే వీళ్ళ పూర్వజన్మలో చేసినటువంటి సంస్కారముల చేత, మిత్రత్వము చేత, వాళ్ళు చేసిన పనులచేత, యింకొకడితో కలిసి చేసిన కృషి మొదలైన వాటిమీద ఆధారపడి ఈ జన్మలో మీకేది యిష్టం అనేది ఉంటుంది. పిలవకుండా చాల దూరంనుంచి యోగ సూత్రాల క్లాసుకోసం ఎందుకొస్తున్నారు. యివాళ్టిది కాదిది. ఇది యివాళ్టిదే కనుక అయినట్లైతే మీకు రాకుండా ఉండడానికి కావలసినన్ని ప్రశ్నలు వచ్చి ఉండేవి. ఏమని? దూరం కదా? మళ్ళీ వెనక్కి తిరిగి వెళ్ళేటపుడు బస్సు ఉండదుగా? మొదలైనవి. సినిమాకి టికెట్టు దొరకలేదు కనుక పాట కచేరీకి వెళ్తాడు. సినిమాకి, పాట కచేరీకీ తేడా లేదు పాపం. అవి వాడి పూర్వ సంస్కారాలు. ఒక్కొక్కళ్ళు రామకోటి రాస్తూంటే ఒక్కొక్కళ్ళకి ఎగతాళిగా ఉంటుంది. వీడిరుచి వాడికి తెలీదు. వాడిరుచి వీడికి తెలీదు, కాఫీ రుచి గొడ్డుకి తెలుసా? గడ్డి రుచి మనిషికి తెలుసా? ఇద్దరిలో ఎవరూ గొప్ప కాదు (no one is superior) మానవజన్మ ఎక్కువేమి కాదు. అది బయాలజీ వరకే పరిమితం. జీవరాసులు శరీరం ధరించటాన్ని బట్టి ప్రవర్తన ఉంటుంది. ఏ శరీరం ధరిస్తారనేది పూర్వజన్మలో వాళ్ళు ఏవిధంగా ప్రవర్తించారో దాన్నిబట్టి ఉంటుంది. ఇవన్నీ కూడ కాదనటానికి వీల్లేనటువంటి సత్యములు. భారతదేశంలో మనకి వీటితో అట్టే సంబంధం లేదుగాని, యితరదేశాల్లో క్రమంగా ఆర్జించుకొని క్రమబద్ధం చేసుకుంటున్నారు. కొన్ని వందల

ంవత్సరాలు పోయాక మళ్ళీ అక్కడినుంచి తెచ్చి చదువుకోవలసిందే. కనుక ఇవి పూర్వజన్మ సంస్కారములు అనేటువంటి అత్యద్భుతమైన శాస్త్రము continuity of life. అంటే మనం లక్షల జన్మలు ఎత్తుతూ ఉండగ జరుగుతూన్నటువంటి ఈ సంసార చక్రము evolution cycle. దాంట్లో జరుగుతూన్నటువంటి పూర్వాపర సందర్భాల వైఖరులు ఉంటాయి. దానినిబట్టి మన మనస్సుని ఏవి ఆకర్షిస్తాయి? ఏవి ఆకర్షించవో ఉంటుంది. భగవద్గీతను ఆకర్షించినా, యింకో పనికిరాని విషయాన్ని ఆకర్షించినా పూర్వజన్మ సంస్కారమే. ఏమిచేసినా నాకు నచ్చిన పని నేను చేసుకుంటాను, దానికేమిటి అభ్యంతరం అనే ధైర్యము, విశ్వాసము ఉండాలి. యావత్ప్రపంచాన్ని నిలబడి అడిగినా ఆ ప్రశ్నకి సమాధానం లేనేలేదు. ఆ లేదు అని తెలిసిన మంచిరోజు రావాలి. అది మంచి పనిమీద వచ్చినా సరే, చెడ్డపని మీద వచ్చినా సరే. ఎందుకంటే ఇవాళ చెడ్డపని మీద వస్తే ఈ జన్మకి దీంతో వెళ్ళిపోతుంది. వచ్చే జన్మలో ఈ సంస్కారం మిగుల్తుంది. మిగతావి పోతాయి. అందుచేత యిక్కడ ఈయన చెప్పేది ''సాక్షాత్కారం'' కావాలి. సాక్షాత్కారం చేసుకోవాలి. అంటే ఆఫీసులో ఉన్న కొలీగ్‌ని 30 ఏళ్ళనించి ఎరిగి ఉన్నట్టు ఎరిగి ఉండటం కాకుండా మనకు నచ్చినటువంటి కూరగాయల్ని బజారునించి కొనుక్కొచ్చి భార్యని వండమన్నపుడు ఎలా అనుకుంటామో అలా ఉండాలి. ఆ తేడా రావాలి. తేడా ఉంటుందా? లేదా? చక్కగా ఉంటుంది. కుర్రవాడి పుట్టిన రోజునాడు వంట ఎలా చేస్తామో, మిగతా రోజుల్లో కూడ అలాగే చేయాలి. మిమ్మల్ని నిన్నటివరకు ఎరిగి ఉన్నట్లు కాకుండా యివాళ ఆసక్తితో ఎరిగి ఉండటం అనేది బుద్ధి పూర్వకంగా నేర్చుకోవాలి. లేకపోతే యోగాభ్యాసానికి ఈ జన్మకి పనికిరావు. అదీ మీరు చేయవలసింది. అయితే మంచివాళ్ళ గురించి, చెడ్డవాళ్ళ గురించి కూడ ఆసక్తితో, కుతూహలంతో నేర్చుకోవాలా? అంటే చెడ్డవాళ్ళు అనేవారు యోగాభ్యాసం చేసేటువంటి వాళ్ళకి ఉండరు. ఎమర్సన్ చెప్పాడు. "There are no bad people in the world, there are badly behaving people". ఆమాత్రం కనువిప్పు పెద్దవాళ్ళు చెప్పిన వాక్యాల్లో ఎక్కడో అక్కడ రావాలి. లేకపోతే రెండు కాళ్ళతో జన్మ ఎత్తినది వ్యర్థము. కనుక యోగాభ్యాసంలోకి నిజంగా ప్రవేశించిన వాడికి చెడ్డవారు ఉండరు. కనుక ఎవరిని చూచినా, ఎవరితో మాట్లాడినా కుతూహలంగానే ఉంటాడు. అంటే వ్యాపార సరళిలో మాట్లాడినట్లు కాదు.

అది యోగాభ్యాసానికి పనికిరాదు. యోగాభ్యాసానికి కావలసిన ఆసక్తి, కుతూహలం ఏమిటి? మీరు ఎదురుగుండా ఉంటే మీ మీద అభిమానము. మీకేం కావాలో దానిమీద ఆసక్తి. మీ కాకలి వేస్తే అన్నం పెట్టటం మీద ఆసక్తి. వాడికి ఆకలి వేస్తే అన్నం తినటం మీద ఆసక్తి. Equally sincere. రెండు ప్రక్కలా ఒకేలాగ ఉండాలి అంతే. మీకు నచ్చకపోతే నచ్చలేదని చెప్పటం మీద కుతూహలం. కాబట్టి ఈ యోగాభ్యాసంలోకి వచ్చేటప్పటికి వాడి పనులు వాడి మార్గంలో వాడు చేసుకుంటాడు. చేసుకొని సాక్షాత్కారంలోకి వస్తాడు. ప్రతి సంఘటన సాక్షాత్కారంగా జరుగుతుంది. కుర్రవాడికి అన్నం పెడుతూ ఉంటే, తల్లి యోగాభ్యాసం నేర్చుకున్నదైతే, కుర్రవాడికి అన్నం పెట్టటం యందే నిష్ఠ కలిగి ఉంటుంది గాని ప్రక్కావిడతో అత్తగారిని గురించో లేక మరే విషయాలో మాట్లాడుకుంటూ పెట్టదు. శాశ్వతమైన వర్తమాన కాలమునందు సజీవంగా ఉండటం నేర్చుకో అన్నారు పెద్దలు. అదీ సాక్షాత్కారం అంటే. వాడెవడో పిల్లవాణ్ణి ఆటో దింపి తీసుకొస్తున్నాడు: మీరు చూసారు. నేను చూసాను. కాని మీరు చూడటంలో వాణ్ణి యిక్కడికి తీసుకొచ్చే లోపల ఆ కుర్రవాడికి కాలికి పోలియో ఉందని, ఒక కాలు యింకో కాలి కంటే సన్నగా ఉందని, వాణ్ణి దింపుతూంటే సన్నగా ఉన్న కాలు ఇంకో కాలి కన్నా పాలిపోయి తెల్లగా ఉందని, ఆ కుర్రవాణ్ణి ఎత్తుకుంటూ ఉంటే ఆ ప్రక్క టెముకలు నెప్పి చేస్తున్నాయని- ఇవన్నీ మీరు గమనించారు. ఎవళ్ళో అక్కడ ఆటో దిగి అందులోంచి ఒక కుర్రవాణ్ణి తీసుకొస్తున్నారని మాత్రం నేను చూసాను. ఆ తేడా లుంటాయా? లేదా? ఈ రెండోవాడు చూసినట్టు చూడకుండా మొదటివాడు చూసినట్టు చూడండి అన్నారు. చూసి చూట్టంలో క్షణ మాత్రంలోనే అన్నీ వాడికి అప్రయత్నంగా గమనికకు వచ్చినాయి. యోగాభ్యాసం చేసినవాడు అలా చేస్తాడు. అది మనకి కొన్ని జన్మలు పోతేగాని తెలిసే విషయంకాదు. యోగాభ్యాసం చేసేటపుడు అది కావాలి. మన కుర్రవాడి మీద మనకున్నది ప్రేమ. వాడి కుర్రవాడి మీద వాడికున్నది ప్రేమ. అలా కాకుండా మన కుర్రవాడైనా సరే వాడి కుర్రవాడైనా సరే సమానంగా ఉండటం అనే స్థితి వచ్చేదాన్ని పరమప్రేమ అన్నాడు. నారద భక్తి సూత్రాల్లో ''అధాతో భక్తి వ్యాఖ్యాశ్యామః'' భక్తి అంటే ఏమిటో వినండి చెబుతాను అన్నాడు. ''సా త్వస్మిన్ పరమ ప్రేమరూపా'' అదీ పరమ ప్రేమయొక్క స్వరూపము. పరమ ప్రేమ అంటే ఏమిటి? మనకు ప్రేమ తెలుసు. ఆ

తెలిసింది ప్రేమకాదు. నీ కుర్రాడు మీద నీకున్నది గొడ్డు ప్రేమ. అది ప్రేమ ఏమిటి? beastly instinct అన్నాడు. పందికి పంది పిల్లమీద ఉంటుంది. కుక్కకి కుక్కపిల్ల మీద ఉంటుంది. అది తల్లికి బిడ్డకీ ఉన్నటువంటి బంధం కాని ప్రేమకాదు. అది పశుబంధం అంటారు శాస్త్రాల్లో. The beastly instinct between mother and child. అది ప్రేమకాదు. వాడి కుర్రాడైనా సరే మన కుర్రాడైనా సరే అన్నస్థితి వాడికొచ్చిన తర్వాత కుర్రాణ్ణి దింపుతూంటే ఎన్ని విషయాలు వాడి కర్థమైనాయి. నీ కుర్రాడి మీద ప్రేమ వాడి కుర్రాడిమీద ప్రేమ అనేది వెళ్ళిపోయి, ప్రేమ అనేటువంటిది మిగిలింది. కనుక పరమప్రేమ ఎలా ఉంటుందంటే 'అమృత స్వరూపాచ' అన్నాడు తర్వాత సూత్రంలో. ఎంచేత? అంతర్యామి యందు గల ప్రేమతో మీరు అభ్యాసం చేస్తున్నారు గనుక అపుడు మీరు చూస్తున్న ప్రతి విషయం కూడ సాక్షాత్కారంతో చూస్తారుగాని, ఊరికే కన్నులు మూసుకొని చూచింది, చెవులు మూసుకొని విన్నది ఉండదు. 'అక్షం' అంటే కన్నులనే అర్థంలో కాకుండా, పంచేంద్రియాల యొక్క ఐదింటి అర్థంలోనూ కూడ సాక్షాత్కారమనే వాడతారు. Receiving the incident with living interests అది సాక్షాత్కారమంటే. అందుకని పతంజలి 'సాక్షాత్కారం వలన' అనేమాట వాడుతున్నాడు యిన్నాళ్ళనించి. మనం బోర్డు ఉపయోగించుకుంటూ బోర్డు తుడుస్తున్నాంగాని, మనకు పతంజలి యోగసూత్రాలకి బోర్డు ఉపయోగిస్తోందనే గుర్తింపు ఉంటే సాక్షాత్కారంతో తుడుస్తున్నట్టు లెక్క.

పిట్టగోడ మీంచి పిల్లవాడు క్రిందపడ్డాడు. కుర్రాడితో పాటు తండ్రి దూకుతాడా? లేక ఓరి నాయనో! అంటూ తల్లి తండ్రీ మెట్లు దిగుతారా? దాన్ని ప్రేమ అని ఎలా చెప్పగలరు. వాడు పడ్డాడని తెలుసు. మనం వెళ్ళేలోపల బతుకుతాడో చస్తాడో అనుమానం. మెట్లమీంచి ఓయి నాయనో! నా బిడ్డ ఏమయ్యాడో, కొండకి వస్తాను ఏడుకొండలవాడా! అంటే చస్తేవాడు చావాలి కాని మనం చావకూడదు దూకి. ఇది ప్రేమ అంటారా అంటాడు నారదుడు. లేదా 'అమృత స్వరూపా' అంటే యింకో ఉదాహరణ తీసుకుందాం. కుర్రవాడికి అన్నం పెట్టాము. చొక్కాలు కుట్టించాం. టెర్లిన్ చొక్కా కుట్టించాము. టెరికాట్ చొక్కా కుట్టించాము. ఈ లాగు కుట్టించాము. ఆ చొక్కా కుట్టించాము, ఎత్తుకున్నాము. కొంచెం వయస్సు వచ్చేటప్పటికి క్వాలిటీ ఐస్క్రీమ్ కొనిపెట్టాము వాడికి. అది తిన్నాక జబ్బుచేస్తే మందు వేయటం

నేర్చుకున్నాము. వాడు కొంచెం పెద్దయ్యాడు. వాణ్ణి చదివిస్తున్నాం అనుకున్నాం. కాలేజీలో కూడ చదివాడు. వాడికి పెళ్ళయ్యింది. పెళ్ళయ్యేటప్పటికి వాడిని వాడి పెళ్ళాన్ని ద్వేషించటం మొదలు పెట్టామా? లేదా? అద్దంలో చూసుకొని చెప్పండి. వాడు వాడి పెళ్ళాం కలిసి సినిమాకి వెడుతూంటే మొహం ముట ముటలాడ్చుకునే తల్లితండ్రులు ఉన్నామా? లేదా? 'అమృత స్వరూపాచ' అంటారా ఆ ప్రేమని. తండ్రీ కొడుకులుగా పుట్టి అది మనం సాధన చెయ్యాలి. ఇంట్లో ఉన్నవాళ్ళ మీద ఒకరిమీద ఒకరు సాధన చెయ్యలేని వాడు యోగాభ్యాసం ఏం చేస్తారు? ఇల్లు వదిలిపెట్టి, ఏదో వైరాగ్యం పొందుతాను, అరణ్యాలకి వెడతాను, గుహల్లోకి వెడతాము అంటే అరణ్యాల్లోను, గుహల్లోను ఏమీ లేవు. మీ యింట్లో సాధన చేసుకుంటానికి నీ బుర్రకాయలో ఉన్నటువంటి తేళ్ళు, జెర్రులు నువ్వు పోగొట్టుకోగలిగితే ఏమన్నా ఉన్నది లేకపోతే లేదు. యోగాభ్యాసం అరణ్యాల్లో చేస్తానంటే వేమన చెప్పాడు కదా. ''క్రూరమృగం బొకండు తారసిల్లిన మృత్యు మార్గమదియే ముందుగా జూపురా విశ్వదాభిరామ వినురవేమ''. అందుకని ఇవన్నీ ఇంట్లో సర్దుకోవడం చాతైతే, లేదా ఆఫీసులో సర్దుకోవడం చాతైతే లేదా ఎక్కడ పదిమందితో మనం కలిసి బ్రతుకుతున్నామో, అక్కడ సర్దుకోవడం చాతైతే అప్పుడు కొంచెం యోగాభ్యాసానికి అవకాశముంది. అక్కడ మనకి పొసగలేదు. పొత్తులేదు అంటే ఈ జన్మకి యోగాభ్యాసానికి పెట్టి పుట్టలేదు అని తెలియాలి. ఇంట గెలిచి రచ్చ గెలవండి. అంటే ఎక్కడ మనం పదిమందితో తెల్లవారేప్పటికి తిరుగుతూ ఉంటామో, అక్కడ మనకి రాగద్వేషాలు ఉన్నాయో, పోయినాయో చూసుకోవాలి. ఇవికాక ఎక్కడో సాధన చేస్తానంటే ప్రయోజనం లేదు. నిరంతర సాధనగా చేసుకుంటూన్న వాడికి సంస్కారములు సాక్షాత్కారము అవుతాయి. ఎదుటివాడు సంగీతము పాడుతున్నాడనుకోండి, బాగా సంగీతము ప్రశంస చేయగలిగిన మహానుభావుడికి ఆయన పాడటం మొదలు పెట్టగానే అలా ఉండిపోతాడు. మళ్ళీ ఆయన పాట ఆపినపుడే ఈ లోకానికి వస్తాడు. అంటే సాక్షాత్కారము ఆయన అనుభవిస్తాడు. అలాకాక పాడే ఆయన మొహమో, ముక్కో లేదా కనుబొమ్మలో లేదా మోహాన ఉన్న వులిపిరి కాయో చూసేవాడికి సాక్షాత్కారం ఉండదు. ఇవన్నీ ఒకటి ఒకటి చూసి ప్రయోజనం లేదు. అందుకని ''జన్మ మృత్యు జరా వ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్'' అంటే ఒక్క పాదంలో కొట్టేసాడు భగవద్గీతలో. మొత్తం ఈ పనికిరాని విషయాలున్నాయే వీటి దుఃఖాలున్నా,

దోషాలున్నా వీటిని దర్శనము చేయటం చాలదు. అనుదర్శనం చేయండి అన్నాడు. సాక్షాత్కారం చేయండి అన్నాడు. అప్పుడు ముసలివాణ్ణి చూస్తే మీకు ముసలివాడి మీద, కుర్రవాణ్ణి చూస్తే కుర్రవాడిమీద జాలి (sympathy) కలుగుతుంది. జబ్బువాణ్ణి చూస్తే జబ్బువాడి మీద, పిరికివాణ్ణి చూస్తే పిరికి వాడిమీద సానుభూతి కలుగుతుంది. ఎగతాళి చేయరు. ప్లాట్‌ఫారమ్ మీద నుంచుని elocution contest లో మాట్లాడలేక కాళ్ళు, చేతులు వణికేయి అనుకోండి. 'హి' అని అరవరు. ఎంచేత? ఎట్లా ఉన్న వాణ్ణి చూసినా వాడిమీద జాలి కలుగుతుంది. అపుడు సాక్షాత్కారము అన్నది చాతనవుతుంది. అపుడు సర్వజీవులయందు సాక్షాత్కారము వస్తుంది మీకు. అది ''సంస్కార సాక్షాత్కారము''. అలాంటిది కలుగుట వలన ''పూర్వజాతి జ్ఞానమ్'' కలుగుతుంది. మనం పూర్వజన్మలో ఏమిటి అన్నది తెలుస్తుంది. లేకపోతే ఏదో కట్టుకథలు చెప్పుకుంటూ ఉంటాం. పూర్వజన్మ జ్ఞానం అనేది నాడీగ్రంథాల్లో చెప్పించుకుంటానికి, బుకాయించుకుంటానికి కాదు. ఎందుకంటే ఈ జన్మలో కొన్ని తీరనటువంటి దురభ్యాసములు గాని, తాను ప్రయత్నించినా తీరనటువంటి దారిద్ర్య దుఃఖాది బాధలు గాని, లేదా దురదృష్టమైన, విజయవంతము కాని జీవిత విధానము (unlucky, un successful career), ఏది ప్రయత్నం చేసినా సరే నాశనమవుతోంది జీవితంలో. లేదా ఎల్లపుడు ఏదో ఒక వ్యాధిగ్రస్తంగానే శరీరం ఉంటోంది. ఆ వ్యాధి పదేళ్ళు, పదిహేనేళ్ళయినా తగ్గటం లేదు. దానికి డాక్టరు దగ్గర దొరకదు జవాబు. మందుల దగ్గర దొరకదు. ఏ వైద్య పద్ధతులలోను దొరకదు పరిష్కారం. ఎంచేతంటే యివన్నీ కలిసి ఎక్కడ పనిచేస్తున్నాయి. అల్లోపతి వైద్యశాస్త్రం భౌతిక శరీరం మీద పనిచేస్తుంది. ఆరోగ్యం కాని, అనారోగ్యం కాని ప్రాణమయ శరీరంలో తయారవుతున్నాయి. అంతవరకు వెడుతుంది హోమియోపతి. ప్రాణమయ కోశంలోని తేడాలు మనోమయకోశం నించి వస్తున్నాయి. అక్కడనించి అన్నమయ కోశానికి వచ్చేటప్పటికి ఏ లివరు జబ్బో తయారవుతుంది. ఎన్ని మందులిచ్చినా ప్రయోజనం లేదు. ఏవి తిన్నా ఉంటాడని నమ్మకం లేదు. ప్రతిరోజు లివరు తయారయ్యేటువంటి ధాతువులు మనోమయ కోశంలో ఉన్నాయి. దాని విష బీజములు ప్రాణమయ కోశానికి వచ్చినాయి. ప్రాణమయకోశం నించి the chemistry of the physical tissues of the body is determined. మరి ఇక్కడిదాక వచ్చేక, ఏ పతి కూడ లాభం లేదు. ఉమాపతో, శ్రీపతో వాళ్ళిద్దరిలో ఎవరో ఒకళ్ళు

రావాలి. కనుక 'పూర్వజన్మ జ్ఞానమ్'' పూర్వ జన్మలో పాతికేళ్ళో, ముప్పై ఏళ్ళో ఏ చెయ్యకూడని అభ్యాసం చేసినా, నీ మనోమయ కోశంలో ఆ భావం (thought) పుట్టి మిగిలిపోయిందన్నమాట భౌతిక శరీరం దగ్ధమైపోయాక కూడ. మల్లెచెట్టు తగలపెట్టిన తర్వాత కూడ ఆ మల్లెకాయలో ఉన్న విత్తనాలు పొట్లంకట్టి దాచుకొని, తర్వాత వేస్తే మళ్ళీ మల్లెచెట్టే వచ్చినట్లు, భౌతిక శరీరం దగ్ధమైపోయిన తర్వాత కూడ ఇపుడు మళ్ళీ ఆ విత్తనంతో మనస్సు పుట్టటం అంటూ వస్తే, అదే మనస్సు పుడుతుంది. మల్లెగింజలోంచి మల్లె చెట్టే వస్తుందా? వెల్లెచెట్టు వస్తుందా? ఎక్కడా కనిపించకుండా పోయింది కదా మల్లెచెట్టు. కాని మల్లెచెట్టే వస్తుంది అందులోంచి. మల్లెగింజలో మీరు బద్దలకొట్టి మైక్రోస్కోపులోంచి చూసినా మల్లెమొక్క కనిపిస్తుందా? మల్లెమొక్క అందులో గుణ ప్రధానం (qualitative) గా ఉందిగాని, పదార్థం quantitative గా లేదు. గమనించాలి. అంటే గుణ ప్రాధాన్యంతో గుణ స్వరూపమైనట్టి మల్లెమొక్క ఉందికాని, మల్లెగింజలో ద్రవ్య స్వరూపమైన materialistic మల్లెమొక్క లేదు. Potential మల్లెమొక్క ఉన్నది, గుర్తుంచుకోవాలి. కనుక శరీరం వదిలిపెట్టిన తర్వాత జీవుడిలో potentialities మిగుల్తాయి. కిందటి జన్మలో చేసినటువంటి సంస్కారాలు మంచిగాని, చెడుగాని మళ్ళీ మొలిచేటపుడు ఆ potentialities ప్రకారం మంచిగాగాని, చెడుగాగాని మనస్సు తయారవుతుంది. ఆ మనస్సు ప్రకారం ప్రాణామయ కోశం ఏర్పడుతుంది. ప్రాణామయ కోశం ప్రకారం అన్నమయ కోశం నడుస్తుంది. ఈ మనస్సు ఏం చేస్తుంది? ఇలాంటి శరీరాన్ని తయారుచేసేటు వంటి తల్లితండ్రుల దగ్గరికి వెళ్ళి గర్భంలో పడుతుంది. సిఫిలిస్, గనోరియానో కల్గినటువంటి వాళ్ళ దగ్గరికి వెళ్ళి పడిందనుకోండి. పుట్టిన దగ్గరినుంచి వీడు రోగంతో బాధపడుతుంటాడు. 'That is the law of magnetic attraction' అన్నాడు జ్వాలాకూలుడు. కర్మసిద్ధాంతం, పునర్జన్మ సిద్ధాంతం పాశ్చాత్యులకు బోధిస్తూ law of magnetic attraction అని చెప్పాడు. అలాంటిది వచ్చినపుడు గురువులు అది సాక్షాత్కారం చేసుకుంటారు. లేదా పెద్దవారు ఎవరైనా దాన్ని సాక్షాత్కారం చేసుకుంటారు. దానికేం చేయాలో ప్రతిక్రియ (remedy) ఆయన చెబుతారు. దానికోసం పూర్వజన్మ జ్ఞానం. ఉత్తినే ప్రతివాడి గురించి తెలుసుకునేందుకు కాదు. మనం పూర్వజన్మలో ఏమిటి? వచ్చే జన్మలో ఏమిటి? అని జాతకచక్రం చూపించుకునేవాడు నిష్ట

దరిద్రుడు. అంటే తనమీద తనకి నమ్మకం లేనివాడు యోగాభ్యాసానికి పనికిరాడు. రేపు నా జీవితం ఎలా ఉంటుంది అనే పిరికి ప్రశ్న నశించినటువంటి సింహము లాంటివాడు యోగాభ్యాసానికి పనికి వస్తాడు. రేపెలా ఉంటుందంటే యివాళ మనం ఏం చేసుకుంటే రేపలా ఉంటుందన్నది తెలియాలి. అంతేగాని ఈ కక్కుర్తిలో ఏది ఉన్నా అంటే నాకు పూర్వజన్మ ఏమిటి? వచ్చే జన్మ ఏమిటి అనుకునే వాడికి ఉండదు. అది మనం చేసుకునే దాన్ని బట్టి ఉంటుంది. అలాగే నాకు రాబోయే పదేళ్ళు ఎలా ఉంటాయండి? ఎలా ఉంటాయి? మన మొహం అద్దంలో చూసుకుంటే తెలుస్తుంది గాని అవతలి వాణ్ణి అడిగితే ఏం తెలుస్తుంది? వాడు జ్యోతిష్కుడు కానీండి, భూత వైద్యుడు కానీండి, సైకాలజిస్టు కానీండి, మీ సంగతి వాడికేం తెలుసు. ఎవడి సంగతి వాళ్ళు తెలుసుకొని తమాషాగా సర్దుబాటు చేసుకోవాలి. అంటే కలలో కూడ మనకి రేపెలా ఉంటుందనే ప్రశ్న రాకుండా ఉండే స్థితి రావాలి యోగాభ్యాసంలో ఏమైనా ఫలించాలంటే. అపుడు సాక్షాత్కారం అవుతుంది. ఆ సాక్షాత్కారం వచ్చినపుడు ఇరవై నాలుగు గంటలూ ఎవరెవరితో ఉన్నా, వారి గురించి మీకు సాక్షాత్కారం ఉంటుంది. వాళ్ళకి ఆకలేస్తూంటే మీకు వెంటనే ఆకలేస్తుంది. పెద్ద ఆశ్చర్యమేమి లేదు. గుంటూరులో నాతో చిన్నపుడు తిరిగే స్నేహితుడు ఉండేవాడు. వాడు యిక్కడికి వస్తే ఒక 5 నిమిషాలు ప్లాట్ ఫారమ్ మీద నించోబెడతాను. మాలో ఏ ఒక్కడికి ఆకలేసినా ప్రక్కన రెండోవాడికి ఆకలేసేది. లేదా నాకు వేసేది. వెంటనే వాణ్ణి హోటల్‌కి తీసికెళ్ళి వాడికి టిఫిన్ పెట్టించేవాళ్ళం. అప్రయత్నంగా జరుగుతుంది. దప్పికవేస్తే యివతలి వాడికి వేస్తుంది. ఎంచేత? reflect అవుతుంది. అలాగే జబ్బు చేసిన రోగిని నీ దగ్గరికి తీసుకువస్తే వాడికి వ్యాధి ఎక్కడుందో నీకక్కడ reflect అవుతుంది. వాడికి ఏ రకమైన నెప్పి ఉందో నీకు తెలుస్తుందా? ఇది సాక్షాత్కారమంటే. ఇది జరుగుతుందన్నాడు. ఇది ఏం ఉంటే వస్తుంది? నారదుడు చెప్పిన అపారమైన పరమ ప్రేమ ఉంటే వస్తుంది. ఇంక ఏది ఉన్నా రాదు. ఆస్తిపాస్తులున్నారాదు. వ్యాజ్యం ఉన్నారాదు. లౌక్యం తెలిసినా రాదు. ప్రపంచంలో అందరికంటే మనం ప్లానింగ్ గల వాళ్ళమైనా రాదు. మతప్రచారం చేసినా రాదు లేదా మతం మార్చుకున్నా, యిట్లాంటి వాటివల్ల రాదు. మనం మూర్ఖం కదా మతం మారినా, లోపల ఉన్నటువంటి వాడు అదే వాసనతో ఉంటాడు కదా, అది తెలియాలి. అందుకని 'పూర్వజాతి జ్ఞానమ్' కలుగుతుంది అనే మాటకి ఇన్ని రకాల అర్థాలు వచ్చాయి.

## 19. ప్రత్యయస్య (సాక్షాత్కారాత్) పరచిత్త జ్ఞానమ్।

ప్రత్యయస్య = నమ్మకముయొక్క, (సాక్షాత్కారాత్ = సాక్షాత్కారము వలన), పరచిత్త జ్ఞానమ్ = యితరుల చిత్తములో ఉన్న అభిప్రాయములు తెలిసికొనును.

**ఇతరుల చిత్తమునందు సంయమము నిలిపినచో ఆ చిత్తమును గూర్చి తెలియును. (ఇతరుల చిత్తమునం దేమున్నదో తెలియుటయే గాక యితరుల చిత్తమునకు సంబంధించిన ప్రత్యేకత, ఆరోగ్యాది విషయములు, సలహాలు కూడ తెలియును).**

**వివరణ :** యిక్కడ మీరు కిందటి సూత్రంలోని ''సాక్షాత్కారాత్'' అనే పదం చేర్చుకోవాల్సి ఉంటుంది. అనగా, ప్రత్యయము యొక్క సాక్షాత్కారమువలన అని వస్తుంది. 'ప్రత్యయము' అంటే ఏమిటి, డ,ము,వు,లు ప్రథమా విభక్తి అంటే ఆ పదం యొక్క స్వభావం ఎలా వాడతారో చూసుకోవాలి. వాడిమీద వీడికి ప్రత్యయం ఉంది అంటాం. అంటే ఏమిటి? నమ్మకం. కాళిదాసు చెప్పాడు ''మూర్ఖాపర ప్రత్యయన్యే బుద్ధిః, పురాణమిత్యేవన చాతి కావ్యం నవ మిత్యవద్యం'' పాతది కదా ఈ పుస్తకం చాల గొప్పది అని అనుకోడు తెలివైనవాడు. ఇంకో పుస్తకం క్రొత్తది కదా ఇది గొప్పది progressive అని ఎవ్వడూ అనుకోడు. అలాగే పాతది కదా ఎప్పటిదో మనకి అక్కర్లేదని progressive writter లాగ అనుకోడు. క్రొత్తవన్నీ చెత్త మన కెందుకండి అని అంతకంటే అనుకోడు. స్వంత పరీక్ష 'అన్యతర ధ్వజంతే' తను సొంతంగా చూసి ఈ పుస్తకం బాగుందా? లేదా? అని చదువుకుంటాడు బుద్ధి ఉన్నవాడు. 'మూర్ఖః' మూర్ఖుడు ''పరప్రత్యయమే బుద్ధిః'' ఇతరుల అభిప్రాయముల ప్రకారం వాడు బాగుండలేదంటే వీడు బాగుండలేదంటాడు. సినిమాకి వెళ్ళి నలుగురు బాగుండలేదంటే అయిదవవాడు కూడ బావుందంటే బావుండదని వీడూ బాగోలేదంటాడు. Courage of conviction లేదు. అటువంటి వారు యోగాభ్యాసానికి పనికిరారు. కనుక ప్రత్యయం అనే మాటకి అర్థం నమ్మకం. ప్రత్యయస్య అంటే నమ్మకం యొక్క సాక్షాత్కారము వలన. ఎవరి మీద నమ్మకం? అవతలి వాడి మీద నమ్మకం. ప్రపంచంలో మనుష్యుల మీద మనకి

ఎంతవరకు నమ్మకం ఉంటుందండి. నమ్మక గతి లేనంతవరకు నమ్ముతున్నాము ఒకళ్ళనొకడు. అది నమ్మటమా? వారు చెప్పేరండి. చెప్పారనుకో. మనమూ వాళ్ళూ చూసుకోవాలి. ఒకడి మీద ఒకడు భయంతో బ్రతుకుతున్నాంగాని నమ్మకం మీద బ్రతకటం లేదు ప్రపంచంలో. కాని యిక్కడ అవతలివాడి మీద నమ్మకం. దీన్నే మాస్టర్ మోరియాగారు ఒకమాటలో చెప్పారు. "True confidence in the essential goodness of mankind". అంటే మానవుడు సహజంగా మంచివాడు. వాడికున్న పిరికితనము, భయము, బాధలు వీటివల్ల అపరాధి (criminal) అవుతున్నాడు. దొంగతనం చేసినా, దోపిడి చేసినా, తలకాయ పగలకొట్టినా, ఏం చేసినా, తనకున్న భయాలు, భీతిలు వీటివల్లే గాని, సహజంగా వాడి దగ్గర ఈ లక్షణం లేదని తెలియటం, ఆ తెలిసిన దానిమీద మీకు నమ్మకం ఉండటం, దాన్ని ప్రత్యయం అంటారు. విశ్వాసం అంటారు. అంటే వాణ్ణి నమ్మటం అంటే అర్థం ఏమిటి? వాడిమీద నిజంగా జాలి (sympathy) కలగటం. మీ పని వాడి కప్పు చెప్పక్కర్లేదు. మీ పని మీరే చేసుకోవాలి. నమ్మమన్నారు కదండి అంచేత వాడికి నా తల అప్ప చెప్పాను. నీ తల వాడికి ఎవరు అప్పచెప్పమన్నారు. యోగాభ్యాసం మొదలుపెట్టాక నీపని నవ్వు చేసుకోవటమే. నమ్మకం అంటే వాడికి ఏం కావాలో తెలుసుకునేందుకు గాని, వాడివల్ల ఏం కావాలో తెలుసుకునేవాడు వ్యాపారం పెట్టుకోవచ్చు. ఎదుటి వాడిచేత పనులు చేయించుకునే తెలివి ఉన్నవాడు వ్యాపారంలోకి వెళ్ళాలిగాని యోగాభ్యాసానికి కాదు రావల్సింది. అంటే తన వల్ల తాను బ్రతుకుతాననే ప్రాథమిక సూత్రం (fundamental rule) తెల్సును. ఇంకోడు సహాయంచేస్తే కాని బ్రతకలేమని అనుకున్న వాళ్ళకి యివన్నీ అపుడే కాదు. కనుక స్వాభావికంగా నమ్మకం తనమీద, ఎదుటివాళ్ళమీద ఉండాలి. ఎదుటివాళ్ళమీద నమ్మకం రావటం వల్ల వాళ్ళ భావాలు ఏవో మాట్లాడుతూ ఉంటారు. తప్పు మాట్లాడేడు. అవకతవకగా మాట్లాడేడు అనుకోండి, ఏదో పాపం వాడి చేతకాని తనం. ఏయ్! ఒళ్ళు దగ్గరపెట్టుకొని మాట్లాడు అనటం సులభమే కాని అనకుండా ఉండటం కష్టం. అందులో కూడ వాక్కుతో అనకుండా ఉండటం, మానసికంగా అన్నప్పటికీ కూడ. అదీ సులభమే. కాని అది కూడ అనకుండా మానసికంగా వాణ్ణి పరిశుద్ధమైన హృదయంతో ఆ అసమర్థత లేకుండా చూడాలి. మనం ఉంటున్నామా?

దాన్ని ప్రత్యయం వంటున్నారు. ఎదుటివాడు అడ్డంగా కోతలు కోసేస్తున్నాడనుకోండి, మనం కోయలేదా ఇదివరకు. రేపేదన్నా అలాంటి పరిస్థితి వస్తే కోయమని నమ్మకం ఏమిటి? అని నవ్వుకుంటాడు, అంటే దాన్ని విని ఆనందిస్తాడు. పరిహాసంగా తీసుకుంటాడు. అపుడే ఆ కోతలు కోసిన వాడిమీద జాలి (simpathy) ఉంటుంది. లేదా తల తిక్కగా మాట్లాడిన వాడిమీద, ఒళ్ళు పొగరుతో మాట్లాడిన వాడిమీద, ఎగ్గొట్టిన వాడిమీద ఒకే జాలి ఉంటుంది. వాడు పోగొట్టుకున్న మార్గం చాతనైతే అందించు. ఆ మార్గంలోకి వెడితే దాన్ని ప్రత్యయం అంటారు. ప్రత్యయమును సాక్షాత్కరించు కొనుటవలన, అంటే ప్రతివాడి యందు తనకి ఉన్నటువంటి మంచితనాన్ని, అంటే unconditional goodness towards others as an attitude సాక్షాత్కారము చేసుకోండి. అది చేసుకుంటూ ఉండటం వల్ల ''పరచిత్త జ్ఞానమ్'' ఇతరుల యొక్క చిత్తములో ఉన్న అభిప్రాయములు తెలుస్తాయి. లేకపోయినా కూడ thought reading వల్ల తెలుస్తాయి గాని, అందరివీ తెలియవు. వీడిలాంటి దౌర్భాగ్యుడివే తెలుస్తాయి. Thought reading మాత్రం అభ్యాసం చేసి, ఈ goodness లేనటువంటి వాడు ఉంటాడు చూడండి, మనస్సు శూన్యం (mind blank) గా పెట్టుకుంటే ఎదుటివాడి మనస్సులో ఉన్న భావం పడుతుంది. అంటే మనం ఏమి ఆలోచించకుండా mind ని passive గా పెట్టుకుంటం ప్రాక్టీసు చేస్తే అక్కడ వాడి మనస్సులో ఏముంటే మన మనస్సులో అదే ఉంటుంది. చెప్పాం కదా. వాడికి ఎక్కడ నెప్పి ఉంటే మనకి అక్కడ ఆ నెప్పి తెలుస్తుందన్నపుడు, వాడి మనస్సులో ఏముంటే, మన మనస్సులో అదే ఉంటంది. కాని అందరి మనస్సుల్లోను ఉన్నది మన మనస్సులోకి మాత్రంరాదు. ఎందుచేత? ఎవరి మనస్సులో ఉన్నదైనా సరే, మన మనస్సులోకి తెలుస్తే అపాయం లేని స్థితికి వచ్చామా? దానిమీద ఆధారపడి ఉంటుంది. అంటే the typical background nature చేసేది అదే. ఎపుడూ ప్రకృతి చూసేది అదే. ఎవరి హృదయాల్లో ఉన్నటువంటి ఏరకమైన అభిప్రాయాలైనాసరే, భావాలైనా సరే మనకి తెలిస్తే ప్రమాదం లేకుండా ఉండే స్థితిలో మనం ఉన్నామా? ఉంటే మనకి ఆ స్థితి వస్తుంది. లేకపోతే thought reading వాడిలాగే బోర్డు అక్కడ అక్కడ పెట్టుకొని ఉంటూ ఉంటారు. మీరు చెప్పకుండానే మనోగతమైనటు వంటివి చెబుతాము.

మీరు లిస్టురాసి మడతపెట్టి జేబులో పెట్టుకోండి నేను చెబుతాను. ఇలా బ్రతికి చచ్చిపోవాల్సి వస్తుంది. అది ఇది ఒకటి కాదు. Thought reading ఇది ఒకటి కాదు. పీనుగుకి, ఏనుగుకి ఉన్నంత తేడా ఉంది. ఇది విశ్వప్రేమకి సంబంధించినది. అది దుశ్చేష్టకి trickery కి సంబంధించినది. అది వీడికంటే లోకువైనవాళ్ళ మనస్సులలో ఉన్నటువంటివి తెలుస్తాయి గాని, వీడికంటే విశాలమైన హృదయం ఉన్నటువంటి వాడు అక్కడ వచ్చి కూర్చుంటే, ఏమి తెలియదు. వాడి mind blank గా ఉంటుంది. ఒక్కొక్క మహానుభావుడు వచ్చి కూర్చుంటే వాడి thought పట్టుకుందామంటే అందదు. ఉంటేకదా thought పట్టుకునేందుకు. అపుడు రెండు చరణకమలాలూ పట్టుకుంటం తప్ప చేసేది యింకేం లేదు. కనుక this is out and out love, the fulblown love. అది విశ్వాసమంటేను, ప్రత్యయమంటేను. ''ప్రత్యయస్య సాక్షాత్కారాత్'' ప్రత్యయమును సాక్షాత్కారము చేసుకుంటంవల్ల అంటే అవతలి వాడికేం కావాలో దానికి వీడు సిద్ధం అవ్వాలి అన్నమాట. అదొక్కటే ఉండాలి జీవితంలో, అలా ఉన్నవాడికే పనిచేస్తాయి యివన్నీ, అంటే ప్రక్కన ఎవరు వచ్చి కూర్చున్నా వాడికి మనవల్ల ఏం కావాలి? ఇపుడు వచ్చాడు అనేదొక్కటే భావం ఉండి ఇంకేం లేకుండా ఉన్నవాడికి వస్తాయి ఇలాంటివన్నీ. అపుడు వాడికేం కావాలి అనేది దానితోనే చూస్తాడు. అలాంటపుడు వాడికేం కావాలో వీడికి తెలియాలి కనుక వాడి మనస్సులో ఉన్నది పట్టుకుంటాడు. కనుక ఏమాత్రం వీడి దగ్గర criminal mentality ఉన్నా, crookish mentality ఉన్నా ఇవి లొంగవు. వీడికంటే లోకువైన వాళ్ళు, వీడికంటే లౌక్యులు, వీడికంటే పనికిరాని అభిప్రాయాలున్న వాళ్ళవి దొరుకుతాయి వీడికి. ప్రక్కన చేరుతారు ఒకళ్ళకి ఒకళ్ళు. సైజుల వారీగ ఉంటుందన్నమాట. యోగాభ్యాసం ఉన్నవాడు అందడు. వీడికి సర్వ ప్రపంచం కూడ తన హృదయంలో ఉంటుంది. ఆ స్థితిలో ఉంటాడు. ''ప్రత్యయస్య సాక్షాత్కారాత్ పరచిత్త జ్ఞానమ్'' ఇతరుల చిత్తం చక్కగా అందుతుంది. గిలగిల కొట్టుకుంటాడు అవతలివాడు. ఏం ఫరవాలేదు, ఏం కొట్టుకోకు అని రెండు నిమిషాల్లో వాడికి ప్రశాంతి తెస్తాడు. ఎన్నడూ వాడు ఆ పదేళ్ళలో ఎరగనటువంటి చాలా సంతోషాన్ని, ప్రశాంతిని అనుభవిస్తాడు. ఇవతలికి వచ్చాక ఈ అయిదు నిమిషాల్లోను అనుభవించిన ప్రశాంతి గత పదేళ్ళల్లో

అనుభవించలేదు అని చెప్పేస్తాడు. అదే వాళ్ళ దగ్గరికి వెడితే యిచ్చేదన్నమాట. ఒక రమణ మహర్షిగాని, ఒక అరవింద యోగీంద్రుడు గాని, అట్లాంటి చోటికి వెడితే దొరికేటువంటి విషయాలు. వారున్నపుడే గాదు, వారి సమాధి దగ్గరికి మీరు వెళ్ళి కూర్చున్నా అదే లభిస్తుంది. చూస్తే తెలుస్తుంది ప్రత్యక్షంగా. దీనికి జ్వాల్‌కూల్ ఏం చెప్పాడో చూద్దాం. ఆ పుస్తకాలు వచ్చిన తర్వాత మీరు చూసుకోవచ్చు. పుస్తకాలు వచ్చాక కూడ లైబ్రరీ పుస్తకాన్ని తీసుకొని కాపీ చేసుకుంటం మంచిది. కొనగలిగిన ఖరీదులో ఉండవు. ఎక్కడెక్కడ దొరకనటువంటి అతి దుర్లభమైన పుస్తకాలన్నీ W.T.T లైబ్రరీలో నేను సేకరించి పెట్టాను. వాడుకుంటం లేదు. వాడుకోండి, నాకోసం కాదు, కట్టకట్టుకొని తీసుకుపోవటం కోసం కాదు. మీరందరూ వినియోగించుకునేందు కోసమని పెట్టాను. కనుక "Through concentrated meditation the thought images in the minds of the other people become apparent". అది ఈ సూత్రానికి ఆయన ఇచ్చిన అర్థం. ఆయన thought images అన్నారు. మనం thought forms అన్నాము. thought form కీ, thought image కీ కొంచెం తేడా ఉంది. ఊహ, ఊహాచిత్రము వీటి మధ్య ఉంటుంది జ్వాల్‌కూల్‌గారు చెప్పిన thought image. Image అంటే ఊహాబింబము. తర్వాత వారు ఊహించని ద్రవ్యము వస్తువు. ప్రతి ఊహకీ ప్రతి వాడికీ ఇవన్నీ ఉంటాయి. అయితే యోగాభ్యాసం చేసినవాడు దీన్నే అందుకుంటాడు. మిగతావాట్లని అందుకోడు. అంటే thought reading చాతైన ఎవరైనా వస్తువు పోయిందని వస్తే వాడికి అనుమానం ఉన్నవాణ్ణే తల్చుకోమంటాడు. వాడేదో పేరు చెప్తాడు కాని, వాడెవడో, వాడి స్వభావం ఏమిటో, అనేటప్పటికి వాడు ఎవడో వాడి స్వభావం ఏమిటో, వీడెవడో వీడి స్వభావం ఏమిటో రాదు. ఆ పేరే వస్తుంది. యోగాభ్యాసం చేసిన వాడికి వీడెలాంటి వాడో ఆ రూపం (picture) వచ్చి వాడు తీసాడా? లేదా అనేటువంటిది స్పష్టంగా తెలుస్తుంది. ఇది మాత్రమే అందుతుందని చెబుతున్నాడు తర్వాత సూత్రంలో. ఇపుడు ఆ సూత్రానికి వస్తున్నాము.

ఈ యోగాభ్యాసం వస్తువులుపోతే ప్రశ్నలు, జాతకం, సాముద్రికం చెప్పటంకోసం కాదుకదా. గురువు దగ్గర కూర్చొని 12 ఏళ్ళు చదువుకుంటే వ్యాకరణమంతా నోటికి వస్తుందిగాని శాస్త్రం రాదు. Structure of the

cience రాదు కదా. ఉదాహరణకి యిక్కడ నించి చూస్తే మిమ్మల్ని ఏర్తుపడుతున్నాము. నాకంటే దగ్గరగా చీమ ఒకటి వచ్చి పాదం నించి శిరస్సు దాకా పాకుతోందనుకోండి, అది మిమ్మల్ని గుర్తుపడుతుందా? లేదు. ఎందుకని? ఏ రూపం లేదు దాని మనస్సులో. మీ ఒంటిమీద ఉన్న ముడతల ప్రతి ఆనమాలు ఉంది. అంతేకదా. నేను మిమ్మల్ని గుర్తుపడుతున్నాను. మీ ఒంటిమీద ఉన్న చీమ మీ చర్మంమీద ఉన్న ముడతని గుర్తుపడుతోంది. కనుక వ్యాకరణ శాస్త్రం చదవకుండా వ్యాకరణం 12 ఏళ్ళు చదువుకున్నటువంటి వాళ్ళు వ్యాకరణ శాస్త్రం అనేటువంటి ఆయన శరీరంమీద ఉన్న ముడతలనే చదువుతున్నారు కాని శాస్త్రం రాదు. అలాంటి పొరపాట్లు చేయకుండా ఉండేందు కోసమని చెప్పి, యిక్కడ వ్యాకరణశాస్త్రం దాని స్వరూపమేమిటి? దీన్నెందుకు బోధిస్తున్నారు? ఎలా బోధిస్తున్నారు? ఎక్కడ బోధిస్తున్నారు? అనేది మొదటి రెండు సూత్రాలు చదివేటప్పటికి ఆ రెండు సూత్రాలలో చిట్ట చివరిదాకా వ్యాకరణ శాస్త్రం ఏమి apply అవుతుందో, వీడికి తెలుస్తుంది. తరువాత మర్నాడు ఇంకో రెండు సూత్రాలు చదివేటప్పటికి ఈ నాలుగు సూత్రాలయొక్క వెలుగున్నూ మిగతా అన్ని సూత్రాల మీద పడుతుంది. చూసారా? ఒక స్విచ్ వేస్తే ఇంట్లో అన్నిలైట్లు వెలిగినట్లు తయారవుతుంది. వీడి మెదడు. Simultaneity of existence, అది సంయమము అంటే. ఆ సంయమము అనేటువంటి flood light పడేటప్పటికి వీడు ''తస్య భూమిషు వినియోగః'' దాన్ని భూములయందు వినియోగం చేయాలన్నాడు. భూములయందు వినియోగం చేయాలంటే అనేక లోకముల యందు అంటే వేదాంత శాస్త్రం, భాగవతం, రామాయణం, వ్యాకరణశాస్త్రం, తర్కశాస్త్రం, భక్తి సూత్రాలు, బ్రహ్మ సూత్రములు మొదలైనవి అన్నీ మనకి పెద్దలు ఎందుకు యిచ్చారో అట్లాంటి వాటికోసం ఉపయోగిస్తారు. అవి మన జీవితంలో సమన్వయం చేసుకుంటం కోసమని చెప్పి, ఇరవై నాలుగు గంటల్లోను మన జీవితం నడుస్తూంటే అదివరకు చేసిన పొరపాట్లు చేయకుండా ఉండటం కోసం యిది ఒక్కటే వినియోగంగాని, తెల్లవారి లేస్తే అరుగుమీద కూర్చొని ఊరికే వాడి మనస్సులో ఉన్నవి, వీడి మనస్సులో ఉన్నవి, చెప్పకుండా నేను కనిపెడతాను అనేటువంటి చచ్చు వ్యవహారం కోసం కాదు యివి. యింకా 20వ సూత్రం దగ్గరికి వస్తున్నారు చూడండి.

## 20. న చ తత్సాలమ్బనం తస్యావిషయీభూతత్వాత్।

చ = మరియు, తత్ = అది (పరచిత్త జ్ఞానము), న+ఆలంబనం = ఆలంబనముతో కూడియుండదు సుమా, తస్య = అతనికి (యోగికి), అవిషయీ భూతత్వాత్ = విషయము (లక్ష్యము) కాకపోవుట వలన.

ఇతరుల చిత్తమునందలి భావములే ధ్యానింపబడును గనుక ఆ భావములకు స్థానములైన బాహ్య వస్తువులను గూర్చి మాత్రము తెలియును. ఆకలిగా నున్నవానికి పరచిత్త జ్ఞానము కలిగినపుడు, ఆకలిగా నున్నాడనియు, తినగోరుచున్నాడని మాత్రమే తెలియును. ఏమి తినగోరుచున్నాడు? నున్నగునవి తెలియవు.)

**వివరణ :** పై సూత్రలములలో చెప్పిన పరచిత్త జ్ఞానము అంటే యితరుల మనస్సులో ఏమున్నదో అది తెలుసుకుంటం. అది 'న+సాలంబనం', ఆలంబనముతో కూడియుండదు సుమా.

'అవిషయీ భూతత్వాత్' విషయము అంటే లక్ష్యము. ఎదుటివాడి మనస్సులో ఏమున్నది అనేటువంటిది యోగాభ్యాసం చేసిన యోగికి లక్ష్యము కాకపోవుట వలన అది సాలంబనముగా వీడి దగ్గరికి రాదు. ఆలంబనముతో కూడిరాదు. ఆలంబనం అంటే ఏమిటి? ఒక పిల్లవాడికి వంటింట్లో బెల్లంముక్క చూపించారు. బెల్లంముక్క తిందామని కుతూహలం ఉన్నది. కుతూహలం కాక బెల్లంముక్క తిందామనే ఉద్దేశ్యం ఉన్నది. జాగ్రత్త! రెండూ వేరే వేరేగా గమనించండి. తిందామనే కుతూహలం వేరు. కుతూహలం ఉండకపోతే ఉద్దేశ్యం ఉన్నా మర్చిపోతారు. కుతూహలం ఉన్నపుడు ఉద్దేశ్యాన్ని మరిపించినా మళ్ళీ అదే పట్టుకుంటాడు. కొన్ని కొన్ని అభిప్రాయాలు అలాగ వారాల తరబడి, నెలల తరబడి ఎందుకు ఉంటాయి మన మనస్సులో? కొన్ని కొన్ని అభిప్రాయాలు వచ్చినట్లే వచ్చి వాటంతట అవే మాయమైపోయి కొన్నేళ్ళ తర్వాత మళ్ళీ గర్తు రాలేదేమిట్రా అనుకుంటాం ఇది కుతూహలము. తెలుగులో కుతి అంటారు. దీన్ని అభిప్రాయము, సంకల్పము అంటారు. పిల్లవాడికి ఇది ఉంటుంది. దీంతోనే వంటింట్లోకి పరిగెట్టి డబ్బా తీసుకొని

తినేస్తాడు. అట్లా కాకుండా పెద్దవాడున్నాడు అనుకోండి, ఫలానా ఆవిడని పెళ్ళి చేసుకుందా మనుకున్నా డనుకోండి. కుతూహలం ఉంటుంది. దానిక్రింద అభిప్రాయాలు కొన్ని లక్షలు ఉంటాయి. పిల్లవాడికి, పెద్దవాడికి తేడా అది. పిల్లవాడికి మహా ఉంటే బెల్లంముక్క తినాలనే ఒక అభిప్రాయం ఉంటుంది. ఇంకేం ఉండదు. పెద్దవాడికి మాత్రం మనం ఆవిడని వివాహం చేసుకుందాం అన్నపుడు ఆ కుతూహలంతో ఆవిడని వివాహం చేసుకుందామనే ఉద్దేశ్యం రావటము ఒక్కటే కాకుండా, ఇంకా అనేకమైన ఉద్దేశ్యాలు ఉంటాయి. తను అదివరకే వివాహం చేసుకుంది అని తెలిసింది అనుకోండి. అపుడు అయితే ఏమి? అనే భావం కూడ వస్తుంది. వస్తుందా? రాదా? ఆవిడకి పిల్లలున్నారు అనుకోండి. అయితే మాత్రం ఏమి? ఆ పిల్లల్ని నేను పోషించడం విశాల హృదయం కాదా? అంటే వీడికి తగినటువంటి లాజిక్ వీడు అల్లుకుంటాడు. బోల్డన్ని భావాలు, చెప్పకుండా గడ్డిమోపల్లే అల్లుకుంటాడు. తర్వాత ఏమౌతుంది అనేది వేరు. రాత్రిపూట అలా ఆలోచిస్తూ కూర్చుంటాడు. ఆవిడని నేను ఎందుకు వివాహము చేసుకోకూడదు. వివాహము అనే సంస్కారాన్ని పెద్దవాళ్ళెందుకు పెట్టారు. అనవసరంగా పెట్టారు లేదా ఇవన్నీ సామాన్యుల కోసం, మన బోటి గొప్పవాళ్ళ కోసంకాదు. అంటే ఇదొక్కటి అసలు కారణం, motive force. అలాగ రాత్రి పగలు వరిగడ్డి అల్లుకుంటాడు. Every one forms his own logic. యోగాభ్యాసం చేసేవాళ్ళకి వీటితో సంబంధం లేదు. ఎందుకంటే ఇది వదిలించుకొని కదా యోగాభ్యాసంలో పడ్డారు. అవికూడా మీకున్నట్లైతే యోగాభ్యాసం ఏమిటి? చిత్తవృత్తే ఉండదు. అసలు చిత్తవృత్తి అంటే ఇదే కదా పతంజలి చెప్పింది. యోగాభ్యాసంలోకి వచ్చాక జీవితం మొత్తంమీద ఒక్కటే ఉండటం వచ్చేటప్పటికి దాన్ని మీరు ఏకాగ్రత అంటారు. అంటే one direction for life. అది వచ్చేస్తుంది మీకు. అంటే ఏమిటి? పువ్వులాగ జీవితం తయారవుతుంది తమాషాగా. కనుక మీరు యోగాభ్యాసం చేస్తూంటే ఆ రెండవవాడు మీ ప్రక్కన కూర్చుంటే మీకు అందేది ఇదేగాని అది కాదన్నాడు. ఎందుచేత 'తస్య' అతనికి, ఆ యోగికి 'అవిషయీ భూతత్వాత్' ఇవి లక్ష్యములు కాకపోవుటచేత

వాటిని ఎపుడో వదిలేసాడు. ఇదిచేస్తే ఎలా ఉంటుంది? అదిచేస్తే ఎలా ఉంటుంది? అని ఉండదు. ఎపుడన్నా చేస్తే చేయటమేకాని, చేస్తే ఎలా ఉంటుంది అనే తేభ్యం మొహం ఉండదు. 'అహం కాశి గమిష్యామి' అట్లా ఉండదు. వెళ్తే కాశి వెళ్తాడు కాని, ఎపుడు వెడదాం, ఎలా వెళదాం అని ఉండదు. యోగాభ్యాసం చేసిన వాడికి వెళ్ళటం ఉంటుంది. తినాలంటే శుభ్రంగా తినటమే కాని తింటే అని ఏం ఉండదు. So solid man of action అయిపోయినాడు. వర్తమానంలో ఉంటున్నాడు. అలాంటపుడు న,చ,తత్, సాలంబనం. ఈ వీటితో ఆలంబనంతో కూడి మాత్రం ఉండదు సుమా. 'తత్' అంటే అది పరచిత్త జ్ఞానము. పరచిత్త జ్ఞానం ప్రక్కవాడి మనస్సులో ఉన్న పెంట అంతా వీడి మనస్సులోకి ఎక్కించుకోడు. వాడికి కావాలంటే సహాయం చేయటం కోసం వీడికి అందుతుంది. అదైనా ఎందుకు అందుతుంది? అవతలి వాడిని బాధల్లోంచి బయటికి తీయటానికి అందుతుంది. వీడికి ఫలితానికి సంబంధించిన ఉద్దేశ్యములు (motives) ఏం ఉండవు. ఈ సూత్రానికూ్కడ జ్వాల్‌కూల్ గారు చెప్పింది తీసుకుందాం. "As however the object of those thoughts is not apparent to the perceiver, He sees only the thought and not the object. His meditation excludes the tangible." అవతల వాడు కామబాధ అనుభవిస్తుంటే వీడికి ఆ విషయం తెలుస్తుందే కాని, వాటి వివరాల చెత్త ఉండదు. అనగా పరిణామము చెందుతున్న భాగం ఏదైతే ఉన్నదో దాన్ని వదిలేసి సన్యసించి చాల కాలమైంది వాడి మనస్సు. అన్నం తినటం అనుకుంటే తినటమే కాని, తిందామనుకుంటం ఉండదు. అన్నం రుచిగా ఉన్నపుడు అన్నం రుచి అనుభవించటమే కాని, కోర్టు విషయాలు మొదలైనవి మాట్లాడుకుంటం ఉండదు. ఏ పని చేస్తున్నాడో ఆ పనియందు ఉంటాడు. He lives in the present. అంచేత ఎంత తినాలో అంతే తింటాడుగాని, రుచి గురించి ఎక్కువ తినడు. ఖచ్చితంగా ఉండడం (precision) వచ్చేస్తుంది. అంచేత వీడు object లోకి వెళ్ళడు. conceivable లోకి వెళ్ళడు. అంటే భౌతిక ప్రపంచానికి సంబంధించిన వివరాలు అక్కర్లేదు. ఎదుటివాడి సంత అంతా పెట్టుకోడు.

## 21. కాయరూప సంయమాత్తద్గ్రాహ్యశక్తి స్తంభే చక్షుః ప్రకాశా సంప్రయోగేఽన్తర్ధానమ్।

కాయ = శరీరముయొక్క, రూప = రూపముయొక్క, సంయమాత్ = సంయమము తెలియుట వలన, తద్గ్రాహ్య = ఆ రూపమును గ్రహించునట్టి, శక్తే = శక్తిని, స్తంభే = స్తంభింపచేయగా, చక్షుః = కంటికిన్నీ, ప్రకాశా = ప్రకాశానికి (మధ్య), అసంప్రయోగే = సంప్రయోగం లేకపోవుటచేత, అంతర్ధానమ్ = మాయమగుట జరుగును.

**దేహము, దాని రూపము అనువాని భేదముపై సంయమము చేయుటవలన ఆ రూపమును గ్రహించు నేత్రశక్తిని స్తంభింప చేయగల్గును. అపుడు తా నితరుల కన్నులకు కనిపింపకుండుట సిద్ధించును.**

**వివరణ :** కాయం అంటే శరీరం. తన శరీరంమీద తనదనే ఉద్దేశ్యం ఉంటుంది కదా ప్రతివాళ్ళకి. ఎదుటివాడి శరీరం మీదైతే ఏం ఉండదు. అలా కాకుండా ఎదుటివాడి శరీరమైనా, తన శరీరమైనా ఒక రకమైన ప్రాముఖ్యతే ఉంటుంది. ఒక రకమైన అభిప్రాయమే ఉంటుంది. ఒక రకమైన ఉద్దేశ్యమే ఉంటుంది. శరీరమున్నా దానియొక్క రూపము రెండూ ఒకటా? రెండూ రెండా? ఇక్కడ ఒక చిన్న పేచీ ఉంది. రేగడి మట్టిముద్దున్నా, దాంతో చేయబడిన గాంధీ బొమ్మ ఒకటేనా? రేగడి మట్టివేరు. రేగడి మట్టిని గాంధీ బొమ్మగా చేసాడు ఆర్టిస్టు. అలాగే శరీరం వేరు దాని రూపం వేరు. శరీరం అంటే అందులో ఉన్న వివిధ జీవరసాలు (bio-chemistry) అందులో ఉన్న ముద్ద. రూపం అంటే out lines. కన్ను, ముక్కు, చెవి, ఫొటోలో ఏం దిగుతాయో అవి. శరీర నిర్మాణశాస్త్ర ప్రకారం ఏం ఉంటుందో అది కాయము. అంటే తనకి creative notions ఉండవు. చేసుకోవాలి ఎక్కడికక్కడ. ప్రశ్నవేస్తే జవాబు వస్తుంది. ఎవణ్ణీ అడగక్కర్లేదు. ఏ పుస్తకాలు చదవక్కర్లేదు. తప్పుడు భావాలు, మంచి భావాలు ఉంటాయి కదా. తప్పు అభిప్రాయాలు పోయి, నీలో మంచి అభిప్రాయలతో సర్దుబాటు అవుతాయి. యిదివరకు తెలిసిన విషయాలే సరైన పద్ధతిలో తయారౌతాయి మనస్సులో ఉన్నటువంటివి. ''కాయరూప సంయమాత్'' కాయము, రూపముమీద సంయమము చేయుట. అంటే ధారణ, ధ్యాన, సమాధులు ఈ శరీరం మీద,

ిరరూపం మీద ప్రసరణము చేసుకుంటంవల్ల ఈ రెండూ ఒకటి కాదు
నే అభిప్రాయాల్ని మనస్సులో పెట్టుకొని మీలో ఉన్న సంయమము
నేదాన్ని (simultaneous existence of consciousness) project
సినట్లైతే, అంటే సంయమముతో దీన్ని భావన చేసినట్లైతే, తద్గ్రాహ్య,
ంటే ఆ రూపమును గ్రహించునట్టి శక్తి 'స్తంభే' మీరు స్తంభింప చేస్తారు
నస్సులో. అంటే మీ శరీరంయొక్క ఆకారం వేరు, మీ శరీరం వేరు,
నేటువంటి దానిమీద ధ్యానించటంవల్ల ఆ రూపమును గ్రహించునట్టి శక్తిని
ంభింపచేస్తారు. అంటే శరీర ఆకారానికి కంటికి మధ్య ఉన్నటువంటి
ంకుని స్తంభింపచేస్తారు. కంటికి వెలుగుకి మధ్య cut off వస్తుంది. అది
ానసికమైన cut off. రూళ్ళకర్రను దీపంలో ఉన్న వెలుగులో చూస్తాం.
ని అప్పుడు దీపంలో ఉన్న వెలుగుకాక, చూద్దామనే అభిప్రాయము పేరు
లుగు. అది ఉంటేనే కదా కంటితో చూసేది. లేకపోతే కళ్ళు తెరచుకొని
న్నా అక్కడ గోడ ఉందని తెలీదు. అదీ అసలు వెలుగంటే. దీన్నే
్వాలాకూలుడు mental light అన్నారు. Mental movement అని నిన్న
ప్పారు కదా. Movement in the mental plane ని mental light
న్నాడు. మనం చూచేది optic light. ఈ రెండింటికీ తేడా 21వ శతాబ్దం
ధ్యలోకి వెడితేగాని తెలియదు ఫిజిక్స్ వారికి. వాళ్ళకోసం చూడకుండా
ురు ముందు కెళ్ళండి అన్నారు జ్వాల్‌కూల్. యోగాభ్యాసం ముఖ్యం. కనుక
'తద్గ్రాహ్యశక్తి స్తంభే'' ఆ రూపమును గ్రహింప దగినట్టి శక్తిని స్తంభింపచేయగా
చక్షుప్రకాశం' కంటికిన్నీ ప్రకాశానికి మధ్య ''అసంప్రయోగే'' సంయోగం
పోతుంది. అంటే చూద్దామనే అభిప్రాయానికిన్నీ చూసే కంటికి మధ్యన
ఉన్నటువంటి లింకు తెగుతుంది. ఎదుటివాడికి తెగితే ఏమవుతుంది.
'అంతర్ధానమ్'' మీరు నిల్చొని ఉండికూడ కనిపించరు. మాయమగుట
అంటే మాయమవ్వడం. వాడు మనం ఏదో మాట్లాడుకుంటున్నంత సేపు
టార్చిలైటు మన కళ్ళ ఎదురుగుండా దిమ్మల్లే ఉంది. కాని కంటికి లేదు.
అంటే ఈ టార్చిలైటు యిందాకటి నించి ఎంత మాయమయ్యిందో,
ఎదురుగుండా ఉండికూడ కనిపించకుండా, ఎదుట ఉండేవాడు కూడ అంతే
మాయమవుతాడు యోగాభ్యాసంలో. అంతర్ధానం అంటే అర్థం అది.

ఏమవుతాయండి వాడి physical features అంటే, ఏమీ అవ్వవు. అదే వాడు చెప్పింది. బ్లావెట్స్కీ కూడ సరిగ్గా అదే చెప్పింది. Lesser writings and other writtings of Blavetsky అనే గ్రంథంలో. కూర్చుని నేను కనపించను చూడండి అంది. కనిపించలేదు. మద్రాసులో అడయారులో అందరూ చూస్తుండగ. లేచాక నీ శరీరం ఏమౌతుంది కనిపించనపుడు అని అడిగారు వాళ్ళంతా. నా శరీరం ఏమవ్వటం కాదు, నీ బుద్ధి గడ్డిమేస్తుంది అంది. కుర్చీలో కూర్చొని బాగా ఆలోచిస్తూండగ ఈ కుర్చీ కనిపిస్తుందేమిటి? చాక్‌పీసు పుచ్చుకొని బాగా ఆలోచిస్తూండగ ఈ చాక్‌పీసు కనిపిస్తుందేమిటి? శరీరానికీ, రూపానికీ సంయమముచేస్తే కూడ అంతే. అంటే దానిమీద ధారణ, ధ్యాన సమాధులు కలిపినటువంటి స్థితిని ప్రక్షేపించినట్లైతే (project) 'తద్‌గ్రాహ్యశక్తి స్తంభే'' దాన్ని గ్రహించదగినట్టి శక్తి స్తంభింప చేయగా, ఎదుటివాడి మనస్సు నీ మీదకి పోదు. అంతే. అయితే దీని విలోమం (converse) మనందరికి అనుభవం. అందరికంటే అప్పులున్న వాళ్ళకి బాగా అనుభవం. బజారమ్మట వెడుతూ ఉంటాం. మనం ఎవడికో పదో, పాతికో, ఏభైయ్యో యివ్వాల్సిన వాడుంటాడు. వాడికి కిందటి నెల యిస్తామని చెప్పాం. యింకా యివ్వలేదు. మనం వెడుతూంటే అటునించి వాడు వస్తూ ఉంటాడు. అపుడు అయ్యో! వీడి దుంపతెగ! వీడు చూస్తాడేమో మనల్ని అనే భావం మనకి రాగానే వెంటనే వాణ్ణి చూడమని మనం బుర్రలో స్ఫురింప (suggest) చేస్తాం. అందుకని వాడు ఎటో చూస్తున్నవాడు కాస్త, టక్‌మని మనవైపు చూస్తాడు. అంటే ప్రతి ఇద్దరి మధ్యాకూడ ఒక automatic telepathy వర్తిస్తూ ఉంటుంది. అది మనం గమనించుకోము. ఎప్పుడైతే వీడికి వాడు మనల్ని చూస్తాడేమో అని భయంవేసిందో, ఇది వాడికి వెంటనే స్ఫురణ (suggestion) ఇస్తుంది, వాణ్ణి చూడు అని. అలా కాకుండా అవతలి వాడిని చూసికూడ ఇక్కడ మనస్సు గమనించకుండా (notice) వీడు వెళ్ళిపోతున్నాడనుకోండి. ఎదురుగుండా ఎద్దంత మనిషి వెళ్ళిపోతున్నా వాడికి కనపడడు. చూస్తూనే వెళ్ళిపోతాడు. దేన్నిబట్టి ఉంటుంది. వీడు వాణ్ణి రేపెట్టటాన్ని బట్టి ఉంటుంది. వీడు వాడికి భావాన్ని ఎక్కించటాన్ని బట్టి ఉంటుంది. నన్ను చూస్తాడేమో, నన్ను చూస్తాడేమో అంటే చూడు, చూడు అని అర్థం. ఇది తెలియాలి, అంటే గేరు మార్చటాలు తెలియాలి. తెలిసి

కూడ చిల్లర విషయాల (mean motives) కోసం వాడటం కాకుండా, ఉండటం తెలియాలి. ఎందుకంటే దీనికంటే పెద్ద సత్యం అది. అది తెలియాలి. అదీ ఈ సూత్రంలో చెప్పినటువంటిది. అప్పుడు 'చక్షు ప్రకాశం' అంటే కంటికి, ప్రకాశానికి మధ్యన అంటే కంటికి, చూడాలనే అభిప్రాయానికి మధ్యన 'అసంయోగే cut off వస్తుంది. దానివల్ల అవతలివాడికి 'అంతర్ధానమ్' మాయమవటం వస్తుంది. అక్కడిదాకా ఎందుకు? సినిమాకి వెళ్ళి ఫలానా సీట్లో ఎవరూ కూర్చోకూడదు, మనకి అసౌకర్యంగా ఉంటుంది అనే భావం వదిలేయండి. ఆ సీటు ప్రక్కకి ఎవ్వరూ పోరు. కాని అలాంటివి చేయకూడదు. వాడు ప్రక్కసీటుకి పోవాలి. అంతర్ధానమ్ అంటే అది. ఆటోమేటిక్‌గా జరుగుతుంది. వాడికి మనకి మనస్సుని శృతి (tuning) చేసుకోవడంలో జరుగుతుంది.

''కాయరూప సంయమాత్'' శరీరమునకు, రూపానికి ఉన్నటువంటి భేదం మనస్సుకి తెలిసి, దానిమీద ధారణ, ధ్యాన, సమాధుల్ని గనుక సంయమము చేస్తే, శరీరమున్నూ, శరీర ఆకారమున్నూ ఒకటే అనే అజ్ఞానం పోవాలి. శరీరము నశించాక కూడ ఆకారం ఉంటుంది, అది తెలియాలి. కలలో మనకి మనం కనిపిస్తాం. అది ఆకారం, శరీరం కాదు. మన స్నేహితులు కనిపిస్తారు. ఆ కనిపించేది ఆకారంగాని శరీరాలు కావు. వాళ్ళు శరీరాలతో మనని ఎక్కి తొక్కితే ఏం మిగలం. మన మీంచి ఒక లారీ పోయినట్లుగా వస్తుంది కల. అది లారీ ఆకారంగాని, లారీకాదు. కనుక ఆకారానికి, వస్తువుకీ భేదం తెలియకుండా కొట్టుకుంటూ ఉంటాం. కలలోను మేలుకొని ఉన్నపుడూ కూడ. శరీరమంటే శరీరము, ఆకారము రెండూ ఉంటాయని తెలీదు మనకి. శరీరం అంటే అందులో ఉన్నటువంటి మట్టిముద్ద, రస, రక్త, మాంస, మజ్జ, శుక్రకణాలు ఆకారమంటే. శరీరం పుట్టకమునుపు నుంచి శుక్రకణములో ఉంటుంది. తండ్రి శుక్రంలోకి వస్తుంది. ముందు ఏడురోజులు తండ్రియొక్క భ్రూమధ్యంలో ఉంటుంది. అక్కడనించి నాసారంధ్రంలోంచి లోపలికి వెళ్ళి, అక్కడ ఉన్నటువంటి బ్రహ్మగ్రంథి, విష్ణుగ్రంథి, రుద్రగ్రంథి, ఇంద్రగ్రంథులద్వారా వెన్నెముక లోపలనుంచి సుషుమ్న అనే నాడి ఉంటుంది. దానికి ఎడమప్రక్కన ఇడ అనే నాడి ఉంటుంది దీనిద్వారా దిగువకి వెడుతుంది. ఏది? జీవుడు. జీవుడంటే ఎట్లా ఉంటాడు? ఆకారంగా ఉంటాడు. ఇంకేం

ఉండదు. మఱ్ఱిగింజలో మఱ్ఱిచెట్టు ఎలా ఉంటుంది? రాబోయే ఆకారంగా ఉంటుంది. ఇక్కడ ఆధునిక శాస్త్రానికి (Modern Science) ఏమీ తెలియని విషయం. పాశ్చాత్యుల దగ్గర మనం నేర్చుకోకూడని విషయాలు. ఇది జాగ్రత్తగా నేర్చుకొని దీనిమీద పాశ్చాత్యులు చెప్పినవి ఎన్నైనా నేర్చుకోవచ్చు. లేకపోతే అయోమయం అయిపోతుంది. అంటే ఆకారం వేరు, వస్తువు వేరు అనే సంగతి పుటంపెట్టినా పాశ్చాత్యులకి తెలీదు. అంటే వస్తువుకి ఆకారం ఉందనుకుంటాడు గాని సృష్టిలో ఆకారంలోకి వస్తువు పోయబడుతోందని తెలీదు. వస్తువుకి ఆకారం ఉన్నట్లైతే అణువులు (Atoms) ఎలా కట్టుకుంటూ ఉంటాయి. అందుచేతనే ఆధునిక శాస్త్రం (Modern Science) లో ఇంతవరకు జవాబు లేదు. అణువులు (Atoms) ఎక్కడనించి వస్తున్నాయి అనే దానికి అజ్ఞానాంధకారం తప్ప, ఇపుడు most developed science లో కూడ Atoms యొక్క మూలం (origin) ఏమిటండీ? అంటే తెలియదు (not known) ఈ కోటానుకోట్లు అయినటువంటి పరమాణువుల యొక్క ఆకారములన్నీ శాశ్వతములని చెప్పి ప్రాచీన శాస్త్రజ్ఞులు చెప్పారు. వాట్లల్లోకి చోటుకాస్త ద్రవ్యత్వాన్ని పొంది అంటే నీళ్ళు మంచుగడ్డ కట్టుకున్నట్లుగా చోటు పదార్థము అనేటువంటి స్థితిని పొంది, పరమాణువుల్లోకి పోసుకుంటుంది. అపుడు వాటిని పరమాణువులు అంటాం. ఆ స్థితి యింకా ఇపుడున్నటువంటి ఫిజిక్స్‌లోకి వాట్లలోకి రాలేదు. 4,5 శతాబ్దాలు తర్వాత చెప్పుకుంటారు. యివన్నీ కూడ లక్షల సంవత్సరాల పాతవి. మళ్ళీ మర్చిపోయారు. మళ్ళీ చెప్పుకుంటే పాత విషయాలే కాని క్రొత్త విషయాలు కావవి. అయితే modern mind కి క్రొత్త విషయాలు అయ్యి ఉండవచ్చు. అంచేత ఎక్కడనుంచి వస్తున్నాయో తెలీదు modern physics కి. అందులో న్యూక్లియర్ ఫిజిక్స్‌కి అసలు ఏం తెలీదు. కనుక కాయము, కాయముయొక్క రూపము తేడా తెలియటం అనేది వీటన్నిటికిన్నీ పునాది (base) ఉంటే తెలుస్తుంది. పతంజలిగాని, భగవద్గీత రాసినటువంటి వాడు గాని పరమాణువులు చోటులోంచి ఎలా పుడుతున్నాయో తెలియటం చెబితే తప్ప, కాయము, కాయ రూపము వేరు వేరు అనేటువంటి సంగతి బోధపడదు. అట్లాగే ఒక పరమాణువు ఆకారం శాశ్వతంగా ఉండి, ఆ పరమాణువు జీవికి మేల్కొన్నట్లుగా లేస్తుంది పదార్థము (matter). అట్లాంటిది కొన్ని

పరమాణువులు కలిసి ఒక molecule అవుతుంది. కాని molecules శాశ్వతంగా ఉంటాయి. అవి తయారై ఈ పరమాణువులతో నింపబడి, మేల్కొంటాయి. ఈ సమస్తం మేల్కొనటంగాని, క్రొత్తగా పుట్టటంగాని అబద్ధం. అది ఈ సృష్టి క్రమంలో పురాణములు, వేదములు, ఇతిహాసములు మనం చదువుకుంటే తెలిసే విషయమే. బైబిలు కూడ సొంతంగా చదువుకుంటే మనకి తెలిసే విషయం అది. భగవద్గీత కూడ హిందువులు చెపితే వింటే మనకేం అర్థం అవ్వదు. సొంతంగా ఈ మాస్టర్స్ ఉంటారు చూడండి వాళ్ళ దగ్గర చెప్పుకోవాలి. వాళ్ళు లక్షల సంవత్సరాల నించి అలా చెబుతూ వస్తున్నారు దానర్థం. సోమకాసురుడు వేదాల్ని ఎత్తుకుపోయినట్లుగా మతాలవాళ్ళు పెడర్థాలు చెబుతూంటే మళ్ళీ కొన్నాళ్ళు పోతూంటాయి. తర్వాత మళ్ళీ వస్తూంటాయి. కనుక 'కాయరూప సంయమాత్' కాయముయొక్క రూపము నందు సంయమంచేసి, శరీరం కాకుండా శరీర రూపంమీద కనుక మీరు ధ్యానం చేయగలిగి నట్లైతే, అంటే ఏది నీలో శాశ్వతమైన భాగమో, దానిమీద ధ్యానంచేస్తే దొరుకుతుంది. ఏది తండ్రి దగ్గరనించి తల్లి గర్భంలో వచ్చిపడుతూన్నదో, శుక్రకణంలో ఏది వచ్చి పడితే శుక్రకణం ఫలదీకరణం (fertilize) చేస్తుందో, అది లేకపోతే ఎన్ని లక్షల శుక్రకణాలైనా వృథాయే. అది spermotisa గా ఉన్నాయని చెబుతారు. కాని పిల్లలు పుట్టరు. non-motile, not present అని చెబితే అది వేరు. కాని కొన్ని కేసులలో పరీక్షచేస్తే శుక్రకణములు ఉన్నాయి, కదుల్తున్నాయి, బ్రతికే ఉన్నాయి, కాని ఏమిలాభం? అవి గర్భంలోకి వహించుకు తీసుకురావటానికి జీవి రావటంలేదు. శరీరంలోకి దిగటం లేదు. ఎపుడు దిగుతాడు? ఎవడి శరీరంలో శుక్రకణాలున్నాయో వాటికి తగినటువంటి జీవివచ్చి వీడికి వాడికిన్నీ, పూర్వకర్మానుభవము ననుసరించి మరచెంబుకి, మరచెంబు మూతకి ఉన్న సంబంధం ఏర్పాటైతే దిగుతాడు. లేకపోతే దిగేదేమీ లేదు. ఒక 30 ఏళ్ళో, 40 ఏళ్ళో, 50 ఏళ్ళో సంసారంచేసి అలా చచ్చిపోతారు. శరీరంలో ధాతువులు తక్కువైకాదు. ప్రపంచంలో కరువొచ్చికాదు. డాక్టర్లు కరువొచ్చి కాదు. కొందరికి వద్దన్నా అలాగ చెరువుగట్టు మీద వరి మొక్కలు మొలిచినట్లు పుట్టేస్తూంటారు. ఆ శృతి (tuning) అలా కుదురుతుంది. అలా రేగడి నేలలో వేరుశనగ మొక్కల కాయలుంటాయే అలా పుటతారు ఒక్కొక్క కొంపలో గుత్తులు గుత్తులుగా.

అంటే అలా పుట్టటం గొప్పకాదు. అలా పుట్టకపోవటం గొప్పకాదు. కొన్నాళ్ళు అదిపుట్టటం గొప్ప అనుకున్నారు. కొన్నాళ్ళు అది తగ్గించుకుంటం గొప్ప అనుకున్నారు. ఏదో ఆ టైమునిబట్టి వాళ్ళ సాంఘిక పరిస్థితులను బట్టి నడుస్తూ ఉండేటువంటి వాళ్ళం గనుక దాన్నిబట్టి కుటుంబ నియంత్రణ కావాలా? ఎక్కువమంది పిల్లలు కావాలా? అనేది ఆయా శతాబ్దాల్లో అటునించి ఇటు, ఇటునించి అటు మారుతూ ఉంటుంది. ఇంతకంటే పెద్దగా శాశ్వత విలువలు (eternal values) ఏమీలేవు. కొడుకుల్లేరని ఏడుస్తారు. పిల్లలు లేరని ఏడుస్తారు. ''కొడుకుల్ గల్గిరే కౌరవేశ్వరు నకున్'' అన్నాడు ధూర్జటి. ధృతరాష్ట్రుడు కనలేదా వందమందిని. అందరూ శుభ్రంగా గచ్చు చేసినట్లు వెళ్ళిపోయారన్నాడు. అందుకని ఉన్నారంటేనూ గొప్పకాదు, లేరంటేనూ గొప్పకాదు. పూర్వకర్మని బట్టి వీడు వాహికగా పనికొస్తాడంటే వీడిద్వారా పిల్లల్ని పంపుతారు. లేకపోతే పంపరన్నాడు. అంటే ఒక డ్రామా స్టేజి ఉంటుంది. దానికి చేర్చి ప్రక్కన గ్రీన్ రూము ఉంటుంది. అక్కడ వేషాలేసి, మీసాలు పెట్టి యముడని, నెమలికన్ను పెట్టి కృష్ణుడని పంపిస్తూ ఉంటారు. కొన్నాళ్ళైన తర్వాత అక్కడ నాటకాల కంపెనీ తీసేసారనుకోండి, ఆ మొత్తం అద్దెకిచ్చారనుకోండి. ఆ ప్రక్కది యింకా గ్రీన్‌రూమ్ అంటే ఎట్లాగ. మొత్తం గోదాము చేసారు. అక్కడనించి రారింక. అలాగ నాటకాల కంపెనీ గ్రీన్‌రూముతో సహా అద్దెకిస్తే ఏమవుతుందో, అలాంటివాళ్ళు సంసారంచేసినా అంతే. They are not allowed to reproduce. ప్రపంచంలో ఎవళ్ళద్వారా వస్తే ఆ జన్మరోగులు ఎక్కువౌతారో, వాళ్ళకి సంతానం లేకుండా ఆగిపోతుంది. ప్రకృతి చేస్తుంది. మిగతా జాతి అంతా నాశనం అయిపోకుండా ఉండటానికి క్షయరోగులు, కుష్టురోగులు, మానసిక వ్యాధులు ఉన్నటువంటి వాళ్ళు, అణచిపెట్టబడిన గనోరియా, సిఫలిస్, సోరా ఇట్లాంటి వ్యాధు లున్నటువంటి వాళ్ళను ఆరు తరాల వరకు ప్రకృతి చూస్తుంది. అంటే వీళ్ళు నయం చేసుకుంటారేమో, ఏదన్నా సరైనటువంటి ఆహారము, పానీయము, నిద్ర, శ్రమ, విశ్రాంతి, తర్వాత స్త్రీ పురుష సంబంధము వీట్లల్లో పరిశుద్ధి, ఏమన్నా నియమంతో ఉంటారా, బాగుపడతారా అనిచెప్పి. బాగుపడకపోతే ఆరవతరం తర్వాత ''సప్తమే పురుషాన్తేతు కర్తుర్ మూలాని గృన్తతి'' "There is no seventh generation అన్నాడు. మొత్తం ఇంతమందీ కలిసి

వెళ్ళిపోతారన్నాడు. ఇది ప్రకృతిలో ఆటోమేటిక్‌గా జరుగుతుంది. సామాన్య సంక్షేమం ఉండద్గా ప్రకృతికి. వీటన్నిటిని అనుసరించి ఆ చివరి క్షణంలోకి వాడు దిగటమున్నూ, ఆ దిగేవాడు ఏ రూపంలో ఉంటాడు? ఏ ఆకారంగా ఉంటాడు? ఇంకేం ఉండదు. మఱ్ఱి గింజలో మఱ్ఱిచెట్టులాగ ఉంటాడు. దాన్ని గుర్తు చెప్పటం కోసమే మనకి యిప్పటికి క్రీస్తుకు పూర్వము 12,000 సం॥ల క్రిందటి మాట. ఈజిప్టు దేశంలో ఉన్నటువంటి శాస్త్రజ్ఞుడు ఒక బొమ్మ యిచ్చాడు. అంటే తండ్రి శుక్రకణంలోకి జీవుడు దిగటానికి మార్కు-(symbol) కింద అంటే ఆకారం తప్ప యింకేం ఉండదు. చేతులు, కాళ్ళు, తల అన్నట్లు అది యిచ్చారు. తరువాత ఏదో జ్యోతిషం (astrology) లోకి వచ్చాక దానిని కొంచెం క్రిందకి దింపి శుక్రుడు, శుక్ర కణానికి సంబంధించినవాడు అని symbol చేస్తున్నారు. ఎవడికి తోచినది వాళ్ళు చేసుకుంటున్నారు. దానికేముంది. కానీ శుక్రుడు symbol చేసాడు. ఈజిప్టు భాషలో దీనికి 'అలేక్' అని పేరు, అనగా జీవుడు దిగివచ్చేటు వంటివాడు అని. వెల్లకిలా పడుకుంటాట్ట, అంటే శరీరం వదిలాక రంగనాయకుల వారిలా శరీరంలో ఉన్నపుడు వెంకటేశ్వర స్వామిలా. రంగనాయకుల వారిని ఏమంటారు? అనంతశయనం అంటే ఆద్యంతాలకి అవతల ఉన్నటువంటి శయనం అది. అంటే సృష్టికి అవతల ఉన్నటువంటి స్థితి (existence) ఏది? Horijontal గా ఉన్నది. vertical గా వచ్చేటప్పటికి శరీరంలోకి దిగాడు. ఇపుడు దిగి వచ్చేటప్పటికి దేవుడు చనిపోయాడని చెప్పి చుట్టూ తిరిగి ఏడుస్తారు ఈజిప్టువాళ్ళు. అక్కడ ఒక పిట్టబొమ్మ ఉంటుంది. ఆ పిట్టకి మొహం, జుట్టు, తలకాయ మన మనుష్యుల ఆడదిలాగ ఉంటుంది. ఒళ్ళంతాను పక్షిలాగ ఉంటుంది. అది దీనిచుట్టూ తిరుగుతుంది అన్నమాట. ఆరుమాట్లు తిరిగి ఏడవమాటు తిరిగేటప్పటికి ఇవతలకి వస్తుంది. అంటే ఏమిటి? వీడు పూర్వకర్మచేత తండ్రిలోకి దిగటం, అక్కడినించి తల్లిగర్భంలోకి రావటం, ఇదంతా ఒకపిట్ట తిరిగేటువంటి ప్రయాణంలాగ ఏర్పాటు చేసారు. ఇవన్నీ కూడ ప్రపంచంలో అన్ని జాతుల్లోను ఉన్నది. క్రైస్తవమతం వచ్చేటప్పటికి ఈ వెనుక ఉన్న శాస్త్రం తుడిచిపెట్టుకు పోయింది. ఎందుకంటే అవన్నీ ఏం లేవు, అంతకు ముందు ఉన్నటువంటివన్నీ విగ్రహారాధన, పిశాచారాధన, పాపులు మొదలైనటు వంటివి వచ్చాయన్నారు. మన కర్థం కానిదల్లా చేతబడి

అన్నట్లు! కాని యివి వేల సంవత్సరాలు, లక్షల సంవత్సరాల క్రిందటి కథలు. కనుక వాడు శరీరంలోకి 'ఇడ' అనే నాడిద్వారా ఎడమప్రక్క నించి దిగుతాడు. వాడు శుక్రకణంలోకి దిగినపుడు ఆ శుక్రకణం మాత్రమే గర్భధారణం చేస్తుంది. మిగిలినటువంటి ఈ లక్షలన్నీ కూడ వ్యర్థమే. కాని దీని కోసమే మిగిలినవన్నీ కూడ నిర్మాణం చేయబడ్డాయి. అందుచేత దీన్ని ఏమంటారు? రూపము. ప్రతి వస్తువుకి రూపం ఉంటుంది. బియ్యపుగింజకి బియ్యపుగింజ రూపం. మట్టిగింజకి మట్టిగింజ రూపం. అలాగ మీకు రూపం తెలుస్తుంది. ధ్యానంలో దానియందు ధారణపెడితే ధారణ, ధ్యాన, సమాధులు అనేటువంటి సంయమము పెట్టినపుడు కాయరూప సంయమంవల్ల ''తద్గ్రాహ్యాశక్తి స్తంభే'' దానిని గ్రహించేటువంటి శక్తి ఎదుటివాడి కంటి దగ్గర ఉంటుంది. దానిని మీరు స్తంభింప చేయగలుగుతారు. అంటే చూస్తున్నాడు అంటే మనస్సుతో చూస్తున్నాడు. కంటితో చూడటంలేదు. అందుకని మనస్సుని మీరు అదుపు చేసేటపుడు వాడి కన్ను యింక చూడదు. కళ్ళు పత్తికాయలల్లే తెరుచుకొని ఉన్నా ఏం చూడదు. యింతసేపటినించి కళ్ళు తెరుచుకునే ఉన్నాం యిక్కడున్న ఆ గుంజ కనిపించడంలేదు. లెక్చరు వింటున్నాం కనుక. పత్తికాయలల్లే కళ్ళు తెరచుకొని ఉన్నప్పటికి కనపించదు. గ్రాహ్యాశక్తి స్తంభనం జరిగింది. అట్లు జరిగితే ''చక్షుః ప్రకాశ అసంప్రయోగే'' మనస్సులోంచి వచ్చే ప్రకాశానికిన్నీ, కంటికిన్నీ, సంప్రయోగం లేకపోవటంచేత ఎదుట నిల్చున్నటువంటి వాడు మాయమైపోతాడు ఈ కంటికి అన్నాడు. అసలు మాయమవ్వడు. కంటికి మాయం అవుతాడు. కంటికి సంబంధించినది చెప్పాడు. ఈ చెప్పబోయే సూత్రంలో ఈ కంటికి సంబంధించినది అంతా మిగతా శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలన్నింటికీ కూడ అంతే సంబంధించినది. అలాగే సంయమం చేయాలని చెబుతున్నారు.

## 22. ఏతేన శబ్దాద్యన్తర్ధానముక్తం।

ఏతేన = దీనిచేత; శబ్దాది = శబ్దము మొదలగు వానియొక్క; అంతర్ధానమ్ = మాయమగుట; ఉక్తం = చెప్పబడినది.

**దీనివలన శబ్దము, స్పర్శ, రుచి, వాసన మొదలగు వాని అంతర్ధానము కూడ చెప్పబడినట్లే.**

**వివరణ :** 'ఏతేన' అంటే దీనిచేత అంటే పైన చెప్పబడిన విషయము చేత. పైన రూపాన్ని గురించి చెప్పారు. శబ్దము, స్పర్శము, రసము, గంధము అనే నాలుగింటికి కూడ రూపాలుంటాయి. శబ్దము, శబ్దరూపము, స్పర్శ, స్పర్శరూపము, గంధము, గంధరూపము. రసము దాని రూపము. దీనివలన శబ్దము మొదలైనటువంటి వానియొక్క 'అంతర్ధానమ్' మాయమగుట కూడ 'ఉక్తం' చెప్పబడినది. కంటికి రూపము ఎలాగో శబ్దమునకు శబ్దరూపము. తేడా ఏమిటి? మనం కంఠంతో చేసేదేమిటి? శబ్దము. అంతేనా? కాదు. శబ్దము యొక్క రూపము అంటే మనం శబ్దం అని చెప్పేదంతా శబ్ద తరంగములే (sound vibrations) గాని శబ్దం కాదు. మనం స్పందన (vibration) చేయకముందు అసలు శబ్దం ఎక్కడ వుంటుంది? చోటులో వుంటుంది. దాన్నే ఆకాశమని అంటారు. దాన్నే పైథాగరస్ the school of sound అన్నారు. కొద్ది కొద్దిగా ఇపుడిపుడే న్యూక్లియర్ ఫిజిక్స్‌వాళ్ళు electro magnetic fields అనే పేరుతో అక్కడేవో వున్నాయని దూరం నించి కళ్ళు నులుపుకుంటూ చూస్తున్నారు. మృగతృష్ణలాగ వున్నాయి. మనకి E.M.F అనే పేరేగాని, electro magnetic fields మీద application ఏం ఉంటుంది? ఎక్కడన్నా ఫిజిక్స్‌లో ఉందా? ఎలక్ట్రానిక్స్‌లో ఒక వెయ్యిలో లక్షోవంతు application వస్తే మనం ఎరిగి ఉన్న ఎలక్ట్రానిక్స్ శాస్త్రమంతా అందులోంచి వచ్చింది. మిగిలిన భాగమంతా ఎందుకో కూడ యింకా మనకి తెలియనటువంటి స్థితిలో వున్నాం. కనుక శబ్దం అంటే the content of the space అని అనవచ్చు. ఇప్పటికీ కూడ 'content of space' ఏమిటి శూన్యము (vaccume) అని చెప్పేవాళ్ళే ఉన్నారు. ఎవరి దగ్గరికి వెళ్ళినా space లో ఏముంటుందంటే

perfect vaccume అంటాడు. Space లో vaccume ఉండదు. ఏముంటుంది? ''పూర్ణమిదః, పూర్ణమిదం'' శూన్యంకాదు పూర్ణం. చూచేవాడి బుర్రలో శూన్యం ఉంటే అక్కడ శూన్యం ఉన్నట్టు కన్పిస్తుంది. ఇందులో పూర్ణం ఉంటే అక్కడ పూర్ణం వుంటుందన్నాడు. జాగ్రత్త! కనుక the content of the space దాన్నే ఆకాశం అన్నారు. ఆకాశం అంటే చోటు కాదు. చోటులో వున్నదాన్ని ఆకాశము అంటారు. 'ఆ' కాశః అంటే అనంతాత్ ప్రకాశః అన్ని ప్రక్కల ప్రకాశిస్తూ ఉన్నటువంటిది. దాన్ని కదిలిస్తే వచ్చేదే మనం ఎరిగున్న శబ్దం. దాన్ని కదిలిస్తే వచ్చేదే మనం ఎరిగి వున్నటువంటి రంగులు. ఆ రంగులన్నీ విడిపోతే వచ్చేదే ఒక రంగు. అనేక రంగులు కలిస్తే వచ్చేదే మనం వెలుతురు అంటున్నాము, తెలుపురంగు. అవన్నీ లీనమైతే వచ్చేదే తెలుపు కంటే ఎక్కువ మహాతెలుపు. కంటికి ఆకాశము నీలమల్లే కన్పిస్తుంది. ఆకాశము కంటికి నీలంగా ఎందుకు కన్పిస్తుంది. అంతకంటే కన్పిస్తే కన్ను పోతుంది. కనుక కంటియొక్క లోపంవల్ల అక్కడ నీలంగా కన్పిస్తుంది. కాని, నీలంగా ఏం లేదు. నీలంగా వున్న ప్రతీదీను మనకన్ను చూడలేనంత లైటుని అక్కడనించి ప్రవాహముగా చేస్తూ దానికి అడ్డంగా కంటిరక్షణ కోసమని blue effect యిస్తున్నది. నీలం కాదు అక్కడ వున్నది. కనుక శబ్దం, శబ్దరూపం. అలాగే రంగు, రూపం. వర్ణం, వర్ణరూపం. స్పర్శ, స్పర్శరూపం. స్పర్శ వేరు, స్పర్శరూపం వేరు. ఈ రెండింటినించి వచ్చిన దాన్ని స్పర్శ అంటారు. అక్కడ మనకి తెలుస్తుంది చూడండి. దాని పేరు స్పర్శరూపం. పక్షవాతం వచ్చిన వాడికి రూపము వుండదు. స్పర్శ వుంటుంది. అది తేడా స్పర్శకిన్నీ, స్పర్శరూపానికిన్నీ. ఒక భాగంలో స్పర్శ తెలీదనుకోండి. పక్షవాతమో, రోగంతోనో ఉంటుంది. అక్కడ గోకుతుంటే గుంజని గోకుతున్నానేమోనని అనుమానం వచ్చి చూసుకుంటాడు చెయ్యిని. ఒక్కొక్కపుడు తను గోక్కుంటూ ప్రక్కవాడి చెయ్యి గోకుతున్నానేమోనని కూడ అనుమానము వస్తుంది. అంటే స్పర్శ ఉందికాని స్పర్శరూపము లేదు. రసము అంటే రుచి దానిరూపం. ఇడ్లీ చాల రుచిగా చేసారు. అల్లప్పచ్చడి చేసారు. రుచి దేనికి ఉంటుంది. నాలికకా? పచ్చడికా? పచ్చడికి రుచైతే అదే తినేసి ఉండేది. మనదాకా వచ్చేదికాదు. కొన్ని దొంగ ఆవులు వాటి పాలను

అవే తాగేస్తాయి చూడండి. కనుక రుచికి సంబంధించిన రూపము ఎక్కడుంది? నాలికలోంచి పనిచేస్తున్న పురుషుడిలో ఉంది. ఇవన్నీ కూడ మొదట మనం చెప్పుకున్న ఆ రెండవ 'నేను' ఉంది చూడండి (Negative నేను) అది ఈ ఐదింటిలోను పనిచేస్తుంటే ఇవి వుంటాయి. లేకపోతే ఉండవు. గంధం అంటే వాసన. వాసన అంటే ముక్కులో ఉంటుందా? ముక్కులు బద్దలై చచ్చిపోవాలి, ప్రతీవాడునూ. ఎవడి వాసన వాడికి కిట్టదు. ముక్కు వాసన కాదుగా వాడికి వేసేది. మంచి గంధం వాసన. ఎవడూ అక్కడ వాసన చూసేవాడు లేకపోతే మంచి గంధానికి వాసన వస్తుందా? కనుక వాసన, దానియొక్క రూపం యివి తెలుస్తాయి. ఇవి తెలియకుండా ధ్యానంచేస్తే అయోమయంగా వుంటుంది. ఇంద్రియాల్ని వుపయోగించు కుంటున్నాము అనుకొని, ఇంద్రియాలకి ఉపయోగపడడం, మనస్సుకి ఉపయోగపడడం జరుగుతుంది. సంసారపు బంధంలో వున్నవాడు చేస్తాడు అలా. అంటే యోగాభ్యాసం చాతకానటు వంటివాడు రోజూ ఉద్యోగానికి పరిగెట్టి, ఆఫీసరు దగ్గరికి పరిగెట్టి, ఆఫీసుకు పరిగెట్టి, భార్య దగ్గరికి పరిగెట్టి, కొడుకుల దగ్గరికి పరిగెట్టి, కొడుకుల సీట్లకోసం పరిగెట్టి, కాలేజీల దగ్గరికి పరిగెట్టి, బస్సు దగ్గరికి పరిగెట్టి, బస్సు సెంటరు దగ్గరికి పరిగెట్టి, బస్సు స్టాండు దగ్గరికి పరిగెట్టి, రైలు స్టేషను దగ్గరికి పరిగెట్టి, బుకింగ్ ఆఫీసు దగ్గరికి పరిగెట్టి, టికెట్టు రిజర్వుచేసే వాడి దగ్గరికి పరిగెట్టి యిలా ఏడుస్తూ వుంటాడు అన్నాడు. యోగాభ్యాసము చేయకముందు మన బ్రతుకు యిలా ఉంటుంది. సుఖంగా ఉందా? సుఖము లేదు. ఎంచేత లేదు? చస్తూ బ్రతుకుతున్నామంటారు. ఎందుకు బ్రతికేది? అంటే యింద్రియాల్ని వాడుకుంటం లేదు. మనస్సును వాడుకుంటం లేదు. యింద్రియాలు నిన్ను వాడుకుంటున్నాయి. కన్ను వెలుతురు వైపుకు లాగుతుంది. లేదా రూపం వైపుకు లాగుతుంది. మా పల్లెటూరులో ఇంట్లో గోల చేయకుండా ఉంటాం కదాని బడికి పంపించేవారు. గుఱ్ఱపుబండి వస్తున్న శబ్దం వినిపించేది. గుఱ్ఱపుబండి వైపు రోడ్డు మీదకు తిరిగి చూసారంటే మెడకాయ విరగ్గొడతాను అనేవాడు మాష్టారు. బండి అటు వచ్చేది. అందరూ అటు తిరిగేవాళ్ళం. కనుక అవతల వున్న వస్తువు మన ఇంద్రియాలని లాగుతూవున్నదా? మన ఇంద్రియాలు వాట్లని చూస్తున్నాయా? అవతల

వున్న వస్తువువైపు ఇంద్రియాలు లాగుతున్నాయి. పోలీసుంటే లైటు పెట్టుకువెళ్లడం, పోలీసు లేకపోతే లైటు లేకుండా వెళ్ళటం. కొన్నాళ్ళు పోయాక పోలీసువున్నా లైటు లేకుండా వెళ్తారు. తర్వాత యింకొన్నాళ్ళు పోయాక పోలీసు కూడ లైటు లేకుండా వెళ్ళటం. మామూలే పద్ధతి. అందుకని ఈ యింద్రియాలతో, మనస్సుతో నడపబడుతున్నటువంటి నువ్వు మూర్ఖుడల్లే నడిచి వెళ్ళుతూ ఉండటం కాకుండా, ఇంద్రియాలు, మనస్సు ఉపయోగించుకొనే పద్ధతి కోసం అష్టాంగ యోగం యిచ్చారు. కనుక ధారణ, ధ్యాన, సమాధులు సమన్వయపరచి అప్లైచేయి. ఇంద్రియాల మీద నవ్వు నేర్చుకున్న ధ్యానం అప్లయిచెయ్యి. యింద్రియం అంటే ఏమిటో తెలుస్తుంది. ఇంద్రియాల్లోంచి చూచేవాడు, మనస్సు, చూడబడేటువంటి వస్తువు ఈ మధ్యన ఉన్నటువంటి పెట్టె, అంటే aparatus. అంటే మైకులో మాట్లాడేవాడు, మైకుగొట్టం, మైకుగొట్టం కాకుండా మైకు. అంటే ఏమిటి? electricity యే. మైకు అంటూ వేరే వుండదు. దాని కాధారమైనటువంటిది మైకుగొట్టం. అలాగ ప్రతీది నీకు వుంటాయి. ఆ రెండింటికి తేడా తెలుస్తుంది. గనుక శబ్దానికి, శబ్ద రూపానికి తేడా తెలుస్తుంది. మీరు దానిమీద ధారణ చేసేటప్పటికి మీరు మట్లాడుతూ ఉన్నప్పటికి అవతల వాడికి వినపడదు. ఏం చేస్తారు? మీరు మాట్లాడుతూన్నటు వంటిది శబ్దరూపం. శబ్దం కాదుగా. దానికిన్నీ వాడి చెవికిన్నీ మీరు cut off యిస్తున్నారు. అక్కడిదాక ఎందుకండి, వేసవికాలంలో ఆఫీసులో కూర్చొని వున్నారు. గణ, గణ, గణమంటూ fire service కారు వెళ్ళింది. క్రిందికి మంచినీళ్ళు తాగటానికి వెళ్ళొచ్చి ఒకడు అక్కయ్యపాలెంలో పాలబూతు దగ్గర తగలడుతోందిటని ప్రక్కవాళ్ళతో మాట్లాడడం మొదలు పెట్టాడనుకోండి. మీకు వినబడేటట్లు. ఈయన యిల్లు పాలబూత్ సమీపంలో ఉంది. యింట్లో మనుషులున్నారు, భార్య ఉంది, పిల్లలున్నారు. ఇహవాడు మాట్లాడుతున్నవి వినపడతాయా? అదీవాడు చెప్పింది. అంటే మీరు మనస్సుతో అవతలివాడి మనస్సుకి cut off యిస్తే సులభంగా శబ్దానికిన్నీ శబ్దరూపానికీ మధ్యన గండి ఏర్పడుతుంది. ఇక వినిపించేది ఏమిలేదు. వీడు పెద్దగా ఒరేయ్! అని కేకవేసినా వాడు ఆలోచిస్తూ కూర్చుంటాడు. ఒరేయ్! లేవరా! అని అరిస్తే వాడు ఎటో చూస్తుంటాడు.

పెద్ద ఆశ్చర్యం అక్కర్లేదు. మనం బాగా ట్రాఫిక్ వున్న రోడ్డుమీద నడుస్తుంటే ఒక్కొక్కప్పుడు మనందరం ఏం చేస్తున్నామో అదే చేస్తాడు. ఆ కారు వాడుగాని, లారీవాడు కాని, సైకిల్‌వాడు కాని మొత్తుకుంటూ వుంటాడు. ఏమైనాసరే అలాగ (Somnambulism) నిద్రపోతూ కలలో నడుస్తూ ఉంటాం, కాని, రోడ్డుమీద మనుష్యులు నడుస్తున్నట్లు నడుస్తామా? యిప్పుడు కూడ అంతే జరుగుతుంది. క్రొత్తవాడికి ఆశ్చర్యం వేస్తుంది. ఏమిటిరా వీళ్ళు మనుష్యులేనా, యిట్లా నడుస్తున్నారు. లేకపోతే బొమ్మలా అనిపిస్తుంది. ఎందుకంటే గేదెల్లాంటివి కూడ మనకంటే ముందు తప్పుకుంటున్నాయి. వీడు కదలడు. అలాంటి cut off యిస్తుంది. దానికి దీనికీనూ. ఒక మంచి రంగు రంగుల యిల్లుంది అనుకోండి, ఆ యింటికి పది గజాల ముందు వాడికి ఏదన్నా topic suggest చేయండి. వాడు మాట్లాడుతూ వుంటాడు. ఆ దారమ్మటే నడుస్తూ ఉంటాడు. యిల్లుదాటి వచ్చాక ఒరేయ్ రంగుల యిల్లు చూశావురా అంటే రంగుల యిల్లేమిటి అంటాడు. cut off యిచ్చేసారు మీరు. అంతర్థానమ్ అంటే సంపూర్ణమైన, పరిపూర్ణమైన అంతర్థానమ్ జరుగుతుంది అక్కడినుంచి అన్నాడు. కనుక 'ఏతేన' దీనివల్ల 'శబ్దాది అంతర్థాన ముక్తం' శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు, రుచి మొదలైనటు వంటివన్నీ కూడ అంతర్థానమై పోయినాయి. భోజనం వడ్డించారు. సమస్తమయిన పదార్థములు ఉన్నాయి. కూర్చోబోయే ముందు దొంగ టెలిగ్రామ్ తీసుకొచ్చి యిచ్చారు. మీ ఫాదర్‌కి సీరియస్ వెంటనే రమ్మని, ఎవడినో ఏడిపించటానికి. ఏప్రిల్ ఫస్ట్ అనుకోండి ఆరోజు. అందరూ కూర్చున్నారు. పెద్దవాళ్ళు రావాలికదా. సరే వీడు టెలిగ్రామ్ చూసుకున్నాక భోజనం చెయ్యటానికి కూర్చొంటే తియ్యగా ఉన్న పదార్థం తియ్యగా వుంటుందా? పుల్లగా వున్న పదార్థం పుల్లగా వుంటుందా? ఉప్పగా వున్న పదార్థము ఉప్పగా వుంటుందా? అన్నీ ఒకటే అఖండమైన రుచి. అంటే ఏమైంది. మనస్సుకి cut off యిచ్చారు. నోరు అలా నమలాలి కనుక నములుతోంది అన్నాడు. ఇలాగ ఐదు ఇంద్రియాల్లో ఐదింటికి కూడ యిలాంటి cut off యివ్వటానికి వీలుందని ఈ సూత్రములో చెప్పబడింది.

## 23. సోపక్రమం నిరుపక్రమంచ కర్మ తత్సంయమా దపరాన్త జ్ఞాన మరిష్టేభ్యోవా।

సోపక్రమం = ప్రారంభించిన (karma already stimulated); నిరుపక్రమం = ప్రారంభించని (not yet stimulated); కర్మ = కర్మ; తత్ = దానిని; సంయమాత్ = సంయమనము చేయుటవలన; అపరాన్త = శరీరము అంతమయ్యేటువంటి జ్ఞానమున్నూ; అరిష్టేభ్యో = ఆపదలయొక్క; జ్ఞానంవా = జ్ఞానము కలుగును.

వెంటనే ఫలమిచ్చునది, నిదానముగా ఫలమిచ్చునది అగు రెండు విధముల కర్మలయందును సంయమము చేయుట వలన అన్నిలోకముల జ్ఞానము వాని లయము యొక్క స్వరూపజ్ఞానము కూడ తెలియును (ఎవని దేహ మెంతకాలము నిలుచునో కూడ తెలియును). వ్యాధులు, ఆపదలు మున్నగునవి కూడ తెలియును.

**వివరణ** : 'సోపక్రమం నిరుపక్రమంచ కర్మ' అంతవరకు ముందు అర్థం చేసుకుందాం. స+ఉపక్రమం అంటే ఉపక్రమించునది అంటే ప్రారంభించిన కర్మ. నిరుపక్రమం అంటే ఉపక్రమింపనిది. అంటే ఇంకను ప్రారంభించని కర్మ. రెండు రకాల కర్మలు ఉన్నాయి. రాయి విసిరారు, విసిరిన రాయి వెడుతోంది. అది ప్రారంభించిన కర్మ. అలా అయితే నేను విసరను అనటానికి వీల్లేదు. విసరడం అయిపోయింది. అది ఎక్కడ పడుతుందో, ఎవడికి తగుల్తుందో వాడొచ్చి నీబుర్ర ఏం పగలగొడతాడో అన్నింటికి సిద్ధం అయి ఉండవలసిందే. కాని ఇంక మాట్లాడటానికి వీలులేదు. ఎవడికైనా తగిలింది అనుకోండి. ఆ రాయి తీసుకొచ్చి మన బుర్రమీద పెడతానంటాడు. దానిపేరు సోపక్రమ కర్మ. అంటే already stimulated. నిరుపక్రమ కర్మ అంటే రాయి విసురుదాం అని అనుకున్నాం. ప్రోగ్రాం వేసుకున్నాం. యింకా రాయి బయల్దేరలేదు. ఎక్కడ ఉంది కర్మ? యిపుడు మనస్సులో ఉంది. కనుక సోపక్రమ కర్మ స్టేషన్‌లో బయల్దేరక ముందు ఎక్కడుంది ఆ రాయి? నిరుపక్రమ కర్మగా మనస్సులో ఉంది. ఆ నిరుపక్రమ కర్మ ముందు ఎక్కడుంది? వీడి పూర్వకర్మ అనే స్టేషన్‌లో ఉంది. మనం అంతవరకు చిన్నతనం నుంచి ఏ పెంపకంలో పెరిగామో, ఎలాంటి తల్లిదండ్రులు మనల్ని

పెంచారో అంటే ప్రక్కవాళ్ళేదైనా చేస్తే రాయి విసరు అనేటువంటి వాళ్ళు చిన్నప్పటినుంచి పెంచితే కదా వాళ్ళు వస్తుంటే రాయి విసురుదాం అని అనిపించేది. లేకపోతే అనిపిస్తుందా? చిన్నతనంలో ప్రక్కవాడితో ఏమన్నా తేడావస్తే, వాణ్ణి ఫటా ఫటా నాలుగు తన్ని వాడిచేత నాలుగు తన్నులు తిని, వాళ్ళ తల్లితండ్రులువస్తే వాళ్ళచేత తన్నులు తిట్లుతిని, ఆరితేరినటువంటి తల్లితండ్రులకి కొడుకైపుట్టి, కనీసం పాతిక సంవత్సరాలు పెరిగితేగాని వాడు వెడుతూండగ రాయి విసురుదాం రోడ్డు మీదకి అనే ఉద్దేశ్యం రాదు కదా. కనుక అంతకు ముందు ఎక్కడుంది రాయి? వీడి పూర్వకర్మ అనే స్టేషనులో ఉంది. అంటే వీడు పెరుగుతూండగ వాతావరణం, స్నేహితులు, తల్లితండ్రులు అనే స్టేషనులో ఉంది. యింకా ఉపక్రమించరు. అయితే అలాటి స్నేహితులతో వీడెందుకు స్నేహం చేశాడు. అలాంటి తల్లిదండ్రులకు వీడెందుకు కొడుకై పుట్టాడు. అంటే వీడు పూర్వజన్మలో ఏది ఇష్టపడ్డాడో దాన్నిబట్టి వచ్చాడు గనుక ముందు స్టేషన్‌లో ఉన్న కర్మతో ఉన్నాడు. తన తండ్రితో దెబ్బలాడి ఇంట్లోంచి వెళ్ళిపోయిన కొడుక్కి ఎలాంటి వాడు పుడతాడు. తండ్రిని బుర్ర పగలగొట్టేవాడు కొడుకై పుడతాడు. తన పిల్లలతో దెబ్బలాడే తండ్రి వచ్చే జన్మలో ఎలాంటివాడుగా పుడతాడు? అంటే fitness of things. పిల్లలయందు పశువల్లే ప్రవర్తించినవాడు. ఆ పిల్లలలో ఒకలాంటివాడు తండ్రి అవుతాడు. వాడికి కొడుకుగా పుడతాడు. లేదా పిల్లల్ని దయగా చూచినవాడు తప్పుచేస్తే కూడాను, ఏం మనం చేయలేదా? అంటే పిల్లలు తప్పుచేస్తే కూడ దయగా చూడాలా? తప్పుచేస్తేనే కదా దయగా చూసేది, లేకపోతే మనమెందుకు? తప్పు చేయకపోతే ప్రతీవాడు దయగానే చూస్తాడు. తప్పు చేస్తేనే కదా దయతో చూడవలసినది. అలాగే పిల్లలకి తండ్రిమీద గౌరవము ఉండాలి. తండ్రి ఎలాగ చూసినానా? తండ్రి తిన్నగా చూస్తే గౌరవం, స్వార్థంకోసం ఎలాగు వుంటుంది. మనం చదువుకోవాలి కనుక, బట్టలు, గిట్టలు కావాలి కనుక, మనకు డిగ్రీయో ఆపై డిగ్రీయో పూర్తయిందాక వీళ్ళకు అణకువగా ఉందామనేది. అది పెద్ద గొప్పకాదు. ఆ తండ్రి చూపించింది వాత్సల్యమూ కాదు. వాడు చూపించింది పితృభక్తీ కాదు. కనుక దాన్నిబట్టి తల్లితండ్రులు వస్తుంటారు. రోలు, రోకలి, తిరగలి, తిరగలిరాయి అలాగే మరచెంబు, మరచెంబు మూత. మరచెంబు కొంచెం వంకరగా తయారు చేసారనుకోండి. దానికి

మూత పెట్టాలంటే అదికూడ కొంచెం వంకరగా తయారవ్వాలి. అలాగ వుంటుంది. అందుచేత ఇదంతా కూడ స+ఉపక్రమం ఆ మిగిలింది నిరుపక్రమం. అంటే కర్మ అనే గడియారంలో సెకండ్లముల్లు, నిముషాలముల్లు, గంటలముల్లు, తేదీలముల్లు, వారాలముల్లు, మాసాల ముల్లు, సంవత్సరాల ముల్లు ఉన్నాయనుకోండి. యిందులో ఏ ఒక్కటీ తీసేసినవాడు మూర్ఖుడే. అపుడు వాడు జన్మంతా దానధర్మాలు చేసాను, ఎవడు ఉద్యోగము అడిగితే వాడికి వేయించాను, నాకు యిలాంటి జబ్బు వచ్చిపడ్డది, ఎవడికీ ఉపకారము చేయకూడదు అని బాధపడతాడు. ఇంక చేయడానికేముంది. అయిపోయింది. అంటే వాడేం చేసాడు. సోపక్రమ కర్మ మాత్రం బాగుచేసుకున్నాడు. నేను పదేళ్ళనుంచి అప్పు చేయలేదు. ఇంకా అప్పులవాళ్ళు నన్ను బాధిస్తే ఎట్లా? అనుకుంటే అంతకుముందు తీసుకున్న అప్పులు ఏమౌవుతాయి. చాల కష్టం. 'గహనా కర్మణో గతిః', గీతలో చెప్పాడు. ఏది చేయచ్చు, చేయకూడదు అనేది చాల గగనం. జాగ్రత్తగా వెడుతూ ఉండండి అన్నాడు. అంతఃకరణ (instinct) ప్రతీక్షణం లోపలినుంచి చెబుతూ ఉంటుంది. వింటే వినండి లేక మీ యిష్టం వచ్చినట్లు చేస్తే యిరుక్కుపోతారు. యిరుక్కున్నాక మనం చేసేదేమి లేదు. అలాంటి పరిస్థితిలో పడకూడదు. మీకేం ఫర్వాలేదు. మీ తరఫున నేను జపం చేస్తాను. మీ కర్మలు నశించి పోయేట్టుగా అని ఎవరైనా అంటే అది అబద్ధం. ఎవరి కర్మ ఎవరూ నశించిపోయేట్టు చేయలేరు. ప్రపంచములో అవతారమూర్తులతో సహా చేసేదిలేదు. అవతారమూర్తులు కృష్ణుడు, రాముడు, బుద్ధుడు, ఏసుక్రీస్తు వాళ్ళందరూ కూడ మార్చుకోవాలి అని పశ్చాత్తాప పడితే ఆ క్షణంనించి ఏమైనా ఉంది. అంటే శరణాగతి పడ్డ క్షణం దగ్గరనుంచీ సమస్తం భస్మమౌవుతాయి అన్నాడు కృష్ణుడు. కావాలంటే పశ్చాత్తాపపడండి. పడనంటే అలా నిల్చోవాల్సిందే వాకిట్లో అన్నాడు ఏసుక్రీస్తు. కాబట్టి యిలాంటి కర్మలనుంచి తప్పించుకోవాలి. కర్మమీద మనస్సు వెయ్యాలి. అంటే ధారణ, ధ్యాన, సమాధులు వెయ్యాలి. ఉదాహరణకి రైల్లో ఒకడు మనమీద కాలుపెట్టి కూర్చుంటాడనుకోండి. నేనింత పెద్దవాణ్ణి నామీద కాలు పెడతాడా అనుకోకూడదు. వాడెవడో మనమీద కాలు పెట్టవలసిన కర్మ ఒకటి జరిగిపోవలిసినది ఉంది. జరిగిపోతోంది అనుకోవాలి. అది గుర్తున్నా లేక ప్రతిక్రియా స్వభావం ఉన్నా, యోగాభ్యాసం లేదు. లోపల అటువంటి

స్వభావం ఉంటే పైకి కక్కేసేయాలి. ఆ జన్మకి యోగాభ్యాసం ఉండదు. ఫరవాలేదు. చీము, నెత్తురు చంపుకోమని చెప్పలేదు యోగాభ్యాసంలో. చీము అంతా పోయిన తరువాత మంచి నెత్తురు మిగిలాక యోగాభ్యాసం మొదలుపెట్టమన్నాడు. చీము, నెత్తురు చచ్చాక ఎందుకండీ బ్రతకడం అన్నాడు. చీము, నెత్తురు చావకూడదు. చీము పోయిన తర్వాత మంచి రక్తం మిగిలాక పరిశుద్ధత పొంది ఒకమాటు మళ్ళీ ఆధ్యాత్మికమైన ఎక్స్‌రే తీసుకొని చీము లేదని తెలుసుకుని అప్పుడు యోగాభ్యాసం మొదలుపెట్టు. లేకపోతే అలాగ లోపల లుకలుక లాడుతూ వుంటాయి లుకేమియా అల్లే. లోపలనుంచి కామం, క్రోధం, లోభం, మోహం నులిపురుగులల్లే కెలుకుతూ వుంటే వాడంటే మనం వూరుకోవాలా అన్పిస్తుంది. వాడు ఒకటి అంటే వీడు పది అంటాడు. అందుచేత అవన్నీ అయిపోయిన తర్వాత సంగతి యిది. సోపక్రమం అంటే యిదన్నమాట. ఇన్ని లెవెల్స్‌లో నిరుపక్రమం తెలియటం కష్టం. తెలిసి ఆహారం జాగ్రత్తగా తింటున్నాం. కూడనివన్నీ మానేశాం. ప్రస్తుతం హాయిగా పాలు పుచ్చుకుంటున్నాం. పాతికేళ్ళనుంచి తేనె, పండ్లరసం మొదలైనవే పుచ్చుకుంటున్నాం. కాళ్ళు నొప్పులు వచ్చాయి. ఎందుకు రావాలండి? అంటే వీడు సర్దుబాటు చేశాడు రాబోయే దానికి. జరిగిపోయిన దానికి మాత్రం చేయటానికి వీల్లేదు. చేసేదిలేదు. రాయి విసరటం అయిపోయింది. పూర్వజన్మలోనివి. రాయి విసిరిన తర్వాత చెయ్యిపెడితే చేతికి తగుల్తుంది. లేదా అడ్డం నిల్చొంటే బుర్రకైనా తగుల్తుంది. జాగ్రత్త! అదివెళ్ళి ఎవడికైనా తగిల్తే వాడొచ్చి తన్నులు తన్నినా తినవలసిందే. తన్నులు తిను. అది సోపక్రమం. భాగవతం 13వ భాగంలో చూడండి. భరతుడు పొలంలో నిల్చుని వుంటే రహూగణుడు అనే సింధుదేశపు రాజు బ్రహ్మవిద్య నేర్చుకుందామని గురువు దగ్గరికి పల్లకిమీద వెళ్తున్నాడు. చాల దూరం మోసేరు. అక్కడ భరతుణ్ణి చూచి పల్లకి మోయమన్నారు. వాణ్ణి మోయమన్నారంటే అర్థం వాడు పల్లకి కొంతదూరం మోయవలసిన కర్మ మిగిలిపోయింది. కనుక మోస్తున్నాడు. వాడికి పల్లకి మోయటం చాతకాదు. మనిషి నడుస్తున్నాడు ఊరికే పల్లకి బొంగు భుజాన పెట్టుకుని. మిగతావాళ్ళంతా ఒకలాగ నడుస్తున్నారు. వీడొక్కడు ఒకలాగ నడుస్తుంటే పల్లకి నడక పదమూడో ఎక్కం చదువుతున్నట్లుంది. పల్లకిలో వున్న రాజు ఏరా పొగరెక్కిందా! అలా నడుస్తున్నారు. అన్నాడు.

ూకేం తెలియదండి. వీడు యిట్లా నడుస్తున్నాడు అన్నారు. అంటే ఏం
నుగల్లే నడుస్తున్నావేమిటి అంటూ యిష్టం వచ్చినట్లు తిట్టి నీ మదం
దులుస్తానుండు అని పల్లకి దిగి వచ్చేటప్పటికి ఈయన అన్నాడు. నేనే
నుగేమిటండీ, అందరూ పీనుగులే. శరీరాన్ని మోయించుకెళ్తున్నారంటే
నుగుల్ని మోసుకెడ్తున్నట్లే కదా అన్నాడు. నీలోకంలో నువ్వున్నట్లే నా
లోకంలో నేనున్నాను. నీ పల్లకీ లోకంలో లేను. ఈ పల్లకి నా భుజాన
పెట్టటమూలేదు. నేను మోయటం లేదు. ఈ శరీరము మీద పెట్టారు.
అదేదో వెళ్తోంది అన్నాడు. అలాగే నువ్వు యిపుడు కొట్టినా ఈ శరీరాన్ని
కొడతావు. నాకేమి సంబంధించినది కాదు. ఆ గోడను కొడితే ఎంతో నన్ను
కొట్టినా అంతే. కావాలంటే కొట్టుకో అన్నాడు. అపుడు పాదాలమీద సాష్టాంగపడి
నేను ఎవర్ని వెతుక్కుంటూ వెడుతున్నానో, వారు సాక్షాత్కరించారని
ఊహించుకున్నాడు. వాళ్ళిద్దరికీ మధ్యన సంవాదం వుంటుంది అక్కడ. ఆ
సంవాదంలోంచి పరబ్రహ్మోపదేశం వస్తుంది. అపుడు భరతుడు చెప్పాడు.
ఒరేయ్ ఈ వెన్నెముక అనే పల్లకీ బొంగులో ఈ శరీరం అనే పల్లకీలో
కూర్చొని రాజు అని కులుకుతూ ఉంటాడు ప్రతీవాడు కూడను. నువ్వు
రాజువనే అనుకున్నావుగాని, ప్రజలకి సేవకుడవని నీకు గుర్తులేదు, అంటూ
అనేక విషయాలు చెప్పాడు. కనుక ఏమి సర్దుకున్నా సోపక్రమం సర్దుకోవాల్సిందే.
కాని నిరుపక్రమం సర్దుకుంటానికి ఏం వుండదు. వచ్చేస్తూ వుంటుంది.
నిరుపక్రమ కర్మ సర్దుకోవాలంటే యోగాభ్యాసం చేయాలి. తరువాత ఏదన్నా
మనకి వచ్చినా మనంత వాళ్ళకి యిది రావటమా? అనే అహంభావం పోవాలి.
మనంత వాళ్ళకి అనే పాయింటు వుండదు. మీయంత వాళ్ళకి మీక్కూడ సుస్తీ
చేయటమేనా? అని అడిగారు చాలమంది. అది శరీరానికి చేస్తుంది. మీక్కూడా
కాళ్ళు నెప్పులేనా? మీక్కూడ ఆకలేనా? అంటే గురువుగారి పని అయిపోతుంది.
గురువుగారు శిష్యులతో సంచారంచేస్తూ వచ్చినటువంటి పంపకము దగ్గర
పేచీ వచ్చింది. గురువుగారు ఒకడికి ఎక్కువ యిప్పించారు. ఆ రెండవవాడు
గురువుగార్ని మీ పని చెబుతాను ఆగండి అనుకున్నాడు మనస్సులో. ఆపై
వూరు ముందువెళ్ళి వార్త ఎవరు చెబుతారు అంటే నేను వెడతాను అని వెళ్ళి,
ప్రొద్దున్నే 6 గంటలకి ప్రేయరు, ప్రవచనం చేస్తారు. అది అయిన తరువాత
మిగిలిన వాళ్ళందరికీ కాఫీ, టిఫిన్ వుంటుంది. అది అయిన తరువాత వారు

షోడశోపచార పూజ చేస్తారు. అది అయిన తరువాత అందరికీ డిన్నరు ఉంటుంది. యివన్నీ చెప్పేశాడు. సాయంత్రము ప్రోగ్రాము యిచ్చేసాడు. అయితే వారేం పుచ్చుకుంటారు. వారా? పుచ్చుకుంటమా? నెత్తురు కక్కుకొని ఛస్తావు. ఆమాట అనకండి అన్నాడు. తరువాత గురువుగారు వచ్చారు. పాదాలు కడిగారు. గజారోహణ మహోత్సవాలు అయిపోయినాయి. వచ్చేవాళ్ళు వస్తున్నారు. మొక్కేవాళ్ళు మొక్కుతున్నారు. అడిగేవాళ్ళు ధర్మ సందేహాలు అడుగుతున్నారు. మధ్యాహ్నం 2 గంటలు అయినది, 2.30 అయ్యింది, ఏమీలేదు. ఒక్కమాటు అందర్నీ బయటకు వెళ్ళమని తలుపేసి శిష్యుణ్ణి పిలిచి ఏమిటిరా అన్నాడు. అదేనండి నాకు బోధపడటం లేదు అన్నాడు. ఆ గతే అవుతుంది. గురువుగారు కూడ తిండి తింటారా? అని అడిగితే. అంటే వాడికి తక్కువ డబ్బులు యిప్పించాడు గురువుగారు. అందుకని వీడు మొత్తం మాడ్చేసాడు. యిదికూడ నశించాలంటే 'జ్యాయేత్ కర్మ' వరాహ మిహిరుడు చెప్పాడు. మీ కర్మ శమింప చేసుకోండి జాగ్రత్తగా. ఏరకంగా ''శమ దమాది షు కర్మశు' శాంతి, దాంతి అనేటువంటి మీరు చేస్తున్న పనులయందు యింకొకడు మీకు కోపం వచ్చేట్టు పనులు చేసినా, మీకు కోపం రాకుండా ఉండేట్టు ప్రయత్నం చేస్తే, అంటే కోపం అణచుకోవటం, రక్తపోటు వస్తుంది. శమదమాది గుణములు కలిగివుండి, ఎవరన్నా అన్యాయంగా మిమ్మల్ని అన్నారనుకోండి. మీకేమిటి పోయింది. వారు మహానుభావులు అన్నారనుకోండి ఏమొచ్చింది? అది అభ్యాసం చేస్తే యిక్కడ నుంచి 'శమదమాదిషు' తర్వాత 'గ్రహోపచార పూజాదిషుచ' గ్రహముల స్వరూపంలో మనుష్యులు నీ దగ్గరికి వస్తూంటారు. నీదగ్గర పని అనే పేరుతో, వాళ్ళరూపంలో ఉన్న గ్రహముల మూర్తులను ఉపశమనం చేసి పూజచేసుకో. అర్చన చేసుకో. అంతేగాని డబ్బులు యిచ్చేసి గ్రహాలకి జపము చేయిస్తే ఏమీ అవ్వదు. బృహస్పతికి కందులు, శనికి నువ్వులు లంచంయిస్తే అవి పుచ్చుకున్నవాడికి శుభ్రంగా ఆరోగ్యం వస్తుంది. యిచ్చినవాడు అట్లాగే వుంటాడు. అవన్నీ మనకోసం. మనం పరిశుద్ధి అవ్వటానికి, బాగుపడటానికి. మనం మానేసి వాణ్ణి తినమంటాం. పూర్వజన్మలో తిండిపోతు అయి ఎవడికైనా బృహస్పతి శాపం వుంటే అజీర్తి రోగి అయి ఈ జన్మలో పుడతాడు. అంతేకదా. అపుడేం చేయాలంటే కందులతో మాత్రం చేసినటు వంటివి ఒక రెండు సంవత్సరములు

తింటూ వుండండి. బృహస్పతి మంత్రం చేసుకుంటూ వుండండి. అంతేగాని కందులు వాడెవడికో దానం చేసేస్తే మనకి బృహస్పతి దోషంపోదు. అందుకని యివికూడ ఏమిస్తాయి? 'కారణ జన్మ ధర్మేషుచ' కారణ జన్ములైన మహానుభావు లుంటారు. వెతుక్కుంటూ వెళ్ళి వాళ్ళ దర్శనముచేసి ఏ టైము మీకు చాల చికాకైనదో, వాడితో వీడితో పేచీలు వస్తాయో, ఆ టైమపుడు వారి దగ్గర కూర్చోండి అన్నారు. వారితో మాట్లాడండి. లేదా వారు చెప్పినవి వింటూ ఉండండి. దానివల్ల యివి సర్దుకుంటం మొదలు పెడతాయి. అయితే మిగతా పనులు ఏమి వుండవా? నువ్వు చేసిన మిగతా పనులు పాడు పనులు కనుకనే కొంపమీదకు వచ్చింది. అందుకని మానేయి అన్నాడు. మరి ఆఫీసు అన్నాడు. నువ్వు పెట్టిన ఆఫీసువల్ల దివాలా తీశావు, పెళ్ళాం మెడలో నగలమ్మావు, పెళ్ళాం పొలం అమ్మావు, యివన్నీ అమ్మి యింకా ఆఫీసు అంటావేమిటి? ఆఫీసు వెంటనే మూసేయమని అర్థం. నీ మనస్సు కోతిగా లేకుండా వుంటే నీ దగ్గరికి మళ్ళీ వస్తుంది చూడు. అక్కడే వుండు. మనకి అర్థం కానిదీ-చేస్తే నిజమయ్యేదిన్నీ అక్కడే వున్నాయి. అంతకుముందు ప్రశ్నవేసే వాళ్ళకి జన్మంతా ప్రశ్న వేస్తున్నాగాని, పస్తులు పడుకుంటూ, ఏడుస్తూ ''సంశయాత్మా వినశ్యతి'' అన్నట్లు సంశయంతోనే నశించిపోతారు. అక్కడిదాకా వచ్చి నమ్మి వెనక్కి తిరిగి అవన్నీ మానేసి దణ్ణం పెట్టినటువంటి వాళ్ళు అక్కడనుంచి వాళ్ళకి కొత్తగా ప్రారంభం అవుతుంది. పిలిచి యిది చెయ్యి నాయనా మేమున్నా మంటారు. భగవంతుడు వాళ్ళద్వారా చేయిస్తాడు ఇదిచేస్తే బాగుంటుంది మీకు అని. మన మనస్సులో వున్న సంకల్పం నశించనంత వరకు అదిపోదు. ఇది పోవాలంటే చాల చాల కష్టం. దాని పరమార్థం తెలియటం కోసమే మనకి పెద్దలు చెప్పిన ఈ యోగాభ్యాసం. ఈ శమాదమాది గుణాల అభ్యాసం, ఈ గురుకుల వాసం మొదలైనవన్నీ కూడనూ. కనుక సోపక్రమం, నిరుపక్రమంచ కర్మ. రెండు కర్మలూ వుంటాయి. 'తత్+సంయమాత్' దానియందు ధారణ, ధ్యాన, సమాధులు పెట్టినట్లైతే, అంటే నీ దగ్గరికి ఎవడు వస్తున్నా, నీ పూర్వకర్మ ఏమిటో తెలుసుకునేటువంటి దృష్టితో చెయ్యి. మనం డబ్బులివ్వవలసిన వాడికి పండగకే యిచ్చేస్తానన్నాము. పండగ అయిపోయి నాలుగు రోజులు అయిందనుకోండి. వాడు వస్తానన్నాడు అనుకోండి. లేదని చెప్పించకు, యింకా పెంచుకుంటావు. అంటే పెట్రోలు

పంపులో నెంబర్లు తిరుగుతూన్నట్లు. ఒకట్ల స్థానం, పదులస్థానం, అలా పెరుగుతాయి. జాగ్రత్తగా ఉండాలి. అంచేత వాడు వస్తున్నాడంటే యింట్లోనే కూర్చో. వాడికిస్తానన్నావు కదా! అపుడు యివి తగ్గటం మొదలెడతాయి. ఒకవేళ వాడు వచ్చే టైముకి యింట్లోంచి వెళ్ళిపోయినా రేప్పొద్దున్న సరిగ్గా 10 గంటలకు వస్తానంటాడు. ఆ టైముకి యింట్లో వుండు. మనం భయపడేటువంటి వానికి అగ్గమయ్యే విషయాలు (Volnerable points) ఉంటాయి. భార్యాభర్తల మధ్య మాటామాట వచ్చి మాట్లాడుకోవడం మానేస్తావా? లేదా? మాట్లాడుకుంటే పూర్వకర్మ నశిస్తుంది. లేకపోతే ఎన్నాళ్ళయినా పూర్వకర్మ మసలుతూ వుంటుంది. Life లో live చేయటం చాతనవ్వాలి. నిర్భీతిగా మాట్లాడుకుంటే ఏ సమస్య అయినా పరిష్కారం అయిపోతుంది. లోపల పెట్టుకుని కూర్చున్న వాళ్ళకి ఎన్ని జన్మలైనా అలాగ దోషభూయిష్టమైన (condemned lives) జీవితాలు గడుపుతారు. (Damned Souls) అంటారు. అంటే intellectualise అయిపోతాయి souls. అవి vitalise అవ్వటం చాల కష్టం, బుద్ధి చుట్టూ shell డిప్పకట్టబడి వుంటుంది. కట్టిన తర్వాత ఆ డిప్ప (shell) బద్దలవ్వదు. Shattering-shell అంటారు దాన్ని థియోసఫీలో. అది బద్దలవకుండానే వెళ్ళిపోతూ ఉంటాయి. ప్రపంచం అంతా మహానుభావుడని అంటూ వుంటారు. అన్నప్పటికీ condemned and damned souls. వీడికి, వీడి భార్యకి సంబంధం వుండదు. వీడికి, వీడి పిల్లలకీ సంబంధం ఉండదు. వీడికి, వీడి స్నేహితులకీ సంబంధం వుండదు. వీడికి, సహోధ్యాయులకీ ఇంకేం వుంటుంది. ప్రపంచంలో నా అనేవాడు ఉండడు. కావలసిన వాడు వుండడు. మరమేకల్లే పుట్టి చిట్టచివరిదాకా అలాగే పెరిగి అలాగే చచ్చిపోతాడు, a sense of lonliness haunts the helpless creature. ఒంటరితనం అనేది పీడిస్తూ వుంటుంది. పదిమందిలో వుండికూడ, ఇంట్లో భార్య, పిల్లలు అందరూ వుండి కూడ, నా అనేవాళ్ళు ఉండరు వాడికి. అక్కడ సర్దుకోవల్సినవి వున్నాయి. తప్పులు చేయటం పెద్ద అపరాధం కాదు. ఒకళ్ళ తప్పులు ఒకళ్లు గుర్తించడమనేది పశుప్రవృత్తి (beastly nature). సుఖంగా వుండాలంటే మీ తప్పులు మీకు తెలియాలి. ఒకడి తప్పులు ఒకడికి కాదు. అవిచేస్తే జంతు ప్రవృత్తిలోకి వెళ్ళిపోతాం మనం ఎంత చదువుకున్నా. అందుకని ఈ స్థానాల్లో సర్దుకోవాలి. అలాగే అప్పులు.

డబ్బులుంటే కట్టేసేయాలి. అప్పుడు కొన్ని సర్దుకుంటాయి. అప్పుడు వీడి యోగాభ్యాసం ఆరంభమవుతుంది. ఆ ధైర్యం లేక వున్న అప్పులు అలాగే వుంచి డబ్బులు అలాగే ఉంచేస్తారు. వడ్డీ పెరుగుతూ వుంటుంది. డబ్బు ఎలాగు అంత వేగంగా పెరగదు. పాతికేళ్ళ క్రితం తీర్చాల్సిన అప్పు. ఒక పాతిక గంటలు మూత్ర విసర్జన చేయకుండా వున్నవాడి గతి ఏమవుతుందో అంతే అవుతుంది. కనుక మనుష్యుల్లా బ్రతకటం ఏర్పాటు చేసుకోవాలి. రేపు తేల్చుకుందాం అంటే యివాల్టికి మాత్రము పశువుల్లాగ ఉందామనే కదూ అర్థం. తర్వాత ఒక వ్యక్తి పరోక్షములో ఆ వ్యక్తిని గూర్చినటువంటి చెడ్డ విషయములు ఆలోచించటం కాని, మాట్లాడటంగాని, బుర్రలోంచి వెళ్ళిపోవాలి. కావాలంటే ఏడిసినట్లుంది నువ్వుచేసిందని వాడితో చెప్పేయాలి. ఈ రెండూ లేకపోయినవాడు సుఖపడడానికి నోచుకోడు. ఈ రెండింటికీ ఎవడైతే జీవితములో పిరికితనము చెందుతాడో వాడు నపుంసకుడు. సుఖపడటం వుండదు. ఈ ప్రాథమిక విషయాలు (fundamental) సర్దుబాటు చేసుకోవాలి. సోపక్రమం నిరుపక్రమంచ కర్మ. ఉపక్రమము అయిన కర్మ. ఉపక్రమము కాని కర్మ. దాన్నే జ్వాలాకూలుడు "The karma that has gained speed and the karma that has not yet stimulated". అంటే మొలుచుట మొదలుపెట్టి మొలుస్తున్న విత్తనములున్నూ, యింకా పొట్లంలో వున్న విత్తనములు. అలాగ ఈ రెండు రకాలైన కర్మల మీద 'సంయమాత్' సంయమం చేయటం వలన అంటే యితరులతో సంబంధము నందు యోగాభ్యాసం చేయుట వలన, యితరులతో ధారణ, ధ్యాన సమాధులు చేయుట వలన, మీరు యిష్టమైన వాళ్ళు వచ్చినపుడు, యిష్టం కాని వాళ్ళు వచ్చినపుడు, వాళ్ళయందు ధారణ, ధ్యాన సమాధులు చేయుటవలన, పొరుగూరి నుంచి పురిటికి వెళ్ళి 6 నెలల తర్వాత భార్య వస్తోందనుకోండి. రైలు ఆగంగానే నిన్ను గురించి ప్రపంచములో దుష్ప్రచారం చేస్తున్నవాడు రైలు దిగ్గా చూసావు. ఆ రెండిటి యందు కూడ నీ మనస్సు సమానంగా పనిచేస్తుంది. సరైన పద్ధతిలో సర్దుకుంటుంది. లేకపోతే సర్దుకునేది ఏం లేదు నాయనా. ఎందుకంటే దుష్ప్రచారము చేస్తోంది నువ్వుకాదు కదా. వాడిని చూస్తే నీ బుర్ర ఎందుకు వేడెక్కాలి. unless you are a blood pressure patient, Hypertension patent. నిన్ను గురించి వాడు దుష్ప్రచారం చేస్తోంటే అబ్బ!

అదిగో అన్నావు. అదిగో అన్నావంటే అదిగో అన్న రోగం నీ దగ్గరే వుంది. ప్రచారముచేసే రోగం వాడి దగ్గర వుంది. ప్రచారంచేసే రోగం వాడి దగ్గర వున్నంత మాత్రాన ఉలిక్కిపడే రోగం నీ దగ్గర ఉండి తీరవలెనా? అక్కడ మనక్కావలసింది. అంటే వాడు ఫూల్ అని నువ్వు చెబుతున్నావు. నువ్వు కూడ అయి తీరవలెనా? అంతే. తప్పదంటే అవ్వు. నీ యిష్టం. అదీ వాడు చెప్పింది. తెల్లవార్లు నిద్రపట్టలేదు వాడు అన్నాడని. వాడు అని వెళ్ళి భోంచేసి పడుకున్నాడు. నువ్వు తెల్లవార్లు నిద్రపోలేదు. ఎవడు మూర్ఖుడు. కనుక అట్లాంటి కర్మని తత్+సంయమాత్ సంయమం చేయటం వలన 'అపరాంత జ్ఞానము' అపరము అంటే ఇటుపైన, 'అంతం' అంటే ఆగిపోవటం. అంటే ఈ శరీరము ఎపుడాగిపోతుందో దాని తాలుకు జ్ఞానము వాడికి తెలుస్తుంది. ఎపుడు తెలుస్తుంది? శరీరం ఆగిపోతుంది అన్నదాని మీద భయం (Death sensitive) లేనపుడు. చదువుకీ, దీనికి సంబంధం లేదు. మనం ఎపుడు పోతామో తెలిస్తే అంతకుముందే పోయేవాళ్ళు చాలమంది ఉన్నారు. అంచేత ఎపుడుపోతామో ఎవడికీ తెలీదు. ఏం చదువుకున్నాసరే. యోగాభ్యాసం ఉన్న ఒక్కడికే తెలుస్తుంది. లేకపోతే మనిషి జంతువుగా బ్రతుకుతాడు. ఒంటి కాలితో బ్రతికి, మోకాలితో నడిచి, మోచేతులతో ప్రాకుతుంటారు. చేతబడి చేస్తారంటారు. వాడు అన్నదానికి మీరు భయపడ్డం పేరు చేతబడి. వెంటనే జ్వరము వస్తుంది. వాడేం చేయక్కర్లేదు. ఒక్కొక్కపుడు విషం కలిపినటువంటి పండో, ఫలమో, తినేదో, తాగేదో యిస్తారు. అంతే జాగ్రత్తగా వుండాలి. యోగాభ్యాసం చేసేవాడికి అవన్నీ వెళ్ళిపోయి 'అపరాంతం' ఎంతవరకు ఈ శరీరము వుంటుందో స్పష్టముగా వాడికి తెలుస్తుంది. తెలియకముందు ఎంత సరదాగా ఉంటారో తెలిసాక కూడ అంతే సరదాగా ఉంటాడు. ఏమీ తేడా వుండదు. ఆ స్థితి పొందితేనే తెలుస్తుంది. లేకపోతే తెలీదు. జాతకచక్రం సూచించబడ్డ ఆయుర్దాయం ఏమిటి? జాగ్రత్తగా చదువుకోవాలి శాస్త్రము. మనం గుడ్డివాళ్ళంగాని శాస్త్రకారులేం తక్కువ యివ్వలేదు. గ్రహము లిచ్చేటువంటి ఆయుర్దాయం యిచ్చారు. రవి యింత యిస్తాడు. చంద్రుడు యింత యిస్తాడు. యిట్లా వరుసన యిచ్చి లగ్నాయుర్దాయం ఇవన్నీ చెప్పి ఆయుర్దాయం మొత్తం ధరణా, భరణాలన్నీ లెక్కలు యిచ్చాడు. 12వ యింట క్రూరగ్రహం ఉంటే దాని ఆయుర్దాయం అంతా వెళ్ళిపోతుంది.

శుభగ్రహం ఉంటే సగము వెళ్ళిపోతుంది. చక్రపాద, కరణము అనిచెప్పి చివరికి ఆయుర్దాయం ఎంతో 79 సంవత్సరముల, 3 నెలల, ఇన్ని ఘడియల, ఇన్ని విఘడియలు అని చెప్తారు. లెక్కకట్టడం వ్యర్థమే. అన్నీ యిచ్చి చివరికి అరిష్టాధ్యాయం అని ఒకటి యిచ్చాడు యిందులో ''జ్ఞాన మరిష్టేభ్యో వా'' అరిష్టముల జ్ఞానము కూడ తెలుస్తుంది అన్నాడు. అరిష్టములంటే ఏమిటి? వెడుతున్నాడు. పిడుగు . పడ్డది. నువ్వు జాతకవములో లెక్కించిన ఆయుర్దాయమునకు సంబంధించినది కాదు. యిది మధ్యలో కొట్టేస్తుందన్నాడు. లేకపోతే అక్కడేమో గ్రహములతో లెక్కవేస్తే ఇక్కడేమో దశమములో కుజుడు ఉండి, చతుర్థంలో శనివుండి అది సరిగ్గా డిగ్రీలో లగ్నంమీద కేతువు గనుక వుంటే వీడు వెడుతూ వుంటే నెత్తిన పిడుగుపడి ఛస్తాడన్నాడు. ఏ దశలో అంటే వీడిదశలో వాడి అంతర్దశలో గాని, వీడికిన్నీ ఆ 79 సంవత్సరాలకి కలవదు. వాడు చాల జాగ్రత్తగా చెప్పాడు. ఇది గ్రహాలు చెప్పేటువంటి ఆయుర్దాయం నాయనా అన్నాడు. సగటుగా పూర్వజన్మలో వీడు చేసుకున్న పుణ్యంచేత ఎలాంటి తల్లితండ్రుల శరీరానికి పుట్టాడు? ఎంత పుష్టి వుంటుంది? అలా సహజంగా ఆచార కాండతో బ్రతికితే ఎన్ని సంవత్సరాలు బ్రతుకుతాడు తెలియచేస్తుంది. మనం ఆ ఆచారకాండతో బ్రతుకుతున్నామా? త్రాగే కాఫీలు, కాల్చే చుట్టలు, సిగిరెట్లు, మనం వేసుకునే వక్క పలుకులు, ప్లాట్‌ఫారమ్ మీద తినే తిండ్లు యివన్నీ కూడ ఆచారకాండయేనా? అలాంటి తిళ్ళు, త్రాగుళ్ళు వల్ల ఆయుర్దాయం తగ్గిపోయి శరీరాన్ని తగ్గిస్తుంది. ఒక్కరాత్రి నిద్రమేల్కొని వున్నామనుకోండి. రైల్లో నించుని ప్రయాణం చేసాము. ఆయుర్దాయం తగ్గుతుందా? తగ్గదా? శరీరంమీద ప్రభావం ఉంటుందా? ఉండదా? ఇవన్నీ కలిసి నిరుపక్రమ కర్మ సోపక్రమ కర్మ మొత్తం. అవి ఎక్కడదాకా తీసుకొస్తున్నాయో నీకు యోగాభ్యాసం చేస్తే తెలుస్తుందన్నాడు. ఏ రోజుదాక ఈ శరీరము వుంటుందో తెలిసి యింకా అరిష్టము కూడ తెలుస్తుంది. ఇవాళ రైలుకి బయల్దేరుతున్నా రనుకోండి. పోనీ యివాళ మానేయండిరా అంటే మానేస్తారు. ఆరోజు రైలు పడిపోయింది. కొన్ని బోగీలు ముక్కలయి పోయినాయి. వందలమంది చచ్చారన్నారు. అదిగో అలాంటివి అరిష్ట జ్ఞానమంటే. వాడికి ఎందుకు ఆగమన్నాడో తెలీదు. ప్రయాణం చేస్తుంటే ఆగమంటాడు. ఇవాళ మానేసేయి నాయనా అంటాడు.

వారికేం తెలుసు బిజినెస్ కదా అనుకుంటూ వెళ్ళిపోతాడు. వాడికేం తెలీదు ఎందుకు వద్దన్నాడో. వారిద్వారా వద్దని అనిపించింది. దానిపేరు 'అరిష్టేభ్యో వా' అరిష్టముల ద్వారాకూడ జ్ఞానం వస్తుంది. జ్ఞానమంటే వీడి మనస్సుకి తెలియనక్కరలేదు. వాడిద్వారా అనిపిస్తుంది. మీ కిదివరకు ఒకమాటు చెప్పాను ఈ కథ. హైదరాబాదు నుండి సినిమా రీళ్ళు తీసికెళ్ళటానికి విజయవాడ వస్తున్నాడు ఒకహోలు ప్రొప్రయిటరు. తరువాత రైలుకెడితే యింకోడు తీసికెళ్ళిపోతాడు ఆ సినిమాని. బెజవాడలో వున్నారు దాని డిస్ట్రిబ్యూటర్స్. వెళుతూ గురువుగారి దగ్గరికి వెళ్ళాడు. బండికి యింకా 6 నిమిషాలు టైముంది. కారుమీద వెళ్ళాడు. గురువుగారు జపంలో వున్నారన్నారు. లేచేటప్పటికి $1\frac{1}{2}$ నిముషం టైముంది. గురువుగారు లేచి కళ్ళుతెరిచి ఏంనాయనా అంటే ఇలా వెడుతున్నాను. అంటే కూర్చో రేపొద్దున్న వెడదువుగాని అన్నారు. నాలుగు మాట్లు రెట్టించాడు. దణ్ణంపెట్టేసి బొట్టు పెట్టించుకొని వెళ్ళిపోయాడు. వెళితే బండి తప్పిపోయింది. సికింద్రాబాదు స్టేషన్‌లో కారు వేసుకొని వెంటబడ్డాడు. చిట్టచివరికి జనగాం వంతెనమీంచి రైలంతా ఏట్లోకి పడిపోయింది. అపుడు గుండె చరచుకొని వచ్చాడు. ఆయనకు తెలుసునా? ఆయనకి తెలుసుగాని, ఆయన మనస్సుకి తెలీదు. అది ఎవరికైనా అంతే! అది తెలుసుకోవాలి మనం. కనుక 'అరిష్టేభ్యో వా జ్ఞానమ్' అరిష్టముల యొక్క జ్ఞానము కూడ తెలుస్తుంది యోగాభ్యాసం చేసినవాడికి. ఎవడైనా ఎదురుగుండా వచ్చేటప్పటికి తెలుస్తుంది వాణ్ణి గురించి. ఒంగోలులో ఒక ఆయుర్వేదం డాక్టరుగారు ఉండేవారు మా చిన్నప్పుడు. చిలకపాటి ఆచార్యులవారు. వారు చాల పెద్దవారు. ఆయన వాకిట్లో కూర్చొని రోగుల్ని చూస్తుండగా గోడ అడ్డం వుంది. వెనుక తోటకూర తట్టనిండా తీసుకొచ్చి అమ్ముతున్నాడు. ఈయన వాడి గొంతు విన్నాడు. ఆగండి అని పేషెంట్స్‌ని ఆపి వెనక్కివెళ్ళి ఈ తట్టెడు తోటకూర ఎంతకిస్తావు? అన్నాడు. ఎందుకు అయ్యగారు అంటే మందుకి అన్నాడు. ఏదోవాడు చెప్పాడు. ఆ తోటకూర అక్కడ పోసేయమన్నాడు. ఆ డబ్బులిచ్చేసి నువ్వు యింటికి సూటిగా వెళ్ళిపో అన్నాడు. వాడింటికి సూటిగా వెళ్ళిపోయాడు. వెళ్ళంగానే భార్య పిల్లలతో వీడింక గంటన్నరలో చనిపోతాడని చెప్పాడు. సరిగ్గా వాడు గంటన్నరలో చనిపోయాడు. వాడి దృష్టిలో వాడికి ఏ జబ్బులేదనే అనుకుంటున్నాడు. రోజూ అమ్ముకుంటూనే

ఉన్నాడు. అది తెలుస్తుంది. కనుక ఈ సంయమం చేస్తే ఉచ్ఛ్వాస నిశ్వాసల మీద సంయమం, గుండె కొట్టుకుంటం మీద సంయమం, తర్వాత నిత్య దినచర్యమీద సంయమం చేసి ఈ జరుగుతున్న సన్నివేశాల మీద కర్మని సంయమంచేస్తే వస్తూన్న ప్రతీదిని మన పూర్వకర్మచేత జరుగుతున్నవిగా తెలుసుకోవాలి. చుట్టూవున్న జనం అంతాకూడ, ఇంతమంది యిక్కడ ఎందుకు కూర్చున్నారు. అంటే మన పూర్వకర్మ వశంచేత, మనకి వాళ్ళకి సంబంధం ఉండటంచేత కూర్చున్నారుగాని, మనం మొనగాళ్ళం కాబట్టి కూర్చోలేదు. అది తెలుసుకోవాలి. అలాగ పూర్వకర్మ వశంచేత అని తెలుసుకొని దానిమీద సంయమం చేయటంవల్ల 'అపరాంత జ్ఞానమ్' శరీరము అంతమయ్యేటు వంటి జ్ఞానమున్నూ, అలాగే 'అరిష్టేభ్యః జ్ఞానం వా' అరిష్టములు అంటే ఆపదలనుండి వచ్చేటువంటి జ్ఞానము కూడాను వస్తుంది. అంటే అపమృత్యువులు అంటారు వీట్లనే. వాట్లనుండి వచ్చే జ్ఞానం ఈ రెండు కూడ తెలుస్తాయి. ఇలాంటి వాళ్ళకి చెప్పిన ప్రాక్టీసే 'ఛాయా పురుష దర్శన' అని ఒకటి చెప్పారు పెద్దలు. రాత్రిపూట విశాలంగా వున్నటువంటి చోటికి వెళ్ళి, డాబావుంటే డాబామీదకి వెళ్ళి వెన్నెల రాత్రుళ్ళు కాకుండా చూచుకొని, మబ్బు లేకుండా చూచుకొని ఒక దీపం పెట్టుకోండి. ప్రక్కకి తిరిగి నిల్చుని మీ క్రీనీడ మీరు చూడండి. దానివంక చూసి కళ్ళు మూసికొని తల ఎత్తి ఆకాశములోకి కళ్ళు తెరవండి. మీది పెద్ద క్రీనీడ కన్పిస్తుంది. అక్కడ కళ్ళమీద భ్రాంతి. ఆ కన్పించే దాంట్లో ఏయే భాగాలు ఎలా వంకరలు తిరిగి ఉన్నా, ఏ లోపాలు ఉన్నా పెద్దవిగా వున్నా చిన్నవిగా వున్నా మీకేం జరుగబోతోందో, శరీరానికి ఆరోగ్యం, అనారోగ్యం రాబోతోందో మొదలైనవన్నీ కన్పిస్తాయి. ఇహ అయిపోయింది మన ఆయుర్దాయం అన్నటువంటి రోజున ఏం తెలుస్తుందో తెలుసునా? శరీరం అంతా కన్పిస్తున్నది గాని తలకాయ కన్పించదు అక్కడ. ఇది ఛాయా పురుష దర్శనము అని పెద్దశాస్త్రం. అందరికీ పనిచేయదు ఇది. ఈ అభ్యాసం చేసినవాళ్ళకే పనిచేస్తుంది. ఎందుకంటే మనకి ప్రతీవాళ్ళకి చావుని గురించి బుర్రలో పుట్టెడు భావాలు ఉంటాయి. ఎంత చదువుకున్న వాళ్ళమైనా.

## 24. మైత్ర్యాదిషు బలాని।

మైత్ర్యాదిషు = మైత్రి మొదలగు వానియందు (సంయమము చేసినచో); బలాని = బలము మొదలైనవి సంక్రమించును.

మైత్రి మున్నగు సద్గుణముల సంయమము వలన అది కలవారి బలము సంక్రమించును. (మైత్రి కలవారు, కరుణ కలవారు సంతోషముతో జీవించువారు అగు తా నెరిగిన వ్యక్తులను సంయమముచే ధ్యానించుట వలన ఆయా సామర్థ్యములు తనయందు నిండును.)

**వివరణ :** మైత్రి మొదలగు వానియందు సంయమము చేసినచో బలము మొదలగునవి సంక్రమిస్తాయి. అవతలివాడు మంచివాడు అన్నారనుకోండి. మనలో మొదటి అధ్యాయంలో (33వ సూత్రము) చెప్పిన మైత్రి పనిచేయాలి. చెడ్డవాడు అన్నారనుకోండి. మనలో వున్నటువంటి ఉదాసీనత పనిచేయాలి. అంటే వాడి చెడ్డ లక్షణాలతో మనకేం పని అనే ఇంగిత జ్ఞానము పనిచేయాలి. అలాగే అవతలి వాడిలో శోకము వుందనుకోండి, మీరు కరుణతో సంయమము చేయాలి. ఇలా చెప్పాడు కొన్ని. Wrong connections లేకుండా వుండేవి. మంచి ఆరోగ్యంగా బలంగా వున్న వాడితో మైత్రీ భావంచేసి, వాడు వెళ్ళిన తర్వాత కూడ వాడి బలం గురించి సంయమము చేసినట్లైతే క్రమంగా ఆరోజుకారోజు వాడికున్నటువంటి బలంలాగ మనకు బలం పెరుగుతుంది, ఏడాది రెండేళ్ళలో. అలాగే వాడి మానసికమైన అతీత ప్రజ్ఞలు వున్నాయనుకోండి. ఆ ప్రజ్ఞలు సామాన్యముగా ఒకడినుంచి ఒకడికి ఎందుకు రావో తెలుసునా ప్రపంచములో. మధ్యలో water tight compartments ఉన్నాయి. అంటే వాడి కున్నాయిట ప్రజ్ఞలు అంటే ఏడిసాడు అన్పిస్తుంది. అనేటప్పటికి దానికి, దీనికి మధ్యన దిగ్బంధనం ఏర్పడి అక్కడనించి యిక్కడికి చచ్చినా రావు యింక. నీటి చుక్కకూడ దిగదు. Water proof, Brain proof, Mind proof, Goodness proof యింకేం లేదు. అది లేకుండా ఉంటే వాడితో మీరు స్నేహం చేసినటువంటి కొద్దికాలంలో మీ స్వభావం (temperament) లో వున్నటువంటి విరుద్ధ లక్షణములు (Abnor-

malities ) సర్దుకుపోవాలో, అవి సర్దుకుపోతాయి. ప్రపంచంలో మనం ఎవరెవరితో అయితే మైత్రి మొదలైనవి చేస్తున్నామో వాళ్ళవల్ల పరస్పరత్వం ఏర్పడి law of compensation అనే దాని ప్రకారం supplementary values workout అవుతాయి. క్రమంగా ప్రపంచంలో మనం ఎరిగున్నటువంటి ప్రతి ఒక్కడివల్ల కూడ మనకు పరిపూర్ణత దయ చేయబడుతుంది. ఎందుకంటే అన్నిరూపాల్లోనూ వున్నవాడు ఒక దైవము గనుక. ఇలా ప్రయోగం చేసుకోండి అన్నాడు. ఇందులో ఎంత బాగా వినియోగించుకుంటారనేది మీ సంస్కారం మీద ఆధారపడి ఉంటుంది. చిల్లర విషయాలకి వినియోగం చేసుకుంటాడా? లేకపోతే లాటరీ టికెట్టు ఏ నెంబరు వస్తుందా అని ఆలోచిస్తాడా. కనుక 'మైత్ర్యాదిషు బలాని' మైత్రి మొదలైన వాటియందు బలం మొదలైనవి కూడ వస్తాయి అని చెప్పాడు.

# 25. బలేషు హస్తి బలాదీని।

బలేషు = బలవంతులపై (సంయమాత్ = సంయమము నిలుపగా); హస్తిబలాదీని = ఏనుగుల బలము (కలుగును).

బలవంతులపై సంయమము నిలుపగా ఏనుగుల బలము మున్నగునవి కలుగును. (ఏనుగుపై సంయమము చేసినచో ఒక విధమైన బలము, సింహముపై సంయమము చేసినచో ఒక విధమైన బలము ప్రత్యేకముగా కలుగును.)

**వివరణ :** ఎలాగు బలం రావటం అనే మార్గము పెట్టుకున్నారు గనుక, నిజంగా ధృడత్వమే కావాలి కనుక, పుట్టుకచేత శరీర దౌర్బల్యం కలవాడున్నా డనుకోండి. ఒక సర్కస్‌లోనో లేకపోతే దూరం నించో బ్రహ్మాండమైన పుష్టి గలిగిన మదపుటేనుగు అరుస్తూ పరిగెడుతూ ఉండంగ ఒకమాటు చూపించండి వాడికి. బొమ్మలో చూట్టం, సినిమాలో చూట్టంకాదు. సినిమాలో చూస్తే వాడికి mental గా intelectual గా picture పడుతుంది గాని ప్రాణామయ కోశానికి (vital contact) సంబంధం లేదు. లేదా ఒక శుభ్రమైన పుష్టిగా వున్న ఏనుగు చేత తాకించండి ఒకమాటు. ఒక పదిమాట్లు నెత్తిన ఆశీర్వచనం చేస్తుంది స్వాముల వారిలాగ చెయ్యెత్తి. అదొకమాటు అరుస్తుండగా వినిపించండి వాడికి. ఆ కోనేట్లో ఆ ఏనుగు స్నానం చేస్తుండంగ చూపించండి. తరువాత వాడికి యోగాభ్యాసం చేయరా అబ్బాయి అని ఏనుగుమీద సంయమము చేయించండి. వాడు ఎంత వాడవుతాడో చూడండి. వాడి బలము ఎంతవుతుందో చూడండి. మనకి భీముడు మొదలైన వాళ్ళ కథలున్నాయి. బ్రాహ్మణ వేషములో వున్న పాండవుల గురించి స్వయంవరం అయినాక, కుంతి ద్రౌపదితో అంటుంది. మంచి కండలు కలిగి, ధీమాగా కూర్చున్నాడే వాడికి సగము పెట్టు. మిగతావాళ్ళం సగం తిందాము. పేర్లు చెప్పలేదు యింకా. చెప్పవచ్చో, చెప్పకూడదో ఆవిడకు తెలియదు. ధర్మరాజు ఆవిడ మాట్లాడుకున్నాకే పేర్లు బయటికి వచ్చాయి. ''వాడు నాగాయుత బలుడు అబలా'' అంటే పదివేల ఏనుగుల బలం వాడు పిలిస్తే వస్తుంది. వాడు గద విసిరినట్లైతే వస్తుంది. తప్పకుండా వస్తుంది. రిజర్వులో వుంటుంది ఆ బలము. శరీరములో ఉండదు. కండల్లో ఉండదు. గోధుమ తింటే వచ్చే

బలము కాదు. గుడ్లు తాగితే వచ్చే బలంకాదు. పప్పు, నెయ్యి తాగితే వచ్చే బలంకాదు. వేటపోతుల్ని తింటే వచ్చే బలంకాదు. ఆ బలం భౌతికబలం. ఇదివేరు. ఆకాశం (space) లోంచి energy centres లోకి ఆకర్షించేటువంటి శక్తులు (energies) ఉన్నాయి. ఆ బలం యిది. అది చాతనవుతుంది. కనుక 'బలాదిషు హస్తి బలాదీని' బలం మొదలైన వాటియందు కావలసి వస్తే హస్తి బలం సంయమం చేయండి, వస్తుంది అన్నాడు. అలాగే ధైర్యానికి, ఒక ధైర్యవంతుణ్ణి తీసుకోండి. లేదా ధైర్యానికి సంబంధించిన జంతువైన సింహాన్ని దూరం నించి చూపించండి. సర్కస్‌లోనో ఎక్కడైనా తెలుస్తుంది. అపుడు సింహం జపం చేయమనండి. అదీ పద్ధతి. ఇక్కడ హీలింగ్ అనే పద్ధతి కూడ చెప్పారు. అంటే వాడే చేసుకోనక్కర్లేదు. మీరు యోగాభ్యాసం చేస్తే వాడు మీ దగ్గర కూర్చుంటే వాడికి ఈ idea suggestion యిచ్చి మీరు రోజూ సంయమము చేస్తే ఒక 40 రోజుల్లో వాడికి చక్కగా ఒంట్లో దారుఢ్యం, పుష్టి వస్తుంది. నీరసం తగ్గుతుంది. Healing అంటారు దీన్ని. యివన్నీ కూడా జ్వాల్‌కూల్‌గారు 'Esoteric Healing' అనే పుస్తకంలో వివరించారు. 21వ శతాబ్దపు వైద్యశాస్త్రానికి పనికివస్తుంది. యిపుడు మనం అంగీకరించడానికి సిద్ధంగా లేము. మన బుద్ధి అంత సైంటిఫిక్‌గా ఎదగలేదు. కావలసిన వాళ్ళు యిపుడే ఉపయోగించు కోవచ్చు. Those who are advanced can use these methods అని చెప్పారు. 'బలేషు హస్తి బలాదీని' అన్న సూత్రం యిష్టదేవతా ధ్యానంలో కొంత భాగంగా యిమిడి వుంటుంది. అంటే గజాననుడిని స్మరిస్తూ వున్నపుడు గణపతియొక్క శారీరిక, మానసిక బలములు యివన్నీ దానికి చెంది వుంటాయి. అలాగే గరుత్మంతుణ్ణి స్మరిస్తూ ఉన్నపుడు ఆ స్థైర్యము, సాహసం, ధైర్యము, ఆత్మవిశ్వాసంతో కూడినటువంటి ఆత్మ సమర్పణము అవన్నీ కలిస్తే గరుత్మంతుడు. ఇవి formula క్రింద యిచ్చారు. అంటే ధైర్యము, సాహసం ఇవన్నీ కలిసివుండి వీటితో ఆత్మ సమర్పణ కలిసి లేకపోయినట్లైతే మనకి వుపయోగించదు. మనకున్న స్థైర్యం మొదలైనవన్నీ యింకొకడికి ఎవడికో వుపయోగిస్తాయి. అంటే మనం kenetic అవుతాము. అందుచేత ఆత్మ సమర్పణతో కూడినటువంటి symbols యిచ్చారు. గరుత్మంతుణ్ణి మనం స్మరించి వాళ్ళ చెప్పిన స్తోత్రాదులు అవి చేయటం. గరుడోపాఖ్యానం వినటం మొదలైన దాంతో ఆ బలం, ధైర్య స్థైర్యములు

వస్తాయి. యిట్లాగే హయగ్రీవుడు అనేటువంటి మూర్తిని సంయమము చేసినట్లైతే అశ్వము గురించి, వేదాలు దగ్గరనుంచి యిప్పటిదాకా చూచి వాళ్ళు ఏం గ్రహించారో తెలుస్తుంది. శరీరంలో ఏ భాగాన్నైనా కదిలించగల జంతువు గుఱ్ఱం ఒక్కటే. అది వాళ్ళు చూచారు. అంటే ఈగవాలితే ఆ ఈగ ఎక్కడ వాలిందో అక్కడే చర్మము కదిలిస్తుంది గుఱ్ఱం. అలాంటివి యింకా రెండు మూడు రకాల జంతువులున్నాయి. కాని మొట్టమొదటి రాంకు గెల్చుకునేది గుఱ్ఱమే. వాళ్ళు గమనించిన దేమిటంటే గుఱ్ఱం శరీరంలో ఆకారం ఎక్కువ బలం, అందులో నిండి వున్న పదార్థంకన్నా. గుఱ్ఱానికి జబ్బుచేస్తే తప్ప. అలా వున్నటువంటి జంతువుల్లో గుఱ్ఱం ఒక్కటే. కాయం, కాయరూపం అన్నారు కదా. కాయం కన్నా రూపం బలంగా వున్నటువంటి జంతువు మొట్టమొదటిది గుఱ్ఱం. మన శరీరాన్ని కదిలించి నడిపిస్తున్నది ప్రాణమయ కోశము లేక vital body. దానిని గుఱ్ఱంతో పోల్చి వేదాల దగ్గరనుంచి మనకి ఈరోజు వరకు వున్నాయి. ద్రష్టలైనటువంటి వాళ్ళ కవి సమయాలున్నాయి. కవి సమయాలంటే lirical poets, epic poets చేస్తున్నటువంటి పోలికలు మొదలైనవి కవిసమయాల క్రింద లెక్కలోకి రావు. అవి వినోదానికి, మనస్సుకి ఆహ్లాదానికి పనికొస్తాయి గాని, అవి దాటి revelations కి పనికొచ్చేటువంటిది భారత, భాగవత, రామయణాలు, ఉపనిషత్తులు, వేదాలు మరి Old Testament అట్లాంటి గ్రంథాల్లోకి వెళ్ళాలి. అంటే వాళ్ళ సాహిత్యం ఉపయోగించుకోవాలి. వారు ఎక్కడిదాక పరిణామం చెందారో తెలుసుకోవాలి. అపుడు పుట్టిన పొయిట్రీ ఇపుడు పుట్టిన పొయిట్రీకాదు. The future of poetry అనేటువంటిది మనకి అరవిందులు రాసారు. అందులో చదివితే కొన్ని కొన్ని సూచనలిచ్చారు. మళ్ళీ ఆ స్థాయిని అందుకోవటానికి వీలుంది అన్నారు. వాళ్ళ కవి సమయాలు వేరు. మిగతా కవి సమయాలు వేరు. ఈ సూత్రాల్లో అప్పటి కవి సమయాలు కొన్ని చూస్తాం. ఆ సంప్రదాయం కొంత తెగింది. రసపుష్టి, తుష్టి, పాత్ర పోషణ, పాత్రచిత్రణం మొదలైన వాటిలో మార్పులొచ్చాయి. Literacy excellence మిగిలింది. అదికాదు యిక్కడ. గుఱ్ఱం సూర్యలోకం లోంచి భూమికి దిగి వచ్చింది. సూర్యుని తేజస్సు అంటే సూర్యుని భార్య ఆడ గుఱ్ఱమై భూమికి దిగివచ్చింది. కథలు ఎట్లా వుంటాయో చూడండి. ఆవిడని విడిచి వుండలేక సూర్యుడు కూడ మగ

ఓల్టమై భూమికి దిగివచ్చాడు. ఇక్కడ వాళ్ళిద్దరికీ సంతానం కలిగారు. అంటే he origin of what we call life. అని చెప్పాలి. అవి చెప్పాలంటే అలా చెబుతాయి ఆ పుస్తకాలు. అంటే సృష్టిని గురించి చెప్పాలంటే life ని గురించి చెప్పగలగాలి. అంటే form గురించి చెప్పగలగాలి. తర్వాత the content of the form, matter అనే concept ని గురించి చెప్పగలగాలి. అంటే ఏ మూడింటిని గురించి అయితే uptodate modern science కి యింతవరకు జవాబులు లేవో అని చెప్పగలగాలి. light అంటే ఏమిటో చెప్పగలగాలి. Modern science కి యింతవరకు light అంటే ఏమిటో చెప్పటానికి ఏమీలేదు. Darkness యే light గురించి చెప్పాలంటే. అలాగే sound అంటే ఏమిటో, sound vibrations గురించి చెప్పటమేగాని sound ని గురించి చెప్పగలిగిందేమీ లేదు, modern science కి ఈరోజు వరకు. Sound principle తెలియాలి. తరువాత mental light అంటే ఏమిటో, mental sound అంటే ఏమిటో తెలిసేటువంటి scientific age లోకి వెళ్ళాలి. అంటే గత శతాబ్దాల్లోకైనా వెళ్ళాలి. రెండు మూడు శతాబ్దాలు ముందుకైనా వెళ్ళాలి, ఇపుడున్న విజ్ఞానం సరిపోదు. అందుకని ఈ పుస్తకాల్లో ఈ గుట్టం మొదలైనవి చెప్పినపుడు జాగ్రత్తగా నిదానించి చూడాలి. మన శరీరాన్ని కదిలిస్తున్నది ఏమిటి? శక్తి. దానిముందు ఏశక్తి అంటారు? ప్రాణం. అది ఎక్కడ నుండి పుడుతూ వున్నది. తెలియని పిచ్చి సన్యాసి ఏమని చెబుతాడు. ఆహారం నుంచి, పానీయం నుండి పుడుతోంది అంటాడు. అంటే fuel నుండి energy పుడుతుంది. అంటే అది విజ్ఞానమా? Fuel నుంచి combustion జరిగితే energy manifest అవుతోంది. అంతేగాని fuel నుంచి energy పుట్టదు ఎపుడున్నూ. అంటే combustion process ఎక్కడ జరుగుతోంది. అగ్ని ఎక్కడ వున్నది? చోటులో ఎక్కడపడితే అక్కడే వున్నది అన్నాడు. అక్కడ manifest అయితే 'పురుహూతః' మాటిమాటికి పిలవబడుతూ వుండేవాడు. పురుష్టుతః మాటిమాటికి పిలవబడుతూ వుండేవాడు. మాటిమాటికి కంఠధ్వనులపేర జీవరాశుల రూపంలో స్తోత్రం చేయబడుతూ ఉండేవాడున్నూ ''పురుహూతం పురుష్టుతం ఆద్యం పురుషమాసీనం'' పురుహూతం పురుష్టుతం అన్ని పురాణాల్లోను, భారతంలోను, భాగవతంలోను మొట్టమొదట ప్రార్థన శ్లోకం యిది. ఆదిపురుషుడు ఎక్కడ వుంటాడు?

space గా వుంటాడు. వాడెలా తయారవుతాడు. Space pulsates అంటే ఏమిటి? దానికి ప్రాణ ఆపాన స్థితి వస్తుంది. అంటే polarity in space అన్నారు జ్వాల్‌కూల్‌గారు. అది వచ్చేటప్పటికి ఉచ్ఛ్వాస, నిశ్వాసలు పుడతాయి. చోటులో చోటు దేహం ఒకటి, చోటు ఒకటి ఏర్పడతాయి. అపుడు చోటులో దేహాలు ఏర్పడతాయి. దేహంతో ఉచ్ఛ్వాస, నిశ్వాసలు పీల్చే జీవి ఏర్పడుతుంది. కంఠము, ధ్వని ఏర్పడుతాయి. ఈధ్వనిచే, ఎవడయితే యిలా ఏర్పాటయ్యాడో వాడు నిరంతరం స్తోత్రం చేయబడుతూ వుంటాడు. కాని మన కంఠధ్వని చేత మనద్వారా మాట్లాడుతున్న ఆయన్ని గుర్తించక ఉప్పు, చింతపండు, మన జీతం, ఉద్యోగం, ప్రమోషన్లు చెప్పబడుతున్నాయని మనం అనుకుంటున్నాం. ఎక్కడ నుంచి వస్తూన్నది ఈ అగ్ని. Combustion అనేటువంటిది space లో వున్నది. అక్కడ sound యొక్క pool గా వుండి sound గా యివతలికి వస్తోంది. Pre-electric man, electromagnetic phenomina కింద అందులో వుండి, మనం electro mangnetic plant గనుక పెడితే దాంట్లోంచి యివతలకి వస్తోంది. నీళ్ళని ఎత్తునుంచి క్రిందికి పోస్తే దాంట్లో యిమిడి ఉన్నటువంటి చెట్లని, రాళ్ళని, ఇసుకని మొత్తం అన్నింటినీ కూడ ఎలా అయితే సెలయేళ్ళలో క్షాళనం చేసిపారేస్తుందో, అంటే potential energy కాస్త kinetic energy గా వస్తుందో, అంతవరకు మాత్రం modern science సంతోషించవచ్చు. కనీసం రెండు రకాలైన energy ఉంటుందని అంగీకరించారు. రెండు రకాలుంటాయి అని ఒప్పుకున్నాం యిప్పటికి modern science లో. Inter convertables అదికూడ ఒప్పుకున్నారు. ఏది? Potential energy, Kinetic energy. ఆపైన ఒప్పుకుంటానికి యింకా ఒకటి రెండు శతాబ్దాల దాక అంధత్వంలో ఉన్నాం మనం. యుద్ధాలు రాకుండా ఉండే స్థితి సైన్సు వచ్చేవరకు కూడ యిటుపైన ఉన్న సృష్టి రహస్యాలు మానవుడికి అందవు. అందుకని ఈ వేదాల్లో చెప్పిన గుట్టుము మొదలైనవి మనకి బోధపడాలంటే వాళ్ళున్నటువంటి యుగములోకి వెళ్ళాలి వాళ్ళున్న యుగంలో మతాల్లేవు. సనాతన ధర్మం అనేటువంటి universal law వుందిగాని ఈ మతాలు అనే degradation లేదు. అందుకని ఆ స్థాయిలోకి వెళ్ళగలిగిన వాళ్ళు అరవిందో మొదలైన మహనీయులు మాత్రమే. దాన్ని చూచి మార్గము చూపించగలిగారు.

మిగతావాళ్ళు వేదాలమీద వ్రాసినవి పగిలిపోయిన గ్రామఫోను రికార్డులల్లే గ్రుంటాయి. అందుకనే అరవిందో గట్టిగా నోరు చేసుకోవాల్సి వచ్చింది. 'మీకు కాని విషయాలు మీరు మాట్లాడకుండా ఉండటం చాల మంచిదని'' చెప్పాడు. కనుక మతపరంగా చూచేవాళ్ళు లేరు. ద్రష్టలై చూచినటు వంటివాళ్ళు లేరు. మనకు ఈ వేదంలో ఉన్నటువంటి symbols యిచ్చినవాళ్ళు ద్రష్టలు తప్ప పండితులు కారు. పండితులు పనికిరారు ఈ విద్యకి. మనకి కావలసినది ద్రష్టలు. వాళ్ళ చూచి ఇచ్చేటటువంటి వాళ్ళు కావాలి. Electricity యిచ్చే వాడు కావాలిగాని, Electricity ని గురించి పుస్తకం బోధించే వాడక్కర్లేదు. Connections యిచ్చేవాడు కావాలి. పుస్తకం మనమే చదువుకుంటాం. అది కావల్సి వచ్చినపుడు అశ్వమనగా నేమి? ప్రాణమయ కోశం. మైధ్యాశ్వమనగా నేమి? అంటే అశ్వమేధం చేసేవాడి శరీరములో ఉన్నటువంటి అశ్వం. అంటే ఏమిటి? దేనికైనా సరే విశ్వశ్రేయానికి (universal cause) సమర్పణ అయిన వాడి శరీరములో ఉన్న ప్రాణమయ కోశాన్ని, అశ్వమేధం జరిగిన అశ్వం అంటారు. ఇట్లా వస్తాయి. ఈ సంజ్ఞలన్నీ మనం బోధపరచుకోవాలి. యివి చదువుకుంటూ ఉన్నపుడు, ఇక్కడ నుండి వస్తున్నటువంటి సూత్రాలు చదువుకుంటున్నపుడు గణపతిని ధ్యానం చేయటం, హయశీర్షం అంటే హయగ్రీవుడు అనేవాణ్ణి ధ్యానం చేయడం, నారసింహం అనేవాణ్ణి ధ్యానం చేయడం, యిలాంటివన్నీ కూడను తమాషాగా మన ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయాది కోశములలో వున్నటువంటి స్థూల, సూక్ష్మ మలముల క్షాళనం జరిగి మనలో వున్నటువంటి జంతుమయ, పశుమయ లోకములన్నీ కూడ మానవత్వంలోకి వచ్చి అక్కడనుంచి దివ్యత్వంలోకి అడుగు పెట్టడానికి దారితీస్తాయి. అందుకనే ''నీ సకలెవ్వరే నెరుగు'' పాండురంగ మహాత్యంలో తెనాలి రామకృష్ణుడు అన్నాడు. వాడెవడినో పాపం ఋషి పెళ్ళి చేసుకోమని చెపితే చేసుకోనని ఇంట్లోంచి వెళ్ళిపోతే వాణ్ణి ఋషి నువ్వు కప్ప అయిపో అని శపించాడు. వాణ్ణి ఎక్కడ పడి ఉండమన్నారు అని అడిగితే నరసింహస్వామి ఆలయం దగ్గర పడి ఉండమన్నాడు. ఆ నరసింహస్వామిని చూచి కప్ప అయిపోబోయే ముందు వాడు ప్రార్థన చేస్తున్నాడు. ''నువ్వు నర మృగ రూప విస్ఫురణ'' యిటు నరులకీ, యిటు మృగానికీ కూడ రూప విస్ఫురణతో ఉన్నావు. నాబోటి వాళ్ళకి యింకెవరు పరమాత్మ? తర్వాత నీ 'సకలు' అంటే

సింహం యొక్క జూలు కేశాలు అని అర్థం. సకలు అంటే మాయలు, లీలలు అని అర్థము. 'ఎవ్వరేని ఎరుగు' ఎవరికి తెలుసును. యిక్కడెందుకు పడివుంటానో నాకేం తెలుసు. శాపవిమోచనం ఎక్కడో అనుకుంటూ అంటాడు. అంటే ఏమిటి? మనలో వున్నటువంటి పశుప్రవృత్తులన్నీ (animal instincts) తొలగిపోతాయి. మైధాలజీ మీద వ్రాయబడిన మిగిలినవన్నీ సామాన్యంగా చదువుకునేటువంటి వాళ్ళ మనసులన్నీ కలుషితం చేసిపారేశాయి. అందుకే బ్లావెట్స్కీ మొదలైనవాళ్ళు అటువంటి వాళ్ళమీద అంత గట్టిగా నోరు చేసుకోవాల్సి వచ్చింది. Grimn's law is no philosophy అన్నది. మాక్స్‌ముల్లర్‌ని గురించి మాట్లాడుతూ ఫైలాలజీ చెప్పి ఫిలాసఫీ అంటాడేమిటంది. ''అజామేకాం లోహిత శుక్ల కృష్ణా బహ్వీం ప్రజాం జనయంతీం'' అని మంత్రం ఉంటే దానికి మాక్సుముల్లర్ రాసినదే అజాం అంటే గుఱ్ఱం; ఏకాం అంటే ఒకటి ఒక గుఱ్ఱం అని; లోహిత శుక్ల కృష్ణాం తెల్లని, ఎర్రని, నల్లని మచ్చలు కలదానిని తీసుకురావాలి అన్నాడు. యజ్ఞంలో కైమా చేయాలన్నాడు. అదీ రాశాడు. ఆయన్ని అనటం కాదు. ఆయనకి చెప్పినవాడిని అనాలి. అజాం అంటే జన్మ లేనటువంటిది, వీటిల్లోకి యింకా దిగనిది. అంటే life. ప్రాణమయ కోశాన్ని గురించి చెబుతూ గొఱ్ఱె, గుఱ్ఱము రెండు స్థితుల్లలో రెండింటితో పోల్చారు. ''లోహిత శుక్ల కృష్ణాం'' ఎర్రని అంటే రజగుణంతో కూడిన, శుక్ల అంటే నల్లని అంటే తమోగుణంతో కూడిన ఈ మూడింటి గుణాలతో వ్యక్తమవుతున్న లక్షణం కలిగినది. 'బహ్వీం ప్రజాం జనయంతీం' పుట్టలు, పుట్టలు కోట్ల కోట్ల species ప్రపంచంలో రూపాల్ని ఉత్పత్తి చేస్తున్నటు వంటిది. దాన్నివాడు చెబుతూన్నాడు. అలాంటి గొఱ్ఱెని తీసుకురా యజ్ఞంచేస్తే. కనుక గుఱ్ఱం తలకాయ ఉండి మనిషి శరీరం ఉన్న దేవుడు, ఏనుగు తలకాయ - మనిషి శరీరమున్న దేవుడు, సింహం తలకాయ - మనిషి శరీరం ఉన్న దేవుడు, అడివిపంది తలకాయ - మనిషి శరీరం వున్న దేవుడు, యిష్ట దేవతలాగ ధ్యాన స్వరూపంగా పెద్దలు ఎందుకు పెట్టారు? ఎందుకు ఈ రూపాలు ఏర్పడ్డాయంటే 'బలాదిషు హస్తి బలాదీని' అన్నటువంటి ఆ ధర్మం ప్రకారం ఏర్పడ్డాయి.

## 26. ప్రవృత్త్యాలోకన్యాసాత్సూక్ష్మవ్యవహిత విప్రకృష్ట జ్ఞానమ్।

ప్రవృత్తి = ప్రవర్తన యందు; ఆలోకం = కిరణాన్ని; న్యాసాత్ = ఉంచుటవలన; సూక్ష్మ = సూక్ష్మ జ్ఞానము. (subtle unknowable aspects of wisdom). వ్యవహిత = విడదీయబడిన; విప్రకృష్ట = వియోగం చెందిన; జ్ఞానమ్ = జ్ఞానము (కలుగును).

బాహ్య ప్రపంచముపై మనకు కలుగుచున్న వెలుతురును సంయమముచే గమనించినచో అతిసూక్ష్మములు దాగివున్నవి, దూరముగా నున్నవి అగు వస్తువుల జ్ఞానము కలుగును.

**వివరణ :** ఇంతవరకు చెప్పబడిన దానినుంచి సబ్జక్టు మలుపు తీసుకుంటుంది. యిక్కడ కొంచెం వెనక్కి తిరగిచూద్దాం. ధారణ, ధ్యాన, సమాధులు అనేవి ఒకటి రెండు మూడు స్థితులలో వస్తాయని చెప్పాడు. అంటే యమ, నియమాదులలో లెక్కవేస్తే 6,7,8 స్థితులు. కాని మొదటే మనకి వార్నింగ్ యిచ్చారు. ఒకటో స్థితి అయ్యాక రెండోస్థితి, రెండో స్థితి అయ్యాక మూడోస్థితి యిలాగ రావన్నాడు. యమం వచ్చాక నియమము అట్లా వుండదు. అష్టాంగములు కదా, తలకాయ పుట్టాక కన్ను, కన్ను పుట్టాక ముక్కు, ముక్కు పుట్టాక చెవి పుట్టడం వుండదు. మనిషి పుడతాడు. యివన్నీ కూడ అలాగే వస్తాయని చెప్పాడు. ఈమూడు చివరి స్థితులు మిగతావాటి కంటే విశేషము అని, అంతరంగమని, అంతఃకరణకి (internal awareness) కి సంబంధించినవి అని చెప్పాడు. ఈ మూడింటికి simultaneity of awareness of consciousness వుంటుంది. దానిపేరే సంయమము. అది రావటం రెండు రకాలు. యోగాభ్యాసం ఎన్నడూ చేయనటువంటి వాడికీ వస్తుంది సంయమము. కాని వచ్చినట్లు, పోయినట్లు తెలీదు. ఇంట్లో దొంగలు పడ్డట్టూ తెలీదు. ఎవడో జేబులోది కొట్టేసినట్టూ తెలీదు టికెట్టువాడు వచ్చి అడిగితే తప్ప. అలాగ సంయమము ఎలాంటి వాడికైనాసరే వస్తుంది. చదువుకోనక్కరలేదు. యోగాభ్యాసం చేయనక్కర్లేదు. గజ్జె కట్టనక్కర్లేదు. కుండలిని పైకి లేపడానికి ప్రయత్నం చేయనక్కర్లేదు. ఇట్లాంటివేమీ అక్కర్లేదు. కాని మిగతావన్నీ వచ్చి పోయినట్లే అదీ వచ్చిపోతుంది. పిచ్చివాడి చేతిలోరాయి.

మంచి రోజులు చెడ్డరోజులు వచ్చి పోవూ అందరికీ! అలాకాకుండా తనరోజులు ఎలా వుండాలో అలా నడిపించుకునే వాడికి ఎలా వుంటుంది. ఆ ముక్క అడిగితే ఆ మొదటివాళ్లు ఏం సమాధానం చెబుతారు? అది సాధ్యమా? సాధ్యంకాదు. ఎందుకంటే మన పూర్వకర్మ వున్నది. గ్రహాలున్నాయి. ఈ ప్రపంచం వున్నది. తిన్నగా పోతూంటే పోనిస్తారా? అంచేత అనుకున్నట్టుగా భవిష్యత్తుని నడపటం మన యిష్టమా? కాని క్రమంగా ఈయన చెప్పిన ప్రణాళికలో జీవితాన్ని నడుపుకుంటే ఈ పూర్వకర్మ అని చెప్పేదంతా మనం చేసుకున్నదే అని తెలుస్తుంది. అందుకని పూర్వకర్మ అనే దాన్ని సృష్టించి దానికి బాధపడి ఏడవక్కర్లేదు. అంటే మనకి బాధ్యత లేదనే దొంగవేషం వేయక్కర్లేదు. ఇపుడు మనమేమన్నా బాధలు పడుతున్నామంటే నిన్న మనం చేసుకొన్నవే అని తెలుస్తుంది. కనుక రేపు బాధలు పడకుండా వుండాలంటే ఇవాళ మనం చేసుకునేది గాని గ్రహాలు చేసేదికాదు అని తెలుస్తుంది. అయితే గ్రహాలు ఏం తెలియజేస్తాయి? నిన్న నువ్వు ఏం చేసుకున్నావో తెలియజేస్తాయి. యింకేంలేదు. ట్రాఫిక్ పోలీసు మనం తప్పుదారిలో వెడితే పట్టుకున్నాట్ట అంటే పోలీసు అక్కడ వున్నాడు కాబట్టే పట్టుకున్నాడు అనేది తప్పు. మనం తప్పు దారిలో వెళ్ళాం కనుక పట్టుకున్నాడన్నది కరెక్టు. కనుక పోలీసు అనేవాడు ఎట్లాంటివాడో గ్రహాలు కూడ అట్లాంటివే. పోలీసు రోడ్డుమీద వెళ్ళే వాళ్ళందర్నీ పట్టుకోడు కదా! అలాగే గ్రహములనగా మనకి మంచి చెడ్డలు నిర్ణయించునవి అనేది శుద్ధ అబద్ధం. మనం నిర్ణయించుకున్న మంచి చెడ్డలనేటువంటి దానికి గడియారం చూసి గంటలు కొట్టునవి అని అర్థము గ్రహాలంటే. యిది తెలుస్తుంది. అది ఎవడి గడియారం వాడికి వుంటుంది లోపల. అది టంగున గంటలు కొడుతూ వుంటుంది. ఇంటర్వ్యూకని రైలెక్కడానికి వెడితే మిస్సవుతుంది. మనకలా రాసి పెట్టి వుంది అంటాం. కాని అది మనమే రాసి పెట్టుకున్నాం. ఎవడూ రాసిపెట్టలేదు. దస్తూరి మనదే. మనం పుట్టినప్పటి నుంచి రోగిష్టిగా వున్నాం. ఎంచేత? అలాంటి తల్లితండ్రులకు పుట్టాం కనుక. అది పూర్వజన్మలో ఏం తిన్నామో, ఏం తాగామో, స్త్రీ పురుష సంబంధం ఎలా నడుపుకున్నామో, ఈ శరీరాన్ని ఎలా వుపయోగించుకున్నామో, నిద్ర ఎలా వుపయోగించుకున్నామో, శ్రమ

ఎలా వుపయోగించుకున్నామో, పని ఎలా వుపయోగించుకున్నామో, విశ్రాంతి ఎలా వుపయోగించుకున్నామో, దానిమీద ఆధారపడి ఉంటుంది. దానికి తగిన శరీరము రావటం. దానికి తగినటువంటి మంచి తల్లితండ్రులో, సిఫిలిస్, గనోరియా లేదా ట్యుబర్క్యులోసిస్ తల్లిదండ్రులో వస్తారు. Law of magnetic attraction అక్కడ పనిచేస్తుంది. యివన్నీ తెలుస్తాయి. యోగాభ్యాసం ఏమీ తెలియక పోయినా ధారణ వస్తుంది. ఇదివరకు మనం చెప్పుకున్నాం. తనకి నచ్చిన సినిమాకి వెళ్ళికూర్చుంటే యోగాభ్యాసం చేయకపోయినా, ఆ సినిమా హాలు ఎక్కడవుందో, ఏ డైరెక్షన్లో ఉందో అదంతా వెళ్ళిన తర్వాత బుర్రలోంచి పోతుంది. ఏ కుర్చీలో కూర్చున్నామనే సెన్సుకూడ పోతుంది. లైట్లు ఆరిపోయేసరికి హాలు దగ్గరనుంచి, వాడి వూరిపేరు దగ్గరనుంచి, వాడిపేట పేరు దగ్గరనుంచి, వాడి డైరెక్షన్ దగ్గరనుంచి యిందాకటి బుర్రలో ఏవైతే ఉన్నాయో అవన్నీ డస్టర్‌పెట్టి బోర్డు తుడిచినట్టు అయిపోతాయి. మళ్ళీ సినిమా హాల్లోంచి యివతలకి వచ్చేటప్పటికి వచ్చేస్తాయి. ఈ లోపల ఇవన్నీ మనస్సులో ఉంచుకున్నాడంటే టికెట్ దండగ. అవన్నీ పోయిన తర్వాత వీడి మనస్సు తెరమీద మాత్రమే పడుతుంది. మిగిలిన వేమీ గుర్తుండవు. సినిమా అవుతుంటే వీడికి తెలిసినటువంటి రసవద్ఘట్టంలోకి వస్తే అక్కడ సినిమా వున్నదని కాని, ఆ బొమ్మల రూపములు కూడ గుర్తుండనటువంటి కంటికి ఎదురుగుండా రూపాలు కూడ కనిపించనటువంటి ఒకనొక పారవశ్యం అనేటువంటిది కొన్ని సెకనులు వస్తుంది. ఆ పారవశ్యం వచ్చినటువంటి టైములో మీరు మళ్ళీ ఈమాటు గమనించుకొని చూడండి. మీకు సినిమా తెరగాని, దానిమీద పడుతున్నటువంటి బొమ్మలుగాని, చెవికి దాని తాలుకు సంగీతంగాని, సంభాషణలు గాని, యివన్నీ కూడను cut off అయిపోతాయి. మళ్ళీ యివతలకు వచ్చేక సినిమా వుంటుంది. ఆ మధ్య క్షణాల్లో ఏం ఉన్నది? సంయమం వున్నది. అంటే యోగాభ్యాసం చేసి అష్టాంగములు సాధించిన వాడికి ఏ స్థితి ఉన్నదో, అది ప్రతివాడికీ కూడనూ, రోజూ అందుబాటులోనే వుంది environment tune అయితే. అయితే ఇంక యోగాభ్యాసం ఎందుకు అని ప్రశ్న వేయకూడదు. ఏది ఏం చేస్తే ఆ స్థితి వస్తుందో తెలిసినవాడు కాదుకదా? ఆవేళ సినిమా కెళ్ళాం, వచ్చింది. ఆ

సినిమాకే మళ్ళీ మర్నాడు వెడితే రాదు. ఎందుకంటే వాడు, కొడుకు వాదించుకొని మంచి కోపంలో వెడతాడు. సినిమాలో అనుసంధానము ఎందుకవుతాడు? అయ్యో సినిమాకెళ్ళినా ఆ స్థితి మళ్ళీ రాలేదండి అంటాడు. నిన్న ప్రశాంతమైన మనస్సుతో వెళ్ళాడు. కొడుకు యిలా అన్నాడు, మనం యిలా అన్నామని అనే గుర్తు స్థాయి సినిమాలో వున్నా వాడికి దానిమీద స్వామిత్వం రాలేదు. He is not the Master. He is only a dog of environment. మళ్ళీ ఏ రోజున అట్లాంటి స్థితి వస్తుందంటే దాని భాగ్యం వీడి అదృష్టం. ఎవళ్ళూ చెప్పలేరు. పంచాంగం కూడ చెప్పదు. మామూలుగా సగటు మానవుడు ఏరోజున సుఖంగా ఉంటాడు, ఏరోజున దుఃఖముగా ఉంటాడు, ఏరోజున దిగులుగా వుంటాడు, ఏరోజు దేన్ని ఎదురు చూస్తూ ఉంటాడు, ఏరోజు బద్ధకంగా ఉంటాడు, ఏరోజు అసంతృప్తిగా ఉంటాడు, ఏరోజున తృప్తిగా ఉంటాడంటే వాడికి తెలియదు. ఏక్షణము తెలియదు. He is not at all a master of his own environment. He is a slave and a dog of his environment. అలా గాకుండా ఈ మొత్తం యంత్రాంగం అందులో వున్న రేడియో, టెలివిజన్ దీంట్లో వున్నటువంటి ఎలక్ట్రానిక్స్, దాని energy centres న్నూ, ఊళ్ళో current fail అయినా ఇబ్బంది లేకుండా energy linkup చేసేవన్నీ మనకి యిస్తున్నారు యోగాభ్యాసంలో. అంతేగాని సామాన్య మానవుడు ఎరగనటువంటి విచిత్రం ఏదో పైనుంచి టక్కున వీడిమీదికి దూకుతుందని గాని, మనిషి దేవుడైపోతాడని కాని అట్లాంటి దేమీలేదు యోగాభ్యాసంలో మనిషి మనిషే. కాని మనిషికి తనకిచ్చిన ఉపకరణాల్ని వాడుకోలేనటువంటి స్థితినుంచి అత్యద్భుతమైనటువంటి ఎలక్ట్రానిక్ పరికరాల్ని కూడ వాడుకోగలిగే అదృష్టము యివ్వబడ్డది. సంయమం అంటే అది. ఆ సినిమా హాలులో రెండు నిమిషాలో, అరనిమిషమో యోగాభ్యాసం లేనివాడు అనుభవించిన స్థితి, యోగాభ్యాసం వున్నవాడు తెచ్చుకుంటాడు. అంటే బుద్ధి పూర్వకంగా మీ వంకచూస్తూ మీ మీద సంయమం చేస్తాడు. ఏనుగు మొదలైనటువంటి వాటిని ధ్యానంచేస్తూ, ఏనుగు మీద సంయమం చేస్తున్నాడు. మైత్రి మొదలైనటువంటివి ధ్యానంచేసి వాడికీ, మనకి మిత్రత్వం మీద సంయమం చేస్తున్నాడు. అలా ప్రతీ దానిమీద

సంయమం చేయగలడు. ఏది సంయమం చేస్తే ఆ వెలుగు దానిమీద పడి వాడికి ఏరకంగా విస్ఫారుతుందో అది చెబుతున్నారిక్కడ. తరువాత 'ప్రవృత్తి ఆలోకన్యాసాత్' 'ప్రవృత్తి' అంటే ప్రవర్తనము, ప్రవర్తించుట. దానియందు 'ఆలోకం' అంటే కిరణం. కిరణాన్ని 'న్యాసాత్' అంటే ఉంచుటవలన. నువ్వు శరీరంమీద, రూపంమీద ఉంచితే మనిషి కనిపించకుండా ఉంటావు ఎదురుగుండా ఉన్నాగాని, అవన్నీ చెప్పాడు కదా. మైత్రి మొదలైన వాటిమీద ఉంటే ఈ అనారోగ్యం మొదలైనవి తొలగిపోతాయి. హీలింగ్ వస్తుంది. సుస్తీగా ఉన్నవాడిని కూర్చోపెట్టుకొని మైత్రి- ప్రేమ- కరుణ మొదలైన వాటితో ధ్యానంచేస్తే వాడికి హీలింగ్ అవుతుంది. అలాగాకుండా ప్రవృత్తిమీద గనుక సంయమంచేస్తే అంటే ప్రవర్తన మీద, ఏ ప్రవర్తనమీద అంటే సంయమం ప్రవర్తించటం మీద, ఏమౌతుంది. యిప్పటివరకూ కెమేరా గోడకేసి పెడితే ఆగోడ పడుతోంది. ఎటుపెడితే అటున్న వస్తువో, మనిషో పడతాడు. అలా పడుతూ, తీస్తూ నించున్న ఫొటోగ్రాఫర్ మీద కెమేరా పెడితే వాడు పడతాడు. కెమేరా పడుతుందంటున్నాడు. అంటే యిక్కడ కొంచెం డైరెక్షన్ మార్చాడు. యిందాకిటి నుంచి కెమేరాను, ఫొటోగ్రాఫర్‌ని చెప్పాడు. గుంజమీద పెడితే గుంజ పడుతుంది. ఆకాశం వైపు పెడితే ఆకాశం పడుతుంది. చెట్టుమీద పెడితే చెట్టు పడుతుంది. కాని ఫొటోగ్రాఫర్ కెమేరా మీద పడితేనో అన్నాడు. ఫొటోగ్రాఫర్, కెమేరా పడతాయన్నాడు అంతే. ఇద్దరు ఫొటోగ్రాఫర్స్ వాడిని వీడు, వీడిని వాడు ఫొటో తీస్తున్నట్టు తీస్తే యిద్దరూ పడరూ? పద్ధతి చెబుతున్నాడు. నా చిన్నతనములో నా మేనమామ గారు ఒకరు ఉండేవారు. పెద్దవాడు, చాలా శాస్త్రాలు చదువుకున్న వాడు. ఆయన ఏదో వేదాంత గ్రంథం వ్రాసి పాపం దణ్ణం పెడ్తున్నట్లు ఫొటో వేయించుకున్నాడు ఆ పుస్తకంలో. మేమందరం చాలా గౌరవంగా అవన్నీ చూస్తే మా తమ్ముడు చూడగానే మామయ్యా. ఫొటోగ్రాఫర్‌కి దణ్ణం పెడుతూ ఫొటో తీయించుకున్నావా? అన్నాడు. వాడన్నీ అలాంటి dimensions తీసేవాడు. యిందాకటినుంచి ఫొటో తీయడం చెప్పాను. ఇపుడు ఫొటోగ్రాఫర్‌ని ఫొటో తీయడం చెబుతున్నాను అంటున్నాడు. 'ప్రవృత్తి ఆలోక న్యాసాత్' ఈ ప్రవర్తన వున్నదే దీనియందు ఆలోకమును న్యాసము చేయుటచేత దీనిమీద ధ్యానం (Medi-

tate) చేశావు. బావుంది. కాని, నీ meditation మీద meditate చేస్తే అంటున్నాడు. అంటే మనం ఏం చేస్తున్నాం. ఏంచేస్తే ఈ తన్మయత్వం వస్తోంది. తన్మయత్వం అంటే ఏమిటి? ఏనుగు మీద ధ్యానం చేసాం. ఏనుగు అట్టావుంచి ధ్యానం చేయటం అంటే ఏం చేస్తున్నాం? అని తన్మయత్వంలోకి వెళ్ళు ఒకమాటు అన్నాడు. వెడితే ఏం జరుగుతుందంటే యిలా చేయటం వల్ల 'సూక్ష్మ వ్యవహిత విప్రకృష్ట జ్ఞానమ్'' సూక్ష్మ జ్ఞానము వస్తుంది మొదటిది. అంటే subtle aspects, unknowable aspects of wisdom - సూక్ష్మ సూక్ష్మములు. మిగిలిన యోగీంద్రులు అందుకున్నవి కాక, వాట్లల్లో వున్న అంతరాంతరాళాల్లో ఉన్నటువంటి రహస్యాలు అందుతాయి. ఇంకొకటి చేసినా అందుతాయనుకోండి. ఇలా చేయాలన్నాడు రహస్యాలు దొరకాలంటే. అంటే శాస్త్రకారులైన మహనీయులు శాస్త్రాల్లో వున్నటువంటి అంతరాంతరాలైన పరమ రహస్యాలు ఎలారాసి తీసి యిస్తున్నారో అదీ పద్ధతి అన్నాడు. మహాభారతం వేదవ్యాసుడెలా రాశాడు. ''వ్యాసశ్య అద్భుత కర్మణః'' అన్నాడు సూతుడు. It is a miracle అన్నాడు. ఆ పుస్తకము భారతం. భాగవతం ఎలా రాసాడు. వాల్మీకి రామాయణం ఎలా చెప్పాడు. ''హసితం లభితం చైవ'' చిన్న నవ్వు నవ్వటం, ఆ అనటం, ఊ అనటం కూడ ఉన్నదున్నట్లుగా వ్రాశానన్నాడు వాల్మీకి రామాయణంలో. ఎలా చేశారంటే యిదీ పద్ధతి. వాల్మీకి రామాయణం ప్రకారము అహల్యపాత్ర యిలావుంటే బాగుండేది, అలావుంటే బాగుండేది. అదికాదు కావలిసింది. ఆవిడ ఎలా బ్రతికిందో, ఎలా తప్పుచేసిందో, ఎలా సర్దుకుందో రాశాడు. కాని పాత్రపోషణ, పాత్ర చిత్రణ, పాత్ర తోమటంకాదు. అది విమర్శకులకు సంబంధించినది. గ్రంథం ఎవరైనా పఠించే వాళ్ళకోసంగాని, విమర్శకులకోసం కాదు. విమర్శకులు ఎపుడూ ఉంటూ వుంటారు. ఉష్ అని ఎగరగొడితే వెళ్ళిపోతారు. ''తక్షక నిశాఖ పుంజ పతంగ తతుల మ్రోల వెదజల్లె'' అన్నాడు కృష్ణదేవరాయలు. అంటే దేవతలు, రాక్షసులు, పిశాచాలు అందరూ వరుసని నిల్చుని వున్నారుట. ఆకాశములో అదృశ్య స్వరూపంలో వుంటారుగా ఎపుడూ కూడ. విష్ణుమూర్తి వస్తూంటే గరుత్మంతుడు రెక్కలు ఒక్కసారి ఊపేటప్పటికి గింజలు తూర్పారపోస్తే లోపల గింజలేని ఊక గాలికి ఎగిరి పోయినట్లు ఈ రాక్షసులు,

పిశాచాలు ఎగిరిపోయి మిగతావాళ్ళు మిగిలారు. జీవులు వున్నారు. లోపల గింజ ఎవరి దగ్గరైతే ఉందో అక్కడ జీవుడు మిగుల్తాడు. మిగిలిన ఊకంతా వెళ్ళిపోతుంది. అట్లాంటిది యిది. కనుక సూక్ష్మ జ్ఞానము అంటే జ్ఞానములో సూక్ష్మ జ్ఞానము. మీకు ఎలా తెలుసండి యివన్నీ. సంయమము వస్తుందని ఎలా తెలుసు. సమాధి అంటే ఎలా తెలుసు. ఏదో ఊహిస్తే తెలిసే లెవెల్ కాదు. అంటే మనస్సు దాంట్లో ఉన్న పొరలను గురించి రాస్తారు తప్ప మనస్సు ప్రతీక్షణం ఎక్కడనుంచి ఉత్పత్తి అవుతుందో దానిక్రింద రాయగలిగింది ఏంలేదు. దానిని sub-consciousness అంటారు. అంటే చీకటి (Sub-luminary caves). ఆ చీకట్లో వెళ్ళలేరు. పురుగు, పుట్ర వుంటాయని భయం. అందులో ఏం వుండదు. అలాగాకుండా లోపలకి టార్చిలైటు వేస్తే వెళ్ళ గలుగుతారు ఏం శాస్త్రంలోకైనా సరే. ఇక్కడ నీళ్ళు ఉంటాయి. పదండి అంటారు. ఎలా తెలుసును. అంటే ఈ ఆకు ఈ రంగులో ఉంది కనుక. ఇక్కడ నీళ్ళుంటాయి అని వాడికి తెలుస్తుంది. పరస్పర సంబంధాలు (co-relation) తెలుస్తాయి. అది సూక్ష్మ జ్ఞానము. తరువాత వ్యవహిత జ్ఞానము. వ్యవహితము అంటే విడదీయబడిన జ్ఞానం. అంటే the wisdom of arrangement of things. మొదటిదేమో తూర్పు దేశాలకు సంబంధించినది (Eastern type). రెండోది పశ్చిమదేశానికి సంబంధించినది (Western type). మొదటిది దర్శనము, రెండవది recording systamatisation. Oriental mind మొదటిది, occidental mind రెండవది. మానవజాతికి అన్ని minds వుంటాయి కదా. సూక్ష్మజ్ఞానము, వ్యవహిత జ్ఞానము. చక్కగా యిది మనస్సు, యిది బుద్ధి, యిది చిత్తం, యిది అహంకారం. ఇది మనస్సులో, యింద్రియములలో ఉన్నభాగం. మనస్సులో యింద్రియాలకంటే వేరుగా వున్న భాగము. యిట్లాగ చేయగలుగుతారు తమాషాగా. ఇది వ్యవహిత జ్ఞానము. తర్వాత విప్రవృష్టజ్ఞానము. విప్రవృష్టము అంటే ఎడబాటు చెంది వున్నది యింతకాలం నుంచి. మనం జన్మ ఎత్తినప్పటినుంచి కూడ పరిమితత్వం (limited consciousness) లో పడ్డాంకదా లేకపోతే జన్మ ఎత్తలేము. జన్మ ఎత్తాక పరిమితత్వంలో పడ్డాం. కనుక cosmic consciousness అందదు. అది అనాదివిద్య. పుట్టేటప్పటికి దాని ఎరుకవుండదు. (un-claimed గా

ఉంటుంది). అవిద్య, అజ్ఞానము అనేది వారసత్వపు హక్కు (Hereditary property). తల్లి, తండ్రి ఆస్తి సంక్రమించినా లేకపోయినా పుట్టేటప్పటికి మనకి తెలిసినటువంటిది అనే రింగున్నూ, దానిచుట్టూ తెలియనటువంటిదిన్నీ, రెండూ తప్పకుండా సిద్ధిస్తాయి. అదిదాటి ఏం కనిపిస్తుంది మనకి? మనం నిల్చున్న చోటుకి ఎంత కనిపించాలో మనం ఎంత పెట్టి పుట్టామో అంతే కన్పిస్తుంది. అందుకనే పైథాగరస్ every circle has only a centre which can never be replaced by another అన్నాడు. ప్రతీవాడికి వాడి దిక్చక్రమే, horizon యే వుంటుంది. రెండో వాడకి అది ఎట్టి పరిస్థితులలోను బోధపడదు. అందరూ ఒకే ప్రపంచం చూస్తున్నా ఎవడి ప్రపంచం వాడిదే అన్నాడు 'పైథాగరస్'. ఎవడిచుట్టూ చూడగలిగింది వాడిదేగాని మిగిలిన వాళ్ళకెట్లా కన్పిస్తుంది. నువ్వు కేంద్రంగా వుంటే నీచుట్టూ వుంటుంది భూమి, ఆకాశం. యిక్కడినుంచి నేను చూస్తే చుట్టూ వున్న భూమి, ఆకాశం ఒకటికాదు. ఏయిద్దరి కేంద్రం ఒకటి కాదు. పైథాగరస్ 33 సంపుటములు వ్రాశాడు, మహానుభావుడు. అందులో 10వ సంపుటంలో 1 (ఒకటి), 0 (సున్న)ని గురించి చెబుతాడు. అందులో మనకర్థమైనది right angle triangle లో కొంచెము భాగం కనుక అదొక్కటే తీసుకున్నాం. మిగిలినవి వదిలేశారు. ఎందుకంటే అప్పటికి పాశ్చాత్యులు బ్రహ్మవిద్యలో చాల అజ్ఞానులు. ఇపుడు భారతీయులు ఉన్నస్థితిలో వున్నారు. అంచేత వదిలేశారు. కనుక విప్రపుష్ట జ్ఞానం అంటే వియోగం చెందిన జ్ఞానము. దేనియందు అయితే మనం అజ్ఞానము చెంది వున్నామో తెలియటానికి వీల్లేదో, ఈ జన్మ ఎత్తటం వల్ల, అవన్నీ తెలుస్తాయన్నమాట. అంటే జన్మ అంటే ఏమిటి? పుట్టటం ఎలా పుటుతున్నావు. అంటే ఎలా ఏమిటండి? తల్లి గర్భంలోంచి అంటాం. అదికాదు. తల్లి గర్భంలోకి ఎలా వచ్చాం, తండ్రి గర్భంలోకి ఎలా వచ్చారు. ఎలా ఏమిటండి? అని ఎదురు దబాయించాల్సిన పరిస్థితే గాని జవాబు లేదుగా. అక్కడిదాక వెళ్ళి ఆగిపోతుంది, గోడ పెట్టినట్టు. అవన్నీ తెలుస్తాయి. ''యతోవా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయన్త్య భిసంవిశన్తి'' యిక్కడ ఆ ప్రశ్నలకు జవాబులొస్తాయి. గతంలో తైత్తిరీయోపనిషత్ చెప్పుకున్నాం. తండ్రి, కొడుక్కి ఎలాగ జవాబు చెప్పాడో,

అంటే తండ్రి కొడుకవ్వటమే జవాబు. దానిమీద ధ్యానం వస్తుంది. పిండోత్పత్తి శాస్త్రం (Embryology) మొదలైనవన్నీ కూడ సజ్జక్షుగా నేర్చుకుంటం కాకుండా అది సినిమాగానో, నాటకంగానో మనం జీవితం నటిస్తూ వుంటే మనలో కనిపిస్తాయి సమస్తం, బయట, లోపల కూడను. శరీరంలో కనిపించేవి మరీ సూక్ష్మాలుగా వుంటే బయట చూసి నేర్చుకోవాలి. రెండూ అనుబంధం చేసుకోవాలి. అది తెలుస్తుంది. దాన్నే the science of correspondences న్యాసవిద్య అంటారు. ''అణోరణీయాన్ మహతో మహీయాన్'' వేదం చెప్తుంది. విత్తనమనగా నేమి? విత్తనంలో చెట్టు ఎక్కడ ఉంటుంది. మఱ్ఱిగింజ సైజు ఎంత? మఱ్ఱిచెట్టు సైజు ఎంత? మఱ్ఱిగింజలో మఱ్ఱిచెట్టు ఎక్కడ వుంటుంది? పదార్థమయంగా (quantitative) ఉంటుందా? గుణ ప్రధానంగా (qualitative) వుంటుందా? ఇవన్నీ తెలుస్తాయి. అంటే మొలవటం మొదలు పెట్టటం అంటే ఏమిటి? మొక్క అంటే తనకి తాను జ్ఞాపకము రావటం. అరెరె! మొలుద్దాం అనిపించటం ఇవన్నీ తెలుస్తాయి. మొలవటం అంటే మొలుద్దాం అన్పించటం జ్ఞాపకం రావటమే. దాన్నే nature's recollection అంటారు. బ్రహ్మాండ విజ్ఞానము (solar wisdom, planetory wisdom, cosmic wisdom) సమస్తం తెలుస్తాయి. దీనినే విప్రకృష్ట జ్ఞానము అంటారు. విప్రకృష్టమైన జ్ఞానము అంటే మననుండి విప్రకృష్టం చేయబడిన జ్ఞానము. విడదీయబడిన, దూరముగా తీయబడిన, మనకి అందటానికి అవకాశం లేకుండా ఉంటున్న జ్ఞానము. ఈ దృష్టి ఉన్నవాళ్ళనే ఋషులంటారు. వాళ్ళే మనకి ఈ వేదాలు, ఉపనిషత్తులు మొదలైన గ్రంథాలు యిచ్చినవాళ్ళు. కనుక సంయమం మీద సంయమమును ప్రసరింపచేసి ధ్యానంచేస్తే సూక్ష్మ, వ్యవహిత విప్రకృష్ట జ్ఞానము వస్తుంది. దీన్నే seedless meditation, motiveless meditation అంటారు. అంటే నిర్బీజమైన సమాధి. నువ్వు దేనియందు ప్రసరింప చేస్తున్నావో, దేనిని ప్రసరింప చేస్తున్నావో, దానియందే దానిని ప్రసరింప చేస్తున్నావు. అంటే objectivity లేదు. subjectivity యే. Pure subjectivity అయిన లైటు ఎలా ఉంటుందో తెలుస్తుంది. దాంట్లో అర్థం కాని విషయం అంటూ ఉండదు. అది వస్తుంది.

## 27. భువనజ్ఞానం సూర్యే సంయమాత్।

సూర్యే = సూర్యునియందు, సంయమాత్ = సంయమము చేయుట వలన, భువన జ్ఞానము = సప్త లోకములయొక్క జ్ఞానము కలుగును.

సూర్యునియందు సంయమము చేయుటవలన ఈ లోకమున జ్ఞానము కలుగును. (సప్త లోకముల నిర్మాణ జ్ఞానం కలుగును.)

**వివరణ :** ధారణ, ధ్యాన, సమాధులు సూర్యునియందు సంయమముచేస్తే ''భువన జ్ఞానము''. భువనములు అంటే లోకములు ఎలా నిర్మాణమై ఉన్నాయో వాటి జ్ఞానం వస్తుంది. యింతవరకే మనకు ఎక్కువమంది వ్యాఖ్యానకారులు యిచ్చారు. మహానుభావులు యిచ్చినది వేరే వున్నది. 27, 28, 29 సూత్రాలు ఒకే జాతికి సంబంధించినవి. వీటి సమన్వయము 30వ సూత్రములో దొరుకుతుంది.

## 28. చన్ద్రే తారావ్యూహ జ్ఞానమ్।

చన్ద్రే = చంద్రునియందు (సంయమాత్ = సంయమము చేయుటవలన); తారా = తారకల; వ్యూహ = వ్యూహముల యొక్క; జ్ఞానమ్ = జ్ఞానము కలుగును.

చంద్రుని యందు సంయమము వలన తారల వ్యూహ మెట్లున్నదో తెలియును (కన్నులకు గోచరించు రూపముల రహస్యములు తెలియునని కూడ అర్థము).

**వివరణ :** యిక్కడ సంయమాత్ అనేది చెప్పుకోవాలి (to be supplied). అంటే consciousness ని, awareness ని సంయమము చేయుట వలన, ప్రాజెక్టు చేయుట వలన నీకు తారావ్యూహముల జ్ఞానం వస్తుంది. తారలంటే తారకలు, మనం చూస్తున్నాం కదా ఆకాశములో, అనంతకోటి తారకలు చెప్పాడు. తర్వాత వ్యూహములు. వ్యూహములంటే గుత్తులు గుత్తుల నిర్మాణాలు. వాటి జ్ఞానము వస్తుందన్నాడు.

## 29. ధ్రువే తద్గతి జ్ఞానమ్।

ధ్రువే = ధ్రువతారయందు (సంయమాత్ = సంయమము నిలుపుట వలన); తద్గతి = వానియొక్క గమనము; జ్ఞానమ్ = జ్ఞానము కలుగును.

ధ్రువుని యందు సంయమము వలన ధ్రువముల గమనము తెలియును.

**వివరణ :** ధ్రువమంటే pole star. ధ్రువతార యందు 'తద్గతి' అంటే వాడి గమనము యొక్క జ్ఞానము తెలుస్తుంది. ధ్రువతార యొక్క గమనం అంటే భూగోళం యొక్క ధ్రువము తిరగటం. ఈ భూగోళమనే బొంగరము గిరగిర తిరుగుతున్నట్లు తెలుస్తుంది. తెలియకపోతే ఏమైంది. 30వ సూత్రంలో మనకి క్లూ యిస్తాడు. అక్కడ నుంచి మళ్ళీ విప్పుకోవాలి పైవి. ఇటునుంచి అటు విప్పుకోవల్సినవి ఉన్నాయి.

## 30. నాభిచక్రే కాయవ్యూహ జ్ఞానమ్।

నాభిచక్రే = బొడ్డు (నాభి) కేంద్రముగా (సంయమాత్ = సంయమము చేసినచో); కాయవ్యూహ = శరీర నిర్మాణముల; జ్ఞానమ్ = జ్ఞానము (కలుగును).

**తన బొడ్డు కేంద్రముగా సంయమము చేయుట వలన దేహ నిర్మాణ వ్యూహము తెలియును.**

**వివరణ :** సూర్యుడిలోకి వెళ్లాం. చంద్రునిలోకి వెళ్లాం. ధృవతారలోకి వెళ్లాం. యిప్పుడు నాభిచక్రం దగ్గర ఉన్నాం.

ప్రవృత్తి ఆలోకనమువల్ల సూక్ష్మ జ్ఞానము, వ్యవహిత జ్ఞానము, తరువాత విప్రకృష్ట జ్ఞానమున్నూ తెలుస్తాయి అన్నాడు. యిది తెలిసినంత కాలం తెలుస్తూ ఉంటుంది. మామీదే ప్రాజెక్టు చేసుకుంటున్నారు కదా. యిది చేస్తున్నపుడు నీ object of meditation, నువ్వు ధ్యానం చేస్తున్నటువంటి వస్తువు నీవే. యోగాభ్యాసం చేయనివాడికి బుర్రకాయలో ఒక నేను, గుండెకాయంలో ఒక నేను ఉంటాయి. చేసిన వాడికి ఈ యిద్దరూ ఒకే నేనుగా వుంటారు.

ఆజ్ఞ (మనస్సు)
విశుద్ధి (ఆకాశము, space)
అనాహతము (వాయువు)
స్వాధిష్ఠానం - అగ్ని
మణిపూరకము - జలము
మూలాధారం - భూమి (పృథివి)




ఈ నేను అనేదాని చుట్టూ ఏం ఉన్నాయి. మొట్టమొదట మనం నిల్చున్న చోటులో వున్నటువంటిది ఆకాశము. అందులో ఉచ్ఛ్వాస నిశ్వాసలోంచి శరీరంలో నడుస్తున్నటువంటి వాయువు ఉన్నదా? లేదా. తర్వాత శరీరములో తయారవుతున్న శక్తి (energy), దానికి కావలసిన వేడిమి, వెలుగు దాని పేరు అగ్ని. ఈ మూడింటికి వాహికగా పనిచేస్తున్న రక్తం మొదలైన వాటిల్లో పనిచేస్తున్న ద్రవ పదార్థం లేక జలం. వీటికి పాత్రగా పనిచేయుటకై ఏర్పాటైన ఘనపదార్థం లేక వ్యూహం చక్కగా తెలుస్తుంది.

Solid, liquid, gas, combustion and the content of space your self యిది అసలైన science. యివన్నీ వచ్చినపుడు యింకొక పనిచేయి నాయనా అన్నాడు. Centre ఎక్కడ locate చేస్తాం. Centre is not a location. It is an awareness. జాగ్రత్తగా గుర్తుంచుకోండి, pinpoint చేసేదికాదు, centre అనేది. అందుకని ఏమన్నాడు? ''హృదయం చాప్యధోముఖమ్'' అధోముఖంగా క్రిందికి హృదయం వుంటే ''తస్య మధ్యే మహానగ్నిః'' ఆ మధ్యలో మహా వెలుగు ఒకటి బయల్దేరుతోంది. ''విశ్వార్చిర్ విశ్వతో ముఖః'' అది అన్ని ప్రక్కలకి వెలుగుతూ ఉంటుంది. ''సోగ్రభుక్'' వాడు ముందుకు కదిలితే మిగతా వీళ్ళంతా భోంచేస్తారు. లేకపోతే వీళ్ళంతా ఈ శరీరం అవతల పారేయడమే. అది ఆగిపోతే యింక వీడు తినేదేముంది? మొదటి విస్తరి వేసుకొనేవాడు వాడన్నాడు ''స+అగ్రభుక్'' అంటే హృదయం (Heart function) పనిచేస్తే మిగతా మెదడు అవి పనిచేస్తాయి. అవి పనిచేస్తేనే నోట్లోకి ఏమన్నా నీళ్ళు, ఆహారం వెళ్ళేది. లేకపోతే మిగిలినవన్నీ ఆగిపోతాయి. అసలు ఆయన యిక్కడ ఉన్నాడు. ఆయన పేరేమిటి? అంటే అసలు ''నేను''. కనుక అది నీకు అందుతుంది. తర్వాత యింకొంచెం యోగాభ్యాసంలో చూచిన పద్ధతిలో ఉండాలంటే దీనికి కేంద్రం దొరుకుతుంది. దాన్ని మూలాధారం అంటారు.




తర్వాత దీని కేంద్రం దొరుకుతుంది. దీన్ని మణిపూరకము అంటారు. 'మణిపూరక చక్రం'. దీనికి కేంద్రం 'స్వాధిష్ఠానము'. దీనంతటికీ

కేంద్రము ''అనాహతము''. దీని కేంద్రం మీకున్నా sound కిన్ని gateway, vocal cards ఎక్కడుంటాయో అవి. అంటే శబ్దమయినటు వంటి ఆకాశం 'విశుద్ధి చక్రం'. చూసారా? ఎన్ని ఉన్నాయి? ఐదు. దీనిపై మనస్సు ఆజ్ఞాచక్రం. యిదీ వ్యూహం, మనకు పెద్దలిచ్చినటువంటి science of all sciences కున్నటువంటి key boards. యిది మొత్తం common key board అన్ని sciences కి. ఈ key board లేకపోతే ప్రాచీనులు యిచ్చినటువంటి ఏ శాస్త్రము పుస్తకము తిప్పుకుంటానికి వీల్లేదు. పిట్టకథలు మిగుల్తాయి. అందుకని ''మహీం మూలాధారే'' మహీ అంటే భూమి, మూలాధారం. ''జలమపి మణిపూరే'' జలములు మణిపూరకములు. ''హుతవహం స్థితం స్వాధిష్ఠానే'' అగ్నిహోత్రము స్వాధిష్ఠానుడు. ''హృది మరుతం'' హృదయమునందు మరుతం. ''ఆకాశముపరి'' దానిపైన ఆకాశము. ''మనోఽపి భ్రూమధ్యే'' భ్రూమధ్యమందు మనస్సు. ''సకల మహీత్వా కులపథం'' (సౌందర్యలహరి) ఈ సాధనని కులపథం అంటారు. క్రిందినుంచి పైకి సాధన చేసేవాళ్ళు కౌల మార్గ సాంప్రదాయం వాళ్ళు. ప్రమాదకరమైన మార్గం. మూలాధారం దగ్గరనుంచి తిరిపెట్టుకుంటూ వెళతారు. వాళ్ళు కామ క్రోధాలకి లోనయిపోయి పదేళ్లో, పదిహేనేళ్ళో, ఇరవై ఏళ్లో యోగాభ్యాసం చేసిన తర్వాత ఆ అయ్యగారు ఆ అమ్మగార్ని తీసుకుని వెళ్ళిపోతాడు. అంటే కామ క్రోధములు మొసళ్ళలా పట్టుకొని తినేసేస్తాయి. జాగ్రత్తగా వుండండి అన్నాడు. యిది కౌలమార్గం. అట్లాగాకుండా పైనుంచి క్రిందికి వచ్చేటువంటి మార్గం వుందన్నాడు. గురువు దగ్గర నుంచి స్పర్శపొంది పైనుంచి క్రిందికి సాధన చేయడాన్ని సమయాచార మార్గం అన్నారు. కౌలాదారం, సమయాచారం అని రెండు మార్గాలు. కనుక lower forces ని ride చేసిన తరువాత higher intelligences తోటి నీ consciousness దగ్గరికి approach అవ్వటం, dangerous path. Higher intelligences, consciousness క్రింది కక్ష్యల్లోకి విప్పారడం, (enlighten) సమయాచార మార్గం. యిది పరమగురువు యొక్క మార్గం. శంకర భగవత్పాదులవారు సౌందర్యలహరిలో యిచ్చినటువంటి ప్రతి శ్లోకంలోని అక్షరము యందు sciences of all sciences యిమిడి వున్నాయి. ఎవరైతే దీని గురించి కాదని అంటున్నారో వాళ్ళను గురించి నేనేమి మాట్లాడంలేదు యిపుడు. ''కాలస్యయం నిరవధిక విపులాతు పృథ్వీ'' కాలం చాల పెద్దది. భూమి చాల

పెద్దది. ఈ రెండూ ఒకదాన్ని బట్టి ఒకటి వుంటాయి. చాలమంది వస్తారు నా పుస్తకం అర్థం చేసుకునేవాళ్ళు అన్నాడు భవభూతి. పొగరు అనుకుంటారు. పొగరు కాదది. ఇక్కడ శంకరాచార్యుల వారిని గురించి ఆయన రాసిన గ్రంథాన్ని గురించి చెప్పుకోవాల్సి ఉంటుంది. అందులోది ఈ శ్లోకం. చదువుకున్నామా ఎన్నడైనా, చదువుకుంటే ఫర్వాలేదు. యివి మీకు బోధపడతాయి. మీ నేను మీకుంది. నా నేను నాకుంది. ఆయన నేను ఆయనకుంది. అలా గాకుండా ఈ సంయమం బోధపడ్డాక అందరి లోపల వున్న ''నేను'' ని సూర్యుడు అని న్యాసం చేయండి super imposition చేయండి అన్నాడు. సౌర కుటుంబాన్ని (Solar system) న్యాసం చేసుకోండి, అలా చేసుకుంటే నేను అనగా మీకు సూర్యుడు. అక్కడనించి మీకు చుట్టూ వున్నటువంటి చంద్రుడు, గ్రహములు, తారకలు, మొత్తం సౌరకుటుంబం, మీదాక వున్నటువంటి వన్నీ చక్కగా ఏర్పాటై మీకు తెలుస్తాయి. యిది సూర్యునియందు సంయమము చేస్తే అన్నదానికి అర్థం. ''భువన జ్ఞానము, సూర్యే సంయమాత్'' సూర్యునియందు సంయమం చేయుట వలన ఈ లోకముల నిర్మాణ జ్ఞానము వస్తుంది. లోకాల నిర్మాణం మనం చూస్తున్నట్టు చూడకూడదు. మనం కూడ అందులో involve అయ్యి వుంటే కరక్టు. మనం కూడ లోకాల్లో భాగం అవునా? కాదా? మనని తీసేస్తే లోకాలు చూసేవాడు లేకపోతే లోకాలు లేవు. కనుక చూచేవాడు, చూడబడేదిన్నీ రెండు counter parts of wisdom అన్నాడు. అందులో ఏది లేకపోయినా widsom లేదు. జ్ఞానం అనే ద్రష్ట దృశ్యము, అజ్ఞానము అనే బోర్డుమీద వున్నాయి. ఈరెండూ తెలిస్తేనే వెలుగు. ఇక్కడనించే మనకి అద్వైతము, విశిష్టాద్వైతము మొదలైన వన్నీ పుడతాయి. కనుక యిక్కడ సూర్యునియందు భువన జ్ఞానము. భువనములు అంటే లోకముల నిర్మాణ జ్ఞానము (నా చిన్నపుడు మొట్టమొదటి తడవగా విశ్వరూపం కాలేండరు వేశాడు ఒక ఆర్టిస్టు. యిన్ని తలకాయలు యిన్ని చేతులు, ఆయుధాలు. ''*శంఖ చక్ర గదాయుధం*''. అన్ని సరిపోయినాయి. అర్జునుడు బాణాలన్నీ అక్కడ పెట్టి నుంచుని స్తోత్రం చేస్తున్నట్టు వేశాడు. నాకు అనుమానం. వాడు విశ్వరూపం అన్నాడు. వీడు అక్కడ నించే దణ్ణం పెడుతున్నాడని. విశ్వరూపం అంటూ వాడు బయట నుంచుని దణ్ణం పెడుతూంటే దేవయ్య అవుతాడు. అంటే మనకి విశ్వరూపం బయట నుంచుంటానికి వీలుంది అంటే నాటకంలో

వున్నటువంటి బుట్ట బొమ్మకాని విశ్వరూపం కాదు. నాకెప్పుడూ అనుమానమే. కొన్నాళ్ళైన తర్వాత మా నాన్నగార్ని అడిగాను. నాన్నగారు యిది రైటేనా? వీణ్ణి కూడ ఆ లోపల వెయ్యాలి అన్నారు. అంటే పది పన్నెండేళ్ళు ఆ సందేహం అలా వుండిపోయాక అపుడు నాన్నగార్ని అడిగాను. విశ్వరూపంలో కాక వీడు ఎక్కడున్నాడు. కాలెండరు మీద, అట్టమీద వున్నాడా అన్నారు, అందుకని యిక్కడ నేను అనేది, సూర్యుడూ రెండూ ఒకటి అయిపోతాయి. అదే భగవద్గీతలో చెప్పాడు. ''ఇమం వివస్వతే యోగం ప్రోక్తవాన్ అహమవ్యయం'' వివస్వతే అంటే సూర్యునకు నేను ఈ యోగమును ''నేను'' అనేటువంటి అవ్యయం అనే మాటగా ఉపదేశించాను. దాని అర్థం వేరేగా చెప్తారు. అహం అంటే నేను! 'ఇమం అవ్యయం యోగం.' ఈ అవ్యయమైన యోగవిద్యను శాశ్వతమైనటువంటి దాన్ని 'ప్రోక్తవాన్' చెప్పాను. ఏమని చెప్పాడో తర్వాత శ్లోకాల్లో లేదు. యిక్కడ నేను అనేది సూర్యుడు, అది తెలుస్తుంది. ఇంతదూరము ''నేను'' వుండదు ఈ ధ్యానంలోకి వచ్చాక. సంయమం దానిమీదకి వెళ్ళిన తర్వాత ఆ సంయమంలో వున్నంతసేపు యివతల ప్రపంచంలో తిరుగుతున్న సూర్యుడు, అందులో వున్న నేను, వీడిలోంచి నేనుగా మాట్లాడుతూ వుంటాడు. అది కృష్ణావతారం మొదలైనటువంటి వాళ్ళ దగ్గర ఉన్న విషయం. అందుకే నేను చెప్పాను, విను అన్నాడు. నేను చెప్పాను అంటే ఈ శరీరానికి సంబంధించిన నేను అనుకొంటారు. అంతకంటే అర్థంకాదు అన్నాడు. ''మానుషే పరమాశ్రితం మన్వంతేయాన్ అబుద్ధయః'' ఆలోచించేటువంటి వాళ్లు, బుద్ధి ఉపయోగించ నటువంటి వాళ్ళు ఈ మానుషమైన శరీరానికి సంబంధించిన నేను అన్నానని అనుకుంటున్నారు, వాసుదేవుడికి సంబంధించిన శరీరాన్ని గురించి, నేనంతకంటే ఏం చెప్పను అన్నాడు. నువ్వే చెప్పావు, నేను చెప్పానని. ఆ నేను లోంచి మాట్లాడుతుంటే, ఆ నేను నాలోంచి మాట్లాడుతోంది కనుక నేను చెప్పాను. నాకు సమర్పణ చేసుకో. నాకు శరణాగతి అవ్వు. నన్నాశ్రయించు అన్నాడు. అంటే మొత్తం అన్నింటిలో వున్న నేను అని. బ్రహ్మవిద్యకు రాజీ ఉండదు. యిక్కడ 'సూర్యుడిలో' అంటే అర్థం అది. అంటే వీడి నేను సూర్యుడికి సమర్పణమై పోతుంది. కళ్ళు మూసికొని వీడిలో సూర్యుణ్ణి గురించి ధ్యానం చేయగా అవి ఆదిత్య, సోమ, మంగళ, బుధ, గురు, శుక్ర, రాహు, కేతు సమస్తమైనటువంటి వ్యూహములన్నీ కూడ అక్కడ ఉన్నటువంటి

సూర్యుడే. ఇక్కడ ఉన్నటువంటిదీ సూర్యుడే. అక్కడ వున్నా చంద్రుడే. ఇక్కడ వున్నా చంద్రుడే, ఎలా వుంటారు? గొడౌనులో వున్నటువంటి బియ్యపు బస్తాలు, మనం అమ్మే షాపులో ఉన్న బియ్యపు బస్తాలు, మన వంటింట్లో డబ్బాలో వున్న బియ్యం, మన గిన్నెలో వేసుకున్న బియ్యం ఎలాగ ఒకటే వుంటాయో అంతే. ఈ అన్ని బియ్యమూ ఒకటే అని ఎవడికి తెలుస్తుంది, గొడౌను దగ్గరనుంచి యిక్కడదాక చూసిన వాడికి తెలుస్తుంది. లేకపోతే వాడు అమ్ముతూ వున్నచోట డబ్బాలో బియ్యం అయిపోతే ఒహో! లేవు కామోసు! అనిపిస్తుంది. గొడౌనులో అవతల వుంటాయి. అట్లాగే జగత్తులో వ్యూహం మనకి తెలుస్తుంది. నీకునన్నా జగత్తుకి సంబంధించినటువంటి fitness of things అన్నాడు. Ultimate fitness of things అన్నాడు ప్లేటో. అనగా మరచెంబుకి మూతకి వున్న సంబంధం. మనం నిల్చున్న చోటుకి మనకి వున్న సంబంధం. నవ్వు ఎక్కడ నిల్చున్నావో అంతచోటు అక్కడ వుంది అని చెప్పాడు తైత్తిరీయంలో. నువ్వు అంతచోటు ఆక్రమించుకున్నావు. నవ్వు ఎక్కడ నిల్చున్నా గాని తప్పించుకుంటానికి వీల్లేదు. అంచేత ఎవడికీ చోటులేదు అనబోకు అన్నాడు. ''నకంచన వసతౌ ప్రత్యాచక్షీత తద్వ్రతం'' అన్నాడు. పరిమాణం ఎంత వుందో అంతచోటు తింటున్నావు అన్నాడు. అద్దె యివ్వటం లేదు. చందా వెయ్యటం లేదు అన్నాడు. ప్రతీవాడికీని వాడి పరిమాణానికి (volume) సరిపడచోటు యిస్తుంది. పొట్టపెంచుకున్నా కూడ అంగీకరిస్తుంది. ఇది సూర్యుడి యొక్క వ్యాఖ్యానము. పూర్తి ఆవరణము అవ్వలేదు.

యింతవరకు మన శరీర మందలి చక్రముల వ్యూహం యందు సంయమం చేశాము 'చంద్రే సంయమాత్' మీరు చంద్రుడి యందు సంయమం చెయ్యాలి అంటే మనస్సునించి హృదయము వరకు ఉన్నటువంటి మొత్తాన్ని సంయమముచేస్తే చంద్రలోకం మీద సంయమం చేసినవాళ్ళం అవుతాము. చంద్రలోకం అంటే ఏమిటి? ''చంద్రమా మనసోజాతః'' మనస్సు చంద్రుని నుంచి పుడుతోంది. కనుక మనస్సు మీద ఫోకస్ చేయాలి. ఇన్నాళ్ళనుంచి యోగాభ్యాసం చేయటానికి వీల్లేకుండా అటు వెళ్దాం, ఇటు వెళ్దాం, వూరి కెళదాం, సినిమాలు చూద్దాం అనిపించింది. కాసేపు వెళుతున్నాం. యోగాభ్యాసం చేసాక అవన్నీ చేసినా యిబ్బంది లేకండా ఉండేట్టుగా ప్రక్కన నిల్చుని చూస్తోంది మనస్సు. ఇంతేనా వీడికి ఉన్నటువంటిది అని తర్వాత

తెలుస్తుంది. ఈ మనస్సు వెళ్ళిపోయిన తర్వాత తెల్సింది దాని దగ్గర అది ఏం లేదని, మొట్టమొదట అదేం చేస్తుందో, చంపేస్తుందో, తినేస్తుందో అని అనుకొని గాభరా పడతాం. ఆ మనస్సు ఎంతెంత ఘోరాలు చేసింది. ఇపుడేం చేసింది. ప్రక్కన నిల్చుని చూస్తోంది ఊరికే. నువ్వే నాయనా మంచివాడివి అంటుంది. ఏది? యోగాభ్యాసంలో అష్టాంగాలు పూర్తవుతే. ఇట్లాంటి వాళ్ళు మరో పదిమంది వస్తే బావుండును అని అంటుంది ప్రకృతి. కనుక మనస్సుమీద సంయమము చేస్తే 'తారావ్యూహ జ్ఞానమ్' తారకల వ్యూహం సంగతి తెలుస్తుంది. ఇక్కడ చంద్రుడనే మాటకి ఈ యోగాభ్యాసంలో సరైన అర్థము ప్రతిబింబ న్యాయం (reflection principle). ఇది మొట్టమొదటి తడవగా 1966లో ప్రచురించబడిన నా 'స్పిరిచ్యువల్ ఎస్ట్రాలజీ' అనే అంతర్జాతీయ గ్రంథంలో యివ్వబడింది. ముగ్గురు ఫిలాసఫర్స్ మొన్న పారిస్‌లో చెప్పారు. మీరు ప్రధానమైన కీలకములు (main clues) యిక్కడ మొట్టమొదటి తడవగా 20వ శతాబ్దానికి విప్పదీసారు అని. Reflection అనేటువంటిది వాళ్ళు చూసుకోలేదు. అంతకుముందే కొంత 'సీక్రెట్ డాక్ట్రిన్'లో బ్లావెట్స్కీ విప్పదీసింది. వాళ్ళు వాళ్ళ సొంతం విప్పదీసుకుంటం హడావుడిలో వున్నారు. ఆ పుస్తకము చదవలేదు. అపుడు చెప్పాను 'సీక్రెట్ డాక్ట్రిన్' చదవండి. నేను విప్పదీసింది ఇంకొంత భాగం. ఆవిడ మొట్టమొదట కొంత ప్రారంభం చేసారు. పురాణాలు, ఇతిహాసాలు వాట్లలో ఉంది అని చెప్పాను. కనుక చంద్రుడంటే అర్థము ఏమిటి? Reflection principle. సూర్యుడంటే అర్థము brilliant shining force అంటే కిరణం వుత్పత్తి అవటం సూర్యుడు, ఉత్పత్తి అయిన కిరణం కాంతిగా వ్యాపించడం చంద్రుడు. దాన్నే ప్రతిబింబం అంటారు. మనం చూస్తున్న సూర్యరశ్మి, చంద్రరశ్మి కాని సూర్యరశ్మిది కాదు. అంటే reflected Sun తప్ప, original Sun ఎక్కడున్నాడు? దానిలోపల వున్నాడు. Invisible Sun అంటారు. ''సూర్యో సూర్యానాం'' అన్నారు వేదములో. అంటే సూర్యులలో సూర్యుడు. మనం చూస్తున్న సూర్యుడు చాక్షుషము. అంటే కనిపిస్తున్న సూర్యుడు. అందుకనే బ్రహ్మాండ పురాణంలో వ్యాసుడు చెప్పాడు. సూర్యుడు ధరించిన కవచం, దానికి కట్టుకున్న గుడ్డలు, లేసులు అవి చూస్తున్నాం కాని మనం లోపల వున్న సూర్యుణ్ణి ఏం చూస్తున్నాం అన్నాడు. అలాగే యజుర్వేదములో చిట్టచివరికి ఈశావాస్యంలో ''హిరణ్మయేన పాత్రేణ సత్యస్యావి హితం ముఖం'' బంగారపు

పాత్రలాంటి ఆకారంతో సూర్యుడనేటు వంటి సత్యం కప్పబడి ఉన్నది ఈ అసత్యం చేత. ''తత్వం పూషన్నపా వృణు'', ఓ సూర్యుడా! పురుష అవతారంగా ఈరకంగా కన్పిస్తున్నవాడా! ఈ అడ్డం నా మనస్సులో వున్న పొర గనుక యిక్కడ తీసేసి ''సత్య ధర్మాయ దృష్టయే'' ఆ లోపల ఈ లోపల వున్న నేను ఒక్కడినే అనేటువంటి దర్శనము చేయుట కోసము మాకు ఆ విద్యను న్యాసం చేయుము. ఇది యజుర్వేదములో ఒక మంత్రం. దీన్నే ఈశావాస్యోపనిషత్తులో చిట్టచివరి మంత్రంగా తీసుకున్నారు. ఉపనిషత్తులనేవి independent books కావు, వేదాల్లో ఉన్నటువంటి మంత్రములే. Anthologies. అది తెలియక Historians vedic age లో ఉన్న పుస్తకాల కన్నా ఉపనిషత్తుల కాలంలో పుస్తకాలలో ఎక్కువ wisdom వుంది అని వ్రాస్తారు. అంటే original బుక్స్‌లో కన్నా Anothology books లో ఎక్కువ wisdom వుంది అన్నట్లు. చంద్రుడి యందు అంటే అర్థం యిది. కనుక reflection అనేటువంటి దానిమీద reflect చేస్తే మనకి సూర్యుడు కిరణములతో కనిపించేవాడు ఒకడు, దానిమధ్య బింబంతో కనిపించే వాడొకడు. దానిమధ్యన వున్న అసలు సూర్యుడు ఏ రూపంలో వున్నాడు. సూర్యగోళంలో వున్నచోటుగా ఉన్నాడు అసలు సూర్యుడు. దాన్ని అంతర్యామి సూర్యుడంటారు. అలాగే గుండెకాయ చుట్టూ ఉన్నటువంటి కృష్ణమాచార్యులు ఒకడు, గుండెకాయలో ఉన్న కృష్ణమాచార్యులు ఒకడు, గుండెకాయ లోపల అసలు కృష్ణమాచార్యులు ఎలా వున్నాడు? చోటుగా ఉన్నాడు. కృష్ణమాచార్యులు లేడు. ఎవడైనా అంతే. ఆ గుండెకాయ కివతల గుండెకాయ వుండి దాని లోపల చూడగలిగే గుండెకాయ మనకి వుంటే లోపల కృష్ణమాచార్యులు వుండడు, వేంకటేశ్వర్రావు వుండడు, ఏమి వుండదు. చోటు వుంటుంది. వాడే అసలైన మనిషి. ఈపైన ఉన్నటువంటి కృష్ణమాచార్యులు, సుబ్బయ్య, రామారావు వీళ్ళంతా కూడ మనం పెంచుకున్న జుట్టు ఎంతో ఈ పేర్లన్ని అంతే. రాగి చెంబుమీద పేర్లు వేయించుకుంటే ఆ పేరు రాగి అవుతుందా? ఎలా అయితే కాదో, మన identity కూడ అంతే. Identification దగ్గర మనము ఉన్నాము. identity దగ్గర కాకుండా మనం ఉన్నాము. అది తెలుసుకోవాలి. అందుకనే జ్వాలాకూలుడు చెప్పాడు. From identity consciousness to identification consciousness we are travelling. That is evolution. అంటే కైవల్యం దగ్గరకు వెడుతున్నాము అన్నాడు. వేరు వేరుగా ఉన్న

స్థితి దగ్గరనుంచి కేవలం ఒకటిగా ఉన్న వెలుగు దగ్గరకు ప్రయాణం చేస్తున్నాము అని చెప్పాడు. జ్వాలాకూలుడు ఒక్కడే చెప్పాడు ఆ ముక్క. ఇక్కడ ఈ reflection చేస్తే తారా వ్యూహ జ్ఞానం, తారలంటే ఈ వెలుగుతో చేయబడినవి. ఏ వెలుగు? ఈ వెలుగుతో ఈ వెలుగు సత్యమా? యిక్కడ నీ తలకాయ కూడ వుందికదా. దానిమీదే యిపుడు న్యాసం చేసాం. ఈ తలకాయలో, ఈ గుండెకాయలో ఈ యింద్రియాల చుట్టూ ఉన్న ప్రవృత్తులు, వాటి యింద్రియార్థాలు ఎంత సత్యమో, ఈ సూర్యుడి కిరణాలు కూడ అంతే సత్యం. ఎందుకంటే యివి అవి ఒక్కటే. తర్వాత యిక్కడున్న అబద్ధాల నేను (negative I am) చెప్పాను చూడండి అదెంత సత్యమో, ఈ సూర్యగోళం అనేటువంటి సూర్యుడు అంతే సత్యం. అదే నువ్వు. ఇక్కడ మనస్సు, బుద్ధి, అహంకారం, చిత్తం అనేది నువ్వే. ఈ సూర్యగోళం, సూర్యబింబం అనే అబద్ధాల సూర్యుడు. అదికాక అసలు నేను అని చెప్పాడు చూడండి ఈశు శబ్దము లేక ఈశ్వర శబ్దంవాడు. అది సూర్యుడు లోపల వున్నటువంటి ''సూర్యో సూర్యోనాం'' అసలు సూర్యుడంటే వాడు. యిది మీకు తెలుస్తుంది నాయనా అన్నాడు. కనుక చంద్రుడు, తారావ్యూహం. తార అనే మాటకి అర్థం కనుగుడ్డు. తారావ్యూహం అంటే కనుగుడ్డుకి కనిపించేటువంటి మొత్తం వ్యూహం తెలుస్తుంది. అశ్వని, భరణి మొదలైనవి కావు. Objec-tivity అనే రహస్యం తెలుస్తుంది. మన భాషలో మనం చెప్పుకోవాలంటే ఒక సూర్యుడు అబద్ధాల సూర్యుడు. రెండవ అబద్ధాల సూర్యుడు, మూడవ నిజం సూర్యుడు చెప్పారు బాగానేవుంది. యిక్కడేముంది? చోటు వున్నది. అంతేకదా. కాని గ్రహాలన్నీ ఏం చేస్తున్నాయి? వీడిచుట్టూ తిరుగుతున్నాయి. అక్కడ ఉట్టిచోటే వుంటే గ్రహాలు వాడిచుట్టూ ఎందుకు తిరుగుతాయి. మిగిలినచోట్ల ఎందుకు తిరగవు. కాని యిక్కడ చోటు ఏమైంది? తిరగటం మొదలుపెట్టింది సూర్యుడు పుట్టక మునుపు. దాన్ని ధ్రువం అంటారు pole star కాదు, the fiery whirl pool, (బ్రహ్మవిద్య తెలిసినటు వంటి వాళ్ళు), జ్వాలాకూల్ మొదలైనటువంటి వాళ్ళు). The fiery whirl pool before creation అన్నాడు. అంటే ఆగ్నేయులు అయినటువంటి వాళ్ళు ఏడుగురు, రంగుల తలపాగాలతో దిగి వస్తారుట, ఈ whirl pool లోంచి, వాళ్ళనే చిత్ర శిఖండినులు అంటారు. అంటే ఈ free solar light rays. ఏడుగురు వుంటారు. వాళ్ళు దిగివస్తారు. అంటే చోటులో గిరాగిరా చోటు

తిరుగుతుంటుంది. చోటులో చోటు తిరగటం మొదలుపెడితే formation of a forcing state తయారవుతుంది. మీలో నేను అనేటువంటిది అలా తిరుగుతూన్న whirl pool అంతే. దానియందు దీన్ని కనుక నీవు సమన్వయం చేసిపెట్టావంటే ఈ తిరుగుతూ వున్నటువంటి నేను అనే అనేది ఆగిపోయి ఆ లోపల ఎక్కడైతే దేనిచుట్టూ తిరుగుతూ వున్నదో ఆ తిరగనటువంటి కేంద్రం ధ్రువం అంటారు. అంటే stable. ఈ తిరుగుతూ వున్నది అధృవం stable కాదు. కనుక యిపుడు మనం ఎరిగివున్నటువంటి నేను అనే ప్రజ్ఞ తిరుగుతూ వున్నది. revolving కేంద్రం. దాని వెనుక ఉన్న background non-revolving కేంద్రం. ఇది అందుతుంది మీకు. అందుకని ఈ తిరుగుతున్న నేను అనే ప్రజ్ఞ ఆ తిరక్కుండా ఉన్న నేను అనే ప్రజ్ఞ రెండింటితో కూడ నువ్వుంటావు అన్నాడు అక్కడ. దీనియందు సమన్వయం చేస్తే అపుడు 'తద్గతి జ్ఞానమ్' దానిగతి అంటే ఏమిటో తెలుస్తుంది. గమనం అంటే ఏమిటో తెలుస్తుంది. చోటులో చోటు తిరుగుతోంది. మనం సీసా అక్కడ పెడితే చోటులో సీసావుండి సీసాలో మళ్ళీచోటు లేదూ? సీసాలా ఎందుకు మనలో లేదు? చోటులో శరీరముండి, శరీరములో చోటు వుందాలేదా? అంతే అన్నాడు. మనం అలాగ తిరుగుతున్నా మనుకోండి. మనలో వున్నచోటు తిరుగుతోంది. కాని మధ్యన వున్నచోటు తిరుగుతోందా? తిరగటంలేదు. కనుక తిరగని చోటు మరియు తిరుగునట్టి చోటు ఏర్పడి తిరుగునట్టి చోటులో పృథివి, ఆపస్, తేజో, వాయు రాకాశములు ఏర్పడి వున్నవి అనే సైన్సు మీకు తెలుస్తుంది. Space న్నా, non-revolving eternal space. అంటే revolving space ని fleeting space or periodical space అంటారు. కనుక eternal space లోంచి periodical sapce వస్తూపోతూ ఉచ్ఛ్వాస, నిశ్వాసలై జరుగుతూ వుంటుంది. ఆ back ground లో వున్నటువంటి eternal space ఉచ్ఛ్వాస, నిశ్వాసలని అనుభవిస్తున్నటు వంటి నారాయణ శబ్దవాచ్యము. ఇదీ వేదములు, ఉపనిషత్తులు మొదలైనవి మనకి చెప్పినది. అది ధ్రువం. దానియందు నీవు ధ్యానంచేస్తే, అంటే నేననే ప్రజ్ఞ ఇక్కడుందా? అక్కడుందా అని మానేసి, నేను అనే ప్రజ్ఞయందు సంయమం చేస్తే ఆ నేనను ప్రజ్ఞ తిరుగుతూ వున్నది కాక తిరక్కుండా వున్న నే ననే ప్రజ్ఞ కనిపించి, దాని యందు తిరుగుతూ ఉన్న ప్రజ్ఞ కనిపించి రెండు ప్రజ్ఞలు ఒకదానియం దొకటి కనిపిస్తాయి. దాన్ని పరావర యోగం అంటారు.

అది కనిపిస్తే యిది ఆరిపోయి యిది కనిపిస్తే అది ఆరిపోయి ఉంటుంది అంతవరకు. ఇహం కనిపించిన వాడికి పరం కనిపించదు, పరం కనిపించిన వాడికి ఇహం కనిపించదు. ఈ కన్ను కనిపించిన వాడికి ఆ కన్ను గుడ్డి. ఆ కన్ను కనిపించిన వాడికి ఈ కన్ను గుడ్డి, కాకి చూపల్లే. ఇక్కడ అలాకాకుండా రెండు కళ్ళూ కనిపించటం మొట్టమొదటిగా మొదలు పెడతాయి. ''భిద్యతే హృదయ గ్రంథిః''. ఇక్కడ ఆ హృదయములో ఉన్న గ్రంథి భేదనము జరుగుతుంది. The fundamental doubts of non-knowledge, not knowing how to know అది అవిద్య. అది పోతుందన్నాడు. అవిద్య అంటే ఏమిటి? అవిద్య అనేదానికి అనువాదం వ్యాఖ్యానం చాలమంది చేశారు. పతంజలి యోగ సూత్రాలు 2వ అధ్యాయంలో అవిద్య అనేమాటకి 'not knowing how to know' అని చెప్పాను. అది అవిద్య అంటే. అది ''భిద్యతే'' భేదింపబడుతుంది. ''ఛిద్యంతే సర్వ సంశయాః'' సంశయములన్నీ ఛేదించుకొని పోతాయి. ఎందుకంటే సంశయాలు దేనితో చేయబడ్డాయి? ఆ సంశయాల కున్నటువంటి జవాబులుతోనే చూడండి. ఆ జవాబుతో ప్రశ్నలు వేసుకున్నారు. మీకు తెలీదు. జవాబు మీ దగ్గర లేకపోతే ప్రశ్న మీలోంచి రాదు. అరటిపండు ఎలా పొదుగుతుంది, చెట్టుమీంచి గెలలు ఎలా వేస్తాయండి, అని అడిగారనుకోండి. అంటే ఇది అరటిపండని మీకు తెలుసు. గెల వేస్తుందనీ మీకు తెలుసు. చెట్టుకి పండుతుందనీ తెలుసు. అంటే మీరడిగిన మూడింటికి జవాబులు మీ దగ్గర ఉన్నవా? లేవా? పంచదార తియ్యగా ఎందుకుంటుందండి? అంటే పంచదార తియ్యగా ఉంటుందనే జవాబు మీ దగ్గర ఉంది. అంచేత మీరు వేసినవి ప్రశ్నలు కావని తెలుస్తుంది. ప్రపంచములో మనం వేస్తున్న ప్రశ్నలన్నీ జవాబులనే కాగితాలలో పొట్లం కట్టబడి ఉన్న చిన్న కాగితం ముక్కలు. అందుకే C.V.V. గారు చెప్పారు. Every conscious question has sub conscious answer. కనుక ధ్రువతార దగ్గరికి వెళ్ళినటువంటి వాడికి ''ఛిద్యంతే సర్వసంశయాః'' సమస్త సంశయాలు ఛేదించుకొని పోతాయి. ''క్షీయంతే చ యస్య కర్మాణి'' వాడికి కర్మలంటూ వుండవు. ఇక విశ్వకర్మేగాని. ''తస్మిన్ దృష్టే పరావరే'' పరం, అపరం రెండూ కూడ చూస్తాయన్నాడు. భగవద్గీతలో ''యానిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ'' అని చెప్పాడు. సమస్త జీవరాసులకి ఏది రాత్రో, అక్కడ యోగి మేల్కొని వుంటాడు. అంటే యివి రానివాడు. ఎవడికైతే

యిది కన్పించదో వాడు ప్రపంచంలో మేల్కొని వుంటాడన్నాడు. అంటే వీడికొక కన్ను వాడికొక కన్ను వుందన్నాడు. అని యింకా 5,6 శ్లోకాలు పోయిన తర్వాత రెండు కళ్ళూ వుండాలి నాయనా పోగొట్టుకోకు, పాడుచుకోకు అని చెప్పాడు. అంటే యింద్రియాలు మనస్సు యందు మేల్కొన్నటువంటి వాడు తనయందు మేల్కొని వుండడు. యిదే వేదాంతం అన్పిస్తుంది. తనయందు మేల్కొన్నవాడు యింద్రియాలు, ప్రపంచం యందు మేల్కొని వుండడు. దీనియందు దానియందు మేల్కొని ఉండమనే ప్రకృతి నీకీ శరీరం యిచ్చింది కాని, నిన్ను ఏడిపించడానికి, అజ్ఞానములో పడేయటానికి, లేకపోతే కనుగప్పటానికి ఈ శరీరము, మనస్సు యింద్రియాలు యివ్వలేదు. **It is an apparatus pious as anything as it can never be substituted to anything. It is given to you. You are presented.** అందుకని ధ్రువం దగ్గరికి వచ్చేటప్పటికి పరావర జ్ఞానం వస్తుంది.

భువన జ్ఞానం, తారావ్యూహ జ్ఞానం, ధృవగతి జ్ఞానం. మూడు జ్ఞానాలు చెప్పారు. యిందులో మళ్ళీ ఒక్కొక్కటే మరోమారు మూడవ పర్యాయం పూర్తి చేయాలని అనుకున్నాం. భువనజ్ఞానం చూద్దాం. మనం ఉన్నటువంటి భూగోళం మనకి కనిపిస్తోంది. భూగోళం మీద నీళ్ళు కనిపిస్తున్నాయి. భూగోళం మీద ఉన్నటువంటి వాయువు కనిపించకపోయినా అన్పిస్తుంది. ఇవన్నీ వున్నటువంటి చోటు అనేది ఒకటి వున్నదని తెలుస్తుంది కనిపించకపోయినా. వీటన్నింటికీ తెలుసుకునేటువంటి మనస్సు ఒకటి వున్నది అనేది తెలుస్తుంది. ఇవన్నీ వరుసన తెలుస్తూ వుంటాయి. కనుక యిపుడు మనం చెప్పుకునేవన్నీ పైన చెప్పినట్లుగా భూలోకం అంటారు. (Material plane). ఇందులో ఘన పదార్థం, ద్రవ పదార్థం, వాయువు (solids, liquids, gas) ఉన్నాయి. liquid అంటే ఆపస్సు. గ్యాస్ అంటే వాయువు. ఈ మూడింటిని ఒక స్థితినుంచి ఒక స్థితిలోకి మార్చేటువంటిది తేజస్సు అంటే. అగ్ని అనబడేది ఒకటి ఉన్నది. ఇవన్నీ వున్నటు వంటిది ఏదైతే వున్నదో అది ఆకాశం. ఆకాశం అంటే చోటు కాదు. చోటులో వున్నటువంటి content. చోటులోంచి మిగిలినవి రావు. గ్రహాలైనా భూగోళమైనా మనం అంతా వుంటూ ఉన్న ఈ యిల్లు ఇవన్నీ కూడ, చోటులోనే వుంటున్నాయి. చోటులో బ్రతుకుతున్నాము. చోటులోకి వెళ్ళిపోతున్నాము. ప్రతీది చోటులోకి లీనమవుతూ వున్నది. ఇంతవరకు అందరూ అంగీకరిస్తారు. శాస్త్రజ్ఞులు

కూడ అంగీకరించిన విషయం. అంటే పరమాణువులు చోటులోంచి ఉత్పత్తి అవుతున్నాయి. చోటులో ఉంటున్నాయి. చోటులో పరివర్తనం చెందుతూ వున్నాయి. చోటులోకి మళ్ళీ లీనమవుతూ వున్నాయి. అంటే from space to atoms and back to space from atom. ఈ మధ్య మిగతా కథ అంతా వున్నది. వీట్లని పంచ భూతములని అంటారు. వీటన్నింటిని ఒకమాటు బయటకు వెలువరించి ఒక్కమాటు లోపలికి పంపించేది ఒకటున్నది. దాన్ని "ఒకపరి జగములు వెలుగు" అన్నారు. దీన్ని విశ్వశ్వాస, the cosmic breath అన్నారు. దాన్నే విశ్వకర్మ లేక విశ్వప్రాణం అని అంటారు. దాని వలన మన గుడ్డి మనస్సులో ఏమీ లేదు అని చెబుతున్న చోటు అనే స్థితిలోంచి ఇవి వున్నాయి, అవి వున్నాయి అని చెబుతున్న స్థితిలోంచి యివతలకు వస్తున్నాము. దీన్నే పైథాగరస్ From seeming nothing to apparant something and again back. Everything is travelling in a pendular oscilation. అన్నారు. అవ్యక్తం నుండి వ్యక్తమునకు, వ్యక్తము నుండి అవ్యక్తమునకు. "అవ్యక్తా దీని భూతాని వ్యక్త మధ్యాని భారత, అవ్యక్త నిధనాన్యేవ తత్ర కా పరిదేవనా" భగవద్గీతలో చెప్పాడు. ఎక్కడనుంచి వస్తున్నాయంటే ఎవరికీ తెలీదు. తల్లి గర్భంలోకి వస్తున్నాయి. ఎక్కడ నుంచి వస్తున్నాయంటే తండ్రి దగ్గరనుంచి వస్తాయని కోస్తాము. తండ్రి దగ్గరనుండి వచ్చాయంటే దానికి ఒక్కొక్క మతంలో ఒక్కొక్క కథ అల్లుకున్నాం. శరీరము వెళ్ళాక జీవుడు వెళ్ళాడు, జీవుడు వచ్చాడు, అనేటువంటి దాన్ని గురించి వేదాలు, ఉపనిషత్తులు ఏమని చెబుతాయంటే, పటికబెల్లం గడ్డ నీటిలో పడేశారు అనుకోండి, ఏమైంది? పోయింది అన్నవాడు మూర్ఖుడు. అలాగే జీవులు పోతారు. అవి పోయినట్లే మళ్ళీ నీళ్ళలోంచి పటికబెల్లం గడ్డ కడుతుంది. Crystalisation వచ్చింది అన్నవాడూ మూర్ఖుడే. అవ్యక్త స్థితిలో ఉన్నది వ్యక్త స్థితిలోకి వచ్చింది. వ్యక్త స్థితిలోంచి అవ్యక్త స్థితిలోకి వెళ్ళింది అంటే from manifest to unmanifest from unmanifest to manifest. ఈ రెండు స్థితులలోకి నడిపిస్తున్నటువంటి దాన్ని the cosmic breath. లేక విశ్వకర్మ "ప్రాణోవై విశ్వకర్మా" అని వేదం. విశ్వకర్మ అనగా ప్రాణం. ప్రాణం అంటే ఏమిటి? Pulsation, respiration, inhalation and exalation అని అర్థం. దాన్నిబట్టే మనందరికీ కూడ ఉచ్ఛ్వాసలు, నిశ్వాసలు మొదలైనవి రూపం (form) లేకుండా ఏర్పాటు అయినాయి.

దాన్నిబట్టే మనం తయారుచేసే ఒక మోటారుగాని, స్కూటర్‌గాని, ఏదైనాసరే డైనమోగాని, electro magnet గాని అటు యిటు కొట్టటం అనేది దానివల్ల రావటం అనేది కనిపెట్టగలిగింది. అంటే వున్నది కనిపెట్టాం గాని లేనిది కనిపెట్టలేదు. విశ్వశ్వాస లేదా విశ్వకర్మ. దాన్ని ధ్యానంచేసి అర్థం చేసుకోవడం కొంచెం కష్టం. ''ప్రాణోవై విశ్వకర్మా'' అన్నమాటకి అర్థం అది. అలాంటి విశ్వకర్మ ఒకటి వున్నది. దాన్ని గురించే 'Secret Doctrine' లో ఆవిడ cosmic breath అన్నది అంటే when the all one which inhales away everything into his own subjectivity and exhales out into his own objectivity. ఋగ్వేదములో ఒక పుస్తకాన్ని ఆవిడ అనువాదం చేసి యిచ్చింది. సమస్తాన్ని నేను, తాను అనే స్థితిలోకి తీసికెళ్ళిపోతుంది. అంటే ఏం వుండదు అని అర్థం. ఏం వుండదు అంటే తానుతప్ప తనచే చూడబడేది వుండదు. మనం ప్రపంచములో చూడబడటం, వినపడటం, మనకంటే వేరే వున్నవాట్లని చూడటం అనేటువంటి దురభ్యాసంతోనే పెరిగాం. కనుక అది లేకపోతే ఏం లేదని మన ఉద్దేశ్యం. ఎందుకంటే మనం వున్నామని తెలియటానికి అవకాశం ప్రపంచంలో ఎక్కడా లేకపోయింది. చుట్టూ ఎవరెవరు వున్నారో అది మాత్రం తెలుస్తుంది. వాడేం చేస్తున్నాడు, వీడేం చేస్తున్నాడు. వీడేం చెప్పుకుంటున్నాడు, వాడేం చెప్పుకుంటున్నాడు అని తెలుసునుగాని, మనం ఏం చేస్తున్నాం మొదలైనవి ఆలోచించడానికి మనం అవకాశం తెచ్చుకోలేదు. చూడబడుతున్న వ్యక్తులు కన్పిస్తున్నారు గాని, చూస్తున్న మనం మనకి గుర్తుండం. అందుచేత దానిని తెలియక ప్రళయం అంటారు. పురాణాల్లో వాట్లని ప్రళయం అని మనం వాడుతున్న పేరువేసినా దాన్ని యోగనిద్ర అన్నాడు. తాను లోపలకి యోగనిద్రా స్థితిలోకి మొత్తాన్ని పీల్చేసుకుంటాడు అన్నాడు. అంటే తెలియని వాడికిది ప్రళయం. తెల్సినవాడికి యోగనిద్ర. అంటే the all Iam ఆ స్థితిలోకి వెళ్ళేటువంటిది విశ్వకర్మ. తాను కంటే ముందు వున్నటువంటిది, ఎవడికీ ఏమీ తెలియనిది, ఎవడూ ఏమీ చెప్పలేనిది ''అవ్యక్తం చాప్యచింత్యంచ'' యివన్నీ ఈ చెప్పబడిన ఆరు దేనియందు ఉంటున్నాయో అదిన్నీ ఈ మార్పులు. ఈ ఆరింటికి ఉన్న మార్పు దేనియందు లేవో అదిన్నీ. దాని పేరేమిటి? మీరు పేరు పెట్టుకున్నా అది మీరు పెట్టిన పేరు అవుతుంది. పరమాత్మ అని పెట్టుకున్నా, పరబ్రహ్మము

అని పెట్టుకున్నా, అంతర్యామి అని పెట్టుకున్నా అవన్నీ మనం పెట్టుకున్న పేర్లు.

| | | | |
|---|---|---|---|
| | ప్రళయము | | యోగనిద్ర - The all I am |
| | (బ్రహ్మ) సత్య | 7 | అ - (Truth Level) Mahapara Nirvanic Plane |
| | తపో | 6 | ఉ - Para Nirvanic Plane |
| | జనః | 5 | మ - Nirvanic Plane |
| స్థూల లోకములు | మహర్ | 4 | Buddhic Plane (creative will or pure intellect) |
| | సువః | 3 | Mental Plane |
| | భువః | 2 | Force Plane |
| | భూః | 1 | Material Plane |

ఇందులో ఏడు స్థితు లుంటాయి. మొదటిది భూలోకం, మనం దీన్ని matter అంటాం. రెండవది భువర్లోకం, దీన్నే force అంటాం. మూడవది సువర్లోకము. మనస్సు అనేటువంటి లోకం. మన మనస్సుకాదు జగత్తుయొక్క మనస్సు (space mind). చోటులో మనస్సు వుంది కనుకనే మన బుర్రలో కూడ మనస్సు వుంది. మన బుర్రలో మనస్సు వుంది అనేది ఎపుడూ ఉండదు. చోటులో చెంబు పెడితే చెంబులో చోటు వుండదూ? ఉంటుంది. చోటులో చెంబు వుంది కనుక లేకపోతే వుండదు. చోటులో మనస్సు అనేది ఉండక పోయినట్లైతే మన బుర్రలో వుండదు. దీని కధిపతి ఇంద్రుడు. ఇంద్రియములకు అధిష్ఠాన దేవతగా వస్తూ వుంటాడు. మనం శరీరం ధరించేటప్పటికి ఆకాశంలో చోటు కధిపతిగా, మేఘాలకి అధిపతిగాను వస్తూ వుంటాడు. ఆపైన పెద్ద చోటుకి అధిపతిగా వస్తూ వుంటాడు. అవన్నీ మనం అర్థం చేసుకోవాలంటే వేదాలన్నీ చెప్పుకోవాలి. ఇందులో చెప్పబడిన సూత్రం దేన్ని ఉద్దేశించి చెప్పాడో అది వూరికే నిర్దేశించుకొనేందు కోసమని

ెబుతున్నాను. కనుక స్వర్లోకం. ఒక్కొక్క లోకానికి ఒక్కొక్క అధిపతి
ఉన్నాడు. మహర్లోకము అంటే బుద్ధి. దీనికి ఇంగ్లీషులో పదం లేదు. కనుక
అదే వాడుకోవాలి. జ్వాల్‌కూల్ గారు ఏం చెప్పారంటే creative will or
pure intellect. అది దుర్లభం నాయనా జనానికి. అది మనస్సుతో
అంటుపడకుండా ఉండదు అన్నాడు. కనుక మీకున్నది pure intellect అని
అనుకోకండి జాగ్రత్త. తొందర పడకండి. అది వచ్చిన నాటికి అది వస్తుంది.
కాని మీకున్నది అది వచ్చిందని ఎన్నడూ అనుకోకండి. వచ్చేది ఏం
ఫర్వాలేదు. అదే వస్తుంది. ఆయన ముఖ్యంగా creative will అనే ఎక్కువగా
వాడతాడు. అనగా సృజనాత్మకమైనటు వంటి సంకల్పం. మన సంకల్పానికీ
దానికీ తేడా ఏమిటి? ఎలా అయినా కాఫీ మంచిది కాదండి. తాగటం మంచిది
కాదని తెలుసు. మానేద్దాం అనుకుంటం దేనివల్ల జరుగుతుంది. కాఫీ, కల్లు,
వక్క, చుట్ట, బీడి, సిగిరెట్టు, మద్యం, వ్యభిచారం, దొంగబుద్ధి గాని,
యితరుల అభిప్రాయములు తనవిగా ఉపన్యాసంలో చెప్పుకుంటూ ఉండటం
కాని, ఇవన్నీ సరదాగా చేద్దామని అనిపిస్తూ ఉంటుంది. కాని యివి
చేయకూడదు అని అనిపించడం యిక్కడ అనిపిస్తుంది. ప్రతీవాళ్ళకి
అనిపిస్తుంది. కాని చేయకుండా ఉండడం ఎక్కడ ప్రారంభం అవుతుంది.
యిక్కడ ''మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే'' వేయి మందిలో
ఒక్కడు ప్రయత్నిస్తాడు. ప్రయత్నించిన వాళ్ళు వెయ్యిమందిలో ఒకడు
నెగ్గుతాడు. అంటే దీని స్పర్శ ఉంటే చేయగలుగుతాడు. ఏదైనాసరే. మనం
ఈ పనిచేద్దాం అనిపించి ఏమిటోనండి చాల రోజులనుంచి చేద్దామని
అనుకుంటున్నాం. అంటే యింకా మొదటి దాంట్లోనే ఉన్నామని అర్థం.
ఏదన్నా దేశానికి పనికివచ్చే పని చేద్దామని అనుకుంటూ ఉండటం. గడ్డం
నెరిసింది, జుట్టు నెరిసింది, తల వూడిపోయింది, మరి మోకాళ్ళు, కాళ్ళు,
నెప్పులు, వాపులు వచ్చినాయి. ఏమిటో చాలకాలం నించి చేద్దామను
కుంటున్నాం. జరగటం లేదు. అంటే ''అహం కాశి గమిష్యామి'' అన్నచోట
ఉన్నావన్నమాట; వెళ్ళడు, అంటే భవిష్యత్ కాలంలో వుంటుంది. ఇవాళ
వెళ్ళటానికి మాత్రం రెడీగా లేనని అర్థం. ఆ స్థితినుంచి నాల్గవ స్థితికి రావాలి.
ఇంకా ఈ స్థితికి ఆ స్థితికీ తేడా జ్వాలాకూలు దేమి చెప్పాడంటే ఎన్ని
వేలమాట్లు, ఎన్ని లక్షలమాట్లు ఒక అభిప్రాయాన్ని మీరు గట్టిగా గొంతెత్తి
అరిచినా దుమ్ములో కలిసిపోతుంది. ఒకమాటు ఈ స్థితిలో కనుక మీరు

అరవకుండా మనస్సులో స్మరించినా తర్వాత కొన్నివేల సంవత్సరాలు మానవుల్ని తరింపజేస్తూ ఆ అభిప్రాయం ఒక వాక్యంగా మానవుల్లో వుండిపోతుంది చూసుకోండి. శ్రీకృష్ణుడు, గౌతమ బుద్ధుడు, జీసస్ క్రైస్టు ఇచ్చిన వాక్యములు ఎవడు పీక్కు చచ్చినా తన్నుకున్నాపోవు. మిగతా వాళ్లు ఎంత గట్టిగా గొంతెత్తి నినాదాలు చేసి వర్ధిల్లాలి, నశించాలి అని అరిచినా దుమ్ములో కలిసిపోతాయి. అంతే తేడా! కాని ఈ స్థితినుంచి ఒక్క వాక్యం వచ్చినట్లయితే అది నిల్చిపోతుంది. భగవద్గీత వచ్చి ఎంతకాలమైందండి. 5000వేల సం॥ల పైచిల్లర, పోయిందా? అచ్చుకూడ వేయించకపోయినా పోయిందా? అచ్చు ఎపుడు వచ్చింది. మహా అయితే 300 ఏళ్ళ క్రిందట. అంతకుముందు 5000 ఏళ్ళు. అంతకుముందు లిపి రాలేదంటారు. మహాభారతం, భాగవతం 12 స్కంధాలు, రామాయణం షట్కాండలు+సప్తమకాండ, వేదాలు 82 పన్నాలు+ ఋగ్వేదం+సామవేదం+ అధర్వణ వేదం+వాటి బ్రాహ్మణములు, శతపథ బ్రాహ్మణముల సంపుటాలు లిపి లేకుండానే వున్నాయి. కాని script ఉన్నా లేకపోయినా గీపెట్టుకున్నా తన్నుకున్నా పోవు ఆ వాక్యాలు. Love thy neighbour as thyself అని 2000 వేల సంవత్సరాలైంది ఏసుక్రీస్తు చెప్పి. ఆయన tape recorder లో చెప్పలేదు. రాసుకోండిరా నాన్న అనలేదు. గ్రామఫోను రికార్డు యివ్వలేదు వాళ్ళకి. కాని ఇప్పటికి ఇంగ్లీషు దాకా వచ్చిందా లేదా? ఇన్ని పదుల భాషల్లోకి అనువాదం అయ్యాక ఇంగ్లీషులోకి వచ్చి ఉంటుంది. అది ఎక్కడనుంచి వచ్చింది? ఈ స్థితినించి వస్తే వుంటుంది. మొదటి స్థితినుంచి వస్తే వెళ్ళిపోతుంది. ఇది జ్వాలాకూల్‌గారు చెప్పింది. 1. భూలోకం, 2. భువర్లోకము, 3. సువర్లోకం, 4. మహర్లోకం. ఈ నాలుగు స్థూల లోకములు. ఈ నాల్గింటిలోను స్థూల జీవులు ఉంటారు. భూలోకంలో స్థూల శరీరంతో ఉంటారు. భువర్లోకములో సూక్ష్మ శరీరములతో ఉంటారు. శరీరం వదిలి పెట్టిన తర్వాత ఎట్లా ఉంటాయో మనకి modern science కిగాని, professors కి గాని యింకా తెలిసే రోజులు రాలేదు. ఆపైన సువర్లోకము. mental body లో వుంటారు. ఆపైన మహర్లోకములో (budhic plane) ఉంటారు. శరీరంవున్నా ఉండకపోయినా ఎవడికి వాడు ఉండడం వుంది వీట్లల్లో. వీటికి పైన మూడున్నూ సూక్ష్మ లోకములు అని చెబుతారు. 5. జనలోకం. అంటే జీవులు యగుచుండు లోకము. మిగతా నాల్గింటిలో (లోకములలో) ఉత్పత్తి అయిన జీవులు ఉండాల్సిందే. క్రిందా, మీద

పడుతూ శరీరాలు ధరిస్తూ ఉండటం, వదుల్తూ వుండటం, చొక్కాలు వేసుకుంటూ ఉండటం. విప్పుతూ వుండటం, స్నానం చేస్తూ ఉండటం, సగం స్నానంచేస్తూ ఉండటం, కుక్క స్నానంచేస్తూ ఉండటం, ఒక జన్మ ఎత్తి, ఇంకో జన్మ ఎత్తేలోపల పూర్తిగా క్షాళణం అవ్వటం, సగం క్షాళణం అవ్వటం, కాస్త క్షాళణం అవ్వటం, ఆ దుర్వాసనలతో పాటు మళ్ళీ పుడుతూ ఉండటం. కాంప్రడించి ఉమ్మేసిన వాసనలు కూడ మళ్ళీ తీసుకొని ఒంటికి పూసుకొని మళ్ళీ పుడుతూ వుండటం. క్షాళణం తిన్నగా జరగకపోతే, లేదా శుభ్రమైన పనులుచేస్తే శుభ్రంగా క్షాళణం అయిపోయి హాయిగా సర్ఫ్ కొట్టేసి, clear గా, crystal clear గా, transparent గా మళ్ళీ పుడుతూ వుండటం. వీట్లల్లో ఎట్లా అయినా క్రిందికి పైకి తిరుగుతూ వుంటాయి. ఈ నాలుగు లోకాల్లో వాళ్ళు ఈ నాలుగు లోకాల్లోకి ఎక్కడనించి వస్తున్నారు? బుద్ధిలోకం లోంచి. జనలోకములోకి ఎక్కడనుంచి వస్తున్నారు. అంటే చూశారా. జంతికల గొట్టం ఉంటుంది. దాని కన్నంలోంచి జంతికలు ఎక్కడనించి వస్తున్నాయి. పిండిలోంచి వస్తున్నాయి. ఆ పిండి ఉన్నది జ్ఞనలోకం అంటే. ఇవతల పడ్డాక జంతికలు. అంతకుముందు పిండి. కనుక యిక్కడ atoms ఉంటాయి. Pre-atomic state. 'విరజా' అంటే రజస్సులకి అవతల వున్నటువంటి లోకం. 'పరోరజా' రజస్సులకి ఇవతల వున్నది. 'పరో రజసే సావద ఓం' అని ఈ మూడు లోకాలకి అవతల వుంటుంది. ఓం అనేటువంటిది. అందుకనే దీనిపేరు మకారం అని చెబుతారు. అంటే అనునాసికం. ఎప్పుడన్నా తర్వాత చెప్పుకుందాం. యింతవరకే యిపుడు. దీన్నేమంటారు? బుద్ధుడు పెట్టిన పేర్లు జ్వాలాకూలుడు పాశ్చాత్యులకు వ్యాప్తి చేసాడు. ఆయన పుస్తకాలలో ఈపేర్లు కనిపిస్తాయి. (Nirvanic plane) నిర్వాణ లోకమని చెప్పాడు దీన్ని బుద్ధుడు. ఈ పిండి దేనితో తయారు చేయబడ్డది. శనగలు మొదలైన వాటితో. కనుక ఈ జీవుల్ని తయారుచేసే పిండి ఎక్కడనుంచి వస్తోంది. తపోలోకం నుంచి. తపోలోకం అంటే ఏమిటి? తపించునట్టి లోకము. నిరంతరం వేడిమి, వెలుగు తప్ప యింకేం వుండదు అక్కడ, కనుక ఒక జీవి అంటూ వుండటానికి వీల్లేదు ఆ లోకంలో. మొత్తం అంతా ఒక్కడే వుంటాడు. ఈ క్రింది లోకాలలో ఎవడి బ్రతుక్కి వాడు వండుకుంటం, ఎవడి శరీరంలో వాడు ఉండటం, ఎవడి పిండం వాడు పెట్టుకుంటం ఉంటుంది. ఆపైన సత్యలోకం లేక బ్రహ్మలోకము

అంటారు. అంటే truth levels అన్నారు. Nil, None, Naught అన్నారు. అంటే ఈ ఏడో లోకంలో ఒక వెంకయ్య పుట్టి ఉద్యోగం చేసి చచ్చిపోయాడు అనుకోండి. యిక్కడ ఏం వుంటుంది. వెంకయ్య పుట్టి ఉద్యోగం చేసి చచ్చిపోయాడు అని రికార్డు వుంటుంది. పుట్టక మునుపు వుంటుంది. పుట్టాక వుంటుంది. వాడు పోయాక వుంటుంది. తమాషా. ఎలా వుంటుంది అంటే మఱ్ఱిగింజలోంచి మఱ్ఱిచెట్టు పుట్టటం పెరగడం మళ్ళీ మఱ్ఱికాయలు రావటం మఱ్ఱిగింజలు రావటం చచ్చిపోవటం వుటుంది. యిపుడేం వుంటుంది. మఱ్ఱిచెట్టు, మఱ్ఱికాయ, మఱ్ఱిగింజ, మఱ్ఱిమొక్క ఈ మొత్తం బొమ్మ వుంటుంది. యింకేం వుండదు. అది శాశ్వతం. 31 తేదీలు గుడ్డలో పెట్టి అందులో ఒక కన్నం పెట్టారనుకోండి. అపుడు ఇవాళ పదహారో తారీఖు అంటే అదొక్కటే కనిపిస్తూ వుంటుంది. పై డిప్ప తీసేసి ఆపైనుంచి చూసేవాడికి ఆ 31 తేదీలు కనిపిస్తాయి. క్రిందికి డిప్ప పెట్టారనుకోండి. మనం క్రిందనుంచి చూస్తే పదహారో తేదీయే కన్పిస్తుంది. పొద్దున్న చూస్తే 17వ తేదీ కన్పిస్తుంది. దీన్ని పట్టుకుని ఆ నిచ్చెన ఎక్కి రిపేరు చేసేవాడు ఉంటాడు చూడండి. వాడికేం కన్పిస్తాయి 31 తేదీలు కన్పిస్తాయి పైన. అదీ సత్యలోకం అంటే. నమూనా ఊరికే ఉదాహరణకు చెబుతున్నాను. అంటే దాంట్లో ఉన్నటువంటి స్థితిలో లక్షోవంతు, కోటోవంతు మనం భౌతిక శరీరములో ఉన్న మనస్సుతో ఒకడికి ఒకడు చెప్పుకుంటానికి అవకాశం లేదు. ధారణ, ధ్యాన, సమాధులలో ఎవడికి వాడికి తెలియటానికి అవకాశం వున్నది. కనుక యిది సత్యలోకం అని అంటాడు. కనుక బుద్ధుడు పై రెండింటికి పర నిర్వాణలోకం, మహాపర నిర్వాణము అని చెప్పాడు. అయితే ఇది అంతర్యామా? పరమాత్మా? అన్నారు. కాదు కంగారు పడకండి. ప్రతివాణ్ణి చూసి పరమాత్మ అనుకోకూడదు. కొత్తగా విశాఖపట్నం వచ్చినటువంటి నాబోటిగాడికి, నేవీ వాళ్ళు తిరుగుతూ వుంటారు, అది చూసిన మర్నాడు బ్యాండు మేళం వాయించే వాళ్ళని చూస్తాడు, అలాగే వుంటారు వాళ్ళు కూడ, నేవీ వాళ్ళే అనుకుంటాడు. అనుకోకూడదు. వాళ్ళు, వీళ్ళు ఒక రకమైన టోపీలే, ఒక రకమైన చొక్కాలే తొడుక్కుంటారు. వీళ్ళు బ్యాండు వాళ్ళు. వాళ్ళని చూసి సార్ తమరు నేవీవాళ్ళా? అని అడక్కూడదు. కాదండి పంతులుగారు మేము మేళాలు వాయిస్తామండి అంటారు. మొదటి 4 లోకాల వరకు కూడ identity ఉంటుంది. పైకెళ్ళేటప్పటికి identity లేదు. ఇంకొక తమాషా

ఏమిటంటే ఈ నాలుగు లోకాల్లో లోకంబులు, లోకేశులు, లోకస్థులు వేరే వేరే వుంటారు. అంటే యిపుడు ఈ లోకంలో మనం వున్నాం, భౌతిక లోకంలో మన శరీరం వేరే వుందికదా. మనల్ని పరిపాలించేవాడు ఊళ్లో వేరే వున్నాడు కదా. లోకంబు, లోకస్థులం మనం, లోకేశుడు. ఇట్లా ప్రతీ వూరికి ఒక లోకయ్య. ఈ ఊళ్ళన్నింటి మీద జిల్లా లోకయ్య జిల్లాలోకం. వాటిమీద రాష్ట్ర లోకయ్య. తెలుగు వాడికి తెలుగు లోకయ్య, అరవవాడికి అరవ లోకయ్య. వీటన్నింటి మీద కూడ యావద్భారత లోకము, లోకయ్య. ఆపైన యావద్భూగోళ లోకయ్య యిలా వుంటుంది. కాని ఈ మూడింటి దగ్గరికి వచ్చేటప్పటికి ఆ లోకం అన్నా, లోకంలో ఉన్నవాడన్నా, లోకాధిపతి అన్నా ఒకటే, వేరుగా వుండరు. అందుకనే ఇవి తెల్సినవాళ్ళు రచనలు చేస్తుంటే మనకి గమ్మత్తుగా తెలుస్తూ వుంటుంది. నారదుడు ధర్మరాజు దగ్గరకి వచ్చి భారతం - సభాపర్వంలో, మయసభని చూసి, నువ్వు కట్టించిన ఈ భవనం చాల బాగావున్నదన్నాడు. అంటే ధర్మరాజు యిలాంటి భవనం ఏలోకంలో అయినా తమరు చూచారా అని అడుగుతాడు. ఏదో ఆ లోకంలో యిలా వుంది, ఈ లోకంలో యిలా వుంది, అని అవన్నీ చెబుతాడు. చెప్పి స్వర్గలోకానికి వెళ్ళాను. అక్కడ వారున్నారు. వీరు వున్నారు. బృహస్పతి ఉన్నాడు. అంగీరసుడు, భృగువు వీళ్ళంతా ఉన్నారు. మర్చిపోయాను హరిశ్చంద్ర మహారాజు ఉన్నాడు. మాట్లాడి వచ్చాను. బావుంది. అక్కడ నుంచి యింకా అంగారక లోకం వెళ్ళాను. యమ, వరుణలోకాలకి వెళ్ళాను. యమలోకంలో వాళ్ళున్నారు. వీళ్ళున్నారు. ధర్మం చేసిన వాళ్ళు అక్కడ వుండి సభ చేస్తూన్నార్లే. యమధర్మరాజు, మహానుభావులు వాళ్ళందరూ వున్నారు. ఇదిగో మీ నాన్నగారు పాండురాజు వున్నారు అన్నాడు. కొంప తీశాడు. వాడికి చెప్పటం కోసమే చెప్పింది నారదుడు. ధర్మరాజుకి గుండె ధడక్‌మంది. తండ్రి యమలోకంలో వున్నాడనేటప్పటికి. దానికి తోడు హరిశ్చంద్రుడు స్వర్గ లోకములో ఉండటం ఏమిటి? మా నాన్నగారు యమలోకంలో ఉండటం ఏమిటి? ఈయన ఏం తక్కువ పుణ్యాలు చేసేడని, సరే అడగాలి కదా. ఇన్ని పుణ్యాలు చేసినటువంటి మా నాన్నగారు యమలోకంలో వుండటమేమిటి? హరిశ్చంద్రుడు ఆ లోకంలో వుండటం ఏమిటి అని అడిగితే బాగుండదు. మరి ధర్మరాజు అడిగినట్లు వుండదు. 20వ శతాబ్దపు వాడు అడిగినట్లుంటుంది. అందుకని ధర్మరాజు ఏమని అడిగాడో తెలుసునా? అపారమైన మహా పుణ్యములు సమస్తంచేసి ఈ

లోకానికి వెలుగునిచ్చిన మా తండ్రి మొదలైన మహానుభావులంతా యమ సభలో వుండంగ, తానింకా ఎంత చేశాడో ఆ హరిశ్చంద్రుడు ఇంద్రలోకంలో వున్నాడు. కొంచెం వివరించండి అన్నాడు. నారదుడు నిజమైన సైకాలజీ తెల్సినవాడు. నాకు తెలుసోయ్ ఈ ప్రశ్న నువ్వు వేస్తావని అన్నాడు. వాడా ప్రశ్న వేయటంకోసమే ముందు ఆపైన వన్నీ చెప్పాడు. వాడక్కడున్నాడు. వీడిక్కడున్నాడు అంటూ హరిశ్చంద్రాది మహారాజు లందరూ ''యింద్రులందునికియు'' అంటాడు. అంటే యింద్రుని యందున్నారా లేక ఇంద్రలోకంలో ఉన్నారా? అది తెలిసి అనువాదం చేసినవాళ్ళు ఈ మూడు లోకాల్లో యింద్రుడి యందు ఉండటం అన్నా, యింద్రలోకంలో వుండటం అన్నా ఒకటే. బ్రహ్మయందు వుండడం అన్నా, బ్రహ్మలోకములో వుండడం అన్నా ఒకటే. అంటే దానియందు వున్నవాడు దాని అధిపతి, ఆ లోకాలు వేరే వేరే ఉండవు, అంటే container and the contained అని మొదటి నాలుగు లెవెల్స్‌లో వుంటాయి. యిక్కడ container and the contained వుండవు. వెలుతురు వుందనుకోండి. వెలుతురు చోటులో వెడుతున్నట్టు మన గుడ్డి కంటికి కన్పిస్తుంది. కాని ఈ లోకాలకి వెళ్ళి, అంటే భూగోళం దగ్గరనుంచి చంద్రుణ్ణి దాటి అంగారకుణ్ణి దాటి పైకివెడితే, చోటులో వెలుగు వెడుతూ ఉన్నది అనేటువంటి గుడ్డితనం కన్పించదు. ఏం కన్పిస్తుందో తెలుసునా? చోటు చూట్టానికి ఎవరైనా వుంటే వాడికి వెలుగల్లే కనిపిస్తుంది. ఆ వెనుక చోటల్లే కన్పిస్తుంది. యిపుడు సూర్యుడు గుండ్రంగా ఎందుకు కన్పిస్తున్నాడు. మన కన్ను గుడ్డు అలా వుంది కనుక వాడు గుండ్రంగా కనిపిస్తున్నాడు. సూర్యుడు గుండ్రంగా వుండడు. మన కంటికి కనిపించేటువంటి సూర్యుడి బొమ్మ అది. అలాగే సూర్యుడు ఆ రంగులో వుంటాడా? మన కంటికి colour effect? ఆ రంగులో వాడుంటాడా? కనుక ఈ అయోమయాలు చాలా దాటాలి పైకి వెళ్ళాళంటే. పైకి వెడుతూ వుంటే ఏమవుతుంది? ఒక satellite వేసుకొని సూర్యుడిలోకి వెళుతున్నామనుకోండి. అసలు యివన్నీ కూడ దూరం నుంచి సూర్యుణ్ణి చూసేవారికి కనిపించే లోకములు. సూర్యుడిలోకి వెళ్ళేటప్పటికి వీడు, వీడి sattelite, వీడి మనస్సు కూడ ఈ వెలుగు అయిపోతాయి. అంటే తాను అది అవుతాడు. సూర్యుడిలో వున్నదేమిటి? 'సూర్య ఆత్మ జగతః స్తస్థుతస్య' అంటే సూర్యుడిలో Iam వుంది అన్నాడు. అక్కడికి వెడితే I am అయిపోతావు. మొత్తం అంతర్యామిగా

ఒట్లా వుంటావుగాని నువ్వు వేరే వుండి చూట్టానికి వీల్లేదు. దూరాన్నించే ఈ భూగోళం మీద నుంచో, చంద్రగోళం మీదనుంచో, అంగారక గోళం మీదనుంచో అదిదాటి సూర్యునికి దగ్గరగా గోళాలు వేటిమీదా, కనీసం బృహస్పతి గోళం మీదనుంచి కూడ కనిపించటం చాల కష్టం. శనైశ్చర గోళం మీదనుంచి కన్పిస్తుంది. బాగా దూరం వుంది కనుక. భూగోళం మీదనుంచి కన్నా యింకా మసకగా, అద్దానికి మసిపూసి చూస్తే సూర్యగ్రహణం కన్పిస్తుందే, అలా కన్పిస్తాడు శనైశ్చర గ్రహం మీంచి సూర్యుడు. కాని బుధుడు మీదకో శుక్రుడు మీదకో వెడితే అక్కడ నుంచి సూర్యుడు కనిపించేదేం లేదు. మొత్తం అంతా ఒకటే వెలుగు. వీళ్ళు వెలుగుల పరమాణువులై ఉంటారు కాని వేరే వుండరు. ఇంకొంచెం దగ్గరికి వెళ్ళేటప్పటికి పంచదార రేణువులు ఒక గ్లాసులో ఉన్న నీళ్లల్లో పోస్తూంటే ఈ రేణువులు ఏం అవుతాయో అది అవుతాం మనం. అంటే సూర్యుడి దగ్గరికి ఏది వెళ్ళినా, ఏం యంత్రంతో వెళ్ళినా, ఎవడు వెళ్ళినా అనన్యం. తాను తప్ప ఇంకోటి వుండదు. కనుక ఏడులోకముల నిర్మాణం మీకు తెలుస్తుంది. ఇది భువన వ్యూహం అంటే భువనం యొక్క నిర్మాణం మీకు తెలుస్తుంది, సూర్య లోకంలో ధ్యానంచేస్తే అంటే, మీ హృదయములో సూర్యుడిని ధ్యానంచేస్తే. మీరు యోగస్థితిలో సూర్యుణ్ణి ధ్యానంచేస్తే అక్కడున్నట్టు కనిపించడు కళ్ళు మూసుకుంటే. మామూలుగా కళ్ళు మూసుకుంటే సూర్యుడు ఒకడున్నాడు. ఇక్కడ వుండే పాండురంగడు అక్కడే వున్నాడు, అన్నట్టుగా వుంటాడు. అలా వుండదు. మీకు ఎపుడైతే ధారణ, ధ్యాన సమాధులు వచ్చినాయో మీరు అదీ వేరుకాదు కదా. అలాంటపుడు మీలోను సూర్యబింబం వుంటుంది. దాంట్లో మీరుంటారు. మీలో అది వుంటుంది. అది ధ్యానంలో జరిగేది. అంటే truth ప్రకారం మీకు కన్పిస్తుంది గాని మన కంటికి సంబంధించిన చత్వారం, మన కంటికి సంబంధించిన zero error మనం చూస్తున్న వాటి ప్రకారం చూస్తే మాత్రం కనిపించదు. ఈ పనిముట్లు (instruments) లో ఉన్న దోషములు దానికి ఆపాదనము కావు అటుపైన. కంటిద్వారా, మనస్సుద్వారా కాదు మీరు చూస్తూ ఉన్నది. అపుడు సూర్యుని కేంద్రం మీలో వుంటుంది. సూర్యునియొక్క పరిధి అయినటువంటి బ్రహ్మాండమైన వ్యూహం మాత్రం వుంటుంది. ఈ మధ్యన వున్నటువంటి లోకములు అన్నీ తమాషాగా కన్పిస్తూ వుంటాయి, తిరుగుతూ వుంటే. బుధలోకం, అటుపైన బృహస్పతి

లోకం, దానిపైన నీ శరీరము, చర్మం ఎక్కడైతే ఉందో ఆ లోకంలో శనైశ్చర లోకము, surface, lord of sufaces వాడు. యింకా లోపల శుక్రలోకము. ఈ బృహస్పతికి కొంచెం యివతల అంగారక లోకము, మీ రక్తం, శరీరం లోపల హెమోగ్లోబిన్ మొదలైనవి ఎక్కడైతే వుంటాయో అది అంగారక లోకము. ఈ సూర్యుడిలో మీరు చూస్తున్న ఒక భాగంగా చంద్రుడుంటాడు. వేరే వుండడు. అంటే ఏమిటి? సూర్యుడంటే వెలుగు లేదా wisdom (జ్ఞానము). చంద్రుడంటే Idea లేక (form) రూపం. కనుక యిది world of forms. మనం వున్నది. World of light, world of matter శరీరం అనేది. అంటే వీటన్నిటి యొక్క సగటు గట్టి హెచ్చువేత గడితే ఉన్నదే ఇపుడు మనం చూస్తున్నది. ఇందులో ఏ ఒక్కటి పనిచేయటం లేదు ఈ లోకాల్లో. అన్ని లోకాలు పనిచేస్తూంటే ఒకరుకి ఒకరు కనిపిస్తున్నాం. ఒకరికి ఒకరు వినిపిస్తూ ఒకరు చెప్పింది ఒకరు అర్థం చేసుకుంటానికి ప్రయత్నిస్తున్నాం. ఒకరికి ఒకరు సాయం చేసుకుంటానికో, ఒకరిమీద ఒకరు కోర్టు కెళ్ళటానికో యివన్నీ ప్రయత్నం చేస్తున్నాం. అర్థమయినంత అర్థం అవుతుంది. తర్వాత మళ్ళీ చదువుకోవాలి. ఇది యిలా మీక్కనిపిస్తుంది. ఇలా మీ కనిపిస్తూ సూర్యుడిలోనే చంద్రుడు ఒక భాగంగా కనిపిస్తాడు. కనుక నేను అనే దాంట్లోనే యిది కూడ యిమిడిపోయి వున్నది. దీనినే శంకరాచార్యులవారు ఏం చెబుతారంటే మూలాధారం దగ్గర వున్న ప్రజ్ఞ, ఇపుడు మనం వున్నట్టు వుంటుంది. నేను వేరు నాకు మీరు వేరు. మనిద్దరి మధ్య చోటు. యింకా ఈ బల్ల. మనిద్దరం కలుసుకోవాలంటే అక్కడనుంచి యిక్కడికి రావటం లేకపోతే నేను ఇక్కడనుంచి అక్కడికి రావటం. ఏదో ఒకడి దగ్గర ఒకడు ఉద్యోగం చేయాలంటే జీతాలు ఎంత? సంతకాలు ఇవన్నీ ఉంటాయి. ఆ మూలాధారం దగ్గరనుంచి ఒక్కొక్క మెట్టు దాటి, పైన చెప్పిన ఏడు లెవెల్స్ దాటి ఒక్కొక్క లెవెల్ పైకివచ్చి సహస్రారం దగ్గరికి వచ్చేటప్పటికి అంతర్యామి యైన వాడు లేక పరమశివుని యందు లీనమౌతారు. ఎవరు? యోగాభ్యాసం చేస్తున్నవారు కాదు. ఈ చేస్తున్న వారి రూపంలో ఉన్నటువంటి అమ్మవారు లేక శక్తి. అదే మనకి దక్షయజ్ఞంలో సతీదేవి అన్నారు. ఈ ప్రపంచంలో ఒకరికి ఒకరికి ఉన్న సంబంధాలలో ఒకణ్ణి ఒకడు తిట్టుకుంటం కొట్టుకుంటం అనేటువంటి ప్రపంచంలో ఆవిడ తీసుకొచ్చి పడేయబడుతుంది. అదే దక్షయజ్ఞంలో తిట్లు తినటం అంటే. అక్కడనుంచి మృత్యువు అనే పేరుతో

శరీరం వదిలిపెడ్తుంది. దక్షయజ్ఞంలో అమ్మవారు శరీరం వదిలిపెట్టిందట అంటే ఆవిడ పోయిందని అర్థంకాదు. మన శరీరాన్ని ఆవిడ వదిలిపెడ్తుంది. జాగ్రత్తగా చదువుకోవాలి. మన శరీరాల్లో ఆవిడ ఉంటోంది. మన శరీరం ఆవిడ వదిలిపెట్టింది. అంటే మనం వుండం. చేసే పనులబట్టి మన శరీరాన్ని ఆవిడ వదిలిపెడుతుంది. అపుడు మిగతా ప్రమథ గణాలందరూ కూడ ఆ చేయవలసినవి చేస్తారు. ఆ యజ్ఞశాల దూలాలు పీకి వాసాలు లాగి అంటే మన పూర్వకర్మకు సంబంధించిన ఘోరమైనటువంటి తావులన్నీ వాళ్ళు యిస్తారు. కనుక యిక్కడికి వెళ్ళేటప్పటికి శివుడి దగ్గరికి శక్తి వెళ్ళిపోతుంది.

మూలాధారం దగ్గరనుంచి వెడితే సహస్రారం దాక ఏడు levels చెప్పుకున్నాం కదా. మూలాధారం, పృథివీతత్వం (solid), మణిపూరకము, జలతత్వం (liquid), స్వాధిష్ఠానము, అగ్నితత్వం (spleen centre) అంటారు. అలాగే అనాహత చక్రం, వాయుతత్వం (Air, respiration) అవి. తర్వాత విశుద్ధి చక్రం అంటే space కీ మనకి link. అదే Sound principle, కంఠంలోంచి space కి మనకి సంబంధం సౌండే. యిక్కడికి పంచభూతాలు పృథివీ, ఆపస్తేజో వాయు రాకాశములు అంటారే అవి అయిపోయినాయి. తర్వాత మనస్సు ఆజ్ఞాచక్రం భ్రూమధ్యంలో అంటారు. అది కూడ దానికంటే పైకి వెళ్ళేది. ''మనోఽపి భ్రూమధ్యే సకలమపిభిత్త్వా కులపథం'' దీన్ని కుల మార్గం అంటారు. ఈ వెన్నెముకలో ఏర్పాటు చేయబడిన arrangements ని అంటే క్రిందనుంచి పైకి వెళ్ళే ప్రయాణాన్ని కౌలమార్గం లేక కవులాచార సాధన అంటారు. ప్రమాదమైన సాధన. పైనుంచి క్రిందికి వచ్చేది సరియైన సాధన. అది కొంచెం తర్వాత చెప్పుకుందాం. వీటన్నింటినీ ఛేదించుకొని వెళ్ళి ''సహస్రారే పద్మే'' సహస్రారం అనేటువంటి పద్మములో శిరస్సున వుంటుంది. ''సహరహసి పత్యా విహరసే'' అక్కడ తన భర్తతో విహరిస్తుంది అన్నాడు. ఎంత చోటు వుంటుంది అక్కడ అంటే పూర్తిగా తన భర్త నిండి వుంటాడు అక్కడ. తలుపు తీసేటప్పటికి పూర్తిగా ఆయనే ఉంటాడు. లోపలికెళ్ళి తలుపేసుకుంటుంది. అంటే ఇద్దరూ ఉన్నా అంతేచోటు వుంటుంది. అదీ వాళ్ళిద్దరూ కలిసివుండే పద్ధతి. అంటే matter కాదు, అది space. కొంచెం కష్టం. మెల్లిగా ధ్యానంలో వస్తాయి. ఈ లోకముల యొక్క వ్యూహములు కూడ తెలుస్తాయి. ఇదీ సూర్యలోకము తెలియటం అంటే. కనుక సూర్యుడు, చంద్రుడు కలిసివున్న ఆ తత్వము తెలుస్తుంది. అది మనకి

తెలియటానికి, అభ్యాసము చేయటానికి సరైన టైము ఏర్పాటు చెయడం కోసమే ప్రతీనెల సూర్యుడు- చంద్రుడు ఉన్నట్లు కనిపించేటట్టుగా అమావాస్య అనే ఒక స్థితి ఏర్పడ్డది. అమావాస్యనాడు ఉపదేశం పొంది ధ్యానం ప్రారంభం చేయండి అంటూ వుంటారు. నిజమే కాని ఆ అమావాస్యనాడు కాదు. ప్రతీవాడికి వాడి అమావాస్య అని వుంటుంది. అంటే వాడి జన్మచక్రములో చంద్రుడు వుంటాడు. అక్కడికి సూర్యుడు వచ్చినటువంటి రోజును చూసుకొని ఆటైములో చేసుకోవాలి. ఆ ముందురోజు, ఆ రోజు, ఆ తర్వాత రోజున్నూ ద్రవ పదార్థమైన ఆహారంలో వుండాలి పాలు, మజ్జిగ మొదలైనటువంటి వాట్లల్లో. అపుడు మీరు ధ్యానానికి కూర్చుంటే పెద్ద శ్రమ పడక్కర్లేదు. వాళ్ళే తీసికెళ్తారు. పతంజలి తీసుకెళ్తాడు. భగవద్గీత తీసుకెళ్తుంది. అందరూ తీసికెళ్తారు. ఇది అమావాస్యంటే. మీ సొంత అమావాస్య. పంచాంగంలో వున్న అమావాస్యకాదు. ఈ సాధన చేయనటువంటి వాళ్ళకి ఆ రోజున మనస్సేమిటో తమాషాగా ఉంటుంది. ఏమిటిరా ఇవాళ out of mood లో ఉన్నాం అనిపిస్తుంది. ఎందుకని? బయటికి మనస్సు వుంటే ఆ రోజున పనిచేసే రోజుకాదు. ఆరోజున మనస్సున ఉండాల్సింది బయటికి కాదు. లోపలికి. సరిగ్గా అక్కడ నుంచి పదిహేనవ రోజున వాడి పౌర్ణమి వస్తుంది. అపుడు బయట పులి అల్లే ఉంటాడు. ప్రతీవాడికి వాడి అమావాస్య, వాడి పౌర్ణమి అని వేరే వుంటాయి. పంచాంగంలో వున్న అమావాస్య, పౌర్ణమి కాక. అది Spiritual Astrology లో యిచ్చాను. ఎపుడన్నా చూసుకోండి. కనుక యివన్నీ తెలుస్తాయి. జగద్ వ్యూహములన్నీ తెలుస్తాయి. సూర్యుడియందు ధ్యానంచేస్తే. చంద్రుడియందు ధ్యానంచేస్తే వెలుగు లేక నేను అనేటువంటి wisdom అంటే విద్య, జ్ఞానము, దానియందు ధ్యానం చేయుట అయ్యాక form (రూపం) యందు ధ్యానం చేయండి అన్నాడు. శబ్ద, స్పర్శ, రూప, రస గంధములకు అధిపతి రసాధిపతి అయిన చంద్రుడు. అందుకని the world of forms. దానిమీద ధ్యానం చేయండి అన్నాడు. మీ ఆకారం ఎలా వుందో కళ్ళు మూసుకొని ధ్యానం చేయండి. ఆయన ఎలా వున్నాడో కళ్ళు మూసుకుని ధ్యానం చేయండి. జగత్తులో అందరి ఆకారాలు, మనుష్యులు, ఆవులు, దూడలు, కుక్కలు, పిల్లులు, ఎలకలు ఇవన్నీ కూడ ఏయే ఆకారాల్లో ఉన్నాయో మెల్లిగా ధ్యానం చేయండి. చేసేటప్పటికి ఏమౌతుంది? ఆ ఆకారాలు అన్నీ మీలోనే వున్నట్లును, మీరు ఆకారాల్లో అంతర్యామిగా

వున్నట్లు, 9వ అధ్యాయము-భగవద్గీతలో చెప్పబడిన ధ్యానం వస్తుంది. అపుడు 'తారావ్యూహ జ్ఞానమ్' తారావ్యూహముల యొక్క జ్ఞానం వస్తుంది. తారా వ్యూహములంటే ఆకాశములో ఉండే తారకలు కాదు. మీ చుట్టూ వున్నటువంటి జీవరాశులు ఎలా తిరుగుతున్నారో తెలుస్తుంది. శరీరాలు యిపుడు మనం చూస్తున్నాం గాని శరీరాన్ని నడుపుతోంది లోపల వున్న జీవరాశా? వాణ్ణి నడుపుతూన్నది శరీరమా? రైలు పెట్టెలన్నీ కలిసి రైలుని నడుపుతున్నాయా? రైలు పెట్టెలను నడుపుతోందా? ఈ రైలు పెట్టెలన్నీ ఉండటం వల్ల రైలు పోతుంది అంటారా? డ్రైవర్‌కూడ రైలు పెట్టెలన్నీ వుండడం వల్ల పోతున్నాడా? అలాకాదు డ్రైవరు ఉండటం వల్ల ఇంజను కదుల్తోంది. ఇంజను పనిచేయడంవల్ల యింజను చక్రాలు కదుల్తున్నాయి. అది కదలడంవల్ల మిగతా పెట్టెలన్నీ కదుల్తున్నాయి. కనుక ఈ శరీరాలున్నందువల్ల మనము లేము. మనం వున్నందువల్ల ఈ శరీరాలు మనకి వాహికలుగా వున్నాయి. అది తెలుస్తుంది. అంటే ఏమిటి? తారకలు కనిపిస్తాయి. అంటే ఒక్కొక్కప్పుడు ఒక్కొక్క రవ్వ, వెలుగు రవ్వలు, కోటానుకోట్ల వెలుగు రవ్వలు కనిపిస్తాయి దాంట్లో. తారకావ్యూహం అంటే అర్థం అది. ఎవణ్ణి చూసినా వాడిమొహం ఎలా వుంది? వాడి జుట్టు ఎలా వుంది? వాడు ఎంత లావున్నాడు? ఎంత సన్నం వున్నాడు? యిది కాదు వాడంటే. వాడంటే వాడే. వాడి అభిప్రాయములు కావు. వాడికి వున్నటువంటి మంచి చెడ్డ వూహలు కావు. వాడు మంచివాడు, చెడ్డవాడు అనేది కాదు. దాని లోపల వుంటాడు. వాడు అనే వాడు. అది మీకు అందుతాయి. అవన్నీ మీకు చక్కగా చుట్టూ తిరుగుతూ వుంటాయి. ఈ ఆకాశములో ఉన్న తారకలు కూడ వాయువేగంచేత తిరుగుతూ ఉన్నాయని మనకి చెబుతారు శాస్త్రాల్లో. వాయువు అంటే మన గాలి కాదు. మొత్తం centre లోకి attraction repulsion, attraction, repulsion అవుతుంది. అంటే ఒకమాటు expand అవుతోంది Universe. ఒకసారి contract అవుతుంది. ఒక్కొక్క శాస్త్రజ్ఞుడు చూసినపుడు expand అవుతోంది, ఇంకోడు చూసినపుడు contract అవుతోంది అన్నాడు. ఒకమాటు అది అవుతోంది ఒకమాటు ఇది అవుతోంది. టైలర్ మనం గాలి పీల్చుకున్నపుడు కొలిస్తే ఒక కొలత వస్తుంది. మనం గాలి వదిలిపెట్టినపుడు కొలిస్తే ఇంకో కొలత వస్తుంది. వాడు తప్పని వీడు, వీడు తప్పని వాడు అనుకుంటం ఎట్లాగో, ఈ space globe expand అవుతున్నదని

చెప్పినవాడూ రైటు కాదు. Contract అవుతోందని చెప్పినవాడూ రైటు కాదు. ఆ రెండు alternate అవుతూ ఉంటాయి. దాంట్లో కోటానుకోట్లు అయినటువంటి తారకలు. ఒక్కొక్క తారక ఒక సౌర కుటుంబం. ఒక్కొక్క సౌర కుటుంబంలో మన సౌరకుటుంబంలో వున్నట్లే సూర్యుడు, వాడిచుట్టూ ఉన్న గ్రహములు, ఒక్కొక్క గ్రహంమీద ఉన్న జనాభా, వీళ్ళందరినీ పరిపాలించేటువంటి హంగు జనాభా వీళ్ళంతా వున్నారు. కనుక ఒక్కొక్క తారక మనకి యింత దూరానికి తారకల్లే కనిపిస్తోంది గాని, ఆ తారకలో ఉన్న వాళ్ళకి మన సూర్యుడు, మనం అంతాకూడ కనిపించనూ కనిపించక పోవచ్చు. ఇది తారకా జ్ఞానమంటే. కనుక మనచుట్టూ ఉన్న జీవరాశులలో తారకలు కన్పిస్తాయి. దానికి పెద్ద జ్ఞాన మక్కర్లేదు. కాని జీవులు as it is గా స్వచ్ఛమైనటువంటి వెలుగులు కనిపించాలి. వాళ్ళేమిటో అసలు వాళ్ళ నిజస్వరూపం కనిపించాలి. వాళ్ళు తమాషాగా ఎలా తిరుగుతుంటారో కనిపిస్తుంది. అపుడు తెలుస్తుంది. ఎవడు ఈ తిరుగుతూ ఉండటానికిన్నీ, ఈ శరీరాల్లో దిగుతూ శరీరంలోంచి వెడుతూ ఉండటానికిన్నీ ఏమి కారణంలేదు. ఇది ఉట్టి ఆట. క్రీడ అనేది తెలుస్తుంది. అంటే మనం అనుకుంటున్న serious purpose లు ఏమిలేవు దానికి. ఆ సీరియస్‌నెస్ అనే వ్యాధులన్నీ మనం కొనితెచ్చి పెట్టుకున్నటు వంటివి. Seriousness అనేది జబ్బు. వాడికి సీరియస్‌గా ఉంది అంటారు. కాని యింకోమాటు ఏమంటారు? వాడికసలు life లో seriousness లేదంటారు. పొరపాటు. మనిషికి కొంత సీరియస్ mood ఉండాలని. అంటే కొంత వ్యాధి వుండాలని. వాడు కొంచెం సీరియస్‌గా ఉన్నాట్ట. అంటే పాపం, ఎట్లా తగ్గుతుంది? అందుకనే నిజమైన తత్వార్థజ్ఞానం గల వాళ్ళెవరు సీరియస్‌గా ఉండేవాళ్ళు కాదు. మనం చూచినట్లైతే వాళ్ళందరూ కూడను 'స్మితభాషీ, పూర్వభాషీచ రాఘవః' రాముడి దగ్గరనుంచి చిరునవ్వుతో మాట్లాడేవాడుట. ఎదుటివాళ్ళని వాడు ముందు పలుకరించేవాడుట. అంటే వాడు మనల్ని పలకరిస్తాడా లేదా అని చూసేవాడు పెద్దవాడు అవ్వడు. ఆచార్యులగారు, శాస్త్రులుగారు రోడ్డుమీద ఎదురు పడ్డారుట. శాస్త్రులుగారు ఆ బిళ్ళగోచీ తీసి మళ్ళీ కుచ్చిళ్ళు పెడుతున్నాడట. బిళ్ళ పెట్టుకునేందుకు. అవి విడదీసి మళ్ళీ చుడుతున్నాడు ఆచార్యులుగారు. ఎందుకని? ఆయన నమస్కారం చేశాక చేద్దామని ఈయన, ఈయన నమస్కారము చేసాక చేద్దామని ఆయన. ఈ లోపల engaged అన్నమాట

చేతులు. అట్లాగాకుండా స్మితభాషీ, పూర్వభాషీ. రామాయణం చదివితే రాముణ్ణి గురించి వుంటుంది. వీళ్ళందరూ కూడ అంతే. ఆ స్థితిలో లోకమంతా వాళ్ళకి అలా కనిపిస్తుంది. తారామయమ్మైనటు వంటి లోకం అంటే జీవులు వెలుగుగా కనిపిస్తారు తప్ప వాడికి మనకివున్న సంబంధాలు గాని, వాడియొక్క స్వభావములుగాని, వాడి లక్షణాలు కానీ ఇవేమీ కన్పించవు. అలాగే జీవులు కనిపించినట్లే గ్రహములు వాటియొక్క వెలుగులు కనిపిస్తాయి. గ్రహములు కనిపించినట్టే మొత్తం సౌరకుటుంబం అనేటువంటి ఒకానొక పుష్పం కనిపిస్తుంది. అట్లాంటి solar system అనేటువంటి పుష్పములు కోటానుకోట్లు ఆకాశంలో వుంటే అవన్నీ కూడ కనిపిస్తూ ఉంటాయి. వాటి వ్యూహమంతా కూడ మనస్సుకి కన్పిస్తుంది లోపల. అది యిక్కడ చంద్రుణ్ణి చూస్తే తారాదర్శనము కనిపిస్తుందంటే. అశ్వని, భరణి కనిపిస్తాయని కాదు.

''చంద్రే తారావ్యూహ జ్ఞానమ్'' 'ధ్రువే' ధ్రువం గనుక తెలిస్తే అంటే ఈ తిరుగుతూ ఉండే వాట్లల్లో తిరక్కుండా ఉండే నీ కేంద్రం గనుక అందినట్లైతే ''తద్గతి జ్ఞానమ్''. వీటి గమనాలన్నీ తెలుస్తాయన్నాడు. అంటే ఈ లోకాలు ఎటునుంచి ఎటు వెడుతున్నాయి, మన సౌరకుటుంబం ఎటునుంచి ఎటు వెడుతోంది, మన భూగోళం మీద ఉన్న జీవరాశులు ఇపుడున్న శతాబ్దులలో ఎటునుంచి ఎటు వెడుతున్నారు, దాన్నిబట్టి వ్యాసుడు మొదలైనవాళ్ళు రాబోయే శతాబ్దులు ఎలా వుంటాయో, రాబోయే సహస్రాబ్దులు ఎలా వుంటాయో చెప్పేరు. ''*మధర్థావృత లింగాని చక్రమే తత్ర వర్తతే*'' అని వ్యాసుడు చెప్పాడు. ఋతువులు మీరు ఎరుగుదురు కదా. ఇపుడేం ఋతువు? కొద్ది కొద్దిగా వసంత ఋతువు వస్తోంది అన్నారు. విశాఖపట్నంలో వసంత ఋతువు వుండదు. ఎందుకంటే చెట్లు చిగిర్చటం, కోకిలలు, ఇవన్నీ ఉండటానికి అవకాశం ఉన్నటువంటి పల్లెటూళ్ళలో వసంతఋతువుగాని, బస్తీలో వసంత ఋతువేమిటి? అక్కడికి వెళ్ళామనుకోండి. వెడితే వసంతఋతువు కన్పిస్తుంది. దాన్నిబట్టి వచ్చే ఋతువేమిటి అంటే తెలియదు మనకి. వేసవికాలం గ్రీష్మఋతువని చెప్తాం. దాన్నిబట్టి దాని తర్వాత వచ్చే ఋతు వేమిటంటే వర్షాకాలమని ఎట్లా అయితే తెలుస్తుందో మాకు, వ్యాసుడు చెప్పాడు, ఈ లక్షల సంవత్సరాలలో ఆరు విభాగాలు చేసుకుని ఏ ఋతువు తర్వాత ఏ ఋతువు ఈ బ్రహ్మాండ లోకాలకి వస్తుందో దాంట్లో అంతర్దశలు లాగ ఈ భూగోళం మీద ఉన్న మానవజాతికి జరిగిపోయిన వేల సంవత్సరాలలో

ఏ ఋతువు జరిగింది, ఇపుడున్న వేయి సంవత్సరాల్లో ఏ ఋతువు జరుగుతోందో, రాబోయే వేయి సంవత్సరాల్లో ఏ ఋతువు జరగబోతోంది, అంటే ఆకులు రాలిపోయే ఋతువులోకి వెడుతోందా? నరజాతి అందరూ ఒకరిని ఒకరు చంపేసుకుని భూమి ఊరికే బట్టతల అల్లే మిగుల్తుందా రెండు మూడు ప్రపంచ మహా యుద్ధములతో, లేదా చిగిర్చి పుష్పించేటువంటి ఋతువుల్లోకి వెడుతూ వున్నదా? జాతికి జాతి మర్దతు చేసికొని పెరుగుతాయా ఇది వరకు పెరిగినట్లు, అట్లా పెరగనూ పెరిగినాయి. తుణగనూ తుణిగినాయి. ఇవన్నీ కూడ ఋతువులలో ఋతు లింగములు జరిగినట్లుగా జరిగినాయి, ఇవన్నీ తెలుస్తాయన్నాడు. కనుక భారతంలో ఇవన్నీ రాశాడు. దేని తర్వాత ఏది జరుగుతుందో, ఎట్లా వుంటుందో ఇవన్నీ రాశాడా లేదా? మరి కలియుగంలో ఏమౌతుందో, ఇపుడు మనం అంతా ఏం చేస్తాం, అవన్నీ రాశాడు. ఈ చంద్రలోకాల్లో ఉన్న రూపాలు తయారవ్వటం అని చెప్పాం కనుక కామరూపములు అని ఒక లోకము ఉంది భూగోళం మీదే. కామ శరీరం అంటారు. దాన్నే యాతనా శరీరం అనికూడ అంటారు. పెద్దలు దాన్నే పాప పురుషుడు అనికూడ అంటారు. దాన్నే లింగ శరీరం అంటారు. పెద్దలకు తెలుస్తుంది. అంటే ఏమిటంటే మనం చేసిన మంచి చెడ్డలన్నీ వాటి తాలుకు మనమీద వున్నటువంటి గుర్తు. మనకి గుర్తు ఉండటం. మనం తిన్నవి, మనం చేసినవి, మనం ఆలోచించినవి, మనం భయపడినవి, ఇన్ని జన్మలనుంచి మనం చేసుకున్నవి అన్నీకూడ కలిసి ఆ క్షణంలో మనంగా ఉంటుంది. దాని L.C.M. ఇన్ని లక్షలయొక్క మన స్వభావములు tendencies అంటారు. వాటి L.C.M. కలిసి యాతనా శరీరం. అంటే మన తాలుకు ఇంతకు ముందున్న కోరికల యొక్క సారాంశం (essence). అంతా అందులో దిగి వుంటుంది. మనం యోగాభ్యాసం చేయనీయండి, పుటం పెట్టనీయండి, కుండలిని సహస్రారం దాకా లేవనీయండి, ఏం జరిగినప్పటికీ కూడ మన కోరికలు మన కోరికలుగా ఉండిపోతాయి. జాగ్రత్తగా వుండకపోయినా, వాడి అనుగ్రహం లేకపోయినా. అంటే అక్కడిదాక వెళ్ళినా మళ్ళీ అలాగే ప్రవర్తిస్తాం. ఎందుకని? అష్టాంగములు పూర్తికావు, మన సాధనలో అయినాయి అనుకుంటాము. మనకు అష్టాంగములు ఎలాగూ పూర్తి అయ్యాయి కనుక ఒక శిష్యురాల్ని పెళ్ళిచేసుకొని ఒకచోట ఆశ్రమం కట్టేసుకుంటాం. అంటే వెర్రి కుదిరింది. తలకి రోకలి చుట్టమన్నాట్ట వాడెవడో అలా అయిపోతుంది.

10 ఏళ్ళో, 12 ఏళ్ళో యోగాభ్యాసం చేసి సమస్త వైరాగ్య సంపన్నుడైనటువంటి గురువుగారు ఇలా చేశారేమిటి అంటే, ఇన్ని చేసినా అంతకుముందు ఆయనకి ఉన్నటువంటి కోరికలు బంధిస్తాయి. ''దేహమనంగ కోర్కెలు దీపించిన గూడు'' అన్నాడు విశ్వనాథ సత్యన్నారాయణగారు. శుకయోగీంద్రుడు తపస్సు చేస్తుంటే రంభవచ్చి నాట్యం చేస్తోంది. అక్కడ రాశారాయన శుకయోగీంద్రుని గురించి. ఈయన లేవడేమిటి? కదలడేమిటి? దేహమంటే కోరికలు దీపించిన గూడు కదా వీడికి చలనం లేదేమని అనుకుంటాడు యింద్రుడు. కనుక మన భౌతిక శరీరానికి లోపల దీన్ని నిర్మాణం చేసే యింకొక శరీరం వున్నది. అది ఆకారమే కాని శరీరంలో పదార్థం వుండదు. ఆ ఆకారం దేనిమీద ఆధారపడి ఉంటుంది. మనం ఈ రోజు కోరిన కోరికలు, పొద్దున్న కోరిన కోరికలు, నిన్న కోరిన కోరికలు, మొన్న కోరిన కోరికలు, ఈ జన్మలో కోరిన కోరికలు, క్రిందటి జన్మలో కోరిన కోరికలు ఇవన్నీ కలిపి ఆకుపసరు తీసినట్లు ఒక సీసాలోపోసి అరకు చేస్తే ఎట్లా వుంటుందో అలా వుంటుంది. అది ఇపుడు మనకున్న స్వభావం. దాన్నే లింగ శరీరం అని అంటారు. అది భస్మం కావాలి. దాన్నే పాప పూరుష దహనం అని కూడ అంటారు. దాన్ని ప్రత్యక్షముగా అనుభవిస్తున్నట్లుగా గమ్మత్తుగా చూపించాడు ఒకాయనకి షిరిడీ సాయిబాబా. మీరు చదివి వుంటారు ఉపాసని బాబా అని ఒక మహనీయుని ''సాధనా జీవిత చరిత్ర''. ఆయన సాధన చేస్తుంటే కూర్చోమని చెప్పి బుర్రమీద టంగున కొట్టి అక్కడ పెంకుతీసేసి అందులోంచి ఒకణ్ణి బయటికి లాగాడు. 'ఓ' 'ఓ' అని గిలగిల లాడిపోతున్నాడు ఈయన. వీడు చూస్తుండగానే మంటచేసి ఆ మంటలో పడేశాడు వాణ్ణి. వాడు దగ్ధమై తగలడి పోతుంటే ఈయనకి మంటలు, తాపం 'ఓ ఓ' అని ఏడ్చేశాడు. అపుడు వెన్నుమీద చరిచాడు. కళ్ళు తెరిచిచూస్తే ఏమీలేదు. అంతాకూడ వట్టి సినిమాలా సృష్టించాడు. అంటే వాడి పాప పురుష దహనంచేస్తూ వాడికి అనుభూతి చేయించాడు. అంటే పాప పురుషుడు ఉంటాడని తెలియజేయటం కోసం, వీడికి, వాడికీ contact పెట్టి వాణ్ణి దహనం చేస్తుంటే అంటే అక్కడ తంతూంటే ఇక్కడ తగుల్తూ ఉంటుంది దెబ్బ. అది చూపించాడు. అవి ఏవో ఉదాహరణకి, ఊరికే లీలార్థం పెద్దవాళ్లు అపుడపుడు చూపిస్తారు. కాని గురువులు శిష్యుల పాప పురుషుని దహనం చేయటం లేదా పతంజలి మొదలైనటువంటి యోగాభ్యాస మార్గాన వెడుతూంటే ఈ పాప పురుషుడనబడే

కామ శరీరం దగ్ధమైపోవటం ఇవన్నీ సహజంగా వస్తాయి. బ్లావెట్స్కీ యొక్క జీవిత చరిత్ర మీరు చదివినట్లైతే ఏడు సంవత్సరములు పరమగురువుల దగ్గర శుశ్రూష చేసిన తర్వాత ఏడవ సంవత్సరంలో పిలిచి జ్వాలాకూలుడు ఇదిగో నీ astral body burn అయిపోతుంది. ఇంక నీకు astral body లేదు అనిచెప్పి దగ్ధం చేసిన ఘట్టం అందులో వుంది. జ్వాలాకూలుడు Alice A. Bailey books లో కూడ చాలచోట్ల బ్లావెట్స్కీకి కామశరీరం లేదు. కామశరీరం లేకుండా చిట్టచివరి 18 ఏళ్ళు బ్రతికింది అని చెప్పి రాశాడు. ప్రతివాడికీ ఒక్క కామశరీరం ఉంటుంది. నాకు నా కామశరీరం, మీకు మీ కామశరీరం. ఇవన్నీ తెలుస్తాయి చంద్రుడియందు ధ్యానంచేస్తే. అంటే ఎవడి కామశరీరం ఎంతలో వుంది, ఎవరెవరి కోరికలు ఏ పరిస్థితిలో ఉన్నాయి, ఏ పద్ధతిలో ఉన్నది అవన్నీ తెలుస్తాయి, అది కామశరీరం తెలియటం అంటే. అంటే వీడికి చెప్పకూడని కోరికలున్నాయా? చెప్పదగిన కోరికలున్నాయా? వీడు evolved dirty fellow నా? వాణ్ణి పదిమందిలో ఉండనిస్తే ఏం చేస్తాడు? మొదలైనవన్నీ తెలుస్తాయి. చూడగానే వాడి కామశరీరం ఏ స్థితిలో ఉన్నదో తెలిసి, దాన్నిబట్టి వాడు ఏ పరిస్థితుల్లో ఎలా ప్రవర్తిస్తాడో? అంతా సుస్పష్టంగా అప్రయత్నంగా తెలుస్తుంది, ఇది చంద్రుడి దగ్గర ధ్యానంచేస్తే.

సూర్యుడిలో ధ్యానం చేయాలంటే ఏం చేయాలి. హృదయం దగ్గర చేయమన్నాడు. ఈ రెండు కలుస్తాయి. ధ్రువుడిలో ధ్యానం చేయాలంటే వెన్నెముక యందు ధ్యానం చేయాలి. పైనించి క్రిందిదాకా. అది ధ్రువుడు. చేస్తే ఏమవుతుంది. Axis of rotation అంటారు. అందులో సుషుమ్న అనే నాడి ఉంటుంది. అది ధ్రువం అనేటువంటిది. దానికిన్నీ మీరు కూర్చుని ఉన్న, జీవిస్తూ వున్న ఈ భూగోళంనందు వర్తిస్తున్నటువంటి ఉత్తర దక్షిణ ధ్రువాల్ని కలిపే ఆ మార్గానికిన్నీ ఉన్న సంబంధం దొరుకుతుంది. ఇది ఏం చేస్తుంది. ఉత్తర దక్షిణ ధ్రువాలమీద తిరుగుతోందా లేదా భూమి? అది ఉత్తర ధ్రువంలో తిరుగుతూ వుంటుంది. ఇవి దక్షిణ ధ్రువంలో తిరుగుతూ వుంటుంది. కాని దీనిమధ్య తిరగనటువంటి రేఖ ఒకటి. దాన్ని ధ్రువం అంటారు, non rotation రేఖ. దాన్ని మనకి అర్థం అవటంకోసమే వేదవ్యాసుడు మహాభారతం మొదట్లో ''తైలయంత్ర చక్రవత్ భ్రమతి'' అన్నాడు. అంటే గానుగ చూడరా అబ్బాయి అన్నాడు. ఎద్దు ఏమో ఓ వైపుకు తిరుగుతూ వుంటుంది. మధ్యన యిరుసేమో ఇంకోవైపుకు తిరుగుతూ

వుంటుంది. ఈ యిరుసు మధ్యన కన్నం వుంటే అది తిరగదన్నాడు. అది మనకి బోధపడాలంటే వాడు చెప్పిన ఉదాహరణయే best example. తైల యంత్ర చక్రం అంటే ఏమిటి? నూనె గానుగ. పాత నూనెగానుగ చూడండి. అది తిరుగుతున్నట్లు తిరుగుతుందన్నాడు. ఇవి ధ్రువమంటే. మీ వెన్నెముకకిన్నీ భూగోళం మీద వున్నటువంటి రెండు ధ్రువములు మధ్య వున్న దానిని మేరువు అంటారు, దానికిన్నీ ఉన్నటువంటి అవినాభావ సంబంధం తెలుస్తుంది. లేదా మీరిక్కడ ఉంటారన్నమాట. భేదం లేదు. కాగా మీరు ఉత్తర ధ్రువంలో వున్న మహానుభావులకి మొక్కితే మీ మొక్కులు వాళ్ళకి అందుతాయి. అక్కడ వాళ్ళేదన్నా మన సందేహాలు తీర్చాలని మీరు కోరితే మీ సందేహాలు ఇక్కడ తీరుతాయి. యింటి దగ్గరనే. ఎక్కడికి వెళ్ళనక్కర లేదు. మీరు దక్షిణ ధ్రువంలో ఉన్న మహానుభావులకి మొక్కితే అక్కడ వాళ్ళ కవి అందుతాయి. కాని మీకు ముందు ఈ రెండింటికీ సంయమం చేయాలి. ధారణ, ధ్యాన, సమాధులు చేయాలి. చేస్తే మీకు దానికి భేదం లేనటువంటి ఒకానొక స్థితి వస్తుంది. ఇది ధ్రువమంటే. ఈ ధ్రువం వచ్చినపుడు మూలాధారం, మణిపూరకం. స్వాధిష్ఠానం, అనాహతం, విశుద్ధి, ఆజ్ఞాచక్రం, సహస్రారం దీనికిన్నీ దీనిమీద వున్న విభాగాలైన సప్త ద్వీపములకున్నూ ఉన్న సంబంధం తెలుస్తుంది. దీన్ని గురించే భాగవతం 12, 13వ భాగాలలో వ్యాఖ్యానంలో యిచ్చాను. ప్రపంచములో మొట్టమొదటి తడవగా వీటి వివరణ ఆ పుస్తకాలలో యివ్వబడ్డది. అపుడు మీలో సప్త ద్వీపవాసులు అందరూ వుంటారు. అంటే ఎక్కడో కొన్ని ద్వీపాలున్నాయి అనుకోండి. ఏది? far east, జపాన్ మొదలైన Islands ఉన్నాయి అనుకోండి. మీ శరీరంలో ఓ భాగంలో కనుక మీరు ధ్యానంచేస్తే దానికి సంబంధించిన జపానులో వున్నటువంటి ఏ ప్రవృత్తి చేస్తున్న మహానుభావులు కావలెనో వాళ్ళతో contact వస్తుంది. Contact అంటే intellectual గా కాదు, language పరంగా కాదు, soul to soul contact వస్తుంది. అది వచ్చినపుడు ఆ సంబంధం పరస్పరమువస్తే ఉద్ధరించడానికి భూమ్మీద అన్ని దేశాల్లోనూ రెడీగా తిరుగుతున్న మహానుభావులు కొంతమంది ఉన్నారు. వాళ్ళు ముఖ్యంగా ఏడు ప్రదేశాల్లో ఉన్నారు. 1. North pole, 2. South pole, 3. India, 4. Alps, 5. Peru, 6. Mexico, 7. Paris. ఇవి వాళ్ళు కల్పాంతకములుగా వుంటున్న చోట్లు. ఈ రోజువి కావు. ఈ పేర్లు యిప్పటివి తప్ప వీట్లని గురించి the

Seven colleges అని చెప్పి జ్వాలాకూలుడు యిచ్చిన వ్యాసం చూడండి. అంటే కోటానుకోట్ల సంవత్సరములనుంచి ఉన్నారు మహానుభావులు. ఏం చేస్తున్నారు వీళ్ళు. పైన ధ్రువుడు అనే తార ఉన్నది. Pole star అంటారు. వాడి దగ్గరనుంచి క్రిందిగా ఎడమప్రక్క సప్త ఋషులు అని ఏడుగురు వున్నారు. ధ్రువుడు కొంచెం క్రిందుగా ఎడమ ప్రక్క. వాళ్ళ దగ్గరనించిన్నీ, కొన్ని రకములైన తేజస్సులు, కిరణములు వెదజల్లబడు చుండును.




ఆ తేజస్సులు మన సూర్యుడి దగ్గర లేవు. ఎందుచేత? ఈ ఏడుగురికిన్నీ, వాడికిన్నీ ఉన్న పరిణామదశ వేరు. పరపక్వదశ వేరు. మన సూర్యుడికి అంతకంటే తక్కువ పరిపక్వదశ వుండి, వాళ్ళ శిష్యుడుగా మన సూర్యుడు ఉన్నాడు. ఇది శాస్త్రాలు చెబుతున్నాయి. కనుక ఆధ్యాత్మవిద్య, ఆత్మ దర్శనం, మోక్షవిద్య మొదలైనవి మనకు రావలెనంటే వీళ్ళదగ్గర నుంచి, మన సౌరకుటుంబంలో దానిచుట్టూ మన భూగోళం తిరుగుతోంది కదా. ముందర సూర్యుడి మీదికి ఈ ఏడుగురి దగ్గరనుంచి రావాలి. ఇలా ఈ ఏడుగురు దగ్గరనుంచి వచ్చి ప్రతిజీవి శరీరంలోను కూడ వాట్లని కావలసి వచ్చినపుడు స్పృశించటం కోసమే ఈ ఏడు కేంద్రములు వెన్నెముకలో ఏర్పరచబడినవి. ఇది శాశ్వత సత్యం. కనుక ఈ మొత్తం వ్యూహమను మట్టిచెట్టుకి మన శరీరమనేది మట్టిగింజ. దాంట్లో ఉన్నటువంటి sensitive points యివన్నీ. అందుకనే జ్వాల్‌కూల్‌గారు ఏడు ఆశ్రమములు వెన్నెముకలో నిర్మాణం చేయబడి ఉన్నవి అన్నారు. అయితే ఆశ్రమాలు కామోసు, మాకెక్కడన్నా పెడతారా సార్! అంటే there is no ashram on the physical plane in the 20th century అన్నాడు. అందుకని ఎవడి యింటివద్ద వాడుండి, ఎవడి ఉద్యోగం వాడు చేసుకుంటూ తరిస్తూ ఉండండి. పనికిరాని వాళ్ళంతా చేరటానికి కాదు ఆశ్రమాలు. ఉదాహరణకు చెప్పాడు. మంచం ఎంత

పదుపాయంగా ఉంటే నల్లులు అంత తొందరగా చేరుతాయని అన్నాడు. అంచేత ఆశ్రమాలు వద్దు అన్నాడు. ఇదిగో ఈ ఏడు ఆశ్రమాలు వున్నాయి. ఈ ఏడుగురి దగ్గరనుంచి, సూర్యుడి దగ్గరనుంచి ఏడు రంగుల కిరణములలో వస్తూ ఉంటుంది అది. మీకు అందించటం కోసమని ఈ భూమ్మీద ఏడుచోట్ల తిరుగుతూ వుంటారన్నాడు. తర్వాత సూత్రములో వస్తారు. ఇది సూర్యుడు, చంద్రుడు, ధ్రువుడు అనేటువంటి దానికి కొంతవరకు సంగ్రహంగా చెప్పుకుంటే. ఈ ఏడుగురు దగ్గరనుంచి ఇక్కడికి దిగి రావటాన్నే వరుసన ద్వాదశాంతం అంటారు. ఏడు కేంద్రములు ఏర్పడ్డాయి. ఏర్పడి యిక్కడ మళ్ళీ వేరే యింకొక ఆరు కేంద్రము లున్నాయి. ఈ ఆరు కేంద్రములున్నూ, ఈ ఏడున్నూ కాక ఇంకొక ఆరుగురు ఉన్నారు పైన కృత్తికలనే పేరుతో. వారు ఆరుగురు కూడను ''షణ్ మాతృకలు''. మీలో ఉన్న జీవుడు భగవంతుని పుత్రుడుగా అంటే కుమారస్వామిగా పుట్టటానికి ఈ ఆరుగురు తల్లులు పాలిస్తారు అన్నాడు. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి కథ యిది. కనుక వీళ్ళ దగ్గరనించే మీకు ఈ పాలు అందించే వాళ్ళున్నూ, బ్రహ్మజ్ఞానం అందించే వాళ్ళూ అయిన మహానుభావుల సంబంధం మీకు ఏర్పాటు అవ్వాలంటే ఈ పై చెప్పినటువంటి సూర్యుడు, చంద్రుడు, ధ్రువుడు అనే ధ్యానముల ద్వారా పతంజలి చెప్పినట్లుగా మీయందే నిహితం చేసుకుని, మీ హృదయంలో సౌరకుటుంబం అంటే సూర్యుణ్ణి మొత్తం నిహితం చేసుకొని ధారణ, ధ్యాన, సమాధి, సంయమములు చేయండి. మీ శిరస్సులో చంద్రుణ్ణి ధారణ చేసుకొని సంయమము చేయండి. మీ శిరస్సుపై నుండి వెన్నెముకలో నిలువుగా ధ్రువాన్ని ధారణం చేసుకొని సంయమం చెందండి. ఈ మూడు చేయండి. ఇలా అయిన తర్వాత అపుడు 'నాభిచక్రే' బొడ్డు దగ్గర ఉన్న మణిపూరక చక్రానికి రావాలి. పైనించి క్రిందికి రావాలి. క్రింద మూలాధారం నించి తిరిపెట్టినవాడు దెబ్బ తినేస్తాడు. కామక్రోధాల్లో పడిపోతాడు. అంటే ముందు power ని కదిలించి తర్వాత intelligence ని కదిలించేవాడు దెబ్బతింటాడు. Power politics లోకి వెళ్ళినవాడు ఎపుడూ పతనం తప్ప యింకోటి లేదు. క్రిందినుంచి పైకి వెళ్ళేది కౌలాచారం. పైనుంచి క్రిందికి వచ్చేది సమయాచారం. రెండూ ఉన్నాయన్నాడు. మరి ఆయనేం చేస్తాడు. ఆయన చెప్తే మాత్రం మానతారా? కాని కౌలాచారం భ్రష్టు

పట్టినవాళ్లు చేస్తారని చెప్పాడు. తంత్ర శాస్త్రములో కూడ అదే చెప్పారు. ''సమయాచార తత్పరా'' అమ్మవారిని గురించి చెప్పినపుడు కూడ కులమార్గం యివన్నీ చెప్పి ''కులకుండ విహారిణీ'' చెప్పి ''సమయాచార తత్పరా!'' అన్నారు. ఎవళ్ళ యందు ఉంటుంది ఆవిడ? నిష్ఠగా మేల్కొని, సమయాచారం ఆచరించే వాళ్ళయందే ఉంటుంది. అమ్మవారని అంటారు. లలితా సహస్రనామంలో కూడ. యిపుడు నాభిచక్రం దగ్గరకు వస్తే ''కాయవ్యూహ జ్ఞానమ్'' కాయం అంటే ఈ దేహం, దీని వ్యూహం దీని జ్ఞానము వస్తుంది. Anotomy, Physiology మాత్రమే కాకుండా ఈ వ్యూహంలో ముందు చెప్పిన ఏడు వున్నాయి. వీట్లని రస, రక్త, మాంస, మేధో, అస్థి, మజ్జ, శుక్రములు అంటారు. రసం అంటే శరీరంలో ఉన్న ద్రవ పదార్థం లేక రక్తం (Water content or the serum Haemoglobin content), మాంసం అంటే the flesh in you. మేధస్సు అంటే the oil in you నీలో వున్న చమురు. అస్థి అంటే ఎముక, అంటే the bone in you. 'మజ్జ' ఎముకలో వున్నటువంటి ధాతువు. శుక్రము అంటే దేనితో అయితే మిగతావన్నీ పుడుతున్నాయో అది. శుక్రకణం లోంచే కదా తర్వాత ఆకారమంతా శరీరంలో తయారయ్యేది. శుక్రకణం తల్లి గర్భంలో ఈదుకుంటూ వెళ్ళిన తర్వాత దీంట్లోనే కదా ఈ రాబోయే ఆకారంలో వున్నటువంటి topography, outlines అంతా వేయబడి పంపించేది. అదిలేకపోయినట్లైతే మనిషి గర్భంలో మనిషి పుట్టడు, మనిషి గర్భంలో ఏదైనా పుట్టచ్చుకదా. ఏది పుట్టాలి అనేది ఎక్కడుంటుంది. ఆకారం, రూపం యిచ్చేది చంద్రలోకం. దాన్నించి ఆ శుక్రకణంలోకి ఏ రూపమో ఆ రూపం వస్తుంది. ఈ రూపంలోంచి పై చెప్పిన ఏడు వస్తాయి. కనుక ఇవి ఏడు ఇందాకటి ఏడింటికి భౌతిక శరీరంలో ఉపాధులు. అంటే ఆహారములుగా తెలుస్తాయి. వీట్లని భౌతిక శరీరం (Physical body) లోని ధాతువులు అంటారు. మనస్సులో కూడ మళ్ళీ ఏడు పొరలున్నాయి. ఇందులో ఒక్కొక్క దానికి సంబంధించినటువంటి మనస్సు ఒక్కొక్కచోట వుంది మీ మనస్సుతో. వీట్లల్లో ఒక ప్రక్క భౌతిక శరీరంలోని ధాతువులతో సంబంధించి ఉంటాయి. ఈ రెండవ ప్రక్క మహాపర నిర్వాణం, పర నిర్వాణం, నిర్వాణం, బుద్ధిమయ కోశం, మనస్సు లేక మనోమయ కోశం, ప్రాణం లేక ప్రాణమయ కోశం, అన్నమయ కోశం

లేక ద్రవ్యములతో సంబంధించి ఉంటాయి.

| | |
|---|---|
| 7 | శుక్రము |
| 6 | మజ్జ |
| 5 | అస్థి |
| 4 | మేధస్సు |
| 3 | మాంసము |
| 2 | రక్తము |
| 1 | రసము |

| | |
|---|---|
| 7 | మహా పర నిర్వాణము |
| 6 | పర నిర్వాణము |
| 5 | నిర్వాణము |
| 4 | బుద్ధి |
| 3 | మనస్సు |
| 2 | ప్రాణము |
| 1 | అన్నమయ కోశము |

అంటే మన శరీరంలో ఏవేవి అయితే ఉన్నాయో వాటన్నింటితో సంబంధం ఒకప్రక్క, మన శరీరం లోపల ధాతువులుగా ఏర్పాటై ఎక్కడెక్కడైతే ఏవి ఉన్నాయో వాటికి సంబంధించి ఒక ప్రక్క. ఒక ప్రక్క మన లోపల ఉన్న నిర్మాణ వ్యూహంతో సంబంధించి వుంటాయి. ఒక ప్రక్క మన బయటనుంచి సరఫరా అవుతున్న పదార్థం ఉంది చూడండి. అంటే మన ఇల్లు కటుతూన్నచోట వేసిన ఇటుకలు, సిమెంటు లాంటివి ఇవి. అది కాకుండా సిమెంటు, ఇటుకల కంపెనీల దగ్గర ఉన్న సిమెంటు, ఇటుకలు లాంటివి అవి. ఈ రెంటికి మధ్యన ఉంటుంది ఈ లోకం, రెండవలోకం. ఇలాగే మూడవ లోకం. మీలో ఉంటుంది. ఇది కంఠములో వున్నటువంటి ఏడు స్వరములు అనబడతాయి. సంగీతం తెల్సినవాళ్ళు సరిగమలు అంటారు వీట్లని. కనుక $3x7=21$. సమిధలతో ఏడేసి ఏడేసి పరిధులతో ఈ పురుషుడు ఈ యజ్ఞములో కట్టేయబడ్డాడు అన్నాడు. 'సప్తాస్యాసన్ పరిధయః' ఏడేసి పరిథుల చొప్పున 'త్రిసప్త సమిధ కృతాః' త్రిసప్త అంటే మూడు సప్తలు అనగా ఇరవై ఒక్క సమిధలుగా ఏర్పాటై ఉంటాయి. ఈ formula అంతా. దీన్నే ''పై'' అంటారు.

$$\pi = \frac{21 + x}{7} \leftarrow x \ (0 < x < 1)$$

I am less than *one* and more than *zero*

$\pi$ = పైమేండరిస్.

$x$ ఎంత ? 22/7 అనేటువంటి వాడు పిచ్చివాడు. తిన్నగా చేయటానికి ప్రయత్నంచేస్తే recurring decimals వస్తాయి. కనుక బ్రహ్మవిద్య చెప్పినటు వంటి మహానుభావుల ప్రకారం ఏమని చెప్పాలి $\pi = \frac{22-x}{7}$ అని చెప్పారు అంటే $x$ అంటే I am. దానిపేరు less than '1' and more than '0'. అది ఉన్నంతకాలం ఈ సృష్టి ఉంటూ ఉంటుంది. అది శేషం లేకుండా తెగడం అంటే ప్రళయము అయిపోతుంది. ఈ జగద్రహస్యములు విప్పి చెప్పటంకోసం పెద్దలంతా పైనుంచి క్రిందికి చెప్పారు. కాని, ఇపుడు మాథమేటిక్స్‌లో ఎందుకు వాడుకుంటున్నారో అలాంటి వ్యవహారంకోసం కాదు. ఎందుకు వాడుకుంటున్నారో తెలీదు. వీళ్ళు వాడుకుంటున్నది 'పై' కాదు. దీనిమీద యింకా వీళ్ళు వెళ్ళని శాస్త్రం ఉన్నది. Secret Doctrine లో దీనిగురించి 300 పేజీల పైన వున్నది. దీన్నే మహానుభావు లైనటువంటి పైమేండరిస్ (Pymandaris) అని అంటారు. అనగా ఒక బ్రహ్మజ్ఞానమునకు అధిష్ఠాన దేవత. ఆయన పేరు Pymandaris అన్నారు. ఆయన చెప్పాడు, నేను విన్నాను అని రాశారు. అంటే God spoke with man అన్న మాటకి వాళ్ళ అర్థం వేరు. సోలమన్ గాని, డేవిడ్‌గాని, మనువుగాని, పతంజలిగాని వాళ్ళు. ''భృగు మేకాగ్ర మాసీనం'' భృగువు ఏకాగ్రంలో కూర్చుంటే అక్కడికి వెళ్ళి నాకీ విద్య చెబుతారా అని అడిగితే చతుర్ముఖ బ్రహ్మ చెప్పాడు. 'వారు వారికి చెప్పారుట' అన్నమాటకి అర్థాలు యివి. అంటే సృష్టిలో ఎపుడు చూసినా కనిపిస్తూ ఉంటాయని అర్థం. చతుర్ముఖ బ్రహ్మ చెప్పాడంటే those who have eyes to see and ears to hear అన్నాడు Jesus Christ. వాళ్ళకి కనిపిస్తాయి. నాభిచక్రంలో కాయవ్యూహ జ్ఞానం అంటే శరీర వ్యూహ జ్ఞానం పరిపూర్తిగా తెలుస్తుంది. అంటే బొడ్డు దగ్గరనుంచి మన శరీరం పరిపూర్తి అయ్యేవరకు ఉన్న నిర్మాణ వ్యూహములు అన్నీకూడ మనకి తెలుస్తాయి. ఈ శరీరం ఆకారం తెలియటం ఈ శరీరంలో ఉన్న పదార్థం (matter) తెలియటం, ఇందులో ఉన్న bio-chemistry తెలియటం, ఇందులో వున్న ఎనాటమీ, ఫిజియోలజీ తెలియటం కాదు. బొడ్డు దగ్గర ఏం వున్నది, దేనితో ముడివేసి పెట్టి ఉంచింది, ఆ ముడి ఎక్కడ విప్పబడితే ఈ శరీరానికి, మనకి ఏం సంబంధం ఉండదో అది. ఎంచేత? ఇక్కడి నుంచి the silver chord is broken. ఇక్కడి నుంచి ఎక్కడిదాకా వుంటుంది. ప్రతివాడికీని యిక్కడినుంచి చంద్రుడుదాకా వుంటుంది. మనం ఎంతదూరం తిరిగినా,

ఏం చేసినా బాగా సాగేటువంటి రబ్బరుతాడు ఉంటుంది చూడండి. అలాంటి తాడుతో కట్టివేయబడిన కుక్కల్లాగ మనం తిరుగుతూ వుంటాం. మనం ఎంత దూరం లాగినా వస్తుంది అది. మళ్ళీ దాని దగ్గరికి టపీమని లాక్కెళ్ళి పోతుంది అది శరీరం వదిలాక. కనుక సూర్యుడి ద్వారా భూమ్మీదకి కిరణాలుగా దేవతలు దిగివచ్చి, చంద్రుడి మీదుగా పితృదేవతలు దిగివచ్చి మనకీ శరీర నిర్మాణం అంతా ఎలా చేశారో తెలుస్తుంది. శరీర నిర్మాణ వ్యూహమంతా. అంటే సూర్యుడివల్ల, సంక్షిప్త చంద్రుడివల్ల ప్రజోత్పత్తి (reproduction) తెలుస్తుంది. ఈ రెండు జరిగితే ఈ శరీరం ఎలా వచ్చిందో మనం ఎలా యిక్కడ ఉన్నామో ఫలితమే మనంగాని, మనం అంటూ వేరే ఏం లేము అని తెలుస్తుంది. నీళ్ళు, బెల్లం ఒక గిన్నెలో పోయండి. కాసిని మిరియాలు, ఏలకులు నలగొట్టి వేయండి, కొంచెం పచ్చకర్పూరం వెయ్యండి. ఇప్పుడవి ఎన్ని పదార్థాలు? నీళ్ళు, బెల్లం, మిరియాలు, ఏలకులు, పచ్చ కర్పూరం. ఎన్ని పదార్థాలు-5, కాని ఆరవది పానకం అనబడుతుంది. అది ఈ ఐదింటిలో ఏదీ కాదు. అలా ఎలా అయితే కాదో, ఈ శరీరంలో వున్న ధాతువులుగాని, మనో, బుద్ధి, చిత్త, అహంకారాదులు గాని, ఏదీ కానటువంటి మీరు అప్పటికపుడు పుటుతున్నారు. అది జీవుడంటే. ఇది break అయ్యేటప్పటికి అప్పటికప్పుడు పుట్టినటువంటి suspension బుడగ లాంటిదే. కనుక బుడగపోతే ఎక్కడ పోయింది. అంటే బుడగా? పోయింది అంతే. ఎక్కడికీ పోదు. స్విచ్ ఆపేస్తే కరెంటు పోయిందట అంటే ఎక్కడికీ పోదే. కరెంటు ప్రయాణం చేసి వెళ్ళిపోయిందా? స్విచ్ ఆపితే కనుక disconnect అవుతుంది. Disconnect అయితే మనం అనేటువంటి అస్థిత్వం (manifestation) వుండదు conceal అయితే అస్థిత్వము (manifestation) ఉంటుంది. జీవుడని మనం కథలు, కాకర కాయలు చెప్పుకుంటాం. వాడికి ఆ లోకాలు వున్నాయి వీడికి ఈ లోకాలు ఉన్నాయి. ఇహ అది ఎవడిష్టం వాడిది. ఫ్రీగా వదలిపెట్టేసారు. దానికేమిటి అన్నారు. కాకరకాయల కథలు, కాకమ్మకథలు. హిందువు చస్తుంటే మంచి భక్తుడు గనుక అయితే ఒక దున్నపోతు, దానిమీద యముడు కనిపిస్తారు. అదే యమదూతలు. అదే క్రైస్తవుడు చస్తుంటే ఇద్దరు సైంటులు ఒక పూలమాల వేస్తున్నట్లుగా మధ్యన మండుతున్న త్రాసు కనిపిస్తుంది. మహమ్మదీయుడు చస్తుంటే 'కథా' కనిపిస్తుంది. అంటే ఆ అక్షరం మక్కాలోనిది. అందుకని యివన్నీ ఎవడికి

వాడు కల్పించుకున్నవి. పరమ పవిత్రకరమైన, తుష్టికరమైన, పుష్టికరమైన భోజనములు చేయండి ఫర్వాలేదు అన్నారు. వీళ్ళు అదిదాటి యువతలకు వచ్చి కల్పించుకోరు. మాకు ఈ లోకాలన్నీ, యమలోకం మొదలైనవన్నీ లేవా? అంటే ఉన్నాయంటారు. ఎవరికున్నాయి. కావలసిన వాళ్ళకున్నాయి. అదివాళ్ళు చెప్పే సమాధానం. అయితే నిజంగా లేవాండి? అంటే నిజంగా కావల్సిన వాళ్ళకి వున్నాయి. కాని మనకి ఆ జిడ్డు వదిలేటప్పటికి చాల లక్షలు జన్మలు పడుతుంది. ఎందుకంటే ఏ మతంలో వున్నవాడు ఆ మతం చావు చస్తున్నాడు. ఇంక బ్రతికేదేముంది వాడు. నాస్తికుడు, నాస్తికుడి చావు చస్తాడు. అక్కడ ఎదురుగుండా నాస్తికుడు జెండా పట్టుకున్నట్టుగా అదీ కన్పిస్తుంది వాడికి ఫోటో ఆ నాస్తిక లోకాల్లోకి వెళ్ళిపోతున్నట్టు. నాభికి వాడికీ ఉన్న సంబంధం ఇలాగ కన్పిస్తుంది. వాడి నుంచి తన లోపలికి చుట్టూ సూర్యుడు మీద ధ్యానంచేస్తే కనిపించేది ఇది. నాభిమీద ధ్యానంచేస్తే కనిపించేది యిది. చంద్రుడి మీద ధ్యానంచేస్తే కనిపించేది. సూర్యుడి చుట్టూ గ్రహాల కక్ష్యలుంటాయి చూడండి అలాగ, అంటే ఇవేవో spiral లాగ వుంటుంది. బొడ్డు దగ్గర నుంచి. ఇది ఎలాగ వుంటుంది. బయటకు పుల్లలు పెట్టినట్టు ఉంటుంది. ఇది ఎలాగ వుంటుంది. ఉల్లిపాయ అడ్డంగా చూస్తే ఎలాగ వుంటుందో అలా వుంటుంది. కనుక చంద్రుడి దగ్గర పోకుండా కనిపిస్తూంది. ఇన్నీ కూడ తేజో లోకములతో నిర్మాణమైనటువంటి విషయం. కనుక యిన్ని విషయాలతో నిర్మాణమైనదే మనం ఎరిగివున్న రాశిచక్రం. గ్రహచక్రం, జ్యోతిశ్చక్రం, జాతకాలు, వ్యవహారాలు, దశలు, అంతర్దశలు ఇవన్నీ కనిపిస్తాయి. ఇటునించి ఇటు మర్చిపోకుండా గుర్తు వుంచుకుంటే ధ్రువలోకం. ఇన్ని రకాలైన కక్ష్యలు సూర్యుడిచుట్టూ ఉన్నాయా లేదా solar system లో. ఇన్ని రకాలైన కక్ష్యలు మీలో కూడ ఉన్నాయని దాన్ని బొమ్మే మీరని తెలుస్తుంది. అంతేగాక దానినుండి విడదీయటానికి వీల్లేని పరిస్థితి మీది. మనం వేరుగా వున్నాం అనేది అజ్ఞానమని మీకు తెలుస్తుంది. బీరకాయలో బీరగింజ వేరుగా వుంటుందా? మఱ్ఱికాయలో మఱ్ఱిగింజ వేరుగా వుంటుందా? ఈ జగత్తులో మన పోలసీ మనదే అంటాడు. మన పోలసీ మనదేమిటి? ఎవడి దగ్గరన్నా ఉద్యోగమైనా చెయ్యాలి, వ్యాపారమైనా చేయాలి, వాడికాళ్ళు పట్టుకుంటూ. మన పోలసీ ఏమిటి? పరస్పరత్వం తప్పదు. అందుకని everyone is an inseparable of the total. అవునన్నా కాదన్నా, ఏమీ లాభం లేదు అని తెలుస్తుంది.

## 31. కంఠకూపే క్షుత్పిపాసా నివృత్తిః।

కంఠకూపే = గొంతు క్రిందవున్న గుంట; సంయమాత్ = సంయమము చేస్తే; క్షుత్ = ఆకలి; పిపాస = దప్పిక; నివృత్తిః = తొలగును.

**కంఠమందలి గుంటయందు సంయమము చేయుటవలన ఆకలి దప్పులు తొలగును.**

**వివరణ :** 'కంఠకూపం' అంటే గొంతు క్రింద వున్నటువంటి గుంట. The pit of the throat. దానియందు సంయమం చేసుకుంటే యోగాభ్యాసంలో 'క్షుత్' అంటే ఆకలి, 'పిపాస' అంటే దప్పిక, 'నివృత్తిః' తొలగిపోతాయి అన్నారు. కంఠం దగ్గర చిన్న జ్యోతి ఉందనుకోండి. దాంట్లో మనం వేసేటువంటి అన్నం మొదలైన పదార్థములన్నీ కూడ దగ్ధమై తగలడి శరీరంలో ధాతువులకు సరఫరా చేయబడుతున్నాయి. దాంట్లో ఉన్న కాలరీస్ ఆఫ్ హీట్ మనం తీసుకున్న పదార్థాలలోంచి ఉష్ణోగ్రత శక్తిగా మార్చబడి శరీరంలోకి తీసుకోబడుతుంది. అంతేకదా జరుగుతుంది. ఆ పని యిక్కడే జరుగుతుంది. ఇక్కడ పదార్థం తీసుకొని జరగక్కర్లేదు అన్నారు. అది మనందరికీ జరగాలంటే పదార్థం లోపలికి వెళ్ళి, ఆ వెళ్ళిన పదార్థం గొంతు దగ్గర నించి గర్భందాక భస్మమై, జఠరాగ్ని అనే పేరుతో తీసుకోబడుతుంది. దాన్నే వైశ్వానరాగ్ని అంటారు. ''అహం వైశ్వానరో భూత్వా ప్రాణినాం దేహ మాశ్రితః'' జీవుల దేహాన్ని ఆశ్రయించి, వైశ్వానరుడు ''ప్రాణాపాన సమాయుక్తః పచామ్యన్నం చతుర్విధం'' ఆహారమును చతుర్విధములుగా లోపల పచనం చేస్తున్నాను అన్నాడు భగవద్గీతలో. జఠరాగ్ని అంటారు దాన్నే. కనుక ఆహారం గొంతు దగ్గరనుంచి జీర్ణకోశము వరకు పచనం జరుగుతుంది. ఇది జరిగి ఆహారంలో ఉన్న ప్రొటీన్స్, విటమిన్స్, నైట్రేట్స్ మొదలైన వాటిల్లోంచి, కార్బోహైడ్రేట్స్, పిండి పదార్థములు (starches), సుగర్స్ యిట్లా అనేక గణముల దేవతలున్నారు. వాళ్ళందరి లోంచి తలోకాస్త శక్తిని యాచనచేసి శరీరానికి సరఫరా చేయబడుతోంది. అలా అక్కర్లేకుండా ఈ కంఠమునందు సంయమం చేసినట్లైతే ఆకాశంలోంచి అదేశక్తి శరీరంలోకి కంఠం దగ్గరనుంచి వ్యాపనమై

చక్కగా సరఫరా చేయబడుతుంది. అయితే గారడి కోసం చేసేవాడికి ఎవడికీ లొంగదు. యింతవరకూ మనం ఎరిగున్న వాళ్ళల్లో లొంగినది ఒక్క బాలయోగికి మాత్రమే. ఇంకా కొన్ని వేలమంది ఉన్నారు గాని, ప్రపంచానికి తెలియరు. అయితే మనకి ఆహారం అక్కర్లేదు, ఫర్వాలేదు. ఇదిచేస్తే అనుకునే వాడికి లొంగదు. మాడి చచ్చిపోతాడు. జాగ్రత్తగా ఉండాలి. దీనిని సాధన చేయటానికి చెప్పిన బల, అతిబల అనే మంత్రాలున్నూ వాటికి సంబంధించిన మూలికలు. బల అనేది ఒక మూలిక, ముూషిగ చెట్టు అంటారు. అతిబల అనేది ఇంకోచెట్టు అలాంటిది. ఆ రెండు మూలికలతో ఒక మంత్రసాధనచేసి, సూర్యరశ్మిలో కూర్చొని సాధనచేస్తే వస్తుంది. అదొక ప్రక్రియ.

# 32. కూర్మనాడ్యాం స్థైర్యం।

కూర్మనాడ్యాం = కూర్మనాడియందు (సంయమాత్ = సంయమంచేస్తే);
స్థైర్యము = స్థిరత్వం వస్తుంది.

**కూర్మ నాడియందు సంయమం చేయుట వలన స్థిరత్వం కలుగును (కంఠమునకు దిగువ కూర్మనాడి వున్నది).**

**వివరణ :** 'కూర్మనాడ్యాం' అంటే కూర్మనాడి యందు సంయమం చేస్తే ''స్థైర్యం'' అంటే స్థిరత్వం వస్తుంది. స్థిరత్వం అంటే ఎంతసేపు మీ మనస్సంకల్పాన్ని ఏ విషయం మీద పెట్టదలచుకున్నారో అంతసేపుగాని, అన్ని గంటలుగాని, అన్ని రోజులుగాని, అన్ని మాసములు గాని, అన్ని సంవత్సరములు గాని దానిమీద పెడతారు. లేకపోతే వ్యాసుడి దగ్గరనుండి మహాభారతం ఎలా వస్తుంది. కనుక స్థైర్యం అంటే అది. తర్వాత ఏమవుతుందో, రేపెలా ఉంటుందో ఇలాంటివన్నీ పోతాయి. పదిమంది వారెవరికో ప్రమాదంగా ఉందిట అంటే ఈ శరీరాలు శాశ్వతమా? అని వేదాంతం గుర్తువస్తుంది. డాక్టరు స్వయాన మనం చచ్చిపోతామని గనుక చెప్పాడంటే గతుక్కుమంటుంది ప్రాణం. అదిలేకుండా ఉండటం ఉంటుంది స్థైర్యం అంటే. వాడి శరీరం పోతున్నా ఒకే స్థితి వస్తుంది అన్నాడు. Death conditioned గా ఉండదు మనస్సు. అంతేగాక వ్యాపారం మొత్తం దివాళ తీసేసింది అనుకోండి. పోనీండి అన్నాడు. కుర్రాళ్లు ఆడుకుంటూ వాడికొచ్చిన పాయింట్లన్నీ పోయాయి. ఏమిటి చేస్తున్నాడు? ఏమీ పోలేదు అనుకుంటాడు. ఆ స్థితి వస్తుంది. మొత్తం కుటుంబంలో వున్న డబ్బంతాను, పెళ్ళాం మెడలో ఉన్న నగలు పెట్టేసాడు వ్యాపారంలో. ఓడ మునిగింది. ఇన్సూరెన్సు చేయలేదు ఆరోజుల్లో. ఏమైంది అంటే ఓడ మునిగింది. మనమేం చేస్తాం అన్నాడు అంతే. అదేమిటండీ మీకు బాధ వేయటం లేదా అని అడిగారు చుట్టు ప్రక్కలవాళ్ళు. మీకువేస్తే మీరు బాధపడండి అన్నాడు. స్థిరత్వం వస్తుందంటే అర్థం అది. స్థైర్యము అనేది వస్తుంది. దీన్నే ఏమంటారంటే he will find centre of his own circle. స్థిరత్వం రావటానికి మిగతా చుట్టుప్రక్కల ఉన్న పాయింట్సు అన్నీ తగుల్తా

ఉంటాయి బుర్రలో. కేంద్రానికి (centre) మాత్రం తగలదు. ఈ స్థితి వస్తుంది. కూర్మనాడి స్థితి. కూర్మనాడి స్థితి ఎక్కడుంది?




ఇంద్ర గ్రంథినే penial gland అంటారు. Functions not known to modern medical science. కాని ప్రాచీనులు బిహేవియర్ అనేది దీనిమీద ఆధారపడి ఉంటుందని చెప్పారు. అది ఎడ్యుకేషన్‌తో వచ్చేదికాదు. ఇందులో మార్పుతెస్తే ప్రవర్తన (behaviour) లో మార్పు వస్తుంది. సంగీతము కూడ దీనిమీద ఆధారపడి ఉంటుంది. ఋతము, beat, division of time దీనిమీద ఆధారపడి ఉంటుంది. మానవుడు చేసేది కనుక musical sense కాబట్టి, heart beat న్నూ, respiration దీనిమీద ఆధారపడి ఉంటాయి. సంగీతమంటే. గుండె కొట్టుకుంటమున్నూ, శ్వాస పీల్చుటమున్నూ, అంతేగాని ఇదేదో వాయించటం కాదు. దాన్ని బట్టే కదా మిగిలిన సంగీతము మానవుడు నేర్చుకున్నది. లయ, తాళము, చంధస్సును బట్టి నేర్చుకున్నాడు. కనుక యిది musical centre అంటారు. అందుకే గోలోకము అని కూడ అంటారు. ఇంద్రలోకం, ఇంద్రుడు గోవులని ఎత్తుకుపోయాట్ట అక్కడ కృష్ణుడు వేణువు వాయిస్తుంటే. దశమ స్కంధములో వస్తుంది కథ. తర్వాత వరుణ గ్రంథి pitutary gland.

# 33. మూర్ధజ్యోతిషి సిద్ధదర్శనమ్।

మూర్ధం = శిరస్సునందు గల (కంఠ పైభాగం); జ్యోతిషు = జ్యోతియందు (సంయమాత్ = సంయమంచేస్తే); సిద్ధ దర్శనమ్ = సిద్ధుల దర్శనము కలుగును.

**శిరస్సునందు వెలుగును దర్శించుచు సంయమం చేయగా సిద్ధుల (పరమగురువుల) దర్శనము కలుగును.**

**వివరణ** : మూర్ధము అంటే శిరస్సు. దాని యందున్నటువంటి జ్యోతి, జ్యోతిషు అంటే జ్యోతియందు, శిరస్సునందు ఉన్నటువంటి జ్యోతి. అంటే కళ్ళు మూసుకొని తల లోపల ఒక వెలుగు వున్నట్టుగా సంయమం చేయటం అని రాశారు, తప్పు. ఊహాస్థితిలో (imaginary level) సిద్ధ దర్శనము జరుగదు. యోగాభ్యాసం చేస్తున్న వాడికి శిరస్సుమీద సంయమం చేస్తే క్రమక్రమంగా శిరస్సులో ఉన్నటువంటి జ్యోతి కనిపిస్తుంది. ఏం జ్యోతి? అంటే కన్నులు మూస్తే కనిపించే జ్యోతి. మొదట మామూలుగా మనం ఎరిగి వున్నది కన్నులు తెరిస్తే కనిపించే వెలుగు. దీన్ని optic light అంటారు. చాక్షుషం. కన్నులు మూస్తే కనిపించేది mental light అంటారు Masters. యిక్కడ mental light, mental sound modern science కి యింకా తెలిసినవి కావు. కనుక ఇవి mental light కి సంబంధించినటు వంటివి. కన్నులు మూస్తే మాత్రమే మొదటి రోజుల్లో mental light కనిపించటానికి అవకాశం ఉంది. కన్నులు తెరిస్తే అవకాశం లేదు. బాగా అభ్యాసమైన తర్వాత కన్ను మూసినా తెరిచినా వాడు చూడదల్చుకున్నది వాడికి mental గా కన్పిస్తుంది. కంటికి కాకుండా మానసికంగా కనిపించే స్థితి వస్తుంది. అలాంటి స్థితిలో మొట్టమొదటగా వీడు అభ్యాసం చేస్తున్నపుడు అనేక రకాలుగా కన్పిస్తుంది. రంగులు రంగులుగా కన్పించవచ్చు. ఎర్రగా నల్ల నల్ల మచ్చలున్నట్టుగా కన్పించవచ్చు. అలా కనిపిస్తే అతడు అతి ఘోరమైనటువంటి ప్రవృత్తి కలవాడు అనీ, కామక్రోధములు, రాగద్వేషములు ఎక్కువ వుంటే ardent temperment అంటారు. అంటే వాడికి మీమీద ఆపేక్ష వచ్చిందంటే వాడికోటు విప్పి అక్కడ వేసి దానిమీద నడవమంటాడు. కొంచెం తేడా వచ్చిందంటే రోడ్డుమీద నిల్చుని నానా దుర్భాషలు ఆడతాడు, కొడతాడు, లేకపోతే హత్యలు కూడ చేస్తాడు. అంటే ఏమిటి? ఒక రకమైన lower type of beastly emotional consciousness. అది వున్నవాడికి కన్నులు మొదట ఎర్రగా,

lightగా కన్పించి, blood redగా అందులో నల్ల నల్లని చుక్కలు, మచ్చలు కన్పిస్తాయి. లేదా మీరు యోగాభ్యాసం చేయటం పూర్తయిన తర్వాత ఎవరినో వాడివంక ఒక్కమాటు యిలా చూచారంటే ఆ రంగు మీకు కనిపించిందంటే వాడు అలాంటి వాడని అర్థం. యోగాభ్యాసం చేసినవాడికి వాడి శిరస్సులో ఉన్నటువంటి light మీక్కనిపిస్తుంది. కనుక red, black spots అంటే the beastly human being. వాడికి life అంటే competetion తప్ప యింకోటి తెలీదు. ఆ స్థితిలో వుంటాడు. దీంట్లోంచి orange రంగు కనిపించటం మొదలు పెడుతుంది. క్రమంగా కొంత కొంత పరిశుద్ధి అవ్వటం మొదలు పెడుతుంది. అప్పటినుంచి లోపల వున్నటువంటి సూక్ష్మదేహం పరిశుద్ధి అవుతుంది. అది అవ్వటం ప్రారంభించినప్పటి నుంచీ రక్తం రంగుగా, నెత్తురు రంగుగా కనిపించటం మానేస్తుంది. కొంచెం రంగు తమాషాగా మారుతుంది. దీన్నే మందారపుష్పం రంగు, జపాకుసుమ రంగు, అరుణవర్ణం లేక దాడిమీ పుష్పం, దానిమ్మ పువ్వు రేకుయొక్క రంగు అని అంటారు. ఈ రంగుకి ఆ రంగుకి సంబంధం లేదు. ఈ రంగుని మీలో వున్నటువంటి basic higher nature అమ్మవారు అంటారు. అమ్మవారి యొక్క రంగు అంటారు. అందుకనే లలితాదేవి యొక్క స్తోత్రములో ''అరుణాం కరుణా తరంగి తాక్షీం'' అని స్తోత్రం చేయటం. కనుక యింకా కొంచెం క్రిందికి వెళ్ళేటప్పటికి ''జపాకుసుమ భాసురాం స్మరే జపవిధౌ'' అంటారు. 'జపాకుసుమ సన్నిధౌ' జపాకుసుమము అంటే మందార పుష్పము. అది blood red కాదు. ఈ రంగుకి ఆ రంగుకి తేడా వున్నది. మనుష్య శరీరం ఎత్తినా, ఉన్మత్త స్థితిలో పశువుగావున్న వాడికి blood red కన్పిస్తుంది. క్రమంగా యిది కనిపించిన వాడికి పరిశుద్ధి కల్గుతుంది. పరిశుద్ధి అయ్యాక ఈ స్థితిలోకి వస్తుంది. అంటే జపాసుకుమ వర్ణంలోకి వస్తుంది. లేక యింకొక స్థితిలోకైనా వస్తుంది. Golden yellow colour అంటే ''హిరణ్యావర్ణాం హరిణీం సువర్ణ రజత స్రజాం'' ఆ రంగులో వుంటుంది. అంటే సూర్యుడు ఉదయించి అరగంట పోయిన తర్వాత సూర్యరశ్మి యొక్క రంగు. అదైనా కనిపిస్తుంది. ఈ రెంటిలో ఏది కనిపించినా వాడికి పరిశుద్ధి జరిగినట్లే లెక్క. ఎటు జరుగుతుంది అనేది వాడి జీవలక్షణాన్ని బట్టి జరుగుతుంది. యిలాగే యింకొకటి వుంటుంది. దాన్ని మొట్టమొదట ధ్యానం చేసినపుడు grey colour అంటే బూడిద రంగు కనిపిస్తుంది. తమాషాగా ఇపుడున్న భాషలో

చెప్పాలంటే ఈ కల్తీ సిమెంటు అమ్మతున్నారు చూడండి. ఆ సిమెంటు రంగు అన్నమాట, grey colour. ఆ రంగు కనిపిస్తే వాళ్ళు కూడ యింకా చాల సర్దుబాట్లు కావలసిన వాళ్లు అని అర్థం. వాడికి ఒక విధమైన అనిశ్చితత్వం జీవలక్షణంలో ఉంటుంది. తర్వాత దేనియందు కూడ ఆదరభావం, భక్తిభావం అనేవి యింకా పుట్టనటువంటి జీవి వాడు. కనుక భక్తి అనే శబ్దం తప్ప వాడికి అర్థం తెలియదు. సిగ్మండ్ ఫ్రాయిడ్ భక్తిని గురించి, it is also a form of sex అన్నాడు. అలాంటి వాళ్ళు వాడికి ఏది కనిపిస్తే అవన్నీ దాంట్లో చిల్లరల్లే కనిపిస్తాయి. పాత్రతనుబట్టి, యోగ్యతనుబట్టి భక్తితత్వం పుట్టినటువంటి వాడు వీడు. Grey colour లో ఉంటాడు. వీడు క్రమంగా పరిశుద్ధి అయ్యేటప్పటికి ఆకాశం యొక్క నీల వర్ణములోకి వస్తాడు. క్రమక్రమంగా పతంజలి యోగాభ్యాసం ప్రకారం ముందుకు వెళుతూ ఆ ఉచ్ఛ్వాస, నిశ్వాసలు అవన్నీ చెప్పిన పద్ధతిలో చేసుకుంటూ ఈ శిరస్సునందు జ్యోతి దానియందు సంయమం చేసినట్లైతే ధారణ, ధ్యాన, సమాధులు, క్రమంగా ముందు ఒక రంగు కనిపిస్తుంది. తర్వాత రాను రాను బాగుపడి నెలకో, రెండు నెలలకో, ఏడాదికో, ఆర్నెల్లకో ఈ రంగులోకి వస్తుంది. ఈ రంగులోకి వచ్చిందంటే వాడి సూక్ష్మ శరీరం పరిశుద్ధి చెందింది అని అర్థం. యింకొకడికి అలాగే green అంటే ఆకుపచ్చ రంగు కనిపిస్తుంది. ఆకుపచ్చ రంగులో రెండు రకాలైన ఆకుపచ్చ రంగులు. మనం గమనించుకోవాలి. తేడా చెప్పలేము. ఉదాహరణకు మైలుతుత్తపు గడ్డ వుంటుంది. దానిపైన ఆకుపచ్చని కప్పువేస్తుంది. ఆ రంగులో ఉంటుంది. వీడు మొదట ధ్యానంచేసినపుడు వీడు కూడ చాల చీకాకైనవాడే. పరిశుద్ధి కావల్సినవి చాల ఉన్నాయి. అది పరిశుద్ధి అయ్యేటప్పటికి వాడికి మంచి రకమైన ఆకుపచ్చరంగు వస్తుంది. అంటే ఆపూట వర్షం కురియగానే దూరం నుంచి ఆకాశమున్నూ, పచ్చిక బయలు మీరు చూస్తుంటే, నీరుటెండ పడుతూంటే ఏ రంగులో కనిపిస్తూందో ఆ రంగులోకి వస్తాడు. మైలుతుత్తపు గడ్డపైన వున్న కప్పుమీద ఆకుపచ్చని రంగు దగ్గరనుంచి లేత పచ్చిగడ్డి మీద వర్షం కురిసేక నీలమైనటువంటి ఆకాశంలోంచి ఉదయించిన తర్వాత ఉన్న సూర్యరశ్మి పడుతూంటే ఏ రంగులో వుంటుందో ఆ రంగులోకి వస్తుంది. అంటే వాడి పుట్టుకని బట్టి ముందు పై రంగులో ఉండవచ్చు. తర్వాత క్రింది రంగులోకి వస్తాడు. కనుక ఎరుపునుంచి జపాకుసుమ సంకాశంకి వస్తాడు. బూడిద రంగునుంచి నీల

వర్ణానికి వస్తాడు. తర్వాత ఎరుపునుంచి బంగారపు రంగులోకి వస్తాడు. ఆకుపచ్చ నుంచి మంచి ఆకుపచ్చులోకి వస్తారు. సామాన్యంగా ఈ రకాలుగా వుంటారు. 4 రంగులు. ఈ రంగులు కంటికి కనిపించేవి కావు. Mental colours తప్ప optic colours కావు. ఎందుకంటే యిక్కడ ప్రవర్తించేటువంటి light mental light. తప్ప, optic light కాదు. కంటికి సంబంధించిన కావు. వీటిని అనుసరించియే, ప్రతీవాళ్ళం ఈ నాలుగింటిలో ఏదో ఒకదాంట్లోకి వస్తాం, మనం అంతా, మనం వున్న స్థితిని బట్టి. దీన్ని అనుసరించి నిజమైనటువంటి చాతుర్వర్ణ్యం నాలుగు వర్ణముల అర్థం వస్తుంది. అంటే దీన్నిబట్టి వాడి ప్రవర్తన, ప్రవృత్తి వుంటుంది. ఈ క్రిందవి ఉన్న వాళ్ళు చాతుర్వర్ణ్యంలో ఉంటారు. అంటే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర ధర్మముల యందుంటారు. కులాలు కావు. అంటే యోగాభ్యాసం చేస్తున్నవాడు ఒకణ్ణి చూచి వీడి పుట్టుకచేత ఏ వర్ణమో చెప్పగలడు. వాడికి తగినటువంటి పనిగాని, చదువుగాని యిట్లాంటివన్నీ వాడికి చెప్పగలడు. కులాల్నిబట్టి సీట్లు రిజర్వేషన్, అలాకాదు. వాడు దేనికి పనికివస్తాడో అదికావాలి. 20 ఏళ్ళక్రిందట defence లో కూడ మాకు రిజర్వేషన్ కావాలి అన్నారు. అప్పుడు డిఫెన్స్‌లో ఇండియా అంతటికీ నంబియార్ అనే ఆయన ఉండేవాడు. ఆయన సమాధానం పేపర్లో ఒక statement యిచ్చాడు. we want fighters not farmers. కనుక ఆచార్యుల వారిని, శాస్త్రులు గారిని, మంగలిని, చాకలిని, ఒక హరిజనుణ్ణి వీళ్ళందరినీ మిలటరీలోకి పంపించారనుకోండి. ఎందుకు సత్రకాయలల్లే తిండి దండుగ. మంత్రం చెప్పుకోవాల్సిన వాడు, గడ్డం చేయవలసిన వాడు, బట్టలు ఉతకాల్సినవాడు, చెప్పులు కుట్టాల్సినవాడు. వీళ్ళందరూ మిలటరీలోకి వెళ్ళారంటే దేశం ఏమయిపోతుంది. యుద్ధం చేయమని అర్జునుడికే చెప్పాడుగాని భగవద్గీతలో. కృష్ణుడు ప్రతీవాడికి, కృష్ణమాచార్యులకి, శాస్త్రులుకి, రావుగారికి, చౌదరిగారికి, రెడ్డిగారికి, మరి ప్రతివాడికి చెప్పాడా? ప్రతివాణ్ణి యుద్ధం చేయమంటే ఎక్కడ చేస్తాడు? ఎందుకండి వచ్చింది అంటాడు. బాంబులు పడుతున్నాయి. అంటే మనం పారిపోదాం పెళ్ళాం పిల్లల్ని తీసుకుని అంటాడు. రక్తంలో మగతనం లేనటువంటి వాళ్ళు యుద్ధం ఎక్కడ చేస్తారు? దీన్నిబట్టి పుట్టుకచేత తెలుస్తాయి. అవి చాతుర్ వర్ణ్యములు అంటే. Blavetsky the occult significance of the forefold division of the society అని చెప్పి ఒక article

రాసింది. దాంట్లో యివి యిచ్చింది. చూడండి మీకు రంగులు కనిపిస్తాయి. యోగాభ్యాసం చేసిన తర్వాత. మీ రంగు కనిపిస్తుంది. ఎదుటివాళ్ళ రంగు కనిపిస్తుంది. ఎవడు ఎందుకు పనికివస్తాడో కనిపిస్తుంది. దాంతో ఎవడు ఏ పనిచేయాలో ఆ పనిచేసినట్లైతే ప్రపంచం ప్రపంచంగా వుంటుంది. అది రాసింది. కనుక ఈ రంగులు, మంచి రంగులు కనిపిస్తాయి. ఎవడి రంగువాడికి కనిపిస్తుంది. యిలా కనిపించటం అయ్యాక ఇంకా వాడు ధ్యానం చేస్తుంటే యోగములో పరిపూర్ణత వచ్చి అందరికీ కూడను ఏమీ రంగు లేనటువంటి ఉట్టి వెలుగు కనిపిస్తుంది. శుద్ధ స్ఫటిక సంకాశం అన్నట్లు. వీళ్ళు నలుగురికీని. అంటే ఆ నలుగురు కూడ సిద్ధజ్యోతి యందు ప్రవేశించిరి అని అర్థం. వాళ్ళకి వర్ణాలు, గిర్ణాలు ఏం వుండవు. అలాగే ఏదన్నా రామకృష్ణాశ్రమంలో గాని, పెద్దపెద్ద ఆశ్రమాల్లో పబ్లిక్ కోసం పనిచేస్తున్నటువంటి స్వామివారు ఉంటే కులాల ప్రశ్నరాదు. ఒక్క spiritual organisation లో తప్ప అది రాకపోవటానికి తావులేదు. కనుక వీళ్ళకి శుద్ధ స్ఫటిక సంకాశమైనటువంటి వెలుగు వస్తుంది. మొట్టమొదట తెల్లటి వెలుగు వస్తుంది. కళ్ళు మూసుకుంటే తెల్లటి వెలుగు. కొంతమందికి దీపంలాగ ప్రారంభం అవుతుంది. అది అబద్ధమని తెలుసుకోండి. ఎందుకంటే వీడికి దీపం ఆకారాన్ని ధ్యానం చేయటం ఇదివరకు అలవాటు. దాన్నిబట్టి వచ్చిన auto-suggestion తప్ప జ్యోతికి ఆకారం వుండదు. ఇలాగే ఒక క్రైస్తవుడు ధ్యానం చేసాడనుకోండి. శిలువగా కనిపిస్తుంది జ్యోతి. అలాగే ఒక వైష్ణవుడు ధ్యానం చేసాడనుకోండి. సుదర్శన చక్రం కనిపిస్తుంది. అబ్బ సుదర్శన చక్రం అనిపిస్తుంది. ఈ మధ్యలో కన్నం. అందులోంచి విష్ణుమూర్తి వేలుకూడ కనిపిస్తుంది. అంటే వాడికి అదివరకు బుర్రలో వున్నటువంటి auto-suggestions అన్నీకూడ ఆ రకంగా కనిపిస్తూ వుంటాయి. కనుక యివన్నీ వెళ్ళిపోతాయి. వెళ్ళిపోయి మొట్టమొదట మాత్రం తల లోపల, బయట అంతాకూడ చుట్టూ అలా కనిపిస్తుంది. అబ్బ! ఎంత వెలుగు వెలిగిపోతోంది అనిపిస్తుంది. కొన్నాళ్ళయ్యేటప్పటికి ఇవన్నీ వెళ్ళిపోయి ఏ రంగు లేనటువంటిది మిగుల్తుంది. ఆ వెలుగు ఎలా తెలుస్తుందండి. యోగాభ్యాసం చేయాల్సిందే. అది మూర్ధజ్యోతి అంటే. అది చూడగలిగిన వాడికి అందుతుంది. ఈ రంగులన్నీ వెళ్ళిపోయిన తర్వాత మూర్ధజ్యోతి చూడగలవాడు అంటే తన శిరస్సునందు. ఇంద్రియాలున్నాయి కదా. చూచేటువంటి శక్తి, కన్ను, ముక్కు, చెవి

మొదలైనవి. తర్వాత తలకాయలో ఉన్న ఇంద్రగ్రంథి, వరుణ గ్రంథి, రుద్రగ్రంథి, బ్రహ్మగ్రంథి యివన్నీ చెప్పాంకదా. ఈ గ్రంథులలో వున్న అధిదేవతలు ఉంటారు. అధిదేవతలు అనగా the consciousness or intelligences that form the energy centres in the head. అధి దేవతలంటే శంఖచక్రాలు, శిలలు, తిరపతిరాళ్ళు అవన్నీ పుచ్చుకొని నిల్చోరు. అధిష్ఠాన దేవతలు అన్నమాట అధి దేవతలంటే. అంటే Brain లో ఎన్నివేల intelligenes పనిచేస్తుంటే మన intelligence పనిచేస్తోంది. మన intellegence లెక్క లేదు. మనం నిద్రపోతే మన intellegence ఏమౌతుంది? వెళ్ళిపోతుంది. అపుడూ గుండె కొట్టుకుంటుంది. ఊపిరితిత్తులు పనిచేస్తున్నాయి. లోపల ఆహారం జీర్ణశక్తి అవుతుంది. కనుక మన intelligence కాకుండా మిగిలినవి ఎన్ని intellegence వుంటే మనం బ్రతుకుతున్నాం. అసలు intelligence లు అవి. వాళ్ళని దేవ గణములు the Deva kingdom అని అంటారు. వాళ్ళు ఈ అధిష్ఠాన దేవతలు పనిచేస్తూ వుండే energy centers గా వుంటారు. కంటికి చూచుట అను శక్తి. ఆ శక్తికి అధిష్ఠానమైనటు వంటి ప్రజ్ఞ consciousness వాడు అధిదేవత. అధిదేవతకి ఏమిటి సంబంధం వుంటుంది. సూర్యునియొక్క అంశ మనలో వుంటుంది. అంతకంటే ఇంకేం లేదు. అలాగే చెవికి వినుట అనబడు శక్తి. ఆ శక్తికి అధిదేవత అని వినేవాడుంటాడు. వాడికి ఏ అంశ వుంటుంది. బయట వున్న ఆకాశం అనే దాంట్లో శబ్దం అనేది వుంది. అంటే the sound principle అది. sound కాదు. దాని అంశ దాంట్లో వుంటుంది. అంటే బయటవున్న సమస్త దేవతల యొక్క అంశలు కూడను లోపల స్థానాల్లో వుంటాయి. ఎలా అయితే మట్టిగింజలో మట్టిచెట్టు యొక్క అన్ని భాగాలు యిమిడి వున్నాయో, అలాగే మన తలకాయలో ఎక్కడెక్కడ కావలసిన అక్కడ అన్నీ యిమిడి వుంటాయన్న మాట. యిందులో వున్నవన్నీ బయటవున్న వాటితో అనుగుణంగా వుంటాయి. బయట ఆకాశం వుంటే ఆకాశంలో sound principle వుంటుంది. మనకి చెవిలోంచి పనిచేసే sound principle కి తలకాయలో ఒక centre వుంటుంది. అలాగే ఆకాశంలో light ఉంటే మనకి light principle వుంటుంది. కంటికి పనిచేసేది కంట్లో లైటులు పనిచేయించే ఒక సెంటరు అంటే సూర్యాంశ మనలో వుంటుంది. ఆకాశాంశ, సూర్యాంశ అలాగే పృథివీ అంశ ఎలా వుంటుంది? మనం వాసన చూస్తూ వుండే శక్తి మన ముక్కులో వుంది.

ఆ శక్తికి అధిష్ఠాన దేవత అయిన వాసన చూపించే దేవత వుంటాడు. అది పృథివీ అంశ అంటారు. అలాగే రుచి. నాలికలో రుచి చూచే శక్తి వున్నది. ఆ రుచిచూచే శక్తిని గమనం చేస్తున్న intelligence, taste intelligence, taste consciousness. అది జలాధి దేవత. దాన్నే వరుణుడు అంటారు. వాళ్ళందరి విత్తనాలు యిందులో వుంటాయన్నమాట. కనుక పైభాగంలో ఈ పెద్ద staff అంతా ఉంటారు. వాళ్ల తాలుకు విత్తనాలు వుంటే క్రమంగా వాళ్ళ వెలుగులు వెలుగుతాయి. వాళ్ళ వెలుగే మీకు కనిపిస్తుంది. కనిపించిన తర్వాత శుద్ధ స్ఫటిక సంకాశం, colourless రంగు లేనటువంటి వెలుగు అంటారు. దాన్ని నిరంజనో జ్యోతిః అంటారు. అంటే కంటికి కనిపించటానికి కావలసిన ఏ రకమైన సరంజామా para phernalia వుండవు. అంజనం అంటే కంటికి కనిపించటానికి కావలసినవి. యిది ఆకుపచ్చ రంగులో వుందంటే దానిక్కావలసిన రంగుకి కావలసిన లక్షణాలు. కంటికి సప్లైచేస్తూ అది ఆకుపచ్చగా కనిపిస్తుంది. ఇలాంటి రంగులు, ఏరంగులు ఉండటానికి వీల్లేనటువంటి పరిస్థితిలో వుంటుంది. కనుక ఆ వెలుతురు మనస్సుకి మాత్రమే కన్పిస్తుంది. మనస్సుకి కూడ ఏ రంగుతోను కనిపించదు. ఏ రకంగా కన్పిస్తుందో తెలుసునా మనస్సుకి కనిపించటం, అపుడపుడు మనకి మంచివాళ్ళు, వాళ్ళయందు మనకి కొంత గౌరవం, గురి కుదిరిన వాళ్ళు, వాళ్ళు ప్రశాంతంగా అక్కడ కూర్చుని వుంటే వాళ్ళ ప్రక్కన మనం కూర్చుని వుంటే మనస్సులో ఏమిటో మనకి తెలియనటువంటి ఒకానొక ఈజ్ (ease) వుంటుంది. అపుడా లైటు వెలుగుతూ వుంటుంది. మనకి తెలియదు. దాన్ని చూచే కళ్ళు మనకి లేవు. కనుక అలా వున్నచోట బాగుంది అనుకుంటాం. ఆ బాగుండటం రూపంలో ఆ వెలుగు ధ్యానంలో వెలుగుతూ వుంటుంది. అది మూర్ధజ్యోతి. ఆ మూర్ధ జ్యోతిని చూడటం అభ్యాసంచేసి దానియందు సంయమంచేస్తే సిద్ధ దర్శనం కలుగుతుంది. సిద్ధులైన మహానుభావులు దర్శనం యిస్తారు. సిద్ధులంటే మాస్టర్స్. వాళ్ళ దర్శనం యిస్తారు. ఈ స్థితినే it is the plane of consciousness where the masters are found అన్నాడు జ్వాల్‌కూల్‌గారు. ఆ స్థితికి మనం వెళ్ళువరకు భౌతికంగా ఈ సిద్ధులు దొరకరు. జ్వాల్‌కూల్ మొదలైనవారు భౌతికంగా దొరకరు. భౌతికంగా ఎందుకు దొరకరు? అని అడిగితే దొరికితే ఏం చేస్తాం వాళ్ళని, వాళ్ళు చేస్తున్న పనులు వాళ్ళని చేయనివ్వం. అందుకని మనం వాళ్ళ పనికి అడ్డురాకుండా ఉండే స్థితికి వచ్చినదాక వాళ్ళు మనకి దొరకరు. ఇది వచ్చిన తరువాత

ఇందులోనే వాళ్ళూ, మనం తిరుగుతూ వుంటాం. కనుక ఎన్నివేల మైళ్ళ దూరంలో వాళ్ళున్నా వాళ్ళు మనం కలిసే పనిచేస్తూ వుంటాం.

ఒకాయన హిమాలయాల్లోను, ఒకాయన స్కాట్లండులోను, ఒకాయన నార్వేలోను, ఇంకో ఆయన న్యూయార్కులోను, ఇంకొకాయన న్యూజెర్సీలోను అదేపని చేస్తూ వుంటారు. తలవంచుకొని కూర్చొని. కాని అందరూ కూడ ఒకే హాలులో వుంటారు వాళ్ళందరూ. వాళ్ళ తలల్లో వున్నటువంటి వెలుగు. ఆ వెలుగు ఆకాశంలో వుంటుంది. తలలో వున్న మట్టి అంతా పోయిన తర్వాత తలలో కూడ అదే వెలుగు వుంటుంది. అంటే వీడి వీడి అభిప్రాయాలు, వీడి నమ్మకాలు కుంటికాలల్లే ప్రతీవాడికి వుంటాయి కదా. వీడి ఆవేశాలు, ఆదర్శాలు, ఇంకా కావేషాలు ఇట్లాంటివి వుంటాయి కదా! నశించాలి, వర్ధిల్లాలి అనిచెప్పి. ప్రతీవాడికి ఉంటాయికదా, లోపల వుండే కంపు. ప్రతీవాడికి తనకి సంబంధించినవి కొన్ని వర్ధిల్లాలి అని వుంటుంది. తనకి నచ్చనివి కొన్ని నశించాలి అని వుంటుంది. అవన్నీ పోతాయి. ఎందుకంటే ఈ ప్రపంచంలో ఏది వర్ధిల్లాలో, అది వర్ధిల్లుతుంది అనే సంగతి మొట్టమొదట తడవగా తెలుస్తుంది. ఆ రోజున నశించటానికి ఏమీలేదని తెలుస్తుంది. ఆ వెలుగు చలిమిడి ముద్దల్లే లేకపోతే ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌లాగ, మట్టి ముద్దలాగ దానితో రూపాలు చేస్తుండి, పిల్లవాడు మళ్ళీ యింకో రూపం చేస్తుండి ఈ రూపాలు తీసేస్తూ ఇంకొక రూపం చేస్తుండి ఆ పరిస్థితి ఎలా అయితే వుంటుందో ఈ సృష్టి అలా జరుగుతూ వుంది. కనుక నశించటానికి ఏంలేదు అక్కడ. అది తెలిసే స్థితి వస్తుంది. తర్వాత వీడి అభిప్రాయాలు అంటూ ఏం వుండవు. అలాంటపుడు ఎదుటివాడు అభిప్రాయాలు చేస్తుంటే వాడి అభిప్రాయాలు ఒకక్షణం అలా తడతాయి. వాడికి సహాయంగా ఏదన్నా ఉన్నట్లయితే అందులో ఒకటో, రెండో అభిప్రాయాలు తీసుకొని మిగిలినవి వదిలేస్తారు. లేకపోతే మిగిలినవి కూడ తీసేస్తారు. వీడి దగ్గర కూర్చున్నంతసేపు వాడి బుర్రలో కూడ ఏ అభిప్రాయాలు లేకుండా, చాల ప్రశాంతమైన స్థితిలో క్షాళనం చేయబడినటువంటి మనస్సుగా వుంటాయి. అపుడు వాడికి మనస్సులో సందేహాలు వుండవు. అడగవలసినవి వుండవు. పెద్దల దగ్గరికి వెళ్ళామని కంగారు పడతారు చూడండి. ఇట్లాంటి పశుప్రాయమైన వృత్తులు అన్నీపోతాయి. ఎందుకని? పెద్దవాళ్ళ దగ్గరకెళితే కంగారు పడటం అనేది వాళ్ళ యందున్న భక్తికాదు కదా. భయం. భయం

పశులక్షణం. భక్తి వున్నవాడు భయపడతాడా? పెద్దవాళ్ళ దగ్గరకి వెడితే వీడు పరమ ప్రశాంతమైన స్థితిలోకి వెడతాడు. ఇవన్నీ వడపోత అయిపోయిన తర్వాత భక్తి వుంటుంది కాని భయం వుండదు. పశులక్షణం అంతాపోయి మానవ లక్షణం మిగుల్తుంది. దేముడి దగ్గరకు వెళ్ళినా, పెద్దల దగ్గరకు వెళ్ళినా భయం పశులక్షణమే కాని కొంప తీసేస్తుంది. Obedience కాదు కావల్సింది. Offering, devotion. దానికి దీనికి తేడా ఏనుగుకి పీనుగుకి వున్నంత తేడా ఉంది. ఆ తేడా తెలియాలి. కొంప తీసేస్తుంది. నమస్కారం పెట్టి వెనక్కి తిరగంగానే ఏదైనా చేస్తారు. కనుక కావలసినది ఏమిటి? కంగారు వుండదు. పెద్దల దగ్గరికి వెడితే కంగారు పడటం, ఆవేశ పడటం, ఏవేవో అడుగుదామని అనుకున్నాం అని గబగబ అడిగేయడానికి ప్రయత్నం చేసి కంగారుపడటం లేదా అడుగుదా మనుకున్నవి మర్చిపోయి, యివతలకు వచ్చాక అడగలేక పోయా మనుకోవడం ఉండవు. పెద్దవాళ్ళ దగ్గర కూర్చున్నప్పుడు ప్రశాంతమైన మనస్సు వుంటుంది. ఈ బూజుతో, బొద్దింకలతో కూడుకున్నటువంటి మనస్సుపోయి క్షాళనమైన మనస్సు వుంటుంది. యివతలకి వచ్చాక వీడి మనస్సు వీడికి వస్తుంది. అపుడు అనుకుంటాం, కాసేపు పెద్దవాళ్ళ దగ్గర కూర్చొని యివతలకి వచ్చాక, ఈ ప్రశ్నలన్నీ వాళ్ళని అడుగుదామని అనుకున్నాం కాని మర్చిపోయినాము. అక్కడికెళ్ళాక బుర్ర పనిచేయదండి అని అనుకుంటాం. అక్కడికెళ్ళాక బుర్ర పనిచేయకపోవటం కాదు. పనిచేసే బుర్ర ఒకటే వుంటుంది. పనిచేసే బుర్రయొక్క లక్షణం ఏమిటి? మచ్చలు పడనటువంటి గ్లాసులాగ, కిటికీ అద్దంలాగ వుంటుంది. ఇపుడు మన బుర్ర కొన్నివేల మచ్చలు పడ్డటువంటి కిటికీ అద్దంలాగ వుంటుంది. మన బుర్రలో తిరుగుతున్నవి ఒకటా, రెండా, విషయాలు అందుకని ఈ షీటు ప్రక్కకి వెళ్ళిపోయి ఏ మచ్చలు లేనటువంటి షీటు వుంటుంది. షీటు లేనట్టుగా వుంటుంది. జాగ్రత్తగా వుండాలి. అంటే వాడి దగ్గరికి వెడితే ఉండవలసిన మనస్సు వున్నది. మన దగ్గర ఉండదలచిన మనస్సు వుంది. అంటే సైడు కాలువలో ప్రవహిస్తున్న మురికినీరు లాంటి మనస్సు వుంటుంది. అది చేయాలి, ఇది చేయాలి, వాడి దగ్గర కెళ్ళాలి, వీడి దగ్గర కెళ్ళాలి, ఆ పని అవ్వలేదు, ఈ పని అవ్వలేదు ఇవి వుంటాయి. క్రమంగా యోగాభ్యాసం చేసేవాడికి ఆ యావ వుండదు. ఎందుకంటే చేయడం మొదలు పెడతాడు కనుక చేస్తాను అని వుండదు. చేయాలి అని అనుకుంటం వుండదు. అనుకున్నవాడు

యోగాభ్యాసానికి పనికిరాడు. ఆ స్థితి వస్తుంది. అది వచ్చినపుడు వాడికి మనస్సుండదు. వాడే వుంటాడు. వాడికి 'మూర్ధజ్యోతి' రంగులేనటువంటి జ్యోతి కన్పిస్తుంది. అందులో 'సిద్ధ దర్శనమ్' కనిపిస్తుంది. ఈ సిద్ధ దర్శనములో వాళ్ళు వీళ్ళు కలిసి ఎన్నివేల మైళ్ళదూరంలో ఉన్నాగాని పనిచేస్తూ వుంటారు. మరి బ్లావెట్స్కీ జీవిత చరిత్ర చదివితే కొన్నివేల సన్నివేశాలు ఇలాంటివి మీకు తెలుస్తాయి. ఆవిడ లండన్‌లో వేల్స్ నది ఒడ్డున కూర్చొని Secret Doctrine రాస్తూ వుండంగ తిండికి కూడ డబ్బులు వుండేవికావు. ఎపుడన్నా పేపర్లలో వ్యాసాలు రాస్తే దానికి వాళ్ళు డబ్బులు పంపిస్తే వారం పదిరోజులు ఆ డబ్బులతో ఆవిడ, ఆవిడకి సహాయం చేస్తున్న కల్నల్ ఆల్కాటు బతుకుతూ ఉండేవాళ్ళు. అపరిగ్రహం అనేటువంటి దీక్ష అది. ఎవరినీ ఏదీ అడగరు. తెల్లకాగితాలు కొన్ని అక్కడ పెడితే ఆవిడ రాస్తూ వుండేది Secret Doctrine. అలాగ చెప్తూ రాస్తూ వుండేది. ఈయన వంకచూస్తూ ఉండేదికాదు. చోటులోకి కిటికీ లోంచి చూస్తూ రాస్తూండేది. రాసి దానిక్రింద ఒక్కొక్క పేజీకి అడుగున ఏడేసి, ఎనిమిదేసి పుస్తకాలు రిఫరెన్సు యిచ్చేది. పుస్తకంలో ఫలాన పేజీలో ఫలాన పంక్తి అని కొటేషన్ యిచ్చేది. అపుడు ప్రతీరోజూ ఈవిడ రాసిన పుస్తకాలన్నీ అచ్చుకివ్వాలంటే ఈ కొటేషన్లు తిన్నగా వున్నాయో లేదో చూసి యివ్వాలని బాధ లోపల ఆల్కాటుకి. లేకపోతే అప్రతిష్ఠ కదా! ఒక్కొక్క విషయం లైబ్రరీకి వెళ్ళి చూసేసరికి పదిరోజులు పట్టేది. ఇవన్నీ ఎక్కడనించి గుర్తు పెట్టుకుందా ఈవిడ అని ఆయనకి సందేహం. అడుగుదామని మొహమాటపడి అలా వూరుకుంటూ వుంటూంటే ఒకరోజున ఆవిడ చెప్పింది. ఇపుడు విష్ణుపురాణం నుంచి కొటేషను కావాలి. మనం రాస్తుంటే ఇది రాయిస్తున్న వాళ్ళు కొందరు శిష్యులచేత మనకి ఆ పుస్తకాలు ఎప్పటికప్పుడు సమకూరుస్తున్నారు అని కిటికీలోంచి ఇలాచూస్తూ ఆవిడ కళ్ళుమూసికొని చూడు అన్నది ఆల్కాటుని. చూస్తే ఆ కావలసిన పుస్తకం కావలసిన పేజీ తెరచి పట్టుకొని కూర్చున్నాడు ఒక కుర్రవాడు. అపుడావిడ ఆ కిటికీలోంచి చూస్తూ ఆ కావలసిన వాక్యాలు రాసేసుకుని పేజి రిఫరెన్సు రాసేసుకుని సరే అన్నది. ఆ పుస్తకం వాడు పట్టికెళ్ళి పోయాడు. ఈ పుస్తకం ఎక్కడ పట్టుకున్నాడు వాడు. హిమాలయాల దగ్గర వున్న ఒక చిన్న పల్లెటూళ్ళో ఒక యింట్లో వున్న లైబ్రరీలో ఒక కుర్చీలో కూర్చుని పట్టుకొని వున్నాడు.

ఇక్కడికీ అక్కడికీ ఎంతదూరం? లండన్ దగ్గర వేల్స్ నదికి 25000 వేల మైళ్ళ పైచిల్లర దూరం వుంది. ఇలాంటివి కొన్ని వందల సన్నివేశములు ఆవిడ జీవితంలోను, ఆవిడ Secret Doctrine రాస్తున్నపుడు జరిగినటువంటివి మీరు చదవవచ్చు ఆవిడ జీవిత చరిత్రలో. బ్లావెట్స్కీ ఉత్తరం వస్తుంది, తీసుకురా పోస్టాఫీసుకి వెళ్ళి అని చెప్పింది. కొత్త వూరు, పోస్టాఫీసు ఎక్కడ వుందో వాడికి తెలీదు. వాకిట్లోకెళ్ళే టప్పటికి పోస్ట్‌మాన్ ఉత్తరం వాడికి తెచ్చి యిచ్చి వెళ్ళేవాడు. పోస్ట్‌మాన్ కాడు వాడు. హిమాలయాల దగ్గరవున్న గ్రామంలో ఉన్న ఒకడు అక్కడనించి యిక్కడకి అందజేసేవాడు. చోటు (space) లోంచి space travel చేసేవి. అవన్నీ యిక్కడ చెబుతారు తరువాత రాబోయే సూత్రాల్లో. కనుక వాళ్ళ దర్శనం అవుతుంది. సిద్ధ దర్శనం అంటే అది. వాళ్ళతోపాటు వీళ్ళు తిరుగుతూ పనిచేస్తూ వుండటం జరుగుతాయి. వీళ్ళు privileges enjoy చేస్తారని అనుకోవద్దు. వీళ్ళకి జీవితం చాల యోగమయంగా వుంటుంది. privileges అనుభవించడం తుచ్ఛులుచేసే పని. ఎక్కడన్నా ఏదన్నా సేవ (service) లో ఉన్నామంటే అక్కడ మనకి కావలసినవన్నీ ఏర్పాటు చేయమని తర్వాత మనం, మరెవరినో తీసుకు రావటానికి టాక్సీ పట్టికెళ్ళాలిట అంటే మన యింటికి వున్నటువంటి పనులు మన కుర్రవాణ్ణి, పిల్లని, స్కూలునుంచి, కాన్వెంటు నుంచి తీసుకొచ్చి మన కూరలు గీరలు కూడ అదే టాక్సీలో తీసుకురావటం మామూలుగా త్రాష్టులు చేసే పనులు. ఏది? ఉద్యోగరీత్యా తెచ్చిన ఆ టాక్సీలోనే యివన్నీ చేయటం. అక్కడ అలా వుండదు. డబ్బులు లేకపోతే కాఫీ కావల్సినా సరే పస్తు పడుకుంటమే కాని, డబ్బులు ఎవరినీ అడగటం వుండదు. మళ్ళీ పోస్టులో ఎక్కడ నించైనా మనియార్డరు వచ్చిన తర్వాతనే పాపం వాళ్ళిద్దరూ ఏమైనా తినేవాళ్ళు ఆ పుస్తకం రాస్తున్నపుడు. ఒక్కొక్క రోజు, రెండేసి రోజులు ఉత్తి టీ తాగి ఉండేవాళ్ళు డబ్బుల్లేక. ఆ రాస్తున్న ఆవిడ ఆ పక్కన సహాయం చేస్తున్నటువంటి ఆయనాను. అదిదాటి ఎవరికైతే పనిచేసి పెడుతున్నారో వాళ్ళని అడగరు. పోనీ వాళ్ళకు తెలియదా? వాళ్ళని మనం అడగవలసిన అవసరం వుంటే అక్కర్లేదు అని ఈవిడ అనేది. వాళ్ళేమనుకునేవాళ్ళు, ఆవిడకేం కావాలంటే అది అడక్కూడదా? అని నవ్వుకుని అనుకునేవాళ్ళు. ఈ సంభాషణలు జరిగేవి. వాళ్ళకి ఈవిడకీ. ఏం కావాలంటే అది అడిగినట్లయితే ఇలాంటి పనులు అవ్వవు. అలాంటి వాళ్ళకి

సిద్ధదర్శనమ్ అవుతుంది. సిద్ధుల దర్శనం అయినందువల్ల వీళ్ళకి ఒరిగింది ఏమీలేదు. అది తెలుసుకోవాలి. వీళ్ళ దగ్గర డబ్బులుంటే వీళ్ళు అన్నం తినాలి. లేకపోతే వీళ్ళు పస్తుండాలి. పనిచేస్తే చేయాలి. లేకపోతే వాళ్ళు వెళ్ళిపోవాలి. మనలాగ పగలు పనులు చేసుకుని సాయంత్రం పూట పతంజలి యోగ సూత్రములు విందాం, అన్నంతమాత్రాన రాదు. మీలో ఎవర్తైనా సరే వెంటనే ఫలానా వూరు వెళ్ళిపోండి. ఉద్యోగం మానేసి అంటే వెళ్ళడానికి ఎవరైనా రెడీగా ఉన్నారా? ఉన్నాం అంటే వాళ్ళు పతంజలి యోగానికి కావలసిన వాళ్ళు. 25 సంవత్సరముల తర్వాత ఒక్కడు దొరికాడు. హెడ్ మాస్టర్‌గా పనిచేస్తున్నాడు రాయలసీమలో. 'రా' అంటే వచ్చేసాడు. గోదావరి జిల్లాలో కొత్తకోట అనేచోట యిపుడున్నాడు. జగద్గురు పీఠం ఆశ్రమం develop చేస్తున్నాడు. కనుక పతంజలి యోగసూత్రాలు చదువుకునేటప్పుడు, దాంట్లో అభ్యాసం చేయటానికి వాళ్ళు పనికొస్తారు. బ్లావెట్‌స్కీ మొదలైన వాళ్ళు అలా జీవించారు. అంటే వాళ్ళ పనులు వాళ్ళు చేసుకుంటూ ఈ పనులు చేసిపెట్టడం. మనకి సదుపాయంగా అవకాశంగా వున్నటువంటి టైములో వారేదన్నా యోగాభ్యాసాన్ని గురించి చెబితే విందాం. ఏదన్నా మంచి ముక్కలు చెబితే విందాం. అట్లా వీటివల్ల ఏం లాభం లేదు. ఇది మొదటి బాచ్. రెండవది సినిమా టికెట్లు దొరక్కపోతే, లేకపోతే సంగీతం కచేరి టికెట్లు దొరక్కపోతే ఆ రోజున వచ్చి నాలుగు మంచి ముక్కలు విందాం అని కూర్చుంటారు. ఈ రెండు బాచ్‌లవల్ల ఏం లాభంలేదు. అంటే అంకితభావం (dedication) అనేటువంటిది, ఇంకొక జీవితభాగం అని వుండకూడదు. దానికి సాహసించిన వాడికి మాత్రమే బ్రహ్మవిద్య అందుతుంది అని చెప్పారు. మనం ఎరిగివున్న ఈ పేర్లు కలిగిన గురువులే కాకుండా ఎరగనటువంటి వాళ్ళు ఉంటారు. వాళ్ళని పేరు అడగవద్దు అన్నారు. పేరు అడిగితే ఏం తెలుస్తుంది. చెప్తే మాత్రం ఏం తెలుస్తుంది మనకి? వాడేదో చేసుకుంటూ సాయంత్రం కాస్త బ్రహ్మవిద్యని గురించి గయ్యిగయ్యి లాడుకునేటువంటి వ్యవహారాలు కావు. వాళ్ళకి సిద్ధ దర్శనమ్ అవుతుంది. సిద్ధులు కనిపిస్తారు ధ్యానంలో. మొట్టమొదటగా ఈ స్థితి చాతనయినటువంటి యోగి నిద్రపోతూ వుంటే ఆ నిద్రలో contact చేస్తారు. అంటే తమతో మొట్టమొదటి స్పర్శ కలిగించి మొదటి పాఠం మనస్సుకి అందిస్తారు. అది తెల్లవారి లేచేటప్పటికి వీళ్ళకి వచ్చినటువంటి మంచి చక్కని అభిప్రాయంలాగ

అందుతుంది. దడదడ ఒక నాలుగైదు వాక్యాలు రాసేస్తారు. అది నాలుగు నెలలో ఐదు నెలలో అయ్యేటప్పటికి దానిమీద యింకాస్త వచ్చి ఒక పెద్ద శాస్త్ర గ్రంథము అవుతుంది. అంటే యిచ్చిన ఆయన ఒక శాస్త్రాన్ని గ్రంథం లేకుండా అందించాడు. ఆయన గ్రంథం రాసుకున్నాడు. ఇది వాళ్ళు చేసేపని. దీన్నే జ్వాల్‌కూల్‌గారు వెనుకటి యుగాల్లో అట్లాంటియన్స్, ఈజిప్టియన్స్, ancient ఇండియన్స్, యిచ్చినటువంటి advanced teaching effects అన్నాడు. ఆ పద్ధతులని teaching through impression అన్నాడు. అనగా భాష లేకుండా నేర్పదలచుకున్న సబ్జక్టు నేర్పుట. మీ భాషలో మీరు సబ్జక్టు చెప్తుంటే తీసుకుని రాసుకొనుట. ఈ స్థితికి విద్యా విధానం దాదాపు ఇంకొక శతాబ్దిలో వస్తుంది. ఇపుడు వున్నటువంటిది ఉట్టి గొడ్డు విద్యా విధానం. ఎందుకంటే ప్రతీవాడు రాసినది కూడ చొప్పమేసినట్టు మేసి, అదంతా గుర్తు వుంచుకొని, బుర్రలో పెట్టుకొని మనదంటూ ఏమీలేకుండా అయిపోయిందాక పుస్తకాలు చదివి, అవన్నీ పరీక్షల్లో రాసిందాక పాసయినట్టు లెక్కకాదు కదా. పాసయ్యాక యింకెందుకూ పనికిరాదు మనమైండ్. అందుకని 20వ శతాబ్దంలో వున్నది పాతరాతియుగపు విద్యా విధానము. At best it is a memory test అన్నాడు. అందులో వున్న మంచి విషయం ఒక్కటే. వాడి జ్ఞాపకశక్తికి, ధారణాశక్తికి అది ఒక పరీక్ష మాత్రమే. కనుక ఈ పుస్తకాల్లో ఉన్నది బుర్రలోకి ఎక్కించటం అనేటు వంటి పశువిద్యా విధానం తొలగిపోయే రోజు వస్తుంది. దానికోసం ఉన్నది ఆ మార్గం అని చెప్పాడు. ఆయన 19వ శతాబ్ది చివరిలో బ్లావెట్స్కీకి అలాగ బ్రహ్మవిద్య బోధించాడు. ఆ మార్గంలోనే ఆవిడచేత "Secret Doctrine, Isis unveiled" అనే రెండు ఉద్గ్రంథములు రచింపచేసాడు. ఆయన హిమాలయాల్లో ఉంటూ ఆమె లండన్‌లోనో, అమెరికాలోనో ఉంటూ వుండంగ డిక్టేట్ చేశాడు. అది అందరికీ తెలిసిన విషయమే. అది అయిన తర్వాత 20వ శతాబ్దిలో కూడ 30 సంవత్సరములపాటు Alice A. Bailey అనే ఆమెకు హిమాలయాల్లో ఒక గ్రామంలో వుంటూ, ఆవిడ న్యూయార్క్‌లో ఉండగా 24 పుస్తకాలు ఇంగ్లీషులో dictate చేశాడు. భాషతో కూడ ఇచ్చాడాయన. అంటే స్పర్శమైన భాషతో యిచ్చాడు. ఆవిడ తన దగ్గర వున్నటువంటి భాషలోకి రాసింది. ఇది teachings through impression అంటే. కాని 21వ శతాబ్ది మధ్యకాలం దాటేటప్పటికి స్కూల్స్, కాలేజీలు, యూనివర్సిటీల వాళ్ళకి యిలాంటి విద్యా విధానం

వున్నదని తెలిసే రోజులు మొట్టమొదటిగా వస్తాయన్నాడు. అది నీకు అభ్యాసం అవుతుంది. అభ్యాసమైన వాళ్ళతో నీకు సంబంధం వస్తుంది. వచ్చినటు వంటివాడు ఎవడా అనే చొప్పదంటు ప్రశ్న పోతుంది. ఎవడేమిటి? వాడు వచ్చినపుడు మనని వాడు ఎరుగును. వాణ్ణి మనం ఎరగం. అలాంటపుడు ఎవడని ప్రశ్నవేస్తే అర్థంలేదు. బుద్ధిలేదు. అపుడు వాళ్ళు మనకి ట్రయినింగ్ యిస్తారు. జీవితాంతం యిస్తారు. ఒక్కోరోజు గంటసేపు అని వుండదు. తరువాత మీపని మీరు చేసుకుంటూ ఉండచ్చు. మీ యిష్టం వచ్చినట్టు మీరు ప్రవర్తించవచ్చు అని వుండదు. 7,8 సంవత్సరాలు తర్వాతైనాసరే వాళ్ళు చెప్పిన దానికి వ్యతిరేకంగా మన జీవితంలో ప్రవర్తిస్తే, అటుపైన ఆ జన్మలో వారు కనిపించరు. అవకాశం వుండదు. ఎందుచేత, వాళ్ళవల్ల వుపయోగంకన్నా మనవల్ల వాళ్ళకి న్యూసెన్సు ఎక్కువ వుంటుంది. వాళ్ళు మనకి కనిపించడం మొదలు పెట్టేదే వాళ్ళవల్ల మనకి ఉపయోగం వుంటుందని తోచిన కొన్ని పదుల సంవత్సరాల తరువాత. అప్పటివరకు మనకి కనిపించకుండా నిద్దట్లో యిస్తూ వుంటారు. మనకావలసిన ట్రయినింగ్, లేకపోతే కొన్నివేలమంది వాళ్ళని తల్చుకుంటూ వుంటే వాళ్ళు చేసే పనులు అవ్వవు. అందుకని వాళ్ళని తల్చుకుంటానికి గాని, వాళ్ళ భౌతిక శరీరాలు ఎక్కడున్నాయో ఎడ్రసులు గాని ఈ రెండూ అందనీయనటువంటి స్థితిలో వుంటారు. ఈ స్థితికి వచ్చినవాళ్ళకి మాత్రం అందుతారు. అది సిద్ధ దర్శనం అంటే.

Those who have attained self mastery can be contacted through focussing the light in the head. This power is developed to one pointed medidation. సిద్ధులు, సిద్ధులైన మహానీయుల దర్శనం, స్పర్శ, మాట్లాడటం, ఒక్కోకపుడు మాట వినిపించటం, కొన్నాళ్ళపాటు మనిషి కనిపించకుండా వీలవుతుంది, మీ తలకాయలో వున్నటువంటి జ్యోతియందు మీరు సంయమం చేయగలిగితే. This power is developed in one pointed meditation, అది ఆయన చెప్పింది. ఇది జ్వాల్‌కూల్ మహర్షి ఈ సూత్రానికి ఇచ్చినటువంటి వివరణ. కనుక కనిపించటం అంటే కంటికి ఒకటే కాదు. మనస్సుకి ఒకటే కాదు. ఊరికే వినిపించటం కూడ వుంటుంది. అంటే మనం కూర్చుని ధ్యానం చేసుకుంటూ ఉన్నపుడుగాని తెల్లవారుజామునగాని, వినిపించడం ఉంటుంది ఒక్కొక్కపుడు.

కొంచెం పెందలాడే స్నానం చేయడం ఏదన్నా అభ్యాసం వున్నట్లైతే బట్టలు మార్చుకొని శుభ్రంగా వుండటం. అంటే వాళ్ళకి కంపు కొట్టకుండా శుభ్రంగా ఉండే స్థితిలో మనం వుండాలి అంతే. వాళ్ళు మనం ఏ కులం ఏం మతం అని చూడరు. వాళ్ళకి వాసనలు మన దగ్గరనుండి వేయకూడదు. అంటే ఈ కైమా వాసన, గర్‌మసాలా వాసన అవి వేయకూడదు అంతే. మనం దేనికి శుభ్రంగా సంబంధించిన వాళ్ళమో వాళ్ళకి అనవసరం. వాళ్ళు మామూలుగా వుంటారు. ఈ కులాలు మతాలు వీటికి సంబంధించి ఏం వుండవు. రోజూ స్నానం చేస్తాడా? బట్టలు మార్చుకుంటాడా? పళ్లు, గిళ్ళూ శుభ్రంగా తోముకుంటాడా? లేదా? నానా అడ్డమైనవి తింటాడా? కొంచెం ఏమన్నా పద్ధతిలో ఉంటాడా? అంతే వాళ్ళు చూసేది. అంతకంటే ఇంకేమీ చూడరు.

మొట్టమొదట వాళ్ళే మనల్ని contact చేస్తారు. అది మనకి తెలీదు. మనకే ఏవో తట్టుతున్నాయని అనుకుంటాం. తెల్లవారుజామున లేచి మనం రాసుకుంటానికి కూర్చుంటే వినిపిస్తాయి వాక్యాలు స్పష్టంగా. మనకా ఇంగ్లీషు రాదని తెలుసు. సంస్కృతమో, ఇంగ్లీషో, తెలుగో మనం రాస్తే అంత బాగుండవని అంతకంటే తెలుసు. చెవికి వినిపిస్తాయా అంటే చెవికి వినిపించవు. మనస్సులో ఇంకొక చెవి వున్నది. ఇంకొక కన్ను వున్నది. ఇంకొక ముక్కు వున్నది. ఇంకొక నాలుక వున్నది. ఇంకొక స్పర్శ వున్నది. అంటే మనకి కనిపిస్తూ ఉన్న ఐదు జ్ఞానేంద్రియములు కాక లోపల సూక్ష్మేంద్రియాలు ఉన్నాయి. వాటికి కనిపిస్తాయి. వాటికి వినిపిస్తాయి. కనుక సూక్ష్మమైన శ్రవణేంద్రియానికి వినిపిస్తుంది. ఎట్లాగండి? అంటే కలలో మీ స్నేహితుడు మాట్లాడుతున్నట్టుగా వస్తుందా? రాదా? వస్తేవాడి కంఠధ్వని మీకు వినిపిస్తుందా లేదా? ఏ చెవికి? ఈ చెవికా? కలలో వినిపిస్తోంది, ఏ చెవికండి? యింకో చెవి ఉన్నదే లోపల, దానికి వినిపిస్తోంది. అలాగే కలలో కనిపిస్తోంది. ఏ కంటికి? ఈ కంటికా? కలలో వాడు మనం ఎక్కడికో వెళ్ళినట్లు; ఉదా: క్లబ్బుకి వెళ్ళినట్లు. అక్కడ అదివరకు మేల్కొని వుండంగ ఏమేమి అలవాట్లు వున్నాయో ఆ పనులన్నీ చేసినట్లు మంచివిగాని, చెడువిగాని. వస్తాయా రావా? అలాంటపుడు ఏ కంటికి కనిపిస్తుంది? అది సూక్ష్మమైన నేత్రానికి. కనుక సూక్ష్మ శ్రవణేంద్రియం, సూక్ష్మ నేత్రేంద్రియం, సూక్ష్మ ప్రాణేంద్రియం మొదలగునవి. అబ్బ! ఏం సెంటండి! అని కలలో అన్నారనుకోండి. సెంటు ఎక్కడండి? అలాగే కలలో ice cream. ఏ నాలుక? సూక్ష్మమైన నాలుక.

అలాగే కలలో చలివేస్తుంది. ఈ శరీరానికి కాదు. ఇంకో శరీరానికి. కనుక శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు ఐదింటినీ స్వీకరించే మనం ఎరిగివున్న జ్ఞానేంద్రియములలో స్థూలేంద్రియములు గాక, సూక్ష్మేంద్రియములు లోపల వున్నాయి. వాటికి, వీళ్ళకి సంబంధం వస్తుంది. వాళ్ళు కనిపించినా ఒక పదేళ్ళో, పదిహేనేళ్ళో, ఇరవై ఏళ్ళో వీడు వెర్రి వెకిలి చేష్టలు చేయకుండా, వాళ్ళకి న్యూసెన్సు లేకుండా వుంటే అపుడు కంటికి ఎక్కడో అక్కడ కనిపిస్తారు. ఏ వూళ్ళోనో. వాడు పేరు చెప్పడు. ఊరు చెప్పడు. నువ్వు యిలా చేసుకో నాయనా అంటూ వుంటాడు. ఎవడు? అంటే ఎవడైతే నీ కెందుకు, చెప్పింది నీకు పనికొస్తే చేసుకో, లేకపోతే మానేయి అంటాడు. అదికాదు సార్! తమరెవరు? అంటే ఏమీలేదు నీలాంటి వాణ్ణే అంటాడు. ఏం చెబుతాం వాడితో? చెప్పేదేం లేదు. అయితే మనం వాణ్ణి నమ్మేది ఎట్లా? అంటే మానేయాలి. లేకపోతే నమ్మచ్చు. ఇంకేం లేదు అక్కడ. We can waste our opportunity and live as a loafer for life. అదైనా చేయచ్చు. లేదా జీవితం అర్పణం చేస్తే ఏమన్నా వస్తుందేమో చూడన్నా చూడచ్చు. అపుడు అవతల నుంచి ఏమన్నా వచ్చే అవకాశం వుంది. లేకపోతే ఈ జన్మకి, మోరియా గారు చెప్పారు the curtain drops in the middle of the drama and for today the drama is closed. It is never repeated. Tomorrow you can have the show once again అన్నాడు. అంటే ఈరోజుకు ఆట ఆపబడును. కావాలంటే రేపు చూపిస్తాం అన్నాడు. ఇంతే పద్ధతి. ఇదీ సిద్ధ దర్శనాన్ని గురించిన కొంత విషయం.

మూర్ధ్వమునందు ఉత్పన్నమైన జ్యోతి దర్శనము చేయటం వల్ల సిద్ధులు అనేవాళ్ళను దర్శనము చేయటం అవుతుంది అన్నారు కదా! ఆ సిద్ధులు ఏడుగురు. వాళ్ళను కొద్దిగా చెప్పుకుందాము. అంటే భూమ్మీద సిద్ధిపొందిన సిద్ధులు. భూగోళం పుట్టకముందు నుంచి మన సూర్యుడు, మన సౌరకుంటుంబము పుట్టక ముందునుంచి సిద్ధులైన వాళ్ళు ఉన్నారు. వాళ్ళని గురించి కూడ కొంచెం తెలుసుకుంటం మంచిది. ఈ భూగోళం మీద 1) వశిష్ఠుడు, 2) కశ్యపుడు, 3) అత్రి, 4) జమదగ్ని, 5) భరద్వాజుడు, 6) విశ్వామిత్రుడు, 7) గౌతముడు అను ఏడు పేర్లతో ఋషులు ఉండేవారు. అనేక యుగాలలో అనేక శతాబ్దులలో కూడ ఉన్నారు. ఒకళ్ళు కాదు. శ్రీరాముని సమయంలో ఉన్న విశ్వామిత్రుడు దగ్గరనించి

శ్రీకృష్ణుడి సమయంలో యాదవుల నాశానికి శాపం పెట్టిన విశ్వామిత్రుడి దాకా వరసన ఆ గోత్రం వాళ్ళందరినీ విశ్వామిత్రులనే అంటూ ఉంటారు. వీళ్ళు వ్యక్తులు కారు. మొట్టమొదట మనకు వీళ్ళని గురించి వివరించిన మహానుభావులు కనుక వీళ్ళు కూడ ఆపేర్లే పెట్టుకున్నారు. కనుక తరువాత వాళ్లు ఆ మొదట్లో వ్యక్తులు (original) కాదు. ఉదాహరణకి రామారావు అని పేరు పెట్టుకున్నాడనుకోండి. అది original కాదు. అంతకుముందు వాళ్ళ తాత పేరు రామారావు అయి ఉంటుంది. దాన్నిబట్టి వీడికి రామారావు అని పేరు పెట్టుకుంటారు. వాడికి వాడి తాతపేరో, ముత్తాతపేరో రామారావు అయి ఉంటుంది. ఇట్లాగ త్రేతాయుగం దగ్గరనించి కొన్ని లక్షల సంవత్సరాల వాళ్ళదాక, వాళ్ళ మనుమలు, వాళ్ళ మనుమలు రామారావులు వస్తూ ఉంటే వీడు రామారావు అవుతాడు. మొట్టమొదటుగా దశరథుని పుత్రుడు రాముడు. అదీ మొదటిపేరు కాదు. అంతకు ముందు రాముడు అనే చక్కని పేరు ఎవరో మహానుభావుడికి ఉండి, ఆ పేరు మన పిల్లవాడికి పెట్టుకుందామని అనుకుంటాంగాని, కొత్తగా ఒకపేరు కనిపెట్టి, ఎవడూ వాడి పిల్లవాడికి పెట్టడు. ఎవరో పిల్లవాడు పుట్టాడనుకోండి. తాతపేరు శివయ్య. ఆ తాతపేరు, తల్లి నాన్నపేరు వెంకటయ్య; అంటే వెంకట శివయ్య అని L.C.M తీస్తారు. అంతేగాని ఆ వెంకట మొట్టమొదటిగా ఎవరికీ పెట్టరు. ఈ శివ మొట్టమొదటిగా ఎవరికీ పెట్టరు. కనుక మనం పురాణాల్లో చదువుకున్న ఈ పేర్లు కలవాళ్ళల్లో వ్యక్తులు వేరే ఉన్నారు. వ్యక్తులు గాక ప్రజాపతులు ఎప్పటివారు? అప్పటికి యింకా మన సూర్యుడు పుట్టలేదు. మనసృష్టి పుట్టలేదు. ఇపుడు మనం చూస్తున్న కోటాను కోట్లైన తారకలు అనబడే సౌర కుటుంబములు ఉత్పత్తి కాలేదు చోటు అనే గోళంలో. మనచోటు అనే గోళం ఒక మర్రికాయ వంటిది. ఈ మర్రికాయలో కోటానుకోట్లు సూర్య కుటుంబములు ఉన్నాయి. వాట్లనే మనం తారకలు అంటున్నాం. ఈ మఱ్ఱికాయ ఉన్నన్నాళ్ళు ఉండి బద్దలైపోతుంది. ఇలాంటి మఱ్ఱికాయల గుత్తులు ఉన్నాయి. ఒక్కొక్క గుత్తిలో కొన్ని సౌరకుటుంబములు ఉంటాయి. ప్రతి సౌరకుటుంబానికి సూర్యుడు, వాడిచుట్టూ గ్రహములు, గ్రహాల్లో భూగోళము ఉంటాయి. దానికి సంబంధించి ఖండాలు, దేశాలు, సముద్రాలు అన్నీ ఉంటాయి. ప్రతి బీరకాయలో బీరగింజ, బీరపీచు ఉన్నట్లు మనం చూస్తున్న ప్రతి తారకలో కూడ ఇన్ని లోకాలు, ఇన్ని వ్యవహారాలు ఉన్నవే. అందుకని అవన్నీ పుట్టటానికి ముందు,

ఈ తారకాగణ కోటి అంటే మన సౌర కుటుంబములు రాకముందు, ఆకాశంలో ఏడు రంగుల వెలుగులు యిచ్చారు. సూర్యుడిలోంచి వచ్చిన వెలుతురు మాత్రమే మనం ఎరుగుదుము. అవి సూర్యుడి వెలుతురులోంచి వచ్చిన (చిల్లర మార్పుబడిన) రంగులు మాత్రమే. కాని సూర్యుళ్ళు తయారుకాక మునుపు చోటులో ఉన్నటువంటి రంగులు ఏడు వస్తాయి. వాళ్ళనే చిత్ర శిఖండినులని కొన్ని పురాణములు మొదలైన గ్రంథాల్లో చెబుతారు పెద్దలు, శాస్త్రజ్ఞులు. చిత్రం అంటే రంగులు రంగులుగా ఉన్నవి. శిఖండిలు అంటే తలపాగలు కలవారు అని అర్థం. వాళ్ళు పుట్టిన తర్వాత వాళ్ళలోంచి ఏడు రంగుల కిరణములు పుటతాయి. వాళ్ళే ఈ ఏడుగురును. ఒక్కొక్కడిలోంచి ఒక్కొక్క వెలుతురు వస్తుంది. ఆ వెలుతురు తారాకావ్యూహం తయారవ్వటానికి కావలసిన తేజోమయ రాసులు (Star dust) తయారవుతాయి. ఇంకా కొంచెం స్థూలమై, ఇంకా స్థూలమై అవి పరమాణువులవలె తయారై ఒక్కొక్కటి ఒక్కొక్క సూర్యుడిగా ఆకాశమనే మంచి భూమిలో విత్తనాలు వేయబడినట్లుగా అవుతాయి. మొక్కలు మొలుస్తాయి. అపుడు మనం ఎరిగి ఉన్న ఈ తారకలే మనచే చెప్పబడే ఈ సూర్యుళ్ళుగా వస్తాయి. కనుక ప్రతి సూర్యుడు తయారవ్వటానికి వెనుక ఈ ఏడుగురు గురువులు ఉంటారు. ఈ ఏడుగురితో తయారవ్వవలసిందే ప్రతి సూర్యుడియొక్క జీవితమూ కూడను. అందుకే ప్రతి సూర్యుడిలోంచి ఏడు కిరణములు వస్తాయి. అంతేకాక, ఈ వచ్చిన సూర్యుళ్ళలో కూడ, మొట్టమొదట వచ్చిన సూర్యుడు, వాడికన్నా ముందు వచ్చిన సూర్యుడు, యింకాముందు వచ్చిన సూర్యుడు, ఇంకా ముందు వచ్చినటు వంటివాడు, ఇంకా ముందు వచ్చినటు వంటివాడు యిలా ఈ ఏడుగురిలో ఒకడి తేజస్సుకన్న అంతకుముందు వచ్చినవాడి తేజస్సు ఎక్కువగా ఉంటుంది. తేజస్సు అంటే కంటికి కనిపించే తేజస్సుకాదు. మనం జ్ఞానం అని దేన్ని అంటామో అది తేజస్సు సూర్యుళ్ళలోంచి వస్తూ ఉన్నటువంటిది (జ్ఞానమనే వెలుగు). కంటికి కనిపించేది మనం చూస్తూ ఉన్న వెలుగు. దాని భౌతికదేహం మాత్రమే. సూర్యుడు ''త్రయీమయ మూర్తి'' అంటే కంటికి కనిపించే వెలుగు, మనస్సుకి కనిపించే వెలుగు, తర్వాత మనకు కనిపించే వెలుగు. దాన్నే ఆత్మకి కనిపించే వెలుగు అంటారు. కనుక ఈ మూడు రకములైన వెలుతురులలో కూడ ఒకడికంటే ఒకడు అనుభవం కలవారు. ఇలా కాకుండా

ఇంతకంటే పిల్లకాయ సూర్యుళ్ళు ఉంటారు. అంటే తర్వాత పుట్టినవాళ్ళు. ఈ ఏడుగురితో వాళ్ళు ఐదుగురు కలుస్తారు. ఈ పన్నెండుగురు కలిసి ఒక మండలంగా ఏర్పడతారు. అప్పుడు పన్నెండు సౌరకుటుంబాలు వస్తాయి. A group or cluster of twelve solar systems. ఒక కేంద్రం చుట్టూ తిరుగుతూ ఉంటాయి. ఆ కేంద్రం సూర్య అంతర్వర్తియైన పరమాత్మ. అంటే ఎందులోంచి సూర్యుళ్ళు వస్తున్నారో అలాంటి చోటులో ఉన్నటువంటి అంతర్యామియైన పరమాత్మ. The invisible Sun or the Spiritual Sun అని అంటారు. ఇపుడు మనం చూస్తున్న కోటానుకోట్ల తారకలు అన్నీకూడ ఇలాగే పన్నెండుగురు, పన్నెండుగురు చొప్పున గుంపులుగా, ఆశ్రమాలుగా తీర్చి ఉన్నాయి. అంతేగాని మన కంటికి కనిపిస్తున్నట్లుగా అయోమయంగా పారవేసినట్లు, అటు వచ్చేసినట్లు, ఇటు వచ్చేసినట్లు లేవు. దూరంగా ఎత్తైన ప్రదేశం నుంచి చూస్తే జనం కొట్టుకుంటున్నట్లు కనిపిస్తుంది. మన కళ్ళకి కనిపించేది, చెవులకి వినిపించేది పెద్దలెక్క ఏమిటి? జాగ్రత్తగా ఉండాలి. కనుక వీళ్ళందరూ పన్నెండుగురు పన్నెండుగురుగా వస్తారు. అందుచేతనే సంవత్సరములో పన్నెండు మాసములు ఏర్పాటవుతాయి, ప్రతి సౌరకుటుంబంలోను. భూగోళం మీద ఉన్నవాళ్ళకి 12 మాసాలు అనుభవం అవ్వటానికి వాళ్ళే కారకులు. కనుక 7 (ఏడు) అనే సంఖ్య, 12 (పన్నెండు) అనే సంఖ్య ఛందస్సులలో మొట్టమొదటివి. ఛందస్సులంటే వీటి కొలతలే. అక్షరాల కొలతలు, వేద మంత్రాలు, లెక్కలు కావు ఛందస్సు లంటే. వేద మంత్రాల్లో ఏం చెప్పారో వాటిని బుద్ధి కలిగి జాగ్రత్తగా చదువుకోవాలి. ఛందస్సు అంటే భ, ర, న, భ, భ, ర, వ, అనిగాని; లేకపోతే వేదమంత్రాలలో గాయత్రీ ఛందస్సు అంటే అందులో 24 అక్షరాలనిగాని ఉండవు. కొన్నింటిలో ఇరవైమూడే ఉంటాయి. వాటిని చెప్పటం లేదు ఇక్కడ. ఏవి చెప్తున్నాడో ఒళ్ళు దగ్గర పెట్టుకొని చదువుకోవాలి. వేదంగాని, ఉపనిషత్తులుగాని చదివినప్పుడు. ఛందస్సులంటే అర్థం దేశమునందు, కాలమునందు, పనిచేస్తూ ఉన్నటువంటి అంకెలు, రేఖలు (Numbers and figures). దీన్నే పైథాగరస్ the Celestial Geometry and the Divine Logic అన్నాడు. Divine Logic అంటే Arithmatic, Celestial Geometry అంటే patterns, designs. అక్కడ నుంచి అవి పుట్టకపోయినట్లు అయితే మనకి అంకెలు (Numbers) అర్థమయ్యేవి కావు. Geometry వచ్చి ఉండేది కాదు. అక్కడ

లేనివేవి మనకు బోధపడవు. ఇది గ్రహించాలి. వీటికి, వాటికి మనస్సులో సంబంధం గుర్తుంచుకోవాలి. ఇది గుర్తుంచుకున్న తర్వాత, ఇలా ఉన్నటువంటి వాట్లల్లో ఒక పన్నెండు ఒక సెట్టు. ఇపుడు మనం ఉన్నది. అందులో ఏడుగురు సూర్యుళ్ళని గురువులు అంటారు. ఒక్కో set లో ఐదుగురు సూర్యుళ్లని శిష్యులు అంటారు. జ్వాలాకూలుడు రాసినటువంటి 'ఆర్షజ్యోతిషము' Esoteric Astrology అనే గ్రంథములో ఇపుడు నేను చెప్పినటువంటి విషయాలు- వేదములు, పురాణములు వీటన్నింటిలోంచి తీసి విపులంగా ఇచ్చాడు. ప్రతి సౌరకుటుంబాల్లోంచి వచ్చిన గుంపులో ఉన్న సూర్యుళ్ళు ఏడుగుర్ని the sacred Suns అనగా గురువులు అంటారు. మిగిలిన ఐదుగుర్ని the non-sacred Suns అంటారు. అనగా శిష్యులు అని అంటారు. ఇది టెక్నికల్‌గా పెట్టిన పేరు. అంతకంటే ఇంకేంలేదు. మనకి రోజూ పొద్దున్నే నిద్రలేపుతూ ఉన్న సూర్యుడు ఆ ఐదుగురిలో ఒకడుగాని, పై ఏడుగురిలో ఒకడు కాదు. అంటే ఆధ్యాత్మిక స్థితిలో మన సూర్యుడు వాళ్ళ దగ్గర విద్య నేర్చుకుంటున్నటు వంటి స్థితిలో ఉన్నాడు. ఒక ఏడాదో, రెండేళ్ళో నేర్చుకున్నాక అది అవుతాడు. సూర్యుడికి ఏడాదో, రెండేళ్ళో అంటే మనకి కోటానుకోట్లు అయిన సంవత్సరములు. మన భూగోళం అప్పటికి ఉండదు. ఇట్లాంటి భూగోళాలు ఎన్ని వెళ్ళిపోతాయో! అంటే మన్వంతరాలు చాల వెళ్ళిపోయి, కల్పములు కూడ అప్పటికి నడిస్తే మన సూర్యుడు ఆ ఏడుగురిలో ఒకడు అవుతాడు. మన సౌర కుటుంబంలో ఉన్న ఏడుగురు ఎవరో తెలుసునా? మన ఉత్తర దిక్కున ఉన్న ధృవతారకు ఎడమ ప్రక్కగా ఉన్నది సప్తఋషి మండలం- "The Great Bear" అంటారు. సప్తఋషి మండలంలో ఉన్న మహానుభావులంతా నిత్య సూర్యులు. ఇంకాపైన చాలమంది ఉన్నారు. మన కందుబాటులో ఉన్నటువంటి మహానుభావులు. మన సూర్యుడిగారి గురువుగారు అంటే, మన నాన్నగారి గురువుగారు అన్నట్లు. సూర్యుడు మనకి తండ్రేకదా. మన నాన్నగారి గురువుగారు అంటే తప్పేమీ లేదు. అపుడు మనం ఈ సౌరకుటుంబంలో ఉన్నాం అనుకోండి. ఇందులో ఎవరున్నారు? ఒక సూర్యుడు, వాడిచుట్టూ తిరుగుతూ ఉన్నటువంటి గ్రహములు. అందులో ఒక భూగోళము. అందులో ఒక ఆసియా ఖండము, అందులో ఒక భారతదేశము, ఒక ఆంధ్రప్రదేశ్, ఒక విశాఖపట్టణము. ఎక్కడ ఉన్నామో! ఇక్కడ ఉంటూ ఉండంగ వీళ్ళమీద

నించి ప్రతిరోజూ నిరంతరమూ ఈ ఏడుగురు దగ్గరనించి ఈ ఒక్కొక్క సూర్యుడికీ పాఠాలు చెప్పబడుతూ ఉంటాయి. మన స్కూళ్ళల్లో, కాలేజీల్లో మనం ఎరిగి ఉన్నచోట చెప్పేవి, బట్టీ పట్టిస్తున్నట్లు కాకుండా తేజోమయము, జ్ఞానమయము చెప్పబడుతూ ఉంటాయి. అంటే అక్కడనించి తేజస్సు ప్రసారం (transmit) అవ్వటం, ఈయన గ్రహించటం (receive) అనే పద్ధతిలో వస్తాయి. అది మన సూర్యుడుచేస్తూ, తన కుటుంబానికి పంచి పెడుతున్నాడు. తన కుటుంబానికి పంచిపెట్టినందు వల్ల మన భూమ్మీద ఉన్న జీవరాసు లన్నింటికీ కూడ సప్త సప్తి; ఏడు ఏడుగా ఒక్కొక్కళ్ళకీ సంబంధించిన వాళ్ళుం ఒక్కొక్కళ్ళుం ఉంటుంన్నాం. ఈ భూమ్మీద మన అందరం కూడ ఏడు గుంపుల క్రిందకి వస్తాం. ఈ ప్రకారం గనుక జాగ్రత్తగా మనం తెలుసుకోగలిగినట్లైతే. అంటే ఒకడికి మూల పురుషుడు వశిష్ఠుడు అయి ఉండవచ్చు. ఇంకోడికి మూలపురుషుడు కశ్యపుడు అయి ఉండవచ్చు. వేదములోని విషయాలు ఇవి. కులాలకి మతాలకి సంబంధించినవి కావు. వెలుగుకి, సౌరకుటుంబాలకి సంబంధించినవి. కనుక ఒక గుంపు కశ్యపుడు, ఇంకొక గుంపు అత్రి మూలపురుషులుగా కలవాళ్ళు. మగ, ఆడ అనేది శరీర భేదమేకాని, వ్యక్తుల భేదంకాదు. గనుక మగ, ఆడ అనేది లెక్కచేయకుండా ఉన్న వాళ్ళందరినీ కూడ ఈ ప్రకారంగా జ్ఞానం తెలిసి గుంపులుగా అయితే ఏడు గుంపులు అవుతాము. ఇందులో మధ్య ఒకళ్ళు చెప్పేవి ఒకళ్ళకి అందటానికి యింకా వెలుగులు ఉంటారు. అలాగే సూర్యుడికీ మన భూగోళం మీద ఉన్న మనకీ మధ్యన కొందరు ట్యూషన్ చెప్పేవాళ్ళు ఉంటారు. వాళ్ళే ఈ పేర్లతో పుట్టిన ఋషీంద్రులు, యుగయుగాల్లో, కల్పాల్లో పుటుతూ ఉంటారు. వాళ్ళే శరీరధారులై భూమ్మీద ఈపేరుతో మొట్టమొదట పుట్టినవాళ్ళు. కనుక ఈ పేర్లు చెపితే శరీరధారులు మాత్రమే అని అనుకున్నవాళ్ళు తెలివితక్కువ వాళ్ళు. లేదా యివన్నీ సౌరకుటుంబాల పేర్లు, ఆ పేర్లతో వ్యక్తులు లేరు అనుకున్నవాళ్ళూ తెలివితక్కువ వాళ్ళే. వాడూ ఒక కన్ను పొడుచుకుంటాడు. వీడూ ఒక కన్ను పొడుచుకుంటాడు. జాగ్రత్తగా చూసుకోవాలి. రాముడంటే N.T. రామారావే అంటే తప్పుకాదు. N.T. రామారావు కూడ ఉన్నాడు కదా. అసలు N.T. రామారావే original అండి, అంటే కూడ తప్పుకాదు. దశరథ రాముడు కూడ ఉన్నాడు కదా. ఈ రెండింటిలో ఏ కన్నూ పొడుచుకుంటానికి వీల్లేదు. రెండు కళ్ళూ ఉండాలి.

కనుక ఈ విద్య జాగ్రత్తగా అర్థం చేసుకుని గుర్తుంచుకోవాలి. ఇపుడు వీళ్ళకి మనకీ మధ్యన ఉన్నవాళ్ళు ఆ మహానుభావుల శరీరంతో దిగివస్తారు. వాళ్ళు నిరంతరం భూమ్మీద ఉంటూనే ఉంటారు. ఇపుడూ ఉంటారు. వశిష్టుడని చెప్పదగినవాడు శరీరం ధరించిన ఋషి కొన్ని లక్షల సంవత్సరాల క్రిందట ఉన్నాడు. ఆ శరీరం ధరించినవాడు అంతకంటే పైస్థితికి వెళ్ళిపోతే యింకోడు ఆ స్థితిలోకి వస్తాడు. వశిష్ట స్థానంలో ఉన్న ఋషి అన్నమాట. వశిష్టుడు అనేది సంకేతనామం (code name) తప్ప నామవాచకం (Proper noun) కాదు. తాసిల్దారు గారు వెళ్ళిపోయారుట. అంటే ఇంకో తాసిల్దారు రాడూ! కలెక్టరు అంటే ఆయన పేరు కాదు. కలెక్టరుగారు ట్రాన్స్ఫర్ అయ్యి ఇంకో కలెక్టరు రాడూ! అలాగే యివికూడ. ఈ తెలివి లేకపోతే అయోమయంగా ఉంటుంది. కనుక పూర్వకల్పములలో వశిష్టుడు ఉంటాడు. ఈ కల్పంలోనూ వశిష్టులు ఉంటారు. ఇపుడు 20వ శతాబ్దంలో కూడ, మనకి వశిష్టులుగా పనిచేస్తున్నవారు భూమ్మీద ఉంటారు. వాళ్ళుండటానికి వీలుందా? అని సందేహం అక్కర్లేదు. వాళ్ళు ఉండటానికి వీల్లేనంత పాపాత్ములం కాదు మనం అంతా. ఎపుడూ వాళ్ళంతా ఉంటూనే ఉంటారు. కనుక ఈ సౌరకుటుంబాలు రాకముందు మొట్టమొదట తయారయ్యారే వాళ్ళని మొదటి సిద్ధులు లేక సిద్ధౌఘము అంటారు.

తర్వాత ఇపుడు మనం ఎరిగి ఉన్న సప్తఋషుల తారకలు; అది అయిన తర్వాత ఈ సూర్యుడిలోంచి వచ్చే ఈ ఏడు కిరణములు (7 rays) అంటే ఏడు రకములైన కిరణములు. ఒక్కొక్కటి ఒక్కొక్క జాతి చొప్పున ఏడేసి జాతులను పుట్టిస్తూ ఉంటాయి. భూగోళం మొత్తంమీద మనుష్యుల ఆకార వికారములు, చేష్టలు, స్వభావములు అన్నీ కలిపి లెక్కవేస్తే ఏడు రకాలైన స్వభావముల మనుష్యులే ఉంటారు. అంతకంటే తక్కువా ఉండరు. ఎక్కువా ఉండరు. వీళ్ళు ఈ సప్తఋషులు. ఇంకా వీళ్ళతో ఉన్నటువంటి తమాషా ఏమిటంటే అక్కడనించి మన సూర్యుడు దగ్గరకి, మన సూర్యుడు దగ్గరనించి మన భూమి దగ్గరకివచ్చి, తల్లిగర్భంలో మనం శరీరం ధరించక మునుపే వీళ్లు ఏడుగురు సభ చేస్తారు. వీళ్ళల్లో ఎవరూ దిగిరారు. వాళ్ళు అక్కడే ఉంటుండగ ఈ పుట్టేవాడి శరీరంలో డిప్యూట్ చేయబడిన ఏడుగురు క్రొత్తవాళ్ళు తయారవుతారు. మఱ్ఱిచెట్టు అట్లాగే ఉంటూ ఉండంగ మఱ్ఱికాయలో మఱ్ఱిగింజలు తయారవ్వటం లేదూ? ప్రతిగింజలోను మఱ్ఱిచెట్టు

తయారవ్వటం లేదూ? అంటే పెద్ద చెట్టు చస్తోందని అర్థమా? మఱ్ఱిచెట్టుకి ఉన్న మఱ్ఱికాయలు అన్నింటిలోనూ మనం చూస్తే కొన్ని కోట్ల మఱ్ఱిగింజలు ఉంటాయి కదా. మఱ్ఱి గింజలో పుట్టబోయేటు వంటి మఱ్ఱిచెట్టు ప్రతిష్ఠ వేయబడ్డది కదా. ఇన్నికోట్ల మఱ్ఱిచెట్లు ప్రతిష్ఠ చేయబడ్డాయంటే పెద్ద మఱ్ఱిచెట్టు తరిగిందా? తగ్గిందా? కనుక వీళ్ళు అవతరిస్తున్నారంటే మూల పురుషులు దిగివస్తారనిగాని, వీళ్ళు తరిగిపోతారని గాని, అరిగిపోతారని గాని కాదు. ఇంకెక్కడో మరొక పోస్టాఫీసు పెట్టారుట. అంటే ఉన్న పోస్టాఫీసు మాయమయిందని అర్థంకాదు. ఉన్న పోస్టాఫీసులు ఉండంగ క్రొత్త పోస్టాఫీసు పెట్టారు. ఇది సృష్టిలో ప్రక్రియ. విష్ణుమూర్తి అవతార మెత్తాట్ట అంటే దిగివస్తాడని కాదు. ఎక్కడున్నవి అక్కడే ఉంటాయి. ఇలా ఉన్నటువంటి దాంట్లో తలలోకి దిగివస్తారు ముందు. దీన్నే ప్రజాసర్గము అనే దానికి కావలసిన యజ్ఞము, సృష్టి యజ్ఞము అంటారు. దక్షుడి యజ్ఞము మొదలైనవన్నీ దీనియొక్క వర్ణనలే. ఈ యజ్ఞములో ఏడుగురు దిగివచ్చిన తర్వాత మొట్టమొదట తలకాయకి కావలసింది మాత్రమే తయారవుతుంది గర్భంలో. అక్కడనించి తోకగా క్రిందికి దిగివస్తారు. అంటే ఈ ఏడుగురూ మిగతా సిబ్బందిని దించటానికి ముందు ఒక స్టీమరులో ఇందులోకి దిగివస్తారు. ఆ స్టీమరునే శుక్రకణం (స్పెర్మటోజోవా) అంటారు. వాళ్ళు దిగివచ్చి గర్భం తయారైన తర్వాత మొట్టమొదట పెద్దవాళ్లు ఒక పదిమందో, పన్నెండుగురో ఉండటానికి; మొత్తం అంతా నిర్మాణం అవ్వడానికి కావలసినటువంటి ఇంజనీర్లు, శిల్పకారులు **(architects)** వాళ్ళూ ఉండటానికి మాత్రం ఏర్పాట్లవుతాయి. సప్తఋషి మండలం దగ్గరనించి మన సౌరకుటుంబంలో ఉత్తరధ్రువం మీదుగా టెలిఫోను కనెక్షన్‌లు ముందు వేయబడతాయి. ఎక్కడో ప్రోజెక్టు కడుతున్నారు అంటే టెలిఫోను కనెక్షన్లు వగైరాముందు యిస్తారు కదా, అలాగ. కనుక భూమ్మీద ఉన్న ప్రతివాడికి, జీవరాసులన్నింటికీ కూడ ఆ ఏడుగురు సప్తఋషుల దగ్గరనించి వెన్నెముకలో ఏడు కేంద్రముల టెలిఫోను నెంబర్లు వేయబడి ఉంటాయి. మనం వాడుకోలేదంటే వాళ్ళేం చేస్తారు? అది మన తెలివితక్కువ. మిగతావాళ్ళు వాడుకుంటారు. **Ignorance of Law is no excuse.** కనుక వాళ్ళతో ఎపుడూ మనందరికీ కనెక్షన్స్ ఉన్నాయి. ఆ కనెక్షన్స్ ఉన్న కేంద్రములో సూక్ష్మ కేంద్రములు కొన్ని, స్థూల కేంద్రములు కొన్ని ఏడు ఉన్నాయి. సూక్ష్మ కేంద్రములు కాక స్థూల కేంద్రములు ఏడింటి

పేరే షట్చక్రములు, సహస్రారము. ఈ ఏడుగురికి భార్యలున్నారు. అందులో ఒకాయన భార్య అయిన తారక ప్రక్కనే ఉంటుంది. అరుంధతి అంటారు. అదికాక మిగతా ఆరుగురికి వేరేచోట్ల ఉన్నారు. కృత్తికలు అనే తారకల గుంపు (cluster) అంటే అనేక రహస్య కారణాలున్నాయి దానికి. ఇపుడు దాంట్లోకి వెళ్ళొద్దు. కాని మనకి తలకాయ లోపల ఉన్నటువంటి కేంద్రములలో వీళ్ళతో ఏడు కేంద్రములు టెలిఫోను కనెక్షన్స్ చేయబడి ఉన్నాయి. కనుక మీరు యోగాభ్యాసం చేసినా, ప్రాణాయామం చేసినా, నిజమైన శాస్త్రీయమైన పద్ధతి (really scientific process) ఏదన్నా చేస్తే అంటే academically scientific process కాకుండా naturally scientific process కావాలి. శ్వాస పీలిస్తే జీవిస్తున్నామనేది scientific process. వీటన్నింటికీ కూడ కనెక్షన్‌లు link up అయి ఉంటాయి. ఎంతవరకు అవుతుంది? అంటే మీరెంతవరకు expand అవుతారో దీంట్లోకి అంతవరకు link up తయారవుతుంది. తర్వాత వీళ్ళ ఏడుగురు దగ్గరనించే మనందరికీ కూడ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు వాట్లని స్వీకరించేటువంటి శక్తి, మనస్సు, ఆ మనస్సును ఉత్పత్తి చేసుకొని వాడుకునే శక్తి వస్తుంది. మనస్సనేది ఒక పదార్థంగాగాని, ఒక శక్తిగాగాని, నిలబడి ఉన్నటువంటిది కాదు. It is like a gas jug. అంటే equilibrium తప్ప, అస్తిత్వము లేదు మనస్సుకి. ఇలాగ నీళ్ళు జెట్‌లా (jet) పైకి కొడుతూంటే నిలబడి ఉంటుంది చూడండి. దాని ఆకారానికి ఎంత అస్తిత్వమున్నదో మనస్సుకి కూడ అంతే అస్తిత్వమున్నది. అంటే మిగిలిన conditions అన్నీ కనుక తిన్నగా fulfil అయితే మనస్సనేది ఉంటుంది. అది లేకపోతే మనస్సు ఉండదు. నిద్రలోను అంతే. మనస్సుండదు, suspend అవుతుంది. Death లోను అంతే. మనస్సుండదు, suspend అవుతుంది. ఎంచేతంటే మనస్సనేది వేరే ఒక అస్తిత్వము కాదు. అది ఒక ఫలితము మాత్రమే. It is an equilibrium and not an existence అది గుర్తుంచుకోవాలి. అది తెలియక దానిమీదపడి కొట్టుకునే సైకాలజిస్టు శవంమీదపడి కొట్టుకునే ఒక నక్క వంటివాడు. సైకాలజీవల్ల వాడికి దొరికేది ఏం లేదు. అసలు మనస్సుకే అస్తిత్వము లేదు. ఇంక ప్రయోజనం ఏమిటి? కనుక ఇవి మనం సమన్వయం (culmination) లో జాగ్రత్తగా గుర్తుంచుకోవలసినవి. ఇలాంటి అవినాభావ సంబంధము మనకి వాళ్ళకీ ఉన్నది. మనకి పంచేంద్రియములు కూడ వీళ్ళ వల్లనే పనిచేయటం మొదలు

పెడతాయి. కన్ను చూట్వానికి. కంటికి, వెలుతురుకి, సూర్యుడికి మూడుచోట్లకి సంబంధించి టెలిఫోను కనెక్షన్స్, టెలివిజన్ కనెక్షన్స్ యిస్తారు. కంటికి ఒకటి ఉండాలి. వెలుతురుకి ఒకటి ఉండాలి. సూర్యుడికి ఒకటి ఉండాలి. ఈ మూడు కలిస్తేనే కదా రూపం అనేది కన్పిస్తుంది. అలాగే శబ్ద గుణకమైనటు వంటి ఆకాశానికి, శబ్దానికి, చెవికి ఇంకో త్రికోణ కనెక్షను (triangular connection), వీడియో, ఆడియో మొదలైనవి. ఇలాగ ఐదు కనెక్షన్స్ యిస్తారు. ఈ సంబంధాలు గుర్తుంచుకోవాలి కనుక మొదటి సిద్ధులు, వీరి దగ్గరనించి వచ్చినవారు. వీరి తరఫున భూమ్మీద పనిచేస్తున్న సిద్ధులు, మహానుభావులు ఉంటారు. వాళ్ళపేర్లే సంకేతములుగా ఇంద్రుడు, బృహస్పతి మొదలైన దేవతల పేర్లుగా గాని ఋషుల పేర్లుగా గాని ఉంటూ ఉంటాయి పురాణాల్లో. కనుక భూమ్మీద వీళ్ళకి వాళ్ళకీ మధ్యన ఉన్నటువంటి intermedia గా వాళ్ళు పనిచేస్తూ ఉంటారు. భూమ్మీద ఉన్న, మట్టిలో ఉన్న ఖనిజములు, ఆ ఖనిజములో ఉన్న ప్రతి పరమాణువు కూడ మనలాంటి జీవులే. ఒక్కొక్క జీవి ఒక్కొక్క పరమాణువుగా బయల్దేరుతుంది. మనం కూడ లోపల జీవిగా, పరమాణువుగా ఉన్నాం. ఈ శరీరమంతా బరువు. ఇది మనంకాదు. బెడ్డింగు, పెట్టె వగైరా నెత్తిన వేసుకొని నేను నడుస్తున్నాను అంటే రైటా? నేను నడుస్తున్నా, అదంతా నేనా? నేను అనేది పరమాణువే గాని, ఇంకేంకాదు. అది ఇపుడు చెప్పుకుంటాం సూత్రంలో. కనుక ఈ ఖనిజములలో ఉన్నవాళ్ళు కూడ పరమాణువులే. ఇందులో ఉన్న జీవులను మేల్కొలుపుతూ ఉంటారు ఆ ఏడుగురు. ఏవిధంగా మేల్కొలుపుతూ ఉంటారు? ఖనిజములకున్నా, వృక్షములకున్నా ఉన్న సంబంధంచేత మేలుకొలిపితే ఖనిజములు వృక్షములకు శిష్యులుగా పనిచేసి, వృక్షముల శరీరములలో ఉన్న భాగములుగా పనిచేసి, వాటి ఖనిజత్వపు స్థితి అయిపోయిన తర్వాత వృక్షత్వ స్థితికి వస్తాయి. దీన్నే సృష్టి పరిణామము అంటారు. ఖనిజంగా ఉన్నపుడు పితృదేవతలకి సంబంధించిన 'అగ్నిష్వాత్తులు' అనే ప్రజ్ఞలో ఉన్నాయి. అంటే న్యూక్లియర్ consciousness. వృక్షత్వములోకి వచ్చేటప్పటికి 'ఇంద్రాది దేవగణముల' యొక్క ప్రజ్ఞలోకి వచ్చినాయి. అంటే sensations అనే awakening కి వచ్చినాయి. ఖనిజముల (minerals) లో sensation ఉండదు. కాని ఏ ఖనిజముయొక్క రంగు, రుచి, వాసన దానిదే అనేటువంటి ప్రజ్ఞ వాటి దగ్గర ఉంటుంది. కనుక న్యూక్లియార్ consciousness లోంచి plant

awakening అంటే వేదనాత్మకమైనటు వంటి ప్రజ్ఞ మేల్కొన్నది. అందులోంచి జంతువులు ఈ చెట్లను తినగా జంతువుల శరీరంలో ఉన్నటువంటి జీవకణములుగా కొన్నివేల పర్యాయములు పనిచేసి ఈ వృక్ష పదార్థములు జంతువులుగా పరిణామము చెందుతాయి. ఇది మూడవది. జంతువులు, వృక్షములు, ఖనిజములు మూడింటిని మానవుడు తింటాడు. కనుక, వాడి శరీరంలో కణములుగా పని చేసిచేసి తర్వాత ఉన్నటువంటి నరత్వములోకి వస్తాయి. ఖనిజములో న్యూక్లియర్ awakening వృక్షములలో sensational awakening వస్తుంది. జంతువులలో వచ్చేటప్పటికి senses, location, brain, nerves separate అవుతాయి. అంచేత జంతువులకు నెప్పి location తెలుస్తుంది. చెట్లకి location రాదు. ఒక ఆకు తుంపితే చెట్టు మొత్తానికి నెప్పి పెడుతుందిగాని, తుంపిన చోట నెప్పెట్టదు. ఎందుకని? nervous system, brain అనేవి యింకా separate చేయబడలేదు. మొత్తం అంతటిలో కలిసి ఉన్నాయి ఆధారంచేత. దీని తర్వాత బిల్డింగు, యింకా బాగా శాస్త్రీయమైనటు వంటి పద్ధతిలో, బోర్డింగ్‌కి, లాడ్జింగుకి మొదలైనటు వంటి వాటన్నింటికీ పనికొచ్చేట్టుగా తయారు చేయబడింది. అంటే sophisticated mechanism. కనుక ఈ స్థితిలోకి వెళ్ళాక దీంట్లో స్వాతంత్ర్యము యివ్వబడుతుంది మొట్టమొదటిగా. ఇక్కడ వరకు మాత్రం జంతువులుగాని, వృక్షములుగాని ఆకలి వేస్తేనే అన్నం తినగలవు. దప్పిక వేస్తేనే నీరు స్వీకరించగలవు. నిద్రవచ్చినపుడు నిద్రపోగలవు. నిద్రకాయవు. తర్వాత ఋతువైనపుడు మాత్రమే ఆడ, మగ సంబంధములు చరించగలవు. ఇష్టం వచ్చినట్లు చరించలేవు. వీటన్నింటికీ మనకు వివేకం అనేది యివ్వబడి స్వాతంత్ర్యము యివ్వబడ్డది. కనుక యిష్టం వచ్చినట్లు స్వాతంత్ర్యాన్ని ఉపయోగించి, దుర్గంధ భూయిష్టములైన మురికి జన్మలు ఎత్తుతుంటాము. అంటే ఆకలివేసినా, వేయకపోయినా తినేస్తూ నరుడనే పరమ ఛండాలమైన జన్మలు మొట్టమొదట మనమంతా కొన్ని జన్మలు జీవిస్తాము. స్వాతంత్ర్యము మొట్టమొదటిగా యివ్వబడ్డపుడు misuse చేస్తాం. అది అయిన తర్వాత మళ్ళీ సర్దుకొని కొన్నివేల జన్మలైన తర్వాత మళ్ళీ మామూలు నరజన్మలోకి వస్తాము. అక్కడనించి ఆపైన ఏమున్నది? ఈ క్రింద ఏమున్నది? ఈ మధ్యన ఉన్నటువంటివే ప్రకృతిలో పనిచేస్తున్న దేవతలు (intelligences that are working in nature) అని తెలుస్తుంది. వాళ్ళల్లో అనేక గణములు

ఉన్నవి. కనుక దేవతల వలన ఉత్పన్నములైన ఖనిజములుగా మేల్కొని, యిట్లాగ సృష్టి పరిణామము మానవునిదాక వచ్చి తిరిగి వెడుతుంది. ఇలాగ భూమ్మీద ప్రతి సంవత్సరము జరుగుతూ ఉంటుంది. నీళ్లు క్రిందినించి పైకి వెళ్ళి పైనించి క్రిందకి వస్తూ ఉంటాయి ప్రతి సంవత్సరము. అప్పుడేం జరుగుతుంది? ఖనిజములన్నీ కూడ వృక్షం శరీరంలోకో, జంతువు శరీరంలోకో, మనిషి శరీరంలోకో స్వీకరించబడతాయి. అనగా inorganic substances అన్నీ organic substances అవుతాయి. తరువాత మళ్ళీ శరీరం వదిలిపెట్టాక ఆ చెట్టుగాని, ఈ గడ్డిగాని, ఈ మనిషిగాని, ఆ కుక్కగాని, ఈ కుందేలుగాని ఏమౌవుతాయి? అవన్నీ మళ్ళీ వాటి వాటి ఖనిజములలోకి వెళ్ళిపోతాయి అంటే organic substances, inorganic substances లోకి వెళ్ళిపోతాయి అనగా స+అశనములు, అనశనములు అంటే organic and inorganic. 'సాశనానశనే అభి' ఒకదాని కొకటి అభిముఖంగా సంవత్సరము మొత్తముమీద ఉచ్ఛ్వాస నిశ్వాసల్లే జరుగుతూ ఉంటుంది. దీనికోసమే నీళ్లు ఆరుమాసాలు క్రిందినించి పైకివెళ్ళటం, అక్కడనించి మేఘాలుగా కట్టుకొని ఆరుమాసాలు పైనించి క్రిందికి రావటం జరుగుతూ ఉంటుంది. దీన్ని అనుసరించి పెద్దలు ఏర్పాటు చేసుకున్నవే, బ్రహ్మచర్యాశ్రమం, దాని తర్వాత గృహస్థాశ్రమం అనేది. ఈ లోపల శరీరంలో పస అయిపోతే మిగతా ఆశ్రమాల్లో తప్పుకోండి అన్నారు. కనుక ప్రకృతిని చూచి అపౌరుషేయమైనటువంటి పరమ పవిత్రమైన గ్రంథములుగా మానవునికి యివ్వబడినవి యివి. ఇదే మత్స్యావతార కథలో చెప్పబడినది. వేదాలన్నీ పోయినాయి. ఎక్కడికి పోయినాయి? అంటే మళ్ళీ వచ్చినాయి అన్నారు. మనం ఎపుడైతే ఉంటామో, సూర్యోదయం, సూర్యాస్తమయం అపుడే ఉంటాయి. అవి ఎపుడైతే ఉంటాయెూ, అహోరాత్రాలు, వాటిని తెలుసుకుంటం అపుడే ఉంటుంది. అవి ఎపుడైతే ఉంటాయో కాలము, దానితో పనిచేయడం అన్నీ వస్తాయి. ఎందుకంటే వీడిలోంచి పుడతాయిగాని, అవి పుట్టినవి పాతుకుపోయి ఉండలేవు. ఇది మత్స్యావతార కథలో ఉన్నటువంటి ఆంతర్యము. సిద్ధ దర్శనము అంటే ఈ మధ్యన అందరూ పనిచేస్తూ ఉంటారు. అంటే ఖనిజస్థితి నించి పరిణామము చెంది జీవుల్ని తిన్నగా రైలో, విమానమో, బస్సో ఎక్కించి పై స్థితికి పంపిస్తున్న వాళ్ళు కొంతమంది ఉంటారు. వాళ్ళని కూడ సిద్ధులనే అంటారు. వాళ్ళని ఇంగ్లీషులో Masters

of Wisdom అంటారు. వాళ్ళలోని ఒకళ్ళిద్దరివే మనం చెప్పుకున్న మరుపు, దేవాపి, జ్వాలాకూలుడు మొదలైనటువంటి పేర్లు. సిద్ధ దర్శనము అనే మాటకి ఈ సూత్రం ఇప్పుడు మళ్ళీ చదువుకోవాలి. లేకపోతే సిద్ధులంటే ఏదో సినిమాలోలాగ ఒక కమండలం అదీ పుచ్చుకొని గోచీ పెట్టుకొని కనిపించడం కాదు. వాడు చేస్తున్న పనినిబట్టి సిద్ధులనేవి కాని మనకు తెలియకపోయినా వాడు సిద్ధుడే. మనకి తెలిస్తే తెలిసిన నాటి నుంచి మనకి వాడు సిద్ధుడని తెలుస్తుంది. కనుక వాడు సిద్ధుడవునా కాదా అనేది మనకి తెలియటం సర్టిఫికెట్టు కాదు. లేదా నేను పదిమందిని అక్కడపెట్టి వాళ్ళచేత సిద్ధుడని పిలిపించుకోవటం అంతకంటే కాదు. మాకు సిద్ధి వచ్చింది. మేము సిద్ధులం, అష్టసిద్ధులు పొందాం. ఇట్లాంటి అర్థాల్లోను ఈ సిద్ధులనే పదాలు వాడుతూ ఉంటారు. వాడికి సిద్ధులున్నాయిట అంటే, వాడన్నది కాదంటే చేతబడి చేస్తాడు అన్నట్టు. అది దాటి, అంతకంటే మంచి అర్థం ఉండదు. సిద్ధులున్నాయిట అంటే భయపెట్టడానికి. నిజంగా సిద్ధులున్న వాడి దగ్గర భయపట్టానికి అవసరం లేదు. వాడి దగ్గర నిర్భీతిగా మనం పిల్లకాయల్లాగ ఉండచ్చు అది సిద్ధులంటే. కనుక సిద్ధులు ఎంత పరమ పవిత్రములో అంత భీతావహములుగా కూడ అర్థం చేసుకోబడుతున్నాయి. ఇపుడు మనం చెప్పుకున్న వాళ్ళు సిద్ధులయొక్క వరస. వాళ్ళల్లో మన కందుబాటులో ఉన్నటువంటి సిద్ధులు మన రోడ్లమీద కూడ తిరుగుతూ ఉంటారు. మన రైలు స్టేషన్‌లోను ఉంటారు. మన బస్టాండులోను ఉంటారు. మన విమానాశ్రయాలలో ఉంటారు. ఎక్కడ పని ఉంటే అక్కడ ఉంటారు. ఏం పని వాళ్ళకి? యిదే పని. ఇది సిద్ధులయొక్క వరుస. ఈ వరుసనే Hierarchy (పరంపర) అంటారు.

## 34. ప్రాతిభాద్వా సర్వమ్‌।

ప్రాతిభాత్‌+వా = ప్రాతిభము (ప్రతిభ) యందు; (సంయమాత్‌ = సంయమం చేస్తే) సర్వమ్‌ = సమస్తము (తెలియును).

**తన దర్శన జ్ఞానముపై సంయమం చేసినచో సమస్తము తెలియును.**

**వివరణ :** ప్రాతిభము వలన సర్వము అంటే సమస్తం తెలుస్తుంది. ఒకటి తెలియదు అనే పాయింటు ఏం లేదు. ప్రాతిభం అంటే ప్రతిభ. దానియందు సంయమంచేస్తే సర్వం తెలుస్తుంది. పిల్లి అంటే మార్జాలం అన్నట్లు వుంది. ప్రతిభ యందు సంయమం చేయాలి. ప్రతిభ అంటే గదికి ఒక చిన్న కన్నం పెట్టాం. ఆ లోపల పెద్దలైటు పెట్టాం. ఈ కన్నంలోంచి వెయ్యి candle power light పెట్టామనుకోండి. బ్రహ్మాండముగా బయటకు కొడుతోంది కదా. యిక్కడ నుంచి 150 candle power light పెడితే దాని లైటు ఏమౌతుంది? ఆ light, ఈ light ని లోపలకి తీసుకెడుతుంది. అలాంటి పద్ధతి (process) ఒకటి వుంది. ప్రతిభ అనే మాటకి అర్థం ఏమిటంటే మీలో వున్నటువంటి ఇందాక తలకాయలో వెలుగు కనిపిస్తుందన్నాడే దాని సంగతి యింకాస్త చెబుతున్నాడిక్కడ. ఆ వెలుగు మీదనే కనుక యిదేమిటి అని మనస్సుపెట్టి సిద్ధపురుషుల కోసం వెతికితే వాళ్ళు కనిపిస్తారు. అలాకాకుండా ఈ వెలుగే సర్వస్వం. దీనినే ఆశ్రయిస్తున్నాను. ''ధియోయోనః ప్రచోదయాత్‌'' అంటే మీకు తెలియనది లేదు. సమస్తం తెలుస్తుంది. అంటే నాకిది కావాలి అని అడగకుండా ధ్యానంచేస్తే నీకు తెలియనిది లేదు నాయనా అన్నాడు. ఏదన్నా కావాలి అని అడిగితే అది తెలుస్తుందన్నాడు. C.V.V. గారు Namaskarms Master C.V.V. అని ప్రేయరు చేసుకోండి అన్నారు. చేసుకుంటే ఏం వస్తుందంటే, మంచిది అన్నారు. ఇంకేం చెప్పలేదు. ''గురువుగారూ! తేళ్ళు ఎక్కువగా వున్నాయి మా తోటలో తేలుకేదన్నా యిస్తారా?'' అంటే ''ఆ'' తీసుకోండి, అన్నాడు. Scorpion sting rectification adjustments. Namaskarms Master C.V.V. తగ్గిపోయింది. పాముకేమన్నా యిస్తారా? యింట్లో పాములు తిరక్కుండా, అంటే Snake escape adjustments. పాములు లేవు. తిరుగులేదు. ఇట్లాగ అడిగాడు ఒకడు. అడిగిన దానికల్లా ఒక్కో మంత్రం చెప్పాడు. చెప్పినది

ప్రతిదీ ఒక్కమాటు చేస్తే పనిచేస్తోంది. ఇది రోజూ చేసుకోవాలి కదా, ప్రతీ మంత్రమున్నూ ప్రేయరులో. ఆ చేసుకునేటప్పటికి తడిసి మోపెడు అవుతోంది. 45 నిమిషాలు అవుతోంది. ఏదన్నా సహస్రనామం చేసినంత పని అవుతోంది. లలితా సహస్రనామం+విష్ణు సహస్రనామం కలిపిచేస్తే 45 ని॥లు అవుతోంది. అదికూడ స్పీడుగా కక్కుర్తిగా చదివితే. వీడు చివరికి అడిగాడు. ఏమండీ రోజూ మీరిచ్చిన యిన్ని మంత్రాలు చేసుకుంటున్నాం. గురువుగారూ ఇవన్నీ చేయాలా? అన్నాడు. అక్కర్లేదు అన్నాడు. గురువులు అట్లా ఉంటారు, అదేమిటండీ అక్కర్లేదంటారు. మరి ఎందుకిచ్చారు? అంటే, నువ్వు అడిగావు కనుక యిచ్చాను అన్నాడు. మొట్టమొదట నేను ప్రేయరు ఇస్తే నీకేం రోగమా? తేలుకి మంత్రమియ్యి. దాని కొండెలాగ ఉంది వీడి బుర్ర. అడిగాడు మంత్రమిచ్చాడు. ప్రేయరు యిస్తే తేలుకి కూడ పనిచేస్తుందనే ఇంగిత జ్ఞానం లేదా? అంటే ప్రేయరు కూడ పనిచేస్తుందా సార్! అన్నాడు. చూడు అన్నాడు. పనిచేసింది. అయితే యివన్నీ ఎందుకండి? అవును, ఎందుకు? అన్నాడాయన. అలాంటివి యివన్నీ కూడను. ఈపై చెప్పినవన్నీ ప్రతిభ మీద తిప్పితే. ప్రతిభ అంటే ఎట్లా వుంటుంది? ఆ వెలుగు మనకి తెలుసునా? ఒక్కొక్కపుడు విద్యార్థి higher mathematics లో calculations చేస్తున్నవాడు రాత్రి 12, 1 గంట వరకు చేసి చేసి problem solve కాక అక్కడ పెట్టి పడుకుంటాడు. చూసారా. మళ్ళీ 1 గంటో 2 గంటలో అయ్యేటప్పటికి మెలకువ వస్తుంది. పుస్తకం తీసేటప్పటికి answer వచ్చేస్తుంది. బుర్రలో సిద్ధంగా వుంటుంది. ఇలాంటివి ఉన్నాయా? లేవా? ఎక్కడనుంచి వచ్చిందండి? అంటే వాడిలో ఒక వెలుగున్నది. ఆ వెలుగులోకి అనుసంధానం (apply) చేయటం చాతనవ్వాలి. పొరపాటున అనుసంధానం (apply) అయినా వస్తుంది జవాబు. వాడు నిద్రపోతూ ఉండంగా అబ్బ, మనకి రాలేదు అని అనుకొని మనస్సు సమర్పణ చేసి పడుకున్నాడు అనుకోండి. పొరపాటున అనుసంధానం అయ్యింది వెలుగులోకి. టెన్షన్ మీద పడుకుంటే చచ్చినా అనుసంధానం అవ్వదు. రాదు. రాలేదు పోనీలే, అదే వస్తుందిలే అనే relaxation మీద పడుకున్నాడు, కనుక అక్కడికి apply అయింది. ఎపుడైనాసరే ప్రతిభ మీకు అందాలంటే ఏం జరగాలి? ప్రపంచంలో వున్నటువంటి మనం చేస్తున్న పనులమీద వున్న హడావుడి వుంది చూడండి.

దానినుంచి మనస్సు యువతలకి వస్తే మీ వెలుగులో మీకు లోపల వున్నటువంటి వెలుగుతో సంబంధం వస్తుంది. కనుక ప్రతిభ అంటే అది. అలాగే ఒక పదిమందిని చంద్రుడి మీద, చెరుకు గడమీద, మహాభారతం మీద, సముద్రంమీద ఏదన్నా ఒక శ్లోకం చెప్పండి అని కవుల్ని అడిగాట్ట భోజరాజు. సమస్య ఇచ్చాడు. సమస్య యిచ్చినవాడు ఎన్ని పాదాలు యివ్వాలి? ఒకపాదం యివ్వాలి. పూరణం చేసేవాడు మూడు పాదాలు పూరించాలి. వాడు రెండు పాదాలు యిచ్చాడు సమస్య. అంటే ఎంత మిగిలింది కవికి? రెండు పాదాలే మిగిలి వున్నాయి. ఆ రెండు పాదాల్లో ఏం చెప్పాలిట, చెరుకుగడని గురించి చెప్పాలి, సముద్రం గురించి చెప్పాలి, చంద్రుడి గురించి చెప్పాలి, మహాభారతాన్ని గురించి చెప్పాలి. ఎవడు చెబుతాడు? అంతా దణ్ణంపెట్టి ఊరుకున్నారు. మీరే చెప్పండి అన్నారు కాళిదాసుని. అపుడు ఆయన చెప్పాట్ట. లేచి ''కాళిదాస కవిర్భూతే'' అంటే కాళిదాస కవి చెప్తున్నాడు అన్నాట్ట మూడో పాదంలో. అంటే మూడవపాదం కూడ అక్కర్లేదు తీసేసుకోమన్నాడు. ఒకపాదం చాల్లే! అఘోరించేవులే, అన్నట్టుగా చెప్పాడు. ఏమిటి అంటే ''ప్రతి పర్వ రసోదయం'' ప్రతి పర్వమునందు రసం వుదయిస్తుంది అన్నాడు. అంటే చంద్రుడికి పూర్ణిమయందు రసోదయములో వుంటాడు. సముద్రానికి పూర్ణిమ, అమావాస్యలే రెండు పర్వాలు. వాడికి రసోదయం నీళ్ళుపైకి ఎగురుతాయి. చెరుకు గడకి పర్వం అంటే కణుపు. కణుపు దాటిన తర్వాత రసం ఎక్కువవుతూ వుంటుంది. పైనుంచి క్రిందికి వెళ్ళేటప్పటికి. మరి మహాభారతానికి ఆదిపర్వం దగ్గరనుంచి మొదలుపెడితే పర్వం పర్వానికి రసం ఎక్కువవుతుంది చదువుకునే వాడికి. ఇంటికిపోయి చదువుకోండి అన్నాడు. 'కాళిదాస కవి భ్రూతే' అని మూడోపాదం లాగేసాడు. నాల్గోపాదం చాలు అసలు. ఆ పాదంలో సగం కూడ చాలు నువ్వు బాధపడతావని నాల్గోపాదం చెప్పానన్నట్టుగా చెప్పాడు. దాన్ని ప్రతిభ అంటారు. మిగతావాళ్ళంతా మెకానికల్‌గా రాస్తారు. ఏ పనిచేసినా అంతే. రాయటం ఒక్కటేకాదు. చదవటం ఒక్కటే కాదు, మాట్లాడటం ఒక్కటే కాదు. ఉపన్యాసం ఒక్కటే కాదు. ఏదైనాసరే ప్రతిభ అంటే ప్రతిభాసించునది. ఉదాహరణకి ఒక శాస్త్రాన్ని గురించి మీరు సభలో చెబుతున్నారనుకోండి. ఎవడన్నా లేచి కొన్ని ప్రశ్నలు వేశాడనుకోండి. అంతకుముందు మీరు ఆ అధ్యాయం జీవితంలో చదవలేదు అనుకోండి.

అపుడు వెంటనే మీ మనస్సుకి కొన్ని తట్టుతాయి, అవి చెప్పేస్తారు. వాడు తృప్తి పొందాడు. కూర్చున్నాడు. మీరు యింటికి వచ్చి చూసుకుంటే శాస్త్రంలో మీరు చెప్పిన సమాధానములు కరెక్టు. ఎక్కడనించి వచ్చినాయి మీ బుర్రలోకి? పూర్వ జన్మలో మీరు చదువుకొని ఉంటే అయినా వచ్చి వుండాలి. లేకపోతే ఈ ప్రపంచంలో లక్షల కోట్లమంది ఒక్కో శాస్త్రాన్ని చదువుకుని వదిలేసినటు వంటివాళ్ళు. ప్రతీవాడు వాడు చచ్చిపోయాక వాడు చదువుకున్న శాస్త్రం ఎక్కడ వుంటుంది? ఆకాశంలో వుంటుంది. దాంట్లోంచైనా వచ్చి వుండాలి. దాన్నే Blavetsky " Akashik Records" అంటుంది. దాని సంగతి తెలియాలంటే చాల శాస్త్రీయమైన దృక్పథం కావాలి. పుస్తకాలు దాచటానికి పేజీలు, పేపర్లు అక్కర్లేదంది. చదివేసేసి పుస్తకం తగలబెట్టేయండి. వాడి బుర్రలోంచి ఆకాశంలో రికార్డు అవుతుంది. మళ్ళీ యింకొకడు దాంట్లోంచి తీసుకోవచ్చు. అలా ఆవిడ తీసినటు వంటివి చాల వున్నాయి. ఉదాహరణకి Secret Doctrine రాస్తూ క్రిందని foot notes అనిచెప్పి కొన్ని పుస్తకాలు యిస్తే ఒక పుస్తకం ప్రపంచంలో ఎక్కడాలేదు. ఆవిడ quote చేసిన పుస్తకం వూహించి రాసిందన్నారు. కాని కొటేషన్స్ ధారాళంగా యిచ్చేసింది. ఆవిడ చనిపోయిన నాలుగు సంవత్సరాల తర్వాత భూగర్భంలోంచి తవ్వితే బయటపడ్డ పుస్తకాల్లో ఆ పుస్తకం వున్నది. ఆవిడ చెప్పినటువంటి పేజీలు ఆ రాత ప్రతితో సరిగ్గా సరిపోయాయి. ఆవిడ చెప్పిన పేజీల్లోనే ఆవిడ చెప్పిన పంక్తులున్నాయి. ఎక్కడనించి అందుకున్నావు? అంటే Akasic Records లోంచి అందుకున్నాను అని చెప్పింది. ఆవిడ పోయిన తర్వాత బయటపడ్డ పుస్తకాల నుండి పనిచేస్తూ ఉండడాన్ని ప్రతిభ అంటారు. కవి కాదలచిన వాడికి ప్రతిభ లేకపోతే వాడు కవికాడు. ప్రతిభ, వ్యుత్పత్తి, అభ్యాసం అన్నారు. ఉట్టి ఉత్పత్తి. అంటే పాండిత్యం వున్నటువంటి వాడు. వాడు పద్యాలు రాసినా, శ్లోకాలు రాసినా గూడ్సు బండీలల్లే వుంటాయి. నిండా సరుకు వుంటుంది. అలా ఏడుస్తూ, ఈడుస్తూ వుంటుంది బండి. బరువుగా ఉంటాయి. అంటే full of information. పద్యాల్లోగాని, శ్లోకాల్లోగాని వాడెవడో కంద పద్యాల్లో ఎక్కాలు రాసాడు. అలాగాక ప్రతిభ ఉన్నటువంటి వాళ్ళు చరకుడు, శుశ్రుతుడు మొదలైనవాళ్ళు. వాళ్ళు సిద్ధమకర ధ్వజాన్ని గురించి శ్లోకం రాసినా అద్భుతమైన కవిత్వం వస్తుంది. దీన్ని

ఇంగ్లీషులో intuition అంటారు. Psycology వాళ్ళు ఒప్పుకోరు. దీన్నే అంతర్ దర్శనము (intuition) అంటారు. (ఎపుడూ ఉంటుందా?) ఎపుడూ ఉండటానికి వీలుంది. కాని ఉండనీయం కనుక ఈ ఉండనీయ నటువంటి వాడికి అజాగ్రత్తగా ఉన్నపుడు పనిచేస్తుంది అంటే ఈ intelligent man అజాగ్రత్తగా ఉన్నపుడు intution పని చేస్తుంది. ఎందుకంటే conscious intelligence కదా మనది. అది limited. వెనుక ఉన్నది unlimited. ఇది పనిచేయనపుడు అది పనిచేస్తుంది. కాని ఇది హడావుడి పడుతూ వూరికే పరిగెడుతూ ఉంటే impressions ఇస్తున్నా ఇది అందుకోలేదు. రోగికి ప్రమాదకరంగా వుంది. ఒక గంటలో అటో యిటో అనుకుంటున్నారు. ఫలాన మందులేదు. టెలిఫోను చేశాము. పాపం ఆ షాపువాడు కారు వేసికొని తెచ్చాడు, ఇవ్వటానికి. చేతికి యిచ్చాడు. చేయి వణికి కిందపడేసి పగలగొట్టాం. అలా వుంటుంది. ఈ consciousness mind చేసే పనులు. అంచేత అందదు. వాడు తెచ్చి యిచ్చాడు. కాని వీడికి ఎలా వుంటుందో అనే హడావుడిలో వీడు ఏం చేస్తున్నాడు? వాడు చచ్చిపోయేంత పని చేశాడు. ఆ మందుసీసా చేతిలోంచి జారవిడిచాడు. అలా వుంటుంది. మనం ఎరిగి వున్నటువంటి intelligence. intution అది conscious intelligence. అది వున్నంతసేపు intution అందదు. దాన్ని చిత్తవృత్తి అంటారు. అది నిరోధం అయితే ఇది పనిచేస్తుంది. అందుకని 'ప్రాతిభాద్వా' ప్రతిభ మీద కనుక సంయమాన్ని focus చేస్తే 'సర్వమ్' తెలియనిదంటూ లేదు నాయనా. ఇది తెలియాలి అనేదాని మీద పెట్టకుండా, ఆ వెలుగుమీద పెట్టి ఆ వెలుగునే నువ్వు ధ్యానం చేస్తూ వుంటే నీకు ఎపుడు ఏది కావాలో అది తెలుస్తూ వుంటుంది అని అర్థం. లేకపోతే మీరు ఏది కావాలి అని అడిగారో అదొక్కటే తెలుస్తుంది. యూనివర్సిటీ సిలబస్ లాగ. అది కావాలో, ఇది కావాలో చూసుకోవాలి. ''ప్రాతి భాద్వా సర్వం'' అన్న దానికి జ్వాల్‌కూల్‌గారు యిచ్చిన అనువాదం. All things can be known in the vivid light of intuition. అది ఆయన చెప్పింది. దీన్నే దర్శన జ్ఞానమ్ అనికూడ అంటారు. దీన్నే పెద్దలు అంతఃకరణం, పరిశుద్ధ అంతఃకరణం అంటారు. అంతకుముందు అపరిశుద్ధ మనేవి నాలుగుంటాయి. మనో, బుద్ధి, అహంకార, చిత్తాదులు పరిశుద్ధి అయితే ఒకటే వుంటుంది. అది వెలుగు రూపంలో

ఉంటుంది. జ్వాల్‌కూల్‌గారు "The science of Antahkaran" అని రాసారు. అది ఈ వెలుగు. ఎక్కడ పుడుతుంది? Pineal gland కి, body కి మధ్యన ఖాళీ వుంటుంది. ఆ ఖాళీలో పడవలా (ark) మెరిసేటు వంటి spark లాగ పుడుతుంది. అంటే ఇంద్రగ్రంథి, వరుణగ్రంథి అనేటువంటి గ్రంథుల మధ్యన మనం చేస్తున్నటు వంటి ధ్యానం కారణంగా అక్కడ పుడుతుంది. అది మానసికమైన తేజస్సులేక వెలుగు. ఈ వెలుగునే అంతఃకరణము అంటారు. కనుక యివి తెలియటానికి imformation తక్కువ వుంటే సందేహం గనుక వస్తే verification కి, ''సతాని సందేహ ఉపదేషు వస్తు ప్రమాణ మంతఃకరణ ప్రవృత్తయః'' అని కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలంలో యిచ్చాడు. ఏమిటిరా! ఈ ఆశ్రమానికి నేను వచ్చాను. వీళ్ళందరూ బ్రాహ్మణ పిల్లలు. కాని ఈ అమ్మాయి ఎవరో చూసేటప్పటికి వివాహం చేసుకుందామని అనిపించింది? నేనెన్నడూ అపచారము చేసినవాణ్ణి కానుకదా. ఎందుకిలా అనిపించింది అని దుష్యంతుడు అనుకుంటాడు. వాడు రాజుకదా. వీళ్ళందరూ బ్రాహ్మణ పిల్లలైతే వాడికి అన్పిస్తుందా? ఇంకెవడికైనా అనిపిస్తే అనిపించవచ్చు చూచిన ఆడపిల్లనల్లా పెళ్ళిచేసుకుందామని. కాని వాడు రాజర్షి కదా! సంయమం అనేదాన్ని మంచినీళ్ళ ప్రాయంగా కలవాళ్ళల్లో వాడొకడు. సామాన్యుడు కాడు. 'అసంయమం క్షత్ర పరిగ్రహ క్షమా' ఏమీ సందేహం లేదు. క్షత్రియుడు వివాహం చేసుకుంటానికి అర్హమైనటు వంటి పిల్ల అయ్యి వుంటుంది. బ్రాహ్మణ పిల్ల అయ్యి ఉండదీవిడ అనుకుంటూ ''సతాని సందేహ ఉపదేషు వస్తుః'' ఎన్నడూ తప్పుడు మార్గం పట్టకుండా జీవితం నడుపుకుంటూ వున్నవాళ్ళకి సందేహం ఉన్నచోట ''ప్రమాణ మంతః కరణ ప్రవృత్తయః'' అంతఃకరణం యొక్క ప్రవృత్తే ప్రమాణమన్నాడు. అందులో ఏమీ అభ్యంతరం లేదు. తర్వాత తెలిసింది ఆవిడ విశ్వామిత్రుడి కూతురని. కాళిదాసు శాకుంతలంలో ఒక కథ చెప్పాడు ఇలాంటి పదాలు యోగులు ఎలా వాడతారో. అంతఃకరణ ఒకటి ఆయన వాడాడు శాకుంతలంలో. ఇట్లాంటివి అయిదారు పదాలు మామూలు అర్థంలో కాకుండా ప్రత్యేకమైన అర్థంలో వాడాడు. చేతస్సు అనే పదముకూడ అలాగే వాడాడు ''రమ్యాణి వీక్ష మధురాంశ నిషమ్యశబ్దాన్'' ''పర్యక్షుకో భవతియత్ కుశతోపి జంతుః'' ''తస్యతథాస్మరతి న్యూన మభోద కుర్వం''. ''భావస్థిరాణి జనాంతర

సహృదాని''. ఆయన కూర్చొని సంగీతం, నాట్యం చూస్తూన్నాడు. ఆవిడ ఎవరో నాట్యంచేస్తూ సంగీతం పాడుతోంది. నాట్యం చాలా బాగుంది. సంగీతం చాల మధురంగా వుంది. ఈయనికి ఎక్కడల్లేవచ్చి, ఏడుపల్లే, బాధల్లే వచ్చింది. బావుంటే ఏడుపువస్తుందా? సంతోషం రావాలా? అపుడువాడు యిలా అనుకొని సమాధానం పెట్టుకున్నాడు. అతి రమ్యమైన దృశ్యములు, బాగా అందంగా వున్న దృశ్యాలు చూచినపుడు ఒక్కోమాటు అతి మధురమ్మైన శబ్దములు సంగీతంలో విన్నా ఒక్కొక్కసారి చుట్టూ శుభ్రమైన పరిస్థితులలో ఉండికూడ ప్రాణం గిలగిల కొట్టుకుంటుంది. చాలా బావుంటే, excess అవుతుంది అన్నాడు. ఎందుకవుతూందంటే మనం ఎరిగివున్నటు వంటి conscious mind. లో లేనివి పూర్వజన్మకు సంబంధించినటు వంటి memories అన్నీ లోపల వుంటాయి. అది చేతస్సుచేత స్మరిస్తుంది ఒక్కమాటు. వెనుక ఎపుడో యిలాంటి పరిస్థితి రావటం, అపుడెవరో బాధపడటం, గిలగిల లాడటం, ఆ వెనకటి tragedies ఏవో గుర్తు వస్తాయి. అక్కడ గుర్తురావు. ఇక్కడ గుర్తు వస్తాయి. ఇక్కడ గిలగిల లాడుతుంది అన్నాడు. ''భావ స్థిరాణి'' భావాలు స్థిరంగా వుంటాయి. 'జన్మాంతర సహృదాని' జన్మాంతరాల్లో జరిగినవి. పాపం వీడికి తెలీదు. జన్మాంతరాల్లో జరిగినవి కాదు. శాపం చేత నీ పూర్వ పరిస్థితి మర్చిపో అనిచెప్పి దుర్వాసుడు చెప్పాడు. జన్మాంతరం కాదు. ఈ జన్మలోనే శకుంతలని పెళ్ళి చేసుకుంటానని మాట యిచ్చి వచ్చాడు. ఆవిడ అక్కడ బాధపడుతుంది. అది ఏమో తెర అడ్డం పడ్డట్టుగా పడ్డది. ఇక్కడ నాట్యం చూస్తుంటే వీడికి దుఃఖం వచ్చింది. ఇట్లాంటి చోట చేతస్సు అనే పదం వచ్చింది. అంటే special (స్పెషల్) యోగాభ్యాసం. సైన్సులో ఎలా వాడతారో పదాలు, అలా వాడతారు అన్నమాట. కాళిదాసుని, భవభూతిని మామూలుగా టీకా తాత్పర్యాలుగా చదువుకోకూడదు. 'అంతఃకరణం' అనే మాటకి కూడ అర్థం ఇదే. ''ప్రమాణ మంతఃకరణం ప్రవృత్తయః'' అని కాళిదాసు వ్రాసిన దానికి జ్వాలాకూలుడు మొట్టమొదటిగా 800 పేజీల, The science of Antahkarana రాస్తే, నాకు ఆశ్చర్యమేసింది. మనం ఇండియన్స్ అయివుండి అంత అర్థం అవ్వలేదు. ఇది చదువుకున్నాక తెలిసింది.

## 35. హృదయే చిత్తసంవిత్।

హృదయే = హృదయము నందు (సంయమాత్ = సంయమం చేస్తే); చిత్త సంవిత్ = చిత్తంయొక్క విజ్ఞానము కలుగును.

**హృదయమున సంయమము చేసినచో చిత్తమును గూర్చిన శాస్త్ర జ్ఞానమంతయు కలుగును.**

**వివరణ :** హృదయమునందు చిత్తంయొక్క విజ్ఞానము సంయమము చేస్తే అంటే అనాహత చక్రం అంటాం చూడండి, హృదయ కమలము నందు, దానియందు సంయమం చేస్తే చిత్తంలో ఏమున్నది తెలుస్తుంది. ఎవరి చిత్తంలో? మన చిత్తంలోకాదు. మన చిత్తములో నున్నది మనకెల్లాగు తెలుస్తుంది. హృదయంలో ఈ వెలుగుని రోజూ ధ్యానంచేస్తూ వుండే వాడికి కొన్నాళ్ళయ్యేటప్పటికి ప్రక్కన ఒకడు వచ్చి కూర్చుంటా డనుకోండి. ఊరికే తమాషాగా వీడి పేరు హనుమంత రావల్లే వుంది అనిపిస్తుంది. కనుక్కుంటే హనుమంతరావే. అదీ చిత్త సంవిత్ అంటే. కొంచెంసేపయిన తర్వాత మీరేం చేస్తున్నారు అంటే ఏదో మనస్సులో అనిపిస్తుందన్నమాట. Hindusatan Polymers లో పనిచేస్తున్నారులా వుంది అని. మీరెందులో పనిచేస్తున్నారు అంటే Hindustan Polymers అని చెబుతాడు. ఇంక ఏమీ సందేహం లేదు. చిత్త సంవిత్ అంటే ఇలాగ వారింట్లో వ్యవహారములు అన్నీ తెలుస్తాయి. మంచి, చెడు అన్నీ తెలుస్తాయి. ఇది అభ్యాసంచేస్తే, బాధ్యత కల్గి ఉండాలి. అంటే ఎవరింట్లో విషయాలైనా మంచి, చెడు కూడ మనకి తెలిస్తే ఎలా ప్రవర్తించాలి? Staff room లో కూర్చునో, faculty room లో కూర్చునో వాడు అలాగ, వీడు యిలాగ, ఆ నర్సు ఇలాగ, ఆ డాక్టరు యిలాగ, వాళ్ళింట్లో ఇలాగ, అని వాగే పశుప్రవృత్తులన్నీ (Beastly instincts) పోవాలి. అనగా మనకి యితరుల గురించి విషయములు తెలుస్తున్న కొద్దీ బాధ్యత ఎక్కువ అవుతూ వుంటుంది. జాగ్రత్తగా వుండాలి. ఒకర్ని గురించి కొన్ని తెలిసాయి అనుకోండి మరీ ఘోరమైన విషయాలు. ఇంకొకడితో యిలాగట అని చెప్పేము అనుకోండి. మొత్తం తెలీదు యింక. ప్రకృతి కనెక్షన్స్ తీసేస్తుంది. He is a criminal.

ఇంకొకడి ఉత్తరాలు చించి చదివినట్లే కదా! వాణ్ణి ఏం చేస్తారో దొరికితే, వీణ్ణి అదే చేస్తుంది ప్రకృతి. అవి చేయకూడని పనులు. వీడికి ఏమైనా తెలిస్తే ఉపయోగంగా ఉన్నపని ఏదైనా వుంటే దానిని ఉపయోగించాలి. ఒకడికి abnormality of sex వుందనుకోండి. అది తెలిసిన వీడు యింకొకడితో చెప్తే వీడు అలాంటివాడై పోతాడు. అంతకంటే ఇంకేంలేదు. అంటే వీడు యోగాభ్యాసానికి పనికిరాడు. లేదా వాడెప్పుడన్నా వచ్చి, నన్ను ఉద్ధరించి సరైన మార్గంలో పడేయటానికి ఏమన్నా వుందా? అని అడిగినపుడు అపుడు పనికివస్తుంది మీకు ఆ information. ఇంకో దానికి పనికిరాదు. ఇది ఒక రకమైన morality; instinctive morality అంటారు. దీన్నే sensual responsibility అనికూడ అంటారు. అందుకనే జ్వాల్‌కూల్‌గారు చెబుతారు. మనకి విషయం తెలుస్తున్న కొద్దీ, దానికి పదిరెట్లు బాధ్యతలు ఎక్కువవుతాయి అనే సంగతి తెలుస్తుంది. విషయం తెలియని వాడికి బాధ్యతలు ఉండవు. పిల్లల కంటే మనకి కాసిని ఎక్కువ విషయాలు తెలుసును కనుక పిల్లల్ని నిప్పు దగ్గరికి, నీళ్ళ దగ్గరికి, పొయ్యి దగ్గరికి, మెట్ల దగ్గరికి, డాబా పిట్టగోడల దగ్గరకి పోనివ్వకూడదని మనకి తెలుసును అంటే అర్థం ఏమిటి? పోనివ్వకుండా చూచే బాధ్యత మనది. ఇవన్నీ ప్రమాదాలని మనకు తెలుసు. వాడికి తెలీవు. మనకి తెలిసినందువల్ల బాధ్యత ఒకటి నెత్తిన పడ్డది. అందుకని బ్రహ్మవిద్య దగ్గరికి వెళ్ళేటువంటి విద్యార్థులుగాని, యోగాభ్యాసం చేసేవాళ్ళకు గాని, జ్వాలాకూలుడు ఏం చెబుతున్నాడంటే మీకు ఒక్క పాయింటు తెలిసే కొలది పది పాయింట్ల బాధ్యత, బరువు భుజాన పడుతుందని తెలుసుకొని, అపుడు మా వెంట వస్తూండండి. లేకపోతే వదిలేసేయండి. ఇవి రాయితీలు కావు. బాధ్యతలు ఎక్కువవుతాయి, knowledge వల్ల అన్నాడు. Privileges ఎక్కువైతే knowledge, sub-common అయిపోతుంది. విషయాలు తెలియటమే ఒకపెద్ద అధికార కాండ అయినట్లయితే, యింక యోగం ఏంలేదు. అలా రోగిష్టి వాడిలాగ పడి వుంటాడు. యోగాభ్యాసం చేసి, అది బెడిసికొట్టి, ఇలా అయిపోయాను అని చెప్పి ఏడుస్తాడు. అంటే nature will shun down the activity అపాత్రత ఉన్నటువంటి చోట. ఇక ఉండనివ్వదు.

అంటే nature కి ఎంత కరుణ ఉందో అంత exception లేదు. ఎందుకంటే మిగతా వాళ్ళమీద కూడ అంత కరుణ ఉండాలి కదా! కరుణ అంటే మనమీదే అని కాదు కదా అర్థం. అందరి మీదాను. ఒకటి మర్చిపోకూడదు. ప్రకృతికి ఉన్నటువంటి ప్రేమ తనమీదే అని అనుకోకూడదు. అందరిమీద అని అనుకోవాలి. కనుక ఒళ్ళు దగ్గర పెట్టుకొని వుండాలి. కనుక ఎప్పుడైనా మనకి మిగిలేవి బాధ్యతలే. రాయితీలు మిగలవు. విషయము తెలిసినా, తెలిసేకొద్దీ మరీ చికాకే అన్నాడు జ్వాల్‌కూల్‌గారు. పెద్దవాళ్ళంతా అట్లాగే అన్నారు. ఆయనా అదే అన్నాడు. కనుక హృదయమునందు మీరు ధ్యానం చేసినందువల్ల ప్రక్కన కూర్చున్నవాడి అభిప్రాయములు, వాడికి తెలిసి ఉన్నదంతా కూడ మీకు అలాఅలా బుఱ్ఱలోకి తడుతూ ఉంటుంది అన్నాడు. ఇవికూడ తెలుసుకోండి. ఇవి పెద్ద విషయాలు కావు. చిన్నవే అయినప్పటికి ఒకసారి చదివిస్తే under-standing of the mind-conciousness comes from one pointed meditation upon the heart centre. అంటే వాడు మానసికంగా ఎరిగున్న విషయాలన్నీ కూడ మనకి తెలుస్తాయి. లేదా వాణ్ణి నిద్రలోకి పంపించేమనుకోండి. హాయిగా నిద్రపోతూ ఉంటే అందులో వాడు వాగుతాడు. లేదా వాడి ప్రక్కన మీరు కూర్చున్నారనుకోండి. స్పష్టముగా మీ మనస్సుకి వాడి మనస్సులోవి తెలుస్తాయి.

## 36. సత్త్వ పురుషయో రత్యన్తా సంకీర్ణయోః ప్రత్యయా విశేషో భోగః పరార్థత్వా త్స్వార్థ సంయమా త్పురుష జ్ఞానమ్।

సత్త్వ పురుషయోః = సత్త్వము, పురుషుని యందు; అత్యన్త = మిక్కిలి; అసంకీర్ణయోః = అసంకీర్ణత్వము వచ్చినటువంటి వానికి; ప్రత్యయ = ప్రయోజనము నందు; అవిశేషః = అవిశేషమైనటువంటి; భోగః = భోగము వుంటుంది; పరార్థత్వాత్ = పరమ ప్రయోజనము నందు; స్వార్థ సంయమాత్ = స్వార్థము నందు సంయమము చేయుట వలన; పురుష జ్ఞానమ్ = పురుషుని యొక్క జ్ఞానము కలుగును.

**లోపలనున్న పురుషుని నుండి బుద్ధి ఏమాత్రము చెదరనప్పుడు బాహ్య స్వరూపము లన్నియు పురుషుని భోగం కోసమే కల్పింపబడినవి. (అవి తన కోసమని మనస్సు తలచుటచే బాధ లనుభవింపబడు చున్నవి). ఈ సత్యముపై సంయమము చేయగా పురుషుడనగా నెవడో తెలియబడును.**

**వివరణ :** పురుషజ్ఞానం అంటే స్త్రీ పురుష జ్ఞానం కాదు. పురుషుడనే మాటకి వివరణ పూర్వం చెప్పుకున్నాం అయినా మరోసారి ఈ విషయంపై పునరావలోకనం చేసుకుందాం.

ఒక వెలుగులోంచి వచ్చిన వెలుగులే ఇన్ని రూపములుగా తయారవుతున్నాయి. ఆత్మ అనబడే వెలుగులోంచి వచ్చినదే మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము అనే రూపములు. దీంట్లోంచి పంచేంద్రియముల ప్రవృత్తులు, పంచతన్మాత్రలు, ఐదు ఇంద్రియార్థములు, ఈ చిత్తము. దీనికోసం ఏర్పడ్డదే మన శరీరము. ఈ శరీరంలోకి కావలసిన సప్తధాతువులు, దాంట్లోకి కావలసిన ఖనిజములు, రసాయనిక పదార్థములు, బయోకెమిస్ట్రీ (జీవ రసాయనశాస్త్రం), దానికి కావలసిన జలము, అగ్ని అంటే వేడిమి, లోపల రక్తంలో ఉన్న నీళ్ళు మొదలైనవన్నీ కూడ దేంట్లోంచి తయారవుతున్నాయి? ఈ భూగోళం మొట్టమొదట దేంట్లోంచి వచ్చింది? ఈ గడ్డం, మీసం, జుట్టు ఎక్కడనించి వచ్చాయి. మనలోంచే కదా? అలాగే సూర్యకుటుంబంలో ఉన్నటువంటి గ్రహగోళాలు సూర్యుడి లోంచే వస్తాయి. పదార్థం ఏమన్నా అప్పుతెచ్చి తయారు చేస్తున్నాడా? తనలోంచే వస్తోంది. మనకి గోళ్లు, గడ్డం, మీసాలు పెరిగినట్లే. ఇవి నిర్జీవములు. అవి సజీవములు. అదీ తేడా వాటికి, మనకి. అలాంటి సూర్యుడి లోంచి వస్తున్న భాగమేకదా భూగోళమంతా.

కనుక భూగోళంలో ఉన్న యిన్ని ఖనిజములు, భౌతిక పదార్థము, నీరు, నిప్పు మొదలైనవన్నీ కూడ సూర్యుడిలోంచి వచ్చిన భాగాలే కదా! ఎలా అయితే అవన్నీ సూర్యుడిలోంచి వచ్చిన భాగాలో, అలాగే ఈ మొత్తం అన్నీకూడ ఈ సూర్యుడితో సహా ఒకే వెలుగులోంచి వచ్చిన భాగాలు. ఈ వెలుగుల మొత్తాన్ని పురుషుడు అంటారు. ఈ పురుషుడిలో ఇవతల ఉన్నటువంటి పురుషుణ్ణి పురుష సామాన్యుడు అంటారు. అంటే కళ్ళు, ముక్కులు, చెవులు, చేతులు, కాళ్ళు, పొట్ట, తలకాయ ఇవన్నీ. గుండెకాయ, ఊపిరితిత్తులు తర్వాత మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, జ్ఞానం, విజ్ఞానం, ప్రజ్ఞ, తెలివి, తెలుసుకుంటం, జాగ్రత్తగా ఉండటం, మంచిగా ఉండటం ఇవన్నీ కలిసి పురుష సామాన్యుడు. అంటే వాడిలో భాగం ఇవన్నీ తప్ప వాడు ఇందులో లేడు. వాడు కాదు. ఇవికాక ''పురుష విశేషః ఈశ్వరః'' అని మొదటి భాగంలో చెప్పారు. ఈశ్వరుడనగా నెవరు? ఇందులోనే ఏదిగానో మారకుండా ఉన్నప్పుడు orginal గా ఉన్న 'I am' అనే light ఉంది. ఆ లైటుపేరు పురుష విశేషుడు. దీన్ని తెలుసుకుంటే తప్ప, వీడియందు మేల్కొంటే తప్ప, ఇందులో కూడ ఉన్నది వాడే అని తెలీదు. అంతకుముందు మనం ద్వైతం చెప్పినా, అద్వైతం చెప్పినా, విశిష్టాద్వైతం చెప్పినా, ఏం చెబుతామంటే యిదంతా కూడ ఏమీ లేదురా అబ్బాయి, ఇదే అని చెబుతాం. ఇదంతా ఏమీ లేదేమిటి? ఇదంతా అని ఎందుకు అంటున్నాం? కనుక మనం వ్యాధిగ్రస్తులం. మానసిక లక్షణం మనకి ఉంది. ఇదంతా అనేది సృష్టి. దీన్ని అంగీకరిస్తూ ఇదంతా ఏం లేదు అంటున్నాం. ఇదంతా ఏం లేదు అనేది నిజం అని మనం నమ్మినట్లైతే యిదంతా ఏంలేదు అనేటువంటి వాక్యం మనం ఎందుకు వాడతాం? ''సర్వం ఖల్విదం బ్రహ్మ'' అని అరుస్తున్నారు. ఈ సమస్తం పరబ్రహ్మమే కదా. అయితే ఈ సమస్తము అని ఎందుకు అంటున్నాం? ఈ రకంగా నమ్మి, అది అర్థం అయినట్లైతే, ఈ సమస్తమూ అని మళ్ళీ సతాయించుకుంటం ఎందుకు? కనుక యివన్నీ అజ్ఞానంలో వచ్చిన సతాయింపులు తప్ప జ్ఞానం వచ్చిన సతాయింపులు కావు. కనుక దీన్ని పురుషవిశేషుడు లేక ఈశ్వరుడు అన్నారు. వీడు వీడుగా మేల్కొనడం పేరు పురుషజ్ఞానము.

అసలు యోగాభ్యాసానికి పరమావధి ఋషి ఈ సూత్రంలో చెప్పాడు. అంటే ఇదివరకు చెప్పినది పరమావధి కాదా? చేతులు, కాళ్ళు

తలకాయ పరమావధి ఎట్లా అవుతాయి? అయితే అవి ఎందుకండి? అవి లేకపోతే మీరు ఉండటానికి, వినటానికి, నేర్చుకుంటానికి ఏమీ అవకాశం లేదు. చేతులు, కాళ్ళు, నడుము, తలకాయ, ఇవి లేనపుడు, ఇవి ఎందుకండి? అని అడగటానికి కూడ వీల్లేదు. అడగాలంటే నోరు ఉండాలి. నోరు ఉండాలంటే తలకాయ ఉండాలి? ఈ పాడు శరీరం ఎందుకు? ఇది చీము, నెత్తురులతో కూడినది. ఈ పాపిష్టి శరీరం ఎందుకు అని దాన్ని తిట్టటానికి కూడ దాంతోనే తిట్టాలి దాన్ని ఉపయోగించుకుంటూనే. అంటే దేన్ని ఉపయోగించు కుంటున్నామో, దాన్ని తిటుతున్నటు వంటి విశ్వాసహీనులమైన మహా పాపులం అన్నమాట మనం. మోక్షం రమ్మంటే ఎక్కడ వస్తుంది? అది జాగ్రత్తగా ఉండాలి. ఇక్కడ ఈ సూత్రంలో పురుషజ్ఞానము చెబుతాను వినండి అన్నాడు. యోగాభ్యాసంలో పురుష జ్ఞానము వచ్చే పద్ధతి, వేనియందు సంయమంచేస్తే పురుషజ్ఞానము వస్తుందో చెబుతున్నారు. అందుకని ఈ సూత్రం చాల ముఖ్యం. అంటే పై సాధన అంతా ఈ సూత్రంలో చెప్పబడిన దానికోసం చేస్తున్నారు. ''సత్త్వ పురుషయోః అత్యన్త అసంకీర్ణయోః'' సత్త్వము, పురుషుడు మీలో యిద్దరున్నారని తెలియాలి. అంటే మనం ఎరిగున్న భాషలో. జీవాత్మ (soul), పరమాత్మ (spirit) యిద్దరు ఉన్నారు. అంటే సత్త్వము, పురుషుడు అని రెండు ఉన్నాయని ముందు ధ్యానం చేయండి. అష్టాంగ యోగము అభ్యాసంచేసి, అందులో ధారణ, ధ్యాన, సమాధుల ఏకస్థితి అయినటువంటి సంయమము దీనియందు ప్రసరింపచేస్తే మాత్రమే ఈ రెండూ ఉన్నాయని తెలుస్తుంది. లేకపోతే ఒకడిలోనే ఉన్నామని అనుకుంటూ ఉంటాం. సత్త్వము, పురుషుడు ఉన్నాయని తెలీదు. ఈ జన్మకి ముందు, ఈ జన్మకి తరువాత, ఈ జన్మ అయిపోవడం వీట్లని చూసి జాగ్రత్తగా లోపల హితంకోరి, మేలుకోరి నడుపుతూ ఉన్నటువంటి దాన్ని సత్త్వము అంటారు. దీనితో సంబంధము లేకుండా యిందులో ఉండి వెలుగుతూ ఉన్న దాన్ని పురుషుడు అంటారు. ఈ శరీరం ధరించటానికిగాని, శరీరం వదిలిపెట్టటానికిగాని సంబంధంలేదు పురుషుడితో. అంటే పురుషుడు ఒక వెలుగు. ఆ వెలుగునించి వస్తూ ఉన్నది వెలుగుతో చేయబడిన సత్త్వము మొత్తం అంతా. సముద్రంలో ప్రయాణం చేస్తూంటే యిదివరకు రోజుల్లో దిక్కులు తెలియాలంటే రాత్రిపూట తారకని చూసి ప్రయాణం చేసేవాళ్ళు. ప్రయాణం చేస్తున్న ఓడ, పైనున్న తారక రెండూ ఉన్నట్టుగా మనలో సత్త్వం,

పురుషుడు రెండూ ఉన్నాయి. మనలో ఆ రెండూ ఉంటేనే ప్రతి ఒక్కళ్ళం ఉంటాం. ఆ రెండింటిలో ఆ తారకయే పరమాత్మ. ఆ తారక నుండి వచ్చిన వెలుగుతో ఏర్పాటైనది, మిగిలినటు వంటి ఆత్మ. అందులోంచి వచ్చిన బుద్ధి, అందులోంచి వచ్చి కింద వాటితో కలిసి కల్తీ అయిన బుద్ధి, ఆ బుద్ధితో కల్తీ అయిన మనస్సు, ఆ మనస్సుతో కల్తీ అయిన యింద్రియముల ప్రజ్ఞలు, యింద్రియముల ప్రవృత్తులు, ఆ యింద్రియముల ప్రవృత్తులతో బయటికివచ్చి, లోపలకెళ్ళి చూస్తున్నటు వంటి ప్రపంచములో ఉన్నటువంటి విషయములు వీటన్నిటితో సంబంధించినది ఉండి, ఈ మొత్తాన్ని మార్పు చేయటంకోసం, సహాయం చేయటంకోసం, ప్రయాణంచేస్తూ ఉంటుంది. ఇంద్రియాల్లోనించి బయటికివచ్చి, బయటవున్న వెలుతురు చూడటం, బయట ఉన్న శబ్దం వినటం, దీంట్లో జీవిస్తూ ఉండి, ఎందుకూ పనికిరాకుండా జీవితాన్ని వ్యర్థం చేసుకుంటూ ఉన్న మనని, ఈ జీవాత్మ లోపల ఉన్నవాడు, మనకి ఏమని చెబుతాడంటే ఒరేయ్! అబ్బాయి, కంటికి కనిపించిన వెలుగు చూట్టం కాదు. బయటనించి కనిపించినా, కనిపించకపోయినా light వంక నువ్వు చూట్టం అనేది మానేసేయ్. నువ్వు చూడదలుచుకుంటే చూసే విద్య నేను చెబుతాను. అది కనిపిస్తే నువ్వు చూసేటువంటి గతిలేనితనం నించి యివతలకి రా. అది ''యోగశ్చిత్తవృత్తి నిరోధః''. కంటికి కనిపిస్తోంది కాబట్టి చూడడం, చెవికి వినిపిస్తోంది కాబట్టి వినడం, వాసన వేస్తోంది కాబట్టి వెళ్ళి భోంచేసే కుక్క బ్రతుకు ఎందుకు నీకు? అన్నాడు. నీకు ఆకలేసినపుడు నువ్వు భోంచేయ్, నువ్వు చూడదల్చుకున్నపుడు చూడు. వినదల్చుకున్నపుడు విను. అలాంటి శక్తి కావాలంటే ముందు వీట్లలోంచి ఉపసంహారం (with draw) అవ్వాలి. అష్టాంగయోగము అలాంటిది. ఆ ఉపసంహారం అవ్వటం అయిన తర్వాత అష్టాంగయోగము పూర్తయ్యాక ఏం చేయాలి? సమాధి. అందులో ఉండిపోయాడనుకోండి అట్లాగ. దానికోసం కాదిది అన్నాడు. ధారణ, ధ్యాన సమాధుల సంయమంలో ఉండి, అర్జునుడిచేత కృష్ణుడు ఎన్ని పనులు చేయించాడో అర్జునుడు చేసినట్టుగా మనంకూడ కొన్నైనా చెయ్యగలగాలి. కృష్ణుడు అర్జునుడికి యిచ్చిన యోగవిద్య కనుక నిజమైతే. అర్జునుడికి సమాధి రాలేదు అనడం తప్పు అర్జునుడు యోగి అవునా? కాదా? అర్జునుడు యోగి కాకపోతే భగవద్గీతని, కృష్ణుణ్ణి మొత్తం ఎత్తేయాలి. భగవద్గీతని మనం అంగీకరించాలంటే అర్జునుడు యోగి అని అంగీకరించాలి. ''యోగస్థః కురు

కర్మాణి'' యోగస్థితిలో ఉండి చేయి అన్నాడు. నేను చేసేది ఏముంది? అన్నాడు యింక. కారు డ్రైవింగ్ బాగా నేర్చుకున్నాక నువ్వు డ్రైవ్ చేసేదేముంది? చేతులు, కాళ్ళు, మనస్సుతో ఆటోమేటిక్‌గా డ్రైవ్ చేస్తూ ఉంటాయి. కనుక సత్త్వము, పురుషుడు ఉన్నాడని మనకి ముందు తెలియటానికి వీల్లేదు. యోగాభ్యాసము చేసిన తర్వాత తెలుస్తుంది. అంటే ఈ సత్త్వము అనే మాటకి మనం ఎరిగి ఉన్నంతలో ఇంగ్లీషు వచ్చిన వాళ్ళు personal file అని చెప్పుకోవచ్చు. మనం ఆరాధిస్తే కనపడే యిష్ట దేవత వీడే. యిష్టదేవత పైనున్న పరమాత్మ నిజమైన దేవుడు, ఆత్మ అనేది. ఇష్టదేవత మాత్రం వీడే. మనం వెంకటేశ్వరస్వామి అని పేరు పెట్టుకున్నా, గాయత్రి అని పేరు పెట్టుకున్నా, లలితాదేవి అనిపేరు పెట్టుకున్నా, రాజరాజేశ్వరి అనిపేరు పెట్టుకున్నా, కృష్ణుడని పెట్టుకున్నా, దేవుడని పెట్టుకున్నా ఏం పేరు పెట్టినా, ఆ పేరు మనం పెట్టినదేగాని, వాడిది కాదు. వాణ్ణి అందుకోలేము కనుక మనకు personal file అంటే జీవాత్మ. దీనికిన్ని, లోపల ఉన్న పురుషుడికినీ, వీళ్ళిద్దరూ ఉన్నారని తెలుస్తుంది. ఆ పురుషుడు లోపల ఉంటూ ఉండటంవల్ల ఈ జీవుడు బ్రతికి ఉన్నాడని తెలుస్తుంది. దేవుడు లోపల వెలుగుతూ ఉండటంవల్ల జీవుడు ఉంటాడు. విద్యుత్తు ప్రసారం అవుతూ ఉండటంవల్ల లైటు వెలుగుతుంది కాని, లైటు వెలుగుతూ ఉండటంవల్ల విద్యుత్ప్రసారము అవుతుందా ఎక్కడైనా? కనుక లోపల ప్రసారమవుతున్న కరెంటు లాంటివాడు పురుషుడు. లైటు లాంటివాడు జీవుడు. కనుక జీవుడికి, పురుషుడికీ సత్త్వమునకు, పురుషుడికీ ఇద్దరికీ సంకీర్ణత ఉంటుంది లోకంలో మామూలుగా. సంకీర్ణత అంటే ఏమిటి? Out of focus. అంటే ప్రకృతి చక్కగా ఏర్పాటు చేసిపెట్టి యిస్తుంది. కాని అలా ఉండకుండా ఉక్కిరిబిక్కిరిగా చేసుకుంటాడు వీడు. Square plug in a round hole. అంటే లోపల ఉన్న పరమాత్మకిన్నీ, బయట వ్యవహారం చేస్తున్న జీవాత్మకీ మధ్యన సంధులు ఏర్పాటు చేసుకుంటాడు. అంటే కొత్తగా మరచెంబు కొనిపెడితే మూత తీసాడుగాని, మళ్ళీ మూతపెట్టడం చాతకాలేదు. వంకరగా పెట్టాడు. సందులు ఉండవూ? అలా బ్రతుకుతున్నాం ప్రపంచంలో. అందుకనే సంకీర్ణంగా ఉంటుంది. సంకీర్ణం అంటే చెదురుబాటుగా చెల్లా చెదురుగా, అంటే మనం ఎవరైనా సల్ఫర్ పేషెంట్ యింటికి వెళ్ళినట్లైతే, వాడి యింటిలో గిన్నెలు, తపాలాలు, మంచాలు, పెట్టెలు, గుడ్డలు ఎలా ఉంటాయో అలా ఉంటాయి. అది

సంకీర్ణం అంటే, అందుచేత మనకి ఏమనిపిస్తోంది? వెలిగిన వెలుగంతా లైటు క్రోంచే వస్తోంది అని అనిపిస్తోంది. కరెంటు ఉన్నదని గుర్తురావటం లేదు. పరీక్షల మీదే దృష్టిపెట్టుకొని ఉన్నాడు ఒక కుర్రాడు. లైటు వెలుగుతోంది. చదువుదామని కూర్చునేటప్పటికి ఆరిపోతోంది. మళ్ళీ వెలుగుతోంది, మళ్ళీ చదువుదామని పుస్తకంతీస్తే ఆరిపోతోంది. నాలుగైదు మాట్లు ఇలా జరిగేటప్పటికి కుర్రాడికి ఏమవుతుంది? ఒళ్ళు మండిపోతుంది. కాని ఎవరిమీద? టప్‌మని పుస్తకం బల్లకేసి కొట్టాడు. ఒళ్ళు మండిందెవరి మీద? పుస్తకం మీదా? కాదని తెలుస్తుంది. లైటు మీదా? కరెంటుమీదా? వాడు ఆ లైటు వెలగడం, చదువుకుంటం యందే మనస్సు పెట్టాడు. మిగతా వాటిమీద లేదు గనుక కోపం వచ్చింది. అంటే అజ్ఞానంవల్ల కోపం వచ్చింది. లేకపోతే కోపం ఎవరిమీద? చదువుకుందా మనుకున్నపుడల్లా కరెంటు పోతుందేమిటి? వెధవ పరీక్షలు అంటాడు. పరీక్షల మీదా కోపం కాదుగా. వాడు మూర్ఖుడు కాదు కాని, వాడు మారణం చేసుకున్నాడు. తన దృష్టిని సంకీర్ణత్వం చేసుకున్నాడు. ఆ చేసుకుంటంవల్ల దానికి, దీనికీ focus లేదు. అంటే logic లేదు. తిన్నగా పనిచేయటం లేదు. కార్యకారణ సంబంధం లేదు మనకిన్నీ, అవతల ఉన్న పొరపొచ్చానికీ మధ్యన. అంచేత సత్త్వానికి, పురుషుడికీ మధ్య సంబంధం లేకపోవటంవల్ల, జీవితంలో ఉన్న వెలుగంతా కూడ ఈ సత్త్వము తాలూకుదే అని అనుకుంటున్నాం. అంటే మన తాలూకువే అని అనుకుంటున్నాం. మన తెలివితేటలవే అని అనుకుంటున్నాం. మనలోకి ఇంకొకచోటు నించి కరెంటు వస్తోందని తెలియక పోవటంవల్ల. తెలియనప్పుడల్లా ఇక్కడే ఒకరినొకరు కొట్టుకుంటున్నాం, తిట్టుకుంటున్నాం, చీకాకు పడుతున్నాం. ఇదీ సంకీర్ణత్వం అంటే (shattered) చెల్లాచెదరైనది. అట్లా కాకుండా యోగాభ్యాసం చేస్తూంటే అసంకీర్ణత్వం వస్తుంది మీకు. అంటే ఏమిటి? పుట్టేటప్పటికి ఏ స్థితిలో పెట్టి ప్రకృతి వదిలిపెట్టిందో, ఆ స్థితిలోకి మళ్ళీ మెల్లమెల్లగా మిమ్మల్ని మీరు తెచ్చుకో గలుగుతారు. ఏ మార్గంలో తెచ్చుకోగలుగుతారు? నేనెలా తెచ్చుకోగలను అనే పట్టుదల ఉంటే పుటం పెట్టినా ఆ జన్మ అట్లా అంతరించాల్సిందే కాని, తెచ్చుకోలేరు. దేనివల్ల తెచ్చుకోగలుగుతారు? ఈ చెదరిపోయినది ఎలా వస్తుంది? అనే ప్రశ్న వదిలిపెట్టి మనస్సును పరమప్రశాంతం చేసుకుంటే ఆటోమేటిక్‌గా వస్తుంది. ఇది ఎలా ప్రశాంతం అవుతుంది అని గుడ్లురిమితే ఈ జన్మకి అవ్వదు. అంటే

మనకి దానియందు పట్టుదల, కోపము, ఇది సాధించాలి అనే అజ్ఞానము కరుడు గట్టి, ముద్దలుకట్టి మన దగ్గరికి వచ్చినకొద్దీ మళ్ళీ focus అవ్వటం ఈ జన్మకి ఉండదు. ఎపుడైతే వీడు ఆ పట్టుదల వదిలిపెట్టి, చేయవలసిన పని చేస్తూండటం, దానికి అడ్డం వచ్చేవి అని అనుకుంటున్న వాటిని ప్రక్కకి తొలగించుకుంటూ ఉంటాడో, కొన్నాళ్ళయ్యేటప్పటికి, అడ్డాలు ఉండవు. కర్తవ్యం మిగుల్తుంది. విఘ్నాలు అనేవి అబద్ధం అని తెలుస్తుంది. మనస్సు ప్రసన్నమైనకొద్దీ దానికి దీనికీ focus వస్తుంది. కోపం ఎలా పోతుంది? అనే ప్రశ్న నశించిన వాడికి కోపంపోతుంది కాని, ఈ పాడు కోపం ఎలా పోతుంది అని కోపం మీద కోపించిన వాడికి పిచ్చికోపం వస్తుంది తప్ప, కోపం పోదు. సరదాగ ఉండటాన్ని నిరంతరం జ్ఞాపకం చేసేవాడి దగ్గర వీడుంటే కోపం పోతుందిగాని, కోపం ఎలా పోతుంది అని ప్రతి నిమిషం కోపాన్ని జ్ఞాపకం చేసుకునే మూర్ఖుడికి కోపంపోదు. దుర్గుణాల్ని జయించాలని అనుకుంటున్న వాడు, ఆ దుర్గుణాల్ని జయిద్దాం అనే పేరుతో వాటినే స్మరిస్తున్నాడు. దుర్గుణాల్ని స్మరించేవాడు దుర్గుణాల్ని జయించడం ఎన్నడూ జరగదు. సద్గుణాల్ని స్మరించిన వాడికి, దుర్గుణాలు ప్రవేశించటానికి తావుండదు. అదొక్కటే మార్గం. అందుకని సత్త్వమునకు, పురుషునకు అసంకీర్ణత, ఆ ప్రశ్న లేకుండా, తను ప్రశాంతంగా తన కర్తవ్యం; తన కుటుంబము యెడల తన వృత్తి యెడల, తన మిత్రుల యెడల, యిలా వాళ్ళను అంతర్యామి బుద్ధితోచూస్తూ తను చేస్తూన్న సాధన వలన లభించవలసిందే కాని, రెండవ మార్గం పుటం పెట్టినా లేదు. ప్రకృతి ఒక్కటే మార్గం పెట్టింది. ప్రకృతిలో మతాలు అనేవి ఉండవు. సూటిగా మార్గాలిస్తారు. ఎన్ని మార్గాలుంటాయి? ప్రకృతిలో ఎపుడూ ఒకటే మార్గం ఉన్నది. ఆ మార్గంలో యోగాభ్యాసంచేస్తే 'అసంకీర్ణత' వస్తుంది. అంటే సంకీర్ణత తగ్గుతుంది. అనగా out of focus నించి focus లోకి వస్తారు. మీరు యిద్దరు. ఎవరిద్దరు? తత్త్వము, దానిని వెలిగిస్తున్నటువంటి పురుషుడున్నూ. పురుషుడు వెలుగు, ఆ వెలుగును కలిగినటు వంటివాడు సత్త్వము. ఈ రెండూ focus లోకి వస్తాయి. లేకపోతే సత్త్వము అక్కడక్కడ విడిపోయి ఉంటుంది. పురుషుడు జగత్తంతా ఉంటే క్రమంగా focus లోకి వచ్చిన కొద్దీ కూడ పురుషుడు అంతర్యామి అని తెలిసి సత్త్వము దాని focus లోకి వస్తుంది. అందుకనే ఎవరితో మాట్లాడుతూ ఉంటే వాళ్ళల్లో అంతర్యామిని చూస్తారు. అంతర్యామితోనే వాళ్ళు

మాట్లాడతారు. అయితే అవతలివాడు వీడితోనే మాట్లడవచ్చును. వీడు మాత్రం అవతలి వాడిలో ఉన్న అంతర్యామితోనే మాట్లాడతాడు. ఆ స్థితి వస్తుంది. కనుక అట్లా అసంకీర్ణత రాగా, అంటే చక్కని focus లోకి రాగా, ('అత్యన్త' అంటే మిక్కిలి maximum point ని touch అయ్యేటప్పటికి) ''అత్యన్త అసంకీర్ణయోః'' ఈ రెండూనూ పరిపూర్ణంగా అంసకీర్ణత్వము వస్తే అంటే complete focal point లోకి వచ్చినట్లైతే, concave mirror ముందు candle పెడితే, 'u' adjust చేస్తే image ఎక్కడ వస్తుందండి? దాని focal point 'u', 'v' సరిపోయినప్పుడు వస్తుంది. అలా చక్కగా సరిపోయిన పాయింటులోకి వచ్చినపుడు 'సత్త్వపురుషయోః' సత్త్వమునకు, పురుషునకు ''అత్యన్త అసంకీర్ణయోః'' పరిపూర్ణంగా అసంకీర్ణత్వము అనేది వస్తుంది. పరిపూర్ణంగా focus లోకి వచ్చినటువంటి వాళ్ళకి, ''ప్రత్యయ అవిశేషః భోగః''. అపుడు ఆ దృష్టితో ప్రపంచాన్ని మీరుచూస్తూ ఉంటే, చుట్టూ భోగములు కనిపిస్తాయి. భోగం అంటే అనుభవించేది. అంటే objective experience. దాన్ని ''ప్రత్యయ అవిశేషః'' అన్నాడు. ప్రత్యయం అంటే సరైన ఉపయోగము. దాని విషయంలో అవిశేషంగా ఉంటున్నాం. రేడియాలో సంగీతం వస్తే వింటున్నాం. ఆ ప్రోగ్రాం మొదలు పెట్టినప్పటినుంచి అయిపోయే వరకూ ఆ ప్రోగ్రాం యిస్తున్న వారిని గురించి అనేక విషయాలు మాట్లాడుకుంటూ ఉంటాం. అంటే వినటం లేదు. తెల్లవారిలేస్తే రాత్రి పడుకునే లోపల జీవితము అనే రేడియో పాటని ఇలా అనుభవిస్తున్న తెలివిగల వాళ్ళంకూడ ఉన్నాం. లేకపోలేదు. అంటే ఉన్న అవకాశాన్ని పాడు చేసుకుంటున్నాం. దాన్ని గురించే మాట్లాడుకుంటూ వినటానికి వీల్లేని పరిస్థితులు సృష్టించుకుంటున్నాం ప్రత్యయం లేక. ప్రత్యయం అంటే purpose- ప్రయోజనం. కంటికి చూడగలిగిన శక్తి ఉంది. దాని ప్రయోజనం ఏమిటి? అంటే మనకి తెలీదు యింతవరకు. ఇట్లా శక్తులున్నాయి కదా పంచేంద్రియాలకి. వాటి ప్రయోజనం సూటిగా చెప్పగలగిన స్థితిలో ఎవరైనా ఉన్నామా? కంటికి కనిపించటం అనే శక్తి ఉంది. ఎందుకు? వెలుతురులో కనిపిస్తోంది. అంతకి తప్ప మన దగ్గర జవాబు ఏమీ లేదు. యోగాభ్యాసం చేసినవాడికి తెలుస్తుంది ఇది ఏదో ప్రయోజనంకోసం ఇచ్చారని. మన జీవితంలో పంచేంద్రియముల వృత్తులుగాని, మనస్సుయొక్క వృత్తిగాని, శరీరంలో ఉన్న సత్తువగాని, ఆయుర్దాయంగాని, బ్రతకటంగాని ఎందుకు

చేస్తున్నామంటే, పుట్టాం కనుక చచ్చేవరకు బ్రతుకుతున్నాం అనే తప్ప ఇంకేం జవాబు లేదు. లేదా అప్పుడప్పుడు ఈ పిల్ల పెళ్ళి చేయాలి. ఆ యిల్లు కట్టాలి అనుకుంటూ ఉంటాను. పుట్టకుండా ఉంటే ఏం చేసేవాడు? అంచేత మనద్వారా జరుగుతున్నాయి గాని ఆ పనులు మనవి కావని తెలియాలి. మనవి కావు కాబట్టి ఎగ్గొట్టటమనే బైరాగి వేషాలు వేయకూడదు. ఈపిల్ల పెళ్ళిచేయటం మనవల్లా? అని చెప్పి బూట్లు తొడిగేసుకొని యింట్లోంచి వెళ్ళిపోతాడు. అలా అయితే పెళ్ళి చేసుకోకుండానే వెళ్ళిపోవాలిగాని, చేసుకొని పిల్లల్ని పుట్టించి అంటే దుష్కర్మ పెంచుకొని అది వచ్చే జన్మలోకి జమ కట్టుకొని బైరాగి అయినా, సన్యాసి అయినా, ఏం చేసినా లాభంలేదు. ఘోరవ్యాధి ఉందనుకోండి. సన్యాసం పుచ్చుకుంటే అది వదుల్తుందా? నాకు మోకాలు నెప్పులు ఉన్నాయి ఎందుకొచ్చింది? సన్యసిస్తాను అంటే అవి సన్యసించవు. మిగతావన్నీ సన్యసించవచ్చు. ఒకడికి తిన్నగా మూత్రంరాదు. ఎందుకొచ్చింది? సన్యసిస్తాను. అంటే ఇదికూడ వస్తుంది. కనుక సన్యాసం వచ్చేదికాని, పుచ్చుకునేది కాదు. టిఫిన్‌లాంటిది కాదు. అందుకనే కృష్ణుడు సన్యాసం పుచ్చుకోమని అర్జునుడితో చెప్పలేదు. సన్యాసం అంటే ఏమిటో చెప్పాడుగాని, సన్యాసం పుచ్చుకోమని చెప్పాడా? లేకపోతే ప్రతివాడు పుచ్చుకొని ఉండేవాడే కదా, సినిమాలో సన్యాసులు వేషం వేసినట్లు. అక్కడికీ ఆ సన్యాసానికి కూడ అన్యాయం చేస్తూనే ఉన్నాం. కాషాయం మాపు కాగుతుందని కట్టుకున్న వాళ్ళంలేమూ? పాపం స్వాములవారు అనుకొని దణ్ణం పెడతారు అవతలివాళ్ళు. అంటే అపచారం చేయకూడ నటువంటి పవిత్రమైన విషయాలకి అపచారం చేస్తూనే ఉన్నాము. అంటే కాషాయం సన్యాసానికి సంకేతంగా పెట్టారు. అది ఇపుడు అనవసరం. నిజమైన సన్యాసుల దగ్గరికి వస్తున్నాం. అంచేత వీటికి ప్రయోజనం ఉన్నది. కంటి చూపుకి ప్రయోజనం ఉన్నది. పరీక్షరోజుల్లో కంటికి జబ్బువచ్చి, కళ్ళజోడు వేయించుకొని చదువు కుంటుంటే, అపుడు కంటికి చూపు ఎంత ఉపయోగమో గ్రహిస్తాడు. అంటే ప్రయోజనం తెలిసినకొద్దీ దాని విలువ తెలుస్తుంది. అంతకుముందు పంచేంద్రియాలు, మనం దుర్వినియోగం చేసుకుంటానికి ఉపయోగపడ్డాయే కాని సద్వినియోగానికి ఉపయోగించలేదు కదా. దారినిపోతున్న వాళ్ళని చూట్టానికో, కన్నంలోంచి చూట్టానికో, లేకపోతే వాళ్ళు వీళ్ళు ఏం చెప్పుకుంటున్నారో వినటానికో ఉపయోగపడ్డాయి. ఇవి వాటికోసం కాదు. వీటికేదో ప్రయోజనం ఉన్నది.

ప్రత్యయం ఉన్నది. ప్రత్యయం అంటే నిజమైన ప్రయోజనం (Real purpose). ''ప్రత్యయ అవిశేషః భోగః'' అంటే not really purposive అయినటువంటి, భోగః అంటే అనుభవించేది. Objective experience. తనకంటే యితరంగా ఉన్న ప్రపంచంనించి మనం అనుభవిస్తున్న అనుభవం అంతా కూడ ప్రయోజనం లేకుండా అనుభవిస్తున్నాం. అందుకని ఏమవుతుంది? నీకో లక్ష, నాకో లక్ష తీసుకోమని యిచ్చారనుకోండి. ఏం చేస్తాం. అబ్బ! బ్యాంకులో వేసుకుందా మనిపిస్తుంది. ఇంకో లక్ష యిచ్చాడనుకో. పోనీ బంగారం యిచ్చాడనుకో. జేబులో వేసుకుంటాం. ఇంకా యిస్తే ఇంకో జేబులో వేసాం. ఇంక ఖాళీలేదు. బయట కనిపిస్తే దొంగలు పట్టికెళ్తారేమోనని భయం కదా. కాని మనజేబు పట్టటానికి వీల్లేనంత యిచ్చాడనుకోండి. ఏం చేస్తాం? అక్కడ వదిలిపెట్టటమేనా? ఇంక చేసేది ఏమైనా ఉందా? మనం నిల్చున్న కంటే నాలుగైదు రెట్లు బంగారం రోడ్డుమీద పెట్టి, యిదిగో తీసుకో అంటే కాస్త యింటిదాక తెచ్చిపెట్టండి సార్, లేకపోతే బ్యాంకు లాకరుదాకా తెచ్చిపెట్టండి సార్ అంటాం. నీకు ఇప్పుడే కావలిస్తే తీసుకో లేదా వదిలేయి అంటాడు. ఏం చేస్తాం? చివరికి వద్దుసార్ అంటాం. దానితో ఏం చేసికొన్నామో, ఈ పంచేంద్రియములు, వీటి ప్రవృత్తులు, మనస్సు మన తెలివితేటలు, బుద్ధి మొదలైనవి వాడుకుంటున్నాం అని అనుకుంటూ, మనం దేనికి వాడుకుంటున్నామో తెలియకుండా, వాటి ప్రయోజనం ఏమిటో తెలుసుకుంటానికి ఆలోచించే రోజు రాలేదు. ఎందుకివ్వ బడ్డాయి అవి? మనం ఏది పని అని అనుకుంటున్నామో, వాటికి ఉపయోగించు కుంటున్నాం. మనం అనుకుంటున్నది పనికిరానిది. అది స్పష్టమైంది. కనుక ''ప్రత్యయః అవిశేషః భోగః'' ప్రత్యయము నందు, అంటే purpose అంటే గమ్యస్థానము, పరమ ప్రయోజనము నందు, అవిశేషమైనటు వంటి భోగం ఉంటుంది. అలా ఉంటూ ఉండడం ''పరార్థత్వాత్''. ఇంకా యివి ఎందుకు పుట్టాయో తెలుసుకుంటాడు. 'పరం' అంటే పురుషుడు అని చెప్పామే వాడు. 'అపరం' అంటే తక్కువది అంటే సత్త్వము. వీడు వాణ్ణి చూట్టంకోసం పుట్టినది. ఇవన్నీ ఈ మైక్రోస్కోపు, ఈ టెలిస్కోపు లేబరేటరీలోకి తీసికెళ్ళి, కుర్రాడికి ఊరికే ఏం తెలియని వాడికి చూపిస్తే పెద్దదిగా కనిపిస్తోంది నాయనా. దోమకాలు ఎలుక కాలంత కనిపిస్తుంది. వెంట్రుక ముక్క తీసి అక్కడ పెట్టినట్లైతే పెద్ద మేడల్లే కనిపిస్తుంది. దీన్నే ఫ్లూయమ్-గోయమ్ అంటారు.

పెద్దవి కనిపిస్తాయి. ఇలా చెప్పారనుకోండి అబ్బ! బాగా అంతంత పెద్దవి కనిపిస్తాయి. చూస్తూ ఉండటం- దాంట్లోంచి లాగుతూ ఉండటం. కుర్రాడికి ఏమైనా తెలుస్తుందా? మొదటిరోజున మైక్రోస్కోపు చూపిస్తే ఎందుకు వాడతారో వాడికేమైనా తెలుస్తుందా? సైన్సు లేబరేటరీలో మైక్రోస్కోపు, టెలిస్కోపు ఎందుకు పెట్టారో వాణ్ణి పుటం పెట్టినా అర్థం అవుతుందా? కుర్రాడికి ఎలా అయితే అర్థంకాదో మనకు ఇన్ని జన్మలలోను ఆ ప్రశ్న రాలేదు కనుక ఈ కన్ను, ముక్కు, చెవి ఎందుకు యివ్వబడ్డాయో, మనస్సు ఎందుకు యివ్వబడ్డదో, బుద్ధి ఎందుకు యివ్వబడ్డదో, వివేకం ఎందుకు యివ్వబడ్డదో, అనే ప్రశ్న రాలేదు కనుక బోధపడలేదు. ఈ ఒక్కటే ప్రశ్న యింకా వేయి జన్మల వరకు రాకపోతే, వేయి జన్మల వరకు బోధపడదు. అందుకని 'పరార్థత్వాత్' అంటే ఈక్రిందనున్న మనిషి ఆపై నున్నటువంటి మనిషిని చూట్టకోసం, పరము అయినటువంటి దానికోసం ఏర్పడ్డాయి అని తెలుస్తుంది. ఈ కంటితో అవతలివాళ్ళ రూపాలు చూసి, ఆ రూపాలతో అవతలివాళ్ళ రూపాలు పరమాత్మ యొక్క, సాన్నిధ్యమునందు, పరమాత్మ యొక్క రూపములుగా తిరుగుతూ ఉన్నాయి. భగవంతుని యొక్క ఈ రూపములు లీలార్థంగా తిరుగుతూ ఉన్నాయి అని తెలియాలి. అంటే non-god ని చూడటం అనే వ్యాధి పోవాలి. దేవుడు, దేవుడు కానివాడు, brahmin, non-brahmin లా ఉండదు. సమస్తము అంతర్యామి, భగవంతుడని చెబుతాడు, దేవుడును దేవుడు లేనివాడు, జడము, చేతనము యిలాంటి వెట్టి కబుర్లన్నీ చెబితే ఏం లాభం? అందుకని ''పరార్థత్వం'' అంటే the Higher purpose- పరమ ప్రయోజనము. దీనికంటే పై ప్రయోజనం ఉండటంవల్ల అది తెలుసుకుంటే ఒక్కమాటు 'స్వార్థ సంయమం' చేస్తారు మీరు. అంటే మీకోసం ఉపయోగించుకుంటం యందు ధారణ, ధ్యాన సమాధులు ఉపయోగించి సంయమం చేసేస్తారు, arrest చేస్తారు, suspend చేస్తారు. అంటే, కంటితో చూడ్డం; చూడవలసివస్తేనే చూస్తారు. ఒక ఉద్యోగం చేసే వాడికి క్రొత్తగా కారు యిచ్చారనుకోండి. అక్కర్లేని నానా అడ్డమైన పనులకీ కార్లల్లో తిరిగినట్టు చేస్తున్నాం మనం యిపుడు. కాని, వాడు బాధ్యత తెలిసిన తర్వాత ఆఫీసు పనిమీద మాత్రమే కారుమీద వెడుతున్నాడు. అది అక్కడపెట్టి యింటికి రిక్షామీద వస్తున్నాడు. ఇంటిదాకా కూడ ఆఫీసు కారుమీదే వెళ్ళకూడదా అన్నమాటకి, హద్దేముంది అనడిగితే సమాధానం లేదు. కనుక

అన్ని కాలములయందు, అన్ని రకములైన వాళ్ళూ ఉన్నారు ప్రపంచములో. అలా ఈ పంచేంద్రియముల యొక్క ప్రజ్ఞలు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము, తెలివితేటలు వీటియందు ఆ రకమైనటు వంటి పరమ ప్రయోజనము పుట్టి, తమ ప్రయోజనము అనేటువంటి దానికి వాడుకుంటం అనే స్థితి దాటిపోయిన వాళ్ళుగా ఏర్పాటు అవుతారు. దానిపేరు సంయమం. ధారణ, ధ్యాన, సమాధులు సంయమంచేస్తే, తలకాయ తిప్పి అక్కడెవరున్నారో చూద్దామనే దృష్టి ఎప్పుడో పోతుంది. నలుగురు అక్కడ మాట్లాడుకుంటూ ఉంటే, పోట్లాడుకుంటూ ఉంటే, అది ఏమిటో చూద్దాం అనే కుక్కబుద్ధి ఎపుడో పోయింది. ఇద్దరు గోడవతల మాట్లాడుకుంటూ ఉంటే తనని గురించే మాట్లాడుకుంటున్నారు అనేటువంటి నీచస్థితి ఎపుడో పోయింది. అవి ఉండవు. అంటే ఆరాటం ఉండదు. కనుక వాడు చెయ్యి కదిలించినా, కాలు కదిలించినా, తల కదిలించినా, ఆ అన్నా, ఊ అన్నా, ఈ చెప్పబడిన పరమ ప్రయోజనం కోసమే చేస్తాడు. ఇంకో దానికోసం చేయడు. ఆ పరమ ప్రయోజనం పేరే విశ్వశ్రేయము. జగత్తు అనే రూపంతో పరమాత్మ కనిపిస్తున్నాడు. కనుక ఆ పరమాత్మని జగత్తుగా మనం చూస్తుంటే మనలో ఉన్న కామక్రోధాల కారణంగా వాళ్ళయందు మనకి లోపాలు కనిపిస్తున్నాయి. కనుక మనలో ఉన్న blind spots వల్ల వాళ్ళ మొహాన చుక్కలు ఉన్నట్లు కనిపిస్తున్నాయి. ఒకడు మంచివాడు, ఒకడు చెడ్డవాడు, ఒకడు దొంగవెధవ, ఒకడు చాల దురాశ కలవాడు, ఒకడు చాల అనుమానం కలవాడుగా కనిపిస్తారు. ఎంచేత? మనలో ఉన్నాయి, ఆ spots అన్నీ. అవి పోయేదాకా వాళ్లకి సేవ చేసుకోవాలి. ఎవళ్ళని చూస్తే చుక్కలు కనిపిస్తున్నాయో, వాళ్ళకే సేవ చేసుకుంటే పోతాయి. వాళ్ళని వదిలిపెట్టి గదిలో కూర్చుని, కాలిమీద కాలు వేసుకొని, యోగాభ్యాసం చేస్తే, ఉరేసుకొని చచ్చినాసరే, ఏం లాభం లేదు. అంటే ఎవళ్ళని చూస్తే వీడికి కోపం, ఈర్ష్య, అసూయ, మద మాత్సర్యాలు, కామము, క్రోధము కలుగుతున్నాయో, వాళ్ళని చూస్తూనే తను అవి పోగొట్టుకుంటం సాధించాలిగాని, వంటరిగా కూర్చొని, ఉట్టి కట్టుకొని ఊరేగటం వల్ల ఏం లాభంలేదు. అందుకని ''పరార్థత్వాత్ స్వార్థ సంయమాత్'' స్వార్థము కూడ సంయమము జరుగట వలన, తనకోసం ఉపయోగించుకొనుట సంయమం జరుగుతుంది. ఇది చాతనయిన వాడికి ''పురుషజ్ఞానమ్'' వస్తుంది. అంటే తాను ఎట్లా పరమాత్మో తెలుసుకుంటాడు. తాను ఎట్లా

జీవాత్మే తెలుసుకుంటాడు. తాను జీవాత్మ. తాను పరమాత్మ. అంటే ఏమిటి? టార్చిలైటు వేస్తే బల్బులోంచి యివతలకి వస్తున్నటువంటి లైటు; టార్చిలైటు లోంచి యివతలకి వస్తున్న లైటు. ఈ రెండవది మొదటి దానిమీద ఆధారపడి ఉంది. ఈ రెండవదానికి వేరే ప్రత్యేకంగా బ్రతుకు లేదు, వేరే అస్తిత్వమూ లేదు. కనుక అసలు నేను తెలుస్తుంది. రెండవ నేను తెలుస్తుంది. ఓ నేను పేరు పురుషుడు. తక్కువ నేను పేరు సత్త్వము. కొంచెం క్లిష్టమైన సూత్రం. జ్వాలాకూలుడు ఏం చెప్పాడో అదికూడ చూద్దాం. **"Experience of pairs of opposites comes from the inability of the soul to distinguish between the personal poise and the spirit"** ''(పురుష)'' **"The objective form adjusts for the ease and experience of the spiritual man".** కనుక ఏం చెప్పాడు? పదార్థంకోసం వాడటానికి ఉన్నాయని తెలుసుకుంటాడు. **By meditating upon this, arises the imputive perception of the spiritual nature.** అనగా తన ధారణ, ధ్యాన, సమాధులు ఈ అభిప్రాయం ఏమిటో తనయందు సమన్వయం చేసికొనగా అన్నమాట. ఇది ఈ సూత్రం. జ్వాల్‌కూల్‌గారు A.A. బైలీని కూర్చోబెట్టి స్వంతంగా dictate చేసారు. ఈ పేజీలు తీసేసి సమన్వయం చేసారు. పైగా దానికి తగ్గట్టు వ్యాఖ్యానాలు రాసినవాళ్ళు ఎవడికి తోచినది వాడు రాసారు. ఏ రెండు వ్యాఖ్యానాలూ ఒకటిగా లేవు. ముగ్గురో, నలుగురో మహానుభావులు- గంగనాథ్‌ఝా, వివేకానంద లాంటి వారు బాగా వ్రాసిన వారున్నారు. బాగా చక్కగా మొట్టమొదట ఆంగ్లంలోకి అనువాదం చేసిన మాముందు తరం వాళ్ళల్లో గంగనాథ్‌ఝా అనే పుణ్యపురుషుడు, చాల మహానుభావుడు. ఆయన తర్జుమా చేసినది ఎక్కడన్నా పాత లైబ్రరీలలో ఉంటే చూడండి.

కనుక పురుష జ్ఞానం అంటే పురుషుడంటే ఎవరో తెలియటం. ఇది వరకు తెలిసినవన్నీ ఒక ఎత్తు. ఇది ఒక్కటీ ఒక ఎత్తు. పురుషుడనగా తెలియటం అంటే ఏమిటి? ప్రతీవాడిలోను నేను అనే మాటకి నిజమైన అర్థమేమిటో తెలియటం. దీన్నే ఆత్మజ్ఞానము అంటారు. ఆత్మ ఎన్ని పొరలలో ఉంది లోపల. క్షరపురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడు అనే మూడు పొరలలో ఉంది. మారుతున్న వాడు అంటే శరీరద్రవ్యము, ధాతువులు, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి- ఇవన్నీ కలిసి పురుషుడు

అంటారు. మారనివాణ్ణి ఆత్మ అంటారు. ఈ ఆత్మలన్నీ దేనియందున్నాయో (చోటులో) అలాంటివాడు పురుషోత్తముడు అంటే అంతర్యామి. మారుతున్నవాడు, మారనివాడు వీళ్ళిద్దరూ ఎవడియందు ఉన్నారో వాడు అంతర్యామి. ఈ మూడు స్థితులలో పురుషుడు ఉన్నాడు. అందులో మొదటివాడు క్షరపురుషుని వంక చూస్తున్న పురుషుడు, సంసార బద్ధుడైనటు వంటివాడు. అంటే జీవితంలో శరీరం, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి ఎరుగుదుము. ఆపైవి ఎరగము. అపుడు మనం జీవిస్తున్న జీవితాన్ని సంసారబద్ధమైన జీవితం అంటారు. క్షరపురుషుడుగా బ్రతుకుతున్నాము. అలా గాకుండా దానిపై వున్నటువంటిది బుద్ధిమయమైనటు వంటిది, ఆత్మశబ్ద వాచ్యమైనటు వంటిది, స్వయం ప్రకాశమైనటు వంటిది, ఇందాకటి నించి వర్ణిస్తూన్నటు వంటిది, ఈశ్వర శబ్ద వాచ్యమైనటు వంటి వెలుగు ఉన్నట్లు మనకి కొంచెం తెలిసిందంటే అది అనుభవించటం కొద్దో, గొప్పో మొదలుపెట్టాం అనుకోండి. అబ్బ ఎంత సుఖంగా ఉన్నది. అనుభవిస్తూంటే అనేది తెలుస్తుంది మీకు. ''సుఖమాత్యంతికం యత్త ద్బుద్ధి గ్రాహ్యమతీన్ద్రియమ్''. భగవద్గీతలో చెప్పాడు. నిజమైన సుఖస్పర్శ అనేది అక్కడ వుంటుంది అన్నాడు. ఇంకొకడు అనుభవిస్తూంటే వాడికీ నీకు కలిసి ఆ సుఖస్పర్శ ఉంటుంది. పదిమందీ ఈ ప్రపంచంలో అనుభవిస్తూ వుంటే పదిమందికీ కలిసి వుంటుంది అదే సుఖస్పర్శ. కొన్ని కోటానుకోట్లు ఆత్మ దర్శనము కలవాళ్ళు ఉన్నారు. కనుక వాళ్ళందరికీ కలిసి ఆ సుఖస్పర్శ వుంటుంది. వాళ్ళల్లో ఎవరి సాన్నిధ్యమైనా మనకి లభించినట్లైయితే వాళ్ళ దగ్గర కూర్చున్నపుడు శరీర స్పర్శతో సంబంధం లేనటువంటి ఒకానొక స్పర్శ అనుభవిస్తాము వాళ్ళతో. దాన్ని ఆత్మజ్ఞానము అని అంటారు. బోధపడ్డ తర్వాత భక్తిస్వరూపం, ప్రేమ స్వరూపం, పరమ ప్రేమ స్వరూపం అయినటు వంటిది, నిరంతరం ప్రేమమయులై జీవించునట్టి పద్ధతి ఒకటి ఉన్నది. దాన్ని పరమ ప్రేమ స్వరూపం అని అంటారు. అక్కడ వుండేటువంటి వాడి పరమ ప్రేమ స్వరూపాన్ని చూస్తే అంతర్యామి జ్ఞానము వస్తుంది. అంటే కేవలం ప్రేమమయ జగత్తులో మీరు ఉంటారు. మిగతా కనిపించేటు వంటివాళ్ళు అంతాకూడ ప్రేమమయ జగత్తులోనే ఉంటారు. వాళ్ళు చేసేటువంటి పొరపాట్లుగాని, లోపాలుగాని, వాళ్ళు మనల్ని తిట్టేటువంటి తిట్లుగాని, మనకి చెప్పే జాగ్రత్తలుగాని, వాళ్ళకి సంబంధించినవిగాని, మనకి సంబంధించినవి

కావు. కనుక మనకి వాళ్ళతో ఎంతవరకు సంబంధం? మనం వాళ్ళకి ఏం మంచి చేయగలమో అంతవరకే సంబంధం. అదొక్కటే మిగుల్తుంది చివరికి. దానికోసమే వెతుక్కుంటూ వెడుతూ వుంటారు ప్రపంచంలో. దానిపేరు పురుష దర్శనం లేక పురుషజ్ఞానము అంటారు. సత్యానికి, పురుషుడికి మధ్య ఉన్నటువంటి సంబంధం తెలియాలి. సత్యం అంటే అస్థిత్వము, జీవితం. మనం బ్రతికి ఉన్నాం అనేదానికిన్నీ, పురుషుడు అనేటువంటి వాడికీ సంబంధం ఏమిటి? మనం మేలుకొని వుంటే బ్రతికి వున్నాం అనిపిస్తుంది. కాని పురుషుడితో సంబంధం అనేది అభ్యాసం లేకుండా బ్రతికివుంటే, అది పనియందో, ఉద్యోగమునందో, వ్యవహారమునందో, వ్యాపారమునందో, సినిమాయందో, బజారుయందో, దాంట్లో దేంట్లోనో ఒకదాని యందు బ్రతికి ఉండటం. అంతే కదా. అట్లా కాకుండా తనయందు బ్రతికి ఉండటం అనేటువంటి స్థితికి మీరు వస్తున్నారు. అపుడు ఆత్మజ్ఞానం దగ్గరికి వస్తారు. అది బ్రతికి ఉండటానికిన్నీ పురుషుడికీ ఉన్నటువంటి సంబంధం. ఆత్మకి, బ్రతికి ఉండటానికి సంబంధం ఏమిటి? ఆత్మకి బ్రతికి ఉండటం, చచ్చిపోవటం వుండదు. సీసాలో ఉన్నచోటుకి పగిలిపోవటం ఉండదు. సీసా ఆకారం ఉండదు. చోటులో సీసా ఉన్నది కనుక, సీసాలో చోటు వున్నది. కాని సీసాకు వచ్చేటువంటి స్థితిగతులతో అందులో వున్నటువంటి చోటుకి ఏమీ సంబంధం లేదు. అలాగే మనకిన్నీ, మనలో ఉన్న శరీర, మనోబుద్ధ్యహంకారాదులు మన జీవితంలో నమ్మినటువంటి నమ్మకాలు, మన ఆదర్శాలు, ఆశయాలు, మనం వర్ధిల్లాలి, నశించాలి, అని పెట్టేటువంటి వెర్రికేకలు ఈ మొదలైనటు వంటివన్నీ మనంకాదు. నీళ్ళల్లో తేల్తూ ఉన్నటువంటి మంచుగడ్డల స్థితి నీళ్ళస్థితి కాదు. అవి కూడ నీళ్ళైన తర్వాత మాత్రమే నీళ్ళు. అలాగ మనం కానటువంటి భాగాన్ని మనం జీవిస్తూ ఉన్నాం. అదంతా క్రమంగా కరిగిపోయిన తర్వాత సత్యానికి, పురుషుడికి మధ్య ఉన్నటువంటి సంబంధం లేదా సంయమము చేయటం చాతనవుతుంది.

## 37. తతః ప్రాతిభ శ్రావణ వేదనా ఉఉ దర్శాస్వాద వార్తాజాయన్తే।

*తతః* = తర్వాత (పైది చాతనయిన తర్వాత) ప్రాతిభ = రుచి తెలియుట, శ్రావణ = వినటం, వేదన = స్పర్శ తెలియుట, ఆదర్శ = కనిపించుట, వార్తా = వాసన తెలియుట ఆస్వాద = దివ్యేంద్రియ శక్తులు, జాయన్తే = పుట్టుచున్నవి.

**ఈ జ్ఞానముచేత సూక్ష్మములు, పవిత్రములు అగు వాటిని వినుట, స్పృశించుట, చూచుట, రుచి చూచుట, వాసన చూచుట అనునవి కలుగును. (ఇంద్రియముల ద్వారా పనిచేస్తూ ఇంద్రియ శక్తులు కాక వాని కతీతములైన దివ్యేంద్రియ శక్తు లుద్భవించును.)**

**వివరణ :** 'తతః' అంటే తరువాత, అంటే పైది చాతనయిన తర్వాత, పై చెప్పినటు వంటి సాధనమున నీలో జీవుడు, నీలో పురుషుడు తెలిసి తర్వాత, అంటే టార్చిలైటు లోంచి వస్తున్న లైటు, బైటికి వస్తున్న లైటు తెలిసాక, ''జాయన్తే'' పుట్టుచున్నవి. కొన్ని క్రొత్తగా పుడతాయి. అవి ఏమిటో చెబుతున్నాడు. 1) ప్రాతిభము, 2) శ్రావణము, 3) వేదనము, 4) ఆదర్శము, 5) వార్త. ఇదివరకు నీ దగ్గర లేనివి ఇపుడు పుటుతున్నాయి. ప్రొజెక్టరు లోంచి సినిమావేస్తే తెరమీద పంచేంద్రియాలు అనే బొమ్మపడటం మనం ఎరిగి ఉన్నదే. ఫిల్ముటేపులో పంచేంద్రియాల బొమ్మ ఉంటే పడుతుంది. లేకపోతే పడదు. అలా ఇందులో వేరే ఐదు ఉన్నాయన్నాడు. ఇవి పుడతాయి. ఇదివరకు మనం ఎరిగి ఉన్నవి తెరమీద పడ్డవి (magnified). టార్చిలైటు లోంచి యివతలకి వస్తున్న లైటులోనే ఈ ఐదింటిని ఎరుగుదుముగాని, టార్చిలైటు ఇవతలకి రాకుండా, లోపల బల్బులో ఎలా ఉన్నది మనం చూడలేదు ఎన్నడూ. చీకట్లోంచి వస్తూంటే కూడ ఆలైటు అలా పడుతోంది. ఆ బల్బు వాడుతున్నన్నాళ్ళు నెలో, రెండు నెలలో ఆ లైటు ఎలా పడుతోందని చూస్తున్నాము. మన బావమరిది వచ్చి, ఒరేయ్ ఆ లైటు ఎలా పడటం కాదు, ఈ బల్బులో ఫిలమెంటు ఉందని చూపిస్తే అబ్బా అని అనుకున్నాం. అలా ఈ ఐదూ ఉన్నాయి. 'వార్త' అంటే? వర్తించటం, వాసన తెలియుట, గంధం. ముక్కు అక్కర్లేదు. మీకు వాసన తెలుస్తుంది. ఆదర్శం అంటే కనిపించటం. కన్నుద్వారా కాకుండా మనకు వెలుతురు, రూపము మొదలైనటు వంటివన్నీ తెలుస్తాయి. వేదనము అంటే చర్మంతో సంబంధించకుండా స్పర్శ

తెలుస్తుంది. శ్రావణం అంటే వినటం. చెవితో సంబంధించకుండా వినటం తెలుస్తుంది. ఇక మిగిలిందేమిటి? రుచి. ప్రాతిభము అంటే ప్రతిభాసించు నట్టిది. రుచి తెలియటం, నాలికతో సంబంధించకుండా రుచి అనేది మీకు పుటుతుంది. అలా బాగుంటాయా అండి? మనకోసం కాదు అనే స్థితి వచ్చాక ఋవి వస్తాయన్నాడు. కనుక బాగుంటం అనే ప్రసక్తిలేదు. ఇందాక సూత్రంలో ఏం చెప్పాడు? మన ప్రయోజనం కోసం వాడుకుంటం అనే వ్యాధి తగ్గిపోయిన తర్వాత కదా అది వస్తుందన్నాడు. అందుకని, ఇపుడు మనం ఎరిగున్నటు వంటి పంచేంద్రియముల శక్తులకు originals మీలో పుడతాయంటున్నాడు. డూప్లికేట్సు అనుభవిస్తున్నారు మీరు. ఇవన్నీ రేడియో పెట్టెలో బిగించనటు వంటి రేడియో తెలియటం కాకుండా, రేడియో ఇంజనీరింగు తెలుస్తుంది. అంటే మీరు కూడ ఇంకో పెట్టెలో బిగించగలరు. టెలివిజన్ అంటే పెట్టెలో ఉంది అనేటువంటి అయోమయం కాకుండా, అపుడు టెలివిజన్ తయారు చేయడం తెలుస్తుంది. ఇట్లాగ మీ పంచేంద్రియాలు తయారు చేసుకుంటారు. సృష్టించుకుంటారు. నిర్మాణం చేసుకుంటారు. వీటిని దివ్యములు అంటారు. దివ్యములైనటు వంటి పంచేంద్రియ స్పర్శలు వస్తాయి. ఎందుకు పనిచేస్తాయి? విశ్వశ్రేయస్సుకి పనిచేస్తాయి. దానికి, మనకి సంబంధ బాంధవ్యములు ఏర్పడతాయి. ఎట్లా ఏర్పడతాయో చూద్దాం.

సత్త్వము, పురుషుడు మధ్య ఉన్నటువంటి సంకీర్ణతను తగ్గించి, అసంకీర్ణతను పెంచుకున్నపుడు పురుష జ్ఞానము కలుగుతుందన్నాడు. తర్వాత ఈ దివ్యేంద్రియ శక్తులు కలుగుతాయి. ఈ చెప్పుకున్న దాంట్లోనే సత్త్వము, పురుషుడు, దేహము. ఈ మూడు మనం విడదీసి సైంటిఫిక్‌గా చెప్పుకున్నట్లైతే, సత్త్వముకి, పురుషుడికీ తేడా తెలుస్తుంది. ఇంకొక శాస్త్రంలో ఈ ముగ్గురినీ ఈ దేహంలో ఉన్నటువంటి body consciousness యేగాని, matter కాదు అంటారు. ఎందుకంటే matter లో ఉన్నది కూడ matter consciousness యేగాని matter కాదు. అది తెలియాలి. Matter is how it appears; not as how it exists అని ఒక వాక్యము. అంటే ఇది మనకు కనిపిస్తున్నటు వంటిది మన కంటికి, మన చేతికి, మనకి సంబంధించినటు వంటిది. దాంట్లో ఉన్నది, దాని పరమాణువులకి సంబంధించినది. దానికి,

దీనికీ ఏమీ సంబంధం లేదు. కనుక ద్రష్టకు సంబంధించిన అస్తిత్వము ఒకటి, తనకు సంబంధించినటు వంటిది ఒకటి, దృశ్యమునకు సంబంధించినది ఒకటి. ఈ మూడింటినీ ఇంకొక శాస్త్రంలో ఉన్నవాళ్ళు క్షరపురుషుడు, అక్షరపురుషుడు, పురుషోత్తముడు అని మూడు విధాలుగా చెప్పుకొచ్చారు. అప్పటివరకు కొన్నివేల సంవత్సరాలనించీ ఉన్నటువంటి వేర్వేరు శాస్త్రజ్ఞుల యొక్క శాస్త్ర శాఖల సమన్వయమే భగవద్గీత. గనుక భగవద్గీత పదిహేనవ అధ్యాయంలో ఇదికూడ కనిపిస్తుంది. ''ద్వావిమౌ పురుషౌలోకే క్షరస్చాక్షర ఏవ చ''. క్షర పురుషుడు, అక్షర పురుషుడు అనిచెప్పి, two peronal truths we are having అన్నాడు. ''క్షర స్సర్వాణి భూతాని'' సమస్త జీవరాసులు, మనం చూస్తున్న దేహాలు మొదలైనటు వంటివి 'క్షరం'. అంటే నశిస్తాయని అర్థం కాదు. మార్పు చెందుతాయని అర్థం. అంటే ఇపుడున్నది కాసేపయ్యాక ఉండదు. ఉన్నా, ఇంకాసేపాగి ఉండకపోయినా, అది అక్కడే ఉంటుంది. అది తెలియాలి. ఇపుడు ఉండటం, కాసేపు తర్వాత నశించటం అనేటువంటిది మన మనస్సుకీ, మన కంటికీ, గమనించే వాడికి, చూచేవాడికి సంబంధించినది కాని, ఆ వస్తువుకి సంబంధించినది కాదు. కనుక క్షరపురుషుడూ శాశ్వతుడే. ఇలాగ మార్పు చెందుతున్న వాడుకాక, పరమాణువు దగ్గరనించి, మనుష్యుల స్థితిదాకా పరిణామం సమస్తం పూర్తి చేసుకొని, అంటే పరమాణువు, ఖనిజముల నుండి వృక్షములు, జంతువులు, అక్కడనుండి నరజీవుల వరకు పరిణామంగా పూర్తయి, నరులలో జిజ్ఞాసువులు, ముముక్షువులు, సత్త్వజీవులు అయినటువంటి వాళ్ళుగా, యోగ సిద్ధులుగా, పరిపూర్ణులుగా, perfect human beings గా పూర్తయి వచ్చేటప్పటికి కొన్ని లక్షల సంవత్సరాలు పడుతుంది. ఇన్ని లక్షల సంవత్సరాలు పట్టినప్పటికి కూడ మార్పులు ఆ ఒక్క పరమాణువుకే జరుగుతున్నాయి. ఆ పరమాణువునే జీవి అంటాం. మనలో కూడ జీవి అనేటువంటిది అదొక్కటేగాని, ఈ శరీరంలో ఉన్నటువంటి మిగతా భాగం అంతాకాదు. మిగతా భాగమంతా అనేక కోటానుకోట్ల పరమాణువులు. అందులో ఒక్కొక్క పరమాణువు మళ్ళీ ఒక్కొక్క జీవి. లోపల హృదయంలో జీవిగా ఉన్నటువంటిది ఏదైతే ఉన్నదో, దానికివన్నీ కూడ సేవచేస్తూ, అంటే scout

workers క్రింద ఉన్నాయి. అంటే ఆఫీసరూ మనిషే. గుమస్తాలూ మనుషులే. బంట్రోతులూ మనుషులే. అయినప్పటికిన్నీ ఒకడు ఆఫీసరు, కొంతమంది గుమస్తాలు, కొంతమంది బంట్రోతులుగా ఉన్నట్లు, సీనియరుగా ఉన్న పరమాణువేమో జీవుడుగా ఉంటున్నాడు. జీవుడుగా ఉన్న పరమాణువేమో అక్షర పరుషుడుగా ఉంటున్నాడు. వాడిదగ్గర జూనియరుగా ఉన్నటువంటి పరమాణువులు, రోజూ వాడు తీసుకునే ఆహారం, నీళ్లు మొదలైన రూపంలో క్షరపురుషుడుగా ఉంటున్నాడు. ఇది ఒక శాస్త్రీయ పరిజ్ఞానము (Scientific understanding) ఇపుడున్న బయాలజీ పద్ధతిలో చూడకుండా ప్రకృతి (nature) ని దృష్టిలో పెట్టుకొని ఏం జరుగుతుందో చూస్తే, academic interest తో కాక, scientific interest తో చూస్తే, మనకి దొరికే అంశములు ఇవి. అందుకనే ''అవినాశి తు తద్విద్ధి యేన సర్వమిదం తతమ్''- భగవద్గీత రెండవ అధ్యాయం. ఈ మూడింటిలో ఉన్న దాన్ని x అనిపేరు పెట్టినట్లుగా 'తత్' అని పేరు పెట్టమన్నాడు. తత్ అంటే that అది. దాన్నే 'అవినాశి' నశించేది కాదు; అని ముందు తెలుసుకొని, అపుడు స్టడీ చెయ్యమన్నాడు. ఈ శాస్త్రీయమైన అవగాహన (scientific back ground) రావాలి ముందు. ఈ మూడింటిలో ఏ స్థితులలో ఉన్నటువంటిదైనా ''అవినాశే యేన సర్వమిదం తతం''. దేనితో ఈ సమస్తం వ్యాపించి ఉన్నదో దానికి నాశములేదు. ఈ మూడును ''వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తుమర్హతి''. దీంట్లో దేనికీ కూడ వినాశం ఎవ్వడూ చేయడు. Indistructability ఎపుడూ ఉన్నది. అది తెలియాలి. ఇది రూపాలు మారుతూ ఉన్నటు వంటిదిగా మూడవ భాగమైన పురుషుడు. ఇంకొకటి మారనటువంటి వాడుగా ఒక మూడవ భాగమైన పురుషుడు. వీళ్ళిద్దరూ ఏ back ground మీద పనిచేస్తున్నారో, దాన్ని eternity అంటారు. ఆ మూడవ భాగమైన వాణ్ణి పురుషుడు, రెండవవాణ్ణి సత్త్వము అని అంటారు. ఇది క్రీస్తు చెప్పినటువంటి పరిభాషలో Son of man అంటారు. క్రీస్తు చెప్పినది అంటే క్రైస్తవుడు చెప్పినది అని అర్థం కాదు. పెద్దలు క్రీస్తు చెప్పిన పరిభాషని మనకి అందించారు. అందించిన దాంట్లో ఈ రెండవ సత్త్వ స్థితిలో ఉన్నటువంటిది మనలో ఉన్నటువంటి భాగము. New Testament లో ఉంటాయి ఆ పదాలు. పెద్దలు, ఆ సంప్రదాయంలో

ఉన్నవాళ్ళు చెప్పాలి. Son of man వాడు పరిశుద్ధుడు అవ్వాలి. వీడితో అయ్యేటప్పటికి వాణ్ణి Son of God అంటారు. అంటే వీళ్ళిద్దరూ focus అవ్వాలి, reset అవ్వాలి. అంటే అసంకీర్ణత పోవాలి. సంకీర్ణత వచ్చేటప్పటికి వీడికి son గా వాడు ఉండటం మొదలు పెడతాడు. అపుడు వీడిపేరు క్రీస్తు అంటారు. కనుక క్రీస్తు అంటే ఒక వ్యక్తిపేరు కాదు. క్రీస్తు అనే మాటకి అక్షర పురుషుడు లేక పరిశుద్ధుడైనటు వంటి ఆత్మ అని అర్థం, వాడు ఎవరియందు ఉంటున్నాడు? ఎవరితో contact లో ఉంటున్నాడు. My father in Heaven అన్నాడు జీసస్. కనుక వీరిద్దరికీ ఉన్న సంబంధం సరిగ్గా పదిహేనవ అధ్యాయంలో చెప్పినట్లే చెప్పాడు. My father in heaven speaks through me. వీడు నా ద్వారా మాట్లాడుతున్నాడు అన్నాడు. ఇంకొక చోట I and my father in heaven are one. అయి ఉండికూడ మీ అందరి మధ్యకి నేను వచ్చాను అన్నాడు. మనం చేసే పాప పుణ్యాలు అన్నింటిలోకి contact లోకి వచ్చాడు. ఈ ముగ్గురినీ కూడ మనం నేననే పేరుతోనే పిలుస్తున్నాము. ఇందులో ఎవణ్ణి పిలుస్తున్నామో, మనం ఎవడిగా ఉంటున్నామో తెలీదు. అందుకని ఆయన ఏమన్నాడంటే I came down to earth. ఈ 'నేను' అనబడు రెండవ పురుషుడుగా భూమికి నేను దిగివచ్చాను. యిక్కడ మీ మధ్య ఉంటున్నాను అన్నాడు. అంటే ఒకణ్ణి ఒకడు ఒరేయ్ వెంకటస్వామి రావయ్యా అని పిలుచుకునే వాడుగా ఉంటున్నాను అన్నాడు. I will not be with you for a long time అన్నాడు. అంటే మీ మధ్య ఎక్కువకాలం ఉండను అన్నాడు. ఎందుకు అంటే అసలు పురుషుడివైపు మొగ్గవలసి వస్తుంది అన్నాడు. అది పతంజలి చెప్పిన యోగసిద్ధి అంటే. అంటే ఇక్కడ ఎక్కువకాలం ఉండేందుకు కాదు వీడు వచ్చినది. దీంట్లో ఉన్న క్షరపురుషుడు అంటే సప్తధాతువులు, వాటికి కావలసిన పంచేంద్రియములు, రుచులు వాటికి సంబంధించినటు వంటివి కావలసినంత ఎక్కువకాలం ఉండటంకోసం రాలేదు. అది వదిలి మెల్లిగా యివతలకివచ్చి, అసలువాడి వైపుకి gravitate కావటంకోసం వచ్చాడు. కనుక ఏమని చెప్పాడు? ఉపదేశంలో I will not be with you for a long time. మీతో ఎక్కువకాలం నేను ఉండను అన్నాడు. అంటే క్రైస్తవులు శిలువ కొట్టేసేయటం ఆయనకి ముందే తెలుసు.

అంచేత ఎక్కువకాలం ఉండను అని చెప్పాడు. అన్నారు. ఆయన ఏం ఉపదేశిస్తున్నాడో చూసుకోకుండా వీళ్ళు ఏవో చెప్పేసారు. ఆయన శాశ్వత సత్యాల్ని ఉపదేశిస్తున్నాడు. అంతేకాని రేపు జరగబోయేది నేను ముందే చెప్పాను చూసావా అనే చవకబారు జోస్యం కాదు, ఆయన చెప్పినది. Prophesy అంటే astrology కి సంబంధించినది కాదు. తెల్లవారే లోపల మూడుమాట్లు, కోడికూసే లోపల మూడుమాట్లు నువ్వు నన్ను కాదంటావు, అన్నాడు. ఇవి లెక్కపెట్టుకుంటూ కూర్చున్నారు. అంటే వాడేం చెబుతున్నాడో తెలియక వీళ్ల లెక్కపెట్టుకున్నది వేరు. ముందే చెప్పాడు ఆయన. Pearls are thrown before the swines. పందులముందు ముత్యాలు పడేసినట్లుగా కొన్ని వాక్యాలు నేను మీ ముందు పడేసాను అన్నాడు. తర్వాత those who have ears to hear can hear and eyes to see, can see. దీన్ని చూట్టానికి కావల్సిన కన్నులు కలవాళ్ళు మాత్రమే చూస్తారు. దీన్ని వినటానికి కావల్సిన చెవులు కలవాళ్ళు మాత్రమే వింటారు. అంటే క్రాసు కట్టుకున్నవాళ్ళు, నామాలు పెట్టుకున్న వాళ్ళు అన్నట్టు కాదు. అంటే ఈలోకం వేరు, ''మాలోకం''. ఆ లోకం వేరు. కనుక దీన్ని క్రీస్తు అంటారు. దీన్ని గురించే రోజా జ్వాల్‌కూల్‌గారు యిచ్చినటువంటి ప్రేయరులో From the point of Love అని చెప్పిన చోట May christ return to earth అనేటు వంటిది చెప్పారు. అంటే వీడు పురుషునిచేత పరిశుద్ధుడై, వీడిచేత పనిచేయిస్తూ ఉండాలి. వీడినే Spirit అన్నాడు. Holy Spirit అంటే ఒక్కొక్క సంప్రదాయంలో ఒక్కొక్కలా ఉంటుంది. కనుక ప్రేమకు ఆస్పదమగునటు వంటిది ఏదైతే ఉన్నదో, నారద భక్తి సూత్రాలలో పరమప్రేమ అనేటువంటి పేరుతో ఏది చెప్పబడుతుందో, అది ఎవరికి అంటవలసి ఉంటుందో, వాడే మనం చెప్పుకున్నటు వంటి సత్త్వము. వాడు ఎవరియందైతే ఉండి వెలుగుతున్నాడో వాడే పురుషుడు. ఈ సత్త్వము, ఈ దేహమూ ఈ రెండూ లేనపుడు చోటున మనం ఉంటున్నామా? అక్కడ పురుషుడు ఉంటున్నాడు. అక్కడనించి సత్త్వము యివతలకివచ్చి, అక్కడ నించి దేహం యివతలకి వచ్చినపుడు, గర్భంలో ఒకడు పుట్టాడు అంటాము. ఎక్కడనించి పుడతాడు అంటే అక్కడనించే. ఇది గుర్తుపెట్టుకొని మళ్ళీ పైకి వెళ్లాలి.

దానిమీద సంయమము చేసినటువంటి వాళ్ళకి ప్రాతిభము, శ్రావణము, వేదనము, ఆదర్శము, వార్త అనేటువంటివి వస్తాయన్నాడు. అంటే ఆహారం తినాలనుకోండి. తినక్కర్లేదు వీడు. ఎక్కడా దొరక లేదనుకోండి. యోగాభ్యాసం చేసిన వాడికి. ఎక్కడా దొరక్కపోతే దొరికేదాకా వాడు అక్కడా యిక్కడా అడుక్కుంటం చేయనక్కర్లేదు. అలా కూర్చుని ఉంటాడు. ఏం చేస్తున్నాడో ఎవరికీ తెలీదు. వాడికి రుచి ఎక్కడ ఉంటుంది? ఇంద్రియములు ద్వారా కాకుండా, ఇంద్రియములకు అవతల ఉన్నది. మనం ఇంద్రియముల ద్వారా అనుభవిస్తున్న రుచికూడ ఇంద్రియములకు అవతల ఉన్నటువంటిదే కాని, ఇంద్రియాలది కాదు. మనం కంటిద్వారా, చూస్తున్నటు వంటిది కూడ కన్ను అనేటువంటి గుడ్డు చూడటంలేదు. కంటిద్వారా ఈ కన్ను అనే గుడ్డుద్వారా చూస్తున్నాం. అందుకనే మనకు ఉపనిషత్తులు మొదలైనవి, ఏదైతే కంటిద్వారా చూస్తోందో, దేన్నైతే కన్ను చూడలేదో, అని చెప్పారు. కనుక ఈ కంటిద్వారా చూస్తున్నటువంటి చూపు ఒకటి దాంట్లో ఉన్నది అది అందుతుంది మీకు 'ఆదర్శం' అనే దాంట్లో. ఈ చెవిద్వారా వింటూ ఉన్నాం. చెవి వినటంలేదు. చెవి వినటం లేదు గనుక స్పష్టంగా తెలుస్తోంది చెవిద్వారా యింకొకడు వింటున్నాడని. వాళ్ళందరికీ మనం అనే పేరుతోనే అయోమయం. అంటే మామూలుగా ఈ జిల్లా మొత్తంలో ఉన్నవాళ్ళందరికీ దేవుడు అనిపేరు పెట్టేసారనుకోండి, గవర్నమెంటు వాళ్ళు బలవంతంచేసి. అపుడెలాగ ఉంటుందో అలాగే ఉంటుంది. మనలోపల ఉన్నటువంటివి ఒక వెయ్యి వ్యూహాము లుంటాయి. అందులో ప్రతిదానికి నేను అనే పేరు. ఎట్లా? దేవుణ్ణి పిలవరా, దేవుడు అంటారు. ఏ దేవుణ్ణి పిలవాలో దేవుడు చెప్పాల్సిందే. మళ్ళీ, అపుడు లావు దేవుడు, సన్న దేవుడు, పళ్ళదేవుడు, తొర్రి దేవుడు, క్రాపు దేవుడు, బట్టతల దేవుడు, పిలక దేవుడు యిలా పెట్టుకుంటూ దేవుళ్ళాడాలి. ఇపుడు మనం అలాగే దేవుళ్ళాడుతున్నాం ఈ నేను అనే పదంతో. అంటే ఒకే పదంతో ఇన్ని వందల మందిని పిలుస్తున్నాం. దీంట్లో మనకి చెప్పిందేమిటంటే ఆ వినేటువంటి వాడు చెవిద్వారా వినడు. ఇది వరకల్లా చెవిద్వారా వాడే వింటున్నాడు. ఇపుడు చెవి అట్లా ఉంచి, వాడు వినటం నేర్చుకుంటాడు. అయితే వీటివల్ల ఏం వస్తుంది?

అక్కడెక్కడో ఉత్తర దేశంలో ఒక మహానుభావుడు రామాయణం చెబుతుంటే వినాలి. ఎట్లా వెళతాం మనకి ఉద్యోగం, వ్యవహారం ఉన్నాయి. కాని మీరు వినగలరు. అలాగే హిమాలయాల్లో ఎవరో ఏదో సాధన నేర్పుతున్నారు. నేర్చుకోవాలి. నేర్చుకుంటారు. అలాగే ఒక్కొక్కపుడు మీరు సాధన చేసుకుంటూ తీర్థయాత్రకి వెడుతూంటే మీకు అన్నం, నీళ్ళు దొరకలేదనుకోండి. మీ పద్ధతి మీకుంది అన్నాడు. ఇలాంటి వాటికోసం పనికొస్తాయి. ఇది ఒకటే. ఇంతకు తప్ప ఇంకెందుకూ పనికిరావు. కాని ఏమని తెలుస్తుందంటే మీకు ఈ పంచేంద్రియముల యొక్క వృత్తులు- మనం చూస్తున్న పంచేంద్రియాలవి కావు; అవి వీటి కతీతంగా అంతకు ముందునుంచే ఉన్నాయి. వీటిద్వారా పనిచేస్తున్నాయని తెలుస్తుంది. అంటే ఆ కుర్చీలో కూర్చున్న ఆయన ప్రెసిడెంటు అని తెలుస్తుంది. మన ఉద్దేశ్యం ఏమిటి? ఆ కుర్చీలో ఎవడు కూర్చుంటే వాడు ప్రెసిడెంటు అని అనుకుంటున్నాం అదివరకు. తర్వాత ఈ కుర్చీలో కూర్చున్న ప్రతివాడూ ప్రెసిడెంటు కాదు అని తెలుస్తుంది. ప్రెసిడెంటు ఈ కుర్చీలో కూర్చుంటాడు. వాడితో మనకి పరిచయమయ్యాక కుర్చీలో కూర్చోకపోయినా, ఆయన నిల్చుని ఉన్నా, నమస్కారం ప్రెసిడెంటుగారు అంటే నమస్కారమండి! బాగున్నారా! అంటాడు. ఇది కొంచెం సంతకం పెట్టండి. తొందరగా అర్జంటుగా పంపాలి అంటే పెట్టేస్తాడు సబబుగా ఉంటే. కుర్చీలో కూర్చోకుండా పెడితే ఎట్లా? అనే పాయింటు లేదుగా. ఇదివరకు అజ్ఞానపు స్థితిలో ఆ కుర్చీలో డఫేదారు కూర్చొని ఉన్నా, వాణ్ణే సంతకం పెట్టమని అడుగుతాం ప్రెసిడెంటనుకొని. అందుకని కంటిద్వారా చూస్తున్న చూపు అదే చూపు అనుకుంటున్నాం. కాని కంటిద్వారా చూడక్కర్లేదు. అవన్నీ ఈ పంచేంద్రియాలకి సంబంధించినవి.

దివ్యము లైనటువంటి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధముల యొక్క అనుభూతి మీకు కలుగుతుంది. ఈ కలిగినందువల్ల మీకుగాని, యింకొకరికిగాని, ఎక్కడికైనా వెళ్ళినపుడు యిబ్బందులు వచ్చినపుడు ఎవళ్ళని చేయిచాచి దేహి అని అడగక్కర్లేకుండా, మీ పద్ధతిలో మీరు నడచి వెళ్ళిపోవచ్చు. అంతకంటే యింకాస్త ఎక్కువ ఉపయోగిస్తేనో? ఉపయోగించవచ్చు. ఎలాగ? మీకు గులాబి పువ్వుల వాసన కావాలా? సంపెంగ పూవుల వాసన కావాలా?

లేకపోతే మంచిగంధం వాసన కావాలా, అని అడిగితే అందరూ తలొకటి మనస్సులో అనుకుంటారు. ఒకమాటు కళ్ళు మూసుకొని తల్చుకోండి, అనేటప్పటికి ఎవరి వాసన వాళ్ళకి తగుల్తుంది. ఇలా ప్రదర్శనం చేయచ్చు. ఏం కష్టం లేదు. అలాగే మీకు జామపండు తింటున్న రుచి కావాలా? మామిడి పండు తింటున్న రుచి కావాలా? పిప్పరమెంటు తింటున్న రుచి కావాలా? ఎవడి రుచి వాడికి. చూపించవచ్చు. అలాగే మీకు హిందూస్థానీ సంగీతం కావాలా? కర్ణాటక సంగీతం కావాలా? Light music కావాలా, Heavy music కావాలా? ఇపుడు రేడియోలో ఎక్కడెక్కడ ఏం ప్రోగ్రాంలు వస్తున్నాయో దానితో ట్యూన్ చేసేసెయ్. ఇలా చేస్తూంటే ఇదికూడ జరుగుతుంది. ఇదికూడ తాను అనుభవించవచ్చు. ఇంకొకళ్ళ చేత అనుభవింప చేయవచ్చు. ఇవన్నీ నిజంగా ప్రయోజనములేనా? క్రొత్తగా చాల ఖరీదైన మంచి కారు మీకు గవర్నమెంటు వాళ్ళు యిచ్చారనుకోండి ఉద్యోగరీత్యా. అది మనకి సదుపాయమైనటు వంటి విషయమేనా? అని అడిగినట్లు. మీరు ఆఫీసు పనులకు దానిని ఉపయోగిస్తూంటే సదుపాయమైన విషయం అంటారు. అలాగాకుండా దానిమీద వినోద యాత్రలకు, అరకు, మాచ్ఖండ్ అన్నీ వెళుతూంటే ఎక్కడో ఒకచోట గోడ కెక్కించేస్తాము. మన డ్రైవింగ్ తేడాగా ఉండో, లేకపోతే ఏ లారీతోనో, ఢీకొనటమో జరుగుతుంది. అలాంటి దుర్ఘటనే కాకుండా అక్కడికి మనం ఎందుకు అఫిషియల్ కారు వేసుకెళ్ళాం? అనేటువంటి క్రిమినల్, సివిల్ కేసులు మొదలైనటు వంటి వాటిల్లో కూడ యిరుక్కుంటాము. కనుక ఆ కారు ఉండటం సదుపాయమా? కాదా? అనేటువంటిది మన బుద్ధిమీద ఆధారపడి ఉంది. కారుమీద ఆధారపడి లేదు. చూసారా? అందుకని ఈ సిద్ధులు ఉండటం మంచిదా? మంచిది కాదా? అంటే సిద్ధులమీద ఆధారపడిలేదు. మనమీద ఆధారపడి ఉంది. నీకు చెడ్డబుద్ధి ఉంటే అవి అలాగే పనిచేస్తాయి. సద్బుద్ధి ఉంటే అలాగే పనిచేస్తాయి. అది తరువాత సూత్రంలో చెబుతున్నారు.

## 38. తే సమాధావుప సర్గా వ్యుత్థానే సిద్ధయః।

తే = పై చెప్పిన ఐదు దివ్యేంద్రియ శక్తులు, సమాధౌ = సమాధియందు, ఉపసర్గా = విఘ్నములు, వ్యుత్థానే = సరైన మార్గము నుండి తప్పిపోవుట, తలక్రిందులు తిరుగుటనే, సిద్ధయః = సిద్ధులు అంటారు.

**ఈ సిద్ధులు సంకల్పవములుగా వెలుచును గనుక సమాధికి విఘ్నవములుగా పనిచేయును.**

**వివరణ :** తే అంటే పై చెప్పిన ఐదున్నూ దివ్యేంద్రియ శక్తులు అంటే దివ్య రుచి, దివ్య వాసన, దివ్య సంగీతం మొదలైనవన్నీ సమాధౌ, సమాధియందు, యోగ సమాధియందు ఉపసర్గలు. ఉపసర్గలంటే ఏమిటి? సంస్కృతంలో. ప్రాతం అంటే పడటం, ముందు 'ప్ర' కలిపితే ప్రపాతం, 'సం' కలిపితే సంప్రాతం అవుతుంది. ఈ మొదట కలిపే వాట్లని ఉపసర్గలు అంటారు. అలాంటివి మొదటిమాట అర్థాన్ని మార్చే (modify) స్తాయి. ప్రాప్తి, సంప్రాప్తి; అలాగే యోగం, సంయోగం, వియోగం, అవయోగం. ఆ మొదట కలిసేవన్నీ ఉపసర్గలు. దాని అర్థాన్ని దాని అర్థంగా ఉండనీయవు. సమాధి కావలెనంటే, ఈ ఉపసర్గలు ఉండకూడదు. అవి ఉన్నపుడు సమాధిరాదు. అవి సమాధికి పుల్లలు, విఘ్నములు (obstacles) అన్నాడు. అంటే యింకో దానిమీద లగ్న (engage) మయి ఉన్నపుడు నువ్వు నువ్వుగా ఉండవు. ఎంత గొప్ప విషయమైనా సరే నువ్వు అదిగా ఉంటావుగాని నువ్వు, నువ్వుగా ఉండలేవు. అసలు మొట్టమొదట ఆ నీచస్థితి నించి యువతలకి రావటానికి కదా యోగాభ్యాసం మొదలుపెట్టింది. అలా కాదండి, ఈ సంకెళ్ళు బంగారంతో చేయబడినవి అంటే కావాలంటే వేసుకో అన్నాడు. యోగాభ్యాసం ముందున్నవి యినుప సంకెళ్ళు, ఇవి బంగారానివి అంటే వేయించుకో అన్నాడు. కనుక ''తే సమాధౌ'' అవి సమాధియందు 'ఉపసర్గా' అంటే విఘ్నములు. ''వ్యుత్థానే'' సమాధి కాకుండా దానికి వివ్యుత్థానము. వ్యుత్థానము అంటే perversion అంటే తలక్రిందులు తిరిగితే, అంటే బాహ్య ప్రపంచంలో, ప్రయోజనం అనేది వాటికి ఉంటుంది అనే పతనం గనుక నువ్వు చెందితే

"సిద్ధయః" వాట్లని సిద్ధు లంటారు అన్నాడు. అంటే బయట ప్రపంచంలో వీటితో నీకేదన్నా సంబంధం పెట్టుకొని, అదీ ఇదీ చేయాలి అని అనుకుంటే అవి సిద్ధులంటారు. అంటే అయిపోతుంది. నీక్కావలసినటు వంటి దానికి అవి పనికిరావు అన్నాడు. నువ్వు పదిమందిని కూడ వేసుకొని ఊళ్ళు తిరుగుతున్నావుట. వాళ్ళకి చూపిస్తున్నావుట అంటే పదిమంది చూసేటువంటి వాళ్ళకి అబ్బ! కృష్ణమాచార్యులు గొప్పవాడు అనటానికి పనికిరావచ్చు. వాళ్ళకి నువ్వు గొప్పవాడివి అయ్యి ఉండవచ్చు. వాళ్ళ దృష్టిలో నువ్వు దేశాలమీద తిరుగుతూ ఉండచ్చు. నువ్వు వాళ్ళందరి మీద పలుకుబడి కలవాడివై ఉండచ్చు. కాని నీ దృష్టిలో నానా గడ్డి తింటున్నావని అర్థం. అంతేకదా. పదిమందిని మీకు తగిలించి ఊళ్ళన్నీ చూపించి తీసుకురండి అన్నారనుకోండి. చూసేవాళ్ళకి ఎట్లా ఉంటుంది? అమ్మయొయ్యో! వీళ్ళందర్నీ నిజంగా నడిపించుకుని వెళ్తున్నాడండి లీడరు. అన్పిస్తుంది కనుక బయట వాళ్ళ దృష్టి నీక్కావాలంటే లీడరువి. నీ విషయం (point of view) నీక్కావాలంటే ఏడిసినట్లుంటుంది. నీ యిష్టం. ఏది కావాలి? అన్నాడు. కనుక నువ్వేదన్నా సర్కసు పెట్టుకునేందుకు, కంపెనీ పెట్టుకునేందుకు లేదా కొంచెం ఏదో ఒక ఏడాదో, రెండేళ్ళో ఉపయోగించేసి శుభ్రంగా పిల్లలందరికీ తలోయిల్లు ఉండేటువంటిదిగా కొంచెం డబ్బు చేసుకుని, బాంకు బాలెన్సు ఏర్పాటుచేసి వదిలేయటం లాంటి వాటిని సిద్ధులు అన్నాం. ఆ తర్వాత మళ్ళీ నువ్వు యోగాభ్యాసం చేయటానికి ఈ జన్మలో యిష్టపడదు నీమనస్సు. When the curtain is dropped in the middle, the show is never repeated and it may be repeated tomorrow అన్నాడు జ్వాల్కూల్. నాటకం మధ్యలో తెరపడితే మళ్ళీ యివాల్టికి తెర ఎత్తపడదు. అంటే ఈ జన్మకి అన్నాడు. నష్టం ఏంలేదు గాని వచ్చే జన్మలో చేసుకో అన్నాడు. కనుక "తే" అవి ఆపై చెప్పబడినవి, దివ్యేంద్రియముల వల్ల చల్లగా సంపెంగ చెట్లమధ్య కూర్చున్నట్లుగా ఉంటుంది. మీరు కాసేపు ధ్యానం చేయండి. అరగంటసేపు ఉంటుందో లేదో మీకు తెలుస్తుంది. ప్రతివాడికి వస్తాయి యిలాంటి సిద్ధులు. అవి కావాలంటే బాగుంటాయి. సాయంత్రంపూట

పిల్లల్ని తీసుకొని ఎపుడన్నా ఒక రోజున బీచ్‌కి వెళ్తే ఏదో కుర్రాడు Kwality ice-cream పెట్టించమన్నాడు. పెట్టించాము. వాడికి పెట్టిస్తూ మీ ఆవిడ, మీరు కూడ తిన్నారు బావుందా? లేదా? బావుంటుంది. కాని ఇంకొక family ఏం చేస్తారు. రోజూ Kwality ice-cream కోసమని చెప్పి పొద్దున్న, మధ్యాహ్నం, సాయంత్రం కూడ అక్కడికే వెళ్ళి కూర్చుంటారు, ఆఫీసునించి కూడ వెళ్ళి. వీళ్ళకి వాళ్ళకీ తేడా ఏమిటి. వీళ్ళు aimless vegabonds. కాని Ice-cream తినటం తప్పుకాదు కాని వీళ్ళు వెడుతున్న మార్గం (procedure) తప్పు. ఇందాకటి వాళ్ళ మార్గం (procedure) కుర్రాడికోసం తీసికెళ్ళారు. కుర్రాడికి పెట్టించారు. వాళ్ళూ తిన్నారు. తప్పులేదు. అంటే అక్కడికి వెళ్ళినపుడు తిన్నారుగాని, తినడం కోసం అక్కడికి వెళ్ళలేదు. అదీ తేడా. ఏ పనైనా అంతే. మీ పనిమీద మీరుంటూ అక్కడికి వెళ్ళినపుడు తిన్నారు. కర్మబంధం ఏం లేదు. ఆ తేడా తెలియాలి. అంటే ఆ తేడా సామాన్యంగా తెలియదు. పైకి ఒకలాగే ఉంటాయి రెండూను. వాడు వీడు ప్రక్కన కూర్చుని ice-cream తింటూ ఉంటే ఒకడు నోటితో తింటే ఒకడు ముక్కులో పెట్టుకుంటాడా? ఇద్దరూ ఒకలాగే తింటారు భౌతికంగా. దానికోసం వెళ్ళి తింటున్నటువంటి వాడు అలాగే తింటాడు. బోర్డు కట్టినట్టు కనిపిస్తుంది. అదీగాక మనకి కనిపించటానికి కాదు కదా! ఎవడికి వాడికోసం. ఆ తేడాలు తెలియాలి. మనం చేసేది దాన్ని ఆరోహణ చెయ్యటానికి కనుక, యివన్నీ సమాధియందు ఉపసర్గలు అంటే పుల్లలు, విఘ్నాలు అన్నాడు. 'వ్యుత్థానే' అంటే తలక్రిందు లైనపుడు అంటే perversion అనేటువంటిది వచ్చినటువంటి వాడికి 'సిద్ధయః' ఇవి సిద్ధు లన్నాడు. సిద్ధు లంటే ఏమిటి? Attainments. మనం సాధించినటు వంటివి ప్రపంచానికి చూపించటం, ప్రదర్శన లివ్వటం. అపుడు ముఖ్యమంత్రిగారు, మంత్రులు వీళ్ళంతా వచ్చి చూడటం ఏమిటి? దీని పరమావధి అంటే నాకోసం కాదండి అసలు ఈ విద్యలున్నట్లు మీకు తెలియజేయటం కోసం అని చెప్పి కొయ్యటం. కనుక కృష్ణమాచార్యులు తనకోసం కాదు, ఈ విద్యలున్నట్లు ప్రదర్శన చేయటాని కోసం హైదారాబాదు వచ్చాడు గనుక ఆయన్ని విద్యాలకాడమీ,

యోగా అకాడమీ అని పెట్టి ప్రెసిడెంటు చేయండి అనటం, మరి దాన్ని కాపాడుకునేందుకు తను యింకో కొంతమందిని జాగ్రత్తగా తనచుట్టూ వేసుకుంటం. యోగాభ్యాసం అంటే అదే కదా. చివరకు ఏం మిగిలింది? ఇంతా అయితే ఎందుకుట? నాకోసం కాదండి అన్నారు. ఈ బుకాయింపులలోకి వెళ్ళిపోతుంది. అంతకంటే ఏమీలేదు. అంటే జడ భరతుడి కథలోకి వెళ్ళిపోతుంది మొత్తం అంతా. అందుకని జాగ్రత్త. ఇక్కడ శుభ్రంగా సూత్రం బాంబు పేల్చినట్టు పేల్చాడు. లౌకిక ప్రయోజనాలు కావాలనుకున్న వాళ్ళకి అవి సిద్ధులు. ఇంకొంచెం దూరం యోగాభ్యాసం చేసుకుందాం అనుకున్న వాళ్ళకి అంతర్యామిలో జీవించగలగడం (realised living), బంధాలు లేకుండా జీవించడం, బాధ్యత అనేది వదలకుండా బ్రతకడం కోసం గనుక అయితే యివి వద్దు అన్నాడు. ఆ రెండింటిలో ఏదో ఒకటి నీ యిష్టం. తరువాత సూత్రానికి వెళ్ళేముందు ఆపై చెప్పిన సూత్రానికి జ్వాలాకూలుడు యిచ్చిన translation ఏమిటంటే "These powers are obstacles to the highest spiritual realisation, but serve as magical powers in the objective world." సూటిగా యిచ్చేసారు.

## 39. బంధకారణశైథిల్యా (త్ప్రచార సంవేదనాచ్చ) చిత్తస్య పరశరీరావేశః॥

బంధకారణ శైథిల్యాత్ = బంధ కారణములను శిథిలము చేయుటవలన, ప్రచార సంవేదనాత్ = ప్రచారమును తెలుసుకొనుట వలనను, చ= మరియు, చిత్తస్య = చిత్తమునకు, పరశరీరావేశః = ఇంకొకని శరీరమును ఆవేశించటం వచ్చును.

**బంధమునకు గల కారణములను సడలించుట వలనను, తన్ను తాను దేహము నుండి వేరుగా గ్రహించుట వలనను, చిత్తము యింకొక శరీరమునందు ప్రవేశింప గలుగును. (బంధము లనగా దేహమునకు, చిత్తమునకు గల ముడులు).**

**వివరణ :** ''బంధకారణ శైథిల్యాత్'' అంటే బంధము యొక్క కారణములను శిథిలత్వము చేయుట వలనను 'ప్రచార సంవేదనాత్+చ' ఒకళ్ళనించి ఒకళ్ళకి జ్ఞానం ప్రచారం అవ్వటం అనేటువంటి విధానాన్ని 'సంవేదనాత్' అంటే తెలిసికొనుట వలనను, చ అంటే మరియు అని రెండు చెప్పినపుడు ఇంకేం లేదు. ఈ రెండూ గనుక చాతనై చేస్తే అంటే యోగాభ్యాసంలో ఇందాక చెప్పినటువంటివి, మనకి కావాలా? అక్కర్లేదా? కావాలి అంటే దానిపేరు బంధం అంటారు. మనకి కావలసినది యింకోటి గనుక అయినట్లైతే బంధ శైథిల్యం అంటారు. యోగాభ్యాసం చేస్తూంటే వచ్చినవి అనేక బంధ కారణాలుంటాయి. ఒక్కొక్కడికి యోగాభ్యాసం చేస్తూంటే వ్యక్తిగత అయస్కాంతీకరణ (personal magnetism) వస్తుంది తెగ తొంబలు తొంబలుగా జనం చేరుతారు. జనం వాడిచుట్టూ ఎందుకు చేరుతున్నారో తెలీదు. రామకృష్ణ పరమహంసకి సడన్‌గా వచ్చింది అలాంటి స్థితి. ఆ వచ్చినపుడు ఆయనకి 24 గంటలు ఇబ్బంది (nuisance) అయిపోయింది. కళ్ళు మూసుకొని ఒక రెండు రోజులు మొహం మాత్రం దేభ్యం మొహంలాగ ఉన్నట్లుగా ధ్యానం చేసాడు. అది మిగిలిపోయింది చివరికి. కనుక ఇవన్నీ బంధ కారణములు. మనం ఏది చేస్తూంటే ఏ ఫలితం వచ్చినా బంధ కారణమే. ఆఫీసరు ప్రమోషను వచ్చాక కారు యిచ్చింది గవర్నమెంటు. జీపు యిచ్చింది. అది బంధ కారణమా? మోక్ష కారణమా? దేనిమీద ఆధారపడి ఉంది? ఆకారు ఎంత ఖరీదైనది? అది ఏ లోహముతో చేయబడ్డది? వీటిమీద ఆధారపడిలేదు. నీమీద ఆధారపడి ఉంది. ఆఫీసరు కారు కోసం ట్రిప్పులు వేస్తున్నాడంటే బంధ కారణం. కారు వీడిని బంధిస్తోంది. వీడు కారుని బంధించటం లేదు. Car-conditioned గా బ్రతుకుతున్నాడు వీడు.

లేకపోతే క్రొత్తగా T.V. పెట్టినపుడు రెండు మూడు రోజులు కాలేజీ మానేసి T.V. దగ్గర కూర్చుంటారు. క్రొత్తగా ఏదిపెట్టినా అంతే, దాని conditioned గా ఉంటాం. అది బంధం అంటారు. యోగాభ్యాసంలో కూడ కొత్తగా మీకు వచ్చినటువంటివీ అంతే. దూరంనించి పుస్తకం తల్లక్రిందులుగా పుచ్చుకుంటే ఆయన చదువుతాడని ఎవరో చెప్పారుట. అది చూడాలని ఈయన పుస్తకం తీసి ఆయన చదివాడు. ఇపుడు నీకేం వచ్చింది అన్నాడు. మనం చెప్పవలసింది ఏమీ రాలేదు. వాడెవడో భోంచేస్తూ ఉండంగ చూసాట్ట అంటే ఏం వచ్చింది? అది ఎంతో ఇదీ అంతే. ఇది తెలియని వాళ్ళు చేయాల్సిన పని నాయనా. మనం కాదన్నాడు. అయితే ఇదివరకు చేసారుట కదా అని అడిగాడు ఈయన. అంటే ఆయన పెద్దమాట అన్నాడు. ఎవరో పనికిరాని వాళ్ళు అడిగినప్పుడల్లా చేస్తూ ఉండాల్సి వచ్చింది చేసాను. వాడికి అంతకంటే నా దగ్గరనించి కావాల్సిన విషయాలేం లేవు కనుక అవి అడుగుతాడు అన్నాడు. అలాగే లక్ష్మీదేవి కోసం తపస్సు చేసారుట కొంతమంది. ఆవిడ ప్రత్యక్షమై ఏం కావాలి? అని అడిగితే పెసరట్టు ఇయ్యమని అడిగాట్ట ఒకడు. అదేమిటిరా నాయనా నేను లక్ష్మీదేవిని అంటే నాకు తెలుసు అన్నాట్ట. నా భార్య చేసిపెట్టమంటే చేసిపెట్ట లేదు అంచేత తపస్సు చేసాను అన్నాట్ట. జాలివేసి పోనీ ఇస్తాను. ఇంకేమన్నా కూడ అడుగు అందిట ఆవిడ. అంతకంటే ఏం అడుగుతాను కావాల్సింది వచ్చేసింది కదా! ఇంకేం కావాలి? ఇచ్చేయి అన్నాట్ట. సరే అని యిచ్చేసింది. పళ్ళెంకూడ ఇచ్చింది పోనీలే ఉపయోగిస్తుందని. ఆ రెండవ వాడు, ప్రక్కన నించున్నవాడు నెత్తి మొత్తుకు అంటున్నాట్ట. పిచ్చి వెధవ యిలా అడుగుతాడేమని. ఇంకా అడగచ్చు కదా మంచివి అని. పోనీ నువ్వు అడగరా నాయనా అందిట లక్ష్మీదేవి అంటే వాడన్నాట్ట ఒక పెసల బస్తా యిప్పించు అన్నాట్ట. ఆవిడ కనపడ్డపుడు ఒక పెసరట్టేమిటి? రేపు మళ్ళీ తిందామనిస్తేనో అని. మనం తెలివైనవాళ్ళం అనుకున్నాడు వీడు. ఒరేయ్ ఇంకేమి లేవా? నీకు అడగటానికి. ఇంకా ఏమన్నా అడుగు, అందిట ఇంతకంటే ఎవడైతే మాత్రం ఏమి అడుగుతాడు అన్నాట్ట. ప్రక్కన మూడోవాడు బుద్ధిలేదు వీడికి అనుకున్నాడు? ఏది, అమ్మవారి వంకచూస్తూ. పోనీ నువ్వు అడగరా నాయనా అందిట. ఒక ఎకరం చేను యిప్పించు, పెసలు వేసుకుంటాను అన్నాట్ట. అదేమిటిరా నీకు యింకా అడగవలసినవి ఏమీ లేవా? అంటే, అంతకంటే ఎవడైతే మాత్రం ఏమి అడుగుతాడు. అన్నాట్ట వాడు. ఇలాగ అడుగుతూ వెళ్ళింది వరసన. చిట్టచివరి వాడు గాక అంతకుముందు వాడు

ఉన్నాడొకడు. వాడు నీకేం కావాలంటే, అది అడిగాక మళ్ళీ నువ్వు ఔనంటావో కాదంటావో అన్నాట్ట. అదేమిటిరా నేను లక్ష్మీదేవిని కాదనటం ఏం ఉండదు అన్నదిట ఆవిడ. అయితే ఉన్న పళంగా నాతో కూడవచ్చి మాయింట్లో ఉండిపో అన్నాట్ట. వాడే తెలివైనవాడని వాడు అనుకున్నాడు. మొదటివాడు అనుకోలేదూ. ఆ పెసరట్టు తీసుకున్నవాడు. వాడెంత తెలివైనవాడో వీడూ అంతే తెలివైన వాడు. అంటే వస్తున్నాను అన్నది. ఇంకోడు ఉన్నాడు కదా, వాడి సంగతి కూడ విని అది అయిపోయాక వెళ్దాం అని చిట్టచివరి వాణ్ణి ఏమిరా నాయనా ఏమిటి విశేషం అంటే నిన్ను చూద్దామని చేసాను అన్నాట్ట చూసాను. ఇంక వరం ఏమిటి? అన్నాట్ట. అలా కాదురా. నేను ప్రత్యక్షమయ్యా ననటానికి నిదర్శనంగా నీక్కావలసింది ఏమైనా అడగటం, నేను యివ్వటం అనేది ఉంటుంది కదా అని అంటే, అపుడు అన్నాట్ట. నువ్వు ప్రత్యక్షమయ్యాక కూడ నాకు యింకేమైనా కావలసింది ఉందంటే అది నీ దరిద్రం కాని, నాది కాదు అన్నాట్ట లక్ష్మీదేవిని. అపుడు ఆవిడ అన్నదిట ఒరేయ్ మీరంతా వాడిని చూసి నేర్చుకోండి తపస్సు ఎలా చేయాలో. మీరంతా తెలివైనవాళ్ళని అనుకున్నారు. వాడు ఒక్కడే తపస్సు చేయటానికి పనికొచ్చినవాడు. మిగతా వాళ్ళందరి తపస్సు వ్యర్థం. కనుక ఈ మొదటి వాళ్ళందరికీ బంధ కారణాలు అవన్నీ. ఆ చిట్ట చివరివాడు ఒక్కడికి తప్ప చేసిన తపస్సంతా బంధ కారణమే. వాళ్ళకి ఎన్ని లాభాలు, (advantages) ఎన్ని రాయితీలు (privilages) ఉంటే అన్ని ఎక్కువ బంధాలు అవుతాయి. అవీ బంధ కారణాలంటే. ప్రతీవృత్తి చేసేవాడిలోను, ఇహంకోసం ప్రయత్నం చేసేవాడిలోను అందరిలోను ఉంటాయి, ఒక నిజమైన ముముక్షు జనులలో తప్ప, అంటే ఋషుల మార్గాన వెళ్ళేటువంటి వాళ్ళల్లో తప్ప. కనుక యిక్కడ బంధ కారణములు అన్నాడు. అంటే causes of bondage. బంధములకు కారణములు. వాట్లని 'శైథిల్యాత్' అంటే శిథిలము చేయుటవలన, అంటే కారు యిచ్చారు. ఆఫీసరుగా ప్రమోషను వచ్చాక కారు ఆఫీసు కోసమని గుర్తుంచుకొనటం. దానిపేరు శైథిల్యం. ఎవడు ఏం చెప్పినా మాట్లాడనివ్వడు. శైథిల్యం చేసేవాడు. శైథిల్యం చాతనయినటు వంటి వాణ్ణి ఏ విషయంలోను ఎవ్వడూ కూడ ప్రశ్నించలేరు. వాడు చేస్తే అంగీకరించటం, లేకపోతే ఊరుకుంటం అంతే. ఇంక చేసేదేం లేదు. అందుకని బంధ కారణానికి శైథిల్యం చేయటంవల్ల, శైథిల్యం అంటే liberate చేయటం. అంటే ఆ కారుకీని, తన మనస్సుకీ ఉన్న సంబంధం వదిలివేయటం. ఆఫీసులో guest

house యిచ్చారు. Air conditioned. ఎవరైనా guest లు వస్తే engage చేయటానికి. అక్కడ తను, తన భార్య ఒక రాత్రి ఉందామనిపిస్తే బంధం. అనిపించకపోతే బంధ శైథిల్యం. అంతే. వీడి దగ్గర అట్లాంటి vulnerable points ఉండవు. బంధ కారణాల్ని శైథిల్యం చేయటం వలన ప్రచారం చేయాలి. ప్రచారం అంటే మనం ఎరిగి ఉన్న ప్రచారం కాదు. నా దగ్గరనించి నీ దగ్గరికి గాని, నీ దగ్గరనించి నా దగ్గరికి గాని, ఆ లోపల ఉన్నటువంటి వెలుగుని ప్రసారం చేయటం (transperence). అది బోధనలవల్ల, తర్కంవల్ల రాదు. వాదోపవాదములవల్ల రాదు. ఉపాధ్యాయుడు శిష్యులకు పాఠము చెప్పటం వలన రాదు. వీడు నిశ్శబ్దంగా, ప్రశాంతంగా అదిగా ఉండటంవల్ల దాంట్లో ఫీలవటంవల్ల, వాడు ఫీలవటం మొదలు పెడతాడు. అంటే నేను ఏ అనుభూతి ఫీలవుతున్నానో, మీరు అదే అనుభూతి ఫీలవుతారు గాని, నేను ఫీల్ కానటువంటి అనుభూతి నేను చెప్పే పాఠంలో మీరు ఫీలు కాలేరు. కనుక ఎప్పుడైనాసరే. ఒకడినుంచి ఒకడికి విషయం ప్రసారం అవ్వటం అనేది పాఠము శబ్దమయము, వాచ్యమయము, వాక్యమయము కాకుండా గుణం ఉన్నది. వాడి సద్గుణాలు వీడి కందుతాయి. ఎవ్వరితోను ఆర్గ్యుమెంటు చేసేటువంటి లక్షణం లేనివాడి దగ్గర ఆర్నెల్లుండేటప్పటికి పిచ్చి కుక్కలాగ వాదించేవాడు వాదించడం మానేస్తాడు. ఎందుచేత? వాదించటం మానేసినవాడి దగ్గర ఉంటూన్న సాన్నిధ్యం వీడిమీద పనిచేస్తుంది. ఒక అయస్కాంతం ఒక ఇనుపముక్క మీద పనిచేసినట్లు. అది చాతనవ్వటం పేరు 'ప్రచార సంవేదనం' అంటారు. ప్రచార సంవేదనం అంటే transperence. You know how of it and how to do it. అది సంవేదనం అంటే. అది తెలియటం వల్లనూ అంటే బంధకారణాల్ని శిథిలం చేయటం వల్లనూ, సత్త్వము ద్వారా పురుషుని ఒకరినొకరికి ప్రసారము చేయటము జరుగుతుంది, సత్త్వము అనేది life principle. ప్రేమ (love) క్రింద పనిచేస్తుంది. ఆ ప్రేమ సంబంధమైనటు వంటి పరస్పర సంబంధములలో మనం ఉంటూ ఉండటంవల్ల, లోపల ఉన్న పరమ పురుషుడైన పురుషోత్తముడి యొక్క సాన్నిధ్యాన్ని ఒకరి వలన ఒకరు అనుభవించుట చాతకావాలి. అది చాతనవ్వటం వలనను, 'ప్రచార సంవేదనాత్ చ' అంటే ప్రచారమును తెలిసికొనుట జరుగును. అంటే దీపము ద్వారా వెలుతురుని నలుమూలలకు వ్యాపింప చేయునట్టి పద్ధతిని తెలుసుకొనుట వలన మనలో ఉన్న సర్వాంతర్యామి 'నేను' అనే పేరుతో పిలువబడే దీపము అందరిలో పనిచేయుట వలన; ఈ రెండూ చాతనయిన వాడికి అప్రయత్నంగా

'చిత్తస్య' వాడి చిత్తమునకు ''పరశరీరావేశః'' యింకొకడి శరీరమును ఆవేశించుట అనేది వస్తుంది. నా చిత్తం నా శరీరంలో ఉంటుంది కదా. నా మనస్సు, నా పంచేంద్రియాలు, వీటికి సంబంధించిన ఆలోచనలు, నా ఊహలు ఇవన్నీ ఉంటాయి కదా. ఇవన్నీ క్షాళనం చేయాలి. అష్టాంగయోగం చేస్తే, యివన్నీ క్షాళనం అవుతాయి కదా. కాని చిత్తం ఉంటుందా? ఉండదా? పంచేంద్రియాలు ఉన్నాయి. మనస్సు ఉన్నది. లోపల ఈశ్వరుడితోపాటు, ఇవి ఉంటూ ఉండి, వాడికి ఒక ఏకాగ్రత ఏర్పడ్డది. అంటే ఏమిటి. One direction in life. కనుక ప్రతివాడికి ఒక ఏకాగ్రత ఏర్పడుతుంది. ఆ ఏకాగ్రత వాడి దగ్గరే ఉంటుంది. అలా కాకుండా ప్రక్కన శిష్యుడో, సోదరుడో ఉంటే వీడిలోంచి ''పరాశరీరావేశః'' వాడి శరీరాన్ని ఆవేశిస్తుంది. మరి వీడిదో అన్నాడు. వాడిది ఎగిరిపోతుంది. అంటే ఉంటుంది ప్రక్కన. చెయ్యవచ్చునా? మనలో మాట. అంటే వీడు ఏద్దైతే చేయించదల్చుకున్నాడో అవన్నీ వీడుచేస్తూ ఉంటాడు. ఇందులో కూడ బంధకారణంగా చేసేవాళ్ళున్నారు. దాన్ని శైథిల్యం చేసినవాడు ఎలా చేస్తాడు? అంటే ideal గా ఉన్నది చెబుతున్నాడు. మీరు మొదలు పెట్టారనుకోండి యోగాభ్యాసం. మీతోపాటు ఒక పదిమంది మొదలు పెట్టారనుకోండి. ఆ పదిమందిలో ఒక్కొక్కడితో ఒక్కో పదిమంది మొదలు పెట్టారనుకోండి. వందమంది అయ్యారు. ఈ మొదటివాడు పండేటప్పటికి ఈ వందమంది కూడను అదే బాటలో జీవితం నడుపుకుంటుండటం, అదే మార్గంలో మిగతా వంద వందల మందికి ప్రచార ప్రసారాలు చేయటం, ఆ చేసే మార్గం వీడు యిస్తాడు. అది పరశరీరావేశం అంటే. అంటే ఇన్ని వందలమంది శరీరాల్లోను కూడ వీడి మనస్సు, వీడి యింద్రియములు పనిచేయటం. దేనికి పనిచేస్తాయి? వీడు చెప్పినట్లు చేయటానికి కాదు. వీడేం చేస్తుంటే వాళ్ళేం చేయటం మొదలు పెట్టారో, అది మిగతా వాళ్ళచేత చేయించటానికిన్నీ, దానికి సంపూర్ణంగా మధ్యలో విఘ్నం లేకుండా పరిపూర్తి చేయటానికిన్నీ పనిచేస్తాయి. దాన్నే మనం అర్థం తెలియకుండా పదం వాడతాం. Organisation అంటాం. అంటే ఇంతమంది శరీరాలున్నూ ఒకడి యొక్క organ గా పనిచేయటం. Organisation అంటే ఏమిటి. ఇది నా organ. కాని ఇంతమందికి ఉన్న కుడి చేతులు కూడ నా organ గానే పనిచేస్తున్నాయి. అన్నాడు. అది organisation అంటే. మనం ఈ పదం వాడుతూంటాం. గేదెలు తోలుకుంటూన్నట్లు వాడుతూ ఉంటాం. మనకి కావల్సింది spiritualism

కాదండి organisation అన్నాడు ఒకాయన. ఏమిటో ఏం మాట్లాడుతున్నాడో తెలీదు వాడికి. అంటే ఎడంచెయ్యి కాదండి పుర్రచెయ్యి అన్నట్టు. అంటే ఆయన దృష్టిలో spiritualism అంటే మసి పూసుకొని అరణ్యంలోకి వెళ్ళిపోవటం. ఒంటికాలి మీద నిల్చుని మెడమీద కాలేసుకొని ధ్యానం చేయటం అని ఏవో వెర్రి వెకిలి ఉద్దేశాలు ఉంటాయి. ఇక్కడ ఒకడు తన చిత్తమును వందమంది చిత్తములుగా పని చేయిస్తున్నాడు. రెండు రకాలుంది. ఇలా పని చేయించేది బంధకారణం. అంటే తను చేయదల్చుకున్నవన్నీ వాళ్ళచేతే చేయించటం అనే దుర్బుద్ధి. అంటే ఒక రాజకీయ పార్టీయో, ఒక మత ప్రచారమో అవుతుంది. అంటే మనం అనుకున్న పద్ధతిలోకి వాళ్ళందరినీ మార్చటం. ఈ బంధ కారణ శైథిల్యం ఉన్నవాడు అలా చేయడు. ఒక అరవిందో ఏం చేసాడో? రమణ మహర్షి ఏం చేసాడో; షిరిడీ సాయిబాబా ఏం చేసాడో; కబీరుదాసు ఏం చేసాడో; అలాగే చేస్తాడు. వీడి దగ్గర ఉన్న సామర్థ్యము అవతలివాళ్ళు పని చేసేందు కోసమని వీళ్ళ చిత్తం వాళ్ళ శరీరాల్లోంచి పని చేయిస్తున్నారు. వాళ్ళు యింకా సమర్థులు కాదు గనుక. వాళ్ళకి సామర్థ్యం కలిగే వరకున్నూ, లేదా కొంతమందికి ఈ జన్మలో సామర్థ్యం రావటం అనేది ఉండదు గనుక, వాళ్ళకి ఈ జన్మలో రాకపోయినా సరే, సామర్థ్యం యివ్వటం కోసమున్నూ, ఇన్ని వేలమంది మనస్సులలోను, వీళ్ళ మనస్సుని పరకాయ ప్రవేశం చేయించి పని చేయించుకున్నారు. రామకృష్ణుడు వివేకానందకి యిచ్చాడు. ఆయన పదిమందికి, వందమందికి, వేయిమందికి, లక్షమందికి ప్రవేశింపజేసాడు. రామకృష్ణ మిషన్ అంటే అర్థం ఇది. కనుక దాన్ని spiritual గా ఉపయోగించేటట్లు చేస్తే దాన్ని organisation అంటాం. తరువాత ఆయన వెళ్ళిపోయాక మళ్ళీ రామకృష్ణ మిషన్‌లో కూడ ఇది తప్ప యింకోటి లేదు. అని దబాయించే వాళ్ళు రావచ్చు. ఒక్కొక్కపుడు ఆయన శరీరం వెళ్ళిపోయిన వంద రెండు వందల ఏళ్ళవరకూ కూడ ఆయన చిత్తం సుప్త చైతన్యంలో (suspend) ఉండి పనిచేస్తూనే ఉండచ్చు యింత మందిలోనూ. అప్పుడు వాళ్ళందరూ వాళ్ళ సొంత limitations ఉన్నా, ఈ పక్షంగానే పనిచేస్తారన్నమాట. అలా గాకుండా అంటే ఈయన చిత్తం గాకుండా, వాళ్ళ చిత్తం పనిచేయటం మొదలు పెట్టేటప్పటికి, గురువుగారు ఏం చెప్పారండి? మనందరినీ ఇక్కడ కూర్చోమన్నారండి. యోగాభ్యాసం గురించి చెప్పమన్నారండి అది గాదండి అక్కడెక్కడన్నా హాలులో పెడితే బాగుంటుందంటే తప్పు. ఆయన ఎక్కడ చెప్పారో మనం అక్కడే పెట్టుకోవాలి.

ఇలాగ stagnation వచ్చేస్తుంది. ఈ గుంజ పుచ్చిపోయిదండి అన్నా, తీయటానికి వీల్లేదు. వారు పతంజలి యోగ సూత్రాలు చెప్పినపుడు పెట్టిన గుంజ కనుక అది సత్త్వగుంజ అంచేత అది ఉండాల్సిందే అంటారు. అది ఒక మూల పడిపోతూ ఉంటుంది. ఆ పరకాయ ప్రవేశ విద్య పని చేయకుండా ఉన్నపుడు తరువాత అయోమయంలోకి వెళ్ళిపోతారు. అందుకని ఉన్నంతవరకు తొందరగా పదిమంది ద్వారా పనులు చేయించాలంటే, నీ పనులు చేయించటం కాకుండా, ఆపైన ఉన్నటువంటి వాడి పనులు చేయించాలి. ఒక పార్టీకోసమో, ఒక మతం కోసమో, పనిచేయించటం, కుట్ర చేయించటం కాకుండా, విశ్వశ్రేయమైన పని చేయించటం కోసం చెయ్యాలి. పరకాయ ప్రవేశ విద్య వాళ్ళకి పనిచేస్తుంది. వాళ్ళు దానిద్వారా పని జరుపుతారు. అదీ పరకాయ ప్రవేశ విద్య అంటే. ఒకణ్ణి పడుకోపెట్టేసి, హిప్నటిజం చేసేసి, వీడు వాడిలో ప్రవేశంచేసి ఇక నువ్వు బయల్దేరు వెళ్ళు అని అనటం. వాడు అక్కడెక్కడో ఎవడి భార్య దగ్గరకో వెళ్ళి వాడు ఏమో అనటం, చెప్పుదెబ్బలు తినటం అవి కావు. అవి తెలియక పాపం శంకరాచార్యుల వంటి మహానుభావుల మీదకూడ దిక్కుమాలిన గ్రంథాలు రాసారు. విద్యారణ్యస్వామి రాసాడని, మాధవస్వామి రాసాడని పెద్దవాళ్ళ పేర్లు పెట్టారు. శంకర విజయం అనేటువంటి ఒక చెత్తగ్రంథం ఉంది. మహానుభావులు, ఆచార్య పురుషులు, సర్వసంగ పరిత్యాగులు, ఏమీ అక్కర్లేనటు వంటి వాళ్ళకే ఇవి తప్పలేదు. కర్మబంధాలు పోయినాయి గాని, ఇట్లాంటి చిక్కులు వదల్లేదు. పరకాయ ప్రవేశం అంటే వీడికున్న గాడిద అభిప్రాయాలు ఆయనకి రుద్దారన్నమాట. ఈయన శరీరాన్ని దేవాలయంలో పెట్టి శిష్యుణ్ణి చూస్తూ ఉండమన్నాట్ట. ఈయన రాజుగారి శరీరంలో ప్రవేశించి ఆ రాణిగారితో ఈయన వినోదించటం మొదలు పెట్టాట్ట. అదే నిజమయితే యింత వేదాంత విద్య ఆయన ఎలా ఇచ్చారు? ప్రతివాడు పెద్దవాళ్ళ గురించి పుస్తకం రాస్తే ఎలాగ? ఈ విషయం మంత్రిగారికి తెలిసి, ఊళ్ళో ఉన్నటువంటి శవాలన్నీ వెంటనే తగలబెట్టమన్నాట్ట. ఈయన శరీరం కూడ పట్టికెళ్ళి పోతూంటే, శిష్యుడు ఆ రాజ భవనంచుట్టూ తిరుగుతూ 'తత్త్వ మసి, తత్త్వమసి' అని అరుస్తున్నాట్ట. మట్టి కథలు. అంటే 'నువ్వు అతడివి, నువ్వు అతడివి' అని అరుస్తున్నాట్ట. అపుడు గభాల్న ఆయన కెక్కడో అందిందిట. టప్పున ఆ శరీరం వదిలేసి ఆయన శరీరం దగ్గరికి వెళ్ళాట్ట. అప్పటికే చేతులు, కాళ్ళు కాలిపోయినాయిట శంకరాచార్యుల వారివి. అపుడు ''లక్ష్మీ నృసింహ మమదేహి కరావలంబం'' అనే స్తోత్రం

చెప్పారుట. ఆయన చేసిన పొరపాటది. ఓ! లక్ష్మీ నృసింహా! నాకు కరావలంబం' అంటే నాకు చేయూత నిమ్మని చెప్పి ఎవరన్నా చదువుకునేందుకు స్తోత్రం రాసారు. చేయూత నిమ్మనడం అంటే చెయ్యి కాలింది, కాలు కాలింది, యివన్నీ ప్రసాదించు అని కాదు. మహానుభావుల్ని కూడ వదిలిపెట్టలేదు. జీసస్ క్రీస్తుని కూడ శిలువ కొట్టారు. శంకరాచార్యుల మీద కూడ ఒక పుస్తకం రాస్తే వదిలిపోతుందని రాసేసారు. అది పరకాయ ప్రవేశ విద్యకాదు. ఇంకో ఐదు నిమిషాల్లో శరీరం వదలబోతూ, గౌతమబుద్ధుడు నేను పది వేలమంది శరీరాల్లో ప్రవేశిస్తున్నాను అని చెప్పాడు. శిష్యులు కంగారు పడిపోయారు. పదివేల శరీరాల్లో ఎట్లా ప్రవేశిస్తాడని. వీళ్ళందరికీ ఒక రకమైనటు వంటి మారణ కల్పించి, ఒక ఐదు నిమిషాలు మాత్రం పదివేలు వేరువేరు శరీరాలతో ఒక్కడే కన్పించాడు. కళ్ళకు కనికట్టులాగ. తర్వాత ఆయన చెప్పినటువంటి అర్థం నాగార్జునుడు విప్పి చెప్పాడు. అదిగాదురా. పదివేల శరీరాల్లో పనిచేయటం అంటే పది వేలమ్మంది బుద్ధ ధర్మాన్ని ప్రవర్తింప చేసేటువంటి వాళ్ళని వాళ్ళ మనసులలో నేనుండి నడుపుతాను అనేటువంటి ఉద్దేశ్యం అది. ఇక్కడ చెప్పింది కూడ అదే. కనుక పరకాయ ప్రవేశం అంటే మనం ghostly ideas పెట్టుకోకూడదు. బుద్ధుడు అలాగ ఈ భూమ్మీద పుట్టిన జీవరాసు లందర్నీ కూడ బంధకారణ శైథిల్యం అయ్యేవరకు వాళ్ళవంక చూస్తూ యిక్కడే ఉండిపోతాను అన్నాడు. మరి మోక్షం వద్దా? మోక్షం వద్దు. ఎవడో కనిపెట్టిన పిచ్చిపదం అది. మోక్షం ఎందుకండి? బంధాలంటే, బంధాలు ఏమిటి? నువ్వు తెచ్చుకున్నవి గాని బంధాలు, అక్కడున్నవి ఏమీ లేవే, ఒళ్ళు దగ్గర పెట్టుకొని బ్రతికితే బంధాలు ఏం ఉన్నాయి అన్నాడు. అందుకని వచ్చినందుకు ఏదో పనికొచ్చేపని, సేవ చెయ్యి పదిమందికి. ఈ బంధాలు వద్దు. ఈ కర్మవద్దు. మోక్షం కావాలని అక్కడ ఎక్కడో ఉండి ఈ బాధపడుతున్న వాళ్ళందర్నీ చూస్తూ ఉండటమంత కరుడు గట్టిన స్వార్థం నీకుంటే నీకా మోక్షం వచ్చేది? అని అడిగాడు. అందుకని ఈ భూమ్మీద ఉన్న జీవరాసు లందరూ తరించే వరకు కూడ నేను చూస్తూ ఇక్కడే ఉంటాను సూక్ష్మ శరీరంతో అన్నాడు. అందుచేతనే ఆ చూస్తూ ఉండటం కోసమే ఆయన ధరించినటువంటి చిట్ట చివరి లక్షణాన్ని 'అవలోకి తేశ్వర' అవతారం అంటారు. అవలోకనం అంటే చూస్తూ ఉండటం. కనుక పరకాయ ప్రవేశం, పర శరీర ఆవేశము అనే మాటకి అర్థం అది. రెండు రకాలు. ఒకటి black magic చేసేవాడు, అంటే ఇతరుల mind ని control

చేసి, హిప్నటిజంతో తనకు కావలసినటు వంటి అక్కర్లేని పనులు, కావలసిన పనులు చేయించుకునేవాడు. వాడికి యిష్టం లేకపోయినా సరే, అంటే ఎవడినన్నా హిప్నటిజంతో control చేసి తన్నించటమో, హత్యలు చేయించటమో కూడ చేస్తారు. దాన్ని వక్రమార్గం black magic అంటారు. లేదా విశ్వశ్రేయస్సు అయినటువంటి మార్గాన్ని అందరికీ సామర్థ్యము కలుగదు కనుక, తనకున్న సామర్థ్యంచేత, తన మనస్సు, తన యింద్రియములు, యితరుల యందు ప్రవేశపెట్టి వాళ్ళద్వారా వాళ్ళ శరీరాలు తనవిగా ఉపయోగించుకొని లోక శ్రేయస్సుని చేయటము. ఇది రెండవది. ఇది బంధకారణ శైథిల్యంతో గాని రాదన్నాడు ఈ సూత్రంలో.

మొదటిది చేసేవాడికి బంధకారణం అంటే అధికార ప్రక్రియ లాంటిది. ఎదుటివాడి మనస్సుని కంట్రోల్ చేసి మనకి కావలసినటువంటి దొంగతనాలు గాని, ఏమన్నా పనులు గాని చేయించటం అనేది. అది అపమార్గం, దుఃఖమార్గం, తుచ్ఛమైనటువంటి మార్గం. యిక్కడ బంధ కారణ శైథిల్యంతో ప్రారంభించాడు గనుక ఇది మోక్షమార్గం. ఎదుటి వాళ్ళకు కూడ మోక్షమార్గం. ఎదుటివాళ్ళకు కూడ మోక్షం వచ్చేట్లు ప్రవర్తించాలంటే వాళ్ళందరిలోను తాను ప్రవేశించి, తన చిత్తముగా వారి చిత్తము పనిచేయుట యిక్కడ చెప్పబడింది. చిత్తవృత్తులన్నింటినీ క్షాళనం చేసాక వాడి చిత్తానికి, వీడి చిత్తానికి తేడా ఉండదు. చిత్తములన్నీ ఒకటే. వాడింట్లో ఉన్న రాగిచెంబు, వీడింట్లో ఉన్న రాగిచెంబు అన్నీతెచ్చి, శుభ్రంగా చింతపండుతోను, అవీ ఇవి వేసి తోమి, బాగా తయారుచేసాక, అపుడు అన్ని రాగి చెంబుల్లోను రాగే ఉంటుంది కదా. ఇంకేం ఉండదు. అట్లాగే మనం ఈ స్థితికి వచ్చిన తర్వాత చిత్తవృత్తులన్నీ క్షాళనం అయిన తర్వాత చిత్తము ఉంటుంది కాని చిత్తములు ఉండవు. వాడి personal imperfections ఉండవు. Personal imperfections లేనపుడు తన చిత్తము, ఎదుటివాడి చిత్తము అని ఉండదు. అందుచేత చేయగలుగుతాడు. అది ఇక్కడ చెప్పబడినటు వంటిది ''చిత్తస్య పరశరీరావేశః'' వాడి చిత్తం పరశరీరాన్ని ఆవేశిస్తుంది. ఇది కేవలం మనం చాల higher meaning లో organisation అనేటువంటి మాటని వాడితే ఈ అర్థం వస్తుంది.

## 40. ఉదాన జయాజ్జల పంక కంటకాదిష్వసంగ ఉత్క్రాన్తిశ్చ।

ఉదాన జయాత్ = ఉదానము అను ప్రాణగతిని జయించుట వలన, జల = నీళ్ళు, పంక = బురద, కంటకం = ముళ్ళు, ఆదిషు = మొదలైన వానియందు, అసంగ = అంటకుండా, ఉత్క్రాన్తిః = దాటిపోవుట, చ = మరియును.

ఉదాన వాయువుపై జయము సాధించుట వలన నీరు, బురద, ముండ్లు, స్పృశించి బాధింపకుండ వాని పైనుండి నడచిపోవుట అబ్బును.

**వివరణ :** పైన చెప్పిన సూత్రం తరువాయి అన్నమాట. ఉదానము అనబడునట్టి ఒకానొక వాయుగతిని జయించుట వలన, నీళ్ళల్లో నడుస్తూంటే, నీళ్ళల్లో దిగబడకుండా నీళ్ళు కాలికంటకుండా నడవటం, బురదమీంచి నడుస్తూంటే కాలికి బురద అంటకుండా నడవటం, ముళ్ళ మీదనించి నడచి వెడుతూంటే, ముళ్ళు కాలులో దిగబడకుండా నడవటం మొదలైనవి అనగా ముళ్ళే కాకుండా మేకులు మొదలైనటువంటి వాటిమీద కాని, తేళ్ళు, పాములు మొదలైన వాటిమీద కాని, వాటియందు 'అసంగ' సంగము లేకుండా, వాటికీ మీకు అంటటం లేకుండా. 'ఉత్క్రాన్తిశ్చ' అంటే నడచిపోవుట వస్తుంది. ఎలా వస్తుందండి? మీ మనస్సు కిష్టం లేనటువంటి పని చేస్తూనో, దాని గురించి మాట్లాడుతూనో, అరగంట అయిన తర్వాత, ఒక్కమాటు మిమ్మల్ని మీరు పరీక్ష చేసుకోండి ఏమవుతుంది? శరీరం చాల బరువుగా ఉంటుంది. ఒక్కొక్కపుడు అనారోగ్యంగా ఉన్నపుడు కాలు, చెయ్యి ఎత్తలేము. కాని బరువు పెరుగుతామా? పెరగం. మనకి శరీరం బరువుగా ఉండటం వేరు. బరువు పెరగటం వేరు. బరువుగా ఉండుట sensation. బరువు పెరగటం objective. అలాగే మీకు నచ్చినటువంటి ఒకానొక సన్నివేశంలో కూర్చొని అవతల వాళ్ళతో మీరు చక్కగా మాట్లాడుతున్నా రనుకోండి. వాదోపవాదాలు లేవు. చక్కగా ప్రశాంతమైనటువంటి వాతావరణం ఉందనుకోండి. ఏమవుతుంది? శరీరం చాల తేలికగా, ఇవ్వాళ చాల తమాషాగా అసలు దేహం ఉన్నట్లు లేదు అనిపిస్తుంది. ఈ తేడాలు మీరు మీ శరీరాన్ని గురించి గమనించాలి. ఒక్కొక్కపుడు యివాళ ఏమిటిరా ఇంత తేలికగా ఉంది శరీరం

అనిపిస్తుంది. ఒక్కొక్కప్పుడు శరీరం పర్వతంలాగ ఉందేమిటి అనిపిస్తుంది? ఆ పర్వతంలాగ ఉన్నప్పుడు చూసుకున్నా అంతే బరువు ఉంటుంది. ఈ తేలికగా ఉన్నప్పుడు చూసుకున్నా అంతే బరువు ఉంటుంది. ఏం జరుగుతోంది? అది మనకు కావాలి? అయస్కాంతం ఉన్నది. దానిమీద మనం యింకొక అయస్కాంతం పెట్టి నొక్కుతున్నాము. కాని నిలుచుంటం లేదు. పైకి నెట్టేస్తోంది? ఎంచేత? ఈ రెండింటికి north pole, south pole ఒక ప్రక్క పెట్టి నొక్కుతున్నాము. అలాగాకుండా మళ్ళీ తిప్పి పెడితే కరుచుకుంటూంది. తీస్తే రావటంలేదు. మన శరీరములో ఉండే కణములకిన్నీ, భూగోళం మీద ఉన్న కణములకిన్నీ అలాటి సంబంధమే ఉంది. ఆ సంబంధం ఉండటంవల్ల మనం భూగోళం మీద నిలబడి ఉన్నాంగాని, లేకపోతే గాలికి ఎగిరి ఎక్కడికో పైకి వెళ్ళిపోవాల్సిందే. భూమి గిరగిరా తిరుగుతూ ఉంది. ఎంత స్పీడులో తిరుగుతోంది? అలా తిరుగుతూంటే అక్కడ సముద్రంలో ఉన్న నీళ్ళన్నీ కూడ మరచెంబులో ఉన్నట్లుగా ఒలికి పోవాలా? అక్కర్లేదా? ఏం ఏమన్నా మూతలు, డబ్బాలు అడ్డం వచ్చాయా? భూమికి ఉన్న స్పీడుకి అట్లా తిరుగుతూ ఉంటే లెక్కేస్తే సముద్రంలో ఉన్న నీళ్ళు పుక్కిలించి ఉమ్మేసినట్లు బయటికి వెళ్ళిపోవద్దూ! కాని ఎందుకు వెళ్ళటం లేదు? రెండవ శక్తి కూడ అక్కడనే ఉంది. చెంబుకి తాడుకట్టి చెంబులో నీళ్ళుపోసి తిప్పుతున్నాం అనుకోండి. అలా తిప్పుతూంటే చెంబు మన తలకాయకి కొట్టుకోకుండా, చెంబులో ఉన్న నీళ్ళు క్రిందపోకుండా తిప్పవచ్చా? లేదా? ఏం జరుగుతోంది. చెంబుకి ఉన్నతాడులో రెండు శక్తులు ఒకమాటే పని చేస్తున్నాయి. మీ దగ్గరనించి చెంబు అవతలకి వెళ్ళిపోకుండా దగ్గరికి లాగుతున్న శక్తీన్నీ, మీరు పట్టుకొని ఉండటంవల్ల, మీరు తిప్పుతూ ఉండటంవల్ల, మీ దగ్గరికి అది రాకుండా దూరంగా వెడుతూన్న శక్తీ ఒకేసారి (simultaneous) గా పనిచేస్తున్నాయి. రెండూ పనిచేస్తూ ఉంటేనే కదా చెంబు మన బుర్రకాయకి తగలకుండా తిరిగేది. Centrifugal, centripetal forces రెండూ simultaneous గా పనిచేస్తున్నాయి. పట్టుకొని ఉంటే చేతికి తెలుస్తుంది. చేతినించి చెంబు అవతలకి లాగేస్తున్న శక్తి తెలుస్తుంది, దగ్గరకి రాకుండా.

అంతకంటే దూరం పోకుండా చెంబు మీ చుట్టూ తిరుగుతున్న శక్తీ రెండూ మీ చేతికి తెలుస్తాయి. జాగ్రత్తగా చూస్తే. ఊరికే dynamics ఒకటి చదువుకుంటే లాభంలేదు. Dynamics feel అవ్వాలి. Dynamics experience చేయాలి. ఇక్కడ ఎరిగుండేట్లుగా చెయ్యాలి వాట్లని. లేకపోతే పుస్తకాల్లో ఉంటాయి. కనుక ఈ రెండు సంబంధములు మన శరీరానికిన్నీ, భూమికీ ఉండటం వల్లనే భూమ్మీద నించి మనం బయటికి వెళ్ళిపోవటంలేదు. అలాగే ఇంకొక రహస్యం చెబుతాను. ఇంతవరకు నవీన శాస్త్రజ్ఞులు ఎరగనిదిన్నీ, ప్రాచీన భారతీయులు, ఈజిప్షువాళ్ళు ఎరగనదిన్నీ, ప్రతివాడి వెన్నెముకలోను ఒక్కొక్క అయస్కాంతం లాంటి, అంటే ఇనుముకి సంబంధించిన అయస్కాంతం కాకపోయినా, భూగోళానికి సంబంధించిన అయస్కాంతం ఉంది. భూగోళానికి ఉత్తరధృవం నించి దక్షిణధృవం వరకూ ఉన్నటువంటి అయస్కాంతం ఉండంగ మన వెన్నెముకలో కూడ ఆ అయస్కాంతం ఉన్నది. మనం రాత్రి పడుకున్నపుడు ఈ అయిస్కాంతము, ఆ అయస్కాంతము కలిసినటువంటి పనులు చేస్తున్నాయి. అలాగే ఒక గర్భిణీ స్త్రీ ఉందనుకోండి. తల్లి శరీరంలో ఒక magnet, బిడ్డ శరీరంలో ఒక magnet, ఈ రకమైన సంబంధంలో ఉంటుంది 9 మాసాలునూ. అంచేత, తల్లి శరీరంలోంచి బిడ్డ శరీరం ఇవతలకి ఊడిరాదు. వీళ్ళు వెధవ పనులు చేస్తే తప్ప. తర్వాత నెప్పులు వచ్చేటువంటి టైములో, ప్రసవించేటువంటి టైములో polarity మారిపోతుంది. Head down position వచ్చేటప్పటికి బిడ్డకి, అది వరకు ఆకర్షించి పడుతూ ఉన్నది ఏ శక్తి అయితే తల్లి శరీరంలో ఉన్నదో, అది వికర్షిస్తుంది. లేకపోతే నెప్పులు రావటానికి అవకాశం లేదు, delivery అవ్వటానికి అవకాశం లేదు. Delivery కి ఎవరు కారణం అంటే లేడి డాక్టరున్నూ, సిజేరియన్‌కాదు. ఇది తెలియాలి. దీన్ని గురించి "The Science of Polarities" అనేటువంటి పేరుతో ఒక గ్రంథంలో జ్వాలాకూలుడు చక్కగా వివరించారు. ఇది తెలిస్తే మీరు ధ్యానంలో ఏం చేస్తారంటే యోగాభ్యాసం చేస్తూ ఉత్తరధృవం, దక్షిణధృవం అడుగున భూమి, ఇలా ఉన్నాం మనం అంతా మామూలుగా. ఎంచేత, మనలో positive

charge ఉంటే, earth లో negative charge ఉంది. అది అందరికీ తెలుసు కదా static electricity లో. అందుకని యివి రెండూ లాగి కట్టేసారు. మీరు ధ్యానం చేయటంలో ఏమి చేస్తున్నారు? శరీరాన్ని తేలిక చేస్తున్నారు. అంటే మీలో ఉన్నటువంటి ధృవత్వాన్ని మారుస్తున్నారు. Polarity ని మారుస్తున్నారు. దేనివల్ల జరుగుతుంది? కేవలం సంయమం వల్లే జరుగుతుంది. ఇంకేం అక్కర్లేదు. ఇపుడేం చేస్తుంది? భూమ్మీద ఉన్నటువంటి శక్తి అంతా దేనికి పనిచేస్తుంది? మిమ్మల్ని పైకి నెట్టటానికి పనిచేస్తుంది (up word the hill). దాంతోపాటు మీ శరీరంలో కొన్ని pulsations ఉన్నాయి. ఏమిటి? లోపలనించి బయటికి నెట్టేదిన్నీ, దేనివల్లయితే శ్వాస బయటకు విడుస్తున్నామో అదిన్నీ, బయటనించి లోపలకి నెట్టేదిన్నీ. అంటే దేనివల్ల అయితే శ్వాస మనం పీలుస్తున్నామో, ఈ రెండింటినీ ప్రాణాపానములు అంటారు. తర్వాత దీంతోను, అన్న పానీయాదులతోను స్వీకరిస్తున్నటువంటి energy ని శరీరంలో equal distribution చేస్తుంది. ఇంకొక శక్తి ఉంది దానిపేరు సమాన వాయువు అంటారు. ఇంకో pulsation ఉంది. ఇది out going pulsation. ఇది in coming pulsation, equalising pulsation. ఈ equalising pulsation పేరు సమానవాయువు అంటారు. బయట వాతావరణం యొక్క వాయుపీడనం atmosphic pressure కీ, నీ శరీరంలో ఉన్నటువంటి రసాయనిక పదార్థాల యొక్క, చర్మముయొక్క వేడికిన్నీ, లోపలనించి ఎంత pressure యిస్తే, బయట ఉన్న pressure కి ఇది నిలబడి ఉంటుందో, అది ఏ క్షణానికా క్షణం నిర్ణయింప బడుతూ ఉంటుంది. ఉదాహరణకి మనకి సముద్రంలో మునిగినా చలివేయక 24 గంటలు చనిపోకుండా ఉండేట్టుగా గాలి supply తో ఏదన్నా పెట్టించుకొని, సముద్రం లోపలకి వెళ్ళి మూడు మైళ్ళకి దిగామనుకోండి ఏమవుతుంది? దిగుతూ ఉండంగ మధ్యలోనే చనిపోతాం. పచ్చడి, చట్నీ అయిపోయి. ఎందుకని? ఇన్ని నీళ్ళు మనపైన ఉండగా బ్రతకడం అనేది అలవాటు లేదు అదివరకు. శరీరంలో ఎంత పీడనం ఉన్నది. రెండు మూడు మైళ్ళు క్రిందికి దిగేవరకు బ్రతికి ఉంటామా? మనలో మాట యోగాభ్యాసం వల్ల? ఒక అయిదారేళ్ళు ప్రాక్టీస చేసి,

ఎవడన్నా ప్రదర్శనంచేస్తే చేయవల్సిందేగాని, వెంటనే రెండు మూడు మైళ్ళు దింపితే వాడి శవాన్నే బయటికి తీసేది. యింకేంలేదు. కనుక మనం యిక్కడ నిల్చుంటే దీనికి తగినటువంటి ఉత్పీడనం అంటాం లోపలనించి అక్కడ పనిచేస్తోంది. కొండమీదకి వెళితే తగ్గుతుంది కదా pressure. అపుడు లోపలనించి ఉన్న ఉత్పీడనం కూడ తగ్గుతుంది. లేకపోతే ఏమవుతుంది? బెలూన్ అల్లే బద్దలైపోతాం. మన శరీరంలో ఇపుడెంత పీడనం ఉందో ఇక్కడ, ఇంతే పీడనం పైన, ఈ పీడనంతోనే పైకి వెళ్ళామనుకోండి ఏది? ఒక అరమైలు ఎత్తుకి లేకపోతే మైలో, రెండు మైళ్ళో ఎత్తుకి. అపుడే మవ్వాలి? మామూలుగా అయితే లోపల నించి ఈ పీడనం ఇలాగే ఉంటుంది. చుట్టూ ఉన్నటువంటి వాయుపీడనం తగ్గుతుంది కదా. తగ్గితే లోపలనించి bloat అయిపోయి టప్‌మని బెలూన్ బద్దలైపోయి చచ్చిపోవాలి. అవ్వదు. ఎందుకని లోపలనించి ఈ ఉత్పీడనం తగ్గుతుంది. అంటే regulation of the outward impulse తగ్గుతుంది అంటే surface impulse ఇది. Surface pulsation లో, ingoing pulsation, 2. Out coming pulsation, 3. Equalising pulsation, 4. Surface forming pulsation. దీనివల్లనే అన్నింటికి (surfaces) తలములు అనేటువంటివి తయారవుతున్నాయి. దీన్నే ఉదానము అంటారు. లోపలనించి అన్ని ప్రక్కలకి బయట ఉన్న temperature ని బట్టి, atmosphere ని బట్టి, pressure ని బట్టి నిలబడి ఉంది. అది ఉదానవాయువు pulsation. అది బయటికి upthrust అన్నమాట pressure. అది ఒక విధంగా atmospheric pressure తో respond చేస్తూ ఉంటుంది. తర్వాత మొత్తం అంతా ఉన్నటువంటి ప్రజ్ఞ అంతటిలోను సమానంగా తిరుగుతూ ఉండటం కోసమని చెప్పి, యింకొక pulsation పనిచేస్తుంది. అంటే మన మనస్సులో ఉన్నటువంటి, మనస్సు ఎక్కడ ఉంటుందంటే ఇక్కడ (తల చూపించి) ఉంటుందంటాము. కాని కాలి బొటనవేలు దురదపెడితే మనస్సు అక్కడ ఉండదా? నువ్వు ఈ ధ్యానంచేస్తే జరిగేదేమిటో తెలుసునా? ఇందులో ఉదానం అని చెప్పాం చూడండి. అది క్రమంగా ఉన్నటువంటి దానికన్నా ఎక్కువ అవ్వటం మొదలుపెడుతుంది. ఎక్కువ అవటం మొదలు పెట్టేటప్పటికి ఏమవుతుంది? భూమి ఆకర్షణ

చేస్తోంది చూడండి. దానికి వ్యతిరేకంగా పనిచేస్తుంది. భూమి మీ శరీరంలో ఉన్న కణములమీద ఆకర్షణ తగ్గిస్తుంది. ఈ మార్పు వస్తుంది మీ శరీరానికి, భూమికీని. ఇది రోజూ కొంతసేపు గనుక చేసినట్లైతే, ఆరోజుకారోజుకి మీరభ్యాసం చేస్తున్నటువంటి క్షణములో, నిమిషములో గంటలో శరీరం తేలికపడి, ఈ శరీరం గాలిలో లేస్తుంది పైకి. వరద వచ్చిందనుకోండి. దానిమీద తేలి వెళ్ళిపోతారంతే. బురద వచ్చిందనుకోండి. బురద అంటదు. ముళ్ళు వచ్చాయనుకోండి. ముళ్ళమీద నడిచి వెళ్ళిపోతారు. ఇలాంటిది కూడ వస్తుంది. ఇవి అభ్యాసం చేయడం వల్ల ఎందుకు పనికొస్తాయి? అంటే ఇందాక చెప్పినవే. ఎపుడైనా ప్రాణావసరాలుగా ఉంటే ఈ శరీరాన్ని బాధపెట్టకుండా ఉండడంకోసం. అంతకంటే ఇంకేం ప్రయోజనం లేదు వీటికి. లేదా ప్రదర్శనం చేసుకొని, ఒక తాలింఖానా పెట్టుకొని, ఏదో రెండు మూడు తరాల వరకు డబ్బు సంపాదించి పడేసి వెళ్ళటం. అది కావాలంటే అది. ఇది కావాలంటే ఇది చూసుకోమన్నాడు. కనుక 'ఉదాన జయాత్' ఉదానమును జయించుట వలన అనగా ఉదాన వాయువుని గూర్చి మీరు ఇదివరకు చెప్పబడిన సంయమము అనబడే ధ్యానం చేయటమే. మీరింకేం చేయక్కర్లేదు. ఎక్కడనించి బయల్దేరుతోంది ఉదాన వాయువు. బొడ్డు దగ్గరనించి బయల్దేరుతుంది. కేంద్రం బొడ్డులో ఉంటుంది. అందుకని మీరు బొడ్డు దగ్గర, మణిపూరక చక్రం దగ్గర ధ్యానం చేయటం మొదలుపెట్టాలి. నాభి దగ్గర ధ్యానం చేయటం మొదలుపెడితే ఈ స్థితి వస్తుంది. అది చెప్పాడు. ఇది కావాలి, ఈ రకంగా తేలిక కావాలి, శరీరంలోంచి మన బంధం యువతలకి రావాలి అనే పద్ధతిలో ధ్యానం చేయాలి. అపుడు క్రమంగా శరీరము తేలిక పడుతుంది. ఈ శరీర వ్యూహాలకి, మనకు మధ్య ఉన్న బంధాలు కూడ తెగిపోతాయి. మనం తరువాత ఎంతకాలం శరీరంలో ఉన్నా, బంధాలు ఉండవు. ''జీర్ణమివ వస్త్రం'' రామానుజుల వారు చెప్పారు. బట్ట చిరిగిపోతే సహజంగా దానంతట అది ఒంటిమీద నించి కిందపడి పోయినట్లు నీ పని నువ్వు చేసుకుంటూ ఉంటే శరీరం పడిపోతుందన్నారు. ఆ స్థితి వస్తుందన్నాడు. అది ఈ సూత్రం.

## 41. సమాన జయాజ్జ్వలనమ్।

సమాన జయాత్ = సమాన వాయువుని జయించుట వలన, జ్వలనమ్ : వెలుగుట అనేది వచ్చును.

సమాన వాయువును జయించుట వలన ప్రకాశము కలుగును (ఆత్మ తేజస్సు దేహము నుండి వెలువడుచు యితరులకు వికాసవంతుడుగా కన్పించును).

**వివరణ :** ఇట్లాంటివే రెండు మూడు చెబుతాడు. ఇవి పెద్ద ముఖ్యమైనవి కావు. కాని తెలుసుకొని ఉండటం మంచిది. సమాన వాయువుని జయించుటవలన, అంటే శరీరంలో sensations, equal గా distribute చేసేటువంటి స్పందనమును సాధన చేయుటవలన, అభ్యాసము చేయుటవలన, అది జయింపబడుతుంది. జయింపబడటం అంటే అది నువ్వు అవుతావు. నీకంటే వేరే ఉండదు అది. దేన్ని ధ్యానం చేసినా అంతే జరుగుతుంది. దానివలన 'జ్వలనమ్' వెలుగుట అనేది వస్తుంది. వెలుగుట రావటం అంటే ఏమిటి? మీలో అత్యద్భుతమైన తేజస్సు ఒకటి అందరికీ కనిపిస్తుంది ఆశ్చర్యకరంగా. రెండవది, ఎక్కడన్నా ఒకచోట, గాలిలోనైనా సరే. మీరు చూచి ఈధ్యానం చేయటం మొదలుపెడితే అక్కడ మనం నిప్పు అంటాం చూడండి మంట, అది పుడుతుంది. అది ఎక్కడన్నా ఎండుగడ్డి పెట్టి ధ్యానంచేస్తే అది అంటుకుంటుంది. వంట చేసుకోవచ్చు. అగ్గిపెట్టె అడగక్కర్లేదు. నలోపాఖ్యానం మొదలైన వాటిల్లో భారతంలో మనకు తెలుసు. దీని వర్ణనం ఉన్నది. శిరిడీ సాయిబాబా ఏం చేసాడు? ఎండుగడ్డిలో కర్రతో కొట్టి, అక్కడ నిప్పువస్తే అదిపెట్టి చిలుం కాల్చుకుంటున్నాట్ట. ఇలా ఎక్కడ కావాలంటే అక్కడ నిప్పు ఎలా వస్తోంది? బొగ్గుపెట్టి అంటిస్తే మాత్రం ఎక్కడ నించి వస్తోంది? అగ్గిపుల్ల గీస్తే ఎక్కడనించి వస్తోంది, ప్రశ్న వేసుకోండి? అగ్గిపుల్లలో ఉందా? అగ్గిపెట్టెలో ఉందా నిప్పు? అగ్గిపుల్ల చివర ఉన్న మందులో ఉందా? ఎక్కడ ఉంది? అగ్గి పెట్టెకి, అగ్గిపుల్లకి మధ్యనున్నటు వంటి ఆకాశమే అగ్ని. అది కొట్టేటప్పటికి మనక్కావలసిన మంట అనే రూపంలో వచ్చింది. ఆకాశంలోంచే వాయువు, అగ్ని మొదలైనవన్నీ కూడ వస్తాయి. అగ్గిపుల్లతో నిప్పు వస్తోంది కనుక అదేం మిస్టరీ కాదనుకుంటున్నాం. అగ్గిపుల్ల అక్కర్లేకుండా వస్తే మనకి తెలీదు కనుక miracle అనుకుంటాం అంతే. చెకుముకి రాయి కొట్టామనుకోండి. ఇనుప ముక్కకి నిప్పు వస్తుందా?

రాదా? చెకుముకి రాయిలో ఉందా? ఇనుప ముక్కల్లో ఉందా? రెండింటి మధ్యనున్న ఆకాశంలో ఉంది. వాట్లల్లోకి ఎక్కడనించి వస్తుందో ఇందులోకి కూడ అక్కడనించే వస్తుంది. కనుక ''సమాన జయాత్ జ్వలనం'' సమాన వాయువును జయించుటవలన జ్వలనం అనేది వస్తుందని చెప్పాడు. ఇక్కడనించి ఇంతకుముందు చెప్పిన దివ్యసిద్ధులు చెప్పాం చూడండి శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు అందులో ఒక్కొక్కదాన్ని గురించి ఎలా ధ్యానం చేయాలో కొంచెం సుళువు యిస్తాడు. సమాన వాయువు జయంవలన జ్వలనం అనేది ఉంటుందని చెప్పాం. మనం ఎరిగి ఉన్న భాషలో చెప్పుకోవాలంటే సమాన వాయువు యొక్క స్థితి మనం ఎరిగి ఉన్నటువంటి రాచబెట్టినటు వంటి నిప్పు, నిప్పుయొక్క మంట అదే సమానవాయువు. ఎందుకంటే ఆకాశంలో వాయువు సమానత్వం చెందినపుడు వాయువునించి వచ్చిన అగ్ని వ్యక్తమవుతుంది. అంటే equal distribution of the pulsation of the space. అది జరిగినపుడు ఈ అభ్యాసం చేసేటువంటి యోగి కూడ ఏం చేస్తాడంటే తనని తాను జ్యోతి స్వరూపంగా ధ్యానం చేసుకుంటంలో సమానవాయువు నందు ఒక రకమైనటు వంటి సమాధిస్థితి వస్తుంది. అంటే సంయమం వస్తుంది. ధారణ, ధ్యాన సమాధులు సంయమంతో తేజస్సుయొక్క స్వరూపుడుగా తన్ను తాను ధ్యానం చేయాలి. యివన్నీ కూడ సత్త్వముయొక్క స్థితి భేదములే. మనకి సత్త్వము పురుషుడు అని రెండు చెప్పారు పై సూత్రాల్లో.







మన శరీరం లోపల ఉన్నటువంటి ఆకాశం, బయట ఉన్నటువంటి ఆకాశం, ఈ మధ్యలో పొరలు ఉన్నవి. అన్నింటికంటే చిక్కనిది, దట్టమైనటు వంటి పొర పృథివి అంటే solid matter, మన శరీరంలో ఘన పదార్థము ఉన్నపుడు మనలో ఉన్నటువంటి సత్త్వము ఈ ఘన పదార్థమును (solid

matter) ఒకచోట పట్టి ఉంచుతుంది. సత్త్వముకాక ఈ లోపల పురుషుడు ఉన్నాడు. సత్త్వము అనేక స్థితులతో కలిసి ఉన్నపుడు దాన్ని అపరిశుద్ధి అంటారు. అపరిశుద్ధి చెంది ఉన్నపుడు పురుషుడు కన్న వేరుగా ఉంటుంది. మనం వేరు. మనం ఉన్నటువంటి చోటు వేరు. కాని మనం నించున్నపుడు నించున్నచోటు మనలో ఉన్నది. మరొక చోటుకి వచ్చినపుడు ఆ చోటు యివతలకి వచ్చేసి అక్కడ ఉన్నచోటు మనం అయినాము. మాట్లాడుతూన్నది అక్కడైనా యిక్కడైనా చోటే మాట్లాడుతోంది గాని, మనం అంటూ ఏమీలేము. చోటు మాట్లాడటానికి, చోటు చూడటానికి, వినటానికి వీటన్నింటికీ కావలసిన యంత్రమే ఈ దేహము. ఇదీ యోగశాస్త్రంలో మనం చూడవలసినటువంటి దర్శనం. చోటే దేహంద్వారా అయితే మాట్లాడుతుంది. చోటుగా అయితే మాట్లాడదు. అందుకని చోటు దేహాల్ని కల్పించుకుంటుంది. మొదట సూర్యదేహాన్ని కల్పించుకుంటుంది. అంటే solar system సౌరకుంటుబం మొట్టమొదటగా పుడుతుంది. దాన్నించి పృథివీ, ఆపస్, తేజో, వాయు, రాకాశములు, సూక్ష్మ పంచభూతములు, స్థూల పంచ భూతములు వీటన్నింటినీ పొరలు పొరలుగా కల్పించుకుంటుంది. ఆ కల్పించుకున్న పొరలలో మధ్య ఒకానొక దళసరికి సంబంధించినటు వంటి పొరయే మన భూగోళము. దానియందున్న మట్టి, ఖనిజములు మొదలైన పొర మనం పదార్థము (matter) అనేటువంటిది. మనం matter అనే మాటకిన్నీ, మిగతా బృహస్పతి గ్రహము, శుక్ర గ్రహము, బుధ గ్రహము దానిమీద ఉన్న జీవరాసులు matter అనేటువంటి మాటకిన్నీ ఏమీ సంబంధం ఉండదు. మనం ద్రవ్యము అనే మాటకి అర్థం ఏమిటి? భూగోళం మీద ఉన్న పదార్థము అని అర్థము. అలాగే చంద్రగోళం మీద ఎవడైనా ఉండి ద్రవ్యము అంటే ఆ మాటకి అర్థం చంద్రగోళంలో ఉన్న పదార్థము అని అర్థంకాని, అలవాటు చొప్పున భూగోళంలో ఉన్న పదార్థం అనటానికి వీల్లేదు. మన శరీరం తయారైన ఈ భూగోళంమీద ఉన్నపుడు, భూగోళం ఉన్న పదార్థంతోనే తయారవుతుంది. ఇది వదిలి కొంత పరిణామం (evolution) అయిపోయిన తర్వాత బృహస్పతి గ్రహ మండలంలోకి వెడితే బృహస్పతి గ్రహమండలంలో ఉన్నటువంటి ద్రవ్యంతో తయారవుతోంది గాని, ఇక్కడున్న ద్రవ్యంతో తయారవదు. అలాగ బుధుడిలోకి వెడితే బుధగ్రహంలో ఉన్న ద్రవ్యంతో తయారవుతుంది. శుక్రుడిలోకి వెడితే, శుక్రగ్రహంలో ఉన్న ద్రవ్యంతో తయారవుతుంది. సూర్యుడిలోకి వెడితే,

సూర్యుడిలో ఉన్న ద్రవ్యంతో తయారవుతుంది. ద్రవ్యం సూర్యుడిలోది. భౌతికమూ కాదు. ప్రాణమయమూ కాదు. మనోమయమూ కాదు. విజ్ఞాన మయమూ కాదు. పరిశుద్ధమైనటు వంటిది. దానిచుట్టూ కొన్ని లక్షల మైళ్ళ దూరాన ఏర్పడిన పొరలే మనం చూస్తున్న సూర్యగోళము. అంటే Sun globe అనేది మన భ్రమ (illusion) తప్ప, అక్కడ ఏమీ లేదు. మనం చూస్తున్న Sun globe లో ఏం ఉన్నదో, వందో, రెండు వందలో సంవత్సరాలైన తర్వాత కనిపెట్టవచ్చును సైంటిష్టులు. మన కంటికిగాని, మనం చూచే యంత్రాల్నిగాని మోసగించే ఆ సూర్యుడని మనం చెప్పే స్థానంలో ఏమున్నది? మామూలుగా నీలంగా కనిపిస్తున్న చోటులో ఏముందో అక్కడా అదే ఉంది. కాని ఒకచోటు కేంద్రంగా ఏర్పడ్డాక దాన్నించి కొంతదూరం అయ్యేటప్పటికి వాయువు యొక్క మండలం ఏర్పడుతుంది. దాన్నించి ఇంకా కొంతదూరం అయ్యేటప్పటికి వాయుమండలం వ్యాపించి ఇంకో కొంతదూరం అయ్యేటప్పటికి తేజోమండలం ఏర్పడుతుంది అగ్నిమండలం. అంటే heat- light, electricity-magnetism. ఈ మధ్యన electrons, protons, electronic activity ఇవన్నీ ఉంటాయి. తర్వాత mist formation అంటే జలమండలం ఏర్పడుతుంది. అందులో సూక్ష్మ జలములు, స్థూల జలములు వేరేవేరే పొరలుంటాయి. సూక్ష్మ జలములు అంటే supra-physical. Physical గా అంతవరకు ఏం ఉండవు. ఎందుకంటే అగ్ని భౌతికం కాదు, light భౌతికం కాదు. యింతవరకు ఆధునిక విజ్ఞాన శాస్త్రం (modern science) లో ఎవడికీ light మేటరా? కాదా? అన్నది తేలలేదు? ఈరోజు most up to date గా modern గా ఉన్నటువంటి సౌర సిద్ధాంతాలు (solar theories) లో గాని, light theory physics లో గాని తీసుకున్నటువంటి గ్రంథాలు తాజాగా వచ్చినటువంటి వార్తలు కూడ మనం తీసుకొని చూచినా, light అంటే ఏమిటి? అంటే we don't know. అదొక్కటే జవాబు. కాని ప్రాచీన శాస్త్రవేత్తల ప్రకారం వాళ్ళకి చాతనైన నిర్వచనం వాళ్ళిచ్చారు. రైటో, తప్పో. light అంటే ఏమిటి? తెలివి అంటున్నామే, అదే light అంటేను. బయట objective గా మనం చూసినపుడు light అంటాం, subjective గా చూస్తున్నప్పుడు తెలివి అంటాం. కనీసం రెండు అడుగులైనా ముందుకి వెళ్ళారు. Modern scientist కూడ అలాంటివి ఒకటో రెండో అడుగులు ముందుకు వెళ్ళగలిగితే అపుడు ఏది రైటు అనేది ఆలోచించొచ్చు. ఇక్కడే

కొట్టుకుంటున్నాం light గురించి. So both eyes are towards blind. ఎందుకంటే మనం optic light ఎరుగుదుము కాని, mental light యింతవరకు modern science ఎరుగదు. సూర్యుడు నించి వచ్చినటువంటి దాంట్లో వాళ్ళున్నటువంటి spot కి న్యూరాన్ వాయుమండలం, దానిచుట్టూ అగ్నిమండలం, దానికి దూరాన దానిచుట్టూ జలమండలం, దానికి దూరాన దానిచుట్టూ ద్రవ్యమండలము లేక భూమండలంమీద ఉన్న చోటులో దీన్ని orbit గా తీసుకొని మన భూగోళం ఉన్నది. మనం చూస్తున్న సూర్యుడు యిక్కడనించి కనిపిస్తున్న సూర్యుడు తప్ప, అక్కడ ఉన్న సూర్యుడు కాదు. ఇపుడు మన సూర్యుడిలోంచి వస్తున్నటువంటి ఈ temperature, ఈ radiation, ఈ energy, ఈ heat అక్కడెక్కడో ఏదో ఒక body ఉండి అందులోంచి వస్తున్నది కాదు. మధ్యలో పుట్టి మధ్యలోంచి వస్తూన్నది. అందుచేతనే యిపుడున్నటు వంటి సూర్యునియొక్క ఉష్ణోగ్రతని లెక్కకట్టి, దీన్నిబట్టి ఎన్ని లక్షల సంవత్సరాలకి ఈ సూర్యుడు దగ్ధమైపోతాడో, చెప్పినటువంటి లెక్కలన్నీ కూడను పిచ్చిలెక్కలు. ఎందుకంటే మనందరికీ భౌతికంగా ఒక్కొక్కళ్ళ శరీరానికి ఇంత ఆయుర్దాయం అని ఎలా ఉన్నదో, అలాగే solar system కి ఉన్నది. ఆ టైము అయిపోయిన తర్వాత అది బ్లో-అఫ్ అయిపోతుంది. ఈ లెక్కలన్నీ మన శరీరంలో ప్రతిక్షణము ఉత్పత్తి అవుతున్న ఉష్ణోగ్రతని లెక్కవేయటానికి. ఏదైనా instrument పెట్టి దాంతో చూసి క్షణానికి యింత వేడి పుడుతోంది గనుక నిమిషానికి ఎంత? గంటకి ఎంత? రోజుకెంత? అనివేసి దాన్నిబట్టి ఆయుర్దాయం లెక్కవేసినట్లు మనం బ్రతికి ఉన్ననాళ్ళు ఆ శక్తి (energy) ఉత్పత్తి అవుతుంది. ఇది ఉత్పత్తి అవుతున్ననాళ్ళు బ్రతికి ఉండడం అనేది తప్పు. బండి వెనుక గుఱ్ఱాన్ని కట్టకూడదు. గుఱ్ఱానికి బండి కట్టాలి. కనుక సూర్యుడిలో ఎంతకాలం దగ్ధము (combustion) జరుగుతుందనే లెక్కలు బండి వెనుక గుఱ్ఱాన్ని కట్టడం లాంటివి. అందుకని సూర్యుడు మధ్య ఏం ఉన్నాయి? నీకు, నాకు మధ్య ఏం ఉందో అదే వుంది. ఇంకేం లేదు. కాని చోటుగా awakening జరుగుతుంది. దానిచుట్టూ సౌరకుటుంబం పుడుతుంది. ఆ awarkening పేరే మన భాషలో చెప్పుకుంటే 'నేను', 'అహం' కనుక మొట్టమొదట సూర్యుడు 'నేను' అని చెప్పి ఉపదేశించానన్నాడు భగవద్గీతలో. ''ఇమం వివస్వతే యోగం ప్రోక్తవాన్ అహం అవ్యయం'' అహం అంటే నేను అనేటువంటి

పదానికి అర్థం. 'అవ్యయం' అంటే ఎన్నడూ వ్యయం కానిది. ఇది మొట్టమొదటిగా సూర్యుడికి చెప్పాను అన్నాడు. అదీ యోగం అంటే. మనం అంతా వేరే పుట్టడంవల్ల ఒకడికి ఒకడు వేరే ఉంటున్నాం. కనుక ''సకాల నేహ మహతా యోగో నష్టః పరంతప'' యోగం నష్టం అయ్యింది. యోగం అంటే ఓ ముక్కుతో గాలిపీల్చి ఓ ముక్కుతో వదలడం కాదు. యోగం అంటే సమన్వయము (synthesis) లో పుట్టింది. ఈ విశ్వం (universe) సమన్వయం (synthesis) లోంచి విశ్లేషణ (analysis) లోకి వచ్చేసింది. కనుక మళ్ళీ మనం (synthesis) సమన్వయం సాధించుకోవాలి. లేకపోతే misery అనుభవిస్తాం జీవితంలో అని భగవద్గీతలో ఉపదేశం చేసాడు. అంటే essential oneness of everyone with the whole universe. అది సాధించుకోలేని పిచ్చివాడు ఎంత తెలివిగల వాడైనాసరే రక్తపోటుతో చచ్చిపోవాల్సిందే. అదే వాడు చెప్పింది. అది ఏ శాస్త్రం సాధించుకోనీండి. ఎంతైనా చదువుకోనీండి. ఎంతైనా వాడికి ఉండనీయండి. ఎంతైనా తెలియనీయండి. ఏం తెలిసినప్పటికీ తనకిన్నీ మొత్తం విశ్వానికిన్నీ అవినాభావ సంబంధం, విడదీయ రానటువంటి అంగాంగీ భావ సంబంధం ఉన్నది. అంటే తాను part in the whole అని గమనించుకుంటూ వెళ్ళినవాడు సుఖమనే మాటకి, పెట్టి పుట్టి ఉంటాడు. కొద్దిగా నోచుకుంటాడు. లేకపోతే సుఖమనే మాటకి వాడేం చెప్పుకున్నాడో అంతేగతి. పొద్దున్న, రాత్రికూడ ఓవర్‌టైము చేస్తావు. పెళ్ళాం పిల్లలు పొద్దున్న నువ్వు ఆఫీసుకి వెళ్ళేటప్పటికి నిద్రలేవరు. రాత్రి నువ్వు ఆఫీసునుంచి వచ్చేటప్పటికి నిద్రపోతూ ఉంటారు. ఎందుకిదంతా? అంటే ఏమిటోనండి సుఖపడదామనే కదా అంటాడు. అంటే వాడికి సుఖం అంటే గడ్డి తినటం అన్నమాట. అందుకనే భాగవతం, తృతీయ స్కంధంలో చెప్పాడు. ''మూఢుండు శబ్దమయంబైన వేద ప్రపంచము నందు తిరుగాడు'' అంటే మాటలు పట్టుకొని దాని అర్థాలు కల్పించుకొని దాంతో బ్రతుకుతుంటాడు గాని, అర్థాలకోసం మాటలు ఉపయోగించడం అనేదానికి వాడు ఎంత తెలివైన వాడయినా, ఎంత చదువున్నా పెట్టి పుట్టడు. అంటే he will have his own meaning to words. అంతేగాని ఉన్న అర్థాల దగ్గరికి వెళ్ళి వాటిని మాటలుగా ఉపయోగించుకుంటం అనే మార్పురాదు. ఎవళ్ళున్నా పెద్దవాళ్ళ దగ్గర యిట్లాంటి పుస్తకాలు చదువుకుంటే ఏమన్నా వస్తుంది.

కనుక ఈ నేను అనేటువంటి దాని దగ్గరనుంచి, దీనికి సంబంధించిన కేంద్రం (centre) మీకు యిందులో ఉంది. దీన్ని హృదయం అంటాం. దీనికి భూగోళానికి సంబంధించిన కక్ష్య (orbit) మీలోనే ఉంది. దాన్నే భౌతిక శరీరం physical matter in your body అంటాం. దీనిచుట్టూ తిరుగుతున్నటు వంటి చంద్రుడి కక్ష్య (orbit) ఒకటి ఉన్నది. మీలోనే అదీ ఉన్నది. దాన్నే మనస్సు అంటాం. భూమిచుట్టూ, చంద్రుడు తిరుగుతూ ఉంటాడు. అంటే శరీరం చుట్టూ మనస్సు తిరుగుతూ ఉంటుంది. అన్నమాట. భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతూ ఉంటుంది. అంటే శరీరంలో ఉన్న matter దేనిచుట్టూ తిరుగుతోంది? 'I am' అనేటువంటి కేంద్రం చుట్టూ తిరుగుతూ ఉంటుంది. కనుక సౌర కుటుంబము (solar system) కి ప్రతీక (proto type) నువ్వు. అంటే ఈ విశ్వం అనే మఱ్ఱిచెట్టుకి నువ్వు మఱ్ఱిగింజ అంటే ప్రతి ఒక్కడు ఒక్కొక్క మఱ్ఱిగింజ అందులోంచి మఱ్ఱిచెట్టు వస్తుంది. దీన్ని తిన్నగా సజీవంగా తెలుసుకోవడమే యోగవిద్య. కనుక part in the whole. ఈ విశ్వంలో నిన్ను నీవు ఒక భాగంగా తప్ప, ఇంకో రకంగా ఊహించుకుంటం. మానేసిన నాటి దగ్గరనుంచి నీ నిజమైన అస్తిత్వము కొంచెం అర్థమవుతుంది. సుఖమనేటువంటి మాటకి మనం చెప్పుకున్న అర్థంకాక అసలర్థం కొంత అర్థమవుతుంది. దేనికి సుఖమని పేరు పెట్టారో అది బోధపడుతుంది. లేకపోతే అక్కడికీ సుఖపడదామనే చస్తున్నాం అంటాం. చస్తున్నాం అని ఏడ్చేవాడికి సుఖమేమిటి? ఇంత శ్రమ పడేదీ ఆనందమయ కోశం కోసమే కదండి అంటూ ఆసనాలు, ప్రాణాయామం, తాటకం, పోటకం వగైరా తీవ్రంగా చేస్తూంటాడు. ఇంత శ్రమపడ్డ పిచ్చివాడికి ఎన్నడూ ఆనందం దొరకదు. శ్రమ ఎందువల్ల వస్తుంది మనకి? మూర్ఖతవల్ల వస్తుంది. అంటే out of ignorance we suffer. సృష్టిలో మనం బాధపడటానికి ఏ కారణాలు పెట్టలేదు ప్రకృతి. ప్రకృతి ఏమైనా శ్రమపడుతోందా? విత్తనంలోంచి మొక్క, అందులోంచి చెట్టు, చిగురు, కొమ్మ, పువ్వు, పిందె, కాయ, పండు మళ్లీ అందులోంచి విత్తనం, మళ్లీ మొక్క, అన్ని తమాషాగా వస్తాయి కదా! ఈ మొత్తం చక్రం అంతా ఒక క్రీడగా జరుగుతూ ఉంది. మనలాగ ఉద్యోగం చేసుకునో, వ్యాపారం చేసుకునో సుఖంకోసం శ్రమపడటం అనేటువంటిది ప్రకృతికి లేదు. మిగతా జీవరాసులకి తెలిసినట్లైతే మనల్ని చూసి జాలిపడతాయి. సుఖంకోసం శ్రమ పడుతున్నారుట,

వీళ్ళకి ఈమాత్రం తెలియదా అని. సుఖంకోసం కష్టపడటమేమిటన్ని, జంతువులు కూడ నవ్వుతాయి. యిప్పటికే నవ్వుతున్నాయేమో, మనకేం తెలుసు వాటిభాష. ఎందుకంటే మిగతా జీవరాసుల కంటే మనం ఎక్కువ ఉన్నతమైన దృక్పథంతో పరిణామం చెందేమను కునేటంత తెలివిగల వాళ్ళం. ఒక వంద కుక్కలు మహాసభచేసి, సమస్త జీవరాసులలో కుక్కజన్మ ఉత్తమము అని అవి చెప్పుకుంటున్నాయేమో. అలా అనుకోవడంలో తప్పేమిటి? కనుక మనకు అంత మూర్ఖత్వానికి అవకాశ ముంది జాగ్రత్తగా ఉండకపోతే. అవకాశ ముండటమే కాదు, మనం అమలు పర్చుకుంటూ కూడా ఉంటాం జీవితంలో. ఇవన్నీ వడపోత అయిపోతాయి నిజమైన యోగాభ్యాసంలోకి వెళ్ళేటప్పటికి. ఈ మధ్య ఉన్న పొరలు ఏవైతే ఉన్నాయో, ఆ పొరలే క్షర పురుషుడు. అంటే **the God who has assumed the form of transformation** అంటే పరిణామ పేశలమైన ద్రవ్య స్వరూపము ధరించిన అంతర్యామి యొక్క అవతారం. దానివైపు తిరిగి ఉన్నటువంటి తాను సత్త్వము లేక అక్షర పురుషుడు. క్రమంగా ఈ సత్త్వము అనేవాడు పరిశుద్ధుడై పరిణామత్వము నించి సత్యముయొక్క స్థితికి వస్తున్నాడు. అప్పడు ఏమవుతోంది? మొత్తం ఈ భూగోళం యొక్క పరిణామము, చిట్టచివరికి ఏం జరగడానికి వెళుతూన్నది? ప్రతి-కణము పరమాణువు కూడ బయల్దేరి ఖనిజములుగా, వృక్షములుగా, జంతువులుగా, మానవులుగా, సిద్ధ జీవులైన మహానుభావులుగా వారు పరమగురువుల రూపంలో ప్రమోషన్ పొందుతున్నారు కదా. బావుంది. అయితే మన commonsense ఏం చెబుతోంది? ఈ భూగోళం మీద ఉన్నటువంటి పరమాణవులు ఒక్కొక్కటే ఉత్తమమైనటువంటి వెలుగుని పొందాలి. మనం జ్ఞానం, మోక్షం, ఆనందం అని ఏదైతే అంటున్నామో ఆ వెలుగుని పొందటానికి వెళుతున్నాయి ఈ కణములన్నీ అంతకంతకీ candle power ఎక్కువై. కాని యింతలో ఏమవుతుంది? ఈ భూమి మొత్తానికే వెలుగు ఎక్కువవుతుంది? రానురాను candle power ఎక్కువ అవుతుంది. ఈ సూర్యుడి ప్రసారంచేత. దానివల్ల కల్పాంతం అయ్యేటువంటి టైముకి ఈ భూగోళం మీద సిద్ధంగా ఉన్నటువంటి పరమాణువులు అందరూ కూడ సూర్య తేజస్సుతో కూడినటువంటి జీవులు అవుతారు. అపుడే solar system లో ఉన్నటువంటి pre-atomic stage లో ఉన్నటువంటి brilliance earth కి వస్తుంది. అంటే భూమికూడ సౌరకుటుంబము యొక్క

పరిస్థితికి వస్తుంది. ఆ వచ్చిన తర్వాత ఏమవుతుంది? భూమి బ్లో-అఫ్ అయిపోతుంది earth ఉండదు. మళ్ళీ తరువాత ఇంకో భూమి వస్తుంది. (తరువాత కల్పంలో అనుకోండి.) ఒక్కొక్క సూర్యుడిలో తడవకి ఏడు చొప్పున ఒక భూమి వెళ్ళాక ఒక భూమిలాగ వస్తూ వుంటాయి. ఇప్పుడు మనం అందులోకి వెళ్ళద్దు. కాని యిందులో దాన్నిబట్టి మనకి పరమావధి ఏమిటో తెలుసుకోవాలి. ఇందులో మనం సత్త్వము అని చెప్పేటువంటి వాడు క్రమంగా తేజస్సు పెరిగి పెరిగి పురుషుడు అనేవాడుగా తయారయి వాడికీ వీడికీ అభేదం రావాలి. అంటే మూడవ పురుషుడు అంటే pure space న్నా, శరీరంలో ఉన్నటువంటి మనో, బుద్ధి, అహంకార, చిత్తములు, సప్తధాతువులు వీట్లలో ఉన్న పరిశుద్ధికిన్నీ, అవినాభావ సంబంధం రావాలి. అప్పుడు నిన్ను నువ్వు వేరుగా భావించుకుంటం అనేది సాధ్యంకాదు. ఎన్నడూ కూడను సర్వాంతర్యామిగానే భావించుకుంటావు. నీలోనే ఈ జగత్తులు ఉంటూ ఉంటాయి. ఈ జగత్తులో నువ్వు ఉంటూ ఉంటావు. భగవద్గీత, 9వ అధ్యాయంలో శ్రీకృష్ణుడు చెప్పినటువంటి ధ్యానమే జరుగుతూ ఉంటుంది. అంటే you can never think yourself in any way separately from anything. మన చెయ్యి మనకంటే భేదం కాదు. కాని చేతికి పక్షపాతం వచ్చినపుడు చెయ్యి మనకంటే భేదంగా ప్రవర్తిస్తుంది. అలాగే మనం మిగతా ప్రపంచంలో ఉన్న జీవులకన్నా భేదంగా ప్రవర్తిస్తున్నాం. ఒక వ్యాధి వచ్చింది గనుక. ఆ వ్యాధినే సంసారము లేక భవరోగము అని అంటారు. సంసారం అంటే పెళ్ళాం, పిల్లలు కాదు. జబ్బువస్తే చెయ్యి ఎత్తుకొని నడవాలి. లేకపోతే పడుతుంది. లేకపోతే యింకోళ్ళచేత ఎత్తించాలి. అలాగే మనస్సుకి సంసారం అనే పక్షపాతం వస్తే మిగతా వాళ్ళకంటే మనం వేరు అనేటువంటిది వస్తుంది. వీణ్ణి మిగతా వాట్లల్లోకి చేత్తో ఎత్తుకోవాలో లేకపోతే దేంతో ఎత్తుకోవాలో తెలియని అజ్ఞానంలో ఉంటాం. అంటే seperatist tendencies అవి పోయిపోయి ఎక్కడిదాక వస్తాయి? వ్యాధి ఎక్కువైతే తనకు, భార్యకూ ఉన్న సంబంధం దాక కూడ వస్తాయి. భార్యకొక ఎక్కౌంటు, తనకొక ఎక్కౌంటు, భార్య డబ్బు వేరు, తన డబ్బు వేరు, భార్య ఆస్తివేరు, తన ఆస్తివేరు ఇట్లాంటి క్షుద్రమైన కీటకంలాంటి జన్మ వస్తుంది. తండ్రి వేరు, కొడుకు వేరు, యింట్లో అందరూ ఉంటూనే ఉంటారుగాని, నులి పురుగుల్లాగ ఒకడికి ఒకడు సంబంధం లేకుండా లుకలుకలాడుతూ ఉంటారు. మలంలో ఉన్న

పురుగులు తిరుగుతున్నట్టుగా ఉంటారన్నమాట. అంటే వ్యక్తులు (individuals) గా ఉంటారుగాని group consciousness లేదు. Mass consciousness మాత్రమే ఉంది. Mass consciousness కి, group consciousness తేడా ఏమిటి? Mass consciousness అంటే మలంలో నులి పురుగుల్లాగ ఉంటారు. దేనికి దానికి బ్రతకడానికి ప్రయత్నమే కాని, ప్రక్కదాన్ని గురించి పట్టించుకుందుకు అవకాశం లేదు. పొద్దు పొడవలేదు. మనకు ఉద్యోగం రావటం, మనకు ప్రమోషను రావటం కోసమని మనపైన ఉన్నవాడు ఏదన్నా అవ్వాలి అనుకునేవాళ్ళం ఉన్నామా, లేదా! అంటే a false sense of insecurity haunts the beast of human being. అంటే రేపెట్లాగ? పెళ్ళాం, పిల్లలికి. అన్నానికి, తిండికీ, బట్టకీ ఎలాగ? ఈ ఇల్లూ, వాకిలీ ఎలాగ? దీంతో జీవితం అయిపోతుంది? ఇల్లు కట్టుకున్న ఐదారేళ్ళల్లో వెళ్ళిపోతూ అరెరె! ఈ ఇంట్లో మనం లేకపోతిమే అని బాధపడ్తాడు. అపుడు తెలుస్తుందన్నమాట జీవితం కోసం యివన్నీ తప్ప, వీటికోసం జీవితం కాదని. తెలిసి ఏం లాభం? టైమైపోయింది. వచ్చే జన్మలో మళ్ళీ ఈ జ్ఞానం అంతా నేర్చుకోవాల్సిందే. అట్లా అక్కర్లేకుండా సరైన మార్గంలో వెళ్ళటానికి జీవితం ఒక సమస్య కాదు (life is not a problem) అనే పరమసత్యం ముందు తెలియాలి. జీవితం అనేది సమస్యకాదు. జీవితాన్ని సమస్యగా మనం చేసుకుంటున్నాము. జీవిత సమస్య అనేది జంతువులకి లేదు కదా. సమస్యలు మనస్సులో ఉంటాయి. బయట ఏముంటాయి? చుట్టూ మనుషులు, ఇళ్ళు, వస్తువులు తప్ప సమస్యలుండవు, ఇవి తెలియాలి. క్రమంగా సత్యానికి, పురుషుడికి సన్నిహితత్వం వచ్చి, సత్త్వము, పురుషుల మధ్య అభేదస్థితి పొందుతారు. దాన్నే మోక్షము లేక కైవల్యము అని అంటారు. ఇపుడు మనం చెప్పుకుంటున్న అధ్యాయంలో చిట్టచివరి సూత్రము కూడ అదే. నాల్గవ అధ్యాయం చిట్టచివరి సూత్రములో యోగము యొక్క లక్ష్యము (the goal of yoga) ఏమిటంటే సత్త్వము, పురుషుడూ అభేదం చెందడం. అంటే Satwam as clean and pure as purusha. ఆ రకంగా జీవించండి అన్నాడు. అపుడు శరీరం, పంచభూతాలు దీంట్లో వుండవు. అప్పుడు దీంట్లో ఉన్న పృథివీ తత్వాన్ని జపంచేసినా సత్త్వ పురుషుడు, క్షర పురుషుడిలో ఉన్నటువంటి భాగాన్నే జపం చేస్తున్నాడు. వాయుతత్వాన్ని జపంచేసినా, దాన్నే జపం చేస్తున్నాడు. తేజోతత్త్వం మీద సంయమం చేసినా దీంట్లో ఉన్న

పొరలే. మనం సత్త్వము అనే దాంట్లో ఉన్న పొరలు సత్త్వము దగ్గరనుంచి ఈ పురుషుడిదాకా ఉన్నటువంటివే. అంటే మన దగ్గరనుంచి సూర్యుడిదాకా ఉన్న పొరలు సూర్యగోళ మల్లే మన గుడ్డి కంటికి కనపడ్డట్టు ఇక్కడనించి సూర్యుడిదాకా ఏం పొరలుండవు అసలు. ఊరికే అక్కడ చోటే ఉంటుంది. ఈ లోపల ఉన్నటువంటి పొరలు మనకి మరచెంబులాగ, సూర్యుడులాగ ఏదో ఉన్నట్లు కన్పిస్తాయి. యజుర్వేదంలో స్పష్టంగా చెప్పాడు. ''హిరణ్మయేన పాత్రేణ సత్యస్యాపి హితం ముఖం'' హిరణ్మయం అంటే బంగారు పాత్ర కనిపిస్తున్నట్టుగా లేదా చెంబు బోర్లించినట్లుగా సత్యం మూయబడి సూర్యగోళంలాగ కన్పిస్తోంది అన్నాడు. అంటే through this, concealed under a false appearence of the Sun globe. Sun is not the Sun globe అన్నాడు. అందుకని ''తత్వం పూషన్నపావృణు సత్యధర్మాయ దృష్టయే'' చూచేవాడిలో ఆ చెంబు ఆకారం తొలగించేసేయ్ అన్నాడు. నిజంగా అక్కడ ఏంలేదు తొలగటానికి. అంటే మనస్సులో దాన్ని అర్థం చేసుకునే పద్ధతి మార్చుకోవాలి. అపుడు సత్యము, ధర్మము కనిపిస్తుంది. ఇవన్నీ యజుర్వేదంలో ఉన్న మంత్రాలు. వాటినుంచి కొద్దిగా చదువుకునేందుకు ఈశావాస్యోపనిషత్తు అని వేరే తీసుకున్నారు. ఇలా కొద్దిగా తీసుకున్న వాట్లని ఉపనిషత్తులు అన్నారు. వేదములు ఉపనిషత్తులు వేరుకాదు.

మనం నిప్పు, మంట అంటాం చూడండి, నిప్పు, మంట అంటే చోటు అని మనం చెబుతున్నాము. వంద రూపాయల నోటుకి చిల్లర మార్చినట్టుగా, చోటుని చిల్లరగా మారిస్తే వస్తే చిల్లరలో ఒక రకమైనటు వంటి చిల్లరే మంట. Flame అంటే activity. అక్కడ జరుగుతున్నటు వంటిది మండుతున్న ద్రవ్యం కాదు. జాగ్రత్తగా ఉండాలి. Candle అంటిస్తే flame వస్తుంది. మైనపు వత్తి అంటిస్తే మంట వస్తుంది. ఈ మంటలో కొన్ని లక్షలమంది కూలీలు సన్నటివాళ్ళు అంటే కణములను అణువులుగా, పరమాణువులుగా విడదీసి తీసికెళ్ళి ఈ ఇల్లు కడుతూ ఉంటే చక్కగా క్రిందనించి పైకి, పైనించి క్రిందికి అందిస్తూ ఉంటారు చూడండి, అలాగే మండే కొవ్వొత్తిలో pure flame అనిచెప్పి ఒకటి ఉంటుంది, కనిపించేటు వంటి మంట, ఇదిగాక పైన కనిపించని మంట purest flame అని ఇంకోటి ఉంటుంది. మంట కనబడని చోట. అది అసలైన నిప్పు. దానిక్రింద ఉన్నటువంటిది కొంచెం అపరిశుద్ధమైన నిప్పు. దానిక్రింద ఉన్నది దీంతో

అపరిశుద్ధమైనటువంటి మి(శమమైన (mixture) నిప్పు. ఇంధనం తప్ప ఇది నిప్పు కాదు. ఇది తక్కువ ఇంధనం, ఎక్కువ నిప్పు. ఇంకొకటి ఇంధనం లేని నిప్పు, pure నిప్పు. కనుక ఆకాశంలో ఉన్న చిల్లర డబ్బులే అగ్ని. జాగ్రత్తగా తెలుసుకోండి. శివుడు మూడో కన్ను తెరచి చూసాడుట. కాళిదాసు కుమార సంభవంలో చెప్పాడు. మూడో కన్ను తెరిస్తే ఎట్లా ఉంటుంది అనేది వాడొక్కడే ఊహించాడు. ఇన్నివేల సంవత్సరాల్లో అంటే మనం ఎరిగి ఉన్నటువంటి నిప్పుకి అగ్గిపుల్లైనా ఉండాలి, కట్టెపుల్లైనా ఉండాలి అది మండేందుకు. ఇంధనం లేనటువంటి నిప్పుని మనం ఎరగం. శివుడు కన్ను తెరిచేటప్పటికి fire without fuel వెళ్ళి వాడిని కాల్చేసింది అన్నాడు. అందుకనే శివుడిమీద బాణం వేద్దాం అని నిల్చున్నవాడు అట్లాగే నిల్చున్నాట్ట. ఇంక కదల్లేదు. ఆయన కన్ను తెరిచేటప్పటికి నిల్చున్నది మన్మథుడు కాడు. ''పురుషాకృతి భస్మ కేవలం'' అని అన్నాడు. మన్మథుడి ఆకారంలో బూడిద నిల్చుని ఉందిట. అంటే ఏదన్నావుంటే అది దగ్ధమై (combust) పోతుంది కాని combustion fire కాదు. కుమార సంభవంలో ఆ ఘట్టం చదివితే తెలుస్తుంది ఆశ్చర్యంగా. వెనుక మన్మథుడు బాణం పట్టుకొని నిల్చున్నాట్ట. పార్వతీదేవి శివుడి చేతికి పుష్పమాల యిస్తూంటే శివుడు పట్టుకోబోయాట్ట, ఇంతలో మన్మథుడు బాణం వేసాడు. ఇవీ వాడు వర్ణించింది. ఒక్క క్షణంలో ఆవిడ చూపులు ఈయన చూపులు కలిసినాయి. కలిస్తే ''చంద్రోదయారంభ ఇవావతస్తే'' చంద్రోదయం అవుతుంటే సముద్రం ఎలా ఉంటుందో అలా ఒక్కమాటు అలలు వచ్చినాయిట శివుడిలో. శివుడిలో అలలు రావటం అనేది ఉండదు. శివుడు అంటే ఏమిటి? నిస్తరంగం కదూ. అనుమానం వచ్చి శివుడు వాడికేసి చూసాట్ట. అలా చూస్తుండగానే దేవతలంతా కలిసి గొల్లుమని ''ప్రభోకోపం సమర సంహర'' మూడో కన్ను తెరవకండి. కోప్పడకండి. క్షమించండి అని అరుద్దామని అనుకుంటున్నారుట. వీళ్ళ గొంతులో మాట గొంతులోనే ఉండగ వాడు బూడిద బొమ్మ అయి అలా నిల్చున్నాట్ట. ఇది కాళిదాసు వర్ణిస్తున్నటువంటి విషయం. ఏదో గ్రామరు కోసం పిల్లలకి అర్థం చెబుతాం గాని జాగ్రత్తగా చదువుకోవాలి కుమార సంభవం. ''పయోధరీ భూత చతుసముద్రాం జుగోప గోరూపధరాం ఉర్వీం'' ఆవుని కాపాడుతూ వెళ్తున్నాడు దిలీప మహారాజు. ఎలా రక్షిస్తున్నాడంటే తనచుట్టూ తిరుగుతున్న భూమిని సూర్యుడు ఎలా రక్షిస్తున్నాడో అలా

రక్షిస్తున్నాట్ట. ఎందుకంటే రాబోయే వాళ్ళది సూర్యవంశం కదూ. రాముడి పుట్టుకకి ముందున్న కథ అది. అందుకని పోలిక కూడ అదే తెస్తాడు కాళిదాసు లాంటి కవి. ''గోరూపధరాం'' గోవు రూపం ధరించినటువంటి, ''పయోధరీ భూత చతుసముద్రాం'' తూర్పు, పడమర, ఉత్తరం, దక్షిణం ప్రతివాడు నిల్చున్న నాలుగు ప్రక్కలా చూస్తే కొంతదూరం పోతే ఎక్కడైనా సముద్రం ఉంటుంది కదా! ఆ నాలుగు సముద్రాలు కూడా ఋతువుల ధర్మంతో వేసవికాలం వచ్చి నీళ్ళు కొంచెం వేడెక్కేటప్పటికి నీళ్ళు మేఘాలు అంటే పయోధరాలుగా అవుతాయి. ఆ మేఘాలు వర్షిస్తే జీవరాసులన్నీ బ్రతుకుతాయి. అలాగ పోషిస్తూ ఉన్నాట్ట సూర్యుడు. అలాగే ఇక్కడ పయోధరములు అంటే పొదుగులు, నాలుగు పొదుగులు కలిగినటువంటి ఈ ఆవుని రక్షిస్తూ కూడ వెడుతున్నాడు. అంటే వేదములు రాసిన కవులు ఎలా ఉంటారు అనేది కొంచెం మన కర్థమయ్యే భాషతో చెప్పి చూస్తే కాళిదాసు ఒక్కడే మిగుల్తాడు.

కనుక సమాన వాయువు తెలుస్తుంది. మంట అంటే ఒక పదార్థంగా అనుకుంటున్నాం. కాని దాని degree of illumination ఎక్కువ. గనుక ద్రవ్యం అందులో పెడితే దగ్ధం (combustion) అయిపోతుంది. ఎక్కడనించి వచ్చిన పదార్థాన్ని అక్కడికి పంపించేస్తుంది. కాలటం అంటే అర్థం ఏమిటి? ఘన పదార్థాన్ని ఘన పదార్థంలోకి, ద్రవ పదార్థాన్ని ద్రవ పదార్థంలోకి, వాయువును వాయువులోకి, ఏ మూలకాన్ని (element) ఆ మూలకంలోకి పంపించేస్తుంది. దానికోసం కాలటం అనేటువంటిది ప్రకృతి పెట్టింది. ఇవన్నీ ధర్మాలు. ఒక్కొక్కటే ఒక్కొక్కటే తెలుసుకుంటూ ఉండాలి. కనుక 'సమాన జయాత్'' ఈ రకంగా సమాన వాయువు అనగా మంట అని మనచేత అనబడేది అని తెలుసుకొని ధ్యానంచేస్తే, కొన్నాళ్ళయ్యేటప్పటికి, ''జ్వలనం'' వెలుగుతుంది. మీ లోంచి వెలుగు వస్తుంది. అంతేగాక మీకు ఎక్కడన్నా గడ్డిగాని, పుల్లగాని తీసుకున్నపుడు దానినుండి వెలుగు కావాలంటే వస్తుంది. ప్రాక్టీసుచేస్తే ఎవరికైనా వస్తుంది. ఏడాదో, రెండేళ్ళో ఎవరైనా ప్రాక్టీసు చేయాలి. ఇదివరకు దివ్యములైనటు వంటివి వినటం, చూడటం యివన్నీ వస్తాయన్నాడు కదా. అవి ఎలా వస్తున్నాయో తరువాత సూత్రాలలో ఇంకొంచెం చెబుతున్నారు.

## 42. శ్రోత్రాకాశయో స్సంబంధ సంయమాత్ దివ్యం శ్రోత్రమ్।

శ్రోత్రం = చెవి, ఆకాశయోః = ఆకాశమునకు గల, సంబంధ = సంబంధము నందు, సంయమాత్ = సంయమము చేసినచో, దివ్యం శ్రోత్రం = దివ్యమైన వినునట్టి శక్తి కలుగును.

వినునట్టి ఇంద్రియ శక్తికిని, ఆకాశమందలి శబ్ద గుణమునకు గల సంబంధముపై సంయమము చేయుట వలన దివ్యములైన విశేషములను వినుటకు కావలసిన మరియొక ఇంద్రియము నిర్మాణ మగును.

వివరణ : 'దివ్యం శ్రోతం' అంటే దివ్యమైనటువంటి చెవి అంటే వినేటువంటి జ్ఞానం. ఈ చెవిద్వారా వినేటువంటి జ్ఞానంకాక యింతకుముందు చెప్పిన దివ్యజ్ఞానం వస్తుంది. 'శ్రోత్ర ఆకాశయో'' శ్రోత్రం అంటే చెవి. ఆకాశం అంటే ఆకాశం. ఈ చెవికి, ఆకాశానికి ఉన్న సంబంధం మీద మనస్సు నిలబడితే రోజు కాసేపు అదే పనిగా, అంటే ఆ సంబంధం మీద సంయమం ప్రసరింపచేస్తే దివ్యమైనటువంటి వినే జ్ఞానం వస్తుంది. ధారణ, ధ్యాన, సమాధులు వచ్చిన వాడికి సంయమం లేకుండా ఊరికే ఆరాటంతో ఆలోచించడం ఉండదు. ఏదన్నా ఆలోచించటం అంటే వాడికి సంయమం అనేగాని, ఇంకొకటి ఉండదు. వాళ్ళేం చేస్తున్నారు, వీళ్ళేం చేస్తున్నారు, రైటా, తప్పా, యిట్లాంటి ఆలోచనలు ఉండవు. ''శ్రోత్ర ఆకాశయోః సంబంధాత్'' శ్రోత్రానికి, ఆకాశానికి సంబంధం ధ్యానంచేసి, ''సంయమాత్'' ఆ సంబంధం యందు సంయమం చేయాలి. యోగం అభ్యాసం అయిన వాడికి సంయమం కాకుండా ఉండే అభిప్రాయాలుండవు. అంటే ఎవరికైనా పనికొచ్చే విషయం మీద అభిప్రాయాలే గాని సరదాకి అభిప్రాయాలంటూ వాడికి ఉండవు. సినిమాకి పోదాం అని అడుగుదాం వాడిని అనుకుంటే, ఆ టైములో యింకేమన్నా పని ఉంటే, సినిమాకి ఎప్పుడైనా వెళదాం లే, నైట్‌డ్యూటీ ఉన్నది అని చెప్తాడు. He always belives in personal independence and he never intrudes or never interferes. అక్కడ జాగ్రత్తగా ఉంటారు వాళ్ళు. అందుకనే వాళ్ళని మాకు చెప్పక పోయారా? అని ఏడ్చి లాభంలేదు. మనం అడిగితే చెబుతారు. ఎంత అడిగితే అంత చెబుతారు. అడక్కపోతే కల్పించుకోరు. ఏమండి మా యింట్లో దెబ్బలాడుకుంటూ తన్నుకుంటూ తలకాయలు పగులగొట్టు కుంటున్నాం. మీరు చూస్తూ ఊరుకున్నారేం అని అడిగితే లాభంలేదు. పగలగొట్టు కున్నట్టు మీకు

తెలుసుకదా, అట్లాంటపుడు చూస్తూ ఊరుకోక ఏం చేస్తాం? అని అడుగుతాడు. తెలిసి కొట్టుకున్నారా? తెలియక కొట్టుకున్నారా? తెలిసి కొట్టుకున్నపుడు కొట్టకో నీయటమే because they are to be penalised by each other లేకపోతే ఒకణ్ణి ఒకడు కొట్టుకోవటం ఏమిటి? ఒకడిద్వారా ఒకడికి వాళ్ళల్లో ఉన్న పశుత్వానికి ప్రకృతి యిస్తున్నటువంటి శాస్తి. రాగద్వేషాలు ఉన్నటువంటి వాళ్ళకి ప్రకృతి యిచ్చే షాక్ థెరపీ అది. యోగాభ్యాసం చేసేవాడి దృక్పథమే మారిపోతుంది. గుంభనంగా ఉంటాడు. వాడి దృష్టిలో మార్పు వస్తుంది. Place economy మారుతుంది. తరువాత ఇతరులతో ఉన్నటువంటి సంభాషణ విధానం మారుతుంది. సంబంధములు తనకు వినియోగంగా మారుతాయి. ఉల్లాసంగా కూడా ఉంటుంది. అదివరకు ఉల్లాసం అంటే wasting of time. ఇపుడు ఉల్లాసం అంటే realising something for others. అంటే కోరికల (desires) నించి అవసరాల (needs) లోకి వెళ్ళిపోతాడు. ఇంక కోరిక లుండవు. కనుక ''శ్రోత్ర ఆకాశయోః సంబంధ సంయమాత్'' శ్రోత్రం అంటే చెవి. అంటే ఈ చెవికాదు. దీంట్లో వినే భాగము, eardrum అంటారు. Eardrum వింటుందా? గ్రామఫోను రికార్డువేసి స్టీరియో పెడితే, వింటున్నది స్టీరియోయా? వింటున్నది స్టీరియో అనేది రైటైతే, మన చెవిలో eardrum వింటోంది అనేది రైటు. అది వినదు. దాని ద్వారా మనం వింటున్నాం. స్టీరియోలు ఎందుకంటే మనం బాగా వినటానికి. అంతేగాని స్టీరియోలు వినవు. చెవిలో కూడ డ్రమ్ వినదు. డ్రమ్ ఎందుకంటే మనం వినటానికి సాధనం. It is an instrument. కనుక చెవికాదు చెవిలో ఉన్నటువంటి eardrum కాదు వినేది. చెవిలో అడుగున వున్నటువంటి నరమూ వినదు. ఎందుకంటే స్టీరియోకి తగిలించినటువంటి వైర్లా వినేవి? అలాంటిది నరం అంటే ఇందులో ఏవి కావు వినేవి. వీటన్నిటి అమరిక ఎవరైతే చేస్తున్నారో వాడు వినేవాడు. కనుక చెవిలోవాడు ఉంటాడు. వాడు వింటూ ఉంటాడు. He is never physical. వీటన్నింటినీ ఉపయోగించి అమర్చుకున్నటువంటి వాడుంటాడు. వాడు వింటూ ఉంటాడు. వాడు విని మనస్సు అనేటువంటి దానికి తెలియజేస్తూ ఉంటాడు. అట్లా ఐదుగురు ఉంటారు. కంటి దగ్గర ఒకడుంటాడు. అవన్నీ అమర్చినవాడు. వాణ్ణి చక్షురింద్రయము అంటారు. వాడు అందిస్తూ ఉంటాడు ఈ మనస్సుకి. ఆ మనస్సు లోపల వాడికి అందిస్తూ ఉంటుంది. అలాగే శబ్ద, స్పర్శ, రూప,

రస, గంధము లైందిటికి ఐదు. కనుక ''శ్రోత్రము'' ధ్యానంచేస్తే తెలుస్తుంది గాని పనిముట్లలో తెలీదు. చూచేవాడున్నపుడు యివన్నీ పనికొస్తాయి. చూచేవాడు లేనపుడు వ్యర్థమే. ఈ బ్లాక్ బోర్డు, చాకోపీసు అన్నీ అంతే. ఎందుకు పనికొస్తున్నాయి, యివన్నీ చెప్పేవాడు, నేర్చుకునేవాడు, చదువుకునేవాడు, వినేవాడు ఉన్నప్పుడు యివన్నీ పనికొస్తున్నాయి గాని, మిగతా అపుడు యివన్నీ వృధాయే. ఇందులో ఏదీ కూడ చూచేవాడు కాదు, వినేవాడు కాదు. కనుక చెవిలో ఉన్న ఏ భాగం వినదు. చెవిద్వారా వినే వాడున్నాడు లోపల. వాణ్ణి శ్రోత్రం అంటారు. వాడు దేంట్లో భాగం? సత్త్వంలో భాగం. తరువాత సత్త్వముగాక ఎవడున్నాడు? పురుషుడు లేక పరమాత్మ ఉన్నాడు. మనం ఉన్న చోటులో పురుషుడిలో భాగం ఏమిటి? పురుషుడిలో భాగం ఆకాశం. మనం నిల్చున్నచోట ఉన్న ఆకాశమున్నూ, మనలో వింటున్న వాడున్నూ, వీళ్ళిద్దరి మీద మనస్సు పెట్టండి యోగాభ్యాసం చేసిన తరువాత. అంటే మనలో చెవిద్వారా వింటున్న వాడెవడు అని ప్రశ్న వేయండిగాని, చెవిలో ఉన్నాడని అనుకోకండి. చెవిలో ఉండడు. అలాగే ముక్కులో ఉండడు వాసన చూచేవాడు. ముక్కుద్వారా వాసన చూస్తున్న వాడెవడు? అనే idea మీద మనస్సు పెట్టండి. అలాగే నాలికద్వారా రుచి చూస్తున్న వాడెవడు అని ధ్యానం చేయండి. ఇవి తెలియాలి. వీటన్నిటికీ ఇవతల ఏం వస్తుంది? చెవికి ఆకాశము, కన్నుకి అగ్ని, ఇట్లా అయిందింటికీ అయిదూ వస్తాయి, చెవికి ఆకాశానికి ఉన్న సంబంధము మీద ధ్యానంచేస్తే ''దివ్యశ్రోత్రం'' దానంతటది వస్తుంది. అంటే చెవితో సంబంధం లేకుండా వినపడటం వస్తుంది. మీకే కాదు, ఇంకొకడికి కూడ మీరు వినపడేట్లుగా చేయగలరు. రెండు మూడు కిలోమీటర్ల కంటే ఎక్కువ దూరం పారిపోయిన గుఱ్ఱం శిరిడీ సాయిబాబా కేక పెట్టేటప్పటికి ఒక అరగంటలో పరిగెత్తుకుని వచ్చేసింది. చోటులో వినేవాడు పనిచేయటం అంటే అంతే. తాను విన్నా అలాగే ఉంటుంది. ఇంకొక ఊళ్ళో ఎక్కడో తన భక్తుడు, భక్తురాలు ఉన్నారు. భర్తకి జబ్బుగా ఉంది. మంచమీద ఉన్నాడు. ఆవిడ కమ్మరపని చేస్తోంది. కొలిమి వేస్తోంది. ఒళ్ళో పిల్లవాడు ఉన్నాడు. భర్త పిలిచేటప్పటికి ఒళ్ళో పిల్లవాడు ఉన్నాడన్న సంగతి మరచిపోయి లేచింది. పిల్లవాడు కొలిమిలో పడిపోయాడు. నిప్పులో పడిపోతే ఆవిడ అయ్యో! నాయనా ఎంతపని అయ్యిందని అరవాలి కదా! అట్లా అరవకుండా బాబా అని అరిచిందంతే.

ఇంకొకటి లేదు ఆ మనస్సులో. అటువంటప్పుడు ఈయన దివ్య శ్రోత్రానికి అందుతుంది. అమ్మో! బాబోయ్! అంటే అందదు. వాళ్ళకి వీళ్ళకీ సంధానం ఉండాలంటే వాడికీ టెలిఫోన్ నంబరు ఉండాలి. వీడికీ టెలిఫోను నంబరు ఉండాలి లేదా రేడియోకి రేడియో స్టేషనుకీ అనుసంధానం ఉండాలి. ఆ స్టేషన్‌కి అందుకోగలిగిన శక్తి ఉండాలి. అందుకోగల శక్తి అంటే బాధ కలిగినపుడు అయ్యో! ఏమయి పోయావురా అని అరవకుండా, ఏమని అరిస్తే అవతల స్టేషను catch చేస్తోందో ఆ జ్ఞానం వస్తుంది. అంటే అది తప్ప ఇంకొకటి లేని స్థితికి వచ్చాడన్నమాట. అపుడు ఆ కేకలో దివ్యస్పర్శ ఒకటున్నది. బాబాగారు హోమం చేస్తున్న చోట మండుతోంది. ఆ నిప్పులో చెయ్యిపెట్టి లాగాడు. అంటే అందులో చెయ్యిపెట్టి విదిలించి పడేసేసాడు. చెయ్యి కాలిపోయింది. కాని ఇక్కడ నిప్పులో చెయ్యిపెట్టి అక్కడ కుర్రాణ్ణి బయటికి లాగాడు. ఏం కాలలేదు వాడికి. ఈ కథ మీరు చదవచ్చు శిరిడీ సాయిబాబా జీవిత చరిత్రలో. అంటే ఈ మధ్యన దూరం ఉండదు. భౌతికమైన చెవితో వినేటప్పుడు అయితే దూరం ఉంటుంది. దివ్యశ్రోత్రంతో వింటే దూరం ఉండదు. భౌతికమైన చేత్తో పనిచేస్తే దూరం ఉంటుంది. ఈ చేయిద్వారా ఆ చేయి ప్రసరింపచేస్తే దూరం ఉండదు. ఒక్కొక్కపుడు మాయ ప్రసరింప చేయటానికి కూడ కపట యోగులు ఇలాంటివి చేస్తూ వుంటారు. యోగాభ్యాసం చేసికూడ చెడిపోయిన వాళ్ళుంటారు. ఉదాహరణకి వాల్మీకి రామాయణంలో మారీచుడు. జాగ్రత్తగా చదువుకోవాలి. కొంత దూరాన్న లేడి కనిపించింది, పట్టుకుందుకు ఈయన వెళ్లితే యింకా దూరం వెళ్ళింది, ఇంకా దూరం వెళ్ళింది. అక్కడ వర్ణించినటువంటి వర్ణనచూస్తే 5,6 కి.మీ దాటి వెళ్ళి ఉంటుంది. చివరికి రాముడు బాణం వేసాడు. అప్పటికి రాముడు ఉన్నచోటుకి, సీత ఉన్న చోటుకి మధ్యన కనీసం 4,5 కి.మీ ఉంటుంది. వాడు వేసిన కేక ఈవిడికి వినిపించింది. ఏం జరిగింది? ఆకాశంలో వాడు ఈ శబ్దాన్ని ప్రాజెక్టు చేసాడు. లేకపోతే ఎందుకు వినిపిస్తుంది అంతదూరం? యివి గుప్తంగా ప్రయోగించేవి అన్నారు. వీట్లనే సిద్ధులంటారు. వీట్లని లెక్క చేయనటువంటి వారు అప్రయత్నంగా వాళ్ళద్వారా దివ్య వైభవంతో ప్రయోగించేవాళ్ళు. వాటిని వాళ్ళు ప్రయోగించరు. వాళ్ళద్వారా జరుగుతాయి. శిరిడీ సాయిబాబా ప్రయోగిద్దామని అనుకోలేదు. నలుగురితో మాట్లాడుతూనే నిప్పులో చెయ్యి పెట్టేసాడు. ఎందుకు పెట్టేసాడో, ఆయన

ఎరిగి ఉన్న మనస్సు ఉంది చూడండి. conscious mind, దానికి కూడ తెలీదు. ఆయనని ఎవరన్నా ఎందుకు పెట్టావు అని అడిగితే, ఏం చెప్పలేదు. కాని తర్వాత వాళ్ళు వచ్చి యిలా యిలా జరిగింది అని చెబితే అపుడు అందరితో పాటు ఆయనా వినాల్సిందే గాని ఆయనకి తెలిసినటు వంటిది కాదు. We blindly call them miracles. అందుకనే బ్లావెట్స్కీ చెప్పిన ఆధ్యాత్మిక సూత్రములలో మొట్టమొదట చెప్పింది. "There is no miracle. Everything happens according to the law of nature." ప్రకృతిలో జరుగవలసినటువంటి పద్ధతిలో జరుగుతాయి గాని miracle అని ఏం ఉండదు. దానికి వ్యతిరేకంగా జరగటం, ఎవళ్ళో తెలియనివాళ్ళు నమ్మతారు గాని నమ్మటానికి ఏం లేదు అంది. కాని మనం ఎరగనివి ప్రకృతిలో చాలా ఉన్నాయి కదా! అవి చదివినపుడు మనం miracle అంటాం. Wright brothers విమానం కనిపెట్టినపుడు. ఎవడన్నా రామాయణం చదువుకొని, సీత, రాముడు విమానం మీద ఎక్కారుట. అంటే కవులు అలా గమ్మత్తుగా రాసారులే అనుకుంటాంగాని, విమానం ఉంటుందని ఎట్లా అనుకుంటాం, విమానం ఈ మధ్యే కనిపెట్టబడినప్పుడు. యిప్పటికి ఏడెనిమిది శతాబ్దాల క్రిందట వాల్మీకి రామాయణం చదువుకున్న వాళ్ళున్నారు అనుకోండి. వాళ్ళు విమానంలో పైన వెళ్ళారుట అంటే మహిమ ఉంది వెళ్ళారుట అని చెప్పుకుంటాం. అంతకంటే ఏం చెపుతారు? కాని యిపుడు మళ్ళీ Wright brothers విమానం కనిపెట్టాక రాముడు, సీత విమానంలో వెళ్ళారుట అంటే మామూలుగా నిజమనుకుని (realistic) చదువుకుంటాం. అక్కడికీ ప్రశ్న వేసినటువంటి వాళ్ళం ఉన్నాం. ఆ రోజుల్లో విమానాలు ఎక్కడివి? అని. ఈరోజుల్లో ఎక్కడివో, ఆ రోజుల్లోను అక్కడివే. ఇపుడు ఎక్కడ నించి వచ్చినాయో, అప్పుడు అలాగే వచ్చాయి. ఇన్ని లక్షల సంవత్సరాల్లో ఎన్నోమాట్లు మానవుడు ఈ ప్రకృతిలో ఉన్న రహస్యాల్ని కనిపెట్టటం, పోగొట్టుకుంటం, చాల వేల పర్యాయాలు చేసాడు. We need not be superstitious or sceptic. అందుకని చెవి అనేటువంటిది దివ్యం అయినది. శ్రోత్ర ఆకాశముల మధ్యన వినేటువంటి వాడికీ ఆకాశమునకూ మధ్య ఉన్న సంబంధాన్ని గురించి రోజు కాసేపు ధ్యానం చేయండి. అంటే, మీలో ఉన్న సత్త్వము. మీలో ఉన్న పురుషుడు. అందులో సంయమం చేయబడేటప్పటికి దివ్యశ్రోత్రం వస్తుంది. అంటే చెవితో సంబంధం లేకుండా వినగలగడం.

## 43. కాయాకాశయో స్సంబంధ సంయమాల్లఘుతూల సమాపత్తే శ్చాకాశ గమనమ్।

కాయ = శరీరము, ఆకాశయో = ఆకాశమునకు గల, సంబంధ = సంబంధమునందు, సంయమాత్ = సంయమము చేయుట వలన, లఘు = తేలికగ, తూల = దూదివంటి, సమాపత్తేః = మనస్సులో భావమును వ్యాప్తి చేసుకుంటంచేత, చ = మరియు, ఆకాశ గమనము = ఆకాశము నందు ప్రయాణము చేయుట వచ్చును.

దేహమునకు ఆకాశమునకు గల సంబంధమును తేలికైన దూది పింజలకు ఆకాశముతో గల సంబంధము వలే భావించి సంయమము చేసినచో ఆకాశమున ప్రయాణము చేయు సామర్థ్యము కలుగును.

**వివరణ :** కాయం అంటే శరీరము. ఆకాశం అంటే ఈ శరీరం ఉన్నచోటు. శరీరం చుట్టూ ఆకాశం ఉందని మనం అనుకుంటున్నాం. శరీరంలో ఏముంది? ఎముకలు, మాంసం మొదలైనవి ఉన్నాయను కుంటున్నాం. అదే రైటు అనుకుంటే తప్పేమీ లేదు. ఆ ఎముకలు, మాంసం, ప్రేగులు, కండలు మొదలైన వాటిల్లో ఏముంది? కొన్ని కెమికల్స్. అంతే కదా. ఎముకల్లో ఉన్నవి కాల్షియం, ఫాస్పరస్ వాటి భాగములు (components). పళ్ళల్లో కాల్షియం, ఫ్లోరైడ్ యిట్లాంటివి ఉన్నాయి. వీట్లల్లో ఒక్కొక్కటి దేనితో చేయబడ్డాయి? అణువులతో; ఆ అణువులు పరమాణువులతో చేయబడ్డాయి. పరమాణువుల్లో ఏం ఉన్నాయి? పరమాణువుల అంతర్భాగములు ఉన్నాయి. The isotopes in the Atoms ఉన్నాయి. Protons, electrons, neutrons ఉన్నాయి. అవి దేంతో చేయబడ్డాయి? గిరగిరా తిరుగుతున్నటువంటి మహా శక్తిమయ కేంద్రములు energy centres (ఇంకా modern science అక్కడిదాకా రాలేదు. Electro-magnetic fields వరకు వచ్చింది. ఆ fields లోకి యింకా ప్రవేశించాలి) అంటే spirals ఉన్నాయి. చుట్టలు చుట్టలు ఉన్నట్లుగా నీటి ఆవిరి ఘనీభవిస్తే నీళ్ళు అయినట్లు, చోటు అలలు, అలలుగా ఘనీభవిస్తూ శక్తిమయ తరంగములు అవుతాయి. The waves and the vibration. అంటే పాలమీద మీగడ పాలతోనే తయారయినట్లు. చోటులోంచి వచ్చినటువంటి శక్తి చోటులోంచే తయారవుతుంది. కనుక ఆకాశంలో ఏం ఉన్నది? శక్తి ఉన్నది. ఈ శక్తి దేంతో చేయబడ్డది? మహా చైతన్యంతో చేయబడ్డది. అంటే consciousness. చైతన్యం దేనితో చేయబడ్డది. శరీరం

లోపల ప్రతి అణువుణువున, కణం కణమున, ఎముకలోను, గట్టిగా ఉన్న పదార్థంలోను, అన్నింటిలోను కూడ ఆకాశమే ఉన్నది. అందుకనే ఋగ్వేదంలో ఏం చెప్పాడు. ''అస్థన్వంతం యధ నష్టాపి భర్తి'' ఈ ఎముకలు, గోళ్ళు, పళ్ళు, యివన్నీ కలిగినవాణ్ణి యివేవి లేనటువంటి ఆకాశం పుట్టించి, భరిస్తూ పోషిస్తూ ఉన్నది. ఎలా అయితే ఎముకలు మొదలైనవి గల ఈ శరీరాన్ని, ఎముకలు లేనటువంటి శుక్రకణం తయారు చేస్తోందో అలా. శుక్రకణంలోంచే కదా, enbryonic stages అన్నీ develop అయ్యేది. ఒకదశ (stage) అయిన తరువాత యివన్నీ గట్టిపడుతున్నాయి కదా. ఈ గట్టి పడేవన్నీ గట్టి పడనటువంటి శుక్రకణం లోంచి ఎలా అయితే పుట్టుతున్నాయో, అలాగే ఆకాశంలో ఈ శరీరంలో ఉన్నటువంటి సమస్తము కూడ ఉన్నాయి. అందుకని ఈ ధ్యానం ఎలా చేయాలో చెప్పటానికే తైత్తిరీయోపనిషత్తులో ''పృథివ్యామాకాశః ప్రతిష్ఠితః ఆకాశే పృథివీ ప్రతిష్ఠితా! తదే తదన్న మన్నే ప్రతిష్ఠితమ్। నయ ఏతదన్న మన్నే ప్రతిష్ఠితం వేద ప్రతితిష్ఠితి'' అని చెప్పాడు. అంటే ఆకాశము నందు శరీరం అనేటువంటి ఒక idea suspend అయి ఉన్నది. అది శరీరంగా పెట్టుకొని భుజాన వేసుకొని తిరుగుతున్నాం. శరీరం అన్నది idea తప్ప, matter కాదు. ఇది తెలియాలంటే కష్టం, ధ్యానంలోనే తెలియాలి. అంటే మనం అర్థం చేసుకునేందుకు ఏం లేదు. ఆ consciousness లోకి లయం (tune) కావాలి మనం. కనుక శరీరం అనేటువంటిది ఒక సంకల్పంగా, అభిప్రాయంగా, చోటులో తయారైతే అది భుజాన్నేసుకొని మనం తిరుగుతున్నాం. మనకున్న శరీరం అదే. దాంట్లో ఈ ద్రవ్యంగా, matter గా ఉంటున్నాం. అందుకనే matter is how it appears? Not how it is? ద్రవ్యం మనకి కనిపిస్తూన్నది తప్ప, అక్కడున్నది కాదు. అక్కడున్నది ఏమిటి. పరమాణువులు, శక్తి, చోటూను. చోటుకి ఎక్కడైనా ఇందాక చెప్పిందే formula. ఇదైనా అంతే. అదైనా అంతే. ఏదైనా అంతే. అందుకనే శరీరం ఆకాశంలో ప్రతిష్ఠింపబడి ఉన్నది. ఆకాశం శరీరంలో ప్రతిష్ఠింపబడి ఉన్నది. ధ్యానం చేయమన్నాడు. అందుకనే చోటువంక చూస్తూ ఆకాశంలో ఈ ధ్యానాలన్నీ చెప్పాడు. ''తన్నమ ఇత్యుపాసీత'' అది అన్నింటిలోకి వంగి ఉన్నది. లోపలకి శరీరాల్లోకి కూడ అని ధ్యానం చేయండి. సంయమం చేయండి. ఏమవుతుంది? ''నమ్యన్తేఽస్మైకామాః'' వాడికిన్నీ వాడిచుట్టూ ఆధారపడి ఉన్నవాళ్ళకిన్నీ కావాల్సినవన్నీ నమస్కారం చేస్తూ వస్తాయి. ఏం

ప్రయత్నం చేయక్కర్లేదు. ''తన్మన ఇత్యుపాసీత''. ఆకాశాన్ని మనస్సుగా ధ్యానం చేయండి. ఆకాశంలో మనస్సు ఉంది గనుక, ఆకాశంలో తలకాయ ఉంది గనుక, తలకాయలో మనస్సు ఉంది అని ధ్యానం చేయండి. ''మానవాన్భవతి'' అంటే great mental power మీకు అందివ్వ బడుతుంది. ''తన్మహ ఇత్యుపాసీత'' అన్నీ ఆకాశంలో (space) ఉన్నాయి కనుక, అన్నింటిలోను ఆకాశం ఉంది గనుక ఆకాశం అన్నింటికంటే పెద్దది. అది container, contained గా ధ్యానం చేయండి అన్నాడు. ''మహాన్భవతి ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసేనా, మహాన్ కీర్త్యా'' అంటే సంపద పెరుగుతుంది. సుఖము పెరుగుతుంది. మీతో ఉన్నటువంటి వాళ్ళు ఒక వెయ్యిమందో, రెండువేల మందో మీ పేరు చెప్పుకుని అన్నం తినటం వస్తుంది. అంటే మీ సంపద పెరగటం అని ఉండదు యింక. ఆ దరిద్రం పోతుంది. నా బ్యాంకు బాలెన్సు పెరగటం ఉండదు. వీడి సంపద పెరిగితే, దొంగలెత్తుకు పోవటానికో, లేకపోతే గవర్నమెంటు వాళ్ళు టాక్స్ రూపంలో పట్టికెళ్ళి పోవటానికో పనికొస్తుంది. వీడి సంపద పెరిగిన కొద్దీ ఫైలేరియా కాలు పెరిగితే ఎంతో అంతే. వ్యక్తిగతంగా సంపద పెరగటం అంటే ఏంలేదు. అది తెలియాలి. Instrument of nature ఎవడైనా. కనుక దేవుడి నగలు ఎత్తుకు పోయారు. అయ్యో! స్వామి నగలు, అవి దేవుడి నగలా? పెట్టినవాడి నగలా? అది దేవుడు ఎందుకు చూస్తూ ఊరుకున్నాడండి. ఈ నాస్తికులు మొదలైనవాళ్ళు దేవుడేం చేస్తున్నాడపుడు అంటారు. ఏం చేస్తాడు? వాడు పెట్టమన్నాడా? యిచ్చినపుడు దేవుడికి ఇచ్చుకుంటున్నామనే బుద్ధి ఉంటే ఎవడు పట్టికెళ్ళితే వాడికి దేవుడు యిచ్చాడనే బుద్ధి ఉండాలి. దేవుడు యిట్లాంటివన్నీ అడగడు. మన తెలివితో మనం చూసుకోవాలి. ''తన్మహ ఇత్యుపాసీతా మహాన్భవతి ప్రజయా'' సంతతి నీక్కావలసినంత మంది ఉంటారు. మనుమలు ఉంటారు. లేదన్నది లేదన్నాడు. వాళ్ళకి కావలసినవన్నీ ఉంటాయి. అన్నీ ఉండి హాయిగా బ్రతక్కుండా ఏడుస్తున్న వాళ్ళెంత మంది లేరు? గుండెకాయతో గుండెకాయ బ్రతికేటువంటి బ్రతుకుగా బ్రతకటం. 'మహాన్భవతి' అంటే అర్థం అది. నవ్వుతూ బ్రతుకుతాడు. చివరికి నవ్వుతూ శరీరం వదుల్తాడు తప్ప చావడు. మిగతావాళ్ళు చస్తూ ఉంటారు. బ్రతికి ఉండి కూడ ఎలా ఉన్నారు? అని అడిగితే చస్తున్నాం అంటారు. బ్రతికి ఉండి చస్తూ ఉంటారు వీళ్ళు. వీళ్ళు శరీరం వదుల్తూ ఉన్నపుడు కూడ

చావరు. తరువాత వాడు చచ్చాక వాడి మొహానికి ఫొటో తీసినా చిరునవ్వుతో వస్తుంది. అలా పోతాడు వీడు. తేడా అది. వాళ్ళు వదిలేసి వెళ్ళిన సంస్థలు కూడ తరువాత చిరునవ్వుతో ఉంటాయి కొంతకాలం. 50,60 ఏళ్ళవరకు. ప్రతి వస్తువులోను వాళ్ళ చిరునవ్వు కనిపిస్తుంది. ఇపుడు మీరు అరుణాచలం వెడితే రమణ మహర్షిగారు ఉపయోగించిన ఆ కళ్ళజోడు, ఆ చేతి కర్ర, పుస్తకం అవన్నీ అక్కడ ఉంటాయి. ఆయన ఎంతకాలం క్రిందటో వెళ్ళిపోయాడని తెలిసినా, రెండు నిమిషాల ముందు అక్కడ పెట్టి స్నానానికి వెళ్ళాడని అనిపిస్తుంది. నాకనిపించింది అది. అలాగే గాంధీగారు. అంటే మహానుభావులైనవాళ్ళు అలా ఉంటారు. రెండు నిమిషాల క్రిందటే బాత్రూంలోకి వెళ్ళారు, వస్తారు అన్నట్టుగా ఉంటాయి అవి చూస్తే మనకి. అంటే the smile is capatured on the sensitive plate and kept still.

''మహస్వవతి'' అన్నదానికి అర్థం అది. అందరిలోను అందరి బయటా కూడ ఆకాశం వ్యాపించి ఉన్నది అని ధ్యానం చేయండి అన్నాడు. అలాచేస్తే వీడు మహానుభావుడు అవుతాడు. అందరూ కూడ వీడి వంకచూసి, కొన్ని వేలమంది వీడివల్ల అన్నం తిన్నవాళ్ళు అవుతారు. ఎక్కడైనా కొన్ని వేలమందికి అన్నం పెట్టటానికి వీలవుతుందాండి? తప్పకుండా వీలవుతుంది. వెనుక మహానుభావులు ఖండ ఖండాంతరాలకీ, దేశ దేశాంతరాలకీ పెట్టలేదూ. మొత్తం ప్రపంచం అంతా ఒక ప్రెసిడెంటు క్రింద పాలించి వెళ్ళిపోయినటు వంటివాళ్ళు, లక్షల సంవత్సరాల క్రిందట, ఎన్ని వేలమంది ఉన్నారు. ''*కారె రాజుల్ రాజ్యముల్ గలుగవే గర్వోన్నతిన్ చెందరే*'' బలి చక్రవర్తి మొదలైనవాళ్ల కథలు మనం చదువుకున్నట్లైతే, వీడు జయించిన రాజ్యమంతా వామనుడు దానం తీసుకుంటాడు. వద్దని చెపితే, వాడు అడుక్కొంటానికి వస్తే నువ్వు ఏడుస్తావేమిటి, అన్నాడు. అంచేత ఎవడివల్లైనా కొన్ని వేలమంది అన్నం తింటారంటే కోతలు అనుకోకూడదు. అశోక చక్రవర్తి ఆసేతు హిమాచలము ధర్మాన్నం పెట్టించేటువంటి బౌద్ధ సంఘారామాలు స్థాపించాడు. వాటికి కావలసిన ఆస్తులు యిప్పించేసాడు. ప్రయాణంచేసి వెడుతున్న బాటసారులకు ఎవరైనాసరే, ఆరుగంటల ప్రయాణం తర్వాత మళ్ళీ ఇంకోటి అలాంటి ధర్మాన్నశాల తగిలేది. కనుక 'మహస్వవతి' అన్నమాటకి అర్థం అది. అలాగే ''తత్పరిమర ఇత్యుపాసీతా'' అన్నీ అందులోకి లీనం అవుతున్నాయని ధ్యానం చెయ్యి అన్నాడు. ఏమవుతుంది? అపుడు ''పరేణ్యం మ్రియంతే ద్విషంత

స్సపత్నాః'' ద్వేషించునట్టి శత్రువులంతా ఉన్నారు చూడండి, అట్లా అందులో కలిసిపోతా రన్నారు. అబ్బ ఇది బావుందండి. చేస్తే ఏమవుతుంది? జాగ్రత్త, చెయ్యకూడదు. ఎందుకని? మనకి ఈ శత్రువున్నాడు, ఆ శత్రువున్నాడని అనుకుంటూ ఇది చేసాడనుకోండి. శత్రు వెక్కడ ఉన్నాడు? వీడి బుర్రలోనే ఉన్నాడు గనుక వీడు చెడిపోతాడు. 'Enemies beware of yourself' అని ఒక మంత్రం యిచ్చారు C.V.V. గారు. Enemies ఎక్కడ ఉంటారు? మన enemy మన consciousness లో enemy sensitivity లో ఉంటారు గాని బయట enemy ఉండరు. మనుషులు ఉంటారు. ఈయన భర్తగారుట. అంటే వాడికి రక్తపరీక్ష చేస్తే, భర్త అని ఏంరాదు మనిషే. ఈవిడకి భర్తతప్ప, భర్త అని ఉండదు కదా. పుట్టుకతోటి వీడు భర్త అంటే అందరికీ భర్త అవ్వాలి కదా, అలాగే enemy అని ఉండడు. ఒకాయన వచ్చాడు. శత్రు బాధండి. ఎవరికి నేనంటే కిట్టటం లేదు. కళ్ళల్లో నిప్పులు పోసుకుంటున్నారు అన్నాడు. కూర్చో నాయనా అనిచెప్పి, ఆయన్ని ఒక లిస్టురాయి అటువంటి వాళ్ళందరిదీ, వాళ్ళందరినీ లేపేద్దాం అన్నాడు. వాడు మర్నాటికి 12 పేజీల లిస్టు పట్టుకొచ్చేసాడు. పట్టుకొచ్చావా? యిందులో మరీ మొట్టమొదటిగా లేపేయాల్సిన వాళ్ళ పేర్లు ఎర్రసిరాతో మార్కు చెయ్యమన్నారు. దాంట్లో మొదటివాడి ఫొటో పట్టుకురా అన్నాడు. వాడి ఫొటో పట్టుకొచ్చాడు. కళ్ళు మూసుకొని ఆ ఫోటోలో ఆయన్ని గురువుగా ధ్యానం చెయ్యి అన్నాడు. ఇది ధ్యాన మేమిటి? అనుకున్నాడు. అలాంటి శిష్యుడు తర్వాత మహానుభావుడై శుద్ధ సత్త్వ సంపన్నుడై, వాడే కనిపెట్టాడు. శత్రువు లంటూ లేరు మన బుర్రలోనే ఉంటారని. నేను పనికిరాని వాణ్ణయితే అందరూ శత్రువులే ఉంటారు. అది పోయిన తర్వాత శత్రువులేరి? ఆయనే ఒప్పుకున్నాడు శత్రువులు లేరని. అందుకని ఈ తైత్తిరీయంలో చెప్పినది చాల జాగ్రత్తగా ఉండాలి. ''తత్పరిమర ఇత్యుపాసీతా'' అన్నీ అందులో లీనమవుతాయని ఎవడు చెయ్యాలి? తనకు శత్రువు లెవ్వరు లేనివాడు. తనకు శత్రువు లేనివాడంటే ఏమిటి? అజాత శత్రువు. అపుడేం జరుగుతుంది? ఈయనని శత్రువుగా చూసినవాళ్ళు వెళ్ళిపోతారు. ధర్మరాజు మొదలైనవాళ్ళు చేసేవారన్నమాట. 18 అక్షౌహిణులు వెళ్ళిపోయినాయి. కాని వీళ్ళల్లో ఎవళ్ళూ వెళ్ళిపోవాలని ఆయన అనుకోలేదు, వీళ్ళు యుద్ధం మానేస్తే బాగుండును అనుకున్నాడు గాని, ఎవరినీ ధర్మరాజు దూషించలేదు. అందుకని 18

అక్షౌహిణులు కిమ్మనకుండా వెళ్ళిపోయాయి. కనుక దీని ఉపాసన మనకి తైత్తిరీయంలో చెప్పినది ఇక్కడ కలుపుకోవాలి. 'కాయ ఆకాశయోః' కాయం అంటే శరీరం, 'ఆకాశయోః' అంటే ఆకాశం. ఈ రెండింటియొక్క 'సంబంధ సంయమాత్' సంబంధమును ఈ విధంగా ధ్యానం చేయటం వలన ''లఘుతూల సమాపత్తేఃచ'' లఘు అంటే తేలిక, శరీరం తేలికబడుతుంది. ఇలా చేస్తూ, ఇంకో ప్రక్కనించి ఏం చేయాలంటే, శరీరం అంటే ఏం లేదు, కనుక బరువు ఏం ఉంటుంది. పదార్థం అనేది మన మనస్సులో ఉన్నపుడు బరువు ఉంటుంది శరీరానికి అనే ఆలోచనలను పెంపొందించుకోవాలి. పదార్థం అనేది బుద్ధిలోంచి తీసేస్తున్న కొద్దీ, మనకి లఘుతూలం అనుభూతి వస్తుంది. మనస్సులోంచి తీసేయటం అంటే పదార్థం లేదని నమ్మటంలో ఏం లాభం లేదు. మనస్సులో ద్రవ్యము లేకపోవటం వచ్చినపుడు శరీరంలో ద్రవ్యము (matter) ఉండదు. ఏం ఉంటుంది? Matter దేనితో చేయబడ్డదో అట్లాంటి electrons, protons ఉండటం మొదలుపెట్టి, యింకొంచెం కాలం అయ్యేటప్పటికి energy centres మాత్రం ఉంటాయన్నాడు. అటుపైన కేవలం ఆకాశం ఉంటుంది. ఈ స్థితి మీకు వచ్చేటప్పటికి లఘుత్వము శరీరానికి ధ్యానంచేసి, 'స్థూల సమాపత్తే' స్థూలం అంటే దూది, అంటే దూదితో చేయబడిన శరీరం ఆకారంలాగ, కావాలంటే కొన్నాళ్ళు ధ్యానంచేస్తే, తరువాత అదికూడ వచ్చేస్తుంది. మనస్సుకేదో కొంచెం ఆకారం కావాలంటే స్థూలంగా కనిపించేది దూది తేలికైనది. అలాగ ధ్యానం చేసుకోమన్నాడు కొంతకాలం. ఈ రెండు విధములుగా సమాపన్నత్వముచేస్తే అంటే సంయమంచేస్తే ఈ సంయమంవల్ల ఆకాశ గమనం వస్తుంది. శరీరముచేత ఆకాశము నందు గమనము చేయుట అంటే space travel. అలాంటి cosmo-experience నేను చూచినటువంటి సన్నివేశం ఒకటి చెబుతాను. ఒకాయనకు నాకు మధ్యన మంచం ఉన్నది. ఆయన మూడే ప్రశ్నలు వేసాడు. ఈ మంచం దేనితో చేయబడ్డది? టేకుతో. టేకు దేనితో చేయబడ్డది. అణువులతో పరమాణువులతో. ఆయనే చెప్పుకుంటూ వచ్చాడు. ఈ పరమాణువులు దేనితో చేయబడ్డాయి? మహా చైతన్యంతో. మహా చైతన్యం దేనితో చేయబడ్డది. చోటుతో. కనుక మంచం చోటుతో చేయబడ్డది అని కళ్ళు మూసుకో అని చేత్తో స్పృశించాడు. మంచం, శరీరం కూడ చోటుతోనే చేయబడ్డవి కనుక నావంక చూస్తూ నడచిరా అన్నాడు. అలా మంచంమీద

నించి నడిచి వెళ్ళినటువంటి సన్నివేశం, సొంతంగా నాచేత నడిపించి చూపించాడు. తర్వాత మనం సొంతంగా చేయగలమా? చేయలేమా? అంటే ఆయన యిచ్చినటువంటి మంచం అంటే ఏమిటో ఆ dimensions మనం తెచ్చుకుంటే చేయగలము. దాన్ని సంయమం అంటారు. ఇది నా వ్యక్తిగత అనుభవం. అటువంటి వాటి గురించి చాల అరుదుగా రెండు మూడు ముక్కలు తప్ప ఎక్కడా మాట్లాడకూడదు. మిగిలినవన్నీ చెప్పుకోవచ్చు. కనుక శరీరమునకు, ఆకాశమునకు ఉన్న సంబంధము మీద సంయమము చేయుట వలన తేలికగా దూదివంటి సమాపత్తి అంటే మనస్సులో భావమును వ్యాప్తి చేసుకుంటంచేత, ఆకాశ గమనము వస్తుంది. అంటే ఆకాశములోంచి యిటునించి అటు ప్రయాణం చేసి వెళ్ళాడనుకోండి. ఏమవుతాడు? యిక్కడ చోటులో కలిసిపోతాడు అక్కడ చోటు (space) లో తయారవుతాడు. అంతేగాని మనమంతా చూస్తూండగ ఇలా పైనించి వెళ్ళడు. 21వ శతాబ్దంలో సైంటిఫిక్‌గా కూడ ఇది సాధించబడుతుంది అని చెప్పింది బ్లావెట్స్కీ. ఆవిడ గురువుగారి దగ్గర మొదటి పుస్తకం పూర్తిచేసి యోగాభ్యాసం పరిపూర్ణమయిన సంవత్సరంలో ఆవిడ మూడు విషయాలు చెప్పింది. మొదటిది the scientists are the slaves of matter అని రాసింది. ద్రవ్యమునకు బానిసగా ఉన్నాడు సైంటిస్టు, ఏదన్నా చూపిస్తే తప్ప నమ్మే స్థితిలో లేడు. వ్యాధిని తీసుకొచ్చేటు వంటి క్రిములవలే, సూక్ష్మ జీవులవలే the scientists live upon putrified matter అంటే కుళ్ళుతున్నటువంటి ద్రవ్యం అనే దానిమీద బ్రతుకుతున్నాడు అన్నది. జూలియన్ హక్స్లే మొదలైనటువంటి సైంటిస్టులు ఉన్నటువంటి రోజులు. ''నా దృష్టి ప్రకారం మనస్సు అనేది లేదు. నా దృష్టి ప్రకారం బుద్ధి అనేది లేదు. నా దృష్టి ప్రకారం భావాలనేవి లేవు, అంటూ రాశారు జూలియన్ హక్స్లే. ఇవన్నీ local గా జరుగుతున్న రసాయనిక చర్యలు (chemical reactions) తాలూకు ఒకానొక గడబిడ తప్ప ఇంకేం లేదు'' అని నా ఉద్దేశ్యం అన్నాడు. Blavetsky Isis unveiled లో రాసింది. మనస్సు లేదు, ఊరికే లోపల జరుగుతున్న ఆ రసాయనిక పదార్థముల గడబిడ అంటే ఒప్పుకున్నాం. బుద్ధిలేదు, ఆలోచన లేదు. మనస్సు లేదు అంటే ఒప్పుకున్నాం. కాని ప్రతిదానికి ఇదేమి లేదంటూ It seems to me. నాకిలా అన్పిస్తోంది, నాకిలా అన్పిస్తోంది, నాకిలా అనిపిస్తోందని, రాసినవాడు మూర్ఖుడు, ఎవడు ఆ రాసింది అన్నది. సైంటిస్టులు అందరూ అలాగ,

కనకపు సింహాసమున, అన్నట్లుగా పెట్టారు జూలియన్ హ్యక్షలేని. She says, let us with all reverence enter into the hegjellion false scientific theory. Let us remove the true science, enter into that side అన్నది. ఆ తర్వాత యిపుడు నేను చెప్పిన థీరీ చెప్పింది. అదీ ఆవిడ కల్పించుకోబట్టే. తరువాత రెండవ ప్రశ్న వేసింది. ఇప్పటికీ వేల సంవత్సరాల నించీ అనేక దేశాల్లో ఉన్నటువంటి వాళ్ళకి మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, ఆత్మ ఉన్నవి అని అనిపించింది, ఆ అనిపించిన వాళ్ళు వేల దేశాల్లో, వేల శతాబ్దులలో రాసారు. అవన్నీ సరిపోయాయి. ఇన్ని వేలమందికి అనిపించినది సమానంగా ఉన్నదంటే నేను ఎవర్ని ఖాతరు చేయాలి అనేది commonsense తో వాడే తేల్చాలి. ఒక్క మూర్ఖుడికి సైన్సు విరుద్ధంగా అనిపించిందంటే, నమ్మకం ఎట్లాగ అని అడిగింది. అసలు సైన్సు అంటే ఏమిటో Isis unviled first volume చదవండి. అటు మతాలు యిటు సైన్సు రెండింటి మీద ఆవిడ ఎత్తిన దండయాత్రలకి, ఆవిడ చూపించిన లోపాలకి, గందరగోళం అయిపోయి రోడ్డుమీద కిరసనాయిలు పోసి నిప్పంటించి ఉండేవాళ్ళు, ఆవిడ గనుక తట్టుకుంది. కనుక ఆకాశ గమనము అనే దాని గురించి కూడ ఆ అధ్యాయంలోనే ఆవిడ రాసింది, ఇక్కడ 1875లో జూలియన్ హ్యక్షలేనే, ఉదాహరణగా యిచ్చి ఆవిడ చెప్పింది. A scientist is a slave of matter. అంటే భౌతిక ద్రవ్యాన్ని దాటి ఇంకొకటి ఊహించటానికి తగినటువంటి బుద్ధి లేనటు వంటివాడు అని. 1975 వచ్చేటప్పటికి ఏమవుతారో కూడ రాసింది. చదువుకోవచ్చు ఆ పుస్తకంలో. The scientist is a master of space. ముందువాళ్ళు slaves of matter, తరువాత వాళ్ళు master of space. వీళ్ళు space theory లో mastery సంపాదిస్తారు. 1975కి సంపాదించారా లేదా. space లోనే కదా మనం ఉన్నది. 2075 నాటికి అంటే వంద ఏళ్ళ తర్వాత మళ్ళీ Man is physically broadcast through space అన్నది. అంటే భౌతిక శరీరంతో ఒక రేడియో లాంటి దాంట్లోకి వెళ్ళి తను ఏ ఊరికి వెళ్ళాలో రేడియో tune చేసుకున్నట్టుగా tune చేసుకొని పైకి వెళుతూంటాడు. ఇక్కడ పరమాణువులలో కలిసిపోయి అక్కడ ఇంకోచోట ఏ లండన్‌లోనో, పారిస్‌లోనో, న్యూయార్క్‌లోనో తేలి, తలుపు తీసుకొని బయటికి వస్తాడు. ప్రాచీన యుగాల్లో సాధించినటువంటి పద్ధతి యిక్కడ చెప్పాడు.

## 44. బహిరకల్పితా వృత్తిర్మహావిదేహా తతః ప్రకాశావరణక్షయః।

*బహిః = బాహ్యమున, అకల్పితా = కల్పించబడనటువంటి, వృత్తిః =వృత్తి (సంయమము అనే వృత్తి), మహా విదేహాత్ = మహా విదేహము కలుగును, తతః= దానివలన, ప్రకాశ = వెలుగుయొక్క, ఆవరణ = ఆవరణము, క్షయ = నశించిపోవును.*

**చిత్తమునకు బాహ్య ప్రపంచముతో సంబంధము కలిగినప్పుడు సంకల్పము లేకుండునట్టి స్థితి మహా విదేహము అనబడును. దానియందు సంయమము చేయుటవలన తానను వెలుగునకు గల ఆవరణలు తొలగిపోవును.**

**వివరణ :** ఇంతవరకూ చెప్పినవన్నీ సంయమం ఎట్లాచేస్తే ఏం వస్తుందో చెప్పారు. ఇప్పుడు అలా చెప్పకుండా 'బహిర కల్పితా' ఈ ఆకాశం వైపుకి, చెవి వైపుకి, ముక్కు వైపుకి బాహ్యమునకు చూస్తూ కూర్చునే బదులు వాటిమీదకి ప్రసరించకుండా ధ్యానంచేస్తే అన్నాడు. అంటే when the meditation is not objective. తనయందు సంయమును ప్రసరింప చేసుకోమన్నాడు. లైటు దానిమీద, దీనిమీద వేసే బదులు తనమీద వేసుకోమన్నాడు. అప్పుడు 'బహిః అకల్పితా' బయటికి కల్పించబడనటువంటి వృత్తి- ఏ వృత్తి? చిత్తవృత్తి కాదు. సంయమం వృత్తి. కావాలని మనం యింద్రియాలకి, మనస్సుకి కల్పించిన వృత్తి కదా యిది. మనస్సు ఎలా చెపితే అలా చెయ్యడం కాదు. సంతకం పెట్టమన్నచోట పెట్టటం కాదు. చిత్తవృత్తి పద్ధతి. ఇపుడు వచ్చింది అదికాదు. సత్తా ఉన్నటువంటి యోగాభ్యాసం చేసిన వాళ్ళమే మనం. మనం పెట్టదల్చుకున్న సంతకం పెట్టడం, ఇంకొకడిచేత పెట్టించటం. ఆ స్థితికి వచ్చాం. వృత్తి అంటే ఇక్కడ అర్థం ఏమిటి? భోజనం, గీజనం కావు. ఇలాంటి సంయమం వృత్తి అంటే విశేష వృత్తి. ''బహిర కల్పితా వృత్తిః''. బయటకు కనిపించకుండా ఈ సంయమాన్ని దానిమీద, దీనిమీద పెట్టటం. వాడెవడి మీదో పెడితే వాడు పూర్వం ఎట్లా ఉండేవాడో తెలుస్తుంది. పరకాయ ప్రవేశం తెలుస్తుంది. జీలకఱ్ఱ తెలుస్తుంది. సింగినాదం తెలుస్తుంది అని చెప్తూ ఏడిపించటానికి కొన్ని చెప్పాడు. మళ్ళీ ఇక్కడికి తీసుకొచ్చి ఏం చేస్తున్నాడు? C.V.V. గారు చేసినట్లే, తేలు మంత్రంలాగ అడిగిన కొద్దీ ప్రతిదానికీ adjustment prayers యిచ్చాడు. ఇవన్నీ చేయాలా? అంటే అక్కర్లేదు అన్నాడు.

కనుక బయటికి కల్పింపబడనటువంటి ఈ సంయమం చేస్తే, దాన్నే 'మహా విదేహా' అంటారు. దేహమునకు సంబంధించినది కాకుండా,

తదతీతమైనది, విదేహము. దాన్ని చేసిన వాళ్ళని 'మహా విదేహులు' అని అంటారు. అక్కడ వాడు తన దేహానికి సంబంధించి దేనియందూ ధ్యానం చేయటం లేదు. ఉన్నదేదో దానిమీద ధ్యానం చేస్తున్నాడు. ''తతః'' దానివలన ''ప్రకాశ ఆవరణ క్షయః''- ప్రకాశం అంటే వెలుగు. ఎలా కనిపిస్తోంది కంటికి, ఆ వెలుగుకి మధ్య కొంత విస్తీర్ణం ఉన్నది. దానివల్ల నీ కన్ను దాన్ని meet అవ్వటంవల్ల కనిపిస్తోంది. కనుక ప్రతి వెలుగుకి, మనం చూసే దానికి చుట్టూ కొంత విస్తీర్ణం (area) ఉంటుంది. దీన్ని ఆవరణ అంటారు. అలాగే మన మనస్సుని మనం గమనిస్తున్నపుడు ఒక ఆవరణ ఉన్నది. అంటే మన మనస్సు ప్రకాశిస్తోంది అనుకోండి. దానికి చుట్టూ ఒక ఆవరణ ఉన్నది. అలాగాకుండా, యింకా చూస్తూండు అన్నాడు. ఎందుకు అనేది వదిలేసి, నీ గురించి నువ్వు ధ్యానం చేసుకో. మనస్సుని గురించా? కాదు. నీ గురించే. తలకాయలోనా? కాదు. నీలోనే. భ్రూమధ్యంలోనా? కాదు .నీలోనే. ఇట్లా ధ్యానం చేసుకుంటూ వెళుతూంటే తర్వాత ఆవరణం పోయి light మిగుల్తుంది. ఎందుకంటే నువ్వు బల్బుగా పనిచేస్తూంటే నీలోంచి కొంత light వస్తోంది. నేను అనే light. ప్రతివాడు బల్బుగా పనిచేస్తూ, వాడిలోంచి కొంత light యివతలకి వస్తుంది. ప్రతివాడికి చుట్టూ ఒక్కొక్క 'ఆరా' ఉంటుంది. దానిచుట్టూ ఒక్కొక్కచోటు ఉంటుంది. ఇది దాటి వీడి వెలుగు వెళ్ళగలదు. ఇంకా పైకి వస్తుంది. అంతవరకూ శరీరాల్లో మనం ఉంటాం. అది వచ్చాక మనం అనే ఒక చెరువులో శరీరాలు అనే చిన్న చిన్న సీసాలు తేల్తూ ఉంటాయి. అలాగ మననించి శరీరాలుండటం మొదలు పెడతాయి గాని, శరీరాల్లో మనం ఉండటం పోతుంది. బద్ధలైపోతుంది. శరీరాలు బద్ధలవ్వవు. బహి ప్రదేశమునకు బాహ్యముగ కల్పింపబడనటువంటి వృత్తి వస్తుంది. అనగా యిక్కడ చిత్తవృత్తి కాదని చెప్పుకున్నాం. ఏం వృత్తి? సంయమ వృత్తి. అంటే చిత్తవృత్తిని నిరోధం చేసిన తర్వాత చిత్తముయొక్క వృత్తి. యోగాభ్యాసం చేసినవాడి చిత్తమునకు యివ్వబడిన వృత్తి. అంటే చిత్తము టైపిస్టు లాంటిది. టైపిస్టు ఏది కొడితే అది సంతకం పెట్టడం కాకుండా వాడిని శాసించునట్టి యజమాని. యోగాభ్యాసం ముందున్న మనకీ, యోగాభ్యాసం తరువాత ఉన్న మనకి ఆ మార్పు వస్తుంది. అంటే యోగాభ్యాసం తర్వాత సంకల్పశక్తి (will power) పనిచేస్తుంది. యోగాభ్యాసానికి ముందు దాని (negative aspect) విరుద్ధ అంశము అయిన మొండితనం (obstinacy) పనిచేస్తుంది.

సంకల్ప శక్తి (will power) చాల ప్రసన్నంగా, మృదు మధురంగా ఉంటుంది. ఎదుటివాడు చెప్పింది మనం ఎందుకు వినాలి? అనే తలపొగరుతనం అన్న దుస్థితినుంచి ఆ స్థితికి వస్తాం. అంటే వినాశాత్మకమైన ప్రతిభనుంచి నిర్మాణాత్మకమైన, సృజనాత్మకమైన ప్రజ్ఞలోకి వస్తాం. కనుక యిక్కడ చెబుతూన్నటు వంటిది చిత్తమునకు మీరంగీకరించిన వృత్తి. మీ చిత్తానికి అలాంటి వృత్తి 'బహిర కల్పితా' బయటకి కల్పించకపోతే, మహా విదేహ అనబడుతుంది. ముందు ప్రస్తావింపబడింది. అనగా విదేహ అంటే దేహము నాశ్రయింపనిది. దేహమును ఆశ్రయించకుండా జీవించగల వాళ్ళందరినీ 'విదేహులు' అంటారు. అదొక బిరుదు. అలాంటివాళ్ళు ఉన్న చోటుకి, ఆ మార్గంలోకి శిక్షణ యిచ్చే చోటుని విదేహ రాజ్యము అనిపేరు వచ్చింది. కనుకనే వాళ్ళకి పేరు ఏదైనప్పటికి జనకుడు అనే బిరుదు ఉండేది అక్కడ. ఆ స్థితిలో ఎవరున్నాగాని జనకుడే. అంటే ఎవరు? వాళ్ళకు తండ్రి అని అర్థం. విదేహ అనే మాటకి దేహమును ఆశ్రయించనిది అని అర్థం.

సామాన్యంగా దేహమును ఆశ్రయించే బ్రతుకుతూ ఉంటారు మానవులు. మిగతా జంతువులు మొదలైన జీవరాసులు కూడ దేహాన్ని ఆశ్రయించి బ్రతుకుతూ ఉన్నా, వాటికి దేహ వృత్తులన్నీ కూడ ప్రకృతి చేత రక్షింపబడి, సంయమం కలిగి ఉంటాయి. శరీరానికి ఆకలి దప్పులు మొదలైనవి కావలసివచ్చినప్పుడే చరించడంతప్ప, ఉల్లఘించడం ఉండదు. ఉల్లఘించుట (transgression) అనే హక్కు ఒక్క మానవుడికే గాని, ఈ జంతు ప్రపంచం (biological kingdom) లో యింక దేనికీ లేదు. అలాగే స్త్రీ పురుష సంబంధం కూడ. ఒక ఋతువు వర్తిస్తుంది జంతువులకీ, చెట్లకీ వాటికీను. ఆ ఋతువు ప్రకారం వర్తిస్తాయి. మిగతా టైములో వాటి యిష్టంకాదు. మానవుడు దాంట్లో కూడ అతిక్రమించడం ఉంటుంది. కనుక మానవజాతికి వచ్చినన్ని రోగములు, దుఃఖములు, చింతలు మొదలైనవి మిగతా జాతులు వేటికీ రావు అనేది common sense పాయింట్. కనుక నరులలో జంతువులు అనుభవిస్తున్నటు వంటి సుఖం ఎరగని వాళ్ళం ఒక తెగ ఉంటాం. అది కాకుండా జంతువుల యొక్క స్థితిలో ఉన్న అర్థవంతత్వాన్ని చూసుకొని దాని ప్రకారం అతీతత్వాన్ని పొంది ఉత్తముల మార్గాన వెళ్ళటానికి ప్రయత్నిస్తున్న వాళ్ళం కొంతమంది ఉంటాం. అందుకని విదేహులు అన్న వాళ్ళు ఈ రెండవ తరగతికి చెందినవాళ్ళు. దేహం వాళ్ళమీద ఆధారపడి ఉంటుందిగాని.

దేహంమీద వాళ్ళు ఆధారపడి ఉండరు. అంటే ఏదన్నా తిందామని అనిపిస్తే తినటమేగాని, ఏదో పెళ్ళో, డిన్నరో, పార్టీయో ఉంటే వెళ్ళి తినటం లాంటివి చేయరు. దేహం మీద ఆధారపడటం అంటే అది. అలాచేస్తే మనం అపచారం చేసాం గనుక శరీరానికేమో దెబ్బ. మనస్సుకేమో ఎలాంటి శరీరంలో ఉండాలో అలాంటి శరీరాన్ని అట్టే పెట్టుకోకుండా శరీరాన్ని పాడుచేసుకొని ఆ మనస్సే ఆ శరీరంలో ఉండవలసిన దుస్థితి వస్తుంది. మానసికంగాను, శారీరకంగాను కూడ అనారోగ్యం వస్తుంది. అందుకే యోగాభ్యాసంలో ఇవన్నీ కూడ యమ, నియమాదులలో చెప్పబడిన అంగములలో ఒక uniform explanation ఇచ్చేశాడు. అంటే శరీరానికి ఆహారం కావాలి. శరీరానికి మనం ఆహారం అందించాలి. కనుక దాని సదుపాయం కోసం రుచి. రుచికరమైన ఆహారం తినటం అనేది యోగి తెలుసుకుంటాడు. యోగాభ్యాసానికి ముందున్న మానవుడు శరీరానికి ఆహారం అవసరం కాబట్టి దానికి సదుపాయమైనది రుచి అని తెలుసుకోడు. రుచికరమైనది తినటం అని అనుకుంటాడు. అంటే రుచి మీద ఆధారపడి తింటాడు. ఇక్కడ దీని పరిణామం వేరు, దాని పరిణామం వేరు. రుచికోసం తిన్నవాడు రోగి అవుతాడు. తినటం కోసం రుచిని ఉపయోగించిన వాడు యోగి, భోగి అవుతాడు. మొదటివాడు భోగి కాలేడు, యోగీ కాలేడు. అంటే ప్రాముఖ్యం తెలియాలి. అర్థవంతత్వము తెలియాలి. ఆకలి ఎందుకున్నది? శరీరం నశించిపోకుండా ఉండటం కోసమని తెలియాలి. అంతేగాని ఆకలి ఎందుకున్నది? అంటే మనక్కావలిసిన కూరలు తినటానికి ఉన్నది అనే స్థితి నించి దాటాలి. మనక్కావలసిన కూరలు వండుకు తినచ్చు తప్పులేదుగాని, ఎపుడు శరీరానికి ఆకలేస్తుందో అపుడు వండుకు తినాలి. లేదా ఆరోగ్యం ప్రకారం ఆ కూర మనం తినకూడని స్థితిలో ఉన్నప్పుడు మానేసి తినవలసిన స్థితిలో మళ్ళీ తినాలి. ఇట్లాంటివి మనం చూసుకుంటూ ఉండాలి. అప్పుడు ఆ మొదటి వృత్తినించి తరువాత వృత్తికి వస్తాం. అంటే చిత్తవృత్తి అనే స్థితినుంచి, చిత్తమునకు మీచే యివ్వబడిన వృత్తిలోకి వస్తాం. ఆ వృత్తి బహిర కల్పితం కావాలి.

బహిర కల్పితం అంటే (not applied objectively) ఎలాగ? ఈ పుస్తకంమీద కొంత శ్రద్ధ పెట్టాము. కొంచెం ఎక్కువ బోధపడింది. పరీక్షల మీద కొంచెం ఎక్కువ శ్రద్ధ పెట్టాము. ప్రథమ స్థానం వచ్చింది. అలాగే

దేనియందైతే కొంచెం శ్రద్ధ పెట్టామో దాని తాలూకు లాభాలు ఉంటాయి. అంటే మనస్సు దానిమీద కొంచెం ఎక్కువ candle power తో shine అవుతుంది. తప్పదు. వ్యాపారం మీద కొంచెం ఎక్కువ శ్రద్ధపెట్టితే తప్పకుండా లాభాలు వస్తాయి. అందుకని ఈ స్థితిలో శరీరం అనే యంత్రానికి, దాని సాంకేతిక పరిజ్ఞానం (technical know how) తెలిసి, దాని ప్రకారం బ్రతుకుతూ ఉన్నపుడు, కొంతదూరం వెళ్ళేటప్పటికి ఈ శ్రద్ధని, సంయమాన్ని దానిమీద వర్తింపచెయ్యి. Chemistry మీద వర్తింప చెయ్యి. ఇంకాసిని మార్కులు వస్తాయి. ఏదో ఇంగ్లీషు మీద వర్తింపచెయ్యి. బాగా మంచి ఇంగ్లీషు మాట్లాడతావు. సంస్కృతం మీద అమలు చెయ్యి. హీబ్రూ మీద వర్తింపచెయ్యి. అవన్నీ కూడ పరిస్థితిలో మెరుగవుతాయి. మెరుగైన తర్వాత నీమీద సంయమం లగ్నం చేసి అమలు చేసుకో. అది యిక్కడ చెబుతున్నది. మనం రోజూ మనస్సుని దేనికి వర్తింప చేస్తున్నాం, వస్తున్న అభిప్రాయాలకి వర్తింప చేస్తున్నాం. ఆఫీసులో ఉన్న విషయాన్ని గురించి గాని, లేదా మన కుర్రాడికి ఉద్యోగం యిస్తానన్న వాణ్ణి గురించిగాని, ఆలోచిస్తూ ఉంటాం. అంటే మనస్సు దేనిమీద పనిచేస్తోంది? తాను కాక యితర విషయం మీద పనిచేస్తోంది. అన్యవస్తు ధ్యాస. యిది ఒక్కటే తెలుసును మనస్సుకి. అందుచేత మనందరికి మనస్సు అంటే అభిప్రాయములే కాని, అంతకు వెనుక ఉన్న మనస్సు తెలియటానికి అవకాశం లేదు. అభిప్రాయములు రాకుండా ఉన్నపుడు నిద్రపోతాం కనుక మనస్సు తెలియటానికి వీల్లేదు. అభిప్రాయాలు లేకుండా మనస్సు ఉండటం అనేది మెలకువగా ఉన్నపుడు జరగటం లేదు. కనుక ఉంటే అభిప్రాయాలు, లేకపోతే నిద్ర. అందుచేత మనకి మనస్సని అనిపించేది అభిప్రాయాలు తప్ప, మనస్సు కాదు. అంటే మనం కోనేరు, కొలను అని పిలిచేది, అలలు తప్ప, నీరు కాదు. అలలుకీ నీరుకీ తేడా తెలియని మూర్ఖస్థితి మనది. కోనేటిలో అలలు ఉంటాయనుకోండి. అబ్బ! కోనేరు అంటాం. మనం చూసి అబ్బా అంటున్నది కోనేరు కాదు. కోనేటి అలలు. అలాగ మన మనస్సులో అభిప్రాయం వచ్చినపుడు మనస్సు ఉందని తెలుస్తుంది. మనస్సంటే మన ఉద్దేశ్యంలో అభిప్రాయం. ఈ అభిప్రాయం ఆగిపోయి, ఇంకో అభిప్రాయం వచ్చే లోపల మధ్యలో ఏముందో తెలియటం లేదు. అపుడు మనం ఉన్నాం కాని మన మున్నామని తెలీదు. కనుక మనకు మనస్సంటే అభిప్రాయమనే చెత్త ఉద్దేశ్యమే కాని, అభిప్రాయానికి, అభిప్రాయానికి మధ్యన ఉన్న మనస్సుని

గురించి రుచి చూడటానికి నోచుకోలేదు. పెట్టి పుట్టలేదు యింతవరకూను. అభ్యాసం చేయలేదు. ఇక్కడేం చెబుతున్నాడంటే, దేని మీదైతే నీ శ్రద్ధ, నీ అభ్యాసం పెడుతున్నావో వాటిని మెల్లిగా తీసేయ్. శ్రద్ధ అనే విలువైన వస్తువుని కొంచెం ప్రమోషన్ రావాలి, యింకొంచెం వ్యాపారంలో లాభం రావాలి అనే చెత్త వస్తువులు కొనటానికి ఉపయోగించకు. అయితే అది రావద్దా? తప్పకుండా రావాలి. ఏం చేయాలి? శ్రద్ధమీద నువ్వు శ్రద్ధ పెట్టినపుడు అవన్నీ కుక్కల్లాగ నీవెంట వస్తాయి లేదా వాటిమీద నువ్వు శ్రద్ధ పెట్టినపుడు నవ్వు వాటి దగ్గరికి కుక్కలాగ వెళ్ళి వాడి దగ్గరికి, వీడి దగ్గరికి వెళ్ళి నానా జతల కాళ్ళు, బూట్లతో సహా పట్టుకోవాలి. తేడా అది. నీ దగ్గర శ్రద్ధ అనేది ఒకటి ఉంటే, శ్రద్ధ దగ్గరికి అన్నీ వస్తాయి. దేనిమీదైనా శ్రద్ధ పెట్టావంటే అపుడేమౌతుంది? ''మొసగొని రేగిపండ్లకును మౌక్తికముల్ వెలబోసినట్లు'' అన్నాడు గోపన్న రామదాసుగారు. రేగుపండ్లు అమ్మివస్తే కొలతకి సరికిసరి యిస్తానందిట. బియ్యానికి అని ఆవిడ చెప్పింది. వీడింట్లో ముత్యాలు ఉన్నాయి. ముత్యాలకి అని అనుకొని ముత్యాలు తీసికెళ్ళి కొలిచి రేగుపండ్లు కొనుకున్నాడు. అలాగ శ్రద్ధ, సంయమం అనేవిపెట్టి రేగు పళ్లలాంటివి కొనుక్కుంటూ ఉంటారు మూర్ఖులు అన్నాడు. అంటే వాళ్లల్లో ఉన్న మనఃప్రవృత్తి (psycological set up) లో ఏది నిజంగా విలువైనదో తెలియక అక్కర్లేని చెత్త కొనుక్కుంటారు. అది తెలియాలి. పది లక్షలు లాభం రావటంగాని, ప్రమోషన్ రావటం గాని, విలువైనదని దానిమీద శ్రద్ధ పెట్టేటప్పటికి, శ్రద్ధ అనే పాలల్లో నీళ్ళు కలిపినట్లయి, అది పనికిరాకుండా పోవటం కాకుండా మెల్లిగా మనకి తెలీకుండా సన్నటి సిరంజితో ఆ పాలు లాగేసినట్లవుతుంది. అలా శ్రద్ధ అనే పాలల్లో నీళ్ళు కలిపిన వాళ్ళం అవుతున్నాం. నీళ్ళు కలిపినపుడు నువ్వు ప్రమోషన్ మీద పెట్టినా పనిచేయదు. వ్యాపారం మీద పెట్టినా పనిచేయదు. నీకొచ్చేది నష్టమే. లాభం మరి చచ్చినా రాదు. పది లక్షల లాభంకోసమని శ్రద్ధ పెడితే, శ్రద్ధ పాడవుతుంది గాని, లాభంరాదు. కాని శ్రద్ధ మీద గనుక నువ్వు ధ్యాస పెట్టి, యోగాభ్యాసం చేసినట్లైతే నువ్వు ఏది చేసినా శ్రద్ధ దగ్గరికి వచ్చి, పొరపాటు చేయటం ఉండదు. అదే యిక్కడ చెబుతున్నాడు. కనుక దానికోసం, దీనికోసం శ్రద్ధని తలగబెట్టుకునేటువంటి పిచ్చివాడు. ఎలాంటి వాడంటే, సుఖం కొనుక్కుంటం కోసం డబ్బుల్నీ, ఆస్తిని, ఉద్యోగాన్ని, వ్యాపారాన్ని, యివన్నీ పెట్టి ప్రయత్నిస్తున్నవాడు. వాడికి సుఖం ఎందుకుంటుంది? సుఖంకంటే సుఖాన్ని కొనుక్కుంటానికి వీలైనంత

వస్తువు యింకోటుంటుంది అని నమ్మే వాడికి సుఖం ఎందుకొస్తుంది? మిగిలినవన్నీ వస్తాయి గాని, అంటే ఏమిటి. వాడి దృష్టిలో సుఖం అనే మాటకి సరైన అభిప్రాయం లేదు. డబ్బుపెట్టి కొనచ్చు సుఖాన్ని అంటే వాడి దృష్టిలో సుఖం అనే మాటకి అర్థం ఏడుపు అని. అంతకంటే ఇంకేం లేదు. అలాగే హోదాపెట్టి సుఖం కొనచ్చు అనుకునే వాడికి కూడ సుఖమనే మాటకి అర్థం ఈర్ష్య, అసూయ, మద మత్సార్యాలు. వాళ్ళంతా సుఖంగా ఉంటున్నారు. మనం ఉండటం లేదు అని అనుకుంటూ ఉంటారు. సుఖం ఎందుకుంటుంది? ఏదిపెట్టి సుఖం కొనుక్కుందా మనుకున్న వాడైనా దుఃఖాన్నే కొనుక్కుంటాడు. సుఖం పెట్టి మిగిలినవి కొనుక్కునేవాడు ఉంటాడు. వాడు సుఖపడుతూ ఉంటాడు. మిగిలినవి అన్నీ వచ్చేవి వస్తూ ఉంటాయి వాడు ప్రపంచంలో సుఖ పడుతూ ఉంటాడు. అంటే సుఖపడటానికి క్షుద్రములైన కారణాలు వెతుక్కోని బుద్ధిమంతుడైవడైతే ఉంటాడో వాడొక్కడే సుఖపడుతూ ఉంటాడు. అన్నీకూడ వాడికి సుఖానికే తోడ్పడతాయి. ఏది చేసినా వాడికి, వాడు చుట్టూ ఉన్న వాళ్ళకి సుఖంకోసం కావలసినటు వంటివి వస్తూ ఉంటాయి. ఎందుచేతనంటే సుఖంకోసం యింతకంటే విలువైనది ఇంకొకటి ఉందనే అవమానం వాడు సుఖానికి చేయలేదు గనుక. కావాలంటే ఓవర్ టైము పనిచేస్తాడు. సుఖంకోసం చేయటంలేదు. కనుక అపచారం చేయటంలేదు. చేయాలి కనుక చేస్తాడు. అలాగే శ్రద్ధ కూడ. సుఖం ఒకటి. శ్రద్ధ ఒకటి. దాన్ని ఇంకొక దానికి వినియోగం చేస్తే మైల పడిపోతాయి. అంచేత దానియందే మీరు సమాధి స్థితి పొందాలి. అపుడు బహిర కల్పితమైన మార్పు వస్తుంది. అంటే వెలుపలగా మీరు చెప్పటానికి వీలైన వస్తువులు గాని విషయములుగాని, సంకల్పములు గాని. దేనియందూ యోగాభ్యాసం సంయమం చేయక, ఊరికే సంయమం చేయటం మొదలు పెట్టండి. ఏమవుతుందో చూడండి. అసలు రావలసినది వస్తుంది. ఈ సుఖంగా బ్రతికిన వాళ్ళెవరైతే ఉన్నారో పతంజలి, వ్యాసుడు, వాల్మీకి మొదలైన గడుసైన వాళ్ళకి దొరికిన కిటుకు మీక్కూడ దొరుకుతుంది. అది లేకపోతే యోగాభ్యాసం చేసినాకూడ, వాటి వెంట, వీటి వెంట వెడుతూనే ఉంటారు. సిద్ధులు కావాలని, లేదా వశీకరణము కావాలని, లేదా మనచుట్టూ పదిమంది రావాలని, పదిమందికి మనం తెలియాలని, కీర్తి రావాలని యిట్లాంటివి వాళ్ళు అనుకున్నవి వస్తాయి. నానాగడ్డి, నానామట్టి తింటూ ఉంటారు. కీర్తి వచ్చిందనుకోండి,

అన్నం తినటానికి వీలుందా? మంచినీళ్ళు తాగటానికి వీలుందా? భార్యతో మాట్లాడటానికి వీలుందా? పిల్లలతో మాట్లాడటానికి వీలుందా? వాడు అనుకున్నది వస్తుంది. ఒకడికి ఈ మంత్రం చెయ్యి. బ్రహ్మ రాక్షసుడు ప్రత్యక్షం అయి నీకేది కావాలంటే అదిచేసి పెడతాడు. కాని జాగ్రత్తగా ఉండాలి. నువ్వేమీ పనిచెప్పకపోతే నిన్ను తినేస్తా డన్నాట్ట. సరే పని చెప్పక పోవటానికేం! బోల్డన్ని పనులున్నాయని వాడు ఆ మంత్రం జపం చేసాట్ట. రాక్షసుడు ప్రత్యక్షమయ్యి, ''నేను రాక్షసుణ్ణి నాకేదన్నా పనిచెప్పు అన్నాట్ట. చెప్పకపోతే 'ఆ' అని నోరు తెరచాట్ట. అనేటప్పటికి మా యింట్లో తోటలు, దొడ్లు అన్నీ కావాలి అన్నాట్ట. అవిగో చూడు ఉన్నాయి అన్నాట్ట. వీడు వెళ్ళి వెయ్యలేదు. వాడు చూపించేటప్పటికి ఉన్నాయి. వాడు వీణ్ణి మోసం చేస్తున్నాడు. కనికట్టు తప్ప ఏమీ లేదక్కడ. నాభార్యకి ఒంటినిండా నగలు కావాలి అన్నాట్ట. అదిగో ఉన్నాయి చూసుకో అన్నాట్ట. ఉన్నాయి అక్కడ. ఆ ఇంకేం పని చెబుతావు అన్నాట్ట. ఇంకేం పని చెబుతాడు? మా యింటికి కప్పులన్నీ బంగారంతో వేయించు అన్నాట్ట. అవిగో చూడు ఉన్నాయి అన్నాట్ట. ఇంకేం చెబుతావు? లేకపోతే చంపేస్తాను అన్నాడు. వాడికి మతిపోయి పర్వతం ఒకటి అక్కడ పెట్టు అన్నాట్ట. అదిగో ఉంది చూడు. ఇంకేం చెబుతావు అన్నాట్ట. వీడు అక్కడికి వెళ్ళటం లేదు. అలాంటివి అన్నమాట కీర్తిగాని, ఆస్తిగాని, పేరుగాని, ప్రతిష్ఠలు గాని, మహిమలు గాని యిట్లాంటివన్నీ. వాటంతటు అవి వచ్చినపుడు వారు మహనీయులైనటు వంటివాళ్ళు, వాళ్ళద్వారా వ్యక్తం అవుతాయి ఈ శక్తులన్నీ. అవి వేరు. వాటికోసం ప్రయత్నించినవాడు నానా గడ్డితిని, అగచాట్లు పడి, చాల నీచమైన చావు చచ్చిపోతాడు. అందుకని జాగ్రత్తగా ఉండాలి.

యోగాభ్యాసంలో ఇక్కడిదాక ఒక మెట్టు. తరువాత ఒక్కొక్క మెట్టు (step by setp) లో తీసుకొచ్చి ఇక్కడ చివరి స్టెప్‌లో ఏం చెబుతున్నాడు? దేనికోసమూ కాకుండా ప్రాక్టీసు చెయ్యి అన్నాడు. అది ఈ సూత్రానికి అర్థం. దేనికోసమూ కాకుండా ప్రాక్టీసు చెయ్యడం ఏమిటి? నీకోసం చేస్తే పనికిరాదన్నాడు. దేనికోసమూ కాకుండా చేస్తే నాకోసం పనికొస్తుందన్నారు కాబట్టి చేస్తున్నాను అన్నప్పటికీ, అది నీకోసం అని ఉంది కాబట్టి పనికి రాదు. అది యిక్కడ చెప్పిన పాయింట్. నాకు వాక్సిద్ధి రావాలన్నాడుట యోగాభ్యాసం చేస్తూ. అంటే అన్నదల్లా అయిపోవాలని. తర్వాత అరణ్యాల్లోకి తపస్సు

చేయడానికి వెళుతూంటే అమ్మవారి ఆలయం కనిపించింది. అక్కడ కత్తి, రాయి ఉన్నాయి. ఈ రాయిమీద తలపెట్టి ఆ కత్తితో ఎవడి తల వాడు నరుక్కున్న వాడికి నిజంగా తల అంటుకొని వాక్సిద్ధి వస్తుంది అని రాసి ఉందిట. బాగుందని అనుకున్నాడు. తీసిచూసి ఇది నిజమేనా? అనుకున్నాడు. ఒకవేళ నిజం కాకపోతే తల వెళ్ళిపోతుంది. వెనక్కి తిరిగి వచ్చేసాడుట. ఏదో కొంత సాధన చేసేటప్పటికి నమ్మకం వచ్చి తల తీసేద్దామని చూసేటప్పటికి యింకో ప్రక్కన ''ఎవడైతే ప్రాణభీతి లేకుండా అమ్మవారి కోసం సమర్పణ బుద్ధితో తల ఇస్తాడో, వాడి తలే మళ్ళీ అంటుకుంటుంది గాని, ఇంకొకడి తల అంటుకోదు'' అని రాసి వుందిట. మళ్ళీ వెళ్ళి చూసేటప్పటికి మూడో ప్రక్కన యింకోటి రాసి ఉంది. తన తలకాయ తనకి అతుక్కుంటుందనే నమ్మకంతో ఎవడైతే నరుక్కున్నాడో, వాడికి అతుక్కోదు. తలకాయ పోతే పోనీ అని రెడీ అయినటువంటి వాడికే. మళ్ళీ అనుమానం వచ్చింది. మళ్ళీ యింటికి వచ్చాడు. మళ్ళీ ఆర్నెల్లు ఆగి, మనకి పూర్తిగా నమ్మకం ఉంది అని నరుక్కుందామని వెళితే, యింకో ప్రక్కని ఇంకోటి కనిపించింది. అలా నరుక్కున్న వాళ్ళకి కూడ తలకాయ ఒక్కొక్కపుడు అతుక్కోకపోవచ్చు. ఇంటికి వచ్చేసాడు. ఎందుకొచ్చింది శుభ్రంగా భోంచేస్తూ కూర్చున్నాడు. అలా ఉంటుంది. ఈ వ్యవహారమంతా కూడను. తలకాయ పోతే పోయిందనుకున్న వాడికి తప్పకుండా అతుక్కుంటుంది కాబట్టి, పోతే పోనీ అనుకున్నాడు గాని, అలా అనుకున్నా కూడ అతుక్కోక పోవచ్చు అనేటప్పటికి తిరిగి యింటికి వచ్చేశాడు. చిత్తశుద్ధి లేనివాడు. చిత్తశుద్ధి అంటే చిత్తంయొక్క శుద్ధి. అందుకని యిక్కడ ఏం చెబుతున్నాడంటే ''బహిర కల్పితం'' అంటే **non-objectivised** సంయమం చేయాలి. సంయమం దేనికోసం చేస్తున్నారనేది అక్కర్లేదు. సంయమం చేస్తూ ఉండండి. రామకోటి లాభంకోసం రాస్తున్నవాళ్ళు మానేయచ్చు. లాభం ఉండదు దానివల్ల. అందుకనే ఈ యోగాభ్యాసం చేస్తే మాకేం వస్తుంది అని అడిగాడు మాస్టర్ కుతుహుమిని శిష్యుడిగా చేరుతున్న A.P. Sinnet అనే ఆయన. ఆయన ఏమీరాదు. ఉన్న వేమన్నా కొన్ని పోవటం కోసంగాని, ఏమీ రావటం కోసం కాదు. రావటం కోసం అయితే వ్యాపారం పెట్టుకో అన్నారు. వ్యాపారం పెట్టుకొని, బియ్యంలో బెడ్డలు కలుపుకొని అమ్ముకోవాలి. ఏమన్నా రావటంకోసం అయితే. ఇది పోవటం కోసం కాబట్టి రానక్కర్లేదు నాయనా అన్నాడు. వాడు సర్దుకొని తర్వాత

వచ్చాడు అనుకోండి. ఇట్లాంటి తాపులు చాల తిన్నాడు. A.P. Sinnet. అందుకని యోగాభ్యాసం దేనికి అంటే ఏమీ రావటానికి కాదు. ఉన్న వాట్లల్లో మనకి ఉండకూడనివి పోవటానికి ''కపాలిన్ భిక్షోమే హృదయ కపి మత్యంత చపలం'' శంకరాచార్యుల వారు చెప్పారు. యోగాభ్యాసం ఎందుకు అనేటువంటి దానికి. ''సదా మోహాట వ్యాం చరతి'' మోహం అనే అరణ్యంలో తిరుగుతూ ఉంటుంది. ఊరికే, కొమ్మమీంచి కొమ్మ మీదకి ఈ మనస్సనే కోతి ఎగురుతూ ఉంటుంది. సాహిత్యం మీంచి కామర్స్ మీదకి, దానిమీంచి సైన్సు మీదకి ఇలా దీనిమీంచి దాని మీదకి, దానిమీంచి దీనిమీదకి అలా వెడుతూ ఉంటుంది. ఈ మనస్సనే కోతి. అందుకనే ఓ 'కపాలి' పుర్రె పుచ్చుకొని రోజూ భక్తులను ఆడుక్కుంటున్నాట్ట. భిక్షాటనం చేయటం నీకెలాగూ తప్పదు కనుక శివుణ్ణే అన్నాడు శంకరాచార్యులవారు, ఉట్టి పుర్రె పుచ్చుకొని అడుక్కుంటూ వెళ్ళే బదులు ఈ నా కోతిని కూడా పట్టికెళ్ళరాదా? అన్నాడు. నీకు వసూళ్ళు ఎక్కువ అవుతాయి. నాకు చికాకు లేకుండా ఉంటుంది అని. ఉట్టి ముష్టివాడికేసిన కన్నా కోతిని తెచ్చిన ముష్టివాడికి-కోతికి కాసిని, వీడికి కాసిని వేస్తారు. అంటే అర్థం ఏమిటి? నా మనస్సుని నువ్వు పట్టుకెళ్ళు అని. ''కపాలిన్ భిక్షోమే హృదయ కపి మత్యంత చపలం'' హృదయం అనే కపి ఉన్నదే అది అత్యంత చపలత్వము కలది. దీని మీంచి దాని మీదకి, దానిమీంచి దీని మీదకి వెళుతూాందంటే ఏం చేయాలో చెప్పాడు అక్కడ. సమర్పణం చేయాలి. ఏదన్నా కావాలి అని నువ్వు అనుకున్నా వంటే నీ మెడకి తాడు వేసి కుక్కల్లే లాక్కెళ్ళిపోతుంది నువ్వు పెట్టుకున్న ఆదర్శం అన్నాడు. కనుక నీ ఆదర్శం యజమానై నువ్వు దానికి కుక్కవై దాని వెనుక నడవాల్సి ఉంటుంది. ఆ ధర్మాల కోసం నిద్రాహారాలు లేకుండా చావకూడదు. దేశాని కేదన్నా ఉపయోగించి పదికాలాలపాటు పనికొచ్చినటువంటి వాడు కావాలి గాని బలి గిలి అయిపోయిన వాళ్ళు అక్కర్లేదు యిక్కడ. Negative virtues అక్కర్లేదు. Positive virtues కావాలి. అది యిక్కడ చెప్పిన సాధన.

బహిర కల్పితమైన పద్ధతిచేస్తే ''తతః ప్రకాశ ఆవరణ క్షయః'' ప్రకాశం మిగిలి ప్రకాశంయొక్క ఆవరణం పోతుంది. అనగా దీపం ఉన్నది. దీపానికి ఏం ఉన్నది? glass ఉన్నది. కనుక లాంతరు చిమ్నీలోంచి దీపం చూట్టమే మన కలవాటు. బల్బు ఉన్నది. బల్బులోంచి వెలుతురు చూట్టమే

మన కలవాటు. కనుక వెలుతురును దేంట్లోంచో, ఒక దాంట్లోంచి చూట్టమే మన కలవాటు గాని, యివన్నీ తొలగింపబడిన వెలుతురు ఉంటుంది అపుడు అన్నాడు. అంటే అర్థం ఏమిటి? నీ తెలివితేటలు వ్యాపారం మీద, అదివరకు ఉద్యోగం మీద చూసుకున్నావు. నీపై వాడు ఎపుడు రిటైరు అవుతాడు, లేకపోతే ఎపుడు చనిపోతాడు. నువ్వు కాగితం ఎపుడు పెట్టాలి అనే విషయాలపై జాగ్రత్తగా ఉన్నావు. నిద్రాహారాలు లేకుండా. లేకపోతే ఎవర్ని పట్టుకుంటే పని అవుతుంది అని. నీ తెలివితేటలు వీటన్నింటి యందు ఉపయోగించావు బల్బులోంచి వచ్చే వెలుగులాగ, నీ తెలివితేటలు నువ్వు పెట్టిన దాంట్లోంచి యివతలకి వస్తున్నాయి. ఇవి నీ తెలివితేటలు వినియోగించటం (applied) తప్ప, నీ తెలివితేటలు తెలివితేటలుగా రాలేదు. ఇపుడు మనం యిందులో చూస్తున్న వెలుతురు దాని ఆకారమైన వెలుతురుగాని, వెలుతురు కాదు. బల్బు ఆకారమైన వెలుతురు గాని, వెలుతురు కాదు. ఇలాగ మనం చూస్తున్న వెలుతురు అంతా కూడ వాటి మధ్యమముల (mediums) లోంచి condition చేయబడిన వెలుతురు. అలాగే మన శరీరము, మనో, బుద్ధి, అహంకారాలు, మన సైకాలజీ, వ్యక్తిగత స్వభావము (Individual nature) అంటారు. వాడి స్వభావం వాడి తరహా, అంటాం చూడండి దాంట్లోంచి ఎగుడు దిగుడుగా వంకరటింకరలుగా తిరిగి యివతలికి వచ్చిన వెలుతురునే మనం ఎరుగుదుము గాని, మన లోపల ఉన్న అసలైన వెలుతురుని మనం ఎరగం. ప్రతి ఒక్కడికి ఒక్కొక్క స్వభావము ఒక్కొక్క తరహా అని ఉంటుంది. అదొక్కటే మనకి తెలుసును. మన స్వభావం మనకి తెలిస్తే మహా అయితే అదొక్కటే తెలుసును. స్వభావానికి వెనుక ఉన్న మనని గురించి మనం ఎరగం. అదీ వెలుగంటే. కనుక ఆవరణం తొలగి వెలుతురు మిగుల్తుంది అన్నాడు. ఆవరణం లేకుండా అంటే చుట్టూ అడ్డం లేకుండా వెలుతురు ఉంటే ఎలా ఉంటుంది? ఉదాహరణకి సూర్యుడు. వాడి చుట్టూ ఒక డబ్బా పెడితే సూర్యుడికి కూడ అజ్ఞానం అనే ఆవరణ ఉన్నది. కంట్లోంచి చూడటం మాత్రమే మనకు సాధ్యం తప్ప, సూర్యుడు ఎట్లా ఉన్నాడో, మనకి తెలీదు. అందుకనే మన కన్ను గుండ్రంగా ఉన్నది కనుక సూర్యుడు కూడ చెంబులాగ గుండ్రంగా ఉన్నట్లు కనిపిస్తాడు. కన్నులో ఉన్న గుడ్డితనం తప్ప, సూర్యుడికి ఆ ఆకారం లేదు. సూర్యుడికి ఉట్టి అస్తిత్వమే ఉన్నది. కనుక సూర్యుడు కూడ ఆ వెలుతురుకి అతీతమైన స్థితిలో ఎలా ఉంటాడో అలా ఉండాలి. అప్పుడు

నువ్వు కూడ అలాగే ఉంటావు. అంటే ఆ స్థితిలో నువ్వు ఉండటం మొదలు పెట్టేటప్పటికి నీకు ప్రపంచంలో ఉన్న నీ స్నేహితులు, నీ భార్య, పిల్లలు ఎరిగున్న స్వభావం ఉన్నది చూడండి, ఆ స్వభావంలో బయటవాళ్ళకి ఏమీ మార్పు కన్పించదు. మీలో మాత్రం ఆ స్వభావం ఉండదు. నీకొక స్వభావం అంటూ అసలు ఉండటం మానేస్తుంది. కాని నీ మిత్రులందరికీ నీ స్వభావం ఉన్నట్లు కనిపిస్తుంది. ఎంచేత? ఎవడు వచ్చినపుడు వాడి స్వభావం పనిచేస్తూ ఉంటుంది. నీ స్వభావం ఉండదు. అద్దంలాగ తయారవుతావు, అది వరకు నీ స్వభావంతో మాట్లాడేవాడివి ఎవడు వచ్చినా గాని. కాని యిపుడు ఎవడు వచ్చినా వాడి స్వభావం పనిచేస్తుంది. ఫలానావాడు మహానుభావుడండి అని ఒకడు అంటాడు. ఫలానా వాడు లౌక్యుడని యింకొక డంటాడు. ఇలా అనేకమంది అనేక రకాలుగా అంటారు. భారతంలో కృష్ణుణ్ణి గురించి ఎలా అనుకున్నారో అలా అనుకుంటారు. ఎందుకని? భారతంలో కృష్ణుడికి స్వభావం అంటూ లేదు. కాని వాడి దగ్గరికి ఎవడు వస్తే వాడి స్వభావంతో కృష్ణుడు మాట్లాడటం జరిగేది. కృష్ణుడు మాట్లాడేవాడు కాదు. అవతలివాడు వాడికేం కావాలో మాట్లాడించుకునే వాడు. అంతే. భారతం జాగ్రత్తగా చదువుకుంటే మనకి తెలుస్తుంది. దుర్యోధనుడు, ధృతరాష్ట్రుడు, భీష్ముడు, ధర్మరాజు, భీముడు... యిలా, ఎవరు ఎరిగి ఉన్న కృష్ణుడు వాడికి వేరు. ఎందుకంటే వీడి మొహమే కదా ఆ అద్దంలో కనిపించేది. ఏ ఒక్కడు ఎరిగి ఉన్న కృష్ణుడు రెండవ వాడికి తెలీదు. మహాభారతం మీరు జాగ్రత్తగా చదివితే మనకి తెలిసేది అది. ప్రతివాడు కృష్ణుణ్ణి ఎరుగుదును అనే అనుకున్నారు. వెర్రివాళ్ళు! వ్యాసుడు, భీష్ముడు హెచ్చరిక చేసారు. భీష్ముడు అంపశయ్య మీద ఉన్నపుడు అందరం ఎరుగుదుము అనుకున్నాం. ఎవరికీ తెలీదు అక్కడున్న దేమిటో. ఎరిగి ఉన్నది మన బొమ్మ వాడిలో చూసిందిని, అంపశయ్యమీద పడుకొని దణ్ణం పెట్టాడు భీష్ముడు. అంపశయ్యమీద చెప్పినటువంటి స్తవరాజంలో ఉన్నది. వ్యాసుడు కూడ అదే అన్నాడు. మనం ఎరుగుదుము అనుకొని వాడివంక చూస్తూ ఉంటాం. దాని వెనుక ఉన్న విషయం మనకి తెలిసిందేమీ లేదు. ఎందుకంటే మనం ఎరిగి ఉంటానికి అక్కడేమన్నా ఉంటే కదా అన్నాడు. ఒక మనస్సు, ఒక స్వభావము యిట్లాంటి దేమన్నా ఉంటే కదా. ఒక శరీరం ఉన్నది, అంతే. దాంట్లో ప్రాణం ఉన్నది. మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం, యిట్లాంటివన్నీ ఉన్నాయి. అంటే

instruments అన్నీ ఉన్నాయి. దాంట్లోంచి సూర్యరశ్మి ప్రసరించినట్లుగా యివతలికి మాట్లాడుతున్నాడు. వాడికి స్వభావం లేదు. అని తెలియదు. దానికి సాధన యిక్కడ యిస్తున్నాడు. వీడి స్వభావం ఉండకుండా పోతుంది. అయితే ఆ సాధనలో చరిత్ర మొత్తంమీద మనం ఎరిగి ఉన్న లక్షణాలు ఒక్క కృష్ణావతారంలోనే కన్పిస్తాయి. అంటే పరిపూర్ణత్వము (perfection) వచ్చినటు వంటిది, తనకి individual character అంటూ లేనిది కృష్ణావతారం ఒక్కటే. ఇది ఈ సూత్రానికి సంబంధించినటు వంటిది.

అంటే మీరు అనే వెలుగుకి ఆవరణలు తొలగిపోతాయి. వెలుగు కనిపించదు. నిజమైన, సరియైన తెలివితేటలుండి స్వాభావికంగా పరిపూర్ణమైన వాడు, మళ్ళీ మామూలుగా ప్రవర్తిస్తూ ఉంటాడు. ''బాలోన్మత్త పిశాచవత్'' అన్నాడు భాగవతంలో. ఆ భరతుడనే రాజు నడిచి వెడుతూంటే వీడెవడో బచ్చాగాడు అనుకున్నారు తెలీదు కదా. పొలంలో పనిచేస్తూ ఉంటాడు. వాడి సవతి తమ్ములు, సవతి తల్లి కలిసి మాడిపోయిన అన్నం పెట్టేవాళ్ళు. తినేసేవాడు. వాళ్ళు మంచి అన్నంతిని, వీడికి మాడిపోయిన అన్నం పెట్టేవాళ్ళు. తన స్వభావమే గనుక ఉంటే ఎంత ఏడవవలసి ఉంటుంది. ఇంతపని చేస్తారా, వీళ్ళు. మా నాయన లేడు గనుక, మా నాయన రెండో పెళ్ళి చేసుకొని, ఆ పిల్లల్ని కని యిలా చచ్చాడు గనుక అని ఏడవాల్సిందే కదా. ఆ మాడిపోయిన అన్నం నచ్చితే తిన్నాడు. లేకపోతే అవతల పారేసాడు. వెళ్ళి పొలంలో పని చేయమంటే చేస్తున్నాడు. తిట్టేవాళ్ళు నీకు బుద్ధి లేదు. నీకు తెలివితేటలు లేవు అని తిడితే ఆ తిట్టిన వాడికి సంబంధించినది గాని, నీకు సంబంధించినది ఎట్లా అవుతుంది? మామూలుగా ఇది తెలియని విషయం ప్రపంచంలో ఒకణ్ణి ఇంకోకడు తిడితే అది ఎవరికి సంబంధించినది? తిట్టిన వాడికి సంబంధించినది గాని ఎవణ్ణి తిట్టారో వాడికి సంబంధించినది కాదు. ఇది సామాన్యంగా ప్రపంచంలో వేయి మందిలో 990 మంది తెలుసుకోలేరు. అందుచేతనే తిట్టింది అవతలి వాడైతే, బాధపడేది యివతలి వాడవుతాడు. తిట్టినవాడు తిట్టేసి, వెళ్ళిపోయి భోంచేసి పడుకుంటాడు హాయిగా. వీడు తిట్టాడు, తిట్టాడు అని రాత్రి తెల్లవార్లు నిద్రపాడు చేసుకొంటాడు అడ్డగాడిదల్లే. తెల్లారాక కళ్ళు ఎర్రగా ఉంటాయి. తిట్టింది వాడు. బాధపడింది వీడు. ఆమాత్రం commonsense లేదనేది తెలియటం చాల కష్టం. ఇవన్నీ సర్దుకుంటాయి. ఇక్కడ చెప్పిన సాధనలో. కనుక అదీ 'బహిర కల్పితా' అనే

ాత్రంయొక్క పరిథి (purview). వాడు చాలా మామూలుగా స్వాభావికమైన ద్ధతిలో ఉంటాడు. మీరు పలకరిస్తే పలుకుతాడు. నవ్విస్తే నవ్వుతాడు. ీరేదన్నా కావ్యాన్ని గురించి మాట్లాడితే వాడు కావ్యాన్ని గురించి ాట్లాడతాడు. మీరు శాస్త్రాన్ని గురించి మాట్లాడితే శాస్త్రాన్ని గురించి ాట్లాడతాడు. మీరు దేవుణ్ణి గురించి మాట్లాడితే దేవుణ్ణి గురించి ాట్లాడతాడు. మీరు నాస్తికత్వాన్ని గురించి మాట్లాడితే వాడు నాస్తికత్వాన్ని ురించి మాట్లాడతాడు. మీరేదన్నా దెబ్బలాటకి దిగితే వాడు దెబ్బలాటకి గి మెత్తగా తంతాడు అంతే. ఒకటో రెండో దెబ్బలు యిస్తాడు. దాంతో మెడ రిగిపోతుంది యివతలి వాడికి. ఇంక తర్వాత మళ్ళీ మామూలుగానే ంటాడు. నెప్పెట్టింది అంటే ఆస్పత్రికి మళ్ళీ వాడే తీసికెళ్తాడు. ఇదీ వాడి ద్ధతి. వాడికై స్వభావం ఉండదు. అవతలి వాణ్ణి బట్టి ప్రవర్తిస్తున్నాడు. ెట్టబోయే టప్పటికి వాయించాడు. వాయించేటప్పటికి బాబోయ్ మెడ ొప్పిగా ఉంది. అయితే ఆస్పత్రికి తీసికెళ్తారా అన్నాడు. వాడి డబ్బులు పెట్టే ీసికెళ్ళాడు. ఎంచేత వాడికి డబ్బులమీద విలువలేదు. డబ్బుకంటే మనిషి ిలువ అని తెలుసు. కనుక యిలా ఉంటుంది వాడి స్వభావం. ఇలా ూరిపోతాడు. అందుకని వాడికొక స్వభావం ఉండదు. ఎదుటివాడి స్వభావాన్ని ట్టి ప్రవర్తిస్తూ ఉంటాడు. ఎలా ప్రవర్తించాలో అలా ప్రవర్తిస్తూ ఉంటాడు. దికూడ ప్రయత్నం మీద ఉండదు. అప్రయత్నంగా ఉంటుంది. అవతలివాడి ాగ్యం వాడి ప్రవర్తన (behaviour), వాడి వాడి దుష్ప్రవర్తన (misbehaviour) ాన్నిబట్టి ఉంటుంది. దీనివలన 'ప్రకాశ ఆవరణ క్షయః' మనకి ప్రకాశానికి ఉన్నటువంటి ఆవరణం నశిస్తుంది.

ప్రతివాడిలోను ఉన్నటువంటి నేను అనే తెలివితేటలకి ప్రజ్ఞకి ప్రకాశము ెదడు (brain) అంటే ఏదన్నా పనిచేస్తూ ఉంటే కర్త, కర్మ, క్రియ ఇది ఆవరణము. ఇందులోంచి వస్తోంది లైటు అంతేకదా. అన్నం తినటంలో అన్నం తినేవాడు వేరు. తినబడే అన్నం వేరు. తినటం అనేటువంటి పనివేరు. ఈ మూడు లేకపోతే అన్నం తినలేము. పస్తేకదా, ఈ మూడింటిలో ఏది ేకపోయినా. అలాగే చదవటం. చదవబడే పుస్తకం, చదివేవాడు. ఈ మూడు ేకపోతే చదవలేడు, పరీక్ష పాసవ్వలేడు. మీరే పనైనా చూడండి. మూడు ంటాయి. కనుక ఈ త్రికోణాకారమైన బల్బులోంచి ఈ నేను అనే వెలుగు ేతి అల్లే బయటికి వస్తోంది మనందరి లోంచి. సరిగ్గా రావలసిన పద్ధతిలో

రావటం లేదు. వస్తే ప్రతిబింబం (reflection) వస్తుంది. అందుకనే బ్లావెట్స్కీ Isis unvield లో చెప్పింది Nature is a triangular lock and man is the triangular key that can unlock it. మీరు చూసుకోవచ్చు. ప్రకృతి త్రికోణాత్మకము త్రికోణాకారము అయిన ఒక తాళం. ఆ పెట్టెలో కావలసినవి అన్నీ ఉన్నాయి. తాళం వేసి ఉంది. తాళం చెవి ఎక్కడ అంటే నీవే అన్నది. త్రికోణాత్మకమైన తాళం చెవి. అలాగే దీనిచుట్టూ ఇంకొకటి ఉన్నది. ఇది బద్దలు కొట్టాం అనుకోండి. ఇది బద్దలుకొడితే ఏం వస్తుంది. ఈ మూడు ఉండకుండా ఒకే ఒక స్థితి వస్తుంది. అంటే మొట్టమొదటిలో ఈ స్థితిని రెండుచోట్ల మనం విడిచేటప్పటికి ఈ మూడు వచ్చినాయి. మళ్ళీ విడవకుండా అఖండ స్థితి, ఈ మూడు కలిసిన స్థితి మనకి వస్తుంది. అపుడు యింకా సత్త్వము, రజస్సు, తమస్సు అనేటువంటి ఒక బల్బు ఉన్నది. ఈ బల్బు లోపల ఆ బల్బు ఉన్నది అంటే రెండు బల్బుల్లోంచి refraction అయ్యి వస్తున్న వెలుగు మనం చూస్తున్నది. అదికూడ బద్దలుకొట్టాక వర్తమాన కాలము, భూతకాలము, భవిష్యత్కాలము అనే మూడు అబద్ధాల విభాగాలు ఉన్నాయి. అంటే అక్కడేం లేదు. మనం విభాగం చేసుకుంటున్నాము. కనుక ఈ బల్బులోంచి కూడ దూరి వస్తూన్నది. అంటే ఎన్నింటిలోంచి కిరణములు వక్రీకరణము పొందినటువంటి light మనం చూస్తూ ఉన్నది? ఇన్ని ఆవరణలు ఛేదించాలి. అది చెబుతున్నారు యిక్కడ. ఇన్ని ఆవరణలు క్షయం అంటే ఛేదించినపుడు ఎలా ఉంటుంది? light ఈ ఆకారంలో ఉండదు కదా. చుక్కల్లే ఉంటుందా? అది ఉండదు. అదీ ఆవరణే కదా. ఎలా ఉంటుంది? ఈ బోర్డు మీద light ఉండాలంటే బోర్డులాగే ఉండాలి. ఇంకోలా ఉండదు. ఆవరణ లేకపోతే పైన చోటులో లైటు ఉంటే ఎలా ఉంటుంది? చోటులాగే ఉంటుంది. మనం ఆకాశమని అంటున్నామే నీలంగా ఉందని అది ఆవరణ లేనటువంటి వెలుగు. మన గుడ్డి కంటికి నీలంగా కన్పిస్తూన్నది. ఎందుకంటే మన కన్ను అంతకంటే చూడగలిగినది కాదు. మనం ఎరిగి ఉన్న వెలుతురు కంటి ద్వారానే కదా. కంటికంటే అవతల ఉన్నటువంటి mental light మొదలైనవి ఉన్నాయి కదా. వాటన్నింటిలో ఆవరణము లేనటువంటి వెలుగు. సూర్యుడు కూడా యింకా ఆవరణ ఉన్న వెలుగే. ఆవరణలేని వెలుగు ఆకాశంలాగ ఉంటుంది. వాడి మనస్సు కూడ ఆకాశం లాగే ఉంటుంది. అది సాధించిన వాడికి ఎదుటివాళ్ళ స్వభావాలంటూ ఉంటాయిగాని వాడి స్వభావం అంటూ ఉండదు. ఆ స్థితి వస్తుంది.

## 45. స్థూలస్వరూప సూక్ష్మాన్వయార్థవత్త్వ సంయమాద్భూతజయః

స్థూల = స్థూలము, స్వరూప = స్వరూపము, సూక్ష్మ = సూక్ష్మము, అన్వయము = పై మూడింటి పరస్పర సంబంధము, అర్థవత్త్వము = ప్రయోజనము కలిగినది, సంయమాత్ = సంయమము చేయుట వలన, భూత జయః = పంచ భూతముల మీద జయం వస్తుంది.

స్థూలము, స్వరూపము, సూక్ష్మము, అన్వయము ప్రయోజనము అను అయిందిటిపై సంయమము చేయుటవలన పంచభూతములపై స్వామిత్వము కలుగును. (స్థూలమనగా ఇంద్రియములకు గోచరించునది. స్వరూపమనగా ఆ గోచరించిన దానిని గుర్తింపజేయునది. ఇంద్రియములకు గోచరించు బొమ్మలను బట్టి ఈమె నా భార్య మున్నగునవి గుర్తించుచున్నారు కదా. ఇక సూక్ష్మము అనగా చూచువానిలో నున్న శబ్దాది గుణములు, అన్వయ మనగా కార్యకారణ సంబంధము.)

**వివరణ :** స్థూలము, స్వరూపము, సూక్ష్మము, పరస్పర సంబంధము, ప్రయోజనముల మీద సంయమం చేయము చేస్తే ''భూత జయః'' భూతములంటే పంచభూతముల మీద స్వామిత్వము వస్తుంది, జయం వస్తుంది. ఎలా చేస్తే వస్తుంది. స్థూలంమీద ధ్యానం చేయమన్నాడు. స్థూలం అంటే ఏమిటి. చేతికి బోర్డు, బోర్డుకి చెయ్యి, కంటికి బోర్డు రంగు, బోర్డు రంగుకి కన్ను, కంటికి బోర్డు ఆకారం, బోర్డు ఆకారానికి కన్ను, తగలటం స్థూలం. బోర్డుమీద చాక్‌పీసు రంగు తగలటం, చాక్‌పీసు రంగుమీద కన్ను తగలటం స్థూలం. ఇవి స్థూలం అంటే. ఇట్లాంటివి ఒక బోర్డు తీసుకుంటే దాదాపు ఒక నాలుగైదు వేల విషయాలుంటాయి. అలాగే ప్రతి దానికిని. బోర్డుకి ఒక నాలుగైదు వేల విషయాలు, పుస్తకానికి రెండు మూడు వేల విషయాలు, పుస్తకం తెరిస్తే పేజీకి ఒక పది పన్నెండువేల విషయాలు ఉంటాయి. అవన్నీ ఏకకాలంలో పనిచేస్తున్నాయి కనుక అవి ఉన్నట్లు మనకి తెలీదు. అంటే మనం ఒకళ్ళమే చదువుకుంటున్నాం కామోసు అనుకుంటాం. Simultaneous working actions తెలుసుకుంటానికి కావలసిన సంస్కారం (culture) మనకి లేకపోవటంవల్ల, ఏదో ఉన్నదే సంస్కారం అనుకుంటున్నాం.

ఇపుడు స్థూలం అంటే gross. స్థూలం తర్వాత 'స్వరూపం'. ఇది బోర్డు. బోర్డు మనం చూస్తున్న గుడ్డకి రూపం. స్థూలం రూపంకాక స్వరూపం ఒకటి ఉంటుంది. అది మనం తెలుసుకోవాలి. ఈ analysis రానిదే ఏం లాభంలేదు. స్వరూపం అంటే ఏమిటి? బోర్డు దేనితో చేయబడ్డది. తీస్తే పేడు వస్తుంది. పేళ్ళతో చేయబడెను. కనుక బోర్డు అని మనం పేరు పెట్టినది అబద్ధం స్థూలం. పేళ్ళు దేనితో చేయబడినవి. చెట్టు కర్రతో చేయబడ్డాయి. కనుక పేళ్ళు అని మనం పేరు పెట్టినది అబద్ధం. చెట్టు, కర్ర మాత్రమే నిజం. చెట్టుకర్ర దేనితో చేయబడింది. అందులో కొన్ని రసాయనిక పదార్థాలు. రసాయనిక పదార్థాలు కణములుతో, కణములు అణువులుతో (molecules), అణువులు పరమాణువులతో (atoms). అవి అందులో ఉన్న సూక్ష్మ పరమాణువులు, electrons, protons and neutrons మొదలైన వాటితో చేయబడ్డాయి. అవి మళ్ళీ మహాశక్తితో చేయబడ్డాయి. మహాశక్తి శక్తిమయ తరంగములతో చేయబడ్డాయి. ఆ శక్తి తరంగములు మహా చైతన్యంతోను, మహా చైతన్యం చోటుతోను చేయబడ్డాయి. చోటు అని చెప్పబడే ఒకానొకడు ఉంటున్నాడు. వాడు అంతర్యామి. వాడితో చేయబడ్డాయి యివన్నీ. దాంట్లోంచి ఇవన్నీ వచ్చినాయి. కనుక దాన్ని స్వరూపం అంటారు. కనుక స్థూలం కాకుండా స్వరూపం. అంటే పైన పృథివి ఉంది అనుకోండి. అంటే ఘన పదార్థము. దానికి సంబంధించిన పృథివి స్వరూపం ఒకటి ఉంటుంది. అంటే మనకి కనిపించే బోర్డుకాక ఈ బోర్డు నిలబడ్డానికి దీంట్లో ఇంకొక శక్తిమయమైన బోర్డు ఉంటుంది. దాన్నే అధిదేవత లేక అధిష్ఠాన దేవత అంటారు ప్రాచీన శాస్త్రజ్ఞులు. అధిదేవత లేకుండ ఏ వస్తువు ఉండదు సృష్టిలో. అయితే ఈ బోర్డు నిలబడ్డానికి కావలసిన సూక్ష్మ స్వరూపమైన బోర్డు లోపల ఉంటోందే అది ఎలా ఏర్పాటైంది. బోర్డు తయారుచేసిన వాడి మనస్సులో ప్రాణ ప్రతిష్ఠ చేయబడ్డది. వాడి మనస్సులో కల్పించి సృష్టించి ప్రాణ ప్రతిష్ఠ చేయగా దానియందు మనం చూస్తున్న బోర్డు నిలబడి ఉన్నదిగాని, దానంతట అది ఉండదు ఎక్కడా ప్రకృతిలో. ఎక్కడైనా ఏ చెట్టుమీద నించైనా బోర్డు అని పడుతుందా లేక పైనించి క్రిందకి కుర్చీ పడుతుందా? ఏ చెట్టు అయినా కుర్చీ కాస్తుందా? కర్ర చెట్టుదే, అభ్యంతరం

లేదు. కనుక కుర్చీ అనే అభిప్రాయం ఒకానొక శిల్పిచే సంకల్పింపబడి స్థాపింపబడి ఒక చెట్టు కర్రయందు ప్రతిష్ఠింపబడెను. కనుక కుర్చీ అనేది మనం చూస్తూన్న కుర్చీకాక, దీని లోపల ఈ కుర్చీ నిలబడటానికి కారణభూతమైన స్వరూపమైనటువంటి కుర్చీ యింకొకటి ఉన్నది, మనకి తెలియాలి మెల్లిగా. ధ్యానం యిక్కడ చేయండి అన్నాడు. కనుక పృథివి, పృథివికి solid background, కనిపించని solids ఉంటాయి. అంటే solid consciousness, liquid కి liquid consciousness ఎలా తెలుస్తుంది? తొట్లో నీళ్ళుపోసి పెడితే horizontal గానే ఉంటాయి. వాటికి ఎలా తెలుసు? మీరు వంకరగా పెట్టుకున్నా తొట్టెనీళ్ళు horizontal గానే ఉంటాయి. అది తర్వాతపోస్తే ఎత్తునించి పల్లానికే ప్రవహిస్తుంది. ఎలా తెలుసు? భూమ్యాకర్షణ వలన అంటారు. భూమ్యాకర్షణ వలన అయితే ఒక నాపరాయి అక్కడ పెట్టండి. ఎందుకు రాదు. అందుకని మనం చెప్పే భూమ్యాకర్షణ థీరీ 50% యే రైటు. మిగతా 50% న్నూ మనకి కన్ను యింకా తెరచుకోలేదు. అంటే ఒక కన్ను పొడుచుకొని ఒక కన్ను ఉంచుకున్నారు. నీళ్ళు ఎందుకు ప్రవహిస్తాయి పైనించి క్రిందకి. అంటే gravitation అంటాం. Gravitation అయితే horizontal గా ఎందుకు పడటం లేదు క్రిందకి. Horizontality అనగా not known. అందుకని పృథివికి పృథివి అధిదేవత ఉంటుంది. జలమునకు జలము అధిదేవత ఉంటుంది. అగ్నికి అగ్ని అధిదేవత ఉంటుంది. అంటే అదృశ్యాగ్ని లేక స్వరూపాగ్ని, అగ్ని స్వరూపము, వాయువునకు వాయువు అధిదేవత ఉంటుంది. ఆకాశమునకు ''ఆకాశ శరీరం బ్రహ్మ'' ఆకాశ అధిదేవత ఉంటుంది. వీటితో సంభాషణ చేయటం నేర్చుకోవాలి మనం. అప్పుడు వీటిమీద స్వామిత్వము వస్తుంది. వీటితో మీరు సంభాషణ చేయటం నేర్చుకున్నప్పుడు కట్ట తెగి ఒక ఊరిమీద నది ఏదో పడుతూ ఉండోబోతూన్నపుడు, మీరు గనుక అక్కడ ఉంటే, ఆ నీళ్ళని మీరు అటు ప్రక్కనించి పొండిస్వామి అంటే వెళ్ళిపోతాయి. ఎందుచేత మనం నీళ్ళయొక్క స్థూల స్వరూపం మాత్రమే ఎరిగున్న వాళ్ళమేకాక, నీళ్ళ స్థూల స్వరూపానికి అధిష్ఠాన దేవత అయిన జల స్వరూపంతో మీరు సంభాషణ చేయగలుగుతున్నారు. అలాగే మంచి ఎండగా ఉందనుకోండి. ప్రయాణం

చేస్తున్నారు. స్వామీ ఎండగా ఉన్నది అని అనుకోండి. కొంచెం ఎండ తగ్గి మబ్బులేస్తాయి. మీరు ప్రయత్నం చేసి చూడండి. కాకపోతే నాతో చెప్పండి. లేకపోతే కావలసినటువంటి మనస్సేమిటో దాన్ని సాధించుకోవాలి. వాణ్ణి, వీణ్ణి గురించి ఆలోచిస్తూ, వాడిమీద కేసు పెడదామని, వీడి మీద కోర్టులో కేసు బనాయిద్దామని వెళుతూ చేసిన వాడికి రావు. అవి ఏవి లేనటువంటి వాడికి మాత్రమే వస్తాయి. వాడి మనస్సుకి ఇంకేం పెద్ద గొప్ప విషయా లుండక్కర్లేదు. వాడు అలాంటివాడు, వీడు అలాంటివాడు అని మనస్సులో ఉన్న వాడికి ఏనాడు రావు. వీడికంటే వాడు గొప్పవాడు. వాడికంటే వీడు తక్కువవాడు. వీడు L.D.C. వాడు, U.D.C. అని మనస్సులో ఉన్నవాడికి ఎన్నడూ రావు. ఇవన్నీ మనస్సులో ఏమీ లేకుండా ఉన్నవాడు వెడుతూంటే, బాగా ఎండగా ఉన్నది, ఇంతమంది ఆడవాళ్ళు, పిల్లలు వెడుతున్నారు అని మనస్సులో ఒక్కమాటు జాలిపడితే , అయిదు నిమిషాల్లో ఆ ప్రయాణంలో చక్కని మబ్బులుపట్టి చల్లగా ప్రయాణం జరుగుతుంది. ప్రత్యక్షంగా మీరు ఎన్ని వందలమాట్లైనా verify చేసి చూడవచ్చు. కాని ఆ మనస్సుని ముందు అంట్లు తోముకోవాలి. అంటే కొంతమందికి వస్తుంది, కొంతమందికి రాదు. ఆ వచ్చినవాళ్ళు బ్రహ్మాండ నాయకులు. మహానుభావులు, పరమ గురువులు అవి అబద్ధం అన్నారు. ఎవరికైనా వస్తుంది. ఇది ఎవడు సాధన చేసినా వచ్చే విషయాలు తప్ప, కొందరు పుట్టు కోరలతో పుట్టారు. అట్లా ఉండదు. ఎవడికైనా సరే వచ్చేవే కనుక వీట్లని పెద్దలు ఇంగ్లీషులో elementals అంటారు.

Theosophical literature లోకి వెళ్ళిచూస్తే Blavetsky వీటికి elementals అని పేరు పెట్టింది. అంటే ఆవిడ అట్లాంటి నిదర్శనాలు చూపించింది. ఆ కొండమీద ఉన్నటువంటి పెద్దరాయి శిల్పం చేయాలంటే ఎంతోమంది తీసుకురావాలి కిందకి, మీరు రేపు రండి అంది. మర్నాడు ఉదయం వచ్చి ఆ రాయి తీసుకొని శిల్పం చేయండి. మీరు దింపక్కరలేదు. ఆ రాతికి అధిష్ఠాన దేవత అయినవాళ్ళే క్రిందికి దింపుతారు అన్నది. ఇట్లాంటివి ఎన్నో చూపించింది నిదర్శనాలు. మీ ఫొటో మీకు తీసి యిస్తాను.

ఒక తెల్లకాగితం ఈ పుస్తకంలో పెట్టు అన్నదావిడ. పెట్టారు. మూసారు. ఈ పుస్తకం మీద పెన్సిల్‌యొక్క కార్బన్ పౌడర్ చేసి పొయ్యమంది. అయిదు నిమిషాలు అయిన తర్వాత తియ్యమన్నది. తీస్తే పుస్తకంలో వాడి బొమ్మ ఛాయా చిత్రంలాగ ముద్ర వచ్చింది. Old diary leaves అనే పుస్తకం చదివితే ఇలాంటివి కొల్లలు, వందలు కనిపిస్తాయి రోజూ ఆవిడ చేసినటు వంటివి. Theosophical society లో ఉండవచ్చు. మన లైబ్రరీలో కూడ ఉన్నాయి. అపుడు చెప్పింది. ఏం చేసాం? అంటే మాయ చేయటం, మర్మం చేయటం ఏమీలేదు. సైన్సు ఇపుడున్నకన్న develop కాలేదు. కనుక దీన్ని మహిమలు అంటారు అని చెప్పింది. ఏం జరిగింది అని అడిగితే కాగితానికి అధిష్ఠాన దేవత, తర్వాత ఈ కార్బన్‌కి అధిష్ఠాన దేవత వాళ్ళిద్దరూ కలిసి, ఈ పేపర్‌మీద నీ బొమ్మను ఫొటో తీసారు. ఎవరినైనా సరే నువ్వు సంప్రార్థనం చేయవచ్చు. వాళ్ళని కంట్రోలులో పెట్టేటువంటి విద్యలు ఉన్నాయి. వాళ్ళతో మైత్రిచేసి సంప్రార్థనం చేసే విద్యలు ఉన్నాయి. Control పెట్టే విద్యలు నేర్చుకున్నవాడు వాటి చేతనే దుర్మరణం పొందుతాడు చిట్ట చివరికి. వాటితో మైత్రి చేసినవాడు ఆజన్మాంతము మిత్రుడై లోకంలో యావజ్జీవితము సర్వజన మైత్రి, సౌఖ్యము మొదలైనవి పొందుతాడు, ఇస్తాడు, మిగతా వాళ్ళచేత అభ్యాసం చేయిస్తాడు. కనుక సాధనాలు రెండు రకాలు. మొదటి రకం రాక్షస సాధన అంటారు. రెండవది దివ్యసాధన అంటారు. ప్రకృతి శక్తులతో మైత్రీ భావమును సాధించినవాళ్ళు, దివ్యసాధన చేసిన వాళ్ళవుతారు. ప్రకృతిలో ఉన్న శక్తుల్ని జయిద్దాం అనుకున్నవాళ్ళు మొదటిరకం. అంటే conquering nature. ఎలక్ట్రిసిటీని కనుక్కున్నంత మాత్రాన ప్రకృతిని జయించామనుకున్నాం. రేడియోని కనుక్కున్నంత మాత్రాన ప్రకృతిని జయించామనుకున్నాం. ఈ ప్రకృతిని జయించుట అనే పశుభావం కలిగి ఉన్నపుడు రెండు ప్రపంచ మహా సంగ్రామాలు వచ్చినాయి. మూడోది రాబోతోంది. జయించటం కాదు కావలసింది. ప్రకృతితో మైత్రి చెయ్యాలి. మానవుడు ప్రకృతితో మైత్రి చేసే స్థితికి యింకా రాలేదు. కనుక మానవుడు ఇపుడున్న స్థితికి ప్రకృతిలో ఉన్న రహస్యములు యింకా తెలియబడటం లేదు. దాచబడి ఉన్నాయి. ఎపుడైతే ప్రకృతిని జయించుట అనే దుర్బుద్ధిని వదిలేసి, ప్రకృతితో మైత్రి చేయుట

అనే సద్బుద్ధిని మానవుడు సాధిస్తాడో అపుడు, ఇపుడు మనం ఎరిగి ఉన్నకన్న ఎక్కువ శాస్త్ర రహస్యాలు మానవుడికి తెలుస్తాయి. కాని అది రావటానికి ముందు ఒకడి మీద ఒకడికున్న అభిప్రాయాలు పవిత్రీకరణం జరగాలి. లేకపోతే ప్రకృతితో మైత్రి సాధ్యపడదు. ప్రక్కన ఉన్న మనిషితోనే మైత్రి చేయటం చాతకానివాళ్ళం ప్రకృతితో మైత్రి ఏం చేస్తాం? వికృతితోనే విరోధం ఉన్నపుడు ప్రకృతితో మైత్రి ఎలా వస్తుంది? కనుక ఉద్యోగం, హోదా, కులము, మతము, వీట్లల్లో ఏది గుర్తున్నా ప్రకృతితో మైత్రికి ఆ జన్మకి సాధన లేదు. కనుక యిక్కడ స్వరూపం అనే మాటకి అర్థం ఏమిటి? ఈ స్థూలమైన మనం ఎరిగున్న ఈ పంచభూతములు కాక, వీటికి అధిష్ఠాన దేవతలు అని అర్థం. కనుక స్థూలంమీద ధ్యానం చేయటమూ నేర్చుకోవాలి, స్వరూపం మీద ధ్యానం చేయటమూ నేర్చుకోవాలి. ఏ వస్తువుని చూసినా ప్రతిదాంట్లో ఈ రెండూ ఉంటాయి అని ధ్యానం చేయటం నేర్చుకోండి. ఇక మూడవది సూక్ష్మము.

సూక్ష్మము అంటే ఏమిటి? ఉప్పు ఉందనుకోండి. ఉప్పురాయి చేతిలో పెట్టుకుంటే అది స్థూలం. ఉప్పుగా ఉండటం సూక్ష్మము. అంటే గుణం (quality). ఉప్పున్నూ, ఉప్పగా ఉండటం. ఉప్పేమో స్థూలం, ఉప్పగా ఉండటం సూక్ష్మం. ఈ మధ్యన అధిష్ఠాన దేవత ఉన్నాడు. కనుక ప్రకృతిలో మన కర్థమవ్వవలసినవి చాల లక్షలు ఉన్నాయి. 20వ శతాబ్ది మానవుడికి సైన్సు తెలుసునని అనుకోకూడదు. తెలిసినట్లైతే ఇలా అఘోరిస్తూ, కరువులు, కాటకాలు, యుద్ధాలు, ఇలాంటి పశుప్రాయమైన స్థితిలో ఉండము. కనుక సూక్ష్మమనే మాటకి గుణం (quality) అని అర్థం. పృథివీ తత్వానికి ఏమిటి సూక్ష్మము, వాసన వేయటం గంధత్వము. జలతత్వానికి ఏమిటి సూక్ష్మము రుచి, తేజస్తత్వానికి రూపం, ఆకారం. కంటికి రూపం కనిపించటం. దానివల్లనే కదా. వాయుతత్వానికి స్పర్శనం. ఇట్లా తెలుస్తుందన్నమాట. ఆకాశ తత్వానికి శబ్దము వినపడటం అది సూక్ష్మమంటే. దీనిమీద కూడ ధ్యానం చేయాలి. ప్రతి వస్తువుకి నువ్వు తీసుకున్న దాంట్లో ఈ మూడు ఉంటాయి. ధ్యానం చేసుకో జాగ్రత్తగా ముందు. ఒక్కొక్కటి కొన్నాళ్ళు చేసినాసరే. తర్వాత ఈ మూడు super-impose అయ్యి, మీకు

వస్తాయి. ఎలాగ? ధారణ, ధ్యాన సమాధులతో సంయమం స్థూలం మీద ముందు పెట్టు. తర్వాత స్వరూపం మీద పెట్టు. తర్వాత సూక్ష్మం మీద పెట్టు. నీ యిష్టం అన్నాడు. అపుడు మూడింటి మీద వస్తుంది. ఒక మనిషిని మనం చూస్తున్నపుడు వాడి తల చూసి, చెవిచూసి, కన్నుచూసి, ముక్కుచూసి, చేతులుచూసి వాణ్ణి చూస్తున్నాం. యివన్నీ కనిపిస్తున్నాయి. అది వస్తుంది మీకు. యిందులో ఒక్కొక్కటే చూస్తున్నామా? ఎవరితోనన్నా మాట్లాడుతూ ఉంటే, వాడి మొహం చూసి, వాడు మాట్లాడుతూంటే వాడి నోరుచూసి, వాడి నాలికచూసి, ఈ లోపల వాడు చేత్తో ఏం చేస్తున్నాడో చూడకుండా యిట్లా ఉండదు. వాడిని చూడటం నేర్చుకుంటే యివన్నీ కనిపిస్తాయి. అది సంయమం అంటే. సూక్ష్మము తర్వాత అన్వయము. అన్వయం అంటే పై చెప్పిన వాటితో పరస్పర సంబంధం అంటే స్థలానికి, స్వరూపానికి, సూక్ష్మానికి ఉన్న పరస్పర సంబంధాన్ని అన్వయం అంటారు. నేను translate చేసినది దీనికి mutual realtionship. స్థూలం, స్వరూపం, సూక్ష్మం ఈ మూడింటికీ ఉన్న సంబంధం మీద ధ్యానం చేయమన్నాడు. ఇందులో వచ్చేది సమాచారం (Information) కాదు. ఎవడూ చెప్పాల్సిందీ కాదు. సహజంగా వచ్చేస్తుంది. ఊరికే దానియందు మనస్సు రోజూ కాసేపు పెట్టటమే. తర్వాత అర్థవత్వము. అర్థమనే మాటకి ప్రయోజనము. అర్థవత్వము అంటే ప్రయోజనము కలిగి ఉండుట. అంటే basic purpose. ఘన పదార్థము, దీని అధిదేవత, దీని సూక్ష్మ లక్షణము. ఈ మూడింటికీ గల సంబంధము, అసలు యివి ఉండటంలో ప్రయోజనం ఏమిటి ప్రపంచంలో. అదికూడ ఆలోచించండి. ఉదాహరణకి అన్నం అన్నామనుకోండి. అన్నం ప్రయోజనమేమిటి? అని ఎపుడన్నా ఆలోచించామా? ఆలోచించలేదు. కనుకనే రుచిగా ఉంటే యింకాస్త ఎక్కువ తినటంలాంటి పశువుచేసే పని చేస్తాం. ఆలోచిస్తే ఏమవుతుంది? అన్నం రుచికోసం కాదు. శరీర పోషణకోసం అని తెలుస్తుంది. అంటే basic purpose అర్థవత్వము మీకు తెలుస్తుంది. అది తెలిసినపుడు అన్నంతో మీకున్న సంబంధము సరైన పద్ధతిలో మారుతుంది. అంటే మీరెలా తినాలి అనే స్వరూపమే మారుతుంది కదా. రుచికోసం తినటం అనే పని అపుడు

చేయము. తినటం కోసం రుచిని ఆనందిస్తాము. చేసే పద్ధతి వస్తుంది. అలాగే కన్ను, కన్నుగుడ్డు స్థూలంకదూ. ఈ కన్నుగుడ్డులో ఉన్న ఘనపదార్థానికి అధిష్ఠాన దైవతము అయిన పృథివీ దేవత, తర్వాత కంటికి చూచుట, దానికి అధిష్ఠాన దేవత అయిన సూర్యుడు, ఈ కంటికిన్నీ, సూర్యరశ్మికిన్నీ, చూచుటకున్నూ సంబంధము ఎందుకేర్పడింది? చూడటం అనేది ఎందుకసలు? అనే దానిమీద మీరు మనస్సు పెడితే ఎవడేం చేస్తున్నాడో చూడటానికి, వచ్చేపోయే వాళ్ళని చూడటానికి కాకుండా, సరైన అర్థం మనకి తెలుస్తుంది. తడకల్లోంచి చూడటానికి, కన్నాల్లోంచి చూడటానికి కాకుండా, చూడటం అనేది ప్రకృతిలో ఎందుకు పెట్టబడ్డదో అది కన్నుయొక్క ప్రయోజనం. ఇవి ఎవడికి వాడికి తెలుస్తాయి. నిజంగా తెలిసి మారకుండా ఉన్నప్పుడు, ఒకడికి తెలిసిందే ఇంకోడికి కూడ తెలుస్తుంది. ఒకడికి ఒకటి, ఒకడికి ఒకటి తెలిస్తే అది సత్యంకాదు. కన్ను ఎందుకట? అంటే ఒకే కంటితో అంత దూరాన పిట్టని కొట్టటానికి చూడటం కోసం అని ఒకడికి అనిపించవచ్చు. ఇంకోడికి ఒకే కంటితో ఎంత దూరాన్నించైనాసరే కన్నంలోంచి ఎవడేం చేస్తున్నాడో చూడటానికి అనిపించవచ్చు. వాళ్ళిద్దరికీ ఒక అభిప్రాయం రాలేదు కనుక వాళ్ళిద్దరికీ వచ్చిన అభిప్రాయాలు తుక్కు అభిప్రాయాలే అని అర్థం. కాని అట్లా కాకుండా మీరు ఈ పద్ధతిలో వెళ్ళేటప్పటికి ఏమవుతుంది? వేయిమంది వేర్వేరుగా ధ్యానంచేసినా, వేయిమందికి అదే జవాబు వస్తుంది. కన్నుయొక్క ప్రయోజనమేమి? చెవియొక్క ప్రయోజనమేమి? ముక్కుయొక్క ప్రయోజనమేమి? ఇంద్రియములయొక్క, ప్రవృత్తులయొక్క ప్రయోజనమేమి? మనస్సుయొక్క ప్రయోజనమేమి? అనగా లోపల, వెలుపల అనే ఒకానొక ఆటను కల్పించి, చోటు అనే ఒకవ్యక్తి ఆడుకుంటానికి తయారుచేసిన యంత్రము. ఇది యంత్రాంగము, ఇది తెలుస్తుంది. దానికున్న ధర్మము లేమి? కట్టు బాట్లేమి? మనము ఏమి చేయవలెను? ఏమి చేయకూడదు. యివన్నీ తెలుస్తాయి. అపుడు మనం ప్రవర్తించేటపుడు పంచభూతములపై స్వామిత్వం వస్తుంది.

## 46. తతో౽ణిమాది ప్రాదుర్భావః కాయసంపత్త ద్ధర్మానభిఘాతశ్చ॥

తతః = దానివలన, అణిమాది = అణిమ మొదలైన అష్ట సిద్ధులును, ప్రాదుర్భావః = ఉద్భవించుట, కాయ సంపత్తి = శరీర సంపద, ధర్మ = శరీర ధర్మములకు, అనభిఘాతశ్చ = దెబ్బ తగులకుండుట (వచ్చును).

దానివలన అణిమ మొదలగు సిద్ధులును, దేహము పరిపూర్ణ మగుటయు, దేహ ధర్మములకు లొంగకుండటయు సిద్ధించును.

**వివరణ :** ఒక్కొక్కపుడు సర్కస్‌లో అక్కడా మనం ఊహించలేనంత బరువు ఎత్తేవాళ్ళున్నారు. వాళ్ళు ఎత్తుతారు గనుక ఊహించుతాం కాని, అది చూడకుండా మనం చెప్పినట్లైతే నమ్మటానికి వీల్లేదు. అలాగే మనిషిమీద ఏనుగుని ఎక్కించుకునేవాళ్ళు, మన తరంలో చూచాము. ఇపుడు తరువాత తరంలో పోయింది. కారు వెనక లాగి పట్టుకుంటే కారు వెళ్ళేదికాదు. కోడి రామ్మూర్తి అనే ఆయన్ని కొందరు చిన్నప్పుడు చూసి ఉంటారు. నేను చూసాను. ఏ డ్రైవరైనాసరే కారు డ్రైవ్ చేయవచ్చు. ఈయన వెనుక లాగి పట్టుకొని ఉండేవాడు. కారు వెళ్ళేది కాదు. ఇట్లాంటి వాట్లల్లో క్రమ క్రమంగా జరిగినటువంటి అభ్యాసం వలన కండరములు, నరములు ఆ నిరోధక శక్తిని సృజింప (resistance develop) చేస్తాయి అనే ఒక తప్పుడు సిద్ధాంతం మన దగ్గర ఉంది. వ్యాయామం అంటే అది అని మన ఉద్దేశ్యం. అంతేగాని ఆ లోపల ఏ మార్పులు జరుగుతాయి అనే శాస్త్రీయ దృక్పథాన్ని తెలుసుకుంటానికి యింకా పెట్టిపుట్టలేదు ఈ శతాబ్దం. అంటే ఈ రోజు యింత బరు వెత్తగలిగాడు. వచ్చే నెల యింకొంచెం బరువెత్తగలడు. అంటే ఏం మార్పులు జరుగుతున్నాయి కండరములు, నరములు మొదలైన వాటిల్లో. అవే యిక్కడ చెప్పినటువంటి అణిమ, మహిమ మొదలైనవన్నీ కూడ. ఇక్కడ చెపితే అవి విచిత్రాలు (miracles) కావు. అక్కడ మనం చూస్తే మామూలుగా భౌతికంగా కనిపించే ప్రాక్టీసూ కాదు. ప్రాక్టీసు అన్నా యిదే జరుగుతుంది. యోగాభ్యాసంలో ఉన్నా యిదే జరుగుతుంది. లోపల వచ్చే మార్పు ముఖ్యం. రోజూ భౌతికంగా ప్రాక్టీసు చేసిన వాడికి కూడ ఆ జీవకణములలో ఉన్న జాగ్రత్స్థితి (aware-

ness, alertness) ఒక్కొక్క జీవకణములోను వేర్వేరుగా హెచ్చవుతుంది. అపుడు వీట్లల్లో ఏ స్థితైనా మేల్కొనవచ్చు, మేల్కొనకపోవచ్చు. కనుక అవన్నీ కూడ ఉదాహరణలుగా తీసుకొనవచ్చు. కనుక ఈ చెప్పిన సాధనవల్ల 'అణిమాది ప్రాదుర్భావః' అంటే అణిమ మొదలైనటువంటి ఎనిమిది విద్యలు ఉద్భవిస్తాయి.

1. అణిమ : Atomic existence అణువు అణువుగా ఉండుట.
2. మహిమ : Totalic existence మొత్తం అణువులన్ని ఒకటిగా కనిపించును. (Aggregate or synthetic existence)
3. లఘిమ : తేలికై తేలికై బరువు లేకుండా పోవుట. భూమికి మన శరీరానికి అయస్కాంత శక్తిపోయి వికర్షణ శక్తి ఏర్పడుట. దూది ఏవిధంగా ఉంటుందో ఆవిధంగా ఉంటారు. అంటే లఘుహుట-lightness.
4. గరిమ : గురుత్వము - Heaviness
5. ప్రాప్తి : ఒకచోట ఉండి ఇంకోచోట పనిచేయుట అంటే మీరు ఒక చోట ఉండి ఇంకో ఊళ్ళో ఉన్నవారికి సహాయం చేయుట.
6. ప్రాకామ్యము : అనుకున్నది సాధించుట.
7. ఈశత్వము : lordship - ఏ పనికైనా
8. వశిత్వము : ఏదైనా, ఎవరైనా తన వశములో ఉండుట.

(We should not default with the rights of others -అది చేస్తే నశిస్తాం.)

తన యింద్రియములను వశంలో ఉంచుకుంటే ఈశ్వరత్వం కలుగుతుంది. అలాకాక సిద్ధులకొరకు ప్రయత్నిస్తే చెడిపోతారు. పరుల కొరకు పనిచేస్తే ఐశ్వర్యులవుతారు.

కావలెనని చేసే వాళ్ళని సిద్ధులు అంటారు. యోగాభ్యాసం చేస్తూంటే అప్రయత్నంగా వాళ్ళద్వారా పనిచేసే వాట్లని ఐశ్వర్యములు అంటారు. అంటే ఈశ్వరునియొక్క అవతార మూర్తులుగా వచ్చినపుడు ఐశ్వర్యములు పనిచేస్తాయి. ఐశ్వర్యము అంటే ఈశ్వర లక్షణం అని అర్థం. ఎవడైతే ఈశుడు, ఈశ్వరుడు

అనే స్థితిని పొందాడో వాణ్ణి ఆశ్రయిస్తాయి ఇవి. అట్లా ఆశ్రయించినపుడు ఐశ్వర్యములు అంటారు. వీడు వాట్లని ఆశ్రయించి సాధించటానికి ప్రయత్నం చేసినపుడు, వాటిని సిద్ధులంటారు. తర్వాత 'కాయసంపత్తి' పొందుతారు. కాయ సంపత్తి' అంటే శరీర సంపదను పొందుతారు. కాయ సంపత్తి అంటే తర్వాత సూత్రంలో చెప్పబోతున్నారు. తరువాత ''తత్, ధర్మ'' ఆ దేహ ధర్మములయొక్క, దేహ ధర్మములు అంటే శరీరము నందున్న అవయవ ధర్మములు, చేతులుయొక్క ధర్మములు, ''కర్మేతి హస్తయోః'' పనులు చేయటంలో విధేయత (obedience), 'గతిరితి పాదయోః' కదలుటకు (locomotion) సహాయం చేయటంలో పాదములు. ఇట్లా ఒక్కొక్క దానికి దాని ధర్మములు వేరు వేరుగా ఉన్నాయి. అలాగే శరీరంలో ఉన్న సప్తధాతువుల యొక్క ధర్మములు ఉన్నాయి. ఆ ధర్మములకు తర్వాత వయస్సుకి సంబంధించిన ధర్మములు ఉన్నాయి. ఇన్ని రకాలైన ధర్మములూ కూడ అనభిఘాతము, అంటే దెబ్బ తగలకుండుట అంటే శరీర ధర్మములకు దెబ్బ తగలకుండు నటువంటి స్థితిలో ఉంటాడు. ఈ చెప్పిన యోగాభ్యాసం చేసినవాడు. అంటే శరీర ధర్మములన్నిటిని ప్రతి అణువణువు పరమాణువు యందు వీడు సంయమం చేస్తున్నాడు. గనుక వేటి ధర్మముల యందు అవి ప్రవర్తిస్తూ ఉంటాయి. కనుక, వీటన్నింటిలో ఉన్న పురుషుడు అనేవాడు, సత్త్వము అనే తన వ్యాప్తిని తన తేజస్సుని వ్యాపింపజేసి ఉంచుతాడు. గనుక పురుషుడు క్రమ క్రమంగా యోగాభ్యాసంలో ఆ సత్వాన్ని పరిశుద్ధి చేసుకొని సత్వమే పురుషుడు, పురుషుడే సత్వము అనే అభేద స్థితికివచ్చి మోక్షం పొందటానికి సంసిద్ధుడౌతాడు. మోక్షం అంటే శరీరం వదిలిపెట్టటం కాదు. పురుషుడే శరీరంలో సమస్తంగా జీవించటం. ఆ స్థితికి వెడుతూ ఉన్నాడు కనుక వీడికి తప్పని సరిగా శరీర ధర్మములలో ఏ ధర్మమూ కూడ అభిఘాతత్వము చేయదు. అనభిఘాతత్వము ఉంటుంది. అంటే శరీరంలో ఏవి చెయ్యవలసిన పనులో అవిచేస్తూ, ఆయుర్దాయం అయిపోవటంవల్ల శరీరం వదిలిపెడతాడు గాని, దెబ్బతగలటంవల్లో, దుర్ఘటనవల్లో, రోగంవల్లో చచ్చిపోవటం, రైల్లోనో, దూరప్రాంతాల్లోనో చచ్చిపోవటం గాని ఉండవు.

ఎందుకంటే వాడికి రుచికోసం తినటం, నోరు ఆపలేక పోవటం అట్లాంటివి ఉండవు కదా. అలాంటివి ఉంటే ఎక్కడో ప్రయాణంలో కలరానో ఏదో తగుల్తుంది. ఇవేవి ఉండవు కనుక అలాగ ఖర్జూరపు కాయలాగ ఉంటాడు మనిషి. ఎంత వయస్సున్నా అదే రకంగా ఉంటాడు, మారడు. చిట్ట చివరికి కర్మశేషంచేత అంటే జీవుడికి, ఈ శరీరంతో ఎంతకాలం సంబంధమో ఆ టైము అయిపోయేటప్పటికి శరీరం దానంతట అది పడిపోతుంది. అది ఏదన్నా పనిచేసుకుంటూ పడిపోవచ్చు. మాట్లాడుతూ పడిపోవచ్చు. ఏమన్నా జరుగుతూ పడిపోవచ్చు. వాడి డ్యూటీలో వాడు ఉండంగ శరీరం పడిపోయిన వాళ్ళున్నారు. అంతేకాని, వాడు చావటానికి కావలసినటువంటి ఉపోద్ఘాతాలు ఏమీ ఉండవు. అంటే కాలు, చెయ్యి పడిపోయిందిట. మంచంలో ఆర్నెల్లు ఉన్నాట్ట, వాడి నవద్వారాలకి ఆర్నెల్లపాటు ఇంట్లోవాళ్ళు సేవ చేసారుట. ఇవేం ఉండవు.

అందుకని ''తద్ధర్మ అనభిఘాతశ్చ'' ఆయా శరీర ధర్మాలకు దెబ్బ తగలకుండుట (not damaged) అని అర్థం. అంటే no infringement to the natural law of any counter part of the vehicles ఇది వస్తుంది. కనుక అణిమాది సిద్ధుల ప్రాదుర్భావమున్నా, కాయ సంపత్తి అంటే శరీర సంపద, తర్వాత శరీరములో ఉన్న ధర్మములకు ఎన్నడూ అభిఘాతము తగులకుండా ఉండుట, ఈ యోగాభ్యాసం సక్రమంగా యిందుకోసం అని కాకుండా చేసిన బుద్ధిమంతుడికి కల్గుతాయి. 'ఆవరణ క్షయం' జరగాలంటే యిందుకోసమని చేయకూడదు. భాగవతం 15వ భాగంలో ఒక చిత్రమైన సంభాషణ ఉన్నది. ఆ సంభాషణలో దేవతలందరూ రాక్షసుల్ని సంహరిద్దామని ప్రయత్నం చేసారు. రాక్షసులందర్నీ నిర్ధారణ చేసారు. ఉన్న రాక్షసుల్లో విశ్వరూపుడనే మహానుభావుడున్నాడు. ఆయన యొక్క మూడు తలకాయలు నరికేశారు. దాంట్లోంచి వీళ్ళందర్ని తిని మింగేసే వృత్తాసురుడు అనే రాక్షసుడు ఒకడు పుట్టాడు. వాడిమీద వీళ్ళ ఆయుధాలు పని చెయ్యలేదు. ఆయుధాల్నీ తినేసాడు, వీళ్ళనీ తినేసాడు. దేవతలు హాహాకారాలు చేసారు. దేవతలు రాక్షసులు అనేవాళ్ళు సృష్టిలో సంక్రమించిన గుణాలు మాత్రమే కాని వ్యక్తులు

కాదు. దేవతా గుణములు, రాక్షస గుణములు అని భగవద్గీతలో దైవ, అసుర సంపద్విభాగ యోగంలో యిచ్చాడు. ఆ గుణాల్లో దైవ సంపద కలిగినటువంటి వాళ్ళని దేవతలు అనుకుందాం. వాళ్ళు దుర్గుణాలున్న వాళ్ళని, వాళ్ళ దుర్గుణాల్ని తొలగించటం కోసమని, ప్రపంచంలో ఒక ధ్వజం ఎత్తారనుకోండి. అపుడు వాళ్ళేం చేస్తున్నారు? వాళ్ళ దుర్గుణములను వీళ్ళు ధ్యానం చేస్తున్నారు. అది చేయటంవల్ల దేవతల్ని రాక్షసులు జయిస్తున్నారు. ఎప్పుడైతే ఎవర్నైనా దురాచారంగా ఉంటాడు, స్నానం చేయడు, పొద్దున్నే మొహం కడుక్కోకుండా కాఫీ తాగుతాడు లేకపోతే వాడు కుత్సితమైనటు వంటివాడు, కుట్రలు చేస్తాడు, మొదలైనవి గుర్తిస్తున్నామో, వాడిలో ఆ గుర్తించేటు వంటి లక్షణంలోంచి రాక్షసులకి సంబంధించినటు వంటి కోట ఒకటి మనలో తయారు అవుతోంది. అది మనం గుర్తించం. ఆ కోటలో రాక్షసులు తయారై ఎవడెవడైతే అలా గుర్తిస్తున్నారో ఆ దేవతలందర్నీ మెత్తగా చితక్కొట్టేస్తున్నారు. అలాగే సృష్టిలో ఉన్న దేవతలంతా రాక్షసుల్ని చితక్కొట్టటానికి ప్రయత్నం చేసేటప్పటికి ఇంకొక రాక్షసుడు పుట్టాడు. ఆ రాక్షసుడి పేరే ఎదుటివాళ్ళల్లో లోపాలు చూట్టం అనే లక్షణం కలవాడు. అపుడు మనలో ఉన్న దేవతలంతా నశించిపోతారు. దెబ్బతింటారు. అది వృత్తాసురుడి కథంటే. వృత్తం అంటే ఆవరించటం. చుట్టలు చుట్టుకొని ప్రతివాడి చుట్టూ ఆవరిస్తాడుట. తప్పులు చూడటం, దోషాల్ని చూడటం అనే రూపంలో ఆవరిస్తాడు. కనుక లోపాలు ఆరోపించడం అనే గుణాన్ని తనలో పోగొట్టుకోవాలి. అదికూడ పోగొట్టుకుంటానికి ప్రయత్నం చేయకూడదు. సద్గుణాల్ని ఉపాసించాలి. ఎదుటివాడిలో దుష్ట గుణములను పోగొట్టటానికి ప్రయత్నం చేసినపుడు, ఆ పోగొట్టటానికి చేసిన ప్రయత్నంలోనే మనలో రాక్షసులు జయించి, దేవతలు నశిస్తారు. అది ఆ కథ. తర్వాత దెబ్బ తిన్నాక ఆయుధాలు, అస్త్రాలు ఏం పనిచేయవు. అంటే శమదమాది గుణాలు, యోగాభ్యాసం గాని సాంఖ్యంగాని ఏమి లొంగవు.

తెలిసో, తెలియకో దేవతలు ప్రార్థనచేస్తే నారాయణుడు ప్రత్యక్షమై నా భక్తులు నాకు సంతోషం కలిగేట్టు స్తోత్రం చేసారు కనుక వాళ్ళకేం

కావాలంటే అది యిస్తాను. మీరు యిపుడు ఆపదలో ఉన్నారు కనుక వచ్చాను అంటూ. ఉత్తముడైన మహానుభావుడు ఎపుడూ కూడ అందరిలోను నన్ను చూస్తాడు అన్నాట్ట. అలా చూసినపుడు ఎంతమంది ఉంటారు? ఒక్కడే ఉంటాడు. కనుక ఒక్కడినే చూచి ఏకాంత ధర్మం అనేదాన్ని ఆచరిస్తాడు. సృష్టిలో ఇంతమందిని చూడడు. అలాచూస్తే వాడికి కావలసినవి ఏమి ఉండవు. అందరిలోను తానొక్కడే ఉన్నపుడు తను కోరినవి ఏమైనా ఉంటాయా? ఏమి ఉండవు. అది దాటిపోయినవాడు నాకు చాల యిష్టమైనవాడు అన్నాడు అంటే వీళ్ళు ప్రాణాలు రక్షించుకునేందుకు, ముష్టి ఎత్తుకునేందుకు వచ్చారు. అంటే ఏమని ఉపదేశిస్తున్నాడు? వృత్తాసురుడు చనిపోవటం అంటే నీకేం కావలసి ఉండకుండా ఉండే స్థితి. అంతర్యామిని చూడటం అన్నాడు. అంటే పొగుడుతున్నట్లుగా మందలిస్తున్నాడు దేవతల్ని. మీరందరూ చాల మహానుభావులు, యిలావచ్చి నన్ను స్తోత్రం చేసారంటే నాకు చాల సంతోషం. అందరిలోను నన్నేచూసి ఏకాంత ధర్మం అవలంబించిన వాడికి కావలసినవి అంటూ ఏమీ ఉండవు. ఎవడికైనా కావలసినవి వాడు చేస్తాడుకాని, తనకి కావలసినవి అడగటం ఉండదు. అలాంటి వాళ్ళంటే నాకు సంతోషం అంటున్నాడంటే మీరు అలాంటివాళ్ళు కారు అని అర్థం. ఇపుడు మీ బాధ తీర్చడానికి మార్గం చెబుతాను. మహానుభావుడు, చాల మంచివాడు అయిన దధీచి అని ఒకాయన ఉన్నాడు. అంటే మీరు కాదని అర్థం. మీరు కనుక అలాంటివాళ్ళైతే వృత్తాసురుడు ఎందుకు పుడతాడు ప్రతి ఒక్కడిలోను? ఎందుకు మింగుతాడు? ఆయన శరీరం మినహా ఆయనకి కావలసింది ఏమీలేదు. ఆయన శరీరాన్ని మీరు యాచించి అడుక్కోండి అన్నాడు. అంటే అర్థం ఏమిటి? ఆయన ఎలా బ్రతుకుతున్నాడో అలా బ్రతకటం నేర్చుకోండి అని అర్థం. ఆయన శరీరం మీరు ధరించండి, యాచించండి అంటే. ఏదో తర్వాత ఆయన వెన్నెముకతో వజ్రం చేయండి. ఇవన్నీ చెబుతారనుకోండి. కనుక యిక్కడ చెబుతున్న విషయం కూడ అదే. ఇక్కడ శాస్త్రీయంగా చెబుతున్నాడు. భారత, భాగవత, రామాయణాల్లో ఇతిహాస స్వరూపంగా చెబుతారు. అంటే ఆ కథ ఎవడన్నా సవ్యంగా మనకి

చదివి వినిపించేటప్పటికి అట్లాగ పొట్టు వొలిచి మన చేతిలో పెట్టినట్లు అర్థం అవ్వాలి. అది ఇతిహాసమంటే. శాస్త్రం ఎలా ఉంటుంది? సంస్కృతంలో వ్యాకరణ శాస్త్రం ఉందనుకోండి, విడిచిపెట్టెను అనటానికి ఏమనాలి? జహహి లేకపోతే జహీహి లేకపోతే జహిహి మూడు రూపాలున్నాయి. ఈ మూడు నేర్వాలంటే వ్యాకరణంలో ఒకాయనేం చేసాడు. ''జహహి జహిహి జహీహి రామా జాయం'' అన్నాడు. రాముడు, సీతాదేవి అంతటి మహానుభావురాలని తెలిసి ఉండి కూడ విడిచిపెట్టాడు, విడిచిపెట్టాడు ముమ్మాటికీ విడిచిపెట్టాడని మూడు రూపాలు వేసాడు. అలా చెపితే జ్ఞాపకం ఉంటుందా? గ్రామర్ (grammer) క్లాసులో చెపితే జ్ఞాపకం ఉంటుందా? ఈ ఒక్క మూడు రూపాలేకాదు ఆయన చెప్పింది, మొత్తం వ్యాకరణశాస్త్రం అంతా ఆ మోస్తరుగానే ఆయన చెప్పాడు రామాయణంలో. రామాయణం మొట్టమొదట రామశబ్దంతో ప్రారంభంచేసి సమస్తమైన వ్యాకరణమూ కూడ రామాయణంలో పూర్తిచేస్తూ సంస్కృతంలో కావ్యం రాసాడు. దానిపేరు బట్టి కావ్యం అంటారు. అంటే భక్తి తత్పరత అక్కర్లేకుండా వ్యాకరణం వస్తుందనికాదు. ఆ రాసినటువంటి మహానుభావుడి పేరు భట్టికవి. కొంచెం చమత్కారం వాడేటప్పటికి యివతలి వాడికి లోపల ముద్ర పడిపోతుంది. కనుక ఇదేమో వ్యాకరణ సూత్రాల్లాంటివి. భారతమో, భాగవతమో, రామాయణమో సమాంతరంగా (parallel) ఉన్న వాక్యాలు తీసుకుంటే వాట్లని ఇతిహాసములు అంటారు. ఇతిహాసమంటే ఇతి, హ, ఆస. ఈవిధముగా ఉండెను కదా. జరిగెను కదా అంటే అనగా అనగా ఒకనాడు అని అర్థం ఇతిహాసమంటే. కనుక ఈ సూత్రానికి అర్థం యిది. 'కాయ సంపత్తి' అంటే ఏమిటో తరువాత సూత్రంలో చెబుతారు.

## 47. రూప లావణ్య బల వజ్ర సంహననత్వాని కాయ సమ్పత్।

రూపం = ఆకారం, లావణ్య = వయస్సుతో వచ్చే సౌందర్యం, బలం = బలం, వజ్ర సంహననత్వాని = వజ్రముయొక్క రేఖల కూర్పు, కాయసంపత్ = శరీర సంపద (కలుగును).

**దేహము పరిపూర్ణమగుట అనగా రూపము, లావణ్యము బలము కలిగి వజ్రమువలె రంగులు, తళుకు రేఖల కూర్పు కలిగియుండుట.**

**వివరణ :** కాయ సంపద అనగా శరీర సంపత్తి, శరీర సౌష్ఠవము. అంటే ఆయనకి మంచి శరీర సౌష్ఠవము ఉందండి. అంటే మనిషి కుండల్లే ఉంటాడు. రథమల్లే ఉంటాడని అర్థంకాదు. ఇంత శరీరం ఉంటే ఆరోగ్యంగా ఉన్నట్లుకాదు. వాల్మీకి రాముడి గురించి రామాయణంలో చెప్పినట్లు ఉండాలి. 'స్సమస్సమ విభక్తాంగః' అవయవములు సమముగా విభక్తములై ఉన్నాయి. అంటే the mutual ratios of parts of the body are perfect అన్నాడు. సమవిభక్తములైన అంగములట. అంటే ముక్కు ఎంత ఉంటే కన్ను ఎంత ఉండాలో, కన్ను ఎంత ఉంటే నుదురు ఎంత ఉండాలో, ఒక దానితో ఒకటి పోలిస్తే సరైన నిష్పత్తిలో ఉండాలి. రూపము అంటే ఆకారము. ముక్కు, మొహము, కనుబొమ్మలు, కన్నులు, చెవులు, గడ్డము తీరు సహజంగా పుట్టుకతో వచ్చినట్టు వంటివి. ఏదన్నా వ్యాధి మొదలైనవి వస్తేగాని చెదరదు. సామాన్యంగా ఉంటుంది. సవ్యంగా బ్రతికే వాళ్ళకి అదే పద్ధతిలో ఉంటుంది. లేదా వ్యాధివచ్చి కొంత ఒళ్ళుచేస్తే పాడయిపోతుంది. లేదా ఒళ్ళుతీసేస్తేనూ పాడయిపోతుంది. సహజంగా ఉన్నది మాత్రం సామాన్యంగా ఆరెండూ లేకపోతే ఉండిపోతుంది. కనుక రూపం అనేది సహజ శరీర సౌష్ఠవం (well shaped body). తరువాత లావణ్యం. అంటే పుట్టుకచేత ఉన్న అందంకాక వయస్సుతో ప్రత్యేకంగా వచ్చేటువంటి ఒకానొక తళుకు. దాన్ని లావణ్యం అంటారు. కనుక వయస్సుతో కొన్ని కొన్ని హార్మోనులు ఉత్తేజమవ్వటంవల్ల వచ్చే మిసమిస. యోగాభ్యాసం చేసిన వాళ్ళకి ఆరోగ్యం చక్కగా పరిపూర్తిగా ఉంటుంది. కనుక వయస్సులో ఉన్నవాళ్ళకి ఆ వయస్సుకి తగిన మిసమిస

ఉంటుంది. కుర్రాడు చక్కగా జాంపండల్లే ఉన్నాడు అంటాం. పెళ్ళి కానటువంటివాణ్ణి చూసి, పిల్ల నిద్దామని అనిపిస్తే కొరకొర చూస్తాం. అలా వయస్సులో ప్రత్యేకంగా వచ్చేదాన్ని లావణ్యం అంటారు. శాస్త్రకారులు ఈ లావణ్యం అన్నదానికి నిర్వచనం యిచ్చారు. సముద్రం దగ్గర ఉన్న ముత్యపు చిప్ప (ఆల్చిప్ప) ని ఎండకి ఎదురుగా పెట్టిచూస్తే వెండిపొర ఉన్నట్లు ఉంటుంది. ఏమీ ఉండదు అక్కడ. ఆ వెండిపొర ఉన్నట్లు కనిపిస్తున్న అభిప్రాయం **(impression)** ఎలాంటిదో, ఈ లావణ్యం అలాంటిది. అదీ వాళ్ళిచ్చిన నిర్వచనం. అంటే దాంట్లో వెండి ఎంత ఉంటుందో, దీంట్లో వేరే ఏదైనా భాగాన్ని ఫొటో తీసిచూస్తే అలాగే ఉంటుంది. చాలా బాగున్న ఒక అమ్మాయి ముక్కుకి ఫొటోతీసి పెళ్ళి సంబంధానికి పంపించారనుకోండి. ఏం ఉండదు. ముక్కుకి ఫొటోతీస్తే అందం ఉండదు. నిజమైన, సహజమైన అందం వేరు. వయస్సుతో వచ్చే అందం వేరు. సహజమైన అందాన్ని రూపం అంటారు. దాన్నే అనుభావ సౌందర్యం అనికూడ అంటారు. 'అనుభావ విశేషాస్తు' కాళిదాసు దిలీప మహారాజుని వర్ణించాడు. ఆవుల్ని తోలుకొని వెడుతూ 'పరిమేయ పురస్సరౌ' కూడ వస్తున్నవాళ్ళు కొద్దిమందే అయినప్పటికీ ఆయనకు అనుభావము అంటే సహజంగా పుట్టుకచేత ఉన్న ఒకానొక లక్షణం వలన 'సేనా పరివృతాయివ' సేనా పరివృతుల వలే అంటే చుట్టూ మహాసేనలు వస్తూంటే ముందు ఎలా వెళ్తారో, అలా వెడుతున్నాట్ట. రాజులు, చక్రవర్తులు అలా నడుస్తారు. రాజులు ఎలా నడుస్తారు, ఎలా పరిగెడతారు, ఎలా మెట్లెక్కుతారు, ఎలా దిగుతారు అనేది కొందరికి గుర్తున్నాయి. కొందరికి గుర్తులేవు. అది అనుభావ సౌందర్యం అంటే.

నాకు బాగా చిన్నతనం. 6 సం॥లు. ఒకమాటు మా నాన్నగారి ప్రాణ స్నేహితుడైన ప్రసాదరావుగారు (ఆంధ్ర దేశంలో జగద్విఖ్యాతుడైన నటుడు) దుష్యంతుడు వేషం, హనుమంతరావుగారు (ఇంకొక స్నేహితులు) శకుంతల వేషం వేసేవారు. ఆయన గబగబ పరిగెత్తుకొచ్చి రథం మీంచి దిగటం చూపించాడు, రాజు ఎలా దిగుతాడో. అక్కడ కూర్చున్నారు రాజులు, చూస్తున్నారు. చాల ఆశ్చర్యపడ్డారు. మర్నాడు మళ్ళీ మరో డ్రామా

వేయించారు. హరిశ్చంద్ర మహారాజు సింహాసనానికి మూడు మెట్లున్నాయి. ఆ మూడు మెట్లమీంచి వెళ్ళి సింహాసనం మీద ఎక్కి కూర్చుంటం అన్నమాట. ఎక్కి కూర్చునేటప్పటికి ఆ డ్రామాలు వేయించిన మైలవరం మహారాజుగారు పట్టలేకపోయినాడు. డ్రామా మధ్యలో లేచి వేదిక మీదకి వెళ్ళిపోయి, రాజులు సింహాసనం మీదకి ఎలా వెళ్ళి కూర్చోవాలి, మెట్లు ఎలా ఎక్కాలి అనేది మన పైతరంతో వెళ్ళిపోయింది. ఈ రోజు మళ్ళీ మేము ఈయనని చూసి నేర్చుకున్నాం. అని తన మెళ్ళో ఉన్నటువంటి హారం హరిప్రసాదరావు గారి మెళ్ళో వేసేసాడు. దాన్ని అనుభావ సౌందర్యం అంటారు. అంటే పుట్టుకచేత వస్తాయి కొన్ని లక్షణాలు. ''ధూళి దూసరితోపి అనుభావ సౌందర్యం శ్రీః ఆర్య లిఖితః'' అంటాడు, లక్ష్మణ స్వామి సీతాదేవితో. సీతమ్మని రావణాసురుడు ఎత్తుకుపోయినప్పటి నుండి అరణ్యంలో రాముడు, లక్ష్మణుడు పడ్డటువంటి పాట్లు సీతాదేవికి చిత్రపటాలు బొమ్మలు వేయించి చూపిస్తూంటాడు లక్ష్మణుడు ఉత్తర రామ చరిత్రము అనే నాటకంలో. సీత నిండు చూలాలు. నేడో రేపో ప్రసవిస్తుంది అన్నట్లు ఉంది. ఆవిడకి పొద్దుపోక బెంగగా ఉంది. బంధువులంతా కూడ యజ్ఞానికి వెళ్ళిపోయారు. అందుకని ఆవిడకి వినోదం కోసమని రాముడి పూర్వ చరిత్రాన్ని బొమ్మలు వేయించి చూపిస్తుంటే అక్కడ ఒకచోట చెబుతాడు. రాముడు యిక్కడ క్రిందపడి ధూళి అంతా శరీరానికి కొట్టుకుంటూ గొంతెత్తి ఏడ్చాడు, సీతాదేవికోసం పంపా సరస్సు దగ్గర. ఆశ్చర్యపడక్కర్లేదు. అక్కడ చెబుతాడన్నమాట, ఏమిటి? ''అనుభావ సౌందర్య మాత్ర విశేష శ్రీః దూసరిత సర్వాంగః'' అంటే దుమ్ము కొట్టుకొని శరీరం అంతా ఉన్నప్పటికీ కూడ పుట్టుకచేత సహజంగా ఉన్నటువంటి, పువ్వులాగ ఉండే ఆ లక్షణం ఆ లక్షణంగానే ఉంది. గొంతెత్తి ఏడుస్తున్నాడు. బొమ్మవేసారు. చూడు అన్నాడు. అంటే కొంతమంది దుఃఖిస్తున్నపుడు కూడ వాళ్ళకి వికృతాకారా లుండవు మొహంలో. సహజంగా ఉంటాయి. కొంతమంది నవ్వుతున్నా ఏడుస్తున్నట్లు ఉంటుంది. అంటే పుట్టుకచేత ఉన్న లక్షణాలు యివి. అవి రూపం అంటే. లావణ్యం అంటే వయస్సుతో వచ్చేటువంటిది. తర్వాత ''బలం'' అంటే రోడ్డుమీద ఎవళ్ళైనా యిద్దరు ముగ్గురు దాడి చేసారనుకోండి, యిద్దరు ముగ్గుర్ని పచ్చడి

చేసేవాళ్ళున్నారు. అది బలం. అంటే యిద్దరు ముగ్గుర్ని ఎలా వీడు కొట్టాడు అన్నది ఆశ్చర్యం. దాన్ని బలం అంటారు. అంతేగాని టానిక్కులు పుచ్చుకుంటే వచ్చేదికాదు. పుట్టుకతో ఉంటుంది వాడి బలం. బలమున్నూ, ''వజ్ర సంహన నత్వం''. యిక్కడ తప్పు అనువాదాలు చేసారు జాగ్రత్తగా ఉండాలి. వజ్రాన్ని సంహననం అంటే కొట్టటం. కొడితే ముక్కలై పోతుందిట. తప్పు ఆ అర్థం. వజ్రాన్ని కొడితే ముక్కలవ్వదు. వజ్రాన్ని ఏదిపెట్టి కొట్టినా అవతలదే ముక్కలవుతుంది. సంహననం అంటే కూర్పు. వజ్రం ఉంగరంలోనో, దేంట్లోనో వేయిస్తే దాని చుట్టూ ఉన్నటువంటి రేఖలుంటాయి చూడండి. వాటి కూర్పు ఎలా ఉంటుంది. లేదా ఎండలో ఎక్కడో పెడితే అది గోడమీద పడుతూంటే దాని ఇంద్రధనుస్సు కూర్పు ఎలా ఉంటుంది? అలాంటి కూర్పు ఉంటుందిట అవయవాలు ఒకదానికొకటి. అది వజ్ర సంహననం అంటే. అంటే డైమండులో ఎట్లా ఉంటాయో రేఖలు, వీడి శరీరంలో రేఖలు అట్లాగ చక్కగా తీర్చిదిద్దినట్లుగా ఉంటాయన్నాడు. ''సుశిరాస్సు లలాటస్సు విక్రమః'' రామాయణంలో వాల్మీకి చెప్పాడు. శిరస్సు ఎలా ఉండాలి? లలాటం ఎలా ఉండాలి? ఈ రెండూ చూస్తే వాడిలో ఎంత విక్రమము ఉన్నదో తెలుస్తుంది. తెలియకుండా రాముడితో కలియబడ్డవాడు దెబ్బ తినేస్తాడు. చూసుకోకుండా రాముడి మీదకి వచ్చారు ఖరుడు, దూషణుడు మొదలైనవారు. ఖరుడు అంటే గాడిద. పిల్లలు పుట్టి బ్రతకకపోతే బహుశః ఆ పేరు పెట్టుకుంటారు. ముందు శూర్పణఖ వచ్చి చేయవలసిన రచ్చ అంతా చేసింది. లక్ష్మణస్వామి తొందరపడ్డాడో, పడలేదో భగవంతుడికి తెలుసు. చెయ్యి చేసుకొని దాని ముక్కు, చెవికోసి అవతల పారేశాడు. తరుణ వయస్కులై ఉన్నారు. ''రూప సంపన్నౌ'' వరసన రూపం, లావణ్యం యివన్నీ. ఎంత బాగున్నారు. అలాంటి రూపం ఎక్కడా కనిపించలేదు, యిలా అంటూ, చివరకు ముక్కు, చెవులు కోసేసారు అని చెప్పింది. ఒక యిద్దరు మగవాళ్ళు, ఒక ఆడది ఉన్నారని చెప్పిందిట. ఆవిడకి సీతమీద కోపం. ముగ్గురూ ఏమయ్యా! ఆడదాని మీద చెయ్యి చేసుకున్నారుట ఏమిటి? అంటూ వచ్చారు. వచ్చే పద్ధతే అది. రామాయణంలో వాల్మీకి లోకంలో ఎక్కడ చూచాడో కాని ఆశ్చర్యంగా రాసాడు. రాముడు ఏదో

చెబుతున్నాట్ట. మాట్లాడుతూ మాట్లాడుతూనే చేతిలో ఉన్న ఈటె రాముడి మీదకి విసిరాట్ట ఒకడు. రాముడి చేతిలో విల్లు, అల్లెత్రాడు వేరే తీసేసి ఉన్నాయి. అల్లెత్రాడు కట్టాలి. అమ్ము యిందులోంచి తియ్యాలి. తీసి యిందులో పెట్టాలి. కొట్టాలి. అపుడు కదా వాడు వేసినటువంటి ఈటెకి అడ్డు పడేది. యివన్నీ ఎవడు చేసాడో, ఎపుడు చేసాడో తెలియకుండా ఈటె నడుముకి రెండుగా విరిగింది అన్నాడు. వాల్మీకి రాసాడు. అంటే వాడు ఈటె తీస్తూంటే వీడు యిది కడుతున్నాడన్న మాట. జాగ్రత్తగా చదువుకోవాలి అప్పుడు వెళ్ళిపోయి సైన్యాలతో వచ్చారుట. అలాగ ''చతుర్దశ సహస్రాణి'' ''చతుర్దశ చ రాక్షసా'' పధ్నాలుగు వేలమంది వేయిమందికి వేయిమందికి ఒక్కొక్క లీడరు చొప్పున పధ్నాలుగు మంది వచ్చారుట. వీళ్ళు ముగ్గురు. అపుడే సిద్ధంగా ఉన్నారు. ఎందుకంటే తెలుసు వీళ్ళకి వాళ్ళు వస్తారని, వెళ్ళారంటే వెనక్కి ఊరికే వెళ్ళిపోతారని ఎందుకనుకుంటారు. అంచేత ఒక సన్నని ద్వారం ఉందిట. కొండ ఇటునించి అటు దూరేది. ఆ ద్వారం దగ్గర నిల్చున్నారు. అట్లాగ అటుప్రక్క ఒకడు. యిటుప్రక్క ఒకడు రాముడు-లక్ష్మణుడు. ద్వారం లోంచి తడవకి ఒక్కడే దూరచ్చు. అందుకని ద్వారం దగ్గరికి వచ్చిన వాణ్ణి వచ్చినట్లు లాగేసారు. పధ్నాలుగు వేలమందీ చచ్చారుట. పధ్నాలుగు మందీ చచ్చారుట చివరికి అంటే వీడు యింకెక్కడన్నా నిల్చుని ఉంటే యిరుక్కుని ఉండేవాడు. అందుకని వాళ్ళు వస్తారని తెలిసి ఎక్కడ నిల్చుంటే తడవకి ఒక్కడే వస్తారో, అక్కడ నిల్చున్నారు. అయిపోయి ముగ్గురు ఒకళ్ళ మొహాలు ఒకళ్ళు చూసుకుంటూ ఉంటే ఆ మూడు తలకాయలు కూడ లేచిపోయాయి. కొట్టేసారు వాళ్ళని వదిలేస్తే యింకా పట్టుకొస్తారు, ఎందుకొచ్చింది న్యూసెన్సు లాగేయండి అన్నాడు. కనుక బలం అనే మాటకి మనం ఎంతమందినో ఆశ్చర్యకరమైన వాళ్ళని చూస్తేగాని మనకి అర్థంకాదు. బలం అంటే మనకున్న బలం. ఏదో కొంతవరకు కూరగాయల సంచి ఎత్తేయచ్చు. లేకపోతే సైకిల్ ఎత్తేయచ్చు. లేకపోతే స్కూటర్ ఎక్కడన్నా చెడిపోతే దాన్ని ఆ మెకానిక్‌షాపు దాక తీసుకెళ్ళచ్చు. ఇట్లాంటి చచ్చు విషయాలన్నీ బలం అనుకుంటాం. అది గాకుండా బలం అనేది భీముడు మొదలైన వాళ్ళ చరిత్రలు మనం చదువుకుంటే తెలుస్తుంది. అవి అతిశయోక్తులు

కావని తెలుస్తుంది. తరువాత వజ్ర సంహననం. వజ్రానికి ఉన్నటువంటి పరిస్థితి అంటే ఆ రేఖలు ఎలా ఉంటాయో, అలా తీర్పుగా ఉంటాయట. చెయ్యి, చేతిలో ఉన్నటువంటి గీతలు, మొహం, మొహంలో ఉన్న గీతలు, తమాషాగా ఉంటాయి వాళ్ళకి. ''సంహననత్వాని కాయ సంపత్తి'' ఇది శరీర సంపద అంటే అన్నాడు. అంటే వాడు చేస్తూన్నది యోగాభ్యాసం కనుక అయినట్లైతే, అది సరైన పద్ధతిలో నడూస్తూన్నట్లైతే, శరీరం శుభ్రంగా ఉంటుంది. అయితే ఈ పతంజలిగారే చెప్పిన యింతకుముందు సూత్రాలను పట్టిచూస్తే ఆవరణ భేదనం కోసం యోగాభ్యాసం చేస్తున్నవాళ్ళు దాన్ని పట్టించుకోరు. దీనికోసం యోగాభ్యాసం చేసినవాడికి శరీరం ఇలా ఉంటుంది కాని, దీనికోసం కాకుండా, దేనికోసమూ కాకుండా, యోగాభ్యాసం చేయటం కదా ఉత్తమంగా చెప్పింది ఆయన. అది చేసినవాడికి యిలా ఉండకపోవచ్చు. రమణ మహర్షిగారి శరీరం చక్కగా తడపలాగ ఉండేది చిట్టచివరి క్షణం వరకు. చిట్ట చివరికి రాచకురుపు వచ్చింది. ఏమిటి స్వామి యిది? అని అడిగితే దాని కర్మ అది అనుభవిస్తోంది. దాని గురించి మనకి కంగారెందుకు? అన్నాడు. అంటే he never cared for these things. ఆపరేషను చెయ్యాలి అంటే చేసుకోండి అన్నాడు. అయితే మీకు కొంచెం మత్తివ్వాలి. ఆపరేషను అంటే మీ యిష్టం చేసుకోండి మత్తివ్వటం మీ యిష్టం కాదన్నాడు. మత్తివ్వకుండా ఆపరేషను చేస్తే ప్రాణం గిలగిల్లాడుతుందండి. అక్కడ నేను ప్రాణం ఉంచితే కదా. యివతలకి ఉపసంహరిస్తున్నాను. మీరు ఆపరేషను చేసుకోండి అన్నాడు. వాళ్ళ శాస్త్రానికి అది చాల కొత్త. They are children to that science. అంచేత అది ఎలా సాధ్యం? అన్నారు. ఎలా సాధ్యం అనేది ఏమీలేదు. ఆపరేషను అయిన తర్వాత నాకు చెప్పండి. ఈ లోపల అక్కడ నా ప్రాణం ఉండదు అన్నాడు. అంటే వాళ్ళు మెల్లిగా మెల్లిగా ముట్టుకొని నొక్కిచూసి కత్తి అంటించి చూసి భయపడుతూ భయపడుతూ, తరువాత కొంచెం సేపయ్యేటప్పటికి శుభ్రంగా కర్బూజకాయ కోసినట్లు కోసేసారు. ఆయన మాట్లాడుతూనే ఉన్నాడు. ఆయన్ని అడుగుతున్న వాటికి సమాధానాలు చెబుతూనే ఉన్నాడు. ఎలా మీరు భరిస్తున్నారు అంటే భరించవలసిన విషయంలేదు. అక్కడ నేను జీవించటం లేదు ఈ కాసేపు అన్నాడు. I am

not living in that portion. Why do you bother అన్నాడు. అయిపోయింది, స్వామి అన్నారు. అపుడాయన మెల్లిగా యువతలకి వచ్చేసాడు. కనుక యిది పట్టి సాధించేటువంటి వాళ్ళు కూడ ఉన్నారు. యోగాభ్యాసంచేసి కణకణలాడుతూ తేజస్సుతో కనిపించి, వచ్చిన వాళ్ళని భక్తుల్నిగాని, లేకపోతే సాధకుల్నిగాని, ఆస్తికుల్నిగాని, జగజ్జగేయ మానంగా దిగ్ర్భాంతుల్ని చేసేసి, అక్కడ లక్షలు పోసేసి వాళ్ళు వెళ్ళిపోతారు. మీరేం చెబితే అది చేస్తారు లేదా యిక్కడ ఈ బజార్లో బిల్డింగ్ కట్టించండి అంటే కట్టించేస్తారు. వాడు తర్వాత పాపం దివాలా తీసేసినప్పటికీ వాళ్ళు ఏం పట్టించుకోరు. అలాంటి ఆజ్ఞాపరిపాలనం మొదలైనవి వస్తాయి ఈ రకమైన సౌందర్యాన్ని ప్రత్యేకంగా సాధించుకున్నపుడు. కాని పెద్దలు దీన్ని సాధించటం అనేది అంగీకరించరు. రామకృష్ణ పరమహంస అప్రయత్నంగా యిదివస్తే తొలగించుకున్నాడు. ఆయన జీవితచరిత్రలో మనం చదవచ్చు. ఎందుకంటే ఆయనకి యిది వచ్చేటప్పటికి చుట్టూ జనం చేరటం మొదలుపెట్టారు. ఎక్కడికెళ్తే అక్కడికి తీర్థ ప్రజలల్లే సినిమా స్టార్ దగ్గరికి వెళ్ళినట్లు. ఒక రెండు రోజులు ధ్యానంచేసి దాన్ని తొలగించుకున్నాడు. ఇపుడు మనం ఫొటోల్లో చూస్తున్న మొహం ఆ తొలగించుకున్నాక కనిపించేది. ఎందుకో తరువాత చెప్తాడు. జ్వాల్‌కూల్ గారే మనకీ రహస్యాలు కొన్ని చెప్పారు. Theosophical Hearing అనే గ్రంథంలో రమణ మహర్షిలాంటి సిద్ధులకి రాచకురుపు మొదలైనవి ఎందుకొచ్చినాయో వ్రాసాడు. వాళ్ళకి స్వకర్మ లేకుండా నశించిపోయిన తర్వాత ఆ దేహంతో జీవిస్తూ వాళ్ళు దేశానికి, నరజాతికి చేసే మేలు అనేక విధాలుగా సంకల్పిస్తారు. అందులో ఒక్కొక్కడు జాతియొక్క దుష్కర్మను తన శరీరం ద్వారా బయటికి కొంత వెళ్ళగొట్టటానికి ప్రయత్నం చేస్తాడు. కొన్ని లక్షలమంది చేసినటువంటి దుష్కర్మ వాడి శరీరం మీద ఉన్న వ్యాధిరూపంలో బయటికి వెళ్ళిపోతుంది. ఇదిగో ఉదాహరణలు అని చెప్పి, రమణ మహర్షిని వాళ్ళని యిచ్చాడు జ్వాలాకూలుడు. ఇట్లాంటివి మనకా పుస్తకంలో చాల సందేహాలు తీరుతాయి. యిపుడు తరువాత సూత్రంలోకి వెళుతున్నాం.

## 48. గ్రహణ స్వరూపాస్మితాఽన్వయార్థవత్త్వ సంయమాదిన్ద్రియజయః।

గ్రహణ = గ్రహించే శక్తి, స్వరూపా = యింద్రియ స్వరూపం, అస్మిత = నేను చూస్తున్నాను అనే అవిద్య (Iam ness); అన్వయం = పై మూడింటికీ ఉన్న సంబంధం మీద, సంయమాత్ = సంయమము చేయుట వలన, అర్థవత్త్వమః = యింద్రియముల యొక్క ప్రయోజనము, యింద్రియ జయః = యింద్రియముల మీద జయం కలుగును.

**ఇంద్రియముల స్వభావము, ప్రత్యేకతలు వానిలో పనిచేయుచున్న అహంకారము, వాని వ్యాప్తి, ప్రయోజనము అనువానిపై సంయమము చేసినచో ఇంద్రియ జయము సిద్ధించును.**

**వివరణ :** ఈ సూత్రంలో గ్రహణశక్తి, యింద్రియ సంబంధం, అస్మిత అనే అవిద్యకు ఉన్న సంబంధం మీద సంయమంచేస్తే ఇంద్రియ జయం వస్తుందని చెప్తున్నారు. ఇంద్రియములు చాల ప్రమథనం చేస్తూ ఉంటాయి. 'ఇంద్రియాణి ప్రమాథీని' వాట్లని అదుపులో ఉంచుకోవాలి. ఎన్ని సంవత్సరాల తర్వాతైనా అవి మనం అజాగ్రత్తగా ఉంటే ఎదురు తిరగవచ్చు. వాట్లని తొక్కి ఉంచటం లాభంలేదు. ఎపుడో విప్లవం (revolution) తీసుకు వస్తాయి. వాటికివ్వవల్సినవి వాట్లకి యిస్తూ ఉండాలి. వాట్లని ఉంచవలసిన హద్దుల్లో ఉంచాలి. మిగతా వాళ్ళందరితో చేస్తున్నట్లే వాటితో మైత్రి చేయాలి కాని యింద్రియాలతో శత్రుత్వము పెట్టుకుంటే ఏదో ఒకరోజున తినేస్తాయి. 'హరంతి ప్రసభం మనః' దానికి కావలసిన వాటికి మనస్సుని ఎత్తుకుపోతూ ఉంటాయి. మనస్సుకోసం అవి పనిచేయటం కాదు. యింద్రియములను జయించటం కోసం ఒక్కొక్క దానిమీద సంయమం చేయండి. మొదట గ్రహణం మీద సంయమం చేయండి. ఇంద్రియములు విషయాల్ని ఎలా గ్రహిస్తున్నాయో, దాన్ని గ్రహణ శక్తి అంటాం. కన్ను వెలుగుని ఎలా గ్రహిస్తోందో, దానిమీద రోజూ కాసేపు ఆలోచించండి. ఒక రెండు మూడు నిమిషాలు వెలుతురు కంటిమీద పడుతోంది. కన్ను వెలుతురును స్వీకరిస్తోంది. కన్ను వెలుతురుని ఎలా స్వీకరిస్తోందో ఆలోచించండి. ఆలోచించేటప్పటికి దర్శనం అవుతుంది. అలాగే చెవి శబ్దాన్ని ఎలా గ్రహణం చేస్తున్నదో ఆలోచించండి. ముక్కు వాసనని ఎలా గ్రహణం చేస్తూన్నదో, ఇట్లా ఒక్కొక్కటే సరదాకి పదేసి

రోజులు చేయండి. రెండవది చేస్తున్నపుడు రెండూ కలిపి, మూడవది చేస్తూన్నపుడు మూడూ కలిపి, నాల్గవది చేస్తున్నపుడు నాలుగూ కలిపి, ఐదవది చేస్తున్నపుడు ఐదూ కలిపి చేయండి. శరీరానికి చల్లగా ఉందనుకోండి చలివేస్తోంది. స్పర్శజ్ఞానం మనమీద ఎలా పనిచేస్తోందో ఆలోచించండి. శరీరానికి చలిగాలి తగలటమున్నూ దానికి చలివేయటమును ఈరెండింటికీ మధ్య ఉన్న స్పర్శ బిందువులు (contact points) ఏమిటో ధ్యానం చేయండి. దాన్ని గ్రహణాన్ని ధ్యానం చేయటం అంటారు. గ్రహణం అంటే గ్రహణశక్తి, గ్రహించటం (nature of the grasp of senses) అని చెప్పాడు జ్వాలాకూలుడు.

గ్రహణం తర్వాత స్వరూపం అంటే ఆ యింద్రియం యొక్క స్వరూపం ఏమిటి? అలా ధ్యానం చేయండి. కన్నుద్వారా చూస్తూ యింద్రియం యొక్క స్వరూపం ఎట్లా ఉంటుంది? ఏ సైన్సు ద్వారాను తెలియదు. మీకు తెలుస్తుంది మీరు ధ్యానంచేస్తే. చూచుట అనగా ఆప్టిక్స్. పుస్తకంలో ఉన్న బొమ్మలన్నీ చూసినాగాని, అందులో ఎక్కడా చూడటం అనేది ఉండదు. చూడటం మీ కన్నేగాని, అందులో వేసిన బొమ్మ లన్నింటిలో ఏ ఒక్క బొమ్మైనా చూస్తుందా? లేకపోతే చూపిస్తుందా? వెలుతురు ఎక్కడనించి పడుతూ ఉంటే ఎక్కడనించి బొమ్మ పడుతుందో, ఆ బొమ్మలువేసి యిది కనిపించుట అంటారు. అది కనిపించటం కాదు. కనిపించటం మన కంట్లో ఉంది. వాడు కనిపించటాన్ని గురించి వ్రాసినవి కాకమ్మ కథలు. ఆ పుస్తకంలో ఏ పేజీకైనా కనిపిస్తుందాండి ప్రపంచం? కనుక ఆ పుస్తకంలో రాసి ఉన్న ఏ అక్షరానికి సంబంధించినది కాదు కనిపించటం అనేది. మీరు దానియందు ధ్యానంచేస్తే మీకు తెలిసేది మాత్రమే. అందుకనే దీనిమీద ఆధారపడి ఇంకొక శాస్త్రంలో హానిమన్ మనకి యింకొక సూత్రం యిచ్చాడు. ఒక రోగియొక్క రోగ విధాన లక్షణాలు తెలుసుకునేటప్పుడు మీ కంటికి వాడెలా కనిపిస్తున్నాడు? చెవికి వాడెలా వినిపిస్తున్నాడు? మీ ముక్కుకి వాడి దగ్గర కూర్చుంటే గదిలో ఏ వాసనలు వేస్తున్నాయి? మీ శరీరానికి వాడి దగ్గర కూర్చుంటే ఏ రకమైనటు వంటి మార్పులు కనిపిస్తున్నాయి? ఇవి లెక్కలోకి తీసుకోండి. మరియు వాడి కంటికి కనిపించటం ఎలా ఉంది? పుస్తకం మసకగా ఉందా? వాడి ముక్కుకి వాసన ఎలా ఉంది? ఇవన్నీ తెలుసుకోండి అన్నాడు. ఇదికాక మీరు యంత్ర సామగ్రి పెట్టి అల్ట్రా సోనిక్స్ పెట్టినా, మైక్రోస్కోపు పెట్టినా, అల్ట్రావైలెట్ రేస్

పెట్టినా సరే, ఎక్సరే పెట్టి చూసినాసరే, మీకు వ్యాధి లక్షణం చచ్చి గీ పెట్టు కున్నా తెలియదు. వాడు ప్రవర్తిస్తున్న ప్రవర్తనలో ఉన్న తేడాలలో వ్యాధి లక్షణం తెలుస్తుంది అని చెప్పాడు. యంత్ర సామగ్రి (Instrument) వల్ల తెలియదన్నాడు. ప్రపంచంలో ఉన్నటువంటి ఆప్టిక్ లేబరేటరీస్ అన్నింటిలో కూడ ఏ యంత్రమైనా చూస్తుందా. అంచేత చూడటం అంటూ తెలియాలంటే ఆ apparatus ను వాడుతున్న వాడికి తెలియాల్సిందే గాని అందులో తెలిసేందుకు ఏం లేదు అక్కడ. అలాగే ఆప్టిక్స్ పుస్తకం అంతా చదివితే కళ్ళ జబ్బులున్నటు వంటి వాళ్ళకి మనం కళ్ళజోడు షాపు పెట్టడానికి పనికొస్తుంది. ఆ అద్దాలు అరగ దీసుకుంటూ కూర్చుంటానికి, దానికి సాన పట్టడానికి, లేకపోతే ఫ్రేములు ఎవడి కంటికి ఏవి పడతాయో అవిచూస్తూ ఉండటానికి యిట్లాంటి వాటికి పనికి వస్తుంది తప్ప, మనకి చూడటం అనేది ఏమిటో తెలియటానికి ఏమాత్రం పనికిరాదు. కనుక ధ్యానంచేస్తే యింద్రియం యొక్క స్వరూపం తెలుస్తుంది. చూచుట అనగా ఇదేనండి అని కాకుండా, మీకు బోధపడుతుంది అన్నాడు.

వినుట అనగా నేమి? అంటే బోధపడుతుంది. ఇవి చాతనవుతాయి రోజా కాస్సేపు గ్రహణము నందు తర్వాత స్వరూపము నందు అంటే the nature of that organ ధ్యానం చేసుకుంటూ ఉంటే. 'అస్మితా' అనే దానియందు కూడ ధ్యానం చేయండి. అస్మిత అంటే ఏమిటండి? కన్నుద్వారా చూస్తూంటే మీకు నిజంగా చూడటం ఎపుడు జరుగుతోంది? కన్నులో మీరుండి నేను చూస్తున్నాను అని అనుకున్నపుడే కదా. లేకపోతే కన్ను చూస్తోంది అని అనుకుంటే మీ కంటికి కనిపిస్తుందా? కనుక నేను అనే వెలుగు గోడవతల ఎంతపెద్ద candle power లో ఉన్నా, ఆ వెలుగుని చిన్నకన్నులోంచి యివతలకి రప్పించేటప్పుడు యివతల తెరమీద సినిమా కావల్సింది పడుతుంది. అంతేకదా. సినిమా ప్రొజెక్టరుకి వెనకాల అక్కడ ఉన్నటువంటి కార్బన్‌రాడ్స్‌లో ఆర్క్‌లాంపు వెలిగితే ఎంత వెలుగు ఉంటుందో తెలుసునా? సూటిగా దానివంక చూస్తే కళ్ళు మళ్ళీ పనికి రాకపోవచ్చు ఒక్కొక్కపుడు. అంత వెలుగు ఉంటుంది. ఆ వెలుగంతా పెట్టెలో పెట్టి ఇవతలకి తెరమీద పడేందుకు అందులో కొంత వెలుగు మాత్రమే పడేందుకోసం కన్నంచేసి దాంట్లోంచి పడేట్లు చేస్తున్నామా? లేదా? అలాగే కంటిద్వారా లోపల ''నే'' ననేటువంటి

వెలుగు మొత్తం, కార్బన్ రాడ్ వెలుగల్లే, మనలో ఉంది. ఆ నేను అనే వెలుగు మొత్తంలో ఉంటూ ఉండంగ ఈ కన్ను అనే వాట్లల్లోంచి కొంత వెలుగు మాత్రం ఇవతలకి లాక్కువస్తే నేను చూస్తున్నాను అనే కొంచెం నేనుగా యిక్కడ ఉంటారు మీరు. 'అసలు నేను' మీ శరీరంలో శిరస్సు దగ్గరనించి పాదాలుదాకా ఉన్నారు. ఆ నేను అనేది మొత్తం కలిసి ఉండటంవల్ల surface tension తప్ప వేరే ఏమీ లేదు. చోటులో ఆ నేను ఉంటుంది. శరీరం ఉన్నప్పుడు ఆ నేను అనేది ఉన్నట్లు దానికి తెలుస్తుంది. మాట్లాడుతుంది. చూస్తుంది. దానికోసం యంత్రం శరీరం. ప్రకృతి ఆ యంత్రాన్ని కనిపెట్టి చోటు అనేది ఆ యంత్రంద్వారా మాట్లాడుతోంది, చూస్తోంది, వింటోంది, అదే మనం. ఈ యంత్రమే మనం అని అనుకుంటున్నాం. అక్కడే దెబ్బ తినేస్తున్నాం, ఎందుకని? ఈ యంత్రంలో పుట్టాం. ఈ యంత్రంలో పెరుగుతున్నాం. ఈ యంత్రంలో చచ్చిపోతాం కనుక. ఈ యంత్రమే మనమని అనుకుంటున్నాం కాని మనకి ఈ యంత్రం యివ్వబడ్డది అనేది తెలియటం లేదు. అంటే నేనంటే యిదే అనుకుంటున్నాం గాని, దీని వెనుక నేను మొత్తంలో ఉంది అని తెలీదు. అది దీని అస్మిత. తరువాత చెవులు ఉన్నాయి. దీనియందు నేను వింటున్నాను అనే అభిప్రాయం ఒకటి ఏర్పడుతుంది. దీంతోటే దాని అస్మిత. అస్మిత అంటే అర్థం. అది అంటే "I amness" అన్నమాట. నేను అనేది, నేను వింటున్నాను. నేను చూస్తున్నాను. ఇట్లాంటివి ఐదు యిందులో ఏర్పడితే వీటి మధ్యన అస్మిత. దాన్నే అహంకారం అంటారు. చిన్న అహంకారం అంటారు. ego కాదు. ఈ అహంకారం వేరు. అంటే నేను అనుకుంటున్నటువంటి local officer అంటే బిల్ కలెక్టర్ లాంటివాడు. ఒక్కొక్కపుడు ఎవరూ లేకుండా ఉంటే తానే కలెక్టర్ అని దబాయిస్తాడు. జాగ్రత్తగా ఉండాలి. చదువుకోని వాళ్ళు తట్టగిట్ట పెట్టుకొని అక్కడ ఉంటే, ఏయ్ కలెక్టరుగారు వస్తున్నారు లే అని చెప్పిస్తాడు. ప్రక్కన ఉన్న బంట్రోతు చేత. వీడు అలాంటివాడు. ఎందుకంటే వీడి పేరూ నేననే అంటాడు. ఈ చెవిలో ఉన్నవాడూ నేననే అంటాడు. ముక్కులో ఒక నేను, కంట్లో ఒక నేను ప్రతిదాంట్లో ఐదుగురూ నేననే అంటారు. వీళ్ళందరి పైన ఉన్న మేస్త్రీ మనస్సులో ఉన్న 'నే' ననేవాడు. వీడి మీద ఉన్నటువంటి పై మేస్త్రీ బుద్ధి అనేవాడు. ఆ బుద్ధికి పైనున్న నేను ఈ అసలు 'నేను'. కనుక అస్మితని గురించి కూడ ధ్యానం చేయండి. నేను చూస్తున్నాను అన్నపుడు,

ఆ నేను చూస్తున్నాను అన్నటువంటి ఆ నేను యొక్క స్వరూపమేమి? అంటే కన్ననే కన్నంలోంచి చూస్తున్నటు వంటిది. ఈ మొత్తం అంతా నేను కాని, ఈ కన్నంల్లోంచి నేనల్లే కనిపిస్తోంది అని తెలుస్తుంది. అంటే సినిమా పడుతున్న స్వరూపం ఏమిటి? సినిమా చూసి అందరూ ఏడుస్తూ నవ్వుతూ ఉండేవాళ్ళు కాక ఆ వెనుక ఏముందని అటు వెళ్ళాడనుకోండి, ఎవడో వాడికి కొంచెం ఆలోచన వస్తుంది. వెనక్కి ప్రొజెక్టరులోకి సినిమా ఎన్నిమాట్లు చూసినా అందులో ఏడుపు వస్తే ఏడిచి, నవ్వువస్తే నవ్వి వచ్చినటువంటి వాడికి తెరమీదది తప్ప యింకేమి తెలీదు. అది సంసార జీవులంటే. అదికాక ఆ వెనుక ఏం జరుగుతుంది? నచికేతుడు యముడు దగ్గరికి వెళ్ళాడు. ఏం కావాలి అని అడిగితే అందులో ఏముంది? అని అడిగాట్ట. మృత్యువు అని బోర్డుకట్టి ఉందిట. ''తప్పు నాయనా! కుర్రవాడివి, వృద్ధిలోకి రావలసిన వాడివి. అన్నాడు యముడు. ''అది తెలుసుకుందామనే వచ్చానండి. మిగతావన్నీ మీరు చెప్పటం ఎందుకు?'' అంటే, ''నీకు రాజ్యం యిస్తాను. పదివేల సంవత్సరాలు రాజుగా పరిపాలిద్దువుగాని'' అన్నాడు. ఆపైనో అన్నాట్ట. వాడా కుర్రాడు? ''ఆపైన చచ్చిపోవాల్సిందే నాండి'', అంటే ''మరి తప్పదనుకో'' అన్నాడు. ''అదే అడుగుతున్నాను. అపుడు ఈ రాజ్యం అక్కర్లేదు. ఆ చచ్చిపోవటం అంటే ఏమిటో చెప్పండి'' అన్నాట్ట వాడు. ''నీకు దాసదాసీ జనములు యిస్తాను. మేడలు యిస్తాను. 50వేల సంవత్సరాలు దీర్ఘాయువు యిస్తాను'' అన్నాడు. ఆపైనో, అన్నాట్ట. చివరికి వాడికి చెప్పక తప్పలేదు. తలుపు తీసి చూపించాడు. తీసికెళ్ళితే ఏం కనిపించిందిట అందులో? మనం కఠోపనిషత్తు జాగ్రత్తగా చదువుకుంటేనే తెలిసే విషయం. ఏమీలేదు. ఉత్తి ద్వారం ఉన్నది. దానికి ఒకప్రక్క పుర్రెబొమ్మ, ఎముకల బొమ్మలువేసి చచ్చుట అని రాసారు వాళ్ళు. అందులోంచి యిటునించి అటు తెరుస్తారు. కాని దూరితే ఏం జరుగుతుందో తెలీకుండా ఏం చేస్తున్నారు. ఆ దూరబోయే ముందు యిటుప్రక్క క్లోరోఫారమ్ పెట్టి మన నెత్తిమీద ముసుగేసి కొట్టి అటునించి లాగుతున్నారు. అంచేత దూరటం ఎవరికీ తెలీదు. మృత్యువు అంటే అట్లాంటిది. దూరాక అవతల ప్రక్క ఏముంటుంది? అదే ద్వారానికి పుట్టుట అని రాసి ఉంటుంది. అపుడక్కడ కెవ్వున అరుస్తాడు యింకో శరీరంతో. ఈ మధ్యన ఏం జరిగిందో తెలీకుండా టప్పున జరిగిపోతుంది. అది చూపించాట్ట. ఉన్నది ఒక్కటే ద్వారం. అప్పటినించి యిప్పటివరకు.

మరమ్మత్తు కూడ చేయించలేదు. దానికి గడియలు గిడియలు లూజు అయి ఉన్నాయి. అటునుంచి ఏమో మృత్యువని కనిపిస్తూ ఉంటుంది. ఇవతలకి వచ్చాక ఎవరన్నా చూడగల్గితే. ''జననం'' అని కనిపిస్తూ ఉంటుంది. ఆ మంత్రసాని, యింట్లో ఉన్నవాళ్ళు, డాక్టరు తప్ప, వాడు చూడలేడుగా, జననం అనేది. ఇంతే ఇక్కడ విషయం. ''నలుగురికీ చెప్పి నా మర్యాద తీయకు'' అన్నాట్ట. జాగ్రత్తగా కఠోపనిషత్తులో ఏముందో మనం యిపుడున్న భాషలో చెప్పుకుంటే అర్థం యిది.

కనుక అస్మిత అంటే అర్థం యిది. 'I am-ness' అని చెప్పుకోవచ్చు అస్మిత అంటే. తర్వాత 'అన్వయం' అంటే ఏమిటి? ఈ మొదట చెప్పిన గ్రహణశక్తికిన్నీ, ఈ రెండవదిగా చెప్పిన యింద్రియ స్వరూపానికి, ఈ మూడోది చెప్పినటువంటి అస్మితకిన్నీ ఈ మూడింటికీ ఉన్న సంబంధం మీద కొంచెంసేపు ఆలోచించండి అన్నాడు. వాటివాటి అన్వయం. అంటే **mutual relationship between any two of the three entities.** ఈ మూడింటిలో ప్రతి రెండింటికీ నడుమ ఉన్న పరస్పర సంబంధమును ధ్యానం చేయండి. దాన్నే అన్వయం అంటారు. ధ్యానంచేసి యింకా అర్థవత్త్వము మీద కూడ ధ్యానం చేయండి. అర్థవత్త్వము అంటే వీటి ప్రయోజనము. అంటే కన్ను చూస్తున్నది అనుకోండి, కన్నులో వెలుతురుని గ్రహించేశక్తి అనగానేమి? కంటి నరములో లేదు. ఎక్కడుందో తెలియాలి. తెలిస్తేనే మీరు మాట్లాడగల్గుతారు. ఈ మూడు తెలుసుకొని ఈ మూడింటికి సంబంధం ధ్యానం చేయాలి. అంటే వెలుతురు, కన్ను, కంటియొక్క గ్రహణశక్తి, ఈ కనబడటం వీటికి సంబంధించినవన్నీ కూడ. ఈ కనబడటం అనగా ఏం జరుగుతోంది అని ధ్యానం చేయాలి. తర్వాత అర్థవత్త్వము. అంటే ఈ కనబడటం అనేది మనకు నిజమైన ఏ ప్రయోజనముగా ఉన్నది. అవి ఇవి చూడటానికేనా? లేకపోతే పుస్తకాలు చదవటానికా లేకపోతే యింతకంటే యింకేదైనా జీవితంలో పరమావధియైన ప్రయోజనం కలదా? పుస్తకాలన్నీ చదివి ఎవడికీ ఉపయోగించకుండా చచ్చిపోయాం అనుకోండి. కన్నువల్ల ప్రయోజనం జరిగినట్లేనా? ఎన్నడూ కాదు కదా. గోడకున్న కన్నాల్లాంటివి అన్నాడు కదా. అలాంటివి కళ్ళు. ప్రహ్లాద చరిత్రలో చెబుతాడు అంటే కళ్ళవల్ల మనం యితరులకు ఏమన్నా ఉపయోగించే పనులు చేయటానికి కన్నులు

ఉపయోగించాలి. చెవులవల్ల యితరులు వాళ్ళ బాధలేమైనా చెబుతూ ఉంటే విని వాళ్ళకేదో మందో, మాకో లేకపోతే ఉపచారమో, లేకపోతే వాళ్ళక్కావలసిన సలహా చెప్పటమో, దానికి ఉపయోగించాలి. కావాలంటే నువ్వు జీవించటానికి కూడ కొద్దిగా ఏదన్నా ఫీజు పుచ్చుకో మరీ వాళ్ళని తినేసేయకుండా. ఇట్లాగ యింద్రియాలయొక్క ప్రయోజనం ఏమిటి? అంటే యితరులకు ఉపయోగించుట. నీకు ఉపయోగించుట అనేది తెలుస్తుంది. పుస్తకాలు చదవటంకోసం ఉన్నాయి. కన్నాల్లోంచి చూట్టకోసం ఉన్నాయి. దిక్కులు చూట్టకోసం ఉన్నాయి. కిటికీల్లోంచి చూట్టంకోసం ఉన్నాయని కాకుండా, జీవితంలో ఒకానొక స్థితి సేవాధర్మంలో నిన్ను నువ్వు భగవత్స్వరూపమైన సృష్టికి అంకితం చేసుకుంటంలో దాని ప్రయోజనం తెలుస్తుంది. ఇలాగ ధ్యానం చేసుకుంటే అర్థవత్త్వము. ఇలాగ సంయమం చేసుకుంటంవల్ల ఇంద్రియజయం పరిపూర్ణంగా వస్తుంది. ఎందుకని? మీలో భాగములుగా యింద్రియాలు ఉంటాయి కాని, ఇంద్రియాలకి వేరే అస్థిత్వము ఉండటం అనే రోగం పోతుంది. మంత్రిగారు, సెక్రటరీగారు, టైపిస్టు ముగ్గురూ ఒక్కమాట మీద ఉంటారు కాని, వాళ్ళ గదుల్లో వాళ్ళు కుట్రలుచేస్తూ వీళ్ళ గదుల్లో వీళ్ళు నిస్పృహాయంగా ఉండరు. ఆస్థితి దాటుతుంది. అంటే ముగ్గురూ ఒకేమాట మీద ఉంటారు. ఎవడన్నా ఏదన్నా యిచ్చి అప్లికేషను టైపుకొట్టి మంత్రిగారికి యివ్వాలంటే మంత్రిగారి దగ్గరనుంచి ఒకచీటి తెచ్చుకోమంటారు, అలాగ ఉంటుంది, యోగాభ్యాసం చేసినవాడికి. అది అభ్యాసం చేయటంవల్ల దానంతట అది వస్తుంది. ఇందులో ఏదికూడ మనం ఎక్కువకాలం అభ్యాసం చేయక్కర్లేదు. దానిమీద మనస్సు పెట్టండి. మిగిలిన పని అదే చేస్తుంది. ఎందుకంటే అష్టాంగములు ఎపుడైతే మీరొకమాటు సాధనచేసి సంయమం చేయటం అనేటువంటిది వచ్చిందో ఆ వెలుగును అటు ప్రక్కకి focus చేయటమే. మీరు చేయవలసిన ప్రయత్నం అంటూ యిక్కడేం లేదు. ''తస్య భూమిషు వినియోగః'' అంతే. ఆ లైటు ఎటు ప్రక్కపెట్టాలి? దేనివైపు వేయాలి? అది అలా పెట్టటమే అంతేగాని లైటు పంపుకొట్టటం, డ్రైవ్ చేయటం ఏం ఉండదు. అంటే మీరు చేయవలసింది సాధన. అంటే object మీద aware గా ఉంటే అది వచ్చేస్తుంది. గమ్యం పెట్టుకొని ఆ గమ్యంమీద గనుక మనస్సు నిలబడి ఉంటే మీకా గమ్యం వస్తుంది.

## 49. తతో మనోజవత్వం వికరణభావః ప్రధానజయశ్చ।

తతః = దానివలన, మనోజవత్వం = మనస్సుకున్న వేగం వచ్చుట, వికరణ భావః = ఇంద్రియములు అక్కరలేని భావము, ప్రధాన జయః = సృష్టికి మూల ప్రకృతిని జయించగలుగుట; చ = మరియును.

**దానివలన మనస్సునకు గల వేగము దేహమున కబ్బుట, భౌతికావయవములు అక్కడ లేకయే ఇంద్రియములు విషయములను గ్రహించుట కలుగును. త్రిగుణములకు అతీతముగా నున్న ప్రకృతిపై కూడ జయము కలుగును.**

**వివరణ :** ఈపై చెప్పినది వచ్చేటప్పటికి సహజంగా మనోజవత్వం వస్తుంది. అంటే మనస్సుయొక్క వేగం దేహమున కబ్బుతుంది. ''మనోజవం, మారుత తుల్యవేగం'' అని మనం ఆంజనేయస్వామి స్తోత్రంలో చదువుతాం. మనోజవం ఎలా ఉంటుందో ఎన్నడూ మనం ఊహించం. మనోజవం ఉన్నవాడు ఎట్లా ఉంటాడు? మనస్సుయొక్క వేగం అంటే ఎట్లా ఉంటుంది? యిక్కడ ఉన్నవాడు లండన్‌లో ఉన్న స్నేహితుణ్ణి గురించి ఆలోచిస్తాడు. అంటే మనస్సు ఇక్కడ నించి లండన్ వెళ్తుంది. క్షణమాత్రం పట్టదు. పుట్టింట్లో ఉన్న మా ఆవిడ ఎలా ఉంది? అని ఆలోచిస్తాడు. ఇవన్నీ మనోజవం లేని వాళ్ళం చేసేపని. మనస్సు వేగంగా వెళ్ళుతుంది కాని మనం చెప్పిన వేగంలో వెళ్ళదు. దానిష్టమొచ్చిన వేగంలో వెళ్తుంది. అలాకాకుండా మనోజవత్వం అంటే ఎలా ఉంటుందో తెలుసునా? మీరు ఎవరితోనో మాట్లాడుతూ ఉంటారనుకోండి ఒక మేడమీద నిల్చుని. పైన డాబామీద ఉన్న ఎవరో కుర్రవాడు పిట్టగోడ మీంచి పడతాడు. మనం బాబోయ్ పడిపోతున్నాడు అని అరిచి లేస్తాంకాని ఏమి చేయటానికి మనస్సు పనిచేయదు. ఈలోగా వాడు పడనే పడతాడు. కాని మనోజవత్వం తెలిసినవాడు పైనించి పడుతూ ఉంటే చూడంగానే ఏ టైముకి పిల్లవాడి శరీరం ఎక్కడ పడుతుందో అక్కడికి వెళ్ళి చెయ్యి పడతాడు. మీతో మాట్లాడుతూనే ఉంటాడు. అపుడు ఆ పడినవాడు వీడి చేతిలో పడతాడు. పెద్దదెబ్బ యిద్దరికీ తగలదు. అంటేవాడు అక్కడ పడుతూ ఉండంగ చూసి దానికి కావలసిన వేగంలో వెళ్ళతాడు. వాణ్ణి రక్షిస్తాడు. అంటే వాడు ఏ స్పీడులో అక్కడికి వచ్చి చేతులు పెడితే ఆ పడుతూన్నవాడి స్పీడు కొంతతగ్గి వాడి చేతిలో పడతాడో అది చేసేస్తాడు.

చేయగలమా? అని ఆలోచిస్తే చేసేదేముంది? కాలు అరటిపండు తొక్కమీద పడ్డదనుకోండి. పడుతూ ఉండంగ చేతులు అడ్డం వస్తాయి కదా. మన మనస్సే ఈ చేతుల్ని అడ్డం తీసుకు రావాలనుకోండి. అపుడు తీసుకురాగలమా? మనస్సు ఆలోచిస్తుంది. తీరా ఈ చేతుల్ని అడ్డం పెడితే ఇవికూడ విరిగితే, ఇవి ఆపగలవా? లేవా? అని ఆలోచించే లోపల ఉన్న ప్రకృతి వీణ్ణి అడిగితే పనులవ్వవు కనుక, వీణ్ణి అడక్కుండా చేతులు దానంతట అవి అక్కడికి వచ్చి వేరే ఏర్పాటు చేసింది. మనని అడిగిచేస్తే దొంగలు పడ్డ ఆర్నెల్లకి కుక్కలు మొరిగినట్లుంటుంది. అంటే కాలుజారి బోర్లా పడ్డాక, నెత్తురు కక్కుకున్నాక అపుడు చేతుల్ని యిలా రమ్మంటాం. అందుకని ప్రకృతి వాళ్ళని అడక్కుండా యిక్కడ వేరే ఆఫీసు పెట్టింది. దాన్నే Instincts and reflexes అంటారు. ఆ ఆఫీసులోంచి మీకు అలారం కొట్టంగానే automatic గా చేతులు ముందుకు వచ్చేటట్లు ఏర్పాటు చేసింది ప్రకృతి. ఇది తెలియక సైకాలజిష్టు మనది consciousness అనిన్నీ, ఇది sub-consciousness అని చెబుతాడు. Instincts sub-conscious ఎట్లా అవుతాయి? Supra-conscious అవుతుంది. Ruflexes and instinct న్నూ, మన మెరుగనటువంటివి, చూచేటు వంటివి, మనకంటే చాల తీవ్రతరమైన పద్ధతిలో precision తో పనిచేసేది sub-conscious ఎట్లా అవుతుంది? Supra-conscious అవుతుంది. Here lies one of the nasty unscientific theories of modern psychology. వచ్చే శతాబ్ది వాళ్ళు నవ్వుకుంటారు. అడక్కుండా సాయంచేసే తెలివితేటలేమో sub-conscious, వీడు పరీక్ష పాసయి ఉద్యోగం తెచ్చుకున్నదేమో conscious యా? తప్పులు యివి చేస్తాయిగాని అవి చేయవు. Instinct, Reflexes తప్పులు చేయవు. Conditioned reflexes అయితేతప్ప, natural reflexes తప్పులు చేయవు. ఒక్క ''పావ్‌లోవ్'' ఒక్కడే సరిగా కనిపెట్టి యిచ్చాడు. Jung and pavola వరకు సైకాలజీ వచ్చింది. తరువాత వచ్చిందంతా అయోమయాలజీ.

కనుక మనోజవత్వం అంటే మనస్సు జవం, వీడి శరీరంలో ఉన్న ప్రతి అణువణువుకీ, కణం కణానికీ కలుగుతుంది. మనస్సుయొక్క జవత్వం అంటే అది. ఆంజనేయస్వామి యొక్క మనోజవం అంటే ఆయన చెట్టు కొమ్మమీద కూర్చుని ఈవిడ సీతాదేవేనా అని చూసే టైములో ఆవిడ

.రిపోసుకునేందుకు ఏమీ సాధనం దొరక్క చనిపోదామని, ఆ చెట్టుకి ఉరి
ేసుకునేటువంటి క్షణాల్లో ఉన్నదావిడ. అంతే మనకి సుందరకాండ చదివితే
ులుస్తుంది. అంటే ఆవిడ చనిపోవటానికి నిశ్చయం చేసుకున్నది. ఈయన
ొమ్మమీంచి చూస్తున్నాడు, ఏం చేయాలి? అప్పుడు ఏం చేస్తే నమ్మతుంది.
ంజనేయుడు అక్కడనించి వచ్చాడని నమ్మటానికి ఎట్లా వీలవుతుంది?
ుడు అక్కడనించి 'అయ్యయ్యో' అని అంటూ ఉంటే ఇంకొంచెం తొందరగా
ురి వేసేసుకుంటుంది, వీడెవడో పట్టికెళ్ళి రావణాసురుడికి అప్పజెపుతాడేమో
నుకొని. అందుకని మనోజవం మారుత తుల్యవేగం అనే ఆయన ఏం
ేసాట్ట మొట్ట మొదటిగా ''జనక మహారాజు చాల మహానుభావుడు'' అని,
ాపైనించి అన్నాట్ట. ''ఆయనకి గర్భంలో కాకుండా యజ్ఞంలో నాగలి దగ్గర
పుట్టినటువంటిది, సీత. సూర్యవంశపు రాజు దశరథుడు. ఆయనకు
పుట్టినటువంటి వాడు విల్లువిరిస్తే పెళ్ళి చేసుకున్నదిట. ఇలా మొదలుపెట్టాడు.
అంటే యిక్కడ చుట్టుప్రక్కల ఎవరికీ తెలియనటువంటి విషయాలు.
ఆవిడకి నమ్మకం పుట్టాలంటే ఎట్లా పుట్టాలి? ఎవరూ చెప్పుకునేవి కావు.
విన్నవి కావు. ఎందుకంటే చుట్టూ సముద్రమే. లంక అంటేనే చుట్టూ
సముద్రం. అంచేత యిక్కడెక్కడా ఎరగనివి, వినిపించనివి. ఆ
ఉరేసుకుందామని అనుకుంటున్న ఆమె అలాగ ఆగిపోయింది. వాడు
పాడుతున్నాడు పైనుండి. ఆగిపోయి ఏమిటది? అని ఆశ్చర్యపడ్డది. మనస్సు
వెనక్కి తిరిగింది. అంటే ఏమిటి. ఆత్మహత్యా ప్రయత్నం ఆపటం జరిగింది.
తర్వాత ప్రయత్నం మెల్లిగా చేసుకొచ్చాడు. ఆయన కొమ్మమీంచి
దిగివచ్చేటప్పటికి ఆయన చూపిన లోకప్రజ్ఞ ఆశ్చర్యకరమైనటు వంటిది.
అయ్యయ్యో! ఉరిపోసుకోకండి. మీకు నేను ఒక విషయం చెబుతాను
అంటూ వాడు దుడుక్కని దూకాడు అనుకోండి. ఉరి బిగించేసుకుంటుంది.
ఇంక తర్వాత ఏం చేస్తాం. కనుక ''మనోజవం మారుత తుల్యవేగం'' అంటే
అర్థం అది. మనస్సుకి సంబంధించినటు వంటి వేగం. ప్రతి crankish
fellow కి మనస్సుకి వేగం ఉంటుంది. ఒక్కొక్కపుడు అదే పిచ్చెక్కటం
కూడను. పెళ్ళిని గురించి ఆలోచిస్తూ పరీక్ష అంటాడు. పరీక్షకీ వెళ్ళలేదు,
పెళ్ళీ చేసుకోలేదు అంటూ ఉంటాడు. ఇది అది కలిపేస్తూ ఉంటాడు.
అంటే మనోజవం తీవ్రంగా (too much) ఉంటుంది పిచ్చెక్కిన వాళ్ళకి,

హిస్టీరియా ఉన్నవాళ్ళకి. కాని మనోజవం వేరు. మనోజవత్వం వేరు. మనోజవం కలవాడు మనోజవి. ఆ మనోజవం శరీరాదులకు కలిగినటు వంటివాడు అవుతాడు. అది మనోజవత్వం అంటే. తరువాత యింకా దానివల్ల ''వికరణ భావః'' కరణములు అంటే ఇంద్రియములు. కన్ను, ముక్కు, చెవి, కాళ్ళు, చేతులు మొదలైనవన్నీ అక్కరలేకుండా ఉండే భావము, అస్తిత్వము వస్తుంది. అంటే ఒకవేళ ఆ పడేవాడు చెయ్యిపెట్టే దూరంకన్నా ఎక్కువ దూరంలో ఉన్నాడనుకోండి. అపుడు వాడికి దగ్గరలో కింద ఎవడున్నాడో వాడి మనస్సుకి పడుతున్నాడు, చెయ్యిపట్టు అని భావ సూచన యిస్తాడు. అవతలివాడు అదివరకు చాతకాకపోయినా చెయ్యి పడతాడు. కనుక వికరణ భావః అంటే యింద్రియములు అక్కర్లేకుండా పనిచేసే భావము వస్తుందన్నాడు. కరణము అంటే యింద్రియములు, వికరణములు అంటే ఇంద్రియములు అక్కర్లేకుండా అంటే పనిముట్లు అక్కర్లేకుండా పనులు సాధించే సౌలభ్యం (ease) వస్తుంది. అపుడక్కడ ఎవడో ఉంటాడు. వాడు చేతులు పడతాడు. ఆ చేతులమీద పడతాడు. తర్వాత వాడు ఆశ్చర్యపోతాడు నేను ఎట్లా పట్టుకున్నాను? వీణ్ణి అని. అపుడు వాడికి జ్వరం వస్తుంది. ఎందుకంటే వాడు ఎన్నడూ ఇలాంటి విద్య ఎరిగున్నవాడు కాదు కదా. రాజమండ్రి దగ్గర కోరుకొండ ఉన్నది. ఆ ఊళ్ళో ఆవులు అవి చాల ఉంటూ ఉండేవి. వేసవికాలంలో ఆ ఆవులకి పందిరి వేసేవాళ్ళు. ఆ పందిళ్ళమీద గడ్డిపరిచి ఉండేది. దానిక్రింద ఆవులు ఉండేవి. రాత్రి వెళ్ళి నీళ్ళుపట్టి గడ్డివేసి వస్తూండేవాడు ఒక దిట్టమైన ఆచార్యులు గారు. ఒకరోజు రాత్రి గొడ్డుకి గడ్డి వేద్దామని పైనించి గడ్డి లాగేప్పటికి దడక్కన పైనించి పడ్డది ఏదో పెద్దది. చేతిలో లావుపాటి బాణాకర్ర ఉంది. అది పెట్టి ఎడాపెడా వెనక్కి తిరిగి చూడకుండా కొట్టాడు. అది చచ్చింది. ఏమిటో తెలీదు. తర్వాత దీపం పట్టుకొని చూస్తే అది పెద్ద పులి. దాన్ని చూసాక ఆయనకి జ్వరం వచ్చింది. జడుసుకున్నాడు. అది చూడకపోతే జ్వరం వచ్చేదికాదు. ముందర కొట్టినపుడు పులి అని తెలిస్తే కొట్టగలిగేవాడు కాదు. అదీ పాయింటు. తర్వాత ఆయన్ని చాలకాలం వ్యాఘ్రాచార్యులు అని పిలిచేవాళ్ళు. గమ్మత్తేమిటంటే ఆ చచ్చింది పెద్దపులి అని తెలిసాక జ్వరం వచ్చింది. అలాంటివన్నీ పోతాయన్నాడు. వికరణం అంటే యింద్రియములతో ప్రసక్తి లేకుండా పనిచేయుట, మరియు

చేయించుట, యిట్లాంటివన్నీ వస్తాయి. గౌతమబుద్ధుడు ఇంకొక అయిదారు గడియలలో శరీరం వదులుతాడనగా కొన్ని వేలమంది శరీరములలో తానొక్కడే పనిచేసాడు. కథలు చదవండి తెలుస్తుంది. శ్రీకృష్ణుడు రాసక్రీడ అనేచోట అన్నివేల గోప శరీరాల్లో ఒక్కొక్క గోపికకు ప్రక్కనున్న గోపిక కృష్ణుడుగానే ఉన్నారు. ఇవన్నీ మనం కొంచెం ధ్యానం చేసుకోవాల్సిన విషయాలు. ప్రతివాళ్ళు ఎవళ్ళకి వాళ్ళు గోపికాను, ప్రక్కవాళ్ళు కృష్ణుడు. ఇలాగ వాళ్ళల్లో అంతర్యామిత్వం చెంది చరించాడు. కనుక 'వికరణ భావః' అంటే యింద్రియములు అక్కరలేని భావమున్నా, అంటే మనస్సుతోనే భావప్రేరణ ఇచ్చి పనిచేయించటం అన్నమాట. వికరణం అంటే అర్థం అది. ఎక్కడైనాసరే, ఎంత దూరాన్నైనాసరే, పని చేయిస్తాడు. షిరిడీ సాయిబాబా మొదలైన మహనీయుల జీవిత చరిత్రలలో ఇలాంటి ఘట్టాలు కుప్పలు కుప్పలుగా ఉంటాయి రమణమహర్షి మొదలైనవాళ్ళ జీవితాలు, చరిత్రలు చూస్తే. చాల అమాయకుల్లాగ, పిచ్చివాళ్ళలాగ ఉంటారు. ఒక ఆశ్చర్యం చెబుతాను. రమణమహర్షిగారు ఉంటూ ఉన్నపుడు ఒక పిచ్చాయన ఆయన కజిన్ బ్రదర్ ఉండేవాడు. ఆయన అడవుల్లో తిరుగుతూ ఉండేవాడు. అపుడపుడు ఆశ్రమానికి వచ్చి, ఆయన దగ్గరకెళ్లి చెయ్యి చాపేవాడు. ఏదో యింత ముద్ద పెడితే తినేసి వెళ్ళిపోయేవాడు. ఆయన పిచ్చాడు అని కొందరు అనుకునేవాళ్ళు. కాదని కొందరు అనుకునేవాళ్లు. ఎవడికీ తేలలేదు. ఎపుడూ చెట్లమీదా కొమ్మలమీదే ఉంటూ ఉండేవాడు. ఆయనమీంచి పాములు, తేళ్ళుకూడ పోతూ ఉండేవి. ఏం చేసేవికావు. ఒకమాటు ప్రక్కగ్రామంలో ఒక బీద స్త్రీ ప్రసవించ లేకుండా వుంటే మంచం వెనక్కి తిరగేసి, దానిమీద పడేసి మనస్వామి ఉన్నాడని చెప్పి కొండమీద రమణమహర్షి దగ్గరికి తీసుకొచ్చేసారు. అంటే మూఢభక్తి. భక్తి అనేది వాళ్ళలో ఉంటుంది. ఆవిణ్ణి లేపి తీసుకొచ్చి నిల్చో బెట్టమన్నారు. వెనుక ప్రక్కన దొడ్లో ఆయన పెంచుతూన్న కోతి ఉండేది. ఇప్పటికి కూడ ఒక కోతి ఉంటుంది. అది దాటి చెట్లు ఉన్నాయి. ఆచెట్టు దగ్గరికి తీసికెళ్ళి నిల్చోబెట్టాడు. ఒక రెండు నిమిషాలు నిల్చోబెట్టండి. అంతే అన్నాడు. యింతలోకే ఎట్లా వచ్చేసాడో ఆయన, ఆ పిచ్చాడు, ఆ చెట్లమీంచి వచ్చి చెట్టుకొమ్మ పట్టుకొని ఉయ్యాల ఊగి, ఆవిడ పొట్టమీద ఒక తన్నుతన్ని వెళ్ళిపోయాడు. వెంటనే ప్రసవం అయ్యింది. పిల్లవాణ్ణి ఒళ్ళో వేసుకొని ఆవిడ తీసుకొచ్చింది. అంటే అపుడు రమణమహర్షి గారు

చేసిందేమిటి? 'వికరణ భావం' అక్కడికి తీసికెళ్ళి నించోపెట్టండి అన్నాడు అంతే. యింకేం చెప్పలేదు. ఆ పిచ్చాడు వచ్చాడు, ఆవిడ పొట్టమీద ఒక తన్నుతన్నాడు. అంటే ఎంత తన్ను తన్నాలి అనేది ప్రసూతి కేంద్రంలో ఉన్న ఏ నిపుణుడూ చెప్పలేడు. కనుక అదీ వికరణ భావం అంటే.

మూడవది ''ప్రధాన జయశ్చ'' ప్రధానం అంటే ఏమిటి? ఇది కొంచెం తెలియాలి. మన కున్నటువంటి ద్రవ్యము అంతా దేంతో తయారు చేయబడ్డది? పరమాణువులు, దాంట్లో ఉన్నటువంటి శక్తి, దాంట్లో ఉన్నటువంటి సత్త్వరజస్తమస్సులు, ప్రకృతి కదా. ఈ సత్త్వరజస్తమస్సుల ప్రకృతి దేంట్లోంచి వచ్చింది. వీటికి అతీతంగా ఉన్నటువంటి ప్రకృతి ఒకటి ఉన్నది. దాంట్లోంచే సమస్త సృష్టి వస్తోంది. ఈ ప్రకృతిలోంచి సత్త్వరజస్తమస్సులు వస్తాయి. ఇందులోంచి మనం ఎరిగి ఉన్న పంచభూతాలు యివన్నీ వస్తాయి. అంటే పృథివీ, ఆపస్సు, తేజో, వాయు రాకాశములు. దాంట్లోంచి ఒకప్రక్క ఈ రజస్సు వైపునించి అయిదు జ్ఞానేంద్రియములు, ఈ తమస్సులోంచి అయిదు కర్మేంద్రియములు యివన్నీ వస్తాయి. యివన్నింటికి ముందు మూలంగా ఉన్న ప్రకృతి యింతకు ముందు ఉంది. దీంట్లో త్రిగుణాలు ఉండవు. అయితే బాగా ధ్యానం చేసిన వాళ్ళకితప్ప, దీని సంగతి తెలియటానికి వీల్లేదు. ఇది ప్రధానము లేక దీన్నే మూల ప్రకృతి అంటారు. దీన్ని మొట్టమొదటిగా బ్లావెట్స్కీ అనువాదంచేసి, ఆంగ్లంలో యిచ్చింది. Primordial substance which is not matter. Substance అంటే matter కాదు. జాగ్రత్తగా ఉండాలి. Primordial substance అనగా ప్రాథమికమైనటు వంటి ద్రవ్యము. సృష్టి తయారవ్వటానికి కావలసిన ద్రవ్యం లేదా divine throught భగవంతునియొక్క సంకల్ప భావము. రెండూ ఒకటే అంది. భగవంతునియొక్క సంకల్పము లేక సృష్టికి మూల ద్ర్యవము. Primordial substance or divine thought. అది 'Secret Doctrine' లో ఆవిడ యిచ్చిన అనువాదం. అదంటే ఏమిటో తెలియడం చాల కష్టం. దాన్ని వీడు జయిస్తాడు. అది 'ప్రధాన జయశ్చ' అంటే. దానిమీద వీడికి స్వామిత్వం mastery వస్తుంది. తన శరీరంలో ఉన్న పరమాణువులకు అతీతమైన త్రిగుణములు, త్రిగుణములకు అతీతమైన పరా ప్రకృతి. దానియందు వాడికి స్వామిత్వము వస్తుంది. ఆ వచ్చినందువల్ల తన శరీరంలో ఉన్న ధాతువులనుగాని,

ఎదుటివాడి శరీరంలో ఉన్న ధాతువులను, పవిత్రీకరణం చేయగలడు. ఎందుకని? ప్రపంచంలో ఉన్న పవిత్రమైన వస్తువులు, అపవిత్రమైన వస్తువులు రెండూ దానితోనే చేయబడ్డాయి కదా. మనకి గిట్టని దాన్ని మనం అపవిత్రం అంటున్నాం. కాని ఇది దేంతో చేయబడ్డదో అదీ దాంతోనే చేయబడ్డది కదా. మనకి తేలుకుడితే మంట పుడుతుంది. కనుక విషం అంటున్నాం. అది నిజంగా విషమే అయితే తేలు అంతకు ముందే చచ్చిపోయి ఉండద్దూ! దాని కొండెలో ఎంతసేపట్నించో ఉన్నది చూసారా. పాము కరిస్తే మనం చచ్చిపోతాం కనుక అది విషం అంటున్నాం. అది నిజంగా విషమే అయితే పామునోట్లో అంతసేపుంటే అది ఎపుడో చచ్చిపోయి ఉండద్దూ. కనుక నిజంగా విషమనిగాని, నిజంగా అమృతమని గాని ఏమీ ఉండవు. ఆయా పరిస్థితులనుబట్టి, సంబంధాన్నిబట్టి, సందర్భమునుబట్టి ఉంటూ ఉంటాయి. అది చాతనవుతుంది వీడికి. అంటే ఎగుడు దిగుడుగా ఉన్న సందర్భములలో రోగాలు, రొష్టులు ఉంటాయి. ఆ ఎగుడు దిగుడులు సర్ద గలిగినటువంటి స్థితి సంకల్పంచేత వాడికొస్తుంది. అలాంటివాడి దగ్గర కాసేపు మనం వెళ్ళి కూర్చుంటే అంతకుముందు మనకు చాలాకాలం నించి అనారోగ్యంగా ఉన్నటువంటిది ఆరోజునించి మన ఆరోగ్యం బాగుపడటం మొదలుపెట్టి (మనకి తెలియకపోవచ్చు.) ఏడాదో, రెండేళ్ళో అయ్యేటప్పటికి మనం దుక్కల్లాగ ఉంటాం. అంటే chain-actions start అవుతాయి. వాడు catalytic agent గా పనిచేస్తాడు. అది ప్రధాన జయం అంటే. అలాంటి దానికోసం పనికొచ్చేందుకే ఈ తీర్థంగాని, విభూతిగాని, తాయెత్తులుగాని మొదలైనటు వంటివి. వాళ్ళచేత స్పృశింప చేయబడి ఆ వస్తువులు వీళ్ళకివ్వటం. అంటే అది యింకా కొంతకాలం పోతేగాని అర్థం కానటువంటి సైన్సు తప్ప మూఢ విశ్వాసం కాదు. వాడికి తెలియనిది అని అర్థం. Superstition means all ingorence అని అర్థం. యిక్కడదాకా తీసుకొచ్చి తరువాత సూత్రంలో ఒక గమ్యస్థానం చూపిస్తున్నాడు. ఇది land marks లాంటి సూత్రాల్లో ఒకటి.

## 50. సత్త్వ పురుషాన్యతాఖ్యాతిమాత్రస్య సర్వ భావాధిష్ఠాతృత్వం సర్వ జ్ఞాతృత్వంచ।

సత్త్వ = సత్త్వము, పురుష = పురుషుడు, అన్యత = వేర్వేరు తనము, ఖ్యాతి మాత్రస్య = నామ మాత్రముగ మిగులును, సర్వభావా = సర్వ భావములకు, అధిష్ఠాతృత్వం = అధిష్ఠాతయగును, సర్వజ్ఞాతృత్వం = అన్నీ తెలుసుకున్నవాడి లక్షణం కలిగియుండును, చ = మరియును.

**బుద్ధికిని, తనకును గల బేధము నామ మాత్రముగనే మిగులును, అప్పుడు సమస్త వస్తు స్వభావములపై స్వామిత్వము, సర్వజ్ఞత్వము కలుగును.**

**వివరణ :** సత్త్వము, పురుషుడు అనేది ఇదివరకు మనం చెప్పుకున్నాం. సత్త్వము అనగా ఆత్మ. దానికంటే కిందిగా ఉంటాయి బుద్ధి, చిత్తము, అహంకారము, మనస్సు, ఇంద్రియములు, ఇంద్రియార్థములు, శరీరము, శరీరమునందు సప్త ధాతువులు. ఇవన్నీ ఉన్నవాణ్ణి క్షరపురుషుడు అంటారు. దానిపైన ఉన్నది అక్షరపురుషుడు లేక ఆత్మ (soul) అనేది సత్త్వము. దానిపైన ఉన్నది పరమాత్మ. లోపల ఉన్నవాడు ఈశుడు, ఈశ్వర శబ్దవాచ్యుడైన వాడు పురుషుడు. సత్త్వము, పురుషుడు. పురుషుడు కంటే సత్త్వము తేడాగా ఉంటుందని చెప్పాం కదా. క్రమక్రమంగా పరిశుద్ధి (purify) అవుతుంది. ఇది చేసినందువల్ల సత్త్వము పవిత్రము అవుతుంది. అంటే ఆత్మకి వీటియొక్క ఆవరణ లేకుండా పోతుంది. శరీరము, యింద్రియాలు, ధాతువులు, వీటి మలినములు, కల్మషములు, స్థూల, సూక్ష్మములైన మలములు, వీటిచేత conditioning అనేది లేకుండా పోతుంది. అంటే grosser conditioning, subtler conditioning, toxic conditioning, etheric conditioning, astral conditioning, యివి లేకుండాపోతాయి. అప్పుడు సత్త్వము అనేది పరిశుద్ధమైన అద్దంలాగ తయారవుతుంది. అంటే ఆత్మ, ఆత్మగా వీడు అనుభవించుతాడు. ఎందుకంటే ఈ మలినము వీడికి పోయింది. కనుక ఆత్మలో జీవించటం మొదలు పెడతాడు. మనస్సులో జీవించటమో, చెవిలోనో, తిండిలోనో యిలా దేనిలోనో జీవించటంకాక, తనయందు తాను జీవించటం ప్రారంభించినపుడు ఈ రెండింటికీ తేడా తగ్గిపోతుంది. పరిశుద్ధమైన ఆత్మ ఉంటుంది. సత్త్వము, పురుషుడు అన్యత అంటే వేర్వేరుగా ఉండటం పోతాయి. సత్త్వం వేరు, పురుషుడు వేరు అనేది, ఆత్మవేరు, పరమాత్మ వేరు

అనేది మనందరిలో పనిచేస్తోంది. కనుక వీటి అడ్డంవల్ల matter conditioning, mind conditioning యివన్నీ మనకి ఉన్నాయి. సత్త్వము, పురుషుడు ఈ రెండింటియొక్క అన్యత 'ఖ్యాతి మాత్రం'. అంటే ఊరికే పేరుకి మాత్రమే. ఖ్యాతి అంటే పేరు. రెండున్నాయి కనుక వాడిలో సత్త్వము, పురుషుడు అని లెక్క వేయాల్సిందేకాని, రెండింటికీ భేదము నశించే స్థితి వస్తుంది యోగాభ్యాసం చేసినప్పుడు. అంటే ఆత్మ, క్రిందనించి లెక్క వేస్తూంటే దేహము, సూక్ష్మ దేహము, ఇంద్రియార్థములు, ఇంద్రియములు, మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకారము యివన్నీ పోను సత్త్వము లేక ఆత్మ, పరమాత్మ అని లెక్క ఊరికే వేయటమేగాని, ఆత్మకి, పరమాత్మకి భేదం నశిస్తుంది. అంటే ఆత్మకూడ పరమాత్మగా వుండటం మొదలుపెట్టింది. అట్లాంటి వాణ్ణి ఏమంటారు? ''సత్త్వ, పురుష అన్యతాఖ్యాతి మాత్రస్య'' సత్త్వమునకు, పురుషుడికీ ఉన్న అన్యత్వం ఉందే, అంటే వేర్వేరు తనం, అది ఖ్యాతి మాత్రమే అంటే ఊరికే పేరుకి మాత్రమే. అట్టివాడు. ''సర్వభావ అధిష్ఠాతృత్వం'' సర్వ భావములకు అధిష్ఠాత అవటము జరుగుతుంది. అంటే మానవులకు, దేవతలకు, జంతువులకు, చెట్లకు, పిట్టలకు, చేపలు మున్నగు జలచరాలకు గాని వీటన్నిటికీ వచ్చే భావాలుగాని, అవన్నీ తెలుస్తాయి. వేటి జీవితం వాటికి ఉంటుందని మనకు తెలీదు. మన జీవితం ఒకటి మాత్రమే ఉంటుందని తెలిసిన మూర్ఖులం, మానవజాతి. రోడ్డుమీద వెడుతూంటే మనం చెప్పులతో చీమల్ని తొక్కేస్తూ ఉంటాం. చీమలు కూడ భార్య భర్త షికారు వెళ్తుంటాయని, పిల్లల్ని కూడ తీసికెళ్తూ ఉంటాయని, వాళ్ళ పిల్లల్ని కూడ ఏదో tenth class లో చేర్చాలని, ఇట్లాంటివి ఉంటాయని మనకి తెలీదు. ఉంటాయని నమ్మనూ నమ్మము. ఎందుకంటే దానిని నమ్మటానికి కావలసిన పరిశుద్ధి మనయందు లేదు కనుక. ఇవన్నీ ఒక్క మానవులకు మాత్రమే ఉంటాయి. చీమ, చీమభార్య రెండూ కలిసి వెడుతూ ఉండటం అనేది ఉండదు అనుకుంటం దురహంకారం. అది దాటిన వాడికి తప్ప యోగాభ్యాసం రాదు. ఏం లాభంలేదు. జ్ఞానం తెలుస్తుందంటే వాడికి యూనివర్సిటీ జ్ఞానమో, కాలేజీ జ్ఞానమో తప్ప తెలిసేది ఏంలేదు. అంటే ఉద్యోగం సంపాదించుకుందుకు కావలసిన జ్ఞానం మాత్రం తెలుస్తుంది. అందుకని 'సర్వభావ అధిష్ఠాతృత్వం' యివన్నీ తెలుస్తాయి. అంటే వీడు వెడుతూంటే అడుగు చూసి వేస్తాడు. చాదస్తుడల్లే వెళ్ళడు. స్పీడుగానే

వెడతాడుగాని, వేటిమీద పడకుండా వెయ్యగల్గుతాడు. అలాగే ఎక్కడన్నా ఇంట్లోని బల్లమీద చెయ్యిపెట్టి మాట్లాడుతూంటాం అనుకోండి. ఆ బల్ల అటునించి పైకి లేస్తుంది. అలాంటివి మానేస్తాడు. లేదా నడిచే రోడ్డుమీద సైకిల్ అడ్డం పెడతాం. అందుకని జంతువుల్ని గురించి తెలియటానికి అవకాశం లేదు. ఒక మనిషి సదుపాయమే ఇంకో మనిషికి తెలియనపుడు జంతువులు, పక్షులు, చెట్లు వీట్ల సదుపాయము మనుషులకు తెలిసే అవకాశం లేదు. అందుచేత ఈ ప్రాక్టీసు చేస్తున్నవాళ్ళు క్రమంగా ఇవన్నీ దాటిపోతారు. మనం రోడ్డుమీద ఎక్కడ నిల్చుంటే మలుపు తిరిగే వాళ్ళకి యిబ్బందో, అక్కడ నిల్చోడు వీడు. అక్కడ నిల్చోకపోవటం నామర్దాగా భావించేవాడు అదివరకు. ఇపుడు అది మానేసి, నామర్దాకాదు. అక్కడ నిల్చుంటం మిగిలిన వాళ్ళకి అసౌకర్యం అని తెలుస్తుంది. అంటే సైకిలో, స్కూటరో, కారో వస్తూంటే అక్కడనించి తొలగకుండా ఉండటం అనేది ఒక ప్రతిష్ఠ క్రింద భావించే పశుత్వంలోంచి క్రమంగా అడ్డంవచ్చే చోట అసలు నిల్చోకుండా, ఎక్కడ నిల్చుంటే ఎవడికీ ఇబ్బంది లేదో అక్కడ నిల్చునే దృక్పథం నేర్చుకుంటాం. అదీ పోలీసుకోసం కాకుండా, మనకోసం అని తెలుసుకునే జ్ఞానోదయం కలుగుతుంది సాధనచేస్తే.

''సర్వభావాధిష్ఠాతృత్వం'' అన్ని జీవరాసులయొక్క భావాలకీ వీడు అధిష్ఠాత అవుతాడు. అంటే దొడ్లో రాత్రిపూట ఏదన్నా ఒకజీవి జబ్బుతో బాధపడుతోందనుకోండి. అది నెమరువేస్తూ ఉంటేనో, అరుస్తూ ఉంటేనో, వాడు లోపల నుంచి వింటే, దానికి సుస్తీగా ఉందని తెలుసుకొని బయటికి రాగలుగుతాడు. దూడని పాలు తాగనివ్వకుండా చంపేసేసి గేదె దగ్గర పాలు తీసుకునేవాడు ఇలాంటివి కలలో కూడ ఊహించలేడు. పెంపుడు కుక్కకి చాల జబ్బుగా ఉన్న తర్వాత పశువుల వైద్యుని దగ్గర పంపే పనులు చేయటం కాకుండా, అది యింట్లో తిరుగుతూ ఉండగానే ఆ తిరిగే తరహాలో తేడా ఉండేటప్పటికి ఒంట్లో బాగుండలేదని గ్రహిస్తాడు వీడు. ఏ జీవికైనా అంతే. పిల్లి అరుస్తూ ఉంటే గొంతు మార్పుగా ఉంది అని గుర్తుపట్టి చూస్తే జ్వరం వచ్చి ఉంటుంది. దానికి ఏం చేయాలో చేస్తాడు. ఇలాంటివన్నీ సమస్త సర్వ భావములయందు అధిష్ఠాత అవుతాడు. అంటే అధిష్ఠానము చెందుతాడు. అంటే అధికారము వస్తుంది. భావములంటే అన్ని జీవులయొక్క భావములు. The feelings of all beings. వాట్లని స్పృశిస్తాడు. గౌతమబుద్ధుడు ఆయన

అంతరంగిక శిష్యులకు చెప్పిన సాధనలో ఒక ముక్క చెప్పాడు. ''నీవు నిజంగా సాధకుడివి కాదల్చుకుంటే, నువ్వు నిజంగా బిక్షుకుడివి, బిక్కువి కాదల్చుకుంటే ఈ ప్రపంచంలో ఎవడి తాలూకు కన్నీళ్లు కూడ నీ గుండెకాయమీద పడకుండా భూమిమీద పడకూడదు అన్నాడు. ఇది కంకణం కట్టుకోవాలి'' అన్నాడు. సరిగ్గా చదువుకోకపోతే బుద్ధుడు చెప్పిన విషయాలు మనకి తెలియటానికి అవకాశం లేదు. చదువుకున్న తర్వాత అవన్నీపోయి 'సర్వభావ అధిష్ఠాతృత్వం' వస్తుంది. సమస్త జీవరాసుల భావములకూ వీడు అధిష్ఠాత అవుతాడు. అంటే వీడి హృదయంమీద పడకుండా ఏ రెండు చుక్కల కన్నీరు కూడ భూమ్మీద పడుదు. ఆ స్థితికి వస్తాడు. 'సర్వ జ్ఞాతృత్వంచ' వాడికి తెలియనిదంటూ ఉండదు. అంటే దేనిమీద మనస్సు పెట్టినా వాడు ఆ శాస్త్రం చదువుకున్నా, చదువుకోక పోయినా ఆ శాస్త్రంలో ఏం చెప్పబడిందో వీడికది తెలుస్తుంది. ఈ స్థితిలో ఉండి శాస్త్రాలు రాసారు కనుక. వీడు ఆ స్థితిలోకి వెళ్ళేటప్పటికి శాస్త్రాలు ప్రకృతిలోంచి వీడికి అందుతాయి. ఉదాహరణకి ఆర్కిమెడిస్ సూత్రం ఉంది. ఒక వస్తువు నీళ్ళల్లో మునిగితే, దాని ఘన పరిమాణం నీళ్ళు ఎంత ఉంటాయో, అంత బరువు తగ్గుతుంది అని ఆయన రాసాడు. అది మనకి ఎలా తెలుసు? ఏదో ఫిజిక్స్ పుస్తకంలో ఉంది కనుక. ఫిజిక్స్ పుస్తకం రాసిన వాడికి ఎట్లా తెలుసు? అంటే వాడికంటే ముందు పుస్తకం వ్రాయబడింది కనుక. అంతకంటే మనకి తెలియటానికి వీల్లేదు. ఆర్కిమెడిస్‌కి ఎలా తెలుసు? అంటే ఇంక మన దగ్గర జవాబు లేదు. ఆర్కిమెడిస్‌కి ఎలా తెలుసునో, మీకూ అలాగే తెలుస్తుంది. ఈ సాధన అభ్యాసం చేస్తే అంటున్నాడు పతంజలి.

సత్త్వము, పురుషుడు ఒకరికన్నా ఒకరు అన్యత్వం అనేది ఖ్యాతిగా మాత్రము ఉంటుంది గాని గుణం (quality) లో ఏం భేదంలేదు. తగ్గిపోయింది. అలా అయిపోయిన వాడికి ''సర్వభావ అధిష్ఠాతృత్వం, సమస్త భావములయొక్క అధిష్ఠానము పొందుట, తాను అధిష్ఠాతగా ఉండుట తెలుస్తుంది. అనగా ప్రపంచంలో భావములు అంటే ideas అని అర్థంకాదు. అస్థిత్వములు (existences) అని అర్థం. భావములు అంటే అన్ని జీవరాసుల భావములు. మనిషికి నేను మనిషిననే భావం, ఇండియా వాడికి నేను ఇండియా వాడిననే భావం, ఆంధ్రుడికి నేను ఆంధ్ర అనే భావం ఉంటుంది, యిలా ఉంటాయి.

అంటే కొన్నివేల పూర్వ సంస్కారాలతో కలిసి ఒక్కొక్కడి భావం ఉంటుంది. అలాంటివి కోటానుకోట్ల జీవరాసులున్నాయి. కనుక అన్ని భావాలు ఉన్నాయి. ఈ సర్వభావాలకిన్నీ అధిష్ఠాతృత్వం వస్తుంది. అంటే ప్రపంచంలో ఎవడు ఎందుకు బాధపడుతున్నాడు? ఎవడు ఎందుకు సంతోషిస్తున్నాడు? ఇవన్నీకూడ వీడు ఫీలవుతూ తెలుసుకో గలుగుతాడు. ఫీలవటం అంటే దెబ్బతినడు. కాని వీడిలో reflect అవుతాయి. కనుక 'సర్వజ్ఞాతృత్వంచ' సమస్తాన్ని తెలుసుకో గలుగుతాడు. జ్ఞానం అంటే ఊరికే అన్నీ తెలియటం. జ్ఞాత అంటే తెలుసుకున్నవాడి లక్షణం. అంటే ఇంకాస్త దగ్గరగా ఉంటుంది తెలియటంకన్నా. తరువాత సృష్టిలో తాను అనుభవించని సృష్టి భాగము ఉండదు. అంటే అంతర్యామిత్వాన్ని పొందుతాడు. ఈ స్థితి సాధన చేసినవాడు. కనుక దీనినే మన పురాణ, ఇతిహాస గ్రంథములలో ''వాసుదేవ ఉపాసనము'' అని అంటారు.

ఈ వ్యూహములు ఇలా ఉంటాయి :

| 1. క్షరపురుషుడు | 2. అక్షరపురుషుడు (వాసుదేవుడు) | 3. సర్వాంతర్యామి (నారాయణుడు) |
|---|---|---|
| దేహము | సత్త్వము లేక ఆత్మ | పురుషోత్తముడు |
| ఇంద్రియములు | | |
| మనస్సు | | |
| బుద్ధి | | |
| చిత్తము | | |
| అహంకారము | | |

దేహము, మనస్సు, ఇంద్రియములు, చిత్తము, బుద్ధి, అహంకారములతో ఉన్నవాడు క్షరపురుషుడు. అదిగాక సత్త్వము లేక ఆత్మ లేక అక్షర పురుషుడు. పురుషుడు లేక పురుషోత్తముడు, సర్వాంతర్యామి లేక పరమాత్మ. మనకి భారత, భాగవత, రామాయణాదుల లోకి వచ్చేటప్పటికి ఒకడి పేరు నారాయణుడు. ఇంకొకడి పేరు వాసుదేవుడు. వీళ్ళల్లో ఉన్న అంతర్యామి పేరు పరివార సమేతుడైన విష్ణువు. విష్ణువు అంటే వ్యాపించి ఉన్నవాడు అని అర్థం. ఇందులో మొదటి వ్యూహమున కధిపతిగా ఉన్నవాడు ''సంకర్షణుడు'' అని అంటారు. రెండవ దాని కధిపతిగా ఉన్నటువంటి

వాడు 'ప్రద్యుమ్నుడు' అనబడతాడు. మూడవదాని కధిపతిగా ఉన్నటువంటి వాడు ''అనిరుద్ధుడు''. ఈ మూడు మూడు విధములైన వ్యూహములు అంటారు. కనుక నారాయణుడు, వాసుదేవుడు, విష్ణువు. జీవరాసులలో మనం చూస్తూ ఉన్న విష్ణువు. జీవరాసులలో ఉన్న చేష్టలు, వాళ్ళుచేసే ప్రవర్తన మొదలైన రూపంలో మనం చూస్తూన్నది వాసుదేవుడు. ఈ రెండింటికీ అతీతంగా ఉండి చూస్తూన్నది నారాయణుడు. అందుకనే విష్ణువుతో భాగవతం ప్రారంభమైంది. ''విష్ణుండు విశ్వంబు వేరేమియును లేదు'' విష్ణు సహస్రనామంలో 'విశ్వం విష్ణుర్వషట్కారో' అదే విష్ణుండు విశ్వంబు అని విష్ణు సహస్రనామం చిట్ట చివరికి ''నారాయణో విష్ణుర్వాసు దేవోఽభి రక్షతు'' అన్నారు. కనుక ఈ వ్యూహాలు కూడ కొద్దిగా పురాణాలు, యితిహాసాలు చదివేటప్పుడు అందులో ఉన్న పరిభాషను యిందులో ఉన్న పరిభాషకి సమన్వయం చేసుకోవాలి. లేకపోతే ఎవరి మతం వాడిది, క్రొత్త మతమల్లే ఉంటుంది. పురాణం మతంలో ఒకలాగ, శాస్త్రాల మతంలో ఒకలాగ, ఉపనిషత్తుల మతంలో ఇంకొకలా, ఏమిటో అందరూ తలొకలాగ చెప్పారు అంటూ ఈ తీవ్రవాదులు (radicals) మాట్లాడినట్లుగా మాట్లాడతాం. ఈ పరిభాష తెలియకపోతే ఒకళ్ళకి, ఒకళ్ళకి మధ్యనున్న పదభాష ఆమూలాగ్రం (radical) గా దెబ్బతింటాం. ఈ పై చెప్పినవన్నీ సాధనచేసిన తర్వాత ఇంకెందుకు అనిపిస్తుంది. వీటన్నింటికోసం కాకుండా, చేసే సాధన మళ్ళీ మళ్ళీ చేస్తూండాలి. అలాకాకుండా ఊరికే సాధన చెయ్యి. చేసినందువల్ల వైరాగ్యం వస్తుంది. ఆత్మయొక్క శక్తులు వెలువడుతూ ఉంటాయి. ఆత్మ శక్తులలో చిక్కుకొని అజ్ఞానంలో పడకుండా వైరాగ్యం పనికొస్తూ ఉంటుంది. ఇలా వెడుతూ వెడుతూవుంటే చిట్ట చివరికి కేవలము తానే అని తెలుస్తుంది.

## 51. తద్వైరాగ్యాదపి దోషబీజక్షయే కైవల్యమ్॥

తత్ = అది, వైరాగ్యాత్ = వైరాగ్యము వలన, అపి = కూడ, దోష బీజక్షయే = దోష బీజములు క్షీణించుట వలన, కైవల్యమ్ = కైవల్యము వచ్చును.

దానియందు కూడ వైరాగ్యము కలుగు వేళకు దోషముల బీజములు తొలగిపోవును. ఉన్నది కేవలము తానే యగును (అదియే కైవల్యము).

**వివరణ :** ముందు సూత్రంలో 'సర్వభావాధిష్ఠాతృత్వం, సర్వజ్ఞాతృత్వం' అని చెప్పారు కదా. సృష్టిలో ఉన్న సమస్త జీవరాసుల భావములు నీయందున్న స్థితి వస్తుంది. ఆ వచ్చినపుడు నీకు తెలియనిదేముంది? నీకు లేనిదేం ఉంది? ఈ తెలియని దేమున్నది అన్నదాంట్లో సర్కస్‌చేస్తూ ఉంటారు చాలమంది. తెలిసిన దేమీ ఉండదు చివరికి. సర్వజ్ఞత్వం వచ్చేటప్పటికి అవతలవాడు ఏవో చెప్తుకుంటూ ఉంటే, అందులో పొరపాట్లు ఉంటే అలాకాదు ఇలాగు అని చెప్పటమున్నూ, వాళ్ళు కాదని అనటం, మళ్ళీ వాదనలోకి దిగటం, రాగద్వేషాలు యివన్నీ కూడ ఉంటాయి. ఇవి సర్వజ్ఞత దోషములు. మీలో ఉన్న అంతర్యామి సర్వజ్ఞుడు అని తెలియాలి కాని, నీవు సర్వజ్ఞుడుగా ఉంటే దోషం ఆపాదించబడుతుంది. ఎప్పుడో అప్పుడు దురాకర్షణ (temptation) వస్తుంది. ఇద్దరు సర్వజ్ఞులు కలుస్తారనుకోండి. అపుడు ఆ యిద్దరిలో ఎవడు ఎక్కువ సర్వజ్ఞుడు? అని వస్తుంది. మొట్టమొదటగా ప్రజాస్వామ్యం (democracy) కోసం Roman empire లో రాజ్యాంగ చట్టం పుట్టుతూ ఉన్న రోజులలో వాళ్ళు all are equal అన్నారుట. ఒకడు లేచి some are more equal అన్నాడుట. అలా ఉంటుంది.

దివ్యములైన యింద్రియ శక్తులు పొందటం. దర్శన జ్ఞానం Intuition పొందటం యివన్నీ కూడ, యిదివరకు చెప్పారు. మీ యిష్టం ఎన్ని శక్తులు చెప్పాడో చూడండి. బలం పొందటం, దేహ సౌందర్యాన్ని పొందటం మొదలైనవన్నీ ఉన్నాయి. ఇందులో మీరు సాధనచేస్తూ, దేనిమీద నుంచున్నా మిమ్మల్ని క్రిందికి జార్చేస్తాయి జాగ్రత్త అన్నాడు. యివన్నీ వస్తాయని తెలియజేయటం కోసం చెప్పానుగాని, వీటిల్లో మీరు దేనిమీద ఆధారపడి, దేనికోసం మీరు యోగాభ్యాసం చేసినా, పాకుడు బండమీద కాలు గట్టిగా వేసినట్టే. ఎంత గట్టిగావేస్తే అంత సూటిగా జారిపడతాం. అలా అయిపోతుంది. కాబట్టి ఊరికే యోగాభ్యాసం చేస్తూ ఉండండి. ''తద్వైరాగ్యాదపి'' ఈ

చెప్పినవి కూడ వైరాగ్యం పొందినపుడు అంటే ''సర్వభావ అధిష్ఠాతృత్వం'' ''సర్వజ్ఞాతృత్వం'' వచ్చినవాడు కూడ ధ్యానం చేస్తున్నపుడు ఎందుకు చేస్తున్నావు అంటే, ధ్యానం చేయటం మంచిది కాబట్టి అనేది మిగలాలి. ఇంకేం లేదు. పతంజలి యోగ సూత్రాలు సాయంత్రం ఎందుకు చెప్పుకుంటున్నామని అడిగితే, అందులో పాండిత్యాన్ని పొందటానికి, కుండలిని మేలిపెట్టటానికి అలాంటివి అని అనుకోకుండా, ఈ గంటో గంటన్నరో, రెండు గంటలో వాడలాగ, వీడు ఇలాగ అనుకోకుండా ఉండటానికి పనికిరావాలి. ఇంతకంటే అనుకోవద్దన్నాడు యోగాభ్యాసం చేసేవాళ్ళు ఎవరూ కూడను. అపుడు పరిపూర్ణమైన వైరాగ్యం వస్తుంది. ఎందుకు చేస్తున్నారు? అనేది వెళ్ళిపోతుంది. అది తీసేసాక ''తత్ వైరాగ్యాదపి'' దాని యందుండి కూడ వైరాగ్యం చెందటం వస్తుంది. అట్టి వైరాగ్యం చెందుట వలన దోషబీజము క్షయము చెందును. దోషమెట్లాగూ లేదు వీడిలో; కాని దోషము తాలూకు విత్తనాలు లోపల మిగిలి ఉంటాయి. ఎందులో మిగిలి ఉంటాయి? మనకు సర్వజ్ఞత్వం వస్తే దానిక్రింద అడుగున ఉంటుంది. ఇంకో సర్వజ్ఞుడు రైల్లో కలిసేటప్పటికి ఆ రెండు బీజాలు బద్దలవుతాయి, పేలాలు వేగుతాయి. పేలాలు వేగితే ఫరవాలేదు. మొక్కలు మొలుస్తాయి. నీళ్ళు చల్లినట్లు వాడి సర్వజ్ఞత, వీడి సర్వజ్ఞత కొట్టుకుంటాయి. ఇద్దరు సర్వజ్ఞులు ఏమిటి? Some are more equal అన్నట్లు. ఇబ్బంది వస్తుంది. అలాగే దివ్యములైన శబ్దములు విన్నాం. వాడు నేనూ విన్నాను అంటాడు. వాడికేం వినిపిస్తుంది. వాడి భార్య కంఠం వినిపిస్తుంది. పుట్టింట్లో ఉన్నది. వీడికేం వినిపిస్తుంది. వీడి భార్య కంఠం వినిపిస్తుంది. అంచేత నాకిల్లా వినబడ్డది అని వీడు, నాకిల్లా వినపడ్డదని వాడు అంటాడు. ప్రతీదీ కూడ ఈ చెప్పిన సాధనల్లో అవివస్తే రానీయండి గాని, మీరు దానికోసం చూసారంటే మీ దగ్గర దోషా లుండకపోయినా, వాటి దగ్గర దోషబీజా లున్నాయన్నాడు. విత్తనాలుంటాయి. అవి ఎక్కడో దానికి సరైన భూమి దొరికినపుడు అంటే సారవంతమైన భూమి అంటే ఇంకొకడు వీడిలాంటి వాడు తగిలినపుడు రైల్లోనో, కారులోనో, బస్సులోనో, అక్కడ అవి మొలవక మానవు అని అర్థం. లోపల ఎపుడైతే బీజాలున్నాయో, పైన దోషాలు లేకపోతే ఏం లాభం లేదన్నాడు. అవి ''విషయా వినివర్తంతే నిరాహారస్య దేహినః'' ఒకవేళ అన్నం లేకుండా పస్తులు పెట్టి మంచినీళ్ళిచ్చి ఎండగొడితే కోపం, క్రోధం, రాగం, ద్వేషం అన్నీపోతాయి. అప్పుడు అవి

పోయినట్టు కాదు, ఉడిగినట్టు అన్నాడు. ఎంచేత ''రసవర్జం'' వాట్లని అనుభవించే రసం పోయింది. కనుక ''రసోప్యస్య పరం దృష్ట్వా నివర్తతే'' అవి వాడిలో పోయినవి ఎట్లా పోయినాయి. వీడి లోపల మళ్ళీ విత్తనాన్ని ఉంచి పోయినాయి. ఏది? పస్తు పడుకుంటే పోయినవన్నీ మళ్ళీ అన్నం పెట్టేటప్పటికి ఎలా అయితే చిక్కుడు గింజ నేలలోవేస్తే చిక్కుడుకాడ, చిక్కుడు ఆకు, చిక్కుడు వాసన, చిక్కుడు మొక్క, చిక్కుడు పిందె, చిక్కుడు పువ్వు, చిక్కుడు కాయ అన్నీ చిక్కుడే వస్తాయో అలాగ వీడికున్న చిక్కులే వస్తాయి. వీడు మళ్ళీ భోం చేయటం మొదలు పెట్టినప్పటినుంచీ వీడి మనస్సులో ఉన్న సకల రోగములు ఒక్కొక్కటే. వీడికి కోపం ఉంటే కోపం, అహంకారం ఉంటే అహంకారం, కామం ఉంటే కామం, క్రోధం ఉంటే క్రోధం అన్నీ వీడికి పోయినవి కదండి అంటే పోలేదు నాన్నా ఆపైన ఉన్న కొమ్మలు కొట్టేసారుగాని, విత్తనాలు పొట్లంలో పెట్టి అట్టే పెట్టారు. తర్వాత వానాకాలం వచ్చేటప్పటికి నేలమీద పడ్డాయి. పడ్డాక వాన పడ్డది. మళ్ళీ మొలుచుకు వచ్చినాయి. దూరదృష్టి, దూర శ్రవణాలు గాని, అణిమ, మహిమ, లఘిమ మొదలైనటువంటి అన్నింటిలో కూడ అంతే. శరీరం తేలికగా ఉందని ఇక్కడనించి అనకాపల్లికి నడిచి వెళ్తాడు. ప్రక్కవాడు నడవలేకపోతే ఏమనుకున్నావు యోగం అంటే అంటూ ఉంటాడు. ప్రక్కన నడవలేని వాణ్ణి పెట్టుకొని, అది యోగమంటే ఎలా? అది పశుత్వం అవుతుంది. చిన్న వాట్లల్లో బోల్తాలు అయిపోతూ ఉంటాయి. బోల్తా పెద్దది. పొరపాటు చిన్నది. రక్షించేటప్పుడు కూడ చేసే ధర్మం పెద్దది. రక్షణ చిన్నది అన్నాడు భగవద్గీతలో. ''స్వల్పమప్యస్య కర్మస్య ప్రాయతే మహతో భయాత్'' అన్నాడు. అట్లాగే పొరపాట్లు కూడ చాల చిన్నవి ఉంటాయి. వచ్చేవి గిన్నె బోర్లించినంత నష్టాలు. పొయ్యిమీద అందరికీ వంట వండుతూ ఆ గిన్నె బోర్లాతీస్తే ఆ పూటకి ఎంత నష్టం ఉంటుందో అలా అయిపోతుందన్నాడు జీవితమంతా. అందుకని వాటికివన్నీ దోహదం చేస్తాయి. వీటియందు మీకు దృష్టి ఉండి ఎదుటివాడి మనస్సులో ఏం ఉందో కనుక్కుందాం అనుకున్నా, ఎంతదూరం యిందులో వెళ్ళిన వాడైనాసరే, వాడు పతనమైపోవడానికి వీలుంది. వీట్లల్లో ఎక్కడైనా జాగ్రత్తగా ఉండాలి. అందుకని దేనికోసం యోగాభ్యాసం చేస్తున్నా చెడతాడు. యోగాభ్యాసం చేస్తూంటే యివి వస్తున్నాయంటే రానీండి ఫర్వాలేదు. అవి ఎవడికి కావలిస్తే వాడికి పనిచేస్తాయి. ఎవడికి ప్రాప్తం ఉంటే

వాడికి పనిచేస్తాయి. మనకి సంబంధించినవి కావు. గుంటూరు, బాపట్ల, చీరాల, తెనాలి ఆ వూళ్ళల్లో ఒకాయన షావుకారు తిరుగుతూ ఉండేవాడు, కోమటి. ఏ తాలూకావాడో, వాళ్ళ కుటుంబం వివరాలేమిటో ఎవరికి తెలియదు. అక్కడికి వచ్చేసాడు. భుజాన మంచినీళ్ళు కావిడి వేసుకొని, మంచినీళ్ళుపోసి, ఒక పది పన్నెండు యిళ్ళల్లో ఓపికనుబట్టి ఏదో రోజుకింత అని తీసుకుంటూ ఉండేవాడు. దాంతో జీవనోపాధి గడుస్తోంది. తుండుగుడ్డ భుజాన వేసుకునేవాడు. బాబు అనే ఆయన. ఆయన కూర్చుని రామభజన చేస్తూండేవాడు, ఏమీ తెలియదు. 'రామ రామ' అనటం తెలుసు. ఎక్కడన్నా కూర్చుని 'రామ రామ' అంటున్నపుడు మధ్యన అదిగదిగో పూజ జరుగుతోంది, అదిగో గంట కొడుతున్నారు, హారతి యిస్తున్నారు అనేవాడు. మేం వెళ్ళొస్తామంటే అదిగో ప్రసాదము యిస్తున్నారు తీసుకొని వెళుదురు గాని అని యిలా చెయ్యి పడితే అరటిపండు, కొబ్బరిచిప్ప, పటికబెల్లం పడేవి. అవి యిచ్చి పంపేవాడు. దానికోసం చేసినవాడు ఏమవుతాడు? ఆయనకి ఎక్కడ భజన చేస్తున్నారో, ప్రసాదం ఎలా వచ్చిందో మనకేం తెలుసు? వీళ్ళని సహజంగా జన్మచేత వచ్చిన సిద్ధులంటారు. ఇందులో తర్వాత అధ్యాయంలో చెబుతారు సిద్ధు లెన్నిరకాలుగా వస్తాయో. గంజాయి మొదలైన వాటితో వచ్చేవి, అంటే మూలికలతో, అలా కాకుండా పుట్టుకచేత వచ్చేవి, వరుసన చెప్తాడు. కనుక దోషమునకు బీజములు. ఇందులో దేనికోసం యోగాభ్యాసం చేసినా, ఆ దోష బీజములు క్షయత్వం పొందుతాయి. యోగాభ్యాసం చేయటంలో కేవలం ఒకానొక వెలుగు మిగుల్తుంది. ఆ వెలుగు మీ సత్త్వము నందు ప్రకాశించి, మీ ఆత్మయే ఆ వెలుగుగా ఉండి, మీలో ఉన్న ఆ పరమాత్మ నుండి ఆ వెలుగు వస్తూ ఉంటుంది. ఈ స్థితి వస్తుంది. అనగా మీలో పరిశుద్ధి వచ్చిన తర్వాత ఆత్మకు, పరమాత్మకు మధ్యన భేదం నశిస్తుంది. ఏ పరిశుద్ధి? స్థూల శరీర పరిశుద్ధి మాత్రమే కాదు. స్థూల శరీరానికి కావలసినవి పళ్ళు తోముకుంటం, నాలిక గీసుకుంటం, చేతులు, కాళ్ళు, కళ్ళు, మొహం కడుక్కుంటం, స్నానము చేయడం, గుడ్డలు మార్చుకుంటం మొదలైనవి మాత్రమే. శుచి అంటే అదికాదు మనస్సు పరిశుద్ధి, కోరికలనుండి తర్వాత మహా మహిమలు కావలెను అనే స్థితి నుండి పరిశుద్ధి. యోగాభ్యాసం చేస్తూంటే మనకి పదిమందిలో కలిగేటువంటి పేరు ప్రతిష్ఠలు కావలెను అనే మనస్సునుండి పరిశుద్ధి లేదా యోగాభ్యాసం చేస్తూంటే

పదిమందికి పనికొచ్చే పనులు మనం ఏదన్నాచేస్తూ ఉండటంవల్ల పదిమందిలో పేరు ప్రఖ్యాతులు వస్తూ ఉండటం అనే వాటినుండి పరిశుద్ధి. లేదా ఏదన్నా సిద్ధులు, శక్తులు, దూరదృష్టి దూర శ్రవణాదులు కలిగితే ఎవరికన్నా ఏమన్నా ఉపయోగం అవుతుందనే అభిప్రాయం నుండి పరిశుద్ధి. ఇలాంటివన్నిటి నుండి క్రమక్రమంగా పరిశుద్ధి కలిగేటప్పటికి అంతర్యామిత్వం తప్ప యింకేం మిగలదు. ధ్యానంలో ఆ స్థితి వచ్చేటప్పటికి సత్త్వము అని చెప్పబడేటువంటి పరమాత్మ లేక పరబ్రహ్మముతో అభేదత్వము చెందుతారు. అంటే దేహేంద్రియాదుల పరిశుద్ధి పరిపూర్తి అయ్యేటప్పటికి ఆత్మకి, పరమాత్మకిన్నీ భేదం నశిస్తుంది. గదిలో ఉన్న చోటుకి, బయట ఉన్న చోటుకి భేదం లేదని తెలుస్తుంది. గదిని శుభ్రంగా ఉంచుకోకుండా అవి యివి వండుకొని, మసాలాలు అవన్నీ అక్కడపోసి ఆ ఎముకలు, కోడిగుడ్లు అవన్నీ అక్కడే పడేసుకొని, చేపల ముక్కలు అవి అక్కడే ఉంటే గది వాసన కొడుతోంది అంటాం. కాని గదిలో ఉన్న ఆ చోటుకి ఆ వాసన అంటుతుందా? అలాగ మనలో ఉన్న సత్త్వము లేక ఆత్మ అనేదానికి మనం చేస్తున్న దుర్వాసనలు ఏమీ అంటవు. అయితే అవి చేయవచ్చునా? చేయవచ్చును. బాధ్యత మనదే కనుక అనుభవించ వలసినది మనస్సే. పాపము లాచరించేది మనస్సే, అనుభవించేది శరీరంద్వారా మనస్సే గనుక, అనుభవించటానికి ముచ్చట పడితే చేయవచ్చును. ఏమీ అభ్యంతరం లేదు. నిప్పులో వేలు పెట్టవచ్చునా? అంటే మహారాజులాగ పెట్టవచ్చును. దానికేం తర్వాత కాలిందంటే బాధ్యత నీదే. కాలింది అనేది లేకుండా ఉంటే మళ్ళీ పెట్టచ్చు. కనుక పరిశుద్ధి పరిపూర్ణంగా కలిగినప్పుడు, అంటే వీడికి కావలసింది ఏంలేదు అని తెలిసేటప్పటికి దేహము, యింద్రియములు, మనో, బుద్ధి అహంకార చిత్తములు వీటి క్షాళనం పరిపూర్ణంగా అయ్యేటప్పటికి ఆత్మ అని చెప్పబడే సత్త్వము, పరమాత్మ అని చెప్పబడే పరమ పురుషునితో అభేదము చెందుతుంది. అంటే గది చక్కగా కడిగి తుడిచి పెట్టుకున్నపుడు, ఇల్లు కట్టకముందు అక్కడ ఉన్నచోటు ఎంత పరిశుద్ధో, యిల్లు కట్టిన తర్వాత ఆ గదిలో ఉన్న చోటుకూడ అలాగే ఉంటుంది. ఈ గదిలో ఉన్న చోటు లాంటిది ఆత్మ. గది కట్టక మునుపు ఉన్నటువంటి చోటులాంటిది పరమాత్మ, కనుక మనం గదిని గలీజు చేసుకుంటంవల్ల వాసనలు మనకి కొడ్తున్నాయి. కాని, చోటుకి కొట్టవు. పాపాలు ఎందుకు చేయకూడదు? మనకి కొడతాయి కనుక. మనలో ఉన్న

ఆత్మకి అంటవు. మనం అనుభవించాలి. అందుకని కావలిస్తే చేసుకోవచ్చు అన్నాడు. ''న మాంస భక్షణే దోషః న మద్యే న చ మైధునే'' మనువు చెప్పాడు. మాంసం తింటే దోషమా? దోషం ఏమీలేదు. మద్యం తాగితే దోషమా? నువ్వెవడివి నిర్ణయించటానికి అన్నాడు. 'న చ మైధునే' అలాగే సెక్స్‌లో ఎపుడూ మునిగి ఉంటే దోషమా? నువ్వెవడివి చెప్పటానికి? అన్నాడు. నీకు కావాలంటే నువ్వు మునిగి ఉండు. లేకపోతే తేలి ఉండు. వాళ్ళు ఎంత గడుసైన వాళ్ళో చూడండి. ''అతీతస్తు మహాప్రాజ్ఞ'' వీటికి అతీతంగా ఉన్నవాడు మహానుభావుడని మేము వాడికి దణ్ణంపెట్టి, మేము వాడి దగ్గర నేర్చుకుంటున్నాం కాని, యివి పొందినవాడు దుష్టుడని మేము అనటం లేదన్నాడు. మనుస్మృతిలో. ఇవి దాటినవాడు మాకు కావాలని మేము వెతుక్కుంటున్నాము కాని, ఇవి ఉన్నవాడిని మేము ఏదో అనటానికి మేము ఎవళ్ళం? అన్నాడు. అంటే అంతటి సంస్కారము, నాగరికత (highest culture, civilization) ఉన్నవాళ్ళే పరిపాలన చేయగలరు. చాల ఆశ్చర్యం.

కనుక దోష బీజములన్నీ క్రమంగా ఈ రకంగా నశిస్తాయి నిరంతర సాధన చేయటంవల్ల. ఆ సాధన చేయటంలో ఎందుకు సాధన చేస్తున్నాం అనేదాన్ని కూడ త్యాగంచేసి వైరాగ్యం చెందాలి. త్యాగం, దానం, పరోపకారం, యోగాభ్యాసం, ధ్యానం, ఇవన్నీ ఎందుకు చేస్తున్నారు? అంటే జవాబు ఏమిటి? ''*సౌరభమేల లేల!* వెదజల్లు చందమామ'' అన్నాడు. అంటే చంద్రుడు వెన్నెలలు ఎందుకు వెదజల్లుతున్నాడు అంటే వాడి స్వభావం కాబట్టి. సూర్యుడు చీకటిని ఎందుకు పోగొట్టుతున్నాడు. యత్నించికాదు. అది వాడి స్వభావం కాబట్టి. అలా అవ్వాలి యోగాభ్యాసం. అపుడు ''దోష బీజక్షయే'' దోషములు కలగటానికి ఉన్న బీజములు శుభ్రంగా మాడిపోతాయి. అంటే ప్రేరకములు (Incentives) ఉండవు. దోష బీజాలు అంటే అవి. దోషం దేనివల్ల చేస్తామో అవి ఉండవు. యింక దోషం జరగటానికి అవకాశం లేదు. అంతేగాని దోషాలు జరగకుండా చూడండి అంటే జరగకుండా ఉండవు. ఎక్కడో దోషం చెయ్యనే చేస్తాడు. అందుకని మానసిక కక్ష్యలో జాగ్రత్తగా ఉంటే జరిగేవి కావు యివి. దోషం జరగటానికి కావలసిన వస్తువులుగాని, మనుషులు గాని అందుబాటులో లేకుండా చేసుకో అన్నాడు. అపుడు యింకేం చేయటానికి వీల్లేదు కదా. సిగరెట్లు మానేయడం కోసం ఒకడు రాత్రి గం॥ 9.30లు అయ్యే లోపల ఉన్నవన్నీ కాల్చేసాడు. ఎందుకని?

తెల్లవార్లు కాల్చకుండా ప్రాక్టీసు చేస్తాట్ట. తరువాత రెండు మూడు నెలలు యిలా ప్రాక్టీసు చేసి దీనివల్ల లాభం లేదని, సిగరెట్లు అమ్ముతున్న ఊరికి నాలుగుమైళ్ళ దూరంలో ఉన్న గ్రామంలో మకాం పెట్టేసాడు. అక్కడనించి ఏం చేసాడు? దానికోసం స్కూటర్ కొన్నాడు. జడభరతుడి కథల్లే అయ్యింది. కనుక దోష బీజములు అలా పోవు నాయనా అన్నాడు. అవి పోవాలంటే ఇంకొక దాంట్లో లీనమై ఉంటే పోవాల్సిందే. దాన్ని పోగొట్టుకునేందుకు తరిమినా, పారిపోయినా, వదిలేవి కావు. నువ్వు పారిపోతూ ఉంటే అవి నిన్ను తరుముతూ ఉంటాయి. ఎందుకు యోగాభ్యాసం చేస్తున్నారు? అన్న ప్రశ్న లేనివాళ్ళు ఈ అభ్యాసం చేస్తారు. తెనాలి రామకృష్ణుడు చెబుతాడు. ఒక అరణ్యంలో వెడుతూ ఒక ఆశ్రమం చూపించి, అగస్త్యమహర్షి భార్యతో అన్నాట్ట. ఓ లలితాంగి యిందు ''సుఖ మొందు మృతుండతండు రాఘూలు వ్యాఘూలము హాతి గాధ వ్యాఘూల మహాతి రిక్త చరితుండ మృతుండ మ్మహర్షి వ్యాఘూలుడు''. గాధి అంటే విశ్వామిత్రుడి తండ్రి వీళ్ళకంటే పైన ఉన్న ప్రవర్తన కలవాడు, ఈ ఆశ్రమంలో ఉన్నాడు. నిష్కాళగళుండు, గొంతుమీద విషం మ్రింగిన నల్లని మచ్చలేదు వాడికి చూడు ''నిర్వృతి గాత్రుడు'' శరీరం సగం భాగంలో స్త్రీ లేదు వాడికి చూడు, ఆ ఋషి ''నిర్నిటలేక్షణుడు'' వాడు గట్టిగా కన్నెర్రజేసి చూస్తే భయంలేదు. మూడవ కన్ను మొహాన బయటికి కనిపించదు. ''అయిన అంబకేశుడు అనంత చింతింపగన్'' కాని ఈమూడు విషయాల్లో తప్ప అంతా పరమేశ్వరుడే అన్నాడు. లోపాముద్రతో అగస్త్యుడు చెబుతున్నాట్ట. వ్యాఘూల మహర్షిని గురించి. అలాంటి వాళ్ళ దగ్గర దోష బీజములు ఉండవు. ఎందుకు యోగాభ్యాసం చేస్తున్నారనేది ఉండదు. కైవల్యమ్ ఉంటుంది. కైవల్యము అంటే కేవలము. ఏమిటి కేవలము? సత్త్వము లేక ఆత్మ, పురుషుడు లేక పరమాత్మ. అంటే వీడు కేవలము వాడుగానే ఉండటం మొదలు పెడతాడు. కైవల్యము అంటే అర్థం అది. కేవలము యొక్క స్థితే కైవల్యము. కైవల్యం అంటే జీవుడు పరమాత్మగానే ఉండటం ప్రారంభించాడు కనుక కైవల్యము అంటారు. ఈ స్థితివస్తే ఆ స్థితి వస్తుంది. ఎవడికన్నా నువ్వు ఏదన్నా చెప్పాలంటే, నువ్వు చెప్పవలసినటువంటి పరిస్థితి వచ్చి, ఆ పరిస్థితి నీచేత వాడికి చెప్పిస్తుంది కాని, నువ్వు పంతంపట్టి, వాడికి చెప్పేను అనిపించుకోటానికి చెప్పటం యివన్నీ మానేస్తావు. వాడు కావాలంటే నిన్ను అడుగుతాడు. నువ్వు చెబుతావు. వాడు నిన్ను అడగడు. నువ్వు చెప్పవు

అంతే. అడగకపోయినా చెప్పాలా? అలాంటి పరిస్థితి వస్తే అడగకపోయినా చెప్పు. అడగకపోయినా చెప్పేవని వాడు నిన్ను తిట్టడా? నీకు సంబంధించినది కాదు. పెద్ద పెద్దవే నువ్వు వదులుకున్నావు. తిట్టితే పెద్ద లెక్కేమిటి? ఈ స్థితి వస్తుంది. కనుక ఈ స్థితి కోసమే యోగాభ్యాసం. ఈమధ్య వచ్చినవన్నీ ఎందుకయ్యా? నువ్వు వర్ణించావు అని అడిగితే, దీనికి సంబంధించిన శాస్త్రం కనుక వివరాలు అన్నీ ఉండాలి (encyclopedia). ఇవన్నీ తప్పనిసరిగా ప్రతి యోగాభ్యాసం చేస్తున్న వాడికి దారిలో తగుల్తాయి. కనుక కంగారు పడకుండా, షాక్ తినకుండా ఉండటం కోసము చెప్పారు. వాడు యోగాభ్యాసం పరీక్షల ముందు మొదలుపెట్టి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణదాకా వచ్చాడనుకోండి. ఈ స్థితిలో ధ్యాన సమాధులు చుట్టూ తిరుగుతూ ఉంటాయి. వీడిలో ప్రవేశిద్దామా? లేదా? అని. ఆ స్థితిలో ఉండంగ చదువుకుందామని పుస్తకం తీసాడనుకోండి, రేపటి పరీక్షకు సంబంధించినది టకటక ఏదో తమాషాగా ఎవడో చెప్పినట్టు వచ్చేస్తాయి. రాసేసుకుంటాడు. ఇంకాసేపు చదువుతూ ఉంటే దాంట్లో యింకో విషయం మీద ఇంకేదో వచ్చింది. రాసేసి పెట్టాడు. ఇట్లా ఐదో, ఆరో రాసేసి అక్కడపెట్టాడు. మర్నాడు పరీక్ష కెడితే పేపర్లో ఉన్న ప్రశ్నలే యివి. అంటే రేపు రాబోతున్న ప్రశ్నపత్రం అచ్చు అయ్యింది గనుక, మీరు ఆ సబ్జక్టే చదవటానికి తీసేటప్పటికి అవి దడదడ మనస్సులోకి వచ్చేసినాయి. ఒకచోట రిజిష్టర్ అయ్యాయి. అచ్చయి వస్తాయి. యిటువంటివన్ని పేరాశతో మొదలుపెడితే దోషబీజం అన్నాడు. దోషబీజము క్షీణించుట వలన 'కైవల్యమ్' కైవల్య తత్వము వస్తుందన్నాడు. అంటే ఎవడికన్నా ఏదన్నా మీవల్ల జరగలవలసి ఉంటే మీరు చేయటం కాకుండా అది జరుగుతుంది అంతే. వాడికి ప్రాప్తం అవుతుంది. మీకూ అంతే. ఇంకేదన్నా కూడ ప్రాప్తం అయితే అవుతుంది. అంటే ఇది ఇలా జరగాలి, ఇది ఇలా చేయాలి అని ఏమీ ఉండకుండా పోయినటువంటి ఒక చక్కని స్థితి వస్తుంది.

## 52. స్థాన్యుపనిమన్త్రణే సంగస్మయాకరణం పునరనిష్ట ప్రసంగాత్।

స్థాని = స్థానము గలది, ఉపనిమన్త్రణే = విలువ కట్టుట, శ్రద్ధ చూపుట, సంగం = అంటుకుంటం, స్మయాకరణం = తిరస్కరించటం, పునః = తిరిగి, అనిష్ట ప్రసంగాత్ = అనిష్ట ప్రసంగములు వచ్చును.

**ఆయా స్థానముల యందున్నవారు సత్కారాదులు చేసినను వానియందు అభిలాషగాని, గర్వపడుటగాని కలుగరాదు. లేనిచో మరల కర్మ బంధాదులు కలుగుచునే యుండును.**

**వివరణ :** స్థాని అంటే స్థానము కలది. ఇది తర్కశాస్త్రంలో ఉన్న పదం. ''స్థాని వదా దేశః'' అని కొన్ని కొన్ని వ్యవహారాలు వస్తాయి. యిపుడు మనకి అక్కర్లేదనుకోండి. మరీ క్లిష్టం (complicated) గా ఉంటాయి. స్థాని అంటే స్థానము కలది. ఈ అరటిపండు స్థాని. ఈ పుస్తకము స్థాని. ఆ గుంజ స్థాని. ఈ గోడ స్థాని. ఏ వస్తువైనాసరే మనిషైనా సరే. అస్థిత్వము కలది అని అర్థము స్థాని అంటే. అది ఉన్నపుడు వీరెవరండి? అంటే ఒక పెద్ద పారిశ్రామిక వేత్త. ఆ! అని చూస్తున్నాం. ఆ! అని చూసేటప్పటికి అనిష్ట ప్రసంగం వస్తుంది మనస్సులో. ఎందుకని? వాకిట్లో కూర్చుని ఏదో పదిమందికి బాధగా ఉందంటే మందులు యిద్దామని కూర్చున్నవాడివి. ఆయనెవరో పారిశ్రామికవేత్తట అంటే ఆ! అంటావా, ఆ! అనేటప్పటికి ఆయనకి ముందు మందు యివ్వవలసిన కారణాలు మనకు వస్తాయి తప్పక. కాని ఆయన నీరసంగా ఉన్నాడనుకోండి. మనకందరికి ఉన్నట్టు ఆయన కూడ నీరసంగా ఉండచ్చు కదా. ఆయనకి మందు ముందు యివ్వవలసిన కారణాలు ఎలా అయితే దుష్టములైనవి వస్తాయో, అలాగే ఆయన నీరసంగా ఉన్నాకూడ ముందు మందు యిస్తే ఎవరన్నా ఏమన్నా అనుకుంటారేమో అని యివ్వకుండా ఉండే దుష్టకారణాలు కూడ వస్తాయి. డోలల్లే రెండు ప్రక్కల వాయించేస్తుంది. నేను కాబట్టి ఈపని చేస్తున్నాను అని అనుకుంటం ఎంత పాపమో, నేనేముంది అని అనుకుంటం కూడ అంత పాపం. నేను ఏముందో వాడు తేల్చాలి. వాడికి సంబంధించినది కాని, మనకి సంబంధించినది కాదు. అమ్మమ్మ. మనమేమిటండి. క్షుద్రులం, నీచులం అంటాం. Let us not have any opinion about us. ఏ ఉద్దేశ్యమూ ఉండకూడదు. రెండూ దోషమే, అహంకారం క్రిందే లెక్క. మనని గురించి మనం delicate గా ఫీలవ్వటం కూడ అహంకారం క్రిందే లెక్క. ఎవడన్నా మనని తిట్టాడనుకోండి. కోపం

వస్తుంది. అదెంత దోషమో. ఎవడన్నా పొగిడాడు అనుకోండి మొహం ఎర్రబడుతుంది. B.P. raise అవుతుంది, delicate గా ఫీలవుతాము. కాలు చెయ్యి అటు ఇటు తిప్పుతాము ఎక్కడ పెట్టుకోవాలో తెలియక. అదికూడ అహంకారమే. అదెంత అహంకారమో యిది కూడ అంతే అహంకారము. ఎందుకంటే నీవు వాటిని పట్టించుకుంటున్నావు గనుక వాడు తిట్టినదిన్నీ, వీడు పొగిడినదిన్నీ, దాన్ని హంసపాదుపెట్టి నీకు అన్వయించు కుంటున్నావు కనుక ఈ restlessness అంతా వచ్చింది. నిజంగా మీరాండి, ఒక డోసుయిస్తే చాలండి. నేను వార్ని చూసాను, వీర్ని చూసాను. జయసూర్యగార్ని కూడ చూసాను. పిలకా కృష్ణమూర్తిగార్ని కూడ చూసాను. హోమియోలో మీ లెక్క మీలెక్కేనండి. అంటే 'ఆ' ఏమిటోలెండి అంటున్నామంటే అర్థంవాడు అంటున్నవన్నీ మనకోసం. మన పేరు క్రింద జమ కట్టుకుంటున్నాం అన్నమాట. వాడెంత, వీడెంత అంటే ఎంత దోషమో, వాడు మనని పొగుడుతూంటే delicate గా ఫీలవ్వటం కూడ అంతే దోషం. ఎందుకంటే మనక్రింద జమ కట్టుకుంటున్నామని అర్థం. యివన్నీ అనిష్ట ప్రసంగములు అటుయిటు కూడ. కనుక కారణాలు ఏవి ఉండాలి. ఏవి ఉండకూడదు. క్రమంగా తొలగిపోవాలి ప్రవర్తనలో. నిజంగా M.L.A. గారు నీరసంగా ఉన్నారు. గుండెదడగా ఉంది. ముందు మందిస్తే ఎవరన్నా చూసి M.L.A. గారికి ముందు యిస్తున్నారు అని అనుకుంటారు అనేది కూడ ఉండకూడదు. అది ఉంటే ఎంత దోషమో, నీరసం లేకపోయినా ముందు చూడడం అంతే. అంతకంటే మహా దోషము. ఎందుకంటే కీర్తి దురద. అంటే వాళ్ళేమన్నా అనుకుంటారనేటు వంటిది. అది మరీ బురద లాంటిది. అంటే మానసిక దౌర్బల్యము (psychological weakness). అందుకని ''స్థాని ఉపనిమన్త్రణం'' ఉపనిమన్త్రణం అంటే విలువ కట్టుట, శ్రద్ధ చూపుట అక్కడ ఉన్న వస్తువుగాని, మనిషిగాని, వాటికి నువ్వు ఉపనిమన్త్రణం చెయ్యక మానవు. అలాగే బల్లమీద ఒక ముక్కుపుడక పడి ఉందనుకోండి ఏది? డిస్పెన్సరీ అంతా అయ్యాక అందరూ వెళ్ళిపోయారు. ఏం చేయటం? ఉపనిమన్త్రణం. చూడంగానే ఓయ్ ముక్కుపుడక ఎవరిదో ఏమిటో అనుకుంటే అది ఉపనిమన్త్రణం. అంటే నీ ప్రవర్తనను అక్కడ ఉన్న వస్తువుని చూసి స్పీడుగా అసాధారణం (odd)గా తయారు చేసుకుంటం. దానియందు నీ reaction. ఉంగరం ఉందనుకోండి అందరూ వెళ్ళిపోయాక ఎవరిదో

పడిపోయింది అక్కడ. లేదా పదిమంది ఉండంగానే చూసారనుకోండి, డిస్పెన్సరీ మంచి కిటకిట లాడుతోంది. మందులిస్తున్న బల్లమీద ఉంగరం ఉంది. వెంటనే జేబురుమాలు తీసి దానిమీద వేసేసి ఒక పదినిమిషాల్లో పావుగంటో అయిన తర్వాత ఆ జేబురుమాలుతో పాటు తీసి జేబులో పెట్టేయటం. అదొక పద్ధతి.

కొత్తగా పెళ్ళయిన రోజుల్లో మీ ఆవిడ తల్లో పువ్వులు చూసారనుకోండి. పువ్వు కంటే ఎక్కువ గందరగోళం ఉంటుంది. అది ఉపనిమంత్రణం అంటే. పుష్పమే కదా యింతా అయితే. ఆ చెట్టుమీద చూసినపుడు మీకు వికార పెట్టదది. ఇక్కడ చూసినపుడు వక్క వేసుకోవాల్సినంతగా వికార పెట్టుతుంది. ఉపనిమన్త్రణాలు అంటే అవి. "Odd feelings that make you restless" ''స్థాన్యు ఉపనిమంత్రిణే' స్థానుల యందు మీరు ఉపనిమన్త్రణం చెందుతూ ఉండగ అంటే వ్యక్తులు, వస్తువుల యందు, మీరు గల్లంతు చెందుతూ ఉండంగ అన్నమాట. అపుడు మీరు అభ్యాసం చేయవలసింది. ''సంగస్మయాకరణం'' సంగం అంటే అంటుకుంటం. భార్యని మీరు భౌతికంగా తాకవచ్చుగాని, మానసికంగా మీరు తాకకూడదు. ఇందులో అదొకటి గందరగోళం. ఎందుకంటే ఆవిడ నా భార్య అనే భావం మీకు యోగాభ్యాసానికి అడ్డంతప్ప, భార్యాభర్తల సంసారం యోగాభ్యాసానికి అడ్డంకాదు. సంసారబద్ధులు అవరు. ఎందుకంటే ఆవిడ భార్యకాదు. మనిషే. మీ కంటికి భార్య, మీ మనస్సుకీనీ, అది ఎత్తేసేయి. అది ఎపుడు కావాలి. ఎవర్ని ముట్టుకోవచ్చు. ఎవర్ని ముట్టుకోకూడదు అనే అభిప్రాయంలో కావాలి. ఆ టైమపుడు ఉంచి, మిగతా టైమపుడు ఎత్తేసేయ్. Let yourself be a companion or a fellow. కనుక ''స్థాన్యుప మన్త్రణం'' జరిగినపుడు ఆ వస్తువుకీ, నీకు సంబంధం వచ్చినపుడు సంగం అంటే ఆ వస్తువు అంటుకుంటుంది. ''ఇది ఉంగరమా? అయ్యో! ఇది అవతల పారేయ్'' అంటే అది అంటుకుంటం అంటే. అదివరకు బల్లమీద పుస్తకాలు ఉంటే ఇది పుస్తకమా? ఇది పుస్తకమా అని ఎందుకు గుంజుకోలేదు. ఇది పెన్సిలా. పెన్సిలా? అని ఎందుకు గుంజుకోలేదు. ఉంగరము పెట్టితే ఇది ఉంగరమా? ఇది ఉంగరమా? అని గుండెలు తెంచుకుంటున్నాం? ఆ స్వభావం వదిలించుకుంటం పేరు సంగం వదిలించుకుంటం. సంగం అంటే అంటుకుంటం. బల్లమీద చెయ్యివేస్తే

ఎక్కడ వేసినా అంటుకోదు. పుస్తకం మీద వేసినా అంటుకోదు. పెన్సిల్‌మీద వేసినా అంటుకోదు. అరటిపండు బాగా మగ్గి ఉందనుకోండి చెయ్యి పెడితే అంటుకుంటుంది. వెళ్ళి కడుక్కు రావాలి. అలాగే ఇంట్లో కరెంటు పోయిందనుకోండి శబ్దభేది అల్లే కూర ఎక్కడుందో, అన్నం ఎక్కడుందో చెవిపెట్టి భోంచేస్తూ ఉంటాం. చేస్తూ ఉండంగ ఎడమచేత్తో కొన్ని తడుముతూ ఉంటాం. తడుముతూ చెయ్యి పెట్టేటప్పటికి మంచినీళ్ళ గ్లాసు తగుల్తుంది. అంటే అంటుకుంటాయి. యింకా కొంచెం తడిమేటప్పటికి నెయ్యి తగుల్తుంది. కొన్ని అంటుకుంటాయి. కొన్ని అంటుకోవు. గ్లాసులు, గిన్నెలు తగిలితే అంటుకోవు. నెయ్యి, ఆముదము, నూనె తగిల్తే అంటుకుంటాయి. ఆ అంటుకునేటు వంటివి జాగ్రత్త అని చెప్తున్నాడు. మనస్సుకి అంటుకునే సంగాన్ని ''స్మయం'' అంటే తిరస్కరించటం నేర్చుకోమన్నాడు. అంటే అంటుకుంటాన్ని తిరస్కరించటం నేర్చుకో అన్నాడు. అంటే ఇంకోదాన్ని నువ్వు చేయవలసిన పనిని స్మరిస్తూంటే అది నీకంటుకోదు. నువ్వు మందులిస్తూంటే ఒళ్ళు పొగరెక్కి లేకుండా ప్రక్కన ఈ ఉంగరం ఎవరిది? ఈ ఉంగరం ఎవరిది అని రాదుకదా. ఎవరిదైతే వాళ్ళు తీసుకుంటారు. లేకపోతే గప్‌చిప్‌గా జేబులో వేసుకొని ఆ మర్నాడు ఎవరైనా అడిగేదాకా అట్టేపెట్టి ఇయ్యి. ఈ లోపల ఎందుకు నువ్వు దొంగ వేషాలు వెయ్యాలి. అలాకాకుండా గింజుకున్నాడంటే వాడు యోగాభ్యాసానికి పనికిరాడన్నాడు. లోపల గుండె దడ్‌దడ్ కొట్టుకుంటూ ఉంటుంది. ఎందుకంటే జేబులో ఉంగరం ఉంది. ఆరాత్రి నిద్దట్లో కూడ ఆకాశంలో ఇంత పెద్ద ఉంగరం యిలా తేల్తున్నట్లు, తిరుగుతున్నట్లు మీదకి 'ఆహా' అని వస్తున్నట్లు యివన్నీ వస్తాయి. వాడికి సంగం ఉంటే, లేకపోతే ఎవడి ఉంగరమో జేబులో వేసుకుంటే కలరాదు. మర్నాడు యిచ్చేద్దామని అనుకుంటాడు. మధ్యలో దాని ధ్యాస ఉండదు. వీడికి దానిమీద ఎంత గందరగోళం ఉందో అంత ఉంగరం జ్వాలలతో మండుతూండి దాంట్లోంచి వీణ్ణి దూరమన్నట్లు అలాంటి కలలన్నీ వస్తాయి ఒక్కొక్కపుడు. అంటే వీడికి ఎంత వికృతమైనటువంటి అభిప్రాయాలు దాని గురించి ఉన్నాయో, అంత వికృతమైన కలలు వస్తాయి. అందుకని దాన్ని 'స్మయం' చెయ్యాలి. అంటే తిరస్కరించటం, అలక్ష్యం చేయడం (ignoring) 'సంగస్మయం' అంటే అట్టి బంధములను లెక్క చేయకపోవటం. ''సంగ స్మయాకరణం'' వాట్లని అలక్ష్యం (ignore)

చెయ్యటం అనేది చెయ్యాలి. అంటే బ్రతికి ఉన్నన్నాళ్ళు కూడ నాయనా యోగాభ్యాసం అయిపోయింది, అష్టాంగాలు అయిపోయినాయి, అనుకోవోకు అన్నాడు. అష్టాంగమంటే ఎనిమిది అంకెలు లెక్క పెట్టడం కాదు. యావజ్జీవము యోగాభ్యాసం చేస్తూండటమే. మన కిదివరకే సంయమం వచ్చిందనుకోండి. ఒకమాటు వస్తే రెండోమాటు రావాలని ఏంలేదు. మళ్ళీమాటు రాకుండా ఉండచ్చు. ఇదివరకు రాకుండా ఉండి, ఇపుడు రావటానికి వీలున్నపుడు ఒక ఏడాది నా యిష్టం వచ్చినట్టుగా ప్రవర్తిస్తే మళ్ళీ రాకపోవటానికి కూడ వీలుంది. ఎన్నాళ్ళు మనం యోగస్థితిలో ఉంటే అన్నాళ్ళు మనస్సుకి సంయమం ఉంటుంది కాని, యోగస్థితి మానేస్తే సంయమం ఎందుకుంటుంది? పాతికేళ్ళు నుంచి వ్యాపారం చేస్తూంటే లాభాలు వస్తున్నాయి. అకస్మాత్తుగా ఒక ఏడాది కొట్టు మూసేసాడు అనుకోండి. మళ్ళీ ప్రారంభిస్తానంటే వస్తుందా? రాదు. ఆ నేనేకదా. ఆ కొట్టేకదా. అయినప్పటికి మధ్యన గాస్ పోసేసాడు. కనుక ఆ వ్యాపారం పుటం పెట్టినా రాదు. ఒక ఏడాది చెప్పకుండా ఉద్యోగం మానేసి, ఆ ప్రిన్సిపాల్ దగ్గరికే, లేదా ఆ ఆఫీసరు దగ్గరికే వెళ్ళి ఆ నేనే కదా, ఆ మీరే కదా, ఆ ఉద్యోగమే ఇవ్వండి అంటే ఇవ్వరు. అందుకని స్థానుల యందు ఉపనిమంత్రణం చేస్తూ ఉండంగ సంగస్మయాకరణం చేసుకుంటూ ఉండు. యావజ్జీవము కూడ. ఎనిమిది లెక్క పెట్టేవు అనే పొరపాటున ఉండకు. వేదం చదువుకునేవాళ్ళు ఉన్నారు. నిన్న, మొన్న కూర్చొని చదువుకొని నేర్చుకుంటున్నటువంటి వాళ్ళు అద్భుతమైన స్వర ఉచ్చారణతో పురుష సూక్తము చేప్పేస్తారు. పదేళ్ళ కిందట నేర్చుకున్నవాళ్ళు స్వరాలు, అక్షరాలు కూడ మర్చిపోయిన వాళ్ళుంటారు. ఎందుకంటే ఈ మధ్యన చదవటం లేదు. మళ్ళీ వీళ్ళతో కూర్చొని చదవమంటే ఎలా ఉంటుంది? అఘోరించి నట్లుంటుంది. వెనుక పడతారు. యోగాభ్యాసం కూడ అంతే. అంటే ప్రతిరోజు యోగ జీవితం జీవిస్తూ ఉండాలి. ఒక కోర్సు చెయ్యి అంటే లాభం లేదు. తెలుసుకోవడంతో యోగాభ్యాసం సజీవంగా ఉండాలి జీవితం అంతా. కనుక ప్రతిరోజు తెల్లవారి లేచింది మొదలు రాత్రి పడుకునే వరకు ఎవరు వస్తారు? ఎవరితో మాట్లాడుతున్నారు? ఎవరు మీతో మాట్లాడుతున్నారు? ఏ వస్తువులు పట్టుకొస్తారు? ఏవి మీకిస్తామని అనుకుంటున్నారు. ఏవి వాళ్ళు మీ వలన కావలెను అంటారో యివన్నీ స్థానులు. వాటియందు మనకి మనస్సులో కలిగే ఎగుడు దిగుడులన్నీ ఉపనిమంత్రణలు. ఇవి చూసుకుంటూ

ఉండు అన్నాడు రొజూ పొద్దున్నె. ఎవడు వచ్చినా సరె. వాడు వస్తూండంగ నీ మనస్సు ఏమవుతుందో చూస్తూండు. కునుకుతోందా? జంకుతోందా? వెనక్కి వెళుతోందా? గెంతుతోందా? సర్దుబాటు చేసుకో. ఊరికే గెంతులు వెయ్యకు మనసా అని, ''విశ్వదాభిరామ వినురవేమ'' అని తనకి తానే చెప్పుకున్నట్టు చెప్పాడు ఆయన. ఎవడికి వాళ్ళు మనస్సుతో చెప్పుకోమన్నాడు. అందుకని, స్థాని, ఉపనిమంత్రణం అనుష్ఠానం చేసుకోవాలి. అంటే వ్యక్తులు, ప్రదేశము, వస్తువులు పరిసరముల యెడలనే మనస్సు పోకడ సరి చూసుకుంటూ, సర్దుబాటు చేసుకుంటూ ఉండాలి. ఎవరికి వారే యోగాభ్యాస మార్గంలో (regulate your response towards environments, palces, persons and things.) అంటే నీ మనస్సులో వాటి యెడల పుడుతూన్నటువంటి విలువలు, నువ్విస్తున్నావు కాని, వాటికి ఉన్నవి కావు. ఇవి జాగ్రత్త పడుతూ ఉండు. విలువలు ఎత్తేస్తూండు అన్నాడు. మొత్తం జగత్తులో పరబ్రహ్మం ఉన్నటువంటి విలువ ఒక్కటి నిరంతరం గుర్తుంచుకుంటూ ఉండు. నువ్విస్తున్నటు వంటి విలువలు ఎప్పటికప్పుడు గడ్డం చేస్తున్నట్టుగా చేసేస్తూండు. ఇదివాడు చెప్పింది ఈ సూత్రంలో. అంటే ఇంతకు ముందు చెప్పిన సాధనలన్నీ కూడ తప్పకుండా వస్తాయి. మధ్యన పొరపాటు పడి బోల్తా పడకుండా ఉండేందుకు చెప్పారు. అసలు చేయవలసిన పద్ధతి యిది. అయితే పరకాయ ప్రవేశం చేయవచ్చునా? లేదా? ఆ పనిని బట్టి అన్నాడు. అవతల ఎవడికో ప్రాణం పోతుంది అనుకోండి. వాడిద్వారా మీరు చెప్పదల్చుకున్న మందు వాడిచేత తట్టించి మీరు వేయించవచ్చు. తప్పకుండా పరకాయ ప్రవేశం చేయవచ్చు. అంతకంటే యింకోదానికోసం పరకాయ ప్రవేశం చేయకూడదు. చేస్తే ఏమవుతుంది? గోడ కన్నంలోకి దొంగతలకాయ ప్రవేశం చేసినట్లే. అక్కడికి తలకాయ నరికేస్తారు. సరదాకోసం పరకాయ ప్రవేశం చేసి, అక్కర్లేని పనులకోసం పరకాయ ప్రవేశం చేసి, వాడి శరీరంలో పనిచేస్తున్నాను అని. అలా పనిచేయకండి. ఎవడికైనా ప్రాణ ప్రమాదం వచ్చిందనుకోండి. ఎక్కడన్నా పెద్ద సమస్యవచ్చి, విపత్కర పరిస్థితి వచ్చి, ఒక కుటుంబం కుటుంబం వెళ్ళిపోతుందనుకోండి, అలాంటి చోట చేయండి. ఇవి గుర్తు పెట్టుకొని వెలుగుతూ ఉండండి అని ఈయన చెప్పాడు.

## 53. క్షణ తత్క్రమ యోస్సంయమాద్వివేకజం జ్ఞానమ్।

క్షణ = క్షణములు, తత్+క్రమయోః = దాని క్రమమును, సంయమాత్ = సంయమము చేయుటవలన, వివేకజం = వివేకము వలన పుట్టినటువంటి, జ్ఞానమ్ = జ్ఞానము కలుగును.

**క్షణములు, అవి వర్తించుచున్న క్రమము అనువానిపై సంయమము చేసినచో వివేకము వలన కలిగిన దర్శన జ్ఞానము లభించును.**

**వివరణ :** ఇక్కడ రెండు రకాల అర్థాలు చెప్పారు. మొదటిది తప్పు అర్థం. కాని మీకు కొన్ని వ్యాఖ్యానాల్లో కనిపిస్తుంది. అంచేత ముందు చెప్పుకుందాం. ముందు కుళ్ళు కొబ్బరికాయ కొట్టి, తర్వాత మంచి కొబ్బరికాయ కొట్టేవాళ్ళుట ఆంజనేయస్వామి గుళ్ళో ఒకాయన. అలా 'క్షణ' అంటే క్షణక్షణాలు అంటాం చూడండి సెకన్లు అవి ఎలా వెడుతున్నాయో, భూతకాలం (past) లోంచి వర్తమానంలోకి, వర్తమానంలోంచి భవిష్యత్ (future) లోకి అది ధ్యానంచేసి, ''తత్క్రమం'' అంటే వాటియొక్క క్రమం యందు సంయమంచేస్తే ''వివేకము'' వలన కల్గిన ''జ్ఞానము'' వస్తుంది. అంటే ఇది మంచి, ఇది చెడు అనేటువంటివి ఎవరు చెప్పనక్కర్లేకుండా సృష్టిలో ఉన్న సమస్తంలో మంచి చెడులు, నువ్వు ఏది చేయవచ్చో, ఏది చెయ్యకూడదో ఇంకొకడు చెప్పక్కర్లేదు. ఒకవేళ పొరపాటున చెప్పినా మీరు పొరపాటు చేసారనేది ఉండదు. రైటుది మీకు వస్తుంది. కాని మనకు కావలసినది పెద్దలు చెప్పిన అర్థం అదికాదు. క్షణం అనే మాటకి సెకను అనే అర్థం సంస్కృతంలో ఎక్కడాలేదు. క్షణం అంటే అర్థం ఏమిటి? ఏదన్నా ఒక ఉత్తమమైన పనిమీద ఒకణ్ణి అపాయింట్ చేయటం. క్షణం అంటే క్షణించుట. చేతిలో దర్భలతో నీళ్ళుకొట్టి 'క్షణం గత్వా' అంటారు. పితృ కర్మలలోను, దేవ కర్మలలోను. ''క్షణంగత్వా'' అంటే, మీరు నాకు భోక్తగా ఉండండి. లేదా మీరు మాకు పురోహితుడుగా ఉండండి అని ఆయనకి ఒక అపాయింట్‌మెంట్ యిచ్చినట్లు, అధికారం యిచ్చినట్లు. భారతంలో కూడ ఉదంకోపాఖ్యానంలో అన్నంతిని వెళ్ళమని చెప్పి, ఉదంకుణ్ణి పౌష్య మహారాజు 'క్షణోయించిన' అన్నాడు. 'క్షణించుట' అంటే ఏమని చెప్తారు? బలవంతం చేయటం అని చెప్తాం. క్షణించటం అంటే బలవంతం చేయటం కాదు. ఆ రోజున అమావాస్య.

పితృ దేవతలకి తను తర్పణం పెట్టుకునేందుకు కూర్చున్నాడు రాజు. వీడికి క్షణం యిచ్చాడు. అంటే తమరు నాకు భోక్తగా ఉండండి అని. అది క్షణించటం అంటే. కనుక క్షణించటం అనే మాటకి ఏదన్నా ఒక ఉత్తమమైన పనిమీద ఒకర్ని అధికారమిచ్చి నియమించటం. అలాంటి పరిస్థితులు ఎపుడు వచ్చినా, జాగ్రత్తగా దానియందు సంయమంచేసి చూడండి అన్నాడు. అంటే మిమ్మల్ని ఎవడన్నా అయ్యా ఈ పెళ్ళి సంబంధం కుదర్చటానికి ఉభయ పార్టీలకు తమరు పెద్దగా ఉండండి అంటాడు. ఇది మన క్షణం కావాలి. అంటే బాధ్యత యిచ్చారు. దీని మంచి చెడ్డలేమి? ఈ విషయంలో మనం ఎలా ప్రవర్తించాలి, అని దానియందు యోగాభ్యాసం చేసిన మనస్సుయందు, నీ వెలుగుని ప్రసరింపచేయి, అలాగే నువ్వు ఇంకొకరిని గురించి, అయ్యా! మా అమ్మాయికి మీరు సంబంధం చూసిపెట్టండి. వాడికి మనం క్షణం యిస్తున్నాం. ఈ భారంవాడు భరించగలడా? లేడా? బాధ్యత ఎరిగినవాడా? కాదా? బాధ్యత ఎరుగనివాడైతే ఏదో ఒక సంబంధం చూపెట్టటం ద్వారా మనం చేయకూడని పని చేసిన వాళ్ళం అవుతాం. ఎవరి కర్మ వాళ్ళది. పిల్ల కర్మనిబట్టి భర్త వస్తాడనేది రైటేగాని, మన కర్తవ్యంలో మనం కుంటికాలు పెట్టిన వాళ్ళం అవుతాం. మన కర్తవ్యమే మనకి ముఖ్యంగాని మిగిలినవి కావు. శుష్క వేదాంతం కర్తవ్యాన్ని ఎగ్గొట్టటంకోసం చెప్పకూడదు. మనం ఎవళ్ళమండి? మంచి సంబంధం చెడ్డ సంబంధం తేవటానికి? దాని పూర్వకర్మని బట్టి దానికి సంబంధం వస్తుందని అనుకోరాదు. అది ఎపుడూ నిజమే కాని, మనం తండ్రిగా చేయవలసిన పని ఏమిటి? అలాగ యింకొకడికి క్షణం యిస్తున్నా మనుకోండి. ఇది వీడికి మనం క్షణం యివ్వటమా? యివ్వకపోవటమా? ఇవ్వచ్చు. లేదా వీడు ఈ భారం భరించలేడు. పాపం లేతవాడు. యిట్లాగ క్షణం తత్క్రమం. అంటే వాటియొక్క క్రమం వరుస అంటే తేడావస్తే తేడా సర్దుకో గలగడం. ఏదన్నా ఒక పనిమీద ఎదుటివాళ్ళు మననిగాని, మనం ఎదుటివాళ్ళని గాని, నియమించటమున్నూ, ఒకవేళ అందులో ఏమన్నా తేడాలువస్తే మళ్ళీ అలాకాదు, ఇలాగ అని సర్దుకుంటమున్నూ, తప్పు చేయబోయి రైటు చేయటం. తప్పేం లేదు కదా దాంట్లో. పొరపాటు చేయబోయాము. మళ్ళీ సర్దుకున్నాము. ఇలాంటివి వచ్చినపుడల్లా, రెండింటిమీద కూడ ''సంయమాత్'' మీ సంయమం

ప్రసరింప చేసుకోండి నాయనా అంటే మీరు రోజూ చేస్తున్నటువంటి యోగాభ్యాసం టైములో, అది అయిపోయిన తర్వాత దీన్ని గురించి ఒక్కమాటు ఆలోచించండి. మీకు ఆ తేడా తెలిసిపోతుంది. అపుడు సర్దుబాటు (check) చేసేయండి. ఇది సంయమం చేయటం. దానివలన ''వివేకజం జ్ఞానం'' వివేకం వలన పుట్టిన జ్ఞానం అంటే ఏమిటో మీకు తెలుస్తుంది. వివేకజం అంటే ఏమిటి? అగరవత్తు వెలిగించారు. సువాసనగా ఉంది. కుళ్ళు కాలవ కదిలించారు. దుర్వాసనగా ఉంది. ఇది మంచి వాసన, అది చెడ్డవాసన అని దేన్నిబట్టి నిర్ణయిస్తున్నాము? ఆ శక్తి పేరు వివేకం. మనస్సు కాదది. బాగా దాన్ని సాధన చేసుకున్న వాడికి తిరుపతి నుంచి ప్రసాదం తెచ్చి యిస్తారు. తినడు. లడ్డూలో శనగపిండి ఉంది. నాకు ఆస్మా ఉన్నది. అంటే తినకపోతే కళ్ళుపోతాయి అంటాడు. ముందు ఊపిరితిత్తులు పోతున్నాయి వీడికి. ప్రసాదం యిస్తే అక్కడ పెట్టేస్తావా? నీకెన్ని గుండెలు అంటారు. ఉన్నది ఒకటే గుండె. కాని ప్రసాదం తినకపోతే జబ్బు ఎక్కువ చేసేవాడు వెంకటేశ్వరస్వామి అవుతాడా? పిశాచం అవుతాడా? ఇంగిత జ్ఞానం. దేవుడంటే అందరికీ తండ్రేకదా! జబ్బుగా ఉన్నవాణ్ణి శనగపిండి తినమంటాడా? అంతకంటే ఇంకో మార్గాన ఆయన ప్రసాదం వీడికి యివ్వలేడా? అది తెలియాలి. మూర్ఛించకు అన్నాడు ఇందులో. అలాగే భజన చేసాం కొబ్బరి ముక్క, అరటిపండు పెట్టారనుకోండి. తిను తిను అని సతాయించారు. వాడు తిని పాపం రాత్రి తెల్లవార్లు ఆస్మాతో బాధపడ్డాడు. కొబ్బరి పనికిరాదు. అరటిపండు పనికిరాదు. ఉబ్బసం వ్యాధికి. కాని ప్రసాదం యిచ్చాక తినకుండా ఉండకూడదు అంటే ఎలాగ! ఆ ప్రసాదం వాడికి యివ్వకూడదు. వీడికి వివేకం ఉంటే అది తినకూడదు. ఇంత పంచదార పెట్టు. పంచదార నైవేద్యం పెడితే దేవుడు వద్దనడు కదా! అందుకని పాపం ఆ సుస్తీగా ఉన్నవాడికి చక్కెర యివ్వండి. ఏం నష్టం వచ్చింది. కనుక యిట్లాంటివి సహజంగా తెలుస్తాయి. అవి సహజంగా తెలియటానికి మీలో ఉన్న శక్తి పేరు వివేకం అన్నాడు. వివేకం అంటే సద్, అసద్, వివేచనం చేసేది. ఇది తగును ఇది తగదు. ఇది చేయవచ్చును, ఇది చేయరాదు అని లోపల నించి మీకు ఠంగున గంట కొట్టినట్టు భగవంతుడి నిర్ణయాన్ని మీకు యిస్తూంటే ఆ నిర్ణయాన్ని మీరు అందుకునే శక్తి పేరు వివేకం అంటారు. లోపల ఉండి నేను అజ్ఞానాన్ని

జ్ఞానంచేత చీల్చేస్తాను అన్నాడు భగవద్గీతలో. జ్ఞానం అనే వాడియైన కత్తి పుచ్చుకొని నీకు సందేహాలు వచ్చి ఉన్నచోట నేను చీల్చేస్తాను, నాకు వదిలిపెట్టు సందేహాల్ని. నువ్వు ఊరికే రబ్బరులా సాగదీసుకోకు అన్నాడు. సందేహాలన్నింటిని లోపలికి అప్లై చేస్తూండు. నీ పని నువ్వు చేస్తూండు. నేను చెబుతూ ఉంటాను అన్నాడు. ఇదే విషయం భగవద్గీతలో అలా చెప్పాడు. కనుక వివేకజం అయిన జ్ఞానం ఏ పరిస్థితుల్లో అయినాసరే వస్తుంది. ఇక్కడెవరో నాలుగైదు రకాలైన దేశాలవాళ్ళు వున్నారనుకోండి. ఒకడేమో భజన చేసుకుంటున్నాను అన్నాడు. ఇంకొకడు భజన ఏమిటి నాన్సెన్సు, విగ్రహారాధన ఏమిటి అంటూ అల్లాహో అక్బర్ అంటున్నాడు. ఒకడు నైవేద్యం పెడతానంటాడు. ఇంకొకడు మేకపోతుని దేవతకి బలియిచ్చి నైవేద్యం పెడతానంటున్నాడు. ఇందులో ఎవడిది తప్పు, ఎవడిది రైటు? ఎవడిదీ తప్పులేదు. చూస్తే అడవిలో వంటరిగా లింగం కన్పించిందిట. వాడు వెడుతూ చూచి అరెరె! వంటరిగా ఉన్నాడు. ఓ స్వామి! ఇట్లా ఉన్నావేమిటి? ఇక్కడ వంటరిగా ఉన్నావు ''కవి చూపె క్రీనీడన్ ఒంటివై యున్నావు చుట్టాలు ఎవరూ లేరు నీకు'' అని అన్నాట్ట. నేనుంటాను అని వాడు ఓ చేత్తో మాంసం, ఓ చేత్తో ధనుస్సు, విల్లమ్ములు పట్టుకొని స్వామిని అభిషేకం చేయించాలంటే తామ్రపర్ణి నదిలో వున్న నీళ్ళు నోటినిండా పట్టుకొచ్చి బళుక్కున ఉమ్మేశాడు ఆ లింగంమీద. కాళహస్తీశ్వర మహత్యంలో ఉంది ఆ కథ. ఆ పురోహితుడు వచ్చి ఛీ, ఛీ అని పక్కకి నెట్టేసేవాడు. ఎందుకంటే ఆ వండిన మాంసం అక్కడ ఆకులో తెచ్చిపెట్టి నైవేద్యం పెట్టేవాడు. వాడు తప్పా? వీడు తప్పా? ఎవడూ తప్పుకాదు. కాని వాడికి వీడు తప్పు. వీడికి వాడు తప్పు. అది పోవాలన్నాడు. ఏది తిన్నవాడు అది నైవేద్యం పెడతాడు, వడపప్పు, పానకం మొదలైనవి సాత్వికం, యివి తిన్నవాళ్ళం యివి పెడతాం. అవి తిన్నవాడు అది పెడతాడు. మనం యిది పెడితే తిన్నవాడు అది పెడితే తినడా దేవుడు! వాడికీ యిష్టా యిష్టములు ఉంటాయా? ఇవి తెలియాలి. అందుకని మనం ఏది తినచ్చు, ఏది తినకూడదు. మన పుట్టుకచేత, ఆచారం చేత, అలవాటు చేత, వంశంచేత, సంప్రదాయంచేత, ఏది చేయవచ్చు, ఏది చేయకూడదో చూసుకోవాలి. ఇంటిదగ్గర ఉన్నంతసేపు నియమాలు పాటిస్తాం. రైల్లో ప్రయాణం చేస్తున్నాం అనుకోండి నానాగడ్డి తినేస్తాం. తినేసేటప్పటికి

కలరా పట్టుకుందనుకోండి, ఎవడు ఏం చేయలేడు. అక్కడ చేయాలి. సంయమం అంటే అది. కనుక పద్ధతి అది. క్షణము, తత్+ క్రమము. క్షణము అంటే ఎవడన్నా మనకేదన్నా యిస్తాడు రైల్లో యిది తిను అని. అక్కడ పెట్టేసేయండి. వాళ్ళని అవమానం చేయద్దు కాని ఆ ప్రక్కన పెట్టేసేయండి. ఏం ఫరవాలేదు. లేదా తెల్లవార్లు పేకడదాం అంటాడు ఒకడు. మీరు ఆడుకోండి అని చెప్పండి. వాళ్ళని వద్దని చెప్పకండి. మీరు శుభ్రంగా పడుకోండి. లేదా పెళ్ళికోసం వెళ్ళి, ముహూర్తానికి ఒక అరగంట ముందు వరకూను చీట్లపేక ఆడుతూ ఉంటారు. వాళ్లల్లో చేరకండి. మీరు పెళ్ళికోసం వెళ్ళారుగాని పేకకోసం వెళ్ళలేదు కదా! అటువంటి వాళ్ళతో మనం కలవకూడదు. జాగ్రత్తగా ఉండాలి. వధూవరులను ఆశీర్వచనం చేయటానికి కదా. అంతదూరం నించి రమ్మన్నది. దేనికి రమ్మంటున్నారు? అవి తెలుస్తాయి మనకి. కనుక ఒకవేళ ఉత్తపుడు చీట్లపేక ఆడినా, పెళ్ళికి వెడితే అలా చేయం. అవిపోతాయి. అలాగే పెళ్ళిపందిట్లో సిగరెట్లు కాల్చడం మిగతా అపుడు కాల్చద్దు అనలేదు. ఆ పందిట్లో నించుని సిగరెట్టు కాల్చి, పెళ్ళిమంత్రాలేం పనిచేయలేదు. విడాకులు యిచ్చారు. ఎందుకు పనిచేస్తాయి? ఆ మంత్రం చదివే వాడికి దానిమీద దృష్టిలేదు. వినేవాళ్ళకి దృష్టిలేదు. పెళ్ళిలో కూర్చొని న్యూస్‌పేపరు చదువుతూ ఉంటారు. మంత్రాలు పనిచేయాలి. ఎందుకు పనిచేస్తాయి. వాటియందు శ్రద్ధ ఉన్నవాళ్ళకి పనిచేస్తాయి. జాగ్రత్తగా ఉండాలి. పెళ్ళి పందిట్లో సిగరెట్టు తాగుతూ ఉంటాడు. ఏం బయటికి వెళ్ళి ఏడవకూడదా? ఆ అయిదు నిమిషాల్లో కాల్చేయాలా? సిగరెట్టు కాల్చటం రైటా తప్పా అనేది పాయింటు కాదు పెళ్ళి పందిట్లో. పెళ్ళి వేదిక మీద కాండ్రించి ఉమ్మేస్తామా? బయటికి వెళ్ళిరామూ? ఇవి తెలియాలి. ఇవన్నీ తెలియటం పేరు వివేకం అంటారు. సహజంగా తెలుస్తాయి. ఇట్లా చంకలో అడ్డంగా గొడుగు పెట్టుకొని వెళ్తూ ఉంటారు. ఒక్కొక్కళ్ళు వెళుతూంటే వెనుక ఎవరో చప్పట్లు కొడుతూ ఉంటే ఆ కర్రతో వెనక్కి తిరుగుతాడు. ఈ ముందు వాడి కన్ను వెనుక వాడి చెవి లేచిపోతాయి. అలాంటివన్నీ పోతాయి. మన దగ్గర ఉన్న అవలక్షణాలు అన్నీ పోతాయి. బూటు వేసుకొని నడుస్తూంటే ఎవడి కాలో తొక్కటం యివన్నీ పోతాయి. ఎంతవాణ్ణి పడితే అంతవాణ్ణే, ఎంతమాట పడితే అంతమాట అనేయటం, మీరు చెప్పింది

ఏడిసినట్లుందండి. యిట్లాంటి పొగరు గిగరు క్రమంగా తగ్గిపోతాయి. అవతలి వాడెవడు? మనం ఏమంటున్నాం? ఎందుకు అనాలి మనం? మనకి హక్కుందా? అధికారం ఉందా? యిట్లాంటివన్నీ క్రమంగా తెలుస్తాయి. సర్దుకుంటాయి క్రమంగా. ''వివేకజం జ్ఞానం'' అన్ని విషయాల్లోను కూడ మీరెన్నడు ఎరుగని విషయం దగ్గరికి తీసికెళ్ళి మిమ్మల్ని ఆఫీసరుగా పెట్టినా, మీరు తప్పు చేయకుండా ఉండేటువంటిది మీలోంచి తట్టివస్తూ ఉంటుంది. ఇలాచేస్తే రైటు, ఇలాచేస్తే తప్పు అనిచెప్పి, తప్పు పరిహరించి రైటుచేసి పదిమందికి మీరు చెబుతూ ఉంటారు. ఆ సమర్పణంచేస్తే తోస్తుంది. ఎవరికైనా అంతే. అదే మనకోసం చేస్తే ఇన్నాళ్ళనించి చేస్తున్నట్లే ఉంటుంది. అది పద్ధతి. అందుకని వివేకజం జ్ఞానం. వివేకం అనే ద్వారం తెరుచుకుంటుంది. దాంట్లోంచి వచ్చిన జ్ఞానం. బంగారం ఉందనుకోండి. అదివరకు ఎన్నడూ బంగారం మొహం ఎరగడు కాని ఇది సరైన బంగారం కాదని నాకని పిస్తోందంటాడు. ఎందు కనిపిస్తోందంటే అనిపిస్తుంది. అది తీసికెళ్ళి గీటు గీయించి చూస్తే అది సరైన బంగారం కాదని తేల్తుంది. దీన్నే మొదటి అధ్యాయంలో ''తత్ ప్రజ్ఞా ఋతంభరా'' ఋతంభర అనే ఒక ప్రజ్ఞ వస్తుందని చెప్పాడు. అదే యిది. అంటే instinctively you will hit upon the right point and avoid the wrong path. అది వస్తుంది. ఎగుడు దిగుడు మెట్లున్నా యనుకోండి. కరెంటు పోయింది. మెట్లు దిగుతున్నారు. ఆ ఎగుడు దిగుడుగా ఉన్న మెట్టుమీద కాలు వేసేటప్పటికి బోల్తా కొడతామా లేదా. లేదా కాలు బెణుకుతుంది. నెప్పి పుట్టుతుంది. వీడికి అలాంటి నెప్పి పుట్టదు. వీడికి తెలియకుండా ఏం చేసాడంటే ఆ ముందు మెట్టుదాకా వచ్చి అదేదో మాట్లాడతాడు. ప్రక్కవాడితో ఏదో అవసరం వచ్చి అపుడు మెల్లిగా యిద్దరూ కలిసి దిగుతారు. అంతకు ముందున్న గబగబ దిగటం ఆగిపోతుంది. అక్కడితో ఎవడు ఆగమన్నాడో వాడికీ తెలీదు, వీడికీ తెలీదు. ఇలాంటిది వస్తుంది. అంటే కరెక్టు పని వాడు చేయటమున్నూ, కరెక్టు కానిది వాడికి తెలీకుండా మానేయడమున్నూ వస్తుంది. ఎందుకులెండి, ఇది వద్దులెండి అంటాడు. ఇవి వస్తాయి. కనుక వివేకజం అయిన జ్ఞానం అంటే అర్థం అది. ఈ బస్తాలో బియ్యం చాల బాగా ఉడుకుతాయండి ఈ బస్తాలో బియ్యంకన్నా. రెండు బస్తాలు కుట్టి ఉన్నాయి. విప్పమనటానికి టైము మనకీ లేదు విప్పటానికి

టైము వాడికీ లేదు. బండికి వెళుతున్నాం. మీకు ఏ బస్తా తీసుకోవాలో మీకు లోపలనించి తట్టుతుంది. అది వింటే రైటు. వాడి మాట వింటే అడ్డంగా తప్పు. ఇంటికెళ్లి దెబ్బ తింటారు. వాడు అనుభవజ్ఞుడు అని అనుకోకు. అలాగే మీకు ప్రపంచంలో చాలమంది మీకు సలహా యిస్తుంటారు. అనుభవంతో చెబుతున్నానని, తిరుక్షవరం అయిపోతుంది. యిది వచ్చిన తర్వాత మీకు మీ లోపల చెప్పిన దానికి వ్యతిరేకం. మీరు వెళ్ళారంటే ఏమీ లాభంలేదు. బోల్తా కొట్టేస్తారు. ఇది వివేక జ్ఞానమంటే, జాగ్రత్త. గాంధీగారు అంతర్వాణి **(inner voice)** అన్నారు. దాన్ని ఆచరించాలి. అది యిక్కడ యిచ్చినటువంటి విషయం. కనుక ''క్షణ తత్క్రమయోః'' ''క్షణము'' అంటే క్షణించుట. ఒకళ్ళు మనకిగాని, మనం యింకోళ్ళకి గాని ఏదన్నా అధికారం ఇవ్వటం, అందులో కొంచెం తేడాలువస్తే ''తత్క్రమయోః'' వాట్లని క్రమంలో పెట్టుకుంటం, ఎగుడు దిగుడు లేకుండా ''సంయమాత్'' వాటిమీద మనం సంయమం చేయుటవలన ''వివేకజం జ్ఞానం'' వివేకము వలన పుట్టినటు వంటి జ్ఞానం, మీకు కలుగుతుంది. అంటే ఎవడూ ఏది చెప్పక్కర్లేకుండా ఆ టైముకి మీకేది కావాలో అవన్నీ తెలుస్తాయి. ''సర్వజ్ఞత్వం'' అంటే ప్రపంచంలో ఉన్న సబ్జక్ట్సు అన్నీ బుర్రలో తోసేసుకుంటం కాదు. B.P. వస్తుంది. మీకు ఎపుడేది కావాలో అది అందటం. జాగ్రత్తగా గుర్తుంచుకోవాలి. 'సర్వజ్ఞత్వం' అంటే భగవద్గీతలో చెప్పాడు. ''యావనర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే, తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః'' ఈ నదిలో ఎన్ని నీళ్ళు ఉన్నాయి? అనేది నీకు సంబంధించినది కాదు. నీకెంత దాహమైంది? నీ దగ్గర ఎంత గ్లాసు ఉన్నది? అది నీకు సంబంధించినది. ప్రతి శాస్త్రము నందు, ప్రతి విద్యయందు కూడ ఇదే అభిప్రాయంతో ఉన్నవాణ్ణి బ్రాహ్మణుడు అంటారు. తెలిసిన వాడంటారు. వాడు జ్ఞానం కలవాడు. అంటే వాడికి ఎప్పుడేది కావాలంటే అపుడు వాడికి చేతికి ఆ ఫైల్సు అందింపబడుతూ ఉంటాయి. అంతేగాని ఏ ఫైల్సు ఎక్కడ ఉన్నాయి ఇట్లాంటి పిచ్చి లెక్కలు వేయడు. అక్కర్లేనివి చేయడు. ఈ సైన్సు నేర్చుకొని, దీని తర్వాత ఆ సైన్సు నేర్చుకొని, అక్కర్లేనివి నేర్చుకోడు. తనేవి నేర్చుకోవాలో అవే నేర్చుకుంటాడు. విష్ణుచిత్తుణ్ణి చూచాం కదా. ఆ పద్ధతిలో ఉంటుంది. కనుక వివేకజం అయిన జ్ఞానం అంటే అర్థం యిది.

## 54. జాతిలక్షణ దేశైరన్యతాऽనవచ్ఛే దాత్తుల్యయోస్తతః ప్రతిపత్తిః

జాతి = జాతియొక్క, లక్షణ = లక్షణముల వలన, దేశైః = దేశము వలన, అన్యత = యితరత్వము, అనవచ్ఛేదాత్ = భేదము లేకుండుట, తుల్యయో = సామ్యము కలిగి యుండుట, తతః = పై సాధన వలన, ప్రతిపత్తిః = సక్రమమైన ప్రవర్తన కలుగును.

**ఈ జ్ఞానము వలన జీవరాసు లన్నింటినీ వేర్వేరుగా గుర్తించుటకు, వాని ప్రత్యేకతలు, గుణములు ఉన్న ప్రదేశము తెలిసికొనుటకు సాధ్యపడును.**

**వివరణ :** జాతి అంటే నరజాతి, గోజాతి, మహిషజాతి, ఇట్లాగ జాతులు ఉంటాయి. ఈ జాతికి, జాతికి ఎలా అయితే చూడగానే మనకి తేడా తెలుస్తుందో, అలాగే ఇది భారతజాతి, వీడు చైనావాడు, వీడు జపాన్‌వాడు, వీడు రష్యావాడు, వాళ్ళెలా ఉంటారో ఆ జాతి లక్షణాలు ఈ అభ్యాసం చేసినపుడు, వాడెవడో మీరెరుగనివాడు కనిపిస్తే వీడు ఫలానా జాతివాడు అనేది మీకు మనస్సులో తెలుస్తుంది. అలాగే లక్షణాలు. ఒక్కొక్కడికి ఒక్కొక్క లక్షణాలు ఉంటాయి. అంటే ఒక్కొక్కడు బాగా దిట్టంగా ఉండి తలకాయ, చేతులు, కాళ్ళు ఉండవలసినకన్నా చిన్నసైజు ఉంటే, లక్షణాలని బట్టి చాల తొందరపాటు (quickness) ఉన్నటువంటి మనస్సు అనీ, చాల త్వరగా నిర్ణయాలు చేస్తాడనీ, త్వరగా ఊహిస్తాడనీ తెలుస్తుంది. అలా కాకుండా చేతులు, తల, పాదాలు ఉండవలసిన కన్న పెద్ద సైజులో ఉంటే వీడు నిదానిస్తాడనీ, హడావుడి పడడు అని, విషయం తనకు సవ్యంగా నచ్చితేనే, తెలిస్తేనే, ఒక అడుగు ముందు కెడతాడని, ఏదో వాణ్ణి గురించి ఓ పాతిక, ముప్పై విషయాలు తెలుస్తాయి. దీన్నే మంటారు? లక్షణం అంటారు. అలాగే చేతివేళ్ళకి గోరు ఉందనుకోండి. గోరు గుండ్రంగా ఉండి, పొట్టిగా, నీలంగా ఉంటే conjenital mal-formation of the heart అని తెలుస్తుంది. అంటే గుండెకాయ పుట్టుకచేత వీడికి వ్యాధిగ్రస్థమై ఉన్నది. వీడికి ఈ వ్యాధి ఔషధములతో నివారణం కాదు. వీడు పూర్తి ఆయుర్దాయం బ్రతకడు. ఓ పాతిక, ముప్పై ఏళ్ల లోపల ఎక్కడో అక్కడ ఈ జబ్బుతో

కొట్టేస్తాడు అని తెలుస్తుంది. వీటిని లక్షణాలు అంటారు. సాముద్రిక లక్షణాలు కావచ్చు. జాతక లక్షణాలు కావచ్చు. అలాగే చేతిలో ఉన్న గీతలుంటాయి. ఒకడికి ఒకటి ఉంటుంది. ఒకడికి రెండు ఉంటాయి. దాన్నిబట్టి లక్షణాలు. ఈ మెడమీద కొందరికి ప్రక్కన గీత ఉంటే ఎత్తునించి కిందపడి చచ్చిపోతాడని అర్థం. No exception. ఇలాంటి వాట్లని లక్షణాలు అంటారు. నేర్చుకోదల్చుకున్న వాళ్ళకి చెప్పాలి. మిగతా వాళ్ళకి చెప్పేటప్పటికి బెంగపెట్టుకు చస్తారు. ఎవరికైనా ఉంటే, దాన్ని సక్రమంగా శాస్త్రంగా అభ్యాసం చేసేచోట చెప్పాలి. మిగిలినచోట చెప్పకూడదు. ఈ లక్షణాల్ని బట్టి తెలుస్తుంది. కొందరు కొందరు తలకాయ చిన్నదిగా ఉండి, రానురాను పైకి పెరుగుతారు. నించుంటే పుచ్చకాయలాగ ఉంటారు. కొందరు తలకాయ పెద్దదిగా ఉండి, పాదాల దగ్గరికి వచ్చేటప్పటికి చాల ఊతగా సన్నగా ఉంటారు. మీరు హోమియో చదువుకుంటే దూరంనించే వాళ్ళని లైకోపోడియం పేషెంటు అని, కాల్కేరియా కార్బ పేషెంటు అని, అంటే ఆశ్చర్యార్థకం (exclamation mark) లా ఉన్నాడని, లక్షణాల్ని బట్టి తెలుస్తుంది. తర్వాత మీరు కేస్ టేకింగ్ చేస్తే అవే మిగుల్తాయి. ఇవీ లక్షణాలంటే, అంటే ఏ శాస్త్రానికి సంబంధించిన లక్షణాలైనా సరే శాస్త్ర లక్షణాలు. శాస్త్రాల్ని మేం నమ్మం అనేవాళ్ళ కోసం కావు యివి. అంటే జాతి తెలుస్తుంది. లక్షణం తెలుస్తుంది. లక్షణాల్ని బట్టి తర్వాత దేశం. ఏ ప్రదేశం. ఉత్తర ప్రదేశ్‌వాడు లేదా రాజస్థాన్‌వాడు లేదా నేపాల్‌వాడు అని తమాషాగా అట్లా చేస్తూంటే తెలుస్తాయి తేడాలు ఒకమాటు మీరు వాళ్ళనిచూస్తే, రెండవమాటు ఆ జాతివాళ్ళని చూస్తే మీకు తెలుస్తుంది అంటున్నాడు. అలాగే ఒక్కమాటు ఆ లక్షణం ఉన్నవాడిని చూస్తే, రెండవమాటు ఆ లక్షణం ఉన్నవాణ్ణి గుర్తిస్తారు. అలాగే ఆ దేశంవాళ్ళని ఒక గుంపుని ఒకనెలో, రెండునెల్లో ఉండివస్తే, ప్రపంచంలో మీరెక్కడున్నా సరే ఆ దేశం వాడు కన్పిస్తే ఫలానా దేశం వాడని తెలుస్తుంది. అంటే ఏమిటి? Extension of your commonsense into the yogic relevance. అది చెబుతున్నాడిక్కడ. అంటే యోగాభ్యాసానికి commonsense కీని సంబంధం లేదనుకుంటే ఎట్లా?

Commonsense అనేది యోగాభ్యాసాల్లో మనకి వచ్చే అరుదైన మహా శక్తులలో ఒకటి. 'దివ్యప్రజ్ఞ' అది. దాన్ని ఇంకొంచెం జాగ్రత్తగా రేకలు విచ్చుకునేటట్లుగా పుష్పంలాగ చేసుకునే పద్ధతి చెబుతున్నాడు. ''దేశైః'' వీట్లల్లో 'అన్యతా' అంటే వేరగునట్టి లక్షణము చెప్పగలుగుతారు. అంటే వీడు మామూలు వాళ్ళకన్న వేరుగా ఉన్నాడు. కనుక ఎక్కడివాడో చెబుతారు. లేదా యింట్లో నలుగురు కొడుకులు ఉంటే ముగ్గురు కొడుకులు కంటే వేరుగా ఉంటుంది ఒకడి శరీర నిర్మాణం. మీరు పట్టగలుగుతారు. ఈ ముగ్గురు ఒక పద్ధతి, వీడొక్కడు ఒక పద్ధతి అని తెలుస్తుంది. ఎందులోనో కూడ తెలుస్తుంది. ఉదాహరణకి మనం తెల్లజాతి వాళ్ళని ఒకమాటు రైల్లో చూసామనుకోండి. ఇక్కడనించి బెజవాడదాకా చాలా విషయాలు మాట్లాడాం. చాల దగ్గరగానే మాట్లాడాం. తర్వాత వాడు దిగిపోతాడు. మనమూ దిగిపోతాం. ఒక ఏడాదో, ఏణ్ణర్థమో అయిన తర్వాత, వాడు మళ్ళీ ఎక్కడో ఉత్తరదేశంలో మనకి తగుల్తాడు. చప్పున గుర్తు వస్తాడా? కొంతసేపు ఆలోచించాలి. ఎంచేత? తెల్లజాతివాడు కనుక. అదే భారతీయుడు, నల్లజాతివాడు అయితే అంతకంటే తొందరగా గుర్తువస్తాడు. అక్కడిదాకా ఎందుకు? వాడితో ఇక్కడినించి మద్రాసుదాకా కూడా ప్రయాణం చేయండి రెండు రోజులో, మూడు రోజులో కలిసి, ఒక ఏడాది అయిన తర్వాత ఒక పాతికమంది తెల్లవాళ్ళు ఏదో సెమినార్‌కి వస్తారు. వాళ్ళతో కలిసి వీడు నడచి వస్తూంటాడు. మీరు వాణ్ణి గుర్తుపట్టగలరా? బస్తీలో ఉన్నవాడు ఒక పది పదిహేను గేదెగొడ్లు వస్తూంటే ఏది ఎవరిదో ఎలా అయితే గుర్తుపట్టలేడో, ఒకటి అయితే చెబుతాడు. శర్మగారిదని. రెండోది కొమ్ము విరిగింది కనుక శాస్త్రి గారిదని చెబుతాడు. మూడోది కాలు విరిగింది ఆచార్యులు గారిదని, మూడువరకు చెప్పగలుతాడు. ఉన్నవి మూడే మతాలు గనుక. కాని ఏదో పాతిక గేదెలు వచ్చాయనుకోండి. ఇంక వీడికి తెలిసేదేముంది? తెలీదు. ఎందుకంటే విశాఖపట్నంలో కదా వీడు ఉంటోంది. కాని ఆ గొడ్లకాపరివాడు పల్లెటూళ్ళల్లో పాతిక గేదెల్ని తీసికెళ్ళటం, మేపటం, మళ్ళీ వెనక్కి తీసుకురావటం, ఎవడింటి గేదెని వాళ్ళింటికి అప్పజెప్పటం, గేదెలు కూడ ఏ యజమాని

ఇంట్లోకి ఆ గేదె వెళ్ళటం జరుగుతున్నాయా? లేదా? పది గేదెలు ఒకచోట నిల్చుంటే గుర్తు పట్టలేని మనం పదిమంది విదేశీయులు ఒకచోట నిల్చుంటే, అందులో మనకి కావల్సిన వాణ్ణి గుర్తుపట్టటం కష్టంకదా? వాడితో మనకి పరిచయం ఏర్పడ్డాక తప్ప ఆ 40 మంది విదేశీయులలోను, ఒక 20 మందికో, 25 మందికో, బట్టతలలుండి, లావుగా గుండ్రంగా ఉన్నారనుకోండి. వాళ్ళల్లో ఎవడు ఎవడో అసలు తెలీదు మనకి. ఒకడు సన్నగా పొడుగ్గా ఉండి, ఒకడు లావుగా ఉంటే అపుడు తెలుస్తుంది. అలాగాకుండా వరసన ఒక పదిహేనుమందో, 20 మందో పుచ్చకాయల్లాగ ఉన్నారనుకోండి, తెలియటానికి అవకాశం లేదు. వాళ్ళందరూ ఒకలాగే ఉన్నట్టు ఉంటుంది కొన్నాళ్ళదాకా. బాగా ఒక్కొక్కడితో పరిచయం అయ్యేవరకూనూ. నాలుగైదు రోజులు అయ్యేవరకు కూడ మనకి 'Buck' అని వాడు చెబుతూంటే మనం వాడిపేరు చెబుతూ ఉండటం అవుతుంది. కనుక 'అన్యత' తెలియదన్నాడు. ఈ సాధన చేసేవాడికి తెలుస్తుందన్నాడు. అలాంటి పొరపాట్లు రావు అన్నాడు మీకు. యోగాభ్యాసంలో జాతివలన గాని, లక్షణముల వలనగాని, దేశముల చేతగాని, ఈ మూడింటికి వచ్చే అన్యత ఒకటి అప్రయత్నంగా తెలియటమున్నూ, 'అనవచ్ఛేదాత్' అంటే విడదీయుటకు వీల్లేకుండుట, రెండు వస్తువులు విడదీయటానికి వీల్లేనంత దగ్గరలో ఉన్నాయనుకోండి. దీన్నించి అది దాన్నించి ఇదీను. రెండూ తయారు ఒకే మిషనులో చేసారు. రెండూ ఒకలాగే ఉంటాయి కదా. ఇది నీది, అది నాది ఎలా గుర్తుంచుకుంటాం? అవి తేలికగా తెలుస్తాయి. అపుడు కూడ ''తుల్యయోః'' అంటే రెండు సమానములుగా ఉన్నవాటి నుండి తుల్యములుగా ఉన్నటువంటివి, అయితే you can distinguish between two identical things. రెండు భోంచేసే ప్లేట్లు ఒకచోట కొన్నారనుకోండి. ఒకలాగే ఉన్నాయి. రాత్రివేళ పెట్టుకొని భోంచేసారు. కడిగి యివతల పెట్టేసుకున్నారు యిద్దరూనూ. మర్నాడు ఈ సాధన ఉన్నవాడికి ఎవడిదేదో తెలుస్తుంది.

''తుల్యయోః'' అంటే సమానంగా ఉన్నవాటి యందును ''తతః'' అంటే దానివలన, పై చెప్పబడిన సాధన వలన ''ప్రతిపత్తిః'' అంటే ప్రతిపత్తి

కలుగును. 'ప్రతిపత్తి' అంటె సక్రమమైన ప్రవర్తన కలుగుతుంది. అంటే ఎలా చేయాలో అలా చేయటం అనేది వస్తుంది. పొరపాటు చేయటం అనేది అస్సలు ఉండదు. ఆ స్థితి వస్తుంది. అంటే instinctively he is always correct. రెండూ identical things అయినా అంతే. రెండూ non-identical things అయినా అంతే. ఒక జాతికి సంబంధించిన వాణ్ణి ఆ జాతివాడుగా గుర్తుపట్టటమైనా అంతే. ఒక లక్షణం కలిగిన వాడికి, గుండెజబ్బు ఉన్నదో, లేకపోతే నీరసం ఉన్నదో, లేకపోతే వాడికి పొలాలు ఉన్నాయో తెలుసుకో గలగడమైనా అంతే.

కనుక రెండూ సమానంగా వాటికి పై చెప్పిన సాధన వలన 'ప్రతిపత్తిః' సక్రమమైన ప్రవర్తనం ఏర్పాటవుతుంది. అంటే he will identify things correctly. He will respond and behave correctly and properly. కనుక నువ్వు పొరపాటు చేయవు. సరైన పద్ధతిలోనే చేస్తావన్నాడు.

జాతి, లక్షణము, దేశము వీట్లల్లో ఉన్న అన్యత, దీనిగురించి చెప్పుకున్నాం. అదిగాక అనవచ్ఛేదము కలిగినపుడు అంటే అన్యత లేనపుడు, సామ్యము ఉన్నపుడు 'తుల్యయోః' తుల్యత్వం కలిగిన వాటియందు ''తతః'' ''ప్రతిపత్తిః'' చెప్పుకున్నాం అంటే compare and contrast అనే మాటకి నిజమైన స్థితి మనం పొందుతాము. ఏదో మనకి తోచిన భేదాలు చూపించటం, మనకి తోచిన సామ్యాలు చూపించడం కాకుండా, ప్రకృతిలో ఉన్న సామ్యములు, ప్రకృతిలో ఉన్న భేదములు మనకి దర్శనమిస్తాయి.

జ్ఞానములు రెండు రకాలు : (1) అజ్ఞానం, (2) జ్ఞానం. రెండూ కూడ జ్ఞానమే. అజ్ఞానం అంటే ప్రకృతిలో ఉన్నదాన్ని మనం చూసే విధానం. జ్ఞానం అంటే ప్రకృతి మనకి దర్శనమిచ్చే విధానం. కనుక యిది ప్రకృతిలో ఉన్నదాన్ని మనం చూసే విధానం ప్రకారం మన శాస్త్రాలు అవి ఏర్పాటు చేసుకుంటే దాన్ని మ్లేచ్ఛ సంప్రదాయం అంటారు. అంటే మానవుడి మేధాశక్తి మీద ఆధారపడి ఏర్పాటు చేసుకున్న సంప్రదాయములు మ్లేచ్ఛ సంప్రదాయములు. అలాగాకుండా ప్రకృతిలో ఏమున్నదో అది దర్శనం

చేయడం అభ్యాసం చేసినపుడు వాట్లని సనాతన ధర్మ సంప్రదాయములు లేక వేద సంప్రదాయములు అని అంటారు. ఆ సంప్రదాయానికి చెందినవాళ్ళే ఋషులు. వేదం ఎక్కడ ఉన్నది అంటే సృష్టి స్వరూపమైన విజ్ఞానంగా ప్రకృతిలో ఉన్నది. శాశ్వతమైన స్వరూపము. సృష్టి ఎందులోంచి అయితే వస్తోందో ఆ గ్రంథం పేరు వేదము. అందుకని వేదానికి సంబంధించిన పుస్తకాలన్నీ తగలబెట్టినా సరే, జలప్రళయము వచ్చి నీళ్ళల్లో వెళ్ళిపోయినాసరే, వేదం ఉంటుంది. సూర్యోదయ సూర్యాస్తమయాలు ఉండి, మానవుడు పుట్టటం ఉండేటప్పటికి మానవుడు సూర్యోదయ, సూర్యాస్తమయాల్ని చూడటం, అహోరాత్రాలు ఎపుడైతే పుట్టాయో, వేదం అంతా వాడికి దర్శన మివ్వటం అనేది అపుడే ఉంటుంది. పుస్తకాలమీద ఆధారపడ్డది కాదు వేదం అనేది. వేద గ్రంథంలోనే మనకు చెబుతారు. వేదగ్రంథం వేదం కాదనేది మనకి స్పష్టంగా తెలుస్తుంది. కాని వేదం చదువుకోవాలంటే వేదగ్రంథం తప్ప యింకోటి ఆధారం లేదు. ఒళ్ళు దగ్గర పెట్టుకోవాలి. కాని వేదగ్రంథం వేదం కాదు. ఈ రెండూ గుర్తుంచుకోవాలి. వేద గ్రంథంలోనే చాలచోట్ల 'ఏవం వేదవాదినో వదంతి' అంటే ఈ విధంగా వేదవాదులు అంటే అర్థం ఏమిటి? వేదం పుస్తకం చదువుకుంటం ఒక్కటి కాకుండా, వేదం చదువుకుంటం కూడ తెలిసినవాళ్ళు, ప్రకృతిని చదువుకుంటం తెలిసినవాళ్ళు, అందులో ఉన్న అజరామరమైన ఒకానొక గ్రంథాన్ని దర్శనంచేసి, అధ్యయనం చేసినవాళ్ళు. అంటే సనాతన ధర్మము, వేద సంప్రదాయమునకూ ఈ మ్లేచ్ఛ సంప్రదాయం అన్నదానికిన్నీ తేడా ఉన్నది. ముఖ్యంగా పాశ్చాత్య సంబంధం నించి మనకి వచ్చిన శాస్త్రములు అన్ని మ్లేచ్ఛ సంప్రదాయమునకు సంబంధించినవి. భారతదేశంలో వెనుక ఒకానొకనాడు శాస్త్రములు ఉన్న రోజులలో యిక్కడనించి పుట్టినవన్నీ ఆర్య సంప్రదాయము లేక వేద సంప్రదాయమునకు సంబంధించినవి. ఇపుడ మన దగ్గర ఏ సంప్రదాయం లేదనుకోండి. భారతీయులకి పాశ్చాత్య సంప్రదాయాన్ని స్వీకరించే నిపుణత లేదు. ఆర్యధర్మ వేద సంప్రదాయాన్ని స్వీకరించే ధర్మబుద్ధి, పవిత్రత, మంచితనమూ లేదు. ఉభయత్ర భ్రష్టత్వము చెందినది ఇపుడున్న భారతజాతి. కాని మన

ప్రాచీనులైనవాళ్ళు యిచ్చిన వేద సంప్రదాయంలో ఈ వేద సంప్రదాయానికి సంబంధించిన వాట్లల్లో ప్రకృతిలో ఏది సామ్యము, వైషమ్యము కలిగి ఉన్నదో జాతి మొదలైన భేదాలున్నాయో, వాటంతటవి దర్శనం యిస్తే చూడగలగటం తెలుస్తుంది. అంటే చూడదలచినది చూడటం కాకుండా, చూడవలసినది చూడటం, కనిపించేది చూడటం చాతనవ్వాలి. మామూలుగా మనం మ్లేచ్ఛ ధర్మంలో ఏం చూస్తాం. మనం చూడదలచినది చూస్తాం. సృష్టిలో మనుషుల్ని కూడ. వీళ్ళు మంచివాళ్ళు, వీళ్ళు చెడ్డవాళ్ళు, వాళ్లు తెలివైనవాళ్ళు అంటే మనం చూడదల్చుకున్న బొమ్మల్ని వాళ్ళల్లో చూస్తున్నాం కాని, అక్కడున్న మనుషుల్ని మనం చూడటం లేదు. దానివలన ఏమౌతోంది? మన మనస్సు మన చేతనే కలుషితం అవుతోంది. వీడు మంచివాడు, వాడు చెడ్డవాడుగా మనం చూస్తున్నాంగాని, వాళ్ళిద్దర్నీ ఈ మంచి చెడ్డలకి సంబంధించకుండా, మానవుడుగా మనకి చూట్టం చాతనవటం లేదు. కనుక యిది దాటాలి. దానికి యోగాభ్యాసం ఒక్కటే మార్గం. కనుక జాతి, లక్షణము, దేశము మొదలైన వాటి వలన కలిగిన అన్యత అనేది గుర్తించటం చెప్పాడు. 'అన్యత' కాకుండా అనవచ్ఛేదత్వము అంటే దానికి దీనికీ తేడా లేకుండా విడిగా ఉన్న దాంట్లో 'తుల్యయోః' తుల్యత్వం ఏది ఉందో అది కూడ చూడగలిగే సామర్థ్యం వస్తుందన్నాడు. అంటే అక్కడ ఉన్నది కనిపిస్తుంది గాని, మనం చూచేది కన్పించటం అనే దుస్థితి పోతుంది. మనం చూచేది సృష్టి. అక్కడ ఉన్నది అంతర్యామి. ఆ తేడా నశిస్తుంది. దీనికోసమే యోగాభ్యాసం. కనిపించిన వ్యక్తులు, జీవులు వీళ్ళంతా కూడను సర్వాంతర్యామి యొక్క సజీవ విగ్రహములుగా తెలియుట. అది లేనపుడు ఆయన వెంకయ్య, ఈయన సుబ్బయ్య అని తెలుస్తారు, అంటే గుడ్డి చూడటం అన్నమాట. అది పోయి ఆ మొదటి చూపు వస్తుంది, అంటే ఈ ధృతరాష్ట్ర దృష్టిపోయి, ధర్మరాజుయొక్క దృష్టి వస్తుంది యోగాభ్యాసం చేసినటువంటి పద్ధతిలో.

## 55. తారకం సర్వవిషయం సర్వథా విషయ మక్రమంచేతి వివేకజం జ్ఞానమ్।

తారకం = తరింపజేయునది, సర్వవిషయం = శాస్త్రమందలి సమస్తములైన విషయములు, సర్వథా = అన్ని విధములుగా, విషయం = ఇంద్రియార్థములకు గోచరమైనది సమస్తమూ; అక్రమం = క్రమ మార్గమున లేకుండుట, చ = మరియును, ఇతి = దీనివలన, వివేకజం జ్ఞానమ్ = వివేకము నుండి పుట్టిన జ్ఞానము.

**ఈ వివేకము వలన కలిగిన జ్ఞానము తరింప చేయునది. అన్నింటిని గోచరింప చేయునది. అన్నిటి విశేషములను తెలియజేయునది. అంతేకాదు, క్రమ మక్కరలేకయే ఒక్కమారు గమనికతో సర్వము తెలియును.**

**వివరణ :** భగవద్గీతలో ఒక వాక్యం ఉంది. జ్ఞానం అంతా కూడ అజ్ఞానంచేత ఆవరింపబడి యున్నది. అక్కడేం ఉపదేశింపబడ్డదో ఈ సూత్రంలో కూడ అదే ఉపదేశింపబడ్డది. ''అజ్ఞానే నా వృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః'' ఇదేమిటి? అంటే చాక్‌పీసు. చాక్‌పీసు అనే పేరు మనం పెట్టినదా? అక్కడ ఉన్నదా? కనుక మనం పెట్టినది అజ్ఞానమా? అక్కడ ఉన్నది జ్ఞానం అవుతుందా? కనుక మనం పెట్టిన పేరుతో దాన్ని పిలుచుకుంటున్నాం గనుక అజ్ఞానంతో జ్ఞానాన్ని తెలుసుకుంటున్నాము. ప్రపంచంలో ఉన్న సమస్తం కూడ ఇలాగే ఉన్నది గనుక, ఆ పద్ధతి, ఒడుపు తెలిసి గురువు అనుగ్రహంచేత అజ్ఞానమనే పొట్టు వలచుకొని, జ్ఞానం అనే విత్తనాలు తీసుకోమని కృష్ణదేవరాయలు ఎలా అయితే ఆముక్తమాల్యదలో చెప్పాడో అది తెలుసుకోవాలి. ఏం చెప్పాడు? వడ్లుగా దొరుకుతాయిగాని, బియ్యంగా దొరకవు ధాన్యం ఎపుడూను. ధాన్యం దొరికినపుడు దంచి పైన పొట్టు తీసేసుకొని బియ్యం తీసుకోవాల్సిన కర్తవ్యం మీకు ఉన్నది అని చెప్పాడు. అలాగే అజ్ఞానంతో చేయబడిన జ్ఞానం ఈ సృష్టి. నువ్వు అజ్ఞానాన్ని తొలగించుకొని జ్ఞానాన్ని స్వీకరించటం నీ సాధన. అజ్ఞానం అని వేరే వస్తువు, జ్ఞానం అని వేరే వస్తువు ఉండదు. అదివరకు ఉదాహరణకి చెప్పాను. శ్రావణ పూర్ణిమనాడు యజ్ఞోపవీతం సూర్యోదయం అవుతూండంగ వేసుకోవాలి. సూర్యోదయానికి పదినిమిషాలు ముందే మనం అక్కడ కూర్చున్నాము. 'అపవిత్రః పవిత్రోవా, అపోహిష్టామః' యివన్నీ అయిపోయాయి, తర్వాత 'యజ్ఞోపవీతం పరమం పవిత్రం' దగ్గరికి

వచ్చాం. ఇది విడదీసాం. విడదీస్తే చిక్కుపడ్డది. అంటే యజ్ఞోపవీతం ఎక్కడ విడదీయాలో అక్కడ విడదీయలేదు మనం. ఇవతలి దాంట్లోంచి పోగులు అవతలి దాంట్లోకి లాగేము. అలాగే రజస్సు తమస్సులోకి, తమస్సు రజస్సులోకి ఊరికే కలగాపులగం చేసేసుకున్నాము. చేసుకునేటప్పటికి మెలిక పడ్డది. మెలికపడితే ఊరుకున్నామా? లాగాము. లాగిపెడితే ముడిపడ్డది. ముడిపడితే యింకా లాగేము. చిక్కు పడ్డది. ఇపుడు మన దగ్గర ఉన్నవేమిటి? యజ్ఞోపవీతం, మెలిక, ముడి, చిక్కు. శాస్త్రులు గారు యిచ్చినది యజ్ఞోపవీతం ఒక్కటే. ఈ మెలిక, ముడి, చిక్కు అనేవి వేరే పదార్థములు ఎలా అయితే కావో, యజ్ఞోపవీతంతోనే చేయబడినవో, అలాగే అజ్ఞానం వేరే పదార్థం కాదు. జ్ఞానంతోనే ఉన్నది. కాని మెలిక, ముడి, చిక్కు అనేవి మనం ఎలా చేసుకున్నామో, అలాగే అజ్ఞానం అనేది మనం చేసుకున్నది. చూసారా! యజ్ఞోపవీతము, చిక్కు, రెండుకావు కాని చిక్కు ఊడనిదే యజ్ఞోపవీతం రాదు. యజ్ఞోపవీతము, చిక్కు రెండు పదార్థాలుగా లేవు. ఒకటి ఉన్నదీ, ఒకటి మనం చేసుకున్నది. కనుక అజ్ఞానమేమో మనం చూస్తున్నది. దీనికి చాక్‌పీసు అని పేరుపెట్టాం. ఆ పేరు అజ్ఞానం. లేకపోతే, దాన్ని వాడుకుంటానికి మనకి వీల్లేదు. అవకాశం లేదు. కనుక లోక వ్యవహార సాధన కోసమని చెప్పి, అజ్ఞానం కావాలి. లోక వ్యవహార సాధనలో మనం ఒకరోజు ఏడుస్తూ, ఒకరోజు నవ్వుతూ బ్రతకకుండా ఉండేందుకోసం జ్ఞానం కావాలి. ఎందుకంటే తదతీతంగా ఉండటంకోసం అతీతంగా ఉన్న వాడొక్కడే వీటి సంగతి తెలియగలడు. అలా లేని ఆ రోజున చాక్‌పీసు దొరక్కపోతే ఏడుపు వస్తుంది. చాక్‌పీసు కూడ లేదు అని. మనం లెక్చరు చెప్పటానికి కూర్చుంటే నిజంగా ఒకరోజున చాక్‌పీసు లేదనుకోండి. వెంటనే ఏం చేస్తాం? ఒక కాగితం యిక్కడ వ్రేలాడగట్టి పెన్నుతో రాసుకుంటాం. లేకపోతే నోటితో చెప్పుకుంటాం. అదిచేస్తే మనకి ఈ చాక్‌పీసు అనే దానికి ఉన్న సంబంధంలో అజ్ఞానంలో చిక్కుకోలేదు అని అర్థం. చిక్కుకుంటే ఏమవుతుంది? చాక్‌పీసు కూడ ఇక్కడ పెట్టరు ఎవరూ, మనమంటే లక్ష్యంలేదు. ఎన్నాళ్ళనించి పతంజలి యోగసూత్రాలు చెబుతున్నాసరే ఏమీ లాభంలేదు. ఈ ప్రపంచం అంతా కృతజ్ఞతా రహితంగా ఉన్నది. ఇలాంటి అహంకారపూరితమైన అభిప్రాయాలతో మనం అపమార్గంలోకి వెళ్ళిపోతాం. అంటే కుళ్ళు కాలవలోకి వెళ్ళిపోయినట్లు. నది దగ్గర నుంచున్నవాడు పైడు కాలవలోకి నడిచినట్లుగా నడుస్తాడు. ఎవళ్ళకీ

మనం అంటే లక్ష్యం లేదు. మనలో మాట. ఎవళ్ళకైనా ఎందుకు లక్ష్యముండాలి? మనం అంటే మనమేమైనా మొనగాళ్ళమా? అదికూడ గుర్తుండాలి. అందుకని మన కర్తవ్యం మాత్రమే చేస్తూ ఉండటానికి పనికొచ్చేది జ్ఞానమున్నూ, అదిగాకుండా అటు ఇటు అపమార్గానికి లాగటానికి వీలైనది అజ్ఞానమున్నూ. ఏంచేత వచ్చింది? చాక్‌పీసు మీద మనం ఆధారపడ్డాం కనుక. అలా కాకుండా జ్ఞాని ఏంచేస్తాడు? చాక్‌పీసు ఉంటే చాక్‌పీసుతోనే రాసుకుంటాడు. అది లేకపోతే ఏం చేస్తాడు? పెన్సిల్‌తో రాసుకుంటాడు. అదీ లేకపోతే ఏం చేస్తాడు? కూర్చొని చెపుతాడు. కరెంటుపోతే ఏం చేస్తాడు? నోటితో చెబుతాడు ఇంతే. కాని చాక్‌పీసు ఉంటే మాత్రం దానితోనే రాసుకుంటాడు. ఇది తెలియాలి. పెరుగు ఉంటే పెరుగు పోసుకుంటాడు జ్ఞానియైనవాడు. వాడికి పెరుగే పోసుకుందామని లేదు. కనుక పెరుగు ఉంటే పోసుకుంటాడు. మజ్జిగ ఉంటే మజ్జిగతోనే తింటాడు. సాధనలేని వాడికి యింత శ్రమపడి సంపాదించి ఈ కుటుంబాన్ని అంతనీ పోషిస్తున్నాను, పెరుగుకి నోచుకోలేదు అనే దుర్బుద్ధి కలుగుతుంది. పురుగు దొలుస్తుంది. నాకామాత్రం ఆదరణ లేదు. ఆదరణ అంటే పెరుగా! పిచ్చివాడు! అంటే ఆ బుద్ధి పుట్టనే కూడదు గాని ప్రతిదాని యందు పుట్టుతుంది. దుర్బుద్ధి అంటారు. అంటే చెదలు తినటం. కొరికేస్తాయి. తను స్నానం చేయటానికి తుండుగుడ్డ రెడీగా లేదనుకోండి. ఇంట్లోవాళ్ళు మనకున్నట్లే వాళ్ళకీ పనులు ఉంటాయి. ఏమిటో నేనింత శ్రమపడి ఆర్జించుకొని, ఇంటా బయటా చూసుకొని రెక్కలు కష్టం చేసుకొని తెస్తూంటే, స్నానంచేసే టైముకి తుండుగుడ్డ కూడ అక్కడ పెట్టే గతిలేదు ఈ యింట్లో అంటాడు. గతిలేక ఏముంది? నువ్వు ఉపయోగించుకోవాలిగాని, ఇట్లాంటి బుద్ధి ఎవరికి కలిగినా దానిపేరు దుర్బుద్ధి అంటారు. అంటే అజ్ఞానంలోకి వెళుతూ ఉంటుంది. దానివలననే రాగద్వేషాలు, కామక్రోధాలు, ఈర్ష్య, అసూయ, మద, మాత్సర్యాలు మొదలైనవన్నీ అంటుతాయి. కాని మనం ఒక్కటి గుర్తుంచుకోవాలి. వాల్మీకి, వ్యాసుడు మొదలైనవాళ్ళ కావ్యాలు మనం చదివితే, వాళ్ళు జీవించిన పద్ధతి మనంచూస్తే, వాళ్ళు ఎన్నడూ ఎవరి గురించీ యిలా అనుకున్నట్లు లేవు. మనం ఇంతటి కావ్యాలు ప్రపంచానికిచ్చేము, మనని ఎవరూ గుర్తించలేదు మొర్రో! అని ఏడ్చినవాళ్ళు కారు. వాల్మీకిగాని, వ్యాసుడుగాని, నన్నయభట్టుగాని, తిక్కనగాని, మనకు బాగుపడే రోజువస్తే చదువుకునేందుకు వాళ్ళు రాసారుగాని, వాళ్ళకోసం రాయలేదు. వాళ్ళపిల్ల

పెళ్ళి చేసుకుందామని రాసినవి కావు. ఆ తేడా ఉంది వాటికి వీటికీని. అందుచేత మనం తెలుసుకోవాల్సింది ఏమిటంటే, ఎవరూ గొప్పకాదు (no one is great). అందరిలోను ఉన్న అంతర్యామి ఒక్కడే జ్ఞానం. అందుకని అజ్ఞానము, జ్ఞానము వాటియొక్క స్వరూపం తెలియాలి. ఎటు వెడితే అజ్ఞానంలోకి వెడతామో, అవిద్య అనేది ఎలా అయితే మనలో అనాదిగా వేచి ఉంటుందో అది తెలియాలి. అవిద్య పోయింది అనేది ఉండటానికి వీల్లేదు. ఎందుకని? మొత్తంనించి ఒకడు వేరేగా ఉంటున్నపుడు అవిద్య కాక విద్య అవుతుందా? అది సృష్టి అంటే ఏమిటి? మొత్తంలోంచి మనం ఒకళ్ళం వేరుగా ఉండటం. మొత్తంలోంచి ఎపుడైతే మనం ఒకళ్ళం వేరేగా ఉన్నామో, అదివేరు, ఇది వేరు అనే బుద్ధిరాదూ? లేకపోతే జీవించటం ఎట్లాగ? అది వేరు; ఇది వేరు అనే బుద్ధి వచ్చినపుడు అది విద్య అవుతుందా? అవిద్య అవుతుందా? పళ్ళెం నిండా మైసూరు పాకం పోసి చాకుతో అచ్చులుకోసి దానికి బుద్ధి ఏర్పాటు చేసాడనుకోండి సృష్టికర్త. అందులో ఒక మైసూరు పాకం ముక్క మిగిలినదంతా వేరు, నేను వేరు అనుకుంటే విద్యా? అవిద్యా? కనుక మనం పుట్టిన క్షణంనించీ అవిద్య అనేది తప్పనిసరి (compulsory). కాని ఆ అవిద్యని తెలుసుకొని దానితో తమాషాగా అంతర్యామియైన వాడు ఎలా ఆట ఆడుతున్నాడో తెలుసుకొని, వాణ్ణి శరణాగతి చెంది మనం కూడ ఆట ఆడటం నేర్చుకోవాలి అదీ పద్ధతి. అవిద్య అని తిట్టి ఏం లాభంలేదు. ఎందుకంటే అవిద్య చెడ్డది కాదు. మనం దాన్ని అపార్థం చేసుకుంటం పేరు చెడ్డది. రాత్రిపూట యిటు వెడుతూ టక్కున ఓ గుంజకి కాలు తగిలించుకున్నా మనుకోండి. ఆ గుంజ. అక్కడ ఉండకూడదంటే పాక ఉండదు. గుంజది కాదు దోషం. మనం కళ్ళు నెత్తిమీద పెట్టుకొని నడిచాం లేకపోతే టక్కున తలకాయ దానికెందుకు కొట్టుకుంటాం. కనుక మన దగ్గరే ఉంటుంది. అది తెలుసుకోవాలి. చీకట్లో వెళ్ళి ధన్‌మని కొట్టుకొని, అసలు ఈ గుంజ యిక్కడ ఉండటం వల్లనే యింత ప్రమాదం వచ్చింది అంటే అది తప్పు. గుంజ ఉండటం వల్లకాదు. మనకి కళ్ళు ఉండకపోవటంవల్ల అంత ప్రమాదం వచ్చింది. ప్రతిదీ అంతే సృష్టిలో. అది అక్కడ ఉండటం వల్లకాదు ప్రమాదం. మనకి బుద్ధి ఉండకపోవటంవల్ల. అందుకని యుక్తాయుక్త పరిజ్ఞానానికి యోగాభ్యాసం తప్ప, యింకొక మార్గంలేదు. యోగాభ్యాసం ఫలించాలంటే అంతర్యామితో భక్తి, జ్ఞాన, వైరాగ్యములు, కర్మ యిందులో

ఏది వదిలిపెట్టినా కుర్చీకి నాలుగు కాళ్ళల్లో ఏకాలు విరగ్గొటితే కుర్చీ నిల్చుంటుందండి? కుర్చీ అనేది ఒకటిగాని, నాలుగు కాళ్ళు ఉన్నాయి కనుక కుర్చీలు నాలుగు కావు. భక్తి, జ్ఞానము, కర్మ, వైరాగ్యము అనే నాలుగు కాళ్ళు. ఇందులో ఏ కాలు పట్టుకుంటే మనం కుర్చీ ఎక్కుతాము. ఏ కాలు లేకపోయినా కుర్చీ ఉండదు. కనుక భక్తి, జ్ఞానము, కర్మ, వైరాగ్యం అనేవి నాలుగు కాదు. మూర్ఖులు నాలుగు అనుకుంటారు. ఒకదానికి నాలుగు కాళ్ళు అని తెలియాలి. ఇందులో ఏది గొప్పదని లెక్కవేసుకున్నవాడు కూడ మూర్ఖుడే. నాలుగు కాళ్ళల్లో ఏది గొప్పదని అనుకున్నవాడు కుర్చీలో కూర్చుంటానికి నోచుకోనివాడు. కుర్చీచుట్టూ తిరుగుతూ ఉంటాడు. కనుక ఇపుడు భగవద్గీతలో చెప్పబడిన వాక్యానికి సరైన వాక్యం ఇస్తున్నారు ఇక్కడ. ''తారకం, సర్వ విషయం, సర్వధా, విషయం, అక్రమంచ, ఇతి, వివేకజం జ్ఞానమ్'' ఇంతకుముందు వివేకము వలన కలిగిన జ్ఞానము అనిచెప్పి వదిలిపెట్టాడు. దాన్ని గురించి ఇంకాస్త మనకి ఆవరణ తీసేస్తున్నాడు. ''వివేకజం'' అంటే వివేకము వలన పుట్టిన 'జ్ఞానమ్' జ్ఞానము అనేది ఎట్లా ఉంటుంది? ఆ జ్ఞానమంటే సర్వధా అన్ని విధముల, సర్వ విషయం అంటే సమస్తము లక్ష్యముగా కలది అయ్యి ఉండేది. అంటే దేన్నీ వదిలి పెట్టవు. అది అంటే ఏమిటో మనకి తెలియకుండా వదిలిపెట్టటం ఉండదు. వైరాగ్యంలో ఇపుడు ఋషులు కూడ, మనం ఏదైతే లౌక్యమని, కోర్టు వ్యవహారాలు అని అనుకుంటున్నామో, అవన్నీ తెలియక వదిలిపెట్టిన వాళ్ళు కారు. అవి తెలిసి, వాటి నిస్సారత తెలిసి, వాటికి అతీతంగా ఉన్నట్టు లేకపోతే భారతంలో రాయబారాలు మొదలైన వాట్లల్లో వ్యాసుడు రచన చేయగలడా? కృష్ణరాయబారం, సంజయ రాయబారం యిలాంటివి. అవన్నీ తెలియకుండా వైరాగ్యం పొందాం. మాకెందుకు లెండి అంటే వైరాగ్యం కాదు. అవన్నీ తెలిసి, అక్కర్లేదు అనిచెప్పి, వైరాగ్యంవస్తే వ్యాసుడు లాంటివాడు అవుతాడు గాని, చాతకాని వాడు వైరాగ్యం చెపితే చెట్టుక్రింద కూర్చొని గంజాయి పీలుస్తూ కూర్చోవాల్సిందే. ఏం లాభంలేదు. గంజాయికి బేడ డబ్బులు అందర్నీ అడుక్కోవాలి. అంటే మీరు దానం చేస్తూంటే, వాడు జ్ఞానం చెపుతున్నానని గర్వించేవాడే కాని, వాడు జ్ఞానం యివ్వగలిగినది ఏమీ ఉండదు. కనుక 'సర్వ విషయం' సమస్త లక్షణములు, లక్ష్యములు కలది. విషయములు అంటే యింద్రియార్థములు. అన్ని ఇంద్రియముల అర్థములు కలిగినటువంటిదై

ఉంటుంది. దానికి 'వివేకజం' అంటే వివేకమునందు పుట్టినటు వంటిది అయిన జ్ఞానం గలిగి ఉంటుంది. ''సర్వధా'' అన్ని విధములుగా. యింకా ''తారకం చ'' సమస్తానికి తారకం కూడాను. తారకం అంటే రెండు అర్థాలున్నాయి. తారక అంటే కనుగ్రుడ్డు కంటికి సూటిగా ఎలా కన్పిస్తుందో, నీ జ్ఞానానికి అలా కన్పిస్తుందని అర్థం. కంటికి ఎదురుగుండా తెలిసే సూటియైన జ్ఞానాన్ని తారకం అంటారు. అంతేగాక తెలిసినది మన కేవిధమైన ఉపయోగమో చూడండి. ప్రభుత్వంలో చేస్తున్నవి ఎవడికీ తెలియ కూడనవి కొన్ని రహస్యాలు మనకి తెలిసాయి అనుకోండి. తెలిసాక మనం ఏం చేస్తాం? వారితోను, వారితోను చెప్తాం. అది అవసరమా? అది అవసరం అనుకున్న వాడికి వివేకం లేదన్నమాట. లేదా వాడిని గురించి ఎవరితోను చెప్పకూడని రహస్యం ఒకటి నాకు తెలిసిందనుకోండి. లేదా నన్ను గురించి ఎవరితోను చెప్పకూడని చాల నీచమైన విషయం యింకొకడికి తెలిసిందనుకోండి. ఆయన పతంజలి యోగం చెబుతాడుగాని, ఒకవేళ నిజమే అనుకోండి. కృష్ణమాచార్యులకి ఆ లక్షణం ఉందనుకోండి. దుర్లక్షణం. ఒక్కొక్కడికి ఒక్కొక్క దుర్లక్షణం ఉంటుంది. పెద్ద లెక్కేమిటి? మనకి తెలిసిందనుకోండి తెలిస్తే మనం ఇంకొకడితో చెప్పటం అవసరమా? ఎవడిని గురించైనా సరే ప్రపంచంలో అది చెప్పకపోతే గులగులలాడే వాడికి వివేకం లేదని అర్థం. అది ఈయన యిక్కడ చెబుతూన్నది. చెబితే వీడికేం రాదు కాని వాడికేదో పోతుందనుకుంటాడు. రెండూ జరగవు. ఎందుకంటే వాడికి ఉన్నదేదో పరువు, ప్రతిష్ఠ వాడికి ఉన్నది. ఒకణ్ణి గురించి డప్పు కొట్టుకొని మనం దుష్ప్రచారం చేసినా వాడికి అంతకుముందు లేని, అప్రతిష్ఠ రాదు. ప్రపంచంలో చూడండి. వాడికి అంతకు ముందు ఇన్ని సంవత్సరాలనించి మంచో, చెడో ఏ పేరుందో, అదే ఉంటుందిగాని, అంతకంటే ఏం అవ్వదు. మారాలంటే వాడేమన్నా చేయాలిగాని, వీడు అనటంవల్ల మారదు. వాడు మంచిచేస్తే మంచిగా మారుతుంది. చెడుచేస్తే చెడుగా మారుతుంది. దానివల్ల అది మారకుండా అవ్వటం ఎవడితరమూ కూడ కాదు. ఎందుకంటే ఎవడు చేసుకున్నదాన్ని బట్టి వాడికి, మంచిగానో, చెడుగానో వాడికున్న పేరు మారుతూ ఉంటుంది. దాన్ని డప్పు కొట్టినా ఆపటానికి వీల్లేదు. అది లేనపుడు ఎవడి గురించి సత్ప్రచారంగాని, దుష్ప్రచారం గాని ఏమీ లాభంలేదు. అది తారకం అంటే. అంతే కాకుండా తారకం అనే మాటకి తరింపజేయునది.

అదీ అసలు అర్థం, అంటే ఏదైనా తెలుసుకుంటే, వదిలిపెట్టేయండి అన్నారు. అదే మనకి ఉపయోగం అయిన రోజున మన దగ్గరే ఉంటుంది. తెలుసుకొని ఉన్నారు. గనుక లోపల మనస్సులో ఉంటుంది. ఫలానా ఆయన మేనల్లుడికి పెళ్ళికాలేదు. తెలుసుకోండి. అంతే తరువాత ఎవరన్నా పెళ్ళికాని అమ్మాయి గనుక ఉన్నట్లైతే గభాల్న జ్ఞాపకం వస్తాడు. అపుడవసరం కనుక కాని. ఫలానా ఆయన కుర్రాడికి పెళ్ళికాలేదుట అని హేళన చేయడానికి కాదు. ప్రపంచంలో ఎంత విలువైన విషయం తెలుసుకున్నప్పటికీ యమ నియమాదుల్లో బాగా సాధన వచ్చినాసరే, కుండలిని చక్రాల్లోంచి కొద్దిగా పైకి లేచిందని అనుమానం వచ్చినాసరే, అది ఎవరితోను చెప్పవలసిన విషయం కాదు. చెప్పినందువల్ల ఏమీ లాభంలేదు. లేదా మనకి కొన్ని నిదర్శనాలు కనిపించినాయి. ఏవో కొన్ని అనుభవాలు అనుభూతులు అంటారు. వీటిగురించి ఎపుడూ చెప్పుకోకూడదు. ఏవో ప్రతివాడికీ త్రేనుపులు వచ్చినట్లు వస్తూనే ఉంటాయి. అవి వికారాలు తప్ప, అంతకంటే పెద్ద విషయాలు ఏం కావు. వాట్ల గురించి ఏమండోయ్ నేను జపం చేసుకుంటూ ఉంటే పిల్లి వచ్చింది. ఇలా కళ్ళు తెరిచి చూసాను. అక్కడే ఆగిపోయింది. యిట్లాంటివి చెప్పుకోనక్కరలేదు. అది ఎందుకు ఆగిందో, ఎలుకను చూసి ఆగి ఉండచ్చు. ఎందుకంటే ''ఉత్తిష్ఠంతు భూత పిశాచాః'' అని నీళ్ళు వదుల్తూంటే మనవైపు వస్తున్న చీమ కూడ ప్రక్కకి వెళ్ళదు. భూత పిశాచాలు సంగతి తర్వాత. అందుకని మనని గురించి మనకున్న అంచనాలో తారకం ఉండాలి ఎప్పుడూ కూడను. తరించటం అనేది ఉండాలి. ఈ శాస్త్రం తెలిసింది. ఈ విద్య తెలిసింది. ఈ రహస్యం తెలిసింది. ఈ ఆఫీసులో ఉన్న ఈ కిటుకు తెలిసింది. ఈ తండ్రీ కొడుకుల మధ్య ఉన్న ఈ విషయం మనకి తెలిసింది. తెలిసిన తర్వాత మనకి సంబంధించినది కాదని తెలుసుకోండి. ఎవరికైనా పనికొచ్చేందుకు ఏదైనా సంబంధించినదైతే అపుడు అక్కడ సంబంధించి చేయండి. ఆ తర్వాత మళ్ళీ మనకి సంబంధించినది కాదు. ప్రయోజనం గనుక ఉన్నట్లైతే యింకొకడికి గాని, మీకు గాని అంతవరకు మాత్రమే సంబంధించినది.

ప్రయోజనం అంటే ఉపకరించటం, వాడు బాగు పడటానికి, మంచివాడు అవటానికి, పెద్దవాడు అవటానికి, అది ఆ క్షణానికి, ఆ సందర్భానికీ ప్రసక్తము. దాన్ని సత్యం అంటారు. ఆ తర్వాత అయిపోయిన తరువాత ప్రసక్తము కాదు. అందుకనే ఏది సత్యం? ఏది అసత్యం అనేది కూడ

నిత్యత్వం పొందటం లేదన్నాడు సహదేవుడు భారతంలో. దేన్నిబట్టి తెలుసుకోవాలి అని అంటే ఒకటి చెప్పాడు. మనం చెప్పుకున్న ఉదాహరణే. వాడెవడో దుష్టుడు. ఒక స్త్రీని తరుముకుంటూ వెడుతూ ఉన్నాడు. గభాల్నవచ్చి మనింట్లో దూరింది ఆవిడ. వెనుక దొడ్లో నిల్చుంది. వాడిటు వాకిట్లోంచి వెడుతూ ఏమండి, ఆచార్యుల గారూ! మీరు అబద్ధం ఆడరంటారు. యిటు ప్రక్కన ఒక ఆడది వెళ్ళిందా ఇంతకు ముందు అని అడిగాడు. అపుడు మనమేమిటి? అసత్య మాడరాదు. అవునయ్యా ఇటు వెళ్ళింది, ఆ వెనక్కి వెళ్ళి దూరింది, అన్నామనుకోండి. వాడు వెళ్ళి వెంటపడి లాక్కెళ్ళి పోతాడు కదా. దానికి నువ్వు నిమిత్త మాత్రమయినావా? లేదా? కాకుంటే, ఏమోనండి! నేనిపుడే బయటి కొచ్చాను, చూడలేదు అని అడ్డంగా తిరిగి కోసేస్తామనుకోండి, అపుడేమౌతుంది? ఆ అమ్మాయి రక్షింపబడుతుంది. 'కాని మనం అసత్యమాడిన వాళ్ళం అవుతాం. ఈ రెండింటిలో ఏది చేయవలసినది. అంటే భారతమే మనకి ప్రమాణం. మిగతావన్నీ దాంతోనే ప్రమాణం. దేనితో అయితే ఏ ఒక్కళ్ళకైనా రక్షణ జరుగుతుందో దానిపేరు సత్యవాక్కు. దేనితో అయితే ఏ ఒక్కళ్ళకైనా హాని కలుగుతుందో దానిపేరు అసత్యవాక్కు. అంతేకాని టేపు రికార్డుల కంటే సత్యం పలికేవాడుండడు. మనం అనుకుంటున్నది సత్యమయినట్లైతే మనం దగ్గితే అది కూడ పడుతుంది అందులో. అది సత్యం ఏమిటి? అన్నమాట తాను తప్పకుండా ఉండటం సత్యం. యిది అన్నావా? లేదా? అంటే అన్నాను. అయితే అలాగే చెయ్యి. ఎందుకు చెయ్యాలి? అజ్ఞానంగా ఏదో వాగాము తర్వాత జ్ఞానోదయం అయ్యిందనుకోండి. ఉదాహరణకి నేను వాణ్ణి చంపుతాను ఏడు రోజుల్లో అన్నాననుకోండి. రెండు మూడు రోజులు అయ్యేటప్పటికి నలుగురో, అయిదుగురో వచ్చి నీకు బుద్ధి లేదురా చదువుకున్నావు అని చెపితే కొంత నచ్చిందనుకోండి. అవాళ చంపుతానన్నాను. చంపాల్సిందే అనాలా? అవాళ అజ్ఞానంతో అన్నానని మార్చుకోవాలో ఏదిరైటు? ఖచ్చితంగా మార్చుకొని తీరాలి. అయితే ఆ వేళ నువ్వు అసత్యమాడావా? అంటే ఖచ్చితంగా ఆడాను. ఇది భారతం మనకు చెప్పేది. ఇంతకు మించి సత్యం ఉన్నదని ఎవడన్నా అనుకున్నాడంటే పిచ్చివాడే. ఎందుకంటే భారతంకంటే మనకు ఎక్కువ తెలుసునని అనుకుంటే అహంకారం. అంతేగాని మనం అసత్యం ఆడినవాళ్ళం అనకూడదు. ఏం మనం అసత్యం ఆడితే

వచ్చిన నష్టం ఏమిటి? మనం నరకానికి పోతాము. పోనీ ఆ అమ్మాయి రక్షింపబడినపుడు ఒకడు నరకానికి పోతే ఏం? మనకి నరకం వస్తే కొంప మునిగిపోయిందా? అంతగా మనబోటి యింతోటి మొనగాడికి నరకం రాకుడదా? ఇవి తెలియాలి. అంటే ఏమిటి? కరుడు గట్టిన స్వార్థం దాని వెనుక ఉంటుంది. ధర్మం, సత్యం అనే దొంగ పేర్లతో మన వెనుక నేను అబద్ధం ఆడనండి అంటే ఏం ఆడితే అంటారు. ఒకణ్ణి రక్షించడం కోసం అబద్ధమాడితే కొంప మునిగిపోతుందా? నేను అబద్ధం ఆడినవాణ్ణి అయ్యాను కదా. అయితే ఏం? సమాధానం లేదు దానికి. అంచేత ఏది సత్యం? ఏది అసత్యం అన్నదానికి మన మనుకుంటున్న నిత్యత్వం లేదురా నాయనా అన్నాడు. దాని ప్రయోజన నిత్యత్వం జాగ్రత్తగా తెలుసుకోమన్నాడు. సహదేవుడు అదే చెప్పాడు. చాణుక్యుడు అదే చెప్పాడు. మహానుభావులైన పెద్దలంతా కూడ అదే చెప్పారు. ధర్మరాజుని కృష్ణుడు ఆచరించమన్నదీ, అలాగే భారతయుద్ధంలో, అశ్వత్థామ చచ్చాడు అట్లాంటివి ఎందుకు చేసాడు. ఎత్తి చూపించి నువ్వు ఇలా చేసేవు కదా అంటే మీకు బోధపడే విషయం కాదు. నేను మిమ్మల్ని లెక్కచేయుట లేదు అన్నాడు కృష్ణుడు. అంచేత వాడొక్కడే అవతారమూర్తి అయినాడు. నేనెందుకు చేసాను అనేది మీకు బోధపడేది కాదు కనుక జవాబు దారీ (answerable) కాదు నేను అన్నాడు. కుర్రవాడు అన్నం తినను అంటాడు సినిమాకి తీసికెళ్ళలేదని. అబ్బాయీ వెడదాంరా రెండవ ఆటకి, టాక్సీ అది తీసుకు వస్తాను అని అంటే అన్నం తింటాడు. అలా అంటే అసత్యం కాదా, వాణ్ణి తీసుకెళ్ళను కదా, నేను అసత్యమాడను అంటే వాడు అన్నం తినకపోతే పీడా పోయింది అనుకోకూడదు. జాగ్రత్తగా తెలుసుకోవాలి. కనుక యోగాభ్యాసంలో యిలాంటి చెత్త సరుకంతా సర్దుకొని పోతుంది. తారకం అంటే తరింప చేస్తుంది. ఇక్కడ సత్యవాక్కు మీద మనకున్న అభిప్రాయం, తుక్కు అభిప్రాయాల్ని తరింపచేసి, సత్యవాక్కు ఎందుకు కావాలో, ఎపుడు కావాలో అపుడు వస్తూ ఉంటుంది. సత్యవాక్కుగానే నువ్వు ఉంటావు. అంటే నువ్వు కుర్రాడితో సినిమాకి తీసికెళ్తానని చెప్పి బొంకినా, నువ్వు సత్యవాక్కువే అవుతావు. అసత్యవాక్కువి అవ్వవు. ఆ స్థితి వస్తుంది. భారతంలో చెప్పినా ఇలాగే చెప్పారు. భాగవతంలో చెప్పినా ఇలాగే చెప్పారు. రామాయణంలో చెప్పినా ఇలాగే చెప్పారు. మనువు చెప్పినా ఇలాగే చెప్పాడు. అయితే రాముడు అన్నమాట నిలబెట్టుకున్నాడు కదా అంటే

రాముడు అరణ్యంలో ఉన్న రావణ కుంభకర్ణాదులు, వాళ్ళతో వున్న పరివారం వాళ్ళ వధకోసం వచ్చిన నిమిత్తం తప్ప, రాముడికి బుద్ధిపుట్టి వచ్చినటు వంటిది కాదు. రాముడు ఒక వ్యక్తి కాదు. అవతారమూర్తి. అంచేత వానికి ఉన్నది మానవబుద్ధి కాదు. వాడు అయోధ్యాపురంలో ఉన్నా రాజే. అరణ్యంలోకి వెళ్ళినా రాజే. కనుక ఎక్కడినుంచి ఎక్కడికి వెళ్ళాలి? ఏం చేయాలి? అనే నిర్ణయం వేరు. అందుకని రాముడికి మనకి సాపత్యం పెట్టుకోకూడదు. రాముడు చేసిన పని జగత్తుకోసం చేసాడు. మనం కూడ జగత్తుకోసం చేస్తున్నామని సిగ్గువిడిచి చెప్పుకోగలిగిన స్థితివస్తే అపుడాలోచిద్దాం. రామాయణంలో రాముడు తండ్రి చచ్చిపోతున్నాగాని ఆగలేదు, వెళ్ళిపోయినాడు అరణ్యానికి. అంటే వాడిష్టం కాదు. కదిలించాక ఎవడిష్టం కాదు. కైక కదిలించింది రెండు వరాలు. అది కదిలించిన తర్వాత బయల్దేరినటు వంటి ఆ న్యూసెన్సు ఎక్కడ వెళ్ళి ఆగింది? రావణాసురుడు చచ్చిపోవటంతో ఆగింది. ఈమధ్యన ఎవడూ ఆపటానికి వీల్లేదు. ఎవడికీ చాతకాదు. అది అందరి ద్వారా జరుగదు. అందరూ వాడితో లెక్కపెట్టుకొని పోలిక తెచ్చుకోకూడదు. కోరమాండల్ ఎక్స్‌ప్రెస్ రైలుతో మిగతా రైళ్ళు అన్నీ పోలిక పెట్టుకుంటే ఎలాగ? అది మధ్య స్టేషన్లలో ఆగదు. మేం కూడ ఆగము అంటే వాడు సిగ్నల్స్ యివ్వడు, పాయింట్సు తీసేస్తాడు. రైలు పట్టాలు తప్పుతుంది. జాగ్రత్తగా ఉండాలి.

కనుక తారకం అంటే తరింపజేయునది. మీరు ఏశాస్త్రం చదువుకున్నాసరే, శాస్త్రం మనకి పనికొస్తుందనుకొంటే చెడిపోతారు. శాస్త్రం పనికొచ్చే పరిస్థితి వచ్చినపుడు, మీకు ప్రయోజనంగా ఉంటుంది. దానితో మీరు పనిచేస్తారు. తరువాత శాస్త్రం దోవ శాస్త్రందే, మీదోవ మీదే. 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అన్నటువంటి మాట యిక్కడ. మీరు ధర్మములు అనుకుంటున్నవన్నీ కూడ ఇంతే. ధర్మం అంటే ఏమిటి? ''రక్షతి రక్షితః'' దాన్ని ఆదరిస్తే అది రక్షిస్తుంది. పదిమందిని రక్షించే దాన్ని ధర్మం అంటారు. ఎక్కడైతే పదిమంది రక్షింపబడతారో, అది నువ్వు ఆచరిస్తూ ఉండు. జాగ్రత్తగా గుర్తుపెట్టుకో అన్నాడు. ఆ జ్ఞానం వస్తుంది ఇక్కడ కూడ. అంతేగాని మనం ధర్మం అనుకున్నది పట్టుకొని ఈ లక్షలన్నీ పోయినాసరే, మనం అనుకున్న దానిమీదే నిలబడదాం అనే అజ్ఞానం ఉండదు. మనమాట పోకూడదు. పోతే ఏం? అక్కడే కదా కృష్ణుడికి, భీష్ముడికీ తేడా. కృష్ణుడు

ఎందుకు అవతారమూర్తి అయ్యాడు. కృష్ణుడి కంటే భీష్ముడు చాల శాస్త్రాలు తెలిసినవాడు. చాల సత్త్వ సంపన్నుడు, బహు బలశాలి, చాల మహనీయుడు, శీల సంపన్నుడు, భీష్ముడు అవతారమూర్తి ఎందుకు కాలేదు? కృష్ణుడికంటే ఏ విషయంలోను పాండిత్యం మొదలైన విషయాల్లోగాని, పరాక్రమంలోగాని, ఎందులోను తక్కువవాడు కాదు. కాస్త ఎక్కువవాడే. ధనుర్విద్య మొదలైన మహా శాస్త్రాలన్నీ ఆయనకి వచ్చినంత కృష్ణుడికి రావు. కృష్ణుడే చెప్పాడు చాలచోట్ల. రాకపోతే నష్టం ఏం లేదన్నాడు? అలాంటి కృష్ణుడు అవతారమైతే, భీష్ముడు కనీసం మూడు వంతుల అవతారమవ్వాలి కదా. అవ్వలేదు. ఎంచేత అవ్వలేదు. తండ్రిగారి కోసం పెళ్ళి చేసుకోను, రాజ్యం చేయను నేను అన్నాడు. ఎందుకోసం అన్నాడు. తండ్రికి పిల్లనిచ్చిన ఆ దాశరాజు తన కూతురు పిల్లలకి రాజ్యం రావలెననే దృష్టితో కదా అన్నది. అదికాస్త నాశనమైపోయే. ఆవిడకు కొడుకుల్లేరు. పిల్లలు లేరు. అపుడు ఆవిడే పిలిచి ఏమని అడిగింది? ఒరేయ్ నాయనా నువ్వు పెళ్ళి చేసుకోరా అని అడిగింది. మరి రాజ్యం అనేది పరిపాలించే వాడికి సంబంధించినదా? పరిపాలింపబడే వాళ్ళకి సంబంధించినదా? కాబట్టి అవతారమూర్తి కాలేకపోయాడు. రాముడంత వాడన్నాడు. ''యత్ సావిత్రైః ర్జీవితం భూమిపాలైః'' సూర్యుడు దగ్గరనించి నాదాకా వస్తున్నటు వంటి, ఈ మహారాజులు పరిపాలిస్తున్నటు వంటి ఈ వంశంలో ''కశ్మలాకిం వదంతి చేత్'' వీడి భార్య సంవత్సరం రావణాసురుడు దగ్గర ఉన్నా తర్వాత తెచ్చుకున్నాడన్నమాట వచ్చింది. నా వలన ఈ వంశానికి గనుక మచ్చ వచ్చేటట్లయితే ''జింగ్మాం అధన్యం'' నా అంత దురదృష్టవంతుడు లేడు 'ఛీ' అని ఈ సీతని తీసికెళ్ళి అరణ్యంలో వదిలిపెట్టండి అన్నాడు. మనం ఎక్కడ ఉంటాం? సూర్య కిరణాలు భూమిని పరిపాలించిన దగ్గరనించి నాదాక వచ్చింది సూర్యవంశం అనేటువంటిది. ఇందులో మచ్చ ఎపుడైనా ఎరుగుదుమా ఎవరైనా? అట్లాంటిది ఇందులో ఉన్న ఈ రాముడు తన భార్యని, రావణాసురుడి దగ్గర ఉన్నదాన్ని మళ్ళీ తీసుకొని తెచ్చుకున్నాట్ట అని రాజ్యంలో ఎవడో ఒకడు అన్నాడంటే, మరి చేయగలిగింది ఏమిటి? రాజ్యం వదిలిపెట్టి ఈవిడని తీసుకొని అడవుల్లోకి వెళ్ళిపోవటమా? Edward the VIII లాగ, Duke of windsor చేసినట్లు, లేదా రాజ్యంకోసం ఈవిడని వదిలిపెట్టటమా? ఇద్దరూ రెండు ఉదాహరణలు. ప్రక్క-ప్రక్కన మీరు పెడితే Edward the VIII, Duke of windsor ఏం చేసాడు? రాజ్యం

నాకు అక్కర్లేదు, ఆవిడని తీసికెళ్ళిపోతాను అన్నాడు. ఆహా! తన ప్రేమకోసం, ప్రణయంకోసం రాజ్యాన్నే త్యాగం చేసాడు అన్నారు. అది మ్లేచ్ఛ సంప్రదాయం. కాని శాశ్వత ధర్మంయొక్క సిద్ధాంతం రాజు అనేది ఒక పదవి కాదు. రాజంటే ఒక సేవకుడు. పరిపాలకుడు. వాణ్ణి రాజు అనండి, ఇంకేదైనా అనండి. అది ఒక పదవి మాత్రం కాదు. పదవి అనుకున్నవాళ్ళు జంతువులు. రాముడు మొదలైనవాళ్ళు మేము సేవకులం అని చెప్పారు. అందుకు పనికొస్తే ఉంటాం. లేకపోతే లేదు. సేవకుడయిన వాడికి వ్యక్తిగతంగా అసౌకర్యం వచ్చినపుడు అది వదిలేసి చేసే పనిని జాగ్రత్తగా చూసుకో అన్నాడు. ఇది ప్రజలందరికీ సంబంధించినది. నేను పరిపాలించాల్సినది. అది సీతకీ, నాకు వ్యక్తిగతంగా సంబంధించినది. మేం యిద్దరం లేకపోతే ఏం? అన్నాడు. రాజ్యం పదవి అనుకోకుండా పవిత్రమైన ధర్మం అనుకున్నవాడు మనిష్టమా? అన్నాడు. సీతని వదిలేయ్. మొట్టమొదట ఆయనకి హెచ్చరిక చేసింది కూడ అదే. ఎవరు? గురువు వశిష్టుడు. రాముడు పట్టాభిషేకానికి వచ్చాక అట్టే రోజులు అతనితో ఉండటానికి వీల్లేకపోయింది. అల్లుడుగారైన ఋష్యశృంగుడు యజ్ఞం చేస్తుంటే అక్కడికి వెళ్ళాల్సి వచ్చింది వీళ్ళంతా. వశిష్టుడు, వామదేవుడు, జాబాలి. రాముడు పట్టాభిషేకమైన తర్వాత పెద్ద వాళ్ళెవరు అనుభవం ఉన్నవాళ్ళు కూడ లేరు. వాడికి మనస్సులో లుక లుక లాడుతోంది గురువుగారికి. అందుకని రాముడికి కబురు చేయించాడు. ''త్వం బాలయే వాసి నవంచ రాజ్యం'' నువ్వు కుర్రాడివి. రాజ్యం క్రొత్త ''జామాతృయజ్ఞేన వయంతు నిరుద్ధాః'' అల్లుడుగారి యజ్ఞంతో మేం యిక్కడ ఆగాల్సి వచ్చింది. నీ ప్రక్కన నేను ఉండి చేయించాల్సింది పొరపాట్లు లేకుండాను, క్రొత్త రోజుల్లో పదవికి వచ్చినపుడు, కాని నువ్వు చిన్నవాడివి చాతనయినంత వరకు ''యుక్త ప్రజానాం మనురంజనేసాః'' ప్రజలకు ఏదైతే సంతోషమో, ఏది అయితే ధర్మమో, ఆ ప్రయోజనం గుర్తుగా పెట్టుకొని చేస్తూండు నేను వచ్చేవరకు అన్నాడు. అదే నీ సూర్యవంశం వాళ్ళ లక్షణం అన్నాడు. అని కబురంపిస్తే ఏ ముని చేత కబురంపించాడో, ఆ మునికి మళ్ళీ రాముడు ఏమని సమాధానం చెప్పాడో తెలుసునాండి? సీత ప్రక్కన కూర్చొని ఉంది. అప్పటికి యింకా ఈ దుర్వార్త తెలియలేదు. గురువుగారి ఆజ్ఞ అందుకున్నాం ''స్నేహం, దయాంచ సౌఖ్యంచ'' ప్రజా పరిపాలనకోసం స్నేహాన్ని కాని, దయనుకాని, సౌఖ్యాన్నిగాని వదిలేయి అంటే వదిలేస్తాను. 'యదివా జానకీమపి' చిట్టచివరికి

సీతాదేవినైనా సరే. ''ఆరాధనాయ లోకస్య మించ్యతో నాస్తి మే వ్యధా'' ఈ లోకారాధన అని గురువుగారు చెప్పిన మాటకి నేను ఏదీ వదిలి పెట్టటంలో బాధపడను. ఆవిడ కోసం నేను జన్మంతా బాధపడచ్చుగాని, వదిలిపెట్టటాన్ని గురించి ఒక్క క్షణం బాధపడను అన్నాడు. తేడా తెలియాలి రెంటికీ. రెంటికీ తేడా తెలియటం కష్టం. అందుకనే యిలా వదిలిపెట్శాట్ట అని ఒకరి కొకరు చెప్పుకుంటారు అరణ్యంలో. అదివరకు సీతాదేవితో కలిసి ఆడుకున్న మునికన్యలు, వన దేవతలు మాట్లాడుకుంటూ ఒకావిడకు రాముడిమీద కోపం కూడ వస్తుంది. 'తస్య సహధర్మ చారిణి' అంటే యజ్ఞంలో ఎవరు ప్రక్కన ఉన్నటువంటిది అని అడిగితే 'హిరణ్మయి సీతా ప్రతిప్రతిః' అంటే బంగారపు సీతాదేవి రూపం అనేటప్పటికి రాముడు ఎంత బాధపడి వదిలిపెట్టాడో, వదిలిపెట్టినా సీతాదేవి యందు ఎంత ప్రేమ కలదో, మళ్ళీ గుర్తు వస్తుంది. ఈవిడని అనవసరంగా కోప్పడ్డామే రాముడిమీద, అని చాల బాధపడి ఈవిడ అంటుంది. ''వజ్రాదపి కఠోరాణి మృదూని కుసుమాదపి'' ఒకే సందర్భంలో ఒకే మనస్సు వజ్రంకంటే కఠినము. జంకదు కాని పువ్వురేకు కంటే అతి మృదువు. సీతాదేవిని విడిచి పెట్టటంలో వజ్రంకంటే కఠినము. సీతాదేవియందు పువ్వు కంటే మృదువు. ''లోకోత్తరాణాం చేతాంసికోహి విద్యాతుమర్హతి'' లోకంలో వున్నవాళ్ళ మనస్సులు పట్టగలము గాని, లోకోత్తరమైన ఇలాంటి వాళ్ళని గురించి వీడు కఠినుడు, వీడు దయాగుణం కలవాడు అని ఏం చెబుతాం? అని దణ్ణం పెట్టింది. కనుక ఇది తెలిస్తే అది తెలుస్తుంది.

ఇపుడు మనం చెప్పుకున్న రెండో, మూడో, నాలుగో సందర్భాలు ఎందుకు చెప్పామంటే యిందులోంచి కావ్యంలోకి వెళ్ళారేంటి గురువుగారు అనుకోకండి. కావ్యంలోకి వెళ్ళటం కాదు. ఇపుడు మనం చెప్పుకున్న వాట్లల్లో హృదయం ఎందుకు కరుగుతుందంటే? కరుగుతున్న క్షణంలో మనయందు తారకం ఉంటుంది. అందుకనే కావ్యం చదువుకుంటూాంటే ''సద్యపర నిరువృతయే'' కావ్యంయొక్క ప్రయోజనమేమిటి? ఉత్తమమైన కావ్యం ప్రయోజనం ''యశసే'' కీర్తికోసం, ''అర్థవృతే'' డబ్బులు రావటంకోసం, అక్కడేదో ప్రైజువస్తూ ఉంటుంది. వాడు అచ్చు వేయించుకునేందుకు డబ్బులిస్తాడు. చందాలు వేయటం ఇట్లాంటివన్నీ, ''వ్యవహారవిదే'' లోక వ్యవహారం తెలుస్తుంది కావ్యం చదువుకుంటే. ఎవడెట్లా మాట్లాడుతాడో

మొదలైనటు వంటిది. అలాగాకుండా మూడోది ''శివేతరక్షతయే'' శుభానికి, మంగళత్వానికి, పదిమందియొక్క లోకశ్రేయస్సుకి వ్యతిరేకంగా మన మనస్సులో ఉన్నవన్నీ పోతాయి. ''శివేతరక్షతి'' హృదయం పెద్దదవుతుంది కావ్యం చదువుకుంటే. ఇవన్నీకాక ''సద్యపర నిరువృతయే'' వెంటనే చదువుతూ ఉండంగ మనస్సు లోపలికి మునిగిపోయి, రసానందం పైకివచ్చి, వీడికున్నటు వంటి హద్దులు, అడ్డులు అన్నీ అలా పైకి వెళ్ళిపోతాయి. మిగతావాట్లల్లో అయితే యోగాభ్యాసం ఎన్నాళ్ళు పడుతుందో తెలీదు. ప్రక్కన కావ్య రసాస్వాదనం కూడ ఉంచుకుంటే వెంటనే వస్తుంది. ఇది అదీ కూడ రెండు పట్టాలులాగ నడవాలి. ఎందుకంటే కావ్యంలో మన కొచ్చేది సమాచారము **(Information)** కాదు. చాలమందికి అది తెలీదు. కావ్యంలో విషయం ఏం బోధపడుతుంది? బోధపడితే కావ్యం అవ్వదు అది. కేటలాగు అవుతుంది. భీష్మున్ణ్ణి ఆవిడ పెళ్ళి చేసుకోమంది. నేను చేసుకోనన్నాడు ఎందుకని? అన్నమాట నేను తప్పను అన్నాడు. కాని ఈవిడ ఎందుకు చేసుకోమంది? ప్రజలు దిక్కులేకుండా పోతారు. అందుచేత చేసుకోమంది. ఆయన చేసుకోకపోవటం వల్లే కదా మహాభారత యుద్ధం వచ్చింది. అదే కృష్ణుడు అయ్యి ఉన్నట్లైతే ఆ పెళ్ళి చేసుకోవడం తనకోసం కాదు. జగత్ సత్యము, జగత్ శ్రేయము, విశ్వ శ్రేయము కోసం. మహానుభావు డైనప్పటికీ వ్యాసుడు నా బ్రహ్మచర్యం పోతుందేమో అని అనుకోలేదు. సంబంధం లేదు. అలాంటివి ఎందుకు రాసాడంటే? అలాంటివి రాస్తేనే మన పస తేలేది. మనకేదన్నా ధర్మం అంటే ఏమిటో తెలియాల్సిన సత్తా ఉందో, లేకపోతే తలవంచుకొని కొట్టుకుపోతామో, తేలేది అలాంటి కథల్లోనే. మనిషి ఎప్పుడు పెరుగుతాడు? సమస్యలు వచ్చినపుడే, లేకపోతే వీటి నియమం **(morality)** వదిలి పెట్టటమో, రెండింటిలో ఏదో ఒకటి తేల్తుంది. అంటే వీడు కక్కుర్తిలోకి వెళ్ళిపోవటమో, లేక అంతకంటే పెరగటమో, ఏదన్నా సమస్య వచ్చినపుడే తేల్తుంది. శ్రీకృష్ణుడు ఎవడితో మాట్లాడినా అవతలివాడు మాట్లాడాడుగాని, తను మాట్లాడాడా? తనంటూ లేదు. వ్యక్తిత్వం లేదు కృష్ణుడికి. ఎన్ని వేలమంది కృష్ణుడితో మాట్లాడినా, ఆ మాట్లాడిన వాడినిబట్టి కృష్ణుడి దగ్గరనించి సమాధానం వచ్చిందిగాని, కృష్ణుని సమాధానాలు అంటూ లేవు. మొత్తం చూడండి భారతంలో. ఎందుకంటే కృష్ణుడు ఒక వ్యక్తి కాదు. ఒక అద్దం. అద్దం దగ్గరికి వెళ్ళి దానికి నమస్కారం సార్ అంటే నమస్కారం సార్ అంటుంది. ఏరా

ఫూల్ అంటే ఏరా ఫూల్ అంటుంది. అలా మాట్లాడాడు. కృష్ణుడు భారతం మొత్తంమీద. అంటే పర్సనాలిటీ లేదు అంటాం. మీకు నాకు పర్సనాలిటీ లేకపోవటం అవమానం. వాడికి personality లేకపోవడం అనేది లేదు. ఎవడి దగ్గరకి వెడితే వాడి personality ఉంటుంది. అదీ పద్ధతి. తారకం అంటే ఆ స్థితికి తీసికెళ్ళటం. తరింపచేయటం అంటే మన limitations నించి తరింపచేస్తుంది. కనుక ''సర్వ విషయం సర్వథా'' అన్ని విధాలా సర్వవిషయాన్ని తారకంగా చేస్తుంది ఈ వివేకజం అయినటువంటి జ్ఞానం, అంటే యిది చేయవచ్చును, యిది చేయకూడదు అనే నిర్ణయం మీలోనించి రావటం మొదలుపెట్టాక. అదికాదు. ఇంకొకచోట ఏం చెప్పారో చూద్దాం అనుకుంటే ఒక్కొక్కచోట ఒక్కొక్కలాగ చెప్పచ్చు. మరో పుస్తకంలో యింకోలాగ, Hindu law లో ఒకలాగ, Jewish law లో ఒకలాగ హీబ్రూ law లో ఒకలాగ చెప్పాడనుకోండి. ఇపుడు ఏం చేద్దాం? మతిపోదూ? అందుకనే ధర్మం లోపల నుంచి రావాలి. ''వివేకజం జ్ఞానం'' వచ్చిన సిద్ధులైన మహానుభావులు నడుస్తూంటే ఎలా ఉంటుందంటే New Testament లో ఒక వాక్యం ఉంది. నువ్వు చెబుతూన్న దానికి ప్రమాణం ఏమిటి? అని అడిగారు జీసస్ క్రిస్తుని. నేనే ప్రమాణం తీసుకోండి అన్నాడు. నేను అచ్చు తప్పు ఒప్పుకోను అన్నాడు. ఎందుకంటే చెప్పినది రైటా? తప్పా? అని చూసుకోవడమేగాని ప్రమాణం అంటే, అందులో ఉందా? ఇందులో ఉందా? ఎందులో ఉంటే ఏం లాభం? అన్నాడు. నువ్వు చెయ్యకపోయిన తర్వాత ఎన్నింటిలో ఉంటే ఏం లాభం? కనుక దానికి ప్రమాణం ఏమిటంటే నేను చెబుతున్నాను అదే ప్రమాణం అన్నాడు అర్థం కాలేదు. అదొక్కటే సత్యం. 7x6=42. ప్రమాణం ఏమిటి? అంటే ఎక్కాల పుస్తకం చూపిస్తే దానికి ప్రమాణం ఏమిటి అని అడగరు? ఆ ఎక్కాల పుస్తకం రాసిన వాడికి తెలుసునని ప్రమాణం ఏమిటి? అలా కాదురా ఆరేసి ఆరేసి చింతగింజలు పెట్టుకొని లెక్కపెట్టు. మొత్తం 42 వస్తుంది. అంచేత నేను చెబుతున్నాను నువ్వు చూసుకో అంటాడు. సగం తెల్సినవాడు ఎపుడూ అలా చెప్పలేడు. సగం తెల్సినవాడు ఎపుడూ వాడికేం తెలుసు? వీడికేం తెలుసు? ఆ పుస్తకాల కేం తెలుసు? రామాయణానికేం తెలుసు? భారతానికి ఏం తెలుసు? అంటాడుగాని ఇది నేను చెబుతున్నాను. నువ్వు ఆచరించి చూడు అని చచ్చినా చెప్పలేడు. వాణ్ణి పుటం పెట్టినా చెప్పడు ఎన్నడూ. ''ప్రమాణం

మంతఃకరణ ప్రవృత్తయః'' అంటే ఏంలేదు. ఇది పుల్లగా ఉన్నది. ఎలా తెలిసింది? తినిచూడు. అది ఆయన చెబుతున్నది. దాంట్లో తప్పేం ఉంది. ఇంకొకడు పుల్లగా ఉందిట అంటే నువ్వు తిన్నావా? అంటే లేదులెండి అంటే అది follow అయ్యేవాడు, వాడు తిన్నాడా? వీడు తిన్నాడా? అని అడుగుతాడు కాని, తను తిన్నానని ఎపుడూ చెప్పడు. ప్రమాణమైనటువంటి వాళ్ళు ఎపుడూ అలా చెప్పరు. అందుకని ''తారకంచ'' ఏ శాస్త్రం చదువుకోండి, మీరు ఏం చేయండి, దేన్ని అనుష్ఠానం చేయండి, ఆ నేర్చుకున్న విషయం అంతాకూడ అవిద్య. అది సక్రమంగా ఉంటే విద్య అంటారు. జీవితాన్ని తరింపచేసేది. తారకం మిమ్మల్ని ఆ స్థితికి తీసుకువస్తుంది. ఎందుకు తరింపచేయటం, పోనీ అది మూట కట్టుకు కూర్చుంటే ఏమి? ఆ శాస్త్రం. తర్కమెా, వ్యాకరణమెా, కెమిస్ట్రీయెా, ఫిజిక్స్, మీమాంసో, పూర్వమీమాంసో, ఉత్తర మీమాంసో అవి మూటకట్టుకొని చంకలో పెట్టుకు కూర్చుంటే ఏం మోక్షం యివ్వరా? చచ్చినా యివ్వరు. 'సర్వథా' అన్ని విధములుగా మళ్ళీ యిటు అప్లై చేసుకోండి. ''విషయం అక్రమం'' విషయం అంటే ఇంద్రియార్థములకు గోచరమైనది ఎపుడూ కూడ క్రమబద్ధం కాదు అక్రమమే సుమా, అంటే మీరు కంటితో పతంజలి యోగసూత్రాలు చదువుకున్నారు. మనస్సుతో శబ్దాలకి సంస్కృతం నేర్చుకున్న ప్రకారం అర్థం చెప్పుకున్నారు. మొత్తం సమన్వయం చేసుకొని సూత్రానికి అర్థం చెప్పుకున్నారు. యివన్నీ కూడ దేనిమీద ఆధారపడి ఉన్నాయి? మన సంస్కృత జ్ఞానము, మనకున్న శబ్దార్థ జ్ఞానము, వాచ్య జ్ఞానము, అన్వయ జ్ఞానము, సమన్వయ జ్ఞానము, వీటిమీద ఆధారపడి ఉన్నాయి. అందులో తేడా ఉంటే మనం చెప్పుకున్న అర్థం రైటవుతుందా? అందుచేత ప్రపంచంలో ఈ దుస్థితి మనకి ఎప్పుడూ ఉన్నదన్నాడు. ఇంద్రియాలద్వారా మనం తీసుకునేది ఉందే అది ఎపుడూ కూడ క్రమబద్ధంలో ఉంటుంది అనేది చెప్పడానికి వీల్లేదు. అక్రమంగా ఉంటుంది నాయనా, ఇక్కడ ఈ గుంజ ఉంది. మనం యిట్లా నడిచి వెళితే యిక్కడిదాకా వచ్చి యిలా వెడతాం అకస్మాత్తుగా మనకి తెలీకుండా. కంటికి జబ్బు చేసిందనుకోండి, ఆ తలుపు యిక్కడున్నట్లు కనిపిస్తుంది. అపుడు వెళ్ళి టక్కున గుద్దుకుంటాం. అంచేత యింద్రియాలు, మనస్సు వీట్లని ఎన్నడూ ప్రమాణంగా తీసుకోరు. మనం చదువుకుంటున్న యిన్ని శాస్త్రాలు దేనితో చదువుకుంటున్నాం? ఇంద్రియాలతోను, మనస్సుతోను

చదువుతున్నాం. దేనితో అర్థం చేసుకుంటున్నాం? మనస్సుతోనే కదా. కనుక ''సర్వథా విషయం అక్రమం''. విషయం అంటే ఇంద్రియార్థ గోచరమైనది సమస్తమూ కూడ క్రమ మార్గమున ఉండదు. దాన్ని నువ్వు లోపల క్రమంలో పెట్టుకోవాలి. అంచేత తెలుసుకున్నది తెలుసుకో. నేర్చుకున్నది నేర్చుకో. కాని, దానికి దీనికి సంబంధం అక్కర్లేదు. కావలసినపుడు పనిచేస్తుంది అంతే. ఈ వైరాగ్యం లేనివాడికి ఏ శాస్త్రమైనా బంధమే యిస్తుంది. ఈ వైరాగ్యం ఉన్నవాడికి ఏ శాస్త్రమైనా ఎపుడు, ఎవడికి కావాలో వాడిద్వారా అందరికీ పనిచేస్తుంది. దీన్ని గురించే భగవద్గీతలో కృష్ణుడు ''యావానర్థ ఉదపానే సర్వత స్సంప్లుతోదకే తావాన్ సర్వేషు వేదేషు బ్రాహ్మణస్య విజానతః'' అని అన్నాడు. నిండా నీళ్ళు ఉన్న నదిలో ఎన్ని నీళ్ళు ఉన్నాయని కాదు, మీకెన్ని కావాలన్నది ఉంచండి. వేదమునందు ఈ రకంగా ఉన్న వాడినే బ్రాహ్మణుడు అంటారు. వాడు చెప్పినది వేదం. అంటే సృష్టి యజ్ఞం. మానవుడు రాసిన శాస్త్రంకాదు. అపౌరుషేయం అందులోనూ శాస్త్రం ఉంది. ఇందులోను శాస్త్రం ఉంది. ఇది చూస్తూంటే బోటనీ అంటాం. అటుచూస్తే కుక్కపిల్ల బయాలజీ అంటాం. అదిచూస్తే అది నేర్చుకుందామని, యిది చూస్తే యిది నేర్చుకుందామని, పిచ్చివాడయిపోతాడు చివరికి. ఎవరన్నా లెక్కలు రాస్తూంటే అది నేర్చుకుందామనుకొని, అన్నీ తలోకాస్త నేర్చుకుందా మనుకుంటే, ఏదీ రాదు. కాని యిందులో ఏవీ మనవి కావు. ఏరు దాటటానికి తెప్ప ఎలా ఉపయోగించు కుంటున్నాము? దాటిం తర్వాత తెప్ప ఎంత అవుతుందని కొనుక్కొని భుజాన వేసుకొని వెడతామా? ఇవన్నీ అంతే. ఇది తెలియాలి. కనుక విషయం అక్రమం. విషయం అంటే ఇంద్రియార్థములతో కూడినది, అది అక్రమం అంటే క్రమ మార్గాన ఉండదు ఎపుడూ కూడ. దాన్ని పట్టుకొని నువ్వు నిల్చున్నావంటే అది దెబ్బ తీస్తుంది. అది ఎందుకు కావాలో వినియోగ పడటం అనేది మీకు తారకం అయినటువంటి స్థితి ఈ యోగభ్యాసం చేసినటువంటి వాడికి వస్తుంది. పతంజలి యోగసూత్రాలు మనం శాస్త్రంగానే చదువుకోవచ్చు కాని మనం కొంత అభ్యాసం చేయటం మొదలుపెట్టాక ఈ సూత్రాల్లో ఉన్నది పతంజలి ఏం చెప్పాడో మనకి అనుగ్రహించటం కోసమని ఒకానొక స్థితి వస్తుంది. అది వివేకజం అయినటువంటి జ్ఞానము, తారకమున్నూ. అందుకోసం ఈ మూడవపాదం అయిపోతూండగ ఈ సూత్రం ప్రసాదించాడు. అంటే ఒరేయ్ నాయనా!

సూత్రం అంటే టీకా తాత్పర్యాలు మాత్రంకాదు. శాస్త్రం నిన్ను అనుగ్రహించే విషయం ఒకటి ఉంటుంది. ఆ తారక జ్ఞానాన్ని ప్రధానంగా తీసుకోండి. మీకు తెలుస్తుంది. ఏదిరైటో, ఏది తప్పో లోపల ఉండి నేనే చెప్తూ ఉంటాను అన్నట్లుగా చెప్పాడు. ఈ వాక్యానికి అర్థం అది.

జ్వాలాకూలుడు ఏం చెప్పాడో కూడ తెలుసుకుందాం. తేలికగా ఉంటుంది మీకు "The intuitive knowledge" వివేకజం జ్ఞానం అంటే ఆయన ఇచ్చినది. అంటే లోపల నించి మీకు యిది యిష్టము, ఇది అయిష్టము అని తెలుస్తుంది intuition అంటే. అది "The intuitive knowledge which is the great deliverer is omni present and omni potent and includes the past, present and the future in the eternal law". అది తారకం అంటే. అన్నింటి నుంచి సమస్తం నుండి విమోచనం చేసేది. సమస్త విమోచనాత్మకము తారకం అనే మాటకి ఆయన ఇచ్చిన తర్జుమా. It is omni present and omni potent. అది సర్వ విషయం కలది అంటే అందులో సమస్తమూ ఉన్నాయి. కాని నీకెప్పుడు ఏది కావాలంటే అది ఉండటం అని అర్థంకాని, సమస్తము నేర్చుకొని బుర్రమీద మోస్తూ ఉండటం అని అర్థంకాదు. and "includes the past, the present and the future in the Eternal Law" అంటే శాశ్వతమైన సత్యత్వము నందు అక్రమమైన విషయాన్ని తనయందు సర్వధా ధరించి ఉంటుంది అన్నాడు. మనం ఏ క్రమంలో తీసుకుంటాము? భూతము, భవిష్యత్, వర్తమానము. అది క్రమం కాదు అసలు. ఉన్నది ఒక్కటే. అఖండమైనది. కాని మన బుద్ధి మూడుగా దాన్ని చూసుకుంటోంది కనుక విషయం ఎపుడూ కూడ అక్రమమే, మీకు వివేకజం అయిన జ్ఞానం చేరి తారకమున్నూ, సర్వధా సర్వ విషయములున్నూ తెలుస్తాయి.

## 56. సత్త్వ పురుషయోశ్శుద్ధి సామ్యేకైవల్యమ్।

సత్త్వ పురుషయో = సత్త్వమునకు, పురుషునికీ, శుద్ధి సామ్యే = పరిశుద్ధి యందు సామ్యము సిద్ధించగా, కైవల్యమ్ = కైవల్యము (వచ్చును).

**బుద్ధికిని, ఆత్మకును (తనకును) ఒకే పరిశుద్ధి కలిగినపుడు కేవలము తానే ఉండును. దానినే కైవల్యము అందురు.**

**వివరణ :** ఇదివరకు ఈ అధ్యాయంలోనే రెండు పర్యాయములు కైవల్యమ్ అనే పదం వచ్చింది. ఆ చెప్పినదాన్నే మరల హెచ్చరిక చేశారు. సత్త్వమునకు 'త' వత్తు పెట్టాలా అని సందేహం. సత్త్వము అనే దానికి 'త' వత్తు ఉండాలి. లేకపోతే అర్థం మారిపోతుంది. 'త' వత్తు లేకపోతే సత్త్వము అనే మాటకి 'త' యొక్క లక్షణము అని అర్థం వస్తుంది. జాగ్రత్తగా ఉండాలి. ''సత్త్వ పురుషయోః'' అంటే సత్త్వమునకు, పురుషునికీ నడుమ ''శుద్ధి సామ్యే'' పరిశుద్ధి యందు సామ్యము సిద్ధించగా, కైవల్యం వస్తుందన్నాడు. కైవల్యం అట్లా ఉంచండి. ఎలాగు వచ్చేదే కనుక మనం ఈ లోపల చేయవలసిన పనులు ఉన్నాయి. కైవల్యం సాధించటానికి చేసిన వాడెవడూ బాగుపడడు. కర్తవ్యం చేసిన వాడికి కైవల్యం వస్తుంది. కైవల్యం యివ్వబడేది కాని, సాధించుకునేది కాదు. మోక్షం రాదురా అప్పా! అన్నాడు రమణమహర్షి, నాకు మోక్షం ఎలా వస్తుంది సార్! అని అడిగితే. నేను మహాపాపిని కామోసు అనుకున్నాడు వాడు. సాయంత్రందాకా ఏడిపించాడు వాణ్ణి. చివరికి పోయేది బంధం రా అప్పా వచ్చేది మోక్షం కాదన్నాడు. అంటే మనం తెచ్చుకున్నదేదో అది పోవాలి. అంతకు ముందున్న స్థితే మోక్షం. మోక్షం అనేది పట్టి తెచ్చుకునేది కాదు. యజ్ఞోపవీతంలో చిక్కు పోగొట్టుకోవాలి. చిక్కు అనేది పదార్థం కాదు. ఉన్నది శుద్ధ యజ్ఞోపవీతం+చిక్కు మనం తెచ్చుకున్నాం. కనుక మోక్షం రావటం ఉండదు. బంధం పోవటం ఉంటుంది. అందుకని సత్త్వము, పురుషుడు, దేహము, ఇంద్రియములు, ఇంద్రియార్థములు లేక వాటి విషయములు మనో, బుద్ధి అహంకార చిత్తములు అంటే అంతఃకరణ చతుష్టయం, ఇవన్నీ కలిసి ఒక జాతి. బుద్ధి ఒక పురుషుడు మనలో. సత్త్వము

అనేవాడు ఒక పురుషుడు. ఇదికాక పురుషుడు అనబడే ఇంకొక పురుషుడు. భగవద్గీతలో క్షరపురుషుడు, అక్షరపురుషుడు, పురుషోత్తముడు అని చెప్పారు. అంటే జీవుడు, జీవాత్మ, పరమాత్మ. అవి సత్త్వము మీద ప్రతిబింబిస్తూ ఉన్నపుడు పరిశుద్ధి ఉండదు. సత్త్వము మైలపడదు కాని ఆ అద్దంలో నానా అడ్డమైనటువంటి గడ్డిన్నీ ప్రతిబింబిస్తున్నాయి. అద్దం అక్కడ పెట్టాము. అక్కడ కుక్క, అక్కడ గాడిద, అక్కడ చేప, ఇక్కడ కోడిగుడ్డు యివన్నీ పెట్టాము. అద్దంలో అవి కన్పిస్తున్నాయి. అద్దానికేం నష్టంలేదు గాని, చూసే మనకి దేభ్యంగా ఉంటుంది. అందుకని ఇవి ప్రతిబింబిస్తున్నపుడు సత్త్వము శుద్ధం కాదు. ఇది శుద్ధం అవ్వటం ఎట్లాగో చెప్పాడు. క్రమక్రమంగా సత్త్వము, పురుషుడు ఒకే పరిశుద్ధి పొందుతారు. అంటే స్పష్టం అయిపోతుంది. ఇది ప్రతిబింబించదు దాంట్లో. అలా అయినపుడు ఆ రెండూ వచ్చినపుడు కైవల్యము అంటే కేవలము పరబ్రహ్మమే మీ దేహమును ధరించి తిరుగుతూ ఉంటుంది. నువ్వున్నావనే భావమును వాడే ధరించి తిరుగుతూ ఉంటాడు. అంటే వాడికి తిరగటం అవసరమా? అవసరం లేదు. కాని ''తదేజతి, తన్నే జతి తద్దూరే, తద్వంతికే'' వాడు కదుల్తూ ఉంటాడు, కదుల్తూ ఉండనూ ఉండడు అన్నాడు. ఎట్లాగ? ఆకాశంలో గాలిలాగ అన్నాడు భగవద్గీతలో. లేదా నీళ్ళల్లో మంచుగడ్డ పడేసామనుకోండి. తేల్తూ ఉంటుంది. ఇక్కడనించి అక్కడికి వెడుతూ ఉంది. నీళ్ళల్లో మంచుగడ్డ వెడుతోందా? లేదా? వెడుతోంది. మంచుగడ్డ, నీళ్ళు అన్నా ఒకటే కదా. అంతే ఆ మోస్తరుగా ఉంది. కనుక ఈ రెండూ వచ్చినపుడు కేవలం వాడు ఉంటాడు. నీ మనస్సుద్వారా పనిచేసినా వాడే పని చేస్తాడు. ఇంద్రియాలద్వారా పనిచేసినా వాడే పనిచేస్తాడు. బుద్ధిద్వారా పనిచేసినా వాడే పనిచేస్తాడు. చేతులు, కాళ్ళద్వారా పనిచేసినా వాడే పనిచేస్తాడు. మీరు చేయటం అంటూ ఉండదు. మీకు కావలసినది అంటూ ఏం ఉండదు. మీరు అనేది కేవలం ఒక జగన్నాటకం. భాష తప్ప, ఏం మిగలదు. ఈ స్థితి వస్తుంది. దాన్నే కైవల్యం అంటారు. ఇంకొక మతం, ఇంకొక సంప్రదాయంలో ముక్తి అని అంటారు. మరొక సంప్రదాయంలో మహాపర నిర్వాణము అంటారు బౌద్ధులు మొదలైనటువంటి వాళ్ళు. ఇదీ పద్ధతి. పేర్ల భేదమే కాని స్థితి భేదం ఉండదు. అభేద స్థితి, అనన్యస్థితి

వస్తుంది. అంటే అన్యవస్తువు ఉండదు అక్కడ. సమస్త సృష్టి కూడ తానే ఉంటుంది. ఇంకొకటి ఉండదు. ఆ అనుభూతి కలిగేటప్పటికి సత్త్వము, పురుషుడు ఈ రెండింటికీ సిద్ధి సామ్యము కలుగుతుంది. ఇతడు ఏ స్థితిలో ఉన్నాడో, ఆ స్థితిలో ఉంటాడు. అద్దములో ఈమాటు, ఏదో వేంకటేశ్వర స్వామి విగ్రహము, టెంకాయ మొదలైనవి ప్రతిబింబిస్తున్నాయి. ఇందాకటివి లేవు యిపుడు. అవతల ప్రక్క గదిలో అవన్నీ పెట్టి తలుపు వేసేసారు. ఆ గదిలో ఒక నిమ్మకాయ, కత్తి, కోడిపెట్ట, పైని పంచె, సారాబుడ్డీ, యివన్నీ పెట్టారనుకోండి, చాతబడికో, దయ్యాన్ని తీసేయటానికో కావలసిన వస్తువులు. అద్దంలో ఇవన్నీ కనిపిస్తున్నాయి. అద్దం ఎదురుగుండా పెట్టారు గనుక. ఇపుడు మనం యోగాభ్యాసం అంటూ ఏం చేస్తున్నాం? ఈ చెప్పిన వస్తువులు తీసేసి వేంకటేశ్వర స్వామి విగ్రహం, పూజ చేసేటువంటి సామాను, కర్పూరం, హారతి యిచ్చేది, గంధం, తీర్థం, ప్రసాదానికి కావలసినవి పెట్టాము. మధ్యనున్న తలుపు తీసుకున్నారు. మీరు చేస్తూన్నది అంతే. అప్పుడు అక్కడ ఉన్నవి అన్నీ అద్దంలో ప్రతిబింబించేవి అవుతాయి. అంటే పంచేంద్రియాలు లోను గలాభా ఏం ఉండదు. సప్త ధాతువుల్లోను అక్కర్లేనిది చీము, నెత్తురు లాంటివి ఉండటం అవేం ఉండవు. చిట్టచివరిదాక శరీరం లేత తమలపాకులాగ ఉంటుంది. దీనికి వాడికి కావలసిన సేవ జరుగుతూ ఉంటుంది. దాని టైము దానికి అయిన తర్వాత ''జీర్ణమివ వస్త్రం'' చిరిగిపోయిన బట్ట ఎలాగైతే ప్రక్కకి పడిపోతుందో, అలా శరీరం దానంతట అది పడిపోతుందన్నాడు. ఇదీ స్థితి. దాన్ని కైవల్యం అంటారు. అంటే కైవల్యం అనే స్థితి రాగానే ఈ శరీరం వెళ్ళిపోనక్కరలేదు. చచ్చిపోనక్కర్లేదు. అలా అయితే మోక్షం కావాలా అంటే, పిల్లలు గలవాడిని అపుడే అక్కర్లేదు లెండి అనిపిస్తుంది. అది నిజం అనుకోనక్కర్లేదు. కైవల్యస్థితి వచ్చిన తర్వాత ఆ శరీరం పదేళ్ళు బ్రతకచ్చు, ఇరవై ఏళ్ళు బ్రతకచ్చు, ముప్ఫై ఏళ్ళు బ్రతకచ్చు లేదా పుట్టుకతోనే కైవల్య స్థితిలో పుట్టి ప్రహ్లాదాదులలాగ నడవవచ్చు. గనుక జనన, మరణాతీతుడు. ఎందుకంటే శరీరం రావటం- వాడికి రావటం కాదు. శరీరం పోవటం- వాడికి పోవటం కాదు.

ఇదీ చిట్ట చివరికి ఈ అధ్యాయంలో ప్రసాదించినది. చాల పవిత్రమైనటువంటి సూత్రం. కైవల్యం అనేదాని స్వరూపాన్ని మూడవమాటు నొక్కి చెప్పారు పతంజలి ఈ సూత్రంలో. ఇది చెప్పాక కైవల్యపాదం అని నాలుగో పాదం మొదలు పెట్టాం. కైవల్యం అంటే ఏదో కొద్దో గొప్పో రెండు మూడు తడవలు చెప్పుకున్నాం. మనకి బోధపడినంత బోధపడ్డది. అంటే మెల్లిగా బోధపడుతూ ఉంటుంది. ఒకరోజున బోధపడేవి కావు యివి. నేను మీకు పాఠం చెపుతున్నంత మాత్రాన నాకు బోధపడ్డాయని మీరు అనుకోవద్దు. మీరూ బోధపడ్డాయని అనుకోవద్దు. మీకు నాకు కూడ శనగగింజలు నీళ్ళల్లో నానవేస్తే, ఒక రోజో, రెండు రోజులో నీళ్ళల్లో నానాలి కదా మొక్కలు రావాలంటే. నీళ్ళు, శనగ గింజలు అక్కడపెట్టి ఏవి మొక్కలు అంటే ఎట్లా వస్తాయి? టైము కావాలి దానికి. భావన చేయాలి. భావనచేస్తే దాని లక్షణం పరబ్రహ్మ లక్షణం జీవుడికి అంటుతుంది. జీలకర్ర, నిమ్మకాయ రసంలో భావనచేస్తే కొంత టైమివ్వాలి. అప్పుడు జీలకర్రకి నిమ్మకాయ రుచి వస్తుంది. భావన జీలకర్ర అంటాం. అదీ భావన అంటే. అలాగే అల్లం, నిమ్మకాయ రసంలో వేసాం. కొంత టైమివ్వాలి. దాంట్లో నానాలి. కనుక యిపుడు మనం చదువుకున్న సూత్రాల్లో మనం చాలకాలం నానాలి. నానితే ఈ నానాత్వం పోయి కైవల్యం అనేది దానంతట అది వస్తుంది. అది మనని అనుగ్రహించేది తప్ప మనం దాన్ని సాధించేది కాదు. అది తెలియాలి. మన పని మనం చేసుకుంటూ వెడుతూంటే, అది ఏదో ఒకరోజున అన్నం ఉడకటంలాగ సిద్ధిస్తుంది. అన్నం వండం మనం. బియ్యాన్ని, నీళ్ళనీ కలిపి ఉడకబెడతాం అనటం తెలియక అన్నం వండాం అంటాం. కనుక మనం ఏం వండుతున్నాం? బియ్యం, నీళ్ళు కలిపి ఉడకపెడతాం. మన కర్తవ్యం అంతవరకే. మనం వండుతూన్నపుడు అన్నం లేదు. ఒళ్ళు దగ్గర పెట్టుకొనిచేస్తే, అన్నం వస్తుంది తప్ప, అన్నం మనం సాధించేది కాదు. సిద్ధించేది. ఆ రెండింటిలో గలాభా పడకూడదు. మనం ఎట్లా అయినా సరే మోక్షం తెచ్చుకోవాలండి అంటారు. టిఫినూ, గిఫినూ కాదు ఎక్కడనుంచైనా తెచ్చుకునేందుకు. సన్యాసం పుచ్చుకుంటం అంటారు. సన్యాసం పుచ్చుకునేది కాదు, వచ్చేది. ఇడ్లీ పుచ్చుకున్నాం, పూరీ పుచ్చుకున్నాం అన్నట్లు కాదు. సన్యాసం పుచ్చుకోవడం.

పండు పండటం అనేది పండు తెచ్చుకుంటుందా? పురుగు పడకుండా ఉంటే సక్రమంగా అదే వస్తుంది. ముందు కాయ అయ్యి, దోరకాయ అయ్యి, పండయ్యే లోపల జాగ్రత్తగా దానికి దోహదం జరిగినట్లైతే, పండటం అనేది జరుగుతుంది తప్ప, కాయ తెచ్చుకోదు. అక్కడ గలాభా కాకూడదు. కనుక మోక్షాన్ని గురించి మనం సాధించుకునేది, వేధించుకునేది ఇట్లాంటివేం ఉండవు. మన కర్తవ్యం మనం చేస్తూ ఈ చెప్పబడిన తారకం అనే స్థితి ఏంచేస్తే వస్తుందో అది చేసుకుంటూ ఉంటే, అది వచ్చేనాటికి వస్తుంది. దానికోసం ఎదురు చూస్తుంటే రాదు. ఒక్కొక్కమాటు ఆంజనేయస్వామి గుడికి ప్రదక్షిణంచేసి పొట్ట తడుముకుందిట ఒక ఆవిడ. పాతికేళ్ళు చూసి ఏమిటమ్మా! అట్లా చూసుకుంటున్నావు అంటే ఏం లేదండి? ఆంజనేయస్వామి గుడికి ప్రదక్షిణంచేస్తే పిల్లలు పుడతారన్నారు అందిట. ఒక ఆంజనేయస్వామి ఉపాసకుడు చూసి, పెద్ద టెంకాయ పట్టుకొచ్చి నా తలకాయ మీద పెట్టుకొని బద్దలు కొట్టుకోమంటావా? ఆవిడకేమైనా చేస్తావా? అని ఆంజనేయస్వామిని అడిగాట్ట. ఎందుకు చెయ్యను, ఎవరికైనా చేస్తాను, కాని ఆవిడ ఎందుకు తిరుగుతుందో అనుకున్నాను, నన్ను తల్చుకొని తిరగలేదు ఒక్కరోజు కూడ, ఆవిడ కడుపుని తల్చుకొని తిరుగుతోంది అన్నాట్ట. అపుడు ఈ ఉపాసకుడికి అర్థం అయ్యిందిట. మనం గింజుకొని లాభంలేదు. ఆవిడకి భక్తి పుట్టిన తర్వాత సంతానం కల్గుతుంది. అపుడేమన్నా ప్రాప్తం ఉంటే అనుకున్నాట్ట. కనుక కైవల్యం అనేటువంటిది కూడ జాగ్రత్తగా ఉండాలి. విక్రమార్కుడి కథల్లో కూడ చెబుతారు. చక్కని కథ. విక్రమార్కుడున్నూ, మంత్రిగారు ఒక విమానంలో వెడుతున్నారు. మధ్యలో ఏమిటయ్యా ఇక్కడ కొండలు బూడిద రంగులో ఉన్నాయేమిటి? అని అడిగాడు విక్రమార్కుడు. కొండలు బూడిద రంగులో ఉండటం ఏమిటి? అది బూడిదే అన్నాట్ట. ఇదేమిటి. ఇంత బూడిద ఉందేమిటి 'పర్వతాకార మిదమస్తు' అని ఒకమాటు దిగుదాం అంటే అపుడు చెప్పాడుట. ఇక్కడ అమ్మవారి యొక్క ఉపాసకుడు ఒకడు ఉన్నాడు. వాడు రోజూ హోమం చేస్తాడు. ఆ హోమం చేసి యిక్కడ పోస్తాడు. అదీ ఈ బూడిద అన్నాట్ట. అబ్బ! ఎన్నాళ్ళనించి చేస్తూంటే పర్వతమంత అవుతుంది, వారికేమన్నా అమ్మవారు సిద్ధించిందా? పోనీ వారిని

దర్శనం చేసి వెడదాం అన్నాడుట విక్రమార్కుడు. వెళ్లిచూస్తే కావలసి
వ్యవహారమంతా ఉన్నది. ఏమండి అమ్మవారు కనిపించారా? ఇంతవరకు
ఎపుడూ కనిపించలేదు. కలలో కూడ కనిపించలేదు అన్నాడుట. ఎన్నేళ్ళనిం
చేస్తున్నారు అంటే నూటయాభై ఏళ్ళనించి చేస్తున్నాను అన్నాట్ట. అదేమిటయ
ఏది చెయ్యండి అన్నాట్ట. చూస్తే శుభ్రంగానే చేస్తున్నాట్ట. అమ్మవారి యొక్క
మంత్రం. అన్నీ సక్రమంగానే ఉన్నాయి. అమ్మవారు ఎందుకు దర్శనమీయలేద
ఈయనకి బోధపడక, నేను చేసి చూస్తాను అని విక్రమార్కుడు హోమంచేసి
అమ్మవారు ప్రసన్నం కాకపోతే కత్తి తీసుకొని తలకాయ హోమంలో పెట్ట
నరికేసుకుందా మనుకున్నాట్ట. ఆ తల అందులో పడేందుకు, అక్కడిదాక
వచ్చి ఆగిపోయిందిట చెయ్యి. అమ్మవారు ఏమిటిరా? అదేం పని, సాహస
చేస్తావేమిటి? అంతమందిని పరిపాలిస్తున్నటువంటి వాడివి. నీ తలపోతే ఎట్ల
అందిట? మరి ఈ మాత్రం వాడికి ప్రత్యక్షమైతే నీ ముత్యాలు ఏమన్న
రాలిపోతాయా? అని అడిగాట్ట. రామ రామ ఎందుకు ప్రత్యక్షమవ్వను
ఎవడికైనా ప్రత్యక్షమవుతాను. కాని వాడు నన్ను పిలువలేదు. మరి ఈ
బూడిదంతా ఏమిటి? అంటే వాడేదో ప్రయోగంకోసం చేస్తున్నాడనుకున్నాన
అందిట. అంటే మంత్రం జపం చేస్తున్నాను కదా. ''హ్రీం కాళికాయైనమః
''అంగుళ్యగ్రేన యద్వ్యత్వం'' వేళ్ళమీద లెక్కపెట్టే జపం చేస్తున్నాడు అన్నదిట
కనుక పూసజపం చేస్తే దేవత ఎందుకు వస్తుంది? నన్ను పిలవకుండా యి
పిల్చుకుంటూంటే నేనేం రాను! అంది. రోజుకి కొన్నివేల మాట్లు అరుస్తాడు
''క్రీం'' అని ఐస్క్రీం అమ్మేవాడు. అది మంత్రం అవుతుందా? ఆవిడన
పిలవటం లేదు. అంచేత ప్రత్యక్షమవ్వటం లేదు అంది. కనుక కైవల్యం అనేది
మోక్షం అనేది వచ్చేది కాని, తెచ్చేది కాదు. అదొక్కటి గుర్తుంచుకొని మిగత
మన కర్తవ్యం మనం చేసుకుంటూ ఉండాలి. కనుక ఇది చెబుతూ పతంజ
చెప్పిన ''కైవల్య పాదం'' అనే నాలుగో పాదంలోకి ప్రవేశిస్తున్నాం.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

**విభూతి పాదము సమాప్తము**